శ్రీ గురుమూర్తయే నమః

# విన్నపము



ఉ. ఆర్యజనస్తవార్హ విమలాత్మ బుధేంద్ర కవీంద్ర చంద్రమోఽ
వార్య కృపాకటాక్షరుచిర పాత్రుఁడ నౌటనె కాక శంకరా
చార్యజయప్రబంధ మొకచాయ రచించి త్వదంఘ్రి పీఠికా
జర్య విభూషణంబుగ నొసంగ వలంతినొకో రఘూద్వహా!

చ. మతగురు పుణ్యకీర్తి పలుమాఱు స్మరించుటఁ జేసి ఘోర సం
సృతివెత భావిజన్మములనేనియు రూపఱు నంచుఁగా, క హం
కృతిఁ గృతి సెప్పఁబూనినటు లెంచఁగఁబోలె, దెఱుంగ నొక్కొ? ము
న్నతిరసయుక్తిఁ బల్కురు మహాకవు లిద్ది తెలుంగు సేయుటల్.

శా. వారే కాదు, కలంబు చేకొని కవిత్వం బంచు నిర్మించు నె
వ్వారున్ నా కతిపూజ్యు లాగురులు, సంబంధుల్ సఖుల్; గావునన్
వారిన్ బండితదిగ్గజంబులను సంప్రార్థింతు నాలోపముల్
కారుణ్యంబునఁ ద్రోచి, యెందును గుణగ్రాహిత్వముం జేకొనన్.

విజ్ఞలోకమునకు నమఃపూర్వకమగు విన్నపము. “శ్రీశంకర భగవత్పాదులు పరమశివావతార మఁట. అమ్మహానీయుని పుణ్య యశము గానమొనర్చుభాగ్యము సామాన్యుల కబ్బ దఁట” యని చిరకాలమునుండి వినుచు మహాత్ములు చేయఁదగు యత్నమునకుఁ గడఁగితిని. “మూకం కరోతి వాచాల” మ్మనిన ట్లయ్యనఘుని కృప

నామదఁ బ్రసరింపఁ గృతార్థుఁడ నగుదు నను ధైర్యముతో నిరువది యేండ్లక్రిందట శంకర విజయ విలాసము ననుసరించి రెం డాశ్వాసములు రచించితిని. సంసార క్లేశముల కగ్గ మైతిని. గురువుల కరుణకుఁ బాత్రుఁ డను గాలేదేమో యనుకొని యూరకుంటిని. తరువాత నాసంకల్పము సఫల మగునట్లు ప్రేరణ మొనర్చినవారు భాషాపోషణైక వ్రతులును, శంకర ప్రతిష్ఠాపనాది పుణ్యకార్య నిరతులును, మహోదారులునగు శ్రీమదీదర వేంకటరావుపంతులు గారు. వారిసంకల్పబలముననో, కృతిపతి యగు శ్రీరామచంద్రుని కటాక్షవీక్షణముననో, నాయదృష్టముననో యిరువదేండ్లుగా నెఱవేఱని శంకరవిజయరచన మత్యల్పకాలమున నెఱవేఱినది. హృదయభారము తొలఁగినది.

చిద్విలాసకృత శంకరవిజయవిలాస మంతయుఁ జదివి తెనుఁగున రచింప యత్నించితి నని తెలిపియుంటిని. ఆనాఁటినుండియు యత్నము మానలేదు. సాగలేదు. సంస్కృతమున శంకరవిజయములు పదింటికిఁ బై నున్న వని తెలిపి యత్నింపగా మాధవాచార్య కృతమును, నానందగిరికృతమును నగు శంకరవిజయములు రెం[illegible]. అంతకు మున్ను చిద్విలాస గ్రంథానుసారము వ్రాసినపద్యములు పరిహరించి, మాధవ శంకరవిజయము ననుసరించి వ్రాయ మొదలిడితిని. చిద్విలాసానందగిరుల గ్రంథములతో సంప్రదించుట కుపక్రమింప శంకరుని తలిదండ్రులు, నివాసము, సంన్యాసక్రమము మున్నగు ప్రతి ఘట్టమునను విప్రతిపత్తులే కనఁబడఁగాఁ బెక్కురు పెద్దల నడిగితిని. (విద్యారణ్య) మాధవకృతమే ప్రమాణ మనినారు. అందును గొన్ని యనుపపత్తులు కనఁబడుచు వచ్చినవి. ఇతరగ్రంథముల రెండిటి యాధారమున నా[illegible]ల రచన నడుపవలసివచ్చినది. అనువాద మని మక్కికి మక్కిగాఁ జేయఁబడలేదు. కొన్నియెడలఁ జేయఁబడకపోను లేదు. ఆనందగిరి శంకరవిజయము మాధవ, చిద్విలాసుల గ్రంథ

ములకన్నివిధముల భిన్నముగా నుండుటచేతను జరిత్రికంటె నితర మతఖండన మాత్ర మాగ్రంథమున ముఖ్యముగాఁ గానవచ్చుటచేతను దానినెచ్చట ననుసరింపలేదు. ఆంగ్లభాషయందుఁ గల కొన్ని శంకర చరిత్రములఁ గాంచితిని. ఆగ్రంథకర్తలు తమ బుద్ధి వినియోగించి శంకరుని గొప్పతనము పలువిధములగు హేతువాదములతో విమర్శించి, దేశము, కాలము మున్నగు వివిధవిషయములను నిర్ణయించిరి. తొలుత సంస్కృతమునందలి మూడు గ్రంథములు భేదించిన విషయములు చూపి తరువాత నాంగ్లేయ విద్యావేత్తల యభిప్రాయములను బొందుపఱతును.

మాధవ శంకరవిజయమందుఁ గల కొన్నిగాథలు చిద్విలాసుని గ్రంథమునఁ గానరావు. ఆనందగిరి గ్రంథమున మిక్కిలి కానఁబడవు. చిద్విలాసుఁడును, నానందగిరియు శ్రీశంకరులకు సాక్షాచ్ఛిష్యు లని గ్రంథములఁ గనఁబడుచున్నది. ఎవరికథ వారిదే. ఇందేది గ్రాహ్యము? ఏది త్యాజ్యము? ఇటీవలివాఁడు విద్యారణ్యస్వామి. ఆయన వచనమెట్లు ప్రమాణము? ప్రాచీన శంకరవిజయ మాధారముగాఁ దాను రచించితి ననెను. కావునఁ గానఁబడని ప్రాచీనశంకర విజయమును గూర్చి యేమియు ననఁజాలము గదా? అది యెవరు రచించిరో తెలియదు. అని యెంచియు, పీఠికయందు, ప్రామాణ్యము మాధవ శంకర విజయమునకే యాధునిక పండితలోకమున నుంటచే దానినే ఎక్కువగా ననుసరించితిని. ఆగ్రంథము మాధవచార్య కృతము కా దని కొందఱు విమర్శించి యున్నారు. ఆచర్చ నా కిచటఁ బ్రధానము కా దని దానిని విడిచిపుచ్చి గ్రంథరచనమున నన్నుఁ గలవరపెట్టిన యంశమును గప్పిపుచ్చుట న్యాయముకాదని, నాకు దొరికిన యీ మూఁడుగ్రంథములందలి విరోధముల నిక్రిందఁ జూపుచున్నాను.

| మాధవాచార్యుని గ్రంథమున | చిద్విలాసుని గ్రంథమున | అనంతానందగిరి గ్రంథమున |
|---|---|---|
| 1. శంకరుని తలిదండ్రులు ఆర్యాంబా శివగురులు. | శంకరుని తలిదండ్రులు ఆర్యాంబా శివగురులు. | శంకరుని తల్లి విశిష్ట. తండ్రి విశ్వజిత్తు |
| 2. జన్మభూమి కాలటి. పూర్ణానదీతీరము. | కాలటి. చూర్ణీనదీతీరము. | చిదంబరము. నది చెప్పఁబడలేదు. |
| 3. సంతతికై శివగురుఁడు వృషగిరిపైఁ దపమొనర్చెను. ద్విజవేషమున శివుఁడువచ్చి వరమీయ శంకరుఁడు పుట్టెను. | శివగురుఁడు సంతతికై వృషగిరిమీఁదనే తపస్సుచేసెను. స్వప్నమున శివుఁడు తోఁచి వరమిచ్చెను. శంకరుఁడు పుట్టెను. | విశ్వజిత్తు తపస్సుకై అడవికిఁబోయెను. విశిష్ట చిదంబరేశ్వరుని సేవించుచుండ నా దేవుఁడేయామెగర్భమునశంకరుఁడై పుట్టెను. |
| 4. శంకరున కుపనయనముచేయ యత్నించుచు శివగురుఁడు మరణించెను. | శంకరున కుపనయనము చేసి వివాహమునకు యత్నించుచు శివగురుఁడు మరణించెను. | చిదంబరేశ్వరుని యజమానునిగాఁజేసి జాతకర్మాదు లొనర్చినట్లే ఉపనయనము విప్రులే చేసిరి. |
| 5. శవకామలక కథ. | లేదు. | లేదు. |
| 6. శంకరుఁడు మకరాకృష్టుఁడై సంన్యసింప మకరము శంకరుని విడిచిపెట్టెను. | బ్రహ్మచే శప్తుఁడగు నొక గంధర్వుఁడు మొసలియై శంకరుని బట్టికొన శంకరుఁడు సంన్యసించెను మొసలికిశాపవిమోచనమైనది | లేదు. |
| 7. నర్మద పొంగఁగా శంకరుఁడు కమండలువుచే నాపొంగిననీరు స్రావించెను. | లేదు. | లేదు. |
| 8. చోళదేశవాసి. సనందనుఁడు శంకరునకు శిష్యుఁ డగును. | అహోబలవాసి, లక్ష్మీ విష్ణుశర్మలకు కొడుకు, మాధవాచార్యుఁ డనువాఁడు శంకరశిష్యుఁడై సనందనుఁ డనుపే రొందెను. | లేదు. |

| | | |
|---|---|---|
| 9. సనందనుఁడు పద్మపాదుఁ డగును. | కలదు. | లేదు. |
| 10. వ్యాసుఁడు తృయాధ్యాయాది సూత్రముపై విపులమగు వాదము చేయును. | వ్యాసుఁ డాసూత్రముమీఁదనే శాస్త్రవాదముచేసినట్లే కాని యావాద మేమియు లేదు. | తాండిత్రితిపై వ్యాసుడు శాస్త్రవాదము చేసినట్లు విపులముగాఁ గలదు. |
| 11. కుమారిలుని కథయం దోడినవారు యంత్రశిలలందుఁ జచ్చుట పందెముగా బౌద్ధులు చచ్చిరి. | వాదమున నోడిన సౌగతుల తలలను రాజుచే కుమారిలుఁడు నఱకించిన ట్లాతనిచే శంకరునకుఁ జెప్పఁబడెను. | సూక్ష్మముగాఁ గలదు. |
| 12. శంకరుఁడు యోగవిద్యచే మండను వింటఁ జొచ్చునప్పటికి వ్యాసజైమినులను మండనుఁడు శ్రాద్ధమున కర్చించుచుండును. | పితృస్థానమున వ్యాసుని నెలకొల్పి యర్చించుచుండ విశ్వదేవస్థానమున నాకాశమునుండి దిగివచ్చి శంకరుఁడు గూర్చుండెను. | మండనుఁడు తనమంత్రబలమునవ్యాసుని రప్పించి, పితృస్థానమున నుంచి విశ్వదేవస్థానమున సాలగ్రామముంచి అర్చించుచుండ శంకరుఁ డాచోటి కాకసమునుండి దిగును. |
| 13. హస్తామలకుఁడు బలినామాగ్రహారవాసి, ప్రభాకరుని కొడుకు. | ప్రయాగవాసి, దివాకరాధ్వరి కొడుకు. | లేదు. |
| 14. గిరియను శంకరశిష్యుఁడు తోటకాచార్యుఁ డయ్యెను. | విశ్వనాథాధ్వరి కొడుకు కళానిధి యనువాఁడు తోటకుఁ డయ్యెను. | లేదు. |
| 15. శంకరుఁడు వలదని జ్ఞాతులు చెప్పినను వినక తల్లి కుత్తరక్రియలు చేసెను. | తల్లి చనిపోవుచున్నదని తెలిసి విప్రులఁ బిలిచి చెప్పఁగా వారు రాకపోవుటచే శంకరుఁడు తానే యుత్తరక్రియలు చేసెను. | లేదు. |
| 16. తుదిని దేవతాప్రార్థితుఁడై కేదారమందుండి శంకరుఁడు వృషభారూఢుఁడై కైలాసమున కరుగును. | బదరీక్షేత్రమున దత్తాత్రేయుఁడు ప్రత్యక్షమై యొక గుహలోనుండి కైలాసమునకుఁ గొనిపోవును. | కాంచీనగరమున సమాధినిష్ఠుఁడై శంకరుఁడు భౌతికదేహము విడిచి కైలాసమున కేఁగెను. |

ఇన్నివిధములుగా నున్న కథలయందలి సత్యాసత్యనిర్ణయము చేసికొనఁజాలక యాంగ్లభాషాకోవిదుల విమర్శన గ్రంథములను గొన్ని చదివి యందలి చరిత్రవిషయములు కొంతవఱకుఁ దెలియఁజాలితిని. ఈ పరస్పరభేదములనుగూర్చి వా రంతగాఁ దీవ్రదృష్టి యుంచినవారుకారు. కాని మాధవగ్రంథమునే యాధారముగాఁ జేసికొని, శంకరుని మహిమము బహుముఖములవిమర్శించి సాధ్యమైనంతలో హేతువులూహించి చెప్పుచు దేశము, కాలము నిర్ణయింప నెక్కువ శ్రమపడిరి. అందు శంకరునికాలమును గూర్చి ముందు పరిశీలింతము. శృంగేరి మున్నగు పీఠములందలి గురుపరంపరఁ గూర్చి తెలిసికొని ఉపదేశ సాహస్రిపీఠిక యందు శ్రీ వావిలాల వేంకటశివావధానులుగా రిట్లు వ్రాసియున్నారు.

1. "క్రీ. పూ. 86 సం॥రములనాఁడు శంకరజనన మని శృంగేరిపీఠ జగద్గురు పరంపరవలనఁ దెలియుచున్నది.
2. క్రీ. పూ. 508 సం॥రములు అని శ్రీ కాంచీకామకోటి పీఠమందలి గురుపరంపర వలన
3. జగన్నాథమఠమందలి గురుపరంపర వలన క్రీ. పూ. 516
4. ద్వారకామఠగురు పరంపరవలన క్రీ. పూ. 541 న సంవత్సరముల నాఁడు శంకరజననకాల మని తెలియుచున్నది అని.

శ్రీకర్లపాలెము వెంకటనారాయణగారు శంకరు లైదుమఠములు స్థాపించి రనియు, నయ్యవి ద్వారకా బదరికాది పుణ్యస్థలములందలి వనియు, నందలి గురుపరంపర ననుసరించి కాలము లిచ్చి యున్నారు. వానికిని పైని జూపినవానికిని గొంతవిభేద మగపడుచున్నది. పంచాంగ కర్తల నిర్ణయముప్రకారము క్రీ. పూ. 72 సంవత్సరములనాఁడు శంకరావతార మగుచున్నది. పైని జూపిన మఠములందలి గురుపరంపరయు నొకదానికి నొకటి లగింపకున్నది.

ఇట్టి పాశ్చాత్యవిమర్శకాగ్రగణ్యుఁడగు మాక్సుముల్లరు.— శంకరమందార సౌరభమునందలి శ్లో॥ ప్రాసూత తిష్యశరదా మతియాతవత్యా। మేకాదశాధిక శతోన చతుస్సహస్ర్యాం। సంవత్సరే విభవనామ్ని శుభే ముహూర్తే. రాధే సితే శివగురో ర్గృహిణీ దశమ్యాం" అను శ్లోకమునందలి కలియుగాబ్దములు 3889 (క్రీ.శ. 88) సరియగు విభవవైశాఖ శు ౧౦ తిథియందు శంకరులు జన్మించిరను సిద్ధాంతము నూని క్రీ. శ. 783 శంకరజనన మని యంగీకరించెను. టి. ఆర్. చింతామణి ప్రభృతుల మతమున క్రీ. శ. 655-687 లోపల శంకరు లుండు రని నిర్ణయము. మాక్సుముల్లరు మొదలగు పాశ్చాత్య పండితుల సిద్ధాంతములను విమర్శించి రాజేంద్రనాథఘోషుగారు క్రీస్తుశకము 608 లోఁగాని 686 లోఁగాని శంకరులు జన్మించియుందు రని నిర్ణయించిరి. ఆంగ్లేయభాషావిశారదు లగు భారతీయ విమర్శకులు దీనిని బ్రమాణముగాఁ గొనుచున్నారు. Sankara, The sublime అను గ్రంథమున ధీరేంద్రనాథ పాలుగారు.

"In our opinion this date (i. e. 686 A-D) is the most probable one, as Pandit, Srijut Rajendranath shows that a portion of Sankaracharya's Bruhadaranyaka Bhashya Vartika was quoted by a Jaina philosopher Vidyananda, whose date of accession to the pointifical throne of Digambara Jaina gurus was A. D. and the date of his death 783 A. D. Sureswaracharya being the direct disciple of Sankaracharya, this cannot be possible of Sankara was born in 806 A. D. according to the calculation of the Cochin Government astrologer mentioned before ' అన్నారు.

మఱియు సీతానాథదత్తుగారు Sankaracharya (His life and teachings) అను గ్రంథమున "Sankaracharya died in A. D. 830 the the early age of 32 at Kedar on the Himalayas. According to the accouut, which to us appears most reliable, Sankaracharya was born in the year 3889 of Kali Era, corresponding to 799 A. D."

అని వ్రాసినారు. ధీరేంద్రులు 886 అనఁగా 799 అని సీతానాథదత్తు గారు నిర్ణయించినారు.

బొంబాయి హైకోర్టు జడ్జి, శ్రీ కాశీనాథ త్ర్యంబక తెలాంగు గారు "బ్రహ్మసూత్రము ౨. ౧ ౧౭ భాష్యమందు సృఘ్న, పాటలీపుత్ర నగరనామములను శంకరులు స్మరించుటచేతను, ఆసూత్రమందే పూర్ణవర్మ యనురాజుయొక్క నామమును స్మరించుటచేతను, పూర్ణవర్మ యనురాజు క్రీ. శ. 630 లో ఉన్నటుల కన్నింగుహాము నిర్ణయించియుంటచేతను శంకరు లేడవ శతాబ్దాంత్యభాగమువారనియు, సాంఖ్యకారికలయొక్క గౌడపాదభాష్యము క్రీ. శ. 557.683 సమీపకాలమున చైనాభాషలోనికి పరివర్తింపఁబడినటుల తెలియుటచే తత్ప్రశిష్యుఁ డగు శంకరు లాకాలమున నుండును" అనిరి.

దీని ననుసరించి యేడవశతాబ్దిలో శంకరు లున్నట్లు తేలినది. శంకరుల కాలమును గూర్చి యుపలబ్ధము లగు ప్రాచ్య పాశ్చాత్య నిర్ణయములను జదువరుల కందిచ్చితిని. విమర్శించినకొలఁది సత్యము తేలవచ్చును. చరిత్ర తత్త్వవేత్తలు పరిశోధించి నిర్ణయింపక మానరను నాసతో నీప్రస్తావము విడిచి శంకరుల జన్మదేశముగూర్చి యొక మాట స్మరించి శ్రీశంకరులగొప్పతనమునుగూర్చి విపులముగఁ జెప్పికొందము.

ఒక్క యనంతానందగిరి శంకరులు చిదంబరమునఁ బుట్టి రనెనే గాని యితరసంస్కృతకావ్యకర్త లెల్ల 'గాలటి' గ్రామమునఁ జన్మించి రనియే వ్రాసినారు 'కాలటియందు' శంకరులు పుట్టినఁ బుట్ట వచ్చును గాని శంకరులపూర్వులాంధ్రదేశమందలి గోదావరీమండలాంతర్గత సర్వవరక్షేత్రమునుండి మయూరవర్మచేఁ గేరళమునకుఁ గొనిపోఁబడి యుండుటచే, త్యాగరాజకుటుంబము తమిళదేశము నందెన్నితరముల నుండియో యున్నను దెలుఁగు మాటాడుకొనుచు నాంధ్రు లని వ్యవ

హరింపఁబడినట్లే శంకరునివంశమువారందఱు నాంధ్రము మాటాడు కొనుచు నాంధ్రు లయిరే యందు' రని కర్లపాలెము వెంకటనారాయణగారు సిద్ధాంతము చేసియున్నారు. కావచ్చును. గోదావరీ మండలాంతర్గతమై కోనసీమకు సీమంతమణియగు మునిఖండాగ్రహారమున (ముంగండ) వెలసిన వేఁగినాఁటి బ్రాహ్మణశాఖవారైనను జననీజనకులు కాశిలో స్థిరనివాస మేర్పఱుచుకొనిన పిదప నచటనే జన్మించినవాఁడగుటచే శ్రీజగన్నాథపండితరాజు నౌత్తరాహు లుత్తరదేశమువాఁ డని యనుకొన్నను, దాను దనత్రిలింగాన్వయమును మఱువక స్మరించుటచే నాంధ్రుఁ డని యెన్నబడుట లేదా? ఇంటిలో నాంధ్రము, వీథిలో దేశభాష మాటాడునాంధ్రులు వివిధదేశములం దెందఱు లేరు? అట్లే శంకరులకుటుంబమువారును వీథిలోనిమళయాళము మాటాడుచు నింట నాంధ్రము మాటాడుకొనువా రయినను గావచ్చును. కాని సంస్కృతకావ్యకర్త లందఱు నేకకంఠముగఁ గాలటి యని శంకరునిజన్మదేశమును గీర్తించి యుండుటచే వారిపూర్వుల వృత్తాంతము విని యుండని నే నట్లే చెప్పి యుంటిని. ఆంధ్రుల చరిత్రము ననుసరించి కుమారిలభట్టాంధ్రుఁ డనియు, ఉత్కలాంధ్రదేశసంధియందలి జయమంగళగ్రామమువాఁడనియుఁ జెప్పితిని. కాని నాఁ డీ శంకరునిగూర్చి యీసిద్ధాంత మెఱుఁగక విడిచివైచితిని. శ్రీశంకరు లెచట జన్మించినను, నేభాష మాటాడువారైనను, సంస్కృతభాష జగత్తున నున్నంతకాలము యావజ్జగతీమండలమునందును, నజరామరమూర్తియై వెలుఁగుచుందువారే. ఎవరికి వారే "శంకరుఁడు మావాఁడు. నావాఁడు" అనుకొనుట తప్పదు. మణిమంజరి వంటి యద్వైతమతగ్రంథమో మతవిరోధమునఁ గటువుగా నిందించుఁగాక, విదేశవాసులుగాని, విమతస్థులు గాని లవమేని నిందించిరా? ఎట్టిసంతలో స్తుతింపక విడువఁగలిగిరా? ఆంగ్ల

నారీమణియగు సోదరి నివేదిత పలుకుగా ధీరేంద్రనాథపాలుగారు వ్రాసిన యంశము నరయుఁడు.

"The gifted English lady who has become a devoted Hindu in the name of Sister Nivedita thus writes:.... Western people can hardly imagine a personality like Sankara. In the course of a few years to have nominated the founders of no less than ten great religious orders, of which four have fully retained their pristine state to the present day; to have aquired such a mastery of Sanskrit learning as to create a distinct philosophy and impress himself on the scholarly imagination of India is a pre-eminence that twelve hundred years have not sufficed to shake; to have written poems, whose grandeur makes them unmistakable even to foreign and unlearned ears and at the same time to have lived with his disciples in all the radiant love and simplicity of the saint - thus is the greatness that we must appreciate, but cannot understand. We contemplate with wonder and delight the devotion of Francis and Assisi the intellect of Ablard, the virile force and freedom of Martin Luther and political efficiency of Ignotoes- Loyala, but who could imagine all these united in one person?"

(హిందూమత భక్తురాలును, ప్రతిభావంతురాలు నగు సోదరి నివేదిత యను నాంగ్లవనిత యిట్లు వ్రాయుచున్నది. శంకరునివంటి యద్వితీయవ్యక్తిని నెట్టిదని పాశ్చాత్యు లూహింప నశక్తులు. కొన్ని సంవత్సరములనడుమనే పదిమందికి తక్కువ కాకుండ మతోద్ధారకులు వెలసిరి. వారిలో నలుగురుమాత్రమే నేటిదాఁక సత్యస్థితియందు నిలిచియుండిరి. ఆనలుగురిలో నొక్కఁడు (శంకరుఁడు) హిందూదేశములోని విజ్ఞుల భావవీథిని ముద్రిత మొనర్పఁజాలినట్టియు, 1200 యేండ్ల పరిమితిగల కాలమైనను గదలింపలేనట్టి వేదాంత తత్త్వమును సృజింపఁజాలిన వశ్యమగు సంస్కృతపాండితికిఁ బరమావధి యగుటయేకాదు; అతనిపద్యములు పరదేశజులకును, నిరక్షర కుక్షులకును గూడ కర్ణరసాయనమై మనస్సునకు నిష్కళంకదీప్తి నొసఁగుచున్నవి. ఇంత

వాఁడయ్యును పరమహంసయొక్క నిరాడంబరత్వమున నచంచలప్రేమ గలిగి శిష్యులతోఁ గలసిమెలసి యుండుట యాతని యున్నతికి వన్నె బెట్టుచున్నది. ఆ యనఘుని గొప్పతనము మెచ్చుకోఁదగినదే కాని యూహింప సాధ్యము కానిది. (ఫ్రాన్సిసు, ఆసిసులయొక్క భక్తినిగాని, అక్బారుయొక్క మేధాశక్తినిగాని, మార్టెనులూధరుయొక్క అప్రతిహతశౌర్యముతోడి వాగ్ధాటిని గాని, ఇగ్నేషియస్ లయోలాయొక్క రాజకీయ దక్షతను గాని వేఱు వేఱుగా నానందాశ్చర్యములతో నూహింపఁగలము గాని, యిన్నియు నొక వ్యక్తియందే ప్రోగువడి యున్నచో నూహింప నెవనికి సాధ్యమగును?)

మఱియు శ్రీమతి అనిబిసెంటమ్మగారు శ్రీ శంకరులను గూర్చియు వారి భాష్యమునుగూర్చియుఁ జేసిన ప్రశంసకూడ నిట బొందుపఱుచుట యనవసరము కా దనుకొందును.

"There is a mighty name in Indian literature, the name of Sri Sankaracharya, that no man can name without reverence for the subtlety of his intellect, for the vast range of his intelligence. What was his work? He came in the Kaliyuga, he came when the world was losing or had lost most of its spiritual light, he came to build up round the Science the Brahman the bultress of the intellect, the walls of subtle argumentation, the defences that should be strong and mighty, on which the intellect of world might break its teeth in vain. And he did it in order that behind that wall of intellectual subtlety, behind that fortress keen intellectual argument, the Supreme truth might remain unoutraged by assault, might remain for those who were worthy, might be protected for the spiritual mind. If you take as an example the Brahma Sutras, with the commentary upon them of Sankaracharya, you will see exactly what I mean. In his commentary there is the most refined hair - splitting; in his commentary the most subtle distinctions; in his commentary the most careful grading of language and the shading of every possible delicacy of thought; and behind all that commentary the Sutras themselves,"

భరతఖండ వాఙ్మయములో మహామహిమ గల నామధేయ మొకటి గలదు. అది శ్రీశంకర భగవత్పాదుల నామము. ఆనామ ముచ్చరించునపు డామహాపురుషుని కుశాగ్రబుద్ధికిని, విస్తృతవిజ్ఞానము నకును వందనము చేయని మనుజమాత్రుఁ డుండనేరఁడు. ఇట్టి గౌరవ మొందుట కామహితుఁడేమి పను లొనరించెనో విచారింతము. కలి యుగమున పరమార్థతత్త్వప్రకాశంబు మిక్కిలి క్షీణదశ నున్నతఱి బ్రహ్మశాస్త్రదుర్గమునకుఁ దర్కజటిలములగు వాదకుడ్యము లమర్చి, యాగోడలకు బలముగా యుక్తివిశేషము లనెడు నండగోడలను సం ధించి, విశ్వజనులందఱు తమ ప్రతిభతో వ్యర్థముగ డీకొనునటులఁ జేయుదార్ఢ్యమును, బలమును గల రక్షకావరణములను నిర్మింప నమ్మ హాపురుషుఁ డవతరించెను. ఏలయన బుద్ధిసూక్ష్మతచేతను, యుక్తి యుక్తవాదముచేతను సురక్షితమగు పరమార్థతత్త్వము ప్రత్యర్థుల వాఁడితూపులతాఁకులకు లొంగకుండ ఆపరమార్థమొంద నర్హులగు ముముక్షువులకు సులభసాధ్యమై, విపక్షులకు దుస్సాధమై యుండవలయు ననియే వారి యభిమతము. ఇందులకుఁ దార్కాణముగా శ్రీశంక రాచార్యరచిత బ్రహ్మసూత్రభాష్యము తాము చదివినచోఁ బూర్వోక్త మగు నాయభిప్రాయము విశదమగును. వారి భాష్యములో బహువిధ సిద్ధాంతముల లేశలేశముగాఁ బరిశోధించు నేర్పును, సుదురూహపదా ర్థముల తారతమ్య విశేషమును, నిరవద్యమగు భాషాప్రయోగనిపుణ తయు గంభీరార్థ విన్యాసకౌశలమును, నిండియుండి, వానిమఱుఁగున నివురు గప్పిననిప్పువలె బ్రహ్మసూత్రము లొప్పుచుండును.)

ఈరీతిగా వైదేశికులు గావించిన ప్రశంసనములు పెక్కుగలవు. నవీనసిద్ధాంతముల కనువుగ విమర్శించి శంకరులచరిత్ర యంతయు నాంగ్లమున రచించిన ధీరేంద్రనాథపాలుగారు తమను శంకరునెడఁగల

భక్తియంతయు స్ఫుటమగునట్లు గ్రంథాంతమున భరతవాక్య మిట్లు చెప్పుచున్నారు.

What have we to do with the miner incidents of Sankaracharya's life....a life only thirty two years length? We have his philosophy,.... we have his religion .... we have his personality,.... we have his Ethics .... we all Hindus from the north to south, from the east to west breathe in Sankara's spirit. May his spirit again revive our great 'Sanathana Dharma' with its pristine purity and sublimity.

(ముప్పది రెండేండ్లు మాత్రము జీవించిన శ్రీశంకరుని జీవితము నందలి చిన్నచిన్న సంఘటనములవలన మనము నేర్వఁదగిన దేమున్నది? ఆమహనీయుని వేదాంతవిజ్ఞానము, ఆయన యేర్పఱచిన మతము ఆ మహాత్మునివ్యక్తిత్వము అయన నైతికవృత్తము మనకు పెన్నిధానము లట్లు దొరికినవి. ఇటు ఉత్తరమునుండి దక్షిణముదాఁక నటు తూర్పు నుండి పడమరదాఁక భరతభూమి నున్నహిందువుల మగు మనమందఱ మును శ్రీశంకరుని విజ్ఞానవాయువులను పీల్చుకొని జీవించుచున్నాము. ఆయన దివ్యశక్తి నిత్యపూతమై సమున్నతమైన సనాతన ధర్మములను బునరుద్ధరించు గాక !)

మనదేశమందలి ప్రాచీనపండితులును, మహాకవులును "శంకర శ్శంకర స్సాక్షా"త్తని యాయనను బరమశివునిగా భావించిరి. నుతించిరి. కావ్యముల నిర్మించిరి. దేవతార్చనయం దాయన ప్రతిమనుంచి భగవంతుఁ డని నిత్యము పూజించిరి. పూజించుచున్నారు. పూజింప నున్నారు. పూజింప కేమి చేయుదురు? మూర్ఖులమాట యటుండనిచ్చి విజ్ఞుఁడగు నెవఁడేని శంకరులవాఙ్మయగంధము నాఘ్రాణించి యానంద పరవశుఁడు కాకుండఁగలఁడా? మహాపండితుఁడు, మహాకవి, మహా వ్యాఖ్యాత, మహావక్త, మహావాది, మహామేధావి యగు శంకరుని వంటి వ్యక్తి త్రికాలములందును త్రిభువనములందును లేఁ డనిన నతిశయోక్తి యెన్నఁటికిని గానేరదు. ఆయన జీవిత మామూలాగ్రముగ మాశ్చర్య

జనకముగదా! ఆహా! ఎనిమిదేండ్లకు నాల్గువేదములు, నాఱుశాస్త్రములు. పురాణములు, కళలు నేర్చెనట. ఇట్టియనుభవము మనజీవితములం దెఱుఁగము. కావున సంశయము గాని యాశ్చర్యముగాని కలుగవచ్చును. కాని యీనాఁడుగూడ నట్టిలోకోత్తర మేధావులు లేక పోలే దని శంకరవిజయ కృతిసమర్పణసభయందు [4-7-48 తేదీని] న్యాయవాది శేఖరులును, సంస్కృతాంధ్రహూణభాషావిజ్ఞాననిధులును, నాకుఁ జిరకాలమిత్రులు నగు శ్రీసోమంచి లింగయ్య బి. ఎ., బి. ఎల్. గారు శంకరుని నిరుపమానసూక్ష్మగ్రాహిత్వమునకు దృష్టాంతముగాఁ జూపిన 16-4-48 ఆదివారమునాఁటి హిందూపత్రికయందలి వ్యాసభాగము నీక్రిందఁ బొందుపఱుచుట యనావశ్యకము కాదనుకొందును.

## CALCULATING BOYS, AMAZING PRODIGIES

"Another failure in life was the late William Sidis, who died in 1944 aged only 46. A genaration ago he was hailed as the "World's greateast boy genius" but he died in a Boston hospital, penniless, for in spite of his great learning he had been incapable of earning a living. At six months he could recite the alpabet; at two he could read and write; at six he spoke and wrote several foreign languages; at 11 his thearies of fourth dimension startled the scientific world; and at 16 he graduated brilliantly from Harvard University, distinguishing himself especially in mathematics, yet he was never able to hold down a worth-while job even as an adding-machine clerk with a wall street firm, and he drifted aimlessly from one meanial occupation to another." HINDU. 16-4-48.

## గణితశాస్త్రనిపుణు లగుబాలురు-అద్భుతమేధావులు

(రాణింపని జీవితము గలవారిలో కీర్తిశేషుఁడైన 'విల్లియమ్ సిడిస్' ఒకఁడు. ఈతఁడు 1944 లో తన 46వ యేటఁ జనిపోయెను. క్రిందటితరములో నీతఁడు ప్రపంచములోని 'సుప్రసిద్ధబాలమేధావి' యని నుతి కెక్కెను. కాని యెంతపాండిత్య మున్నను సంపాదనశక్తి లేమిచే చేతిలో నొక పైసయైన లేక 'బోస్టన్ ఆస్పత్రి'లో మరణించెను.

అతఁ డాఱునెలలవాఁడై యున్నప్పుడే అక్షరమాల నంతయు నప్పగించెను. రెండవయేఁటఁ జదువను వ్రాయను నేర్చెను. ఆఱేండ్ల వయసునాఁటికి పెక్కు పరభాషలు చదువుటయు వ్రాయుటయు నేర్వఁ గల్గెను. పదునొకొండవ వత్సరమున 'అవకాశమున పదార్థముల వ్యాప్తిని' గూర్చిన నూతనశాస్త్రవిషయములు కనిపెట్టి ప్రకృతిశాస్త్రజ్ఞుల ముగ్ధుల నొనర్చెను. గణితశాస్త్రమున గణుతి గాంచుచు పదియాఱవయేఁట హార్వర్డు విశ్వవిద్యాలయమున పట్టభద్రుఁ డయ్యెను.

అయినను తగినయుద్యోగ మేదియు సంపాదింపలేక చివరకు అంకెలుకూడుయంత్రపువిధి కంపెనీలో గుమాస్తాగా కూడ పనిచేయ లేక ఒక నౌకరీనుండి మఱియొకదానికి ఆదర్శశూన్యముగ మాఱు చుండువాఁడు.)

మఱియు ధీరేంద్రనాథపాలుగారు Sankara, The sublime అను గ్రంథమున శంకరుని బుద్ధిసూక్ష్మతను గూర్చి సంశయింప నక్కఱ లేదని యీనాఁటి వంగదేశమందు జరిగిన యొక యద్భుతసంఘటనము నిట్లు తెలిపి యున్నారు.

The following fact as narrated by an eyewitness only the other day can convince all that it was not at all ludicrous if Sankara's biographers have said that he became a vastly learned man when he was but a mere boy. The following is a translation from the "Hitabadi" newspaper. It was published 11th Visaka in the Bengal year 1315 under the heading "Extrardinary memory."

"The Brahmins of India have degenerated with the degeneration of whole India. They have lost their old world renowend intelligence and genius, .... their superhuman power of memory... their piety and holiness but even in these days of degenaration - we some times come across such extraordinary and wonderful power of memory and intelligence that they cannot be found in any other country of the world. Since a year two Brahmin boys have come to the holy city Benares. Both these boys posses extraordinary memory and intelligence. We publish in this issue the photos of these two boys.

The boy who is in ascetic dress mastered the Hindi, Bengalee and English languages, and studied many Sanskrit works and got by heart the whole of panini's great grammar when he was only five years of age. Last year he was invested with the holy thread and is now living the life of a strict ascetic. He is now only eight years of age and studying the Sama-Veda.

The other boy is hie younger brother. He is now only five years of age; but even now he is proficient in four or five languages and is studying the grammar of Panini. Both brothers are vastly learned in Mathematics.

(ఈ క్రింది వృత్తాంతము ప్రత్యక్షముగాఁ జూచిన యొకరివలనఁ దెలియుచున్నది. శంకరు లతిబాల్యముననే సకలవిద్యాపాటవము గల వాఁ డయ్యె నని చరిత్రకారులు వ్రాసినవ్రాఁతలు పరిహసింపఁ దగినవి మాత్రము కావు. ఈ క్రింది "హితవాది" పత్రికయందలి "లోకోత్తర మగు మేధాశక్తి" అను శీర్షికగల వ్యాసము ననువాదము చూడఁ దగును. హిందూదేశముతోపాటు బ్రాహ్మణులుకూడ మిగుల హీన స్థితికి వచ్చిరి. జగద్విఖ్యాతమగు వారి మనుష్యాతీతమైన మేధాశక్తియు పవిత్రతయు నశించినవి. ఇట్టి హీనస్థితియందును నొక్కొక్కప్పు డసాధారణము, నాశ్చర్యకరమును మఱి యేదేశమునందును గానరాని మేధాశక్తియు జ్ఞానమును గోచరించుచున్నది. ఒకసంవత్సరముక్రింద నిద్దఱు బ్రాహ్మణబాలురు కాశికి వచ్చిరి. వీ రిద్దఱకు లోకోత్తర మగు ధారణాశక్తి, బుద్ధియుఁ గలవు. వీరిఛాయాపటము లీపత్రికలోఁ బ్రకటించితిమి. అందు సంన్యాసివేషమున నున్న బాలుఁడు 5 ఏండ్లవయస్సువాఁడు పాణినివ్యాకరణ మెల్ల కంఠపాఠముచేసి హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు భాషలను స్వాధీనముచేసికొని, పెక్కు సంస్కృత గ్రంథములను చదివెను. నిరుడే యతని కుపనయన మైనది. ఇప్పు డతి తీవ్రమగు సంన్యాసనియమముతో నున్నాఁడు. వయస్సు 8 ఏండ్లు. ప్రస్తుతము సామవేదము చదువుచున్నాఁడు. రెండవవాఁ డతని

తమ్ముఁడు. ఇతఁడయిదేండ్లవాఁడు నాలుగైదు భాషలు నేర్చినవాఁడు. పాణినీయ వ్యాకరణము ప్రస్తుతము చదువుచున్నాఁడు. వీరిద్దఱు గణిత శాస్త్రములో గొప్పపండితులు.)

మఱియు నాగ్రంథకర్త శంకరుని యమానుషశక్తుల వర్ణించుచుఁ బరకాయప్రవేశవిద్యను గూర్చి యిట్లు చెప్పుచున్నారు:

This story might appear to many as the acme of improbability. But as for ourselves, we believe that it was not impossible. By the yoga power, it is perfectly possible, to have one's soul transferred to other bodies or to take it any where at will. This incident has been mentioned by all the writers on the great master. Why for no earthly reason they should speak such an unnecessary lie? Ofcourse this is not the place to enter into such controvercial matter. Our readers are not at perfect liberty to believe or not to believe the story. But they must know that Sankara was not only a great philosopher and a prophet, but he was also a great 'yogee'. He studied and practised 'yoga' under his Guru for many years together. And it is admitted in every Hindu sastra that a man who attains success in 'yoga' becomes almost almighty,.... nothing remains impossible to him. The day is not far off when it will be universally admitted and demonstrated by the modern sciences as they will be advanced to perfection...Page 59.

(పెక్కుర "కీగాథ జరిగియుండుట కేమియు నవకాశములే" దని నట్లు కనుపింపవచ్చును. కాని మాకుమాత్ర మది యసాధ్య మని పించుటలేదు. యోగశక్తిచే ఒకయాత్మ యితరుల శరీరమున ప్రవేశించుటకుఁగాని యిచ్చవచ్చినచోటికేఁగుటకుఁగాని మిక్కిలి యవకాశము కలుగును. శంకరులు పరకాయప్రవేశ మొనర్చినట్లుపెక్కురు వ్రాసియున్నారు. వారందఱు వృథాగా నేల యసత్యము పలుకవలెను? ఇందులకై వివాదపడుట కిది సమయముగాదు. మా చదువరులు దీనిని నమ్మిన నమ్మవచ్చును, లేదా మానవచ్చును. కాని వారొక సంగతి మాత్రము తెలిసికొనవలెను. శంకరులు గొప్పవేదాంతి, గొప్పప్రవక్త

యనిమాత్రమే గాక గొప్పయోగికూడ నని యెఱుఁగఁదగును. పెక్కం డ్లొకగురువువద్ద యోగశాస్త్ర మెల్ల నాయన చదివి సాధన మొనర్చెను. "యోగమును సాధించిన మనుజుడు భగవంతుఁడే యనియు, వాని కసాధ్యమేదియు నుండ దనియు" హిందూశాస్త్రము లన్నియు నేకగ్రీవముగాఁ బలుకుచున్నవి. నేఁటి ప్రకృతిశాస్త్రములింకనునభివృద్ధి యయినకొలఁది నీసంగతిని (పరకాయప్రవేశవిద్య)గ్రహించి రుజువు చేయఁగలట్టి శుభదినము సమీపించుచున్నది)

ఈ వ్రాఁతలనుబట్టి శ్రీశంకరులు యోగవిద్య కరతలామలక మొనర్చుకొనిరనియు ధ్రువపడుచున్నది. కమండలువుచే నర్మదానదీ పూరము త్రావించిన వశిత్వమును, పద్మపాదునిచేఁ దామర పూల పంక్తిమీఁద నడపింప నిచ్చిన లఘిమమును, ముమూర్షువగు తల్లికడకు నాకాశమార్గమున రానేర్చిన పాదుకాసిద్ధియు నీయోగశాస్త్రపాటవము చేతనే కల్గినవనియు; నావిద్యచే నవి సులభసాధ్యము లనియుఁ దెలియఁ దగును.

కావున మనము చూచి యుండలేదని దేనిని లేదనికాని, కాదని కాని త్రోసిపుచ్చుట తగదు. నిన్న నమ్మనివాని, నీదినమున నమ్ముచున్నాము. ఈదినమున నమ్మనివాని నెన్నిటినో రేపు నమ్ముదుము. ఈరీతి సిద్ధాంతముల కనుమతించియు "వ్యాసాదులు చిరంజీవు" లను పురాణసిద్ధాంతమును నమ్మనియట్లు "వ్యాస" యనునది బిరుదము కావచ్చునని వ్యాసునిగూర్చి ధీరేంద్రనాథు లిట్లు నిర్ణయించుచున్నారు.

We need not say that Kristna Dwaipayana Vyasa, the arranger of holy Vedas and the writer of Vedanta Sutras and various Puranas was born many hundreds of years before the brith of Sankara. He was a contemporary of Kuru-Pandavas who fought the great battle of Kuru - Kshetra in about 1900 B. C. Therefore this story is rather an allegory, ... meaning thereby that he had fought with many lear-

ned men to sustain his new explanation of Vedanta. He must have fought with the profound scholar of Vedanta philosophy of that time who was naturally discribed as an incarnation of the ancient Rishi Vyasa. We might mention that the title of "Vyasa" is always borne even up to this day, by one of learned men of Benares. Perhaps the Vyasa contemporary to Sankara was a great learned Vedanttist and he had to light with this old Brahmin.

(వేదవిభాగకర్తయు, వేదాంతసూత్రరచయితయు, బహుపురాణనిర్మాతయు, నగుకృష్ణద్వైపాయనుఁడు శంకరునకుఁ బూర్వము కొన్ని శతాబ్దముల నాఁడు పుట్టెను, ఇంచుమించు క్రీ. పూ. 1900 సంవత్సరములనాఁడు కురుక్షేత్రమున యుద్ధముచేసిన కురుపాండవులనాఁటివాఁడు. కావున నీకథ కల్పితము. కాని యీకథవలన (శ్రీ)శంకరుఁడు తన నూతనసిద్ధాంతములతోఁడి వేదాంతమార్గప్రతిష్ఠకై పెక్కురు మహాపండితులతో వివదించె ననవచ్చును. వ్యాసునియవతారమే యనఁదగు నొకమహావేదాంతవిజ్ఞానితో ఆసమయమున శంకరుఁడు వాదించియుండవచ్చును. నేఁటికిని గాశియందు గొప్పపండితులకు "వ్యాస" అనునది బిరుదముగాఁ గానవచ్చుచున్నది. బహుశః శంకరునినాఁటి వ్యాసుఁ డనఁగా వేదాంతశాస్త్రమున మహావిజ్ఞాని యగునొకానొక పండితుఁడు. ఆతనితో శంకరులకు వాదముజరిగి యుండును") అనిరి. ఈ విషయము నారచనముననే చర్చింపఁబడినది. ప్రాజ్ఞులు నేను జూపిన హేతువుల కామోదించి దీవింతు రనుకొనుచున్నాను. చూ. 3 అ. 231—262.

దేశకాలవివేచనము మనమున నిడుకొనియే సాధ్యమైనంతవఱకు రచన సాగించుచు మూలమునకుఁ జేరువగాఁ గథాంశము నడపయత్నించితిని. ఎంతవఱ కందుఁ గృతార్థుఁడనైతినో నిర్ణయింప సహృదయులే ప్రమాణము. వ్యాసజైమినులు శ్రాద్ధభోక్తలుగా మండనునింటికి వచ్చి రనుఘట్టమున వైయాసకవిద్య (ఉత్తరమీమాంస) జైమినీయ

విద్య (పూర్వమీమాంస) నేర్చినపండితు లని మార్చఁబడెను. మఱియు బాణమయూరదండిశ్రీహర్షప్రముఖమహాకవులతో శంకరుఁడు వాదించి, శిష్యులనుజేసికొనెనని మూలమునఁగలదు. దీనిఁగూర్చిధీరేంద్ర నాథపాలుగారు తమగ్రంథమున “Besides this authenticity of Madhavachary's account of the great man in some points, is very much doubted when we find him mentioning Bana, Mayura, Dandi, Sri Haraha, Bhaskara and Udayana to be contemporary of Sri Sankaracharya.... a thing which is practically impossible and needs no proof any student of Archelogy.

(ఇంతియకాక మహాపురుషుఁడగు శ్రీశంకరునిగూర్చి మాధవాచార్యుఁడు చెప్పిన కొన్ని యంశములందతని ప్రామాణికత్వము సంశయ పాత్ర మగుచున్నది. బాణ, మయూర, దండి, శ్రీహర్ష, భాస్కరోదయనులకు సమకాలికుఁడుగ శంకరు నుదాహరించుట యసంగతము కాదా!) అని విమర్శించియున్నారు. ఈసందర్భమున :

చ. పొరిఁబొరి బాణదండి భవభూతి మయూర ము ఖాద్య సత్కవీ
శ్వర బిరుదాంకితుల్ కవులు వాదునఁ బల్వొ రెదిర్చి యోడి, శం
కరుగురు నాశ్రయించి కడఁకన్; గడకొత్తి స్వదుర్మతంబులన్
వరుసఁ బఠింతు) భాష్యము లవంత్యపవర్తన వర్తనంబునన్. 9-33

ఉ. ఖండనకారునంతటి యఖండమనీషుఁ బటిష్ఠయుక్తి వా
క్ఖండిత సర్వశాస్త్రి) గురుకల్పుని భట్టనికల్పు నొక్కనిన్
బండితపాళిఁ బట్టి యభిమానము తద్యతి ద్రుంచి నొంచి యు
చ్చండ వివాదకేళిని వశంవదుఁ జేసికొనెన్ క్షణంబునన్. 9-57

అని బాణాది పూర్వకవుల నామములను బిరుదములుగా దాల్చిన మహాకవులను, శ్రీహర్షు నంతటి మహాపండితుని శంకరుఁడు జయించె నని మార్చితిని.

శంకరుఁడు తల్లికుత్తరక్రియలు చేయుసందర్భమున మాధవ గ్రంథమందలి శాస్త్రనిషిద్ధాచారము లేకుండఁ జిద్విలాసుని గ్రంథము నందలి "తల్లి మరణింప నున్నదని యెఱిఁగి శంకరుఁడు జ్ఞాతులను బిలువ వారు రారైరి" అను వాక్యమును గొని జ్ఞాతు లుత్తరక్రియలు చేయ రాకుంటకుఁ గినిసి వారిని శపించి యాపద్ధర్మముగాఁ దానే చేసె నని మూలకథ విడువక శ్రీభగవత్పాదులకుఁ గళంకము సోఁకకుండ మార్పు గావింప స్వతంత్రించితిని. ఇట్టి స్వాతంత్ర్యము కుమారిలభట్ట చరిత్రమునను జేయక తప్పినది కాదు. "జైనగురువును జంపినపాపము పోఁగొట్టుకొన భట్టపాదుఁడు తుషాగ్నిప్రవేశ మొనర్చెనను తావునఁ దుషాగ్నిప్రవేశము వ్రత మని నిరూపించితిని. కుమారిలుని చరిత్రమున కెట్టి కళంకము లేకుండఁ జేయుతలంపుతోడనే యట్టిమార్పు కావింపఁ బడె నని ప్రాజ్ఞు లవధరింతురుగాక!

చరిత్రమార్గమున 'అట్టు ఇట్టు' అని శ్రీశంకరులంగూర్చి తోఁచినరీతి విమర్శింపఁగలమే కాని యాలోకోత్తర వర్తనుని శాస్త్ర రచనాపటిష్ఠతఁ గూర్చియేని, కవితానైపుణ్యముఁ గూర్చియేని 'యట్టి ట్టన సహస్రాక్షునకైనను శక్యమా? అమ్మహనీయుని వాక్కు— శాస్త్ర రచనయం దెంత గంభీరార్థనిబద్ధమై ప్రతివాదిదుర్ఛేదమై దీపించునో కవితారచనయం దంత సుకుమారమై, ప్రసన్నమై, మధురమై సకలజన హృదయంగమమై యెప్పుట యద్భుతావహము గాదా? అట్టియలోక మహిమల కాటపట్టయి ముప్పదిరెండేండ్ల యల్ప జీవితమునందే యాసేతుహిమాచలము కాలినడకను బలుమఱు పర్యటించి, వివిధ మతములందు మహావిజ్ఞానులగు పండితులను జయించి శిష్యులుగాఁ జేసికొని, దుష్టు లొనర్చు క్రూరకృత్యములనుండి తప్పించుకొనుచు, శిష్యులఁ గాచుచు, నన్నిదిక్కుల నద్వైతమతరక్షణము శాశ్వతముగా [illegible], నాఁటిమహీపాలుర వశ మొనర్చుకొని, మఠముల నిర్మించి,

దిగ్దంతులవంటి శిష్యులను నాలుగు మఠములకధిపతులుగ నెలకొల్పి, ధర్మము నాల్గుపాదముల నడపిన శ్రీశంకర భగవత్పూజ్యపాదులు భగవదవతార మనుటకు సంశయ మెందులకు? మనుజుల బుద్ధులకు గోచరింపని విషయముల నెఱింగి తన్ననుసరించువారి కవిశేషములఁ దెలిపి తరింపజేసినవానినే కదా భగవదవతార మందురు! అట్టియెడ శంకరునిగూర్చి పెక్కుమాటలతోఁ బ్రయోజన మేమి? అట్టి పరమశివావతార మగు శ్రీశంకరుల దివ్యచరిత్రము కవులును, చారిత్రకులును వర్ణించి విమర్శించి గ్రంథము లెన్నివ్రాసినను వ్రాయవచ్చును. ఒక్కొక్కరి సూక్తియం దొక్కొక్క వింతయో విశేషమో యుండితీరును. అదిగాక ఎంద ఱెంతవర్ణించినను నా వర్ణన మంతయు నా జగదేకగురుని యశస్సుధాబ్ధియందలి తరంగములోని యొక బిందుమాత్రమేనియుఁ గానేరదు. విద్యారణ్యు లని ప్రసిద్ధివడసిన మాధవాచార్యుఁడు శంకరవిజయగ్రంథనిర్మాతలలోఁ దలమానికమై యొప్పును. పండితు లాగ్రంథ మాయనయే రచించినాఁ డని చెప్పుట బహుళము. కాని యాగ్రంథము రచించిన దాతఁడుగాఁడు. 'వ్యాసాచలకవి' ననుకొనుటచే నీతఁ డన్యుఁడని విమర్శకులు చెప్పుచున్నారు. ఆయంశమునకు దిగిన శాఖాచంక్రమము కావచ్చునని యానిర్ణయ మొనర్చుభారము ప్రాజ్ఞలోకము వహింప విడిచిపుచ్చెదను.

'నేతాయత్రోల్లసతి భగవత్పాద సంజ్ఞో మహేశః' అనిన సూక్తి చొప్పున శంకరభగవత్పాదులు నాకావ్యమునకు నాయకుఁడు. కృతిపతి శ్రీరామచంద్రమూర్తి. ప్రేరకులు మహోదారులును నిరంతర రామభక్తి నిధులగు శ్రీ వేంకటరావు పంతులుగారు. ఇట్టి సంఘటన సమున్నతి నాకే నేనే యచ్చెరువడుచు నఘటనా ఘటనాపటిష్ఠుఁడగు గురుమూర్తికి జోహారు లర్పించుచు- దమశిష్యునివలె నన్నునారయుచు, శంకరవిజయమునందలి శాస్త్రవాదఘట్టములం దెన్నియో

తెలియఁ జెప్పి, నాగ్రంథ మంతయు శ్రద్ధతో నరసి, తమ శారదా ముద్రాలయమున ముద్రింపఁజేయుటయే గాక, తమపుత్రులతో సమానముగా న న్నాదరించి, నాశ్రమమంతయుఁ గార్యరూప మొందఁ బీఠిక వ్రాసి దయచేసిన "తర్క-వేదాన్తరత్న" బ్రహ్మశ్రీ బులుసు అప్పన్న శాస్త్రులుగారికి నాసార్వకాలిక కృతజ్ఞత మెఱయ వందనము లర్పించుచున్నాను.

పరమేశ్వరుఁడు శంకరుఁడు శ్రీ వేంకటరావు పంతులుగారికిని వారి పుత్రపౌత్రులకును నిత్యాభ్యుదయము లొసంగి రక్షించుఁగాక!

## ద్వితీయముద్రణము

ప్రథమముద్రణము 1918 జూలై మాసమునఁ బూర్తియైన పిదప 4-7-48 తేదీని కృతిసమర్పణసభ జరిగినది. నాఁటి సభా వృత్తాంత మంతయు "ప్రారంభవిద్యా" పత్త్రిక జూలై సంచికయం దీక్రిందివిధముగాఁ బ్రకటింపఁబడినది.

## విద్వత్కవిసన్మానము

కవితాభూషణ బ్ర॥శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారిచే రచింపబడిన 'శంకరవిజయ' ప్రబంధమును మ॥ రా॥ శ్రీ ఈదర వేంకటరావుపంతులుగారు (వేంకట్రామ అండ్ కో ప్రొప్రైటరు) తమ యిలువేలుపగు శ్రీరామచంద్రమూర్తికి కృతిసమర్పణ చేయించిన సందర్భమున తర్క-వేదాంత సార్వభౌమ బ్ర॥శ్రీ మండలీక వేంకట శాస్త్రిగారి అధ్యక్షతను శ్రీ పంతులుగారింట ది 4-7-48 న గొప్ప సభ జరిగినది. ఈసభకు మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ బ్ర॥శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారున్నూ, బాల వ్యాస వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, బులుసు అప్పన్నశాస్త్రి, దర్భా సర్వేశ్వరశాస్త్రి, చావలి నృసింహశాస్త్రి, కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారయణ **M. A.,** శ్రీ జటావల్లభుల పురుషోత్తము **M. A.,**

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ M. A. B. L. గార్లున్నూ ఇంకా కొందరు మహాకవులు, పండితులు, పురప్రముఖులు చాలమంది విచ్చేసిరి. ఆంధ్రదేశమందలి విఖ్యాత ప్రతిభావంతు లనేకులు శ్రీ ఈదర వేంకటారావుపంతులుగారికి పంపిన ఆశీస్సులు శ్రీ పాలుట్ల పాలంకయ్య గారిచే సభలో చదువఁబడిన పిమ్మట శ్రీ బులుసు అప్పన్నశాస్త్రిగారు సభను ప్రారంభించి గంభీరోపన్యాసము గావించిరి. తదుపరి శ్రీ పురుషోత్తముగారున్నూ, జొన్నలగడ్డ, విశ్వనాథ సత్యనారాయణగార్లున్నూ, కవిసార్వభౌములున్నూ, యింకా కొందరు విద్వాంసులున్ను శంకర విజయమహాప్రబంధ కథానాయకులగు శ్రీ శంకరభగవత్పాదులను గురించియు, కృతికర్తయగు శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారి ఆకర్షణీయమగు కవిత్వమును, వారి అద్వితీయ ధారణాశక్తి, పాండిత్య ప్రకర్ష మున్నగు వానిని గూర్చియు, కృతిప్రేరకులును, సహజౌదార్య సంపన్నులుననగు, విద్యోద్ధారక, ఆశ్రితపారిజాత బిరుదాంకితులు శ్రీ ఈదర వెంకట్రావుపంతులుగారి దివ్యప్రతిభను అసామాన్య వితరణమును, వారి సౌజన్యమును, భగవద్భక్తి మున్నగు వానిని గూర్చియు, విపులముగా వారి సహజ మృదుమధుర వాగ్ధోరణిని అతిమనోహరముగా గంభీరోన్యాసములు చేసి సభ్యుల నమందానంద పరవశుల జేసిరి. శ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రి, పిసుపాటి విశ్వేశ్వర శాస్త్రి, కొల్లి అనంతపద్మనాభశాస్త్రిగార్లు సంస్కృత శంకరవిజయ కర్తయగు విద్యారణ్యుల వారినిగూర్చియు, కావ్యమందలి గుణగణములగూర్చియు చక్కఁగా నుపన్యసించి ఆంధ్ర శంకరవిజయమునందును మూలములోవలె ఆకర్షణీయమగు ఘట్టములు గలవని నిరూపించిరి.

కవిసార్వభౌములు సభ్యుల అనుమతితో కృతికర్తలకు 'విద్వత్కవిశేఖర' యను బిరుదము నొసంగి సన్మానించిరి. కవిగారికి శ్రీ ఈదర వెంట్రావుపంతులుగారు సువర్ణ ఘంటాకంకణమును,

రు 2116 లున్నూ, దుశ్శాలువలు నొసగి బహూకరించిరి. అట్లే ఈ సభకు విచ్చేసిన పండిత కవులను, దుశ్శాలువలు, శంకరవిజయ కావ్యములు, భూరి సంభావనలు ఇచ్చి సత్కరించిరి.

అధ్యక్షుల ఆశీస్సులతోను శ్రీ పాలుట్ల పాలంకయ్యగారి అభివందనములతోను సభ జయప్రదముగా ముగిసినది."

నాఁడు 500 ప్రతులు మాత్రము ముద్రితములైనవి. అందు చాలభాగము నాఁటి సభయందును, దరువాతను, సరసులు, నుదారులు నగు శ్రీ వేంకటరామపంతులుగారిచేఁ బండితులకును మిత్రులకును బహూకరింపఁబడెను. కొలఁదికాలములో మిగిలినవిగూడ నైపోయినవి. మరల నిన్నాళ్ళకుఁ గాని రెండవముద్రణమునకు నవకాశము లభింపలేదు. శ్రీరామచంద్ర కరుణాకటాక్షమున నేఁటికి ద్వితీయముద్రణము పూర్తియైనది. ఈసారి ద్రవ్యలాభమువారి నిర్బంధము లేకుండుటచే 1000 ప్రతులు ముద్రింపఁబడినవి. ప్రథమముద్రణమునందలి ప్రమాదములు సవరింపఁబడినవి. కాని యిందును గొన్ని ప్రమాదములు రాక మానలేదు. కావునఁ జదువరులు తప్పొప్పులపట్టిక ననుసరించి సవరించుకొని పఠించి యానందించి నన్నుఁ జరితార్థు నొనర్తురుగాక యని ప్రార్థించుచున్నాను. ఈ ముద్రణముగూడఁ శ్రీ శారదాముద్రాలయముననే జరుగుటచేత గురుసమానులగు శ్రీ అప్పన్నశాస్త్రిలవారు నాయెడఁ జూపిన యాదరాతిశయమునకు సర్వదా కృతజ్ఞుఁడను.

ఖరఫాల్గుణ శు ౧౨
భానువాసరము

ఇట్లు,
గ్రంథకర్త.

# తృతీయముద్రణము - విన్నపము

శ్రీ వేంకట్రామా కంపెనీ ప్రొప్రయిటర్లు శ్రీ ఈదర వేంకటరావు పంతులు గారును, వారి పుత్రులు శ్రీ వేంకటాద్రియ్యపంతులుగారును ఈశంకరవిజయము 1948లోను 1952 లోను పూర్ణముగా రెండుమాఱు లచ్చొత్తించి ఆర్థికముగా నాకెంతయో సాయ మొనర్చినారు. అప్రతు లన్నియు వెనువెంటనే ఖర్చయి పోయి సుమా రిర్వది యేండ్లుగా పునర్ముద్రణ భాగ్యము నొందలేదు. ఈనడుమ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వా రొనర్చిన పెద్ద ఆర్థికసాహాయ్యమున శంకర విజయము పూర్వభాగము మూఁడవ ముద్రణభాగ్య మొందినది.

మొట్టమొదట నాయీ కావ్య రచనారంభ వృత్తము "మనవి" యను శీర్షకముక్రింద వ్రాసియున్నాను. ఆనాఁడు నాకు లభించిన సంస్కృత మూలగ్రంథములు మూఁడు, తెలుఁగువి రెండు మాత్రమే. అవి 1. చిద్విలాసకృత "శంకరవిజయ విలాసము" 2. మాధవకృత మనఁబడు "శంకరవిజయము" 3. ఆనందగిరి కృతమగు "శంకరవిజయము". ఇవి సంస్కృత మయములు. ఇఁకతెనుఁగున శ్రీ మధిర సుబ్బన్నదీక్షితులుగారి కాశీమజిలీకథలలో నొకభాగమగు 1."శంకరచరిత్ర" 2. శ్రీ కళ్యాణానంద భారతీ మాంతాచార్య స్వాములవారి యుపోద్ఘాతముతోడి శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి కృత "శంకరవిద్యాలీల" అను పద్యకావ్యము ననునవి మాత్రమే. నాశక్తికొలఁది వాని నెల్ల సమన్వయపఱచికొని, శ్రీశంకరుల పాత్ర కెట్టి కళంకము సోఁక కుండవలె నని చిన్నచిన్నమార్పులు చేయుచు- తెలుఁగునాఁట బహుళ ప్రచారము గల మాధవ శంకరవిజయచ్ఛాయనే రచన మెల్ల సాగించితిని. ఆమార్పులు చాలభాగము పీఠికయందు బ్ర॥శ్రీ బులుసు అప్పన్నశాస్త్రిలవారు విమర్శించియే యున్నారు. నా మార్పులలో లోపము లేవేని యుండవచ్చును. ప్రాజ్ఞులు నాసాహసమును క్షమింతురుగాక అని వేడ్కోలు.

రెండవ ముద్రణము తరువాత 1961 లో నాగరలిపియందు ముద్రితమైన "నవ శంకరవిజయము" బ్ర॥శ్రీ. పుల్యా ఉమామహేశ్వరశాస్త్రిలవారు రచించినది యొకటి. 1966లో ముద్రితమైన శ్రీ శృంగేరీ జగద్గురువులచేఁ బ్రకటితమైన గురువంశకావ్యమొకటి. 1978 లో ముద్రితమైన శ్రీ కాంచి కామకోటిపీఠాధిపతుల కరుణచే శ్రీవారిశిష్యులైన బ్రహ్మశ్రీ రాధాకృష్ణశాస్త్రి గారిచే రచింపఁబడిన- శంకరవిజయమకరంద మను సంస్కృత పద్యకావ్య మొకటి. ఏనాఁడో ముద్రితమై శిథి

లమైయున్న "శ్రీశంకరభగవత్పాద చరిత్ర" పేర శ్రీ శ్రీ కామకోటిపీఠము పక్ష మున ప్రకటితమైన సంస్కృతపద్యకావ్య భాగములు అప్పు డప్పుడు దొరికినవి. ఈనాలుగును వెనుకటి మూఁడిటితో నెన్నో తావుల భిన్నములై భ్రమ కలిగించి నవి. ఏది ప్రమాణముగాఁగొనిసను తక్కినవి అప్రమాణములగు నని భయము.

శంకరుల జన్మస్థలము "కాలటి" అను విషయమున ఆనందగిరి కావ్యమున దక్క, అన్నియు నేకగ్రీవములే. ఆనందగిరిమాత్రము "చిదంబరమున జన్మించె" ననెను. "ఆశంకరు లాది శంకరులు కారు. వీరిం కొకరు." అని నవశంకరవిజ యము చెప్పుచున్నది.

ఇఁక కాలమువిషయమై భిన్నవిధములు "మనవి" అను శీర్షిక క్రింద వ్రాసియే యున్నాను.

భారతీయ సంప్రదాయమున వెలువడు పంచాంగముల పరిపాటిని శంక రావతారాబ్దములు 2052 అని కనఁబడును. పాశ్చాత్య సిద్ధాంతానుసారముగా నైనను పది పన్నెండు శతాబ్దముల క్రింద శంకరజనన మని యూహింతము. శంక రావతారము నాఁటికి ఒక రాష్ట్రమున కొకరాష్ట్రముతో సంబంధ మంతగా నున్నట్లు కనఁబడదు. కాని యావద్భారతమును తన యపార సారస్వతమున అచంచల సిద్ధాంత నిబద్ధమైన, అద్వైతమత మార్గమున భావిత మొనర్చిన శ్రీశంకరుల దివ్యచరిత్రము నెవరిభాషలో వారు వ్రాసికొనుటయే కాదు. యావద్దేశ వ్యాప్తికై దేశమున కెల్ల సామాన్యభాష యగు సంస్కృతమున పెక్కురు పండితులు తాము కన్నవి విన్నవి తమ తమ రచనలలోఁ దెలుపుటయుం దనేకభేదములు కలిగినవి. అది సహజమే.

చూడుఁడు. శ్రీభగవత్పాదులు ప్రతిష్ఠించిన మఠములు, త దధిపతుల విష యమున శంకరచరిత్రముల నెన్నియో భేదములు కనఁబడును. బదరికయందలి జ్యోతిర్మఠమున పద్మపాదుని- ద్వారకయందలి శారదామఠమున హస్తామలకుని- శృంగేరియందలి శ్రీమఠమున సురేశ్వరుని పాలకులుగా శ్రీశంకరులే నిలిపినట్లు కొన్ని కావ్యములందు కనఁబడును. నవశంకరవిజయ, శంకరవిజయమకరం దాది కావ్యములందు కొన్నిట శృంగేరియందు పృథ్వీధవుఁడును, కాంచి కామకోటిపీఠమున సురేశ్వరునిపర్యవేక్షణమున తక్కిన నాల్గుపీఠములు పాలింపఁబడుచుండ శ్రీశంక రులు కాంచియందే సిద్ధిపొంది రని గలదు. కొన్నిట కేదారమున సిద్ధి పొందినట్లు కలదు. ఏది సత్యమో తెలియదు.

శంకరవిజయ మకరంద కర్తలు బ్రః శ్రీః రాధాకృష్ణ శాస్త్రిగారు అకావ్యము 306. 307, 308 పుటలలోని అధోజ్ఞాపికలందు ఇట్లు వ్రాయుచున్నారు. వారి సంస్కృతవాక్యముల భావ మిందు పొందుపఱచెదను. "పీఠాధిపత్యవిషయమున పెద్ద విసంవాదము కనఁబడుచున్నది. జ్యోతిర్మఠమున తోటకాచార్యుఁ" డనుట కెందును విరోధములేదు. ఇఁక ఆనందగిరి 'శృంగేరియందు పద్మపాదుఁడును కాంచి యందు సురేశ్వరుఁడును అధిపతు లైరి' అని రెండు పీఠములనే చెప్పెను. మాధవీయమున శృంగేరి మున్నగుచోట్ల కొందఱను నెలకొల్పెను. అని సంగ్రహముగాఁ గలదు. వ్యాసాచలీయమున కాంచిలో శంకరుఁ డను చెట్టు శిష్య లనెడు నాలుగు శాఖలచే లోక మంతయు ఆక్రమించెను- అని అస్పష్టముగాఁ గలదు. గురువంశ కావ్యమున- జగన్నాథపీఠమున పద్మపాదుఁడును, ద్వారకయందు హస్తామలకుడును, శృంగగిరియందు సురేశ్వరుఁడును నిలుపఁబడిరి" అని కలదు. 'హుల్ష్ఁ అనుతఁడు శృంగేరి జగద్గురుపీఠ గ్రంథాగారమునుండి గ్రహించిన గ్రంథమున' "శంకరు లచట పండ్రెండేండ్లు నివసించి పృథ్వీధరుఁ డను నతని శృంగగిరియందు నిలిపె నని చెప్పెను. కృష్ణరాజేంద్రకృత శృంగగిరి మఠ గురుపరంపరా స్తోత్రమున"గురువు శంకరాచార్యులు, విశ్వరూపాచార్యయోగి,నిత్యబోధఘనుఁడు" అనెడి క్రమము కలదు. (కాని విశ్వరూపాచార్యయోగి అనుతావున పృథ్వీధరాచార్యయోగి అనికాని సురేశ్వరాచార్యయోగి యని కాని పఠింపవచ్చును) పృథ్వీధరుఁడే హస్తామలకుఁడు అని గోవర్ధనమఠ జగద్గురు పరంపరా నామములందు "పృథ్వీధరాహ్వాయం శ్రీమ ద్ధస్తామలక యోగినం" అని కలదు. సుధన్వలేఖ యందు నట్లే కలదు. శ్రీశంకరులకు సాక్షాచ్ఛిష్యుఁడైన హస్తామలకుఁడు సురేశ్వరునకు శిష్యుఁ డగుట యెట్లు? అని యొక అనుపపత్తి. సదాశివ బ్రహ్మేంద్రులు గురురత్నమాలాస్తవమున నిత్యబోధఘనునకే పృథ్వీధరుఁ డనునది నామాంతరముగాఁ జెప్పిరి.

ఇది యిట్లుండ :- ద్వారకా మఠాధిపతు లైన శ్రీరాజరాజేశ్వర శంకరాశ్రమ శ్రీపాదులు తమ యుపోద్ఘాతముతో ప్రకాశితమైన పత్త్రికలో సురేశ్వరుఁడు ద్వారకయందును, హస్తామలకుఁడు శృంగేరియందును, తోటకుఁడు జ్యోతిర్మఠమునందును పద్మపాదుఁడు గోవర్ధనమునను పీఠాధిపతు లైరి అని నిరూపించినారు.

వారే ప్రకటించిన సుధన్వరేఖయందు ధర్మరాజధాను లగు జగన్నాథాధి చతుర్మఠములందు 1. జ్యోతిర్మఠమున తోటకుఁ డను పేరి ప్రవర్తనాచార్యులను

2. శృంగేరిలో పృథ్వీధరుడను పేరుగల హస్తామలకుని 3. భోగవర్ధనమున పద్మపాదులను 4. ద్వారకలో సురేశ్వరాచార్యులను శ్రీశంకరులే అభిషేకించినారు. అనినట్లు కలదు.

ఒక్క సురేశ్వరులు రెండు మూడు తావుల నుండు టెట్లు? అని శంకర విజయమకరంద కర్త యిట్లు సమర్థించెను.

శృంగేరియందు ప్రథమాచార్యులుగా నియుక్తు లయిన సురేశ్వరులు శృంగేరియందు నిత్యబోధఘనుఁ డను పేరుగల పృథ్వీధరుని ఆ మఠమున నిలిపి, విజయయాత్ర కేఁగు శంకరులవెంట నరిగిరి. "పీఠే న్యస్య సురేశ్వరం సమవితుం సర్వజ్ఞసంజ్ఞం మునిం" అను ప్రాచీనశంకరవిజయ వాక్యముచే- కంచి యందు సర్వజ్ఞాత్మచరణుల స్థాపన పర్యంతము సురేశ్వరులే పీఠాధిపతులుగా నుండిరి. అనుకొన్నచో శంక కవకాశము లేదు. అని-

ఇట్లు మఠాధిపతుల విషయ మెట్లు విసంవాదముగా నున్నదో యిట్టిదే శంకరులు కరఁగిన పంచలోహముల ద్రవమును పానముచేసినా రనువిషయముకూడను. ఆప్రసంగము మాధవ, చిద్విలాస, సదానందగిరుల కావ్యములందు కనరాదు. ఒకటి రెంట మాత్రమే కనఁబడుచున్నది.

నవ శంకర విజయమున: శంకరులు క్రమ సంన్యాస స్వీకారమునకై గోవింద భగవత్పాదుల యాశ్రమమునకు రాఁగా ఆయతీంద్రుల శిష్యులు ఎనిమిదేండ్ల యీడున నున్న శంకరులను గాంచి, నీకు సంన్యాస మేమి? అని ఆక్షేపింపఁగా- శంకరుఁడది సహింపఁజాలక- నావిరక్తి నిగూర్చి మీకు సందేహమేని మీ యిచ్చవచ్చిన పరీక్ష చేసికొనుఁ డనెనఁట. అంతట వారు క్రాఁగుచున్న లోహ ద్రవము నీ కిచ్చెదము. అది త్రాగి నిర్వికారముగా నిలిచితివేని సంపూర్ణవిరాగిగా మే మెంచెదము. బ్రతికితివా సంన్యాసాధికారము నీకు కల దనుకొందుము- అని రఁట. సరే అని శంకరులు కావేరియందు నిలిచియుండ వారు సలసలక్రాఁగుచున్న లోహద్రవమును తెచ్చి యీయఁగా శంకరులు మంచినీటివలె త్రాగి నిర్వికారముగా నిలిచియుండెనఁట. అంత నాయతీంద్రుల శిష్యులు శంకరునిశక్తి కాశ్చర్య పడి క్షమాపణము కోరిరఁట- అని కలదు.

తమనాఁటికిఁ గల శంకరచరిత్ర అన్నిటిని పరిశీలించి సారమును వెల్లడించిన శ్రీశాస్త్రిమహోదయు లీతప్తలోహపాన వృత్తాంతము ప్రాచీనశంకరవిజయమునను జూచిరేమో! వారే ఆగ్రంథము నేఁడు లేదు- అని యన్నారు.

ఈవృత్తాంతమే "శంకరవిజయ మకరందము"న సందర్భమునకు దూర మైనను ఇం కొక విధముగా నున్నది.

ఒకానొకప్పుడు నాస్తికుఁడైన యొకరాజు శంకరులను భిక్షకై ఆహ్వానించి కాగుచున్న పంచలోహద్రవమును సమర్పించి "స్వామీ మీరు సర్వము బ్రహ్మమయ"మను సిద్ధాంతవాదులు. కావున భిక్షగా మీ రీలోహద్రవమును స్వీకరింపుఁడు. అని ప్రార్థింప— శంకరు లేమియు చలింపక ఆదరముతో ఆలోహద్రవమును త్రాగి నిర్వికారముగా నిలిచియుండిరఁట. ఆరాజు భయపడి కాళ్ళపైఁ బడఁగా— దయతో లేవనెత్తి అద్వైత మతోపదేశముచే వానిని కృతార్థుఁ జేసిరఁట. అని 19వ ఆస్వాదమునఁ గలదు.

ఈరెండు వార్తలందు నేది విశ్వాస్యము ? ఏది ప్రమాణము ? రెండును ప్రమాణము లగునా ? రెండును కావా ?

రెండు వేల యేండ్లనాఁటి శంకరుల జీవిత కథాప్రవాహమున మహానదియందుపనదులు చేరినటు లెన్నియేని యిట్టి యద్భుతావహ మగుఘట్టములు మిశ్రితములై యుండుట కవకాశము లేకపోలేదు. అట్టివి యిన్నాళ్ళకు విడదీసి చెప్పఁబోవ నెట్టి వారి కైనను దుస్సాధము అని నాయభిప్రాయము.

ఆకథాప్రవాహమునే నేనును గ్రహించి యౌచిత్యమునే దృష్టిలో నుంచుకొని కేవల చరిత్రవలెఁ గాక కావ్యముగా రచింప సాహసించితిని. వాస్తవము పరిపూర్ణముగా నెఱుఁగని నారచనలో చారిత్రకాంశములందు తప్పొప్పు లుండవచ్చును. అని తెలుపుటకే వెనుకఁ జూపిన ఉదాహరణములు. కాని పెద్దలను నారచయితలను తొందరపెట్టుటకు మాత్రముకా దని మరొకమాఱు విన్నవించుకొను చున్నాను.

— స్వస్త్యస్తు —

రౌద్ర, శ్రావణము

ఇట్లు,
గ్రంథకర్త.



గ్రంథకర్త:

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

# పీఠిక

శ్లో. గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణాం,
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః.

శ్లో. నారాయణ సమారంభాం శంకరాచార్య మధ్యగామ్,
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్.

శ్లో. శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయం,
నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్.

పరమశివావతార ప్రఖ్యాతులగు శ్రీ శంకరభగవత్పాదులవారి ప్రస్థానత్రయముతోఁ బఠనపాఠనక్రమమున నెంత పరిచయముగలవాఁడ నైనను, గీతాభాష్యమునకు నాంధ్రభాషయందు విపుల ప్రచారము గలుగుటకై నిరంతరము తద్వివరణ రచనా నిమగ్నుఁడ నైనను, శ్రీ యాచార్యులవారి నిరుపమ పుణ్యచరిత్ర మచ్చటచ్చట నరయుటయే కాని యామూల మాచూడముగఁ జూచుభాగ్యము నొందినవాఁడను గాను. అట్టికొఱంత నేఁటి కీయాంధ్రీకృత శంకరవిజయము మూలమునఁ దీఱిన దని సంతసించు చుంటిని. ఈగ్రంథమునకుఁ గృతిపతి శ్రీరామచంద్రమూర్తి యైనను, ప్రేరణకర్తలై యేతద్గ్రంథ రచనకుఁ బ్రత్యక్షనాయకులును, సరసులును వదాన్యులును శ్రీమంతులు నైన శ్రీ యీాదర వేంకటరావు పంతులుగారీగ్రంథమును దమ ముద్రణాలయమున నచ్చొత్తింప నవకాశము చిక్కక, మా శారదా ముద్రణాలయమున ముద్రింపఁ బంపుటచే, గ్రంథకర్తతోపాటు నాకును బ్రత్యక్షరపరిశీలన మావశ్యకమై యమితానందము కలిగించెను. ఆ యానందము లోకులకుఁ దెలుపుకొన వీలుగా నీ గ్రంథమునకుఁ బీఠిక నేనే రచించు సదవకాశముకూడఁ గలిగినది. ప్రకృత మనుసరింతును.

## శంకరుల జన్మ దేశము.

శ్రీశంకర భగవత్పాదుల జన్మదేశము, కాలము, మనుజావతార కారణము మున్నగు విషయముల నించుక పరిశీలించి పిదప నాంధ్రీకరణము గూర్చి చర్చింతము.

కేరళదేశమందలి కాలటి యను నగ్రహారము జన్మస్థాన మని సంస్కృత శంకరవిజయములందుఁ జెక్కింట నున్నది. కాని యానంద గిరికృతగ్రంథమున మాత్రము చిదంబర మని కలదు. ఇటీవల వెలువడిన పరిశోధనములందు శ్రీశంకరుల పూర్వులు తజ్జననకాలమునాఁటికిఁ గేరళ దేశమున నెలకొనినను నాంధ్రదేశమునుండి మయూరవర్మ యను తద్దేశ భూపాలుని యాహ్వానమున నచట స్థిరపడినట్లు కానవచ్చుచున్నది. ఆంధ్రపత్రిక రుధిరోద్గారి ఉగాదిసంచికయందు శ్రీకర్లపాలెము వెంకట నారాయణగారు 'శ్రీమదాదిశంకరు లాంధ్రులే' యని నిర్ణయించుచు నొకవ్యాసము వ్రాసి యున్నారు. అందలి ముఖ్యవిషయము లిం దుదాహరింతును.

"పరశురాముడు రాముని కోడిపోయి పశ్చిమసముద్రతీరమునకు వెళ్ళి గండ్రగొడ్డలి యా సముద్రమున విసరివేయఁగా నేఁటి కేరళదేశ మందుండి పైకిఁదేలినది. అహిక్షేత్రమునుండి కొందఱు బ్రాహ్మణులు పరశురామునితో వచ్చిరి. ఆ బ్రాహ్మణులు పరశురామునితోఁ బోట్లాడి తిరిగి తమదేశమునకుఁ బోయిరి. అందుచే మళయాళమున బ్రాహ్మణులు లేకపోయిరి. పరశురాముఁ డచటి బెస్తలకు జందెములు వేసి బ్రాహ్మణులను జేసి పరశురామస్మృతి వ్రాసి యార్యబ్రాహ్మణు లకు భిన్నాచారముల- అనఁగా మగవారికి ముందుజుట్టు, నాడువారికి రైకలు లేకుండుట మొదలగు నాచారముల నేర్పఱచి యచటనే తపస్సు చేసికొను చుండెను. కొన్నాళ్ళకీ బెస్తబ్రాహ్మణు లాయన కప రాధము చేయ మరల బెస్త లగునట్లు శపించెను. నాఁటినుండి యచట బ్రాహ్మణులు లేరు. తరువాతఁ గొంతకాలమునకుఁ గదంబవంశజుఁడగు మయూరవర్మ గోదావరీ మండలమందలి యహిక్షేత్రమునుండి యార్య బ్రాహ్మణులను గేరళమునకుఁ దీసికొని పోయెను. వీరే యిప్పటి మళ యాళబ్రాహ్మణులు. వీరిలో నుండియే శంకరాచార్యస్వాములవారు

పుట్టిరి. అహిక్షేత్రము నుండి వెళ్ళిన బ్రాహ్మణులు భట్టాచార్యునకు శిష్యులైరి. కదంబవంశము చారిత్రిక రాజవంశము" అనునొకకథవలన మళయాళమున బ్రాహ్మణులు లేనట్లును గోదావరీ మండలమునుండి బ్రాహ్మణులు తీసికొని పోఁబడిరనియుఁ కేరళము సముద్రమునుండి యుద్ధృత మగుటయు స్పష్టము. ఇఁక మయూరవర్మ చారిత్రికపురుషుఁడు. అహిక్షేత్ర మాంధ్రదేశమందలి పిఠాపురమునకు సమీపమున నున్న సర్పవరము. సర్పపురమాహాత్మ్యము బ్రహ్మకైవర్త పురాణమునఁ గలదు. కూచిమంచి తిమ్మకవి దీని నాంధ్రీకరించెను.

'అహిక్షేత్రము తూర్పుతీరమందలి యొక రాజ్యము' అని ఆప్టే గారి సంస్కృతాంధ్ర నిఘంటువునఁ గలదు. భట్టాచార్యులవారే భట్టపాదులు, భాట్టుఁడు, కుమారిలభట్టు అనుపేరులు గలవారు. మయూరవర్మచేఁ దేఁబడిన బ్రాహ్మణులు భట్టాచార్యులశిష్యు లగుటం జేసి యాంధ్రులే; కుమారిలుఁ డాంధ్రుఁడే యని యాంధ్రుల చరిత్రము మున్నగు గ్రంథములందుఁ గలదు. భట్టపాదులశిష్యు లాంధ్రులు నాంధ్రేతరులును గూడ నుండవచ్చును. భట్టపాదుల కాలముననే శంకరు లద్వైతము స్థాపించిరి...... భట్టపాదులకాలముననే మయూరవర్మ బ్రాహ్మణులను దీసికొనిపోయెను. అట్లుకానిచో భట్టాచార్యుని మరణసమయమున దర్శించిన శంకరులు భట్టాచార్యులవారి శిష్యులలో నుండి యుద్భవిల్లుట సంభవింపదు. భట్టపాదశంకరు లేకకాలమున నున్నట్లు చెప్పుచున్నారు.

పైని వ్రాసిన యంశములను బట్టి మళయాళమందలి బ్రాహ్మణులును వారిలోనుండి యవతరించిన శంకరులును 'ఆంధ్రులు' అనుట స్పష్టము. ఇందువిషయమై యితర పండితుల వ్రాఁతల నిచ్చుచున్నాను.

'దక్షిణయిండియా వర్ణములు— తెగలు' అను గ్రంథము 7 సంపుటములుగా మద్రాసు ప్రభుత్వమువారిచేఁ బ్రచురింపఁబడెను.

అందు మళయాళ (కేరళ) దేశబ్రాహ్మణులను గుఱించి యిట్లు వ్రాయఁబడెను.

1. "బ్రాహ్మణులయొక్క లిఖితము లైనకొన్ని గ్రంథములలో కదంబ వంశజుఁ డైన మయూరవర్మ కాలమున నాంధ్ర బ్రాహ్మణులు కొందఱు దక్షిణ కన్నడమునకుఁ దీసికొని పోఁబడి రని చెప్పఁబడి యున్నది.

2. బ్రాహ్మణుల కాలగణన ప్రకారము మయూరవర్మ క్రీ. పూ. 445 మొదలు 455 వఱకు రాజ్యము చేసెను.

3. పరశురాముని శాపానంతరము కదంబవంశములోని మయూరవర్మ అహిక్షేత్రమునుండి తూలుబ్రాహ్మణులను తీసికొని వచ్చు వఱకును నాదేశమునందు బ్రాహ్మణులు లేరు.

4. ప్రస్తుతమం దున్న తూలుబ్రాహ్మణులను మయూరవర్మ తీసుకొని వచ్చె నని చెప్పుటలో సాంప్రదాయిక కథ లన్నియు నేకీభావము వహించుచున్నవి.

5. ఉత్తరకన్నడములోని బనవాసి రాజధానిగా రాజ్యము చేసిన కదంబవంశమునకు మూలపురుషుఁడు మయూరవర్మ యని శాసనములు చెప్పుచున్నవి.

6. గోదావరీతీరమందున్న యహిక్షేత్రమునుండి బ్రాహ్మణులు తీసికొనిరాఁబడి రని చెప్పఁబడుచున్నది.

7. నంబూతిరీలును వీరి సంప్రదాయకథలును మయూరవర్మ వఱకును బోవును.

8. మయూరవర్మచే బ్రాహ్మణులు కొనిరాఁబడినప్పుడు వారు భట్టాచార్యులవారి శిష్యులగా నెంచఁబడిరి. కాని పడమటితీరమునకు వీరు వచ్చినవెంటనే మళయాళదేశపు వేదాంతగురువగు శంకరాచార్యులవారి సిద్ధాంతముల నంగీకరించిరి.

పై గ్రంథముననే యయిదవ సంపుటమున సుబ్రహ్మణ్యఅయ్యరుగా రిట్లు వ్రాయుచున్నారు.

9. కేరళమాహాత్మ్యములో వ్రాయఁబడిన దంతకథాపరంపర నంబూతిరీ లహీక్షేత్రమునుండి వచ్చినట్లుగాఁ జెప్పును. ఈపై పేర్కొనఁబడిన 9 స్థానములలోని యుదాహృతవాక్యములు కేరళమాహాత్మ్యము, కేరళోత్పత్తి యను సంస్కృతగ్రంథములనుండి గ్రహింపఁబడినవి.

మయూరవర్మ, భట్టాచార్యులవారు, శంకరచార్యులవారును ఆంధ్రులని నేనొక్కఁడనే వ్రాయుటలేదు. ఆంధ్రమహాసభ వారిచే ప్రచురింపఁబడిన 'ఆంధ్రప్రచలనము' అను చిన్నగ్రంథమున ప్రథమాంధ్ర సభానంతరము కాఁబోలును ప్రచురింపఁబడెను. మఱికొన్ని దంతకథలును పై విధముననే చెప్పుచున్నవి".

ఈవిమర్శనమునుబట్టి శ్రీశంకరభగవత్పాదు లాంధ్రు లనియు నందు గోదావరీమండలమువా రనియు తేలినది. సంస్కృతశంకరవిజయములం దన్నింటిలోను గేరళదేశీయు లని యున్నది. శంకరులు జన్మించునాఁటికి వారికుటుంబ మచ్చట స్థిరపడియుండవచ్చును. ఆ హేతువున స్థూలముగాఁ గేరళుఁ డని కావ్యకర్తలు వ్రాసియుందురని తోఁచుచున్నది.

శ్రీశంకరులకాలమును గూర్చి ప్రాచ్యపాశ్చాత్యసిద్ధాంతములు బహుముఖములుగా నున్నవి. అందలి సత్యాసత్యములు చరిత్రవేత్తలకు వదలి యుపలబ్ధ మగునొకటి రెండునిర్ణయములనుమాత్రము చూపింప యత్నింతును. జ్యోతిశ్శాస్త్రవేత్తల పారంపరికసిద్ధాంతము— శ్రీ శంకరుల యవతారకాలము 2019 సంవత్సరములనాఁ డని పంచాంగములందుఁ గనఁబడుచున్నది. దీని ననుసరించి క్రీ. పూ. 72 సంవత్సరముల నాఁడు శంకరజనన మని తేలుచున్నది. శ్రీ కర్లపాలెము వెంకట నారాయణగారి నిర్ణయము ప్రకారము శ్రీశంకరుల జననము క్రీ. పూ. 509, బ్రహ్మలోకప్రాప్తి క్రీ. పూ. 477 సంవత్సరములనాఁడును జరిగిన

వని తెలియవచ్చుచున్నది. ఇట్లు బహువిధములఁ దెలుపఁబడుచున్న కాలమును గూర్చినవిమర్శనభారము చరిత్రజ్ఞులకుఁ దొలుతనే సమర్పించియుంటిని. శ్రీశంకరులదేశమును గూర్చి మాత్రము పైని జూపఁబడిన సిద్ధాంతముల ననుసరించి గోదావరీమండలమునుండి మళయాళమునకు భూపాలకులచే నాహూతులైన యాంధ్రబ్రాహ్మణకుటుంబమువారు. కావునఁ దాత్కాలికముగాఁ శ్రీశంకరులు కేరళదేశమువారు కావచ్చునని, అనుకొందము.

శ్రీశంకరుల దేశకాలనిర్ణయప్రసంగము నింక వదలి యాచార్యులవారి యవినశ్వర యశఃకర్పూరసుగంధిల మగు నాంధ్రశంకరవిజయమును గూర్చి కొంచెము ప్రసంగింతును.

“యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం” అనిన కృష్ణపరమాత్మసూక్తి చొప్పున సనాతన మగు వేదధర్మమునకుఁ గంటకమై బౌద్ధ, జైనాది మతకదంబము విజృంభింప దానియౌద్ధత్యము పోఁగొట్టి మరల వేదధర్మము ప్రతిష్ఠింప భగవంతుఁడు శంకరాచార్య రూపమునఁ బొడమెననువిషయమున విప్రతిపన్నులగు మనుజమాత్రులు లేరనవచ్చును. ప్రాచీనులందఱు ‘ధర్మరక్షణార్థము శివుని దేవతలెల్లరు ప్రార్థింప నాపరమేశ్వరుఁడు భూలోకమున శంకరాచార్యుఁడై పుట్టె” ననిరి. అర్వాచీనులు విజ్ఞానము ననుసరించియు, నయ్యనఘుఁడు చేసిన ‘యలౌకికకార్యకలాపము ననుసరించియు భగవదవతార’ మనిరి.

ముప్పదిరెండేండ్ల జీవితములో సకలవేదములు, సర్వశాస్త్రములు, పురాణములు, పఠించి, ప్రయాణసౌకర్యములు లేనియానాఁడు పాదచారియై యాసేతు హిమాచలము పర్యటించి, సర్వమతములను ఖండించి, యద్వైతమతము నెలకొల్పి, నాఁటి రాజేంద్రుల నందఱను శిష్యులుగాఁ జేకొని, స్వమతవ్యాప్తికిని, తదీయ సంరక్షణమునకును

శృంగగిర్యాదిక్షేత్రములందు మఠములను నెలకొల్పిన శ్రీశంకరభగవత్పాదుని బరమేశ్వరావతార మనక మనుష్యసామాన్యుఁ డని యెవ రనఁగలరు? అట్టి మహనీయుని పరమపవిత్ర చరిత్రమే శంకరవిజయ కావ్యమునందలి వస్తువు. సంస్కృతభాషయం దీచరిత్రము పెక్కురు కవులచే బహువిధములుగా రచింపఁబడి శంకరవిజయ మనియు శంకర విజయవిలాసమనియు, శంకరవిజయ డిండిమ మనియు, శంకరమందార సౌరభ మనియు, శంకరాభ్యుదయ మనియు నింక నేవేవియో వివిధ నామములతో విరాజిల్లుచున్నది. ఆమహానుభావునియెడఁ గల భక్త్యతిశయమునఁ బరవశులై యాకవిచంద్రులు నోరార నన్నివిధములఁ గీర్తించిరి. కావుననే శంకరుల యుదంతము లోకమున స్థిరరూపమున వెలసెను. ఆకావ్యముల ననుసరించియే సంస్కృతభాష రాని భారతీయులకందఱకు జగద్గురుచరిత్రము తెలియఁజెప్పు కుతూహలముతోఁ దమతమ కవితానైపుణి మెఱయ దేశభాషాకవులు స్వభాషలలోనికిఁ బరివర్తనము కావించి శ్రీశంకరుల యలోకమహిమము వెల్లడించుచు వచ్చిరి.

అం దాంధ్రభాషయం దింతకు ముందు పెక్కురు కవీశ్వరులు శ్రీశంకరులచరిత్రము గద్యరూపమునను బద్యరూపమునను బరివర్తించియు స్వాతంత్ర్యము మెఱయ రచించియుఁ జరితార్థులైనారు. అట్టి రచన లనేకము లున్నను నేఁ డీశంకరవిజయమును మరలఁ దెలుఁగున నీగ్రంథకర్త రచించుట చర్వితచర్వణ మగు నని మాత్ర మనుకొనఁ దగదు. "తా నద్వైతమతస్థుఁ డగుటయుఁ దన్మతోద్ధారకు లగు జగద్గురుల పుణ్యయశము కీర్తించి తనకవితాశక్తి నన్వర్థము నొనర్చుకొనఁ దలంపు గలుగుటయుఁ గారణములుగా నీగ్రంథ రచనకుఁ బూనుకొంటి"నను గ్రంథకర్త "విజ్ఞాపనము"న మొదటనే దెలిపికొని యుండెను. దానికిఁ దోడు మహోదారులును, శ్రీశంకరమఠ ప్రతిష్ఠాపనాది పుణ్య

కార్య నిరతులును, బరమ శాంతులును, నిరంతర రామభక్తినిశాంతు లును, నిర్గర్వచూడామణులును, భాషాపోషకులును, సంపన్నులు నగు శ్రీ మ“దీదర వేంకటరావు పంతులుగారు” సహాసౌదార్యము మెఱయ నేతత్కవికి గృహనిర్మాణమునకై వలయుధనమును బారితోషికముగా నొసంగి తమయిష్టదైవత మగు శ్రీరామచంద్రున కంకితముగా నీ గ్రంథము నొసంగఁ గోరుట శీఘ్రరచన కుద్బోధక మైనది. కావ్యముగా నిట్టిమహాపురుషచరిత్రము రచియింప నమేయముగా ధనము వెచ్చించియుఁ దమపేర నంకిత మైనను గోరక రామార్పణము సేయఁ బ్రేరించిన శ్రీ పంతులుగారి యనితరసాధారణ సుగుణము వర్ణనాతీతము గదా! అహంకార మమకారములకు మనస్సునఁ దావీయని మహాత్ములీకాలమందును గల రనుటకు శ్రీపంతులుగారు గొప్ప దృష్టాంతము. శ్రీ పంతులుగారి సుగుణగణములు గ్రంథకర్తచే మనోహరముగ వర్ణింపఁ బడినవి. అది యంతయు స్తుతిమాత్రము కాదని ప్రాజ్ఞులు గ్రహింపదగును. ఇట్టిగ్రంథకర్త లెంద ఱెన్నివిధముల వర్ణించినను శ్రీపంతులుగారి గుణగణములు మిగిలిపోవకయుండు వని నానమ్మకము. పరిశుద్ధాంతఃకరణమున నిట్టి మహోత్కృష్ట కావ్యము వెలయించిన శ్రీ పంతులుగారును వారి పుత్రపౌత్రులును నిటువంక నాంధ్రభాషకు, నటువంక వైదిక మతమునకును సువర్ణభూషాయ మానము లగు బహు గ్రంథములు వెలయ నింకను బ్రోత్సాహమిచ్చి శాశ్వత యశస్సును జన్మసాఫల్యమును బడయుదురు గాక!

## ఆంధ్ర శంకరవిజయము

శంకరవిజయ మనుపేర నాంధ్రమునఁ బెక్కుకావ్యములింతకు మున్నే కలవని తెలిపియుంటిని. ప్రకృతకావ్యము మరలఁ దలసూపుటకు నూత్నత యిం దేయించుకైనను గలదా యని పరిశీలింప నచ్చటచ్చటఁ గథాసంవిధానమున నవీనత లేకపోలేదు. ఆ నవీనత యెంత



వఱకు సమంజసమో యించుక పరిశీలింతము. పరమేశ్వరావతారమే యని ప్రాచీనులును, లోకోత్తరపురుషుఁ డని పై దేశికులును దత్సిద్ధాంతానుయాయులగు నాధునికులును స్తుతియింపఁ, బ్రఖ్యాతు లగు శ్రీశంకరాచార్యులయెడ సమాయుక్తులై మతాంతరు లారోపించిన కళంకములు పోఁకనియ ట్లీగ్రంథకర్త పెక్కుతావుల రచన సాగించెను. మాధవ విద్యారణ్యకృత మని విఖ్యాతి గాంచిన శంకరవిజయమునే యాధారముగాఁ జేసికొని యీగ్రంథకర్త రచన సాగించినను నౌచిత్యము దృష్టియం దిడుకొని కథాసంవిధానమున నక్కడక్కడ మార్పులు చేసెను. ఆమార్పులు కొన్ని విద్వజ్జనులకుఁ దెలుపుభారము నామీఁద నున్నది. కాన మున్ముం దయ్యది నెఱవేర్తును.

భూమండలమున నాస్తికమత విజృంభణముచే వేదధర్మము లుప్తప్రాయమై, యధర్మ మభ్యున్నతి చెందఁగా దేవత లెల్లఁ గైలాసమున కేఁగి పరమశివుని ధర్మరక్షణకై వేఁడుకొనఁగా, నక్కార్యమునకై తానే కాలటియందు శంకరాభిఖ్యతోఁ బొడమి జగము నుద్ధరింతు నని యభయ మొసంగిన ఘట్టము నీకవి తీసికొనక, కాలటి యను నగ్రహారము గల దనుకథతో నారంభించి శంకరు లీశ్వరావతార మని వాచ్యముగాఁ బలుకక, తనమహిమములు చెప్పఁబడు ఘట్టంబులందెల్ల సూచించుచుఁ, దుట్టతుదిఘట్టమునఁ బరమశివ స్వరూపముగాఁ బరిణమించిన ట్లద్వైతమతానుసారముగా నిరూపించెను. పఠితల కీసంవిధానమున శంకరుఁడు మొదట మనుజమాత్రుఁడుగా గన్పట్టి, యలౌకమహిమలచే భగవంతుఁడేమో యని సందేహముకలిగించి, క్రమక్రమముగా నీశ్వరుఁ డనువిశ్వాసము నెలకొల్పి తుద కద్భుతముగా మహాదేవుఁడై శరీరము పులకింపఁ బ్రత్యక్షమై నట్లు తోఁపకమానఁడు. ఈ మార్పునఁ గల యౌచిత్యము నుత్యము. శంకరునిది యనూచానులగు పండితులకు జనకమగు విప్రవంశమనియుఁ దలిదండ్రులు తపశ్శాలు లనియు వారి

ఈశ్వరారాధన మహిమవలన శంకరుఁడు జనించె ననియు మొదట సామాన్య మనుజ బాలకునిగా వర్ణించి, క్రమముగాఁ దపము స్వాధ్యాయముఁ బడసి యలౌకికమహిమ లొందె నని మొదటి యాశ్వాసము నందలి కథ. మూలమున శంకరుని జనకుఁ డగు శివగురునకుఁ బరమ శివుఁడు ప్రత్యక్షమై యాయుష్మంతులును గుణహీనులు నగు పెక్కురు పుత్రులు గావలయునా? అల్పాయుష్కుఁడును సుగుణరాశియు నగు నొక్కపుత్రుఁడుగావలయునా? యని యడిగినట్లును, స్వల్పాయువైనను, గుణవంతుఁ డగునొక్కపుత్రుఁడే కావలయు నని యాయన కోరినట్లును గలదు. ఆకథను శివగురునకు స్వప్నమున—నిరంతరధ్యాన మొనర్చు శివుఁడే కానవచ్చి మామిడిపం డిచ్చినట్లును దానిని జేతఁ బుచ్చుకొని పై కెత్తుచుండఁ గ్రిందఁబడి రసము నలువంకలఁ బ్రవహింప భిన్నమైనట్లును మార్పఁబడినది. ఈమార్పు మనుజ జీవితమునందు సామాన్యము గావున రమణీయముగా నున్నది. పై మూలమునందలికథవంటివి యనేకములు పురాణేతిహాసములందుఁ గలవు. అయ్యవి యనుకరించి నట్లాకథ చదువునపుడు స్ఫురింపకమానదు. మూలస్థ మగుకథ యథార్థమే కావచ్చును. అయినను మనుష్యసామాన్యముగా స్వప్నమునఁ దద్విషయ మంతయు ధ్వనింపఁజేయుట సరస మని రసజ్ఞులు మెచ్చక పోవరు. తండ్రి మరణించినపుడు శంకరుఁడు తల్లిని జేరి శిశువయ్యును బ్రౌఢునివలె వైరాగ్య ముపదేశించుట యారయ, సహజవైరాగ్య సంపన్నుఁ డగు ప్రహ్లాదునిచరిత్రము స్మృత మగును. ఈభాగము మూలమున లేని దయ్యు భావికథకుసూచకమై సముచితముగా నున్నది. వేదాభ్యాస కాలమున దరిద్రబ్రాహ్మణికి లక్ష్మి నొసంగుకథ కొన్ని శంకర విజయములందుఁ గానరాదు. మాధవ శంకరవిజయమునఁ గలదు. అందలి కథాంశము మాత్రమే యీగ్రంథకర్త గైకొని యయ్యది వేదాధ్యయనకాలము కావున శ్రీసూక్తస్తవ మహిమవలన

లక్ష్మీ ప్రసన్నురా లగునట్లు రచించుట యెంతయు నౌచిత్యోద్భావకము, శాస్త్రసమ్మతమునై విలసిల్లుచున్నది. వేదమంత్రమే దేవతాస్వరూప మను పూర్వమీమాంసామతము వ్యజ్యమానమగుచున్నది గదా !

రెండవయాశ్వాసమునఁ బూర్ణానదిని జననికొఱకై శంకరుఁడు తనమహిమచే గృహసమీపమునకుఁ దెచ్చె నను కథ. ముందు తన్ను గురుపదంబుగాఁ బూజించు కేరళదేశరాజునకు శ్రోత్రియుఁడగు తన యెడలఁ గల గౌరవమును బురస్కరించుకొని యానదీశాఖ యొకటి తన గృహముచెంత కారాజు రప్పించె నని మార్పఁబడెను. ఈగాథ యం దానాఁటి ప్రభువు లెట్టి యసాధ్యమగు వాంచితార్థముల నైన నొసంగి పండితలోకమును రక్షించుచుండువా రనియు, బండితులు గూడ నిస్పృహులై యుండువా రనియుఁ బ్రస్ఫుట మగుచున్నది. ఇంతదాఁక బ్రహ్మచర్యవ్రతస్వరూపమును, వేదమహిమయుఁ బ్రత్యక్షరమునను వ్యక్తమగుచుండును.

శంకరుఁ డల్పాయుష్కుఁ డని యగస్త్యాది దేవర్షులు వచ్చి యార్యాంబతోఁ జెప్పినట్లును, నామె దుఃఖించుచుండ శంకరుఁడు వైరాగ్య ముపదేశించినట్లును మూలమున నున్నకథ నీగ్రంథకర్త మిగుల రసవంతముగను, నౌచితీభరితముగను శంకర విరక్తికిని, సంన్యాసజిఘృక్షకు నుపోద్ఘాతముగను, సామాన్యమనుజజీవితమునందలి సంఘటనలకుఁ బోలికగను రచించెను.

వృద్ధ యగునార్యాంబ శంకరుని బెండ్లాడు మనఁగా, నాయన మృదు ఫణితి నిరాకరించును. ఏమియు ననలేక తల్లి యూర కుండును. కన్యల నిచ్చెదమని పెక్కురు సజాతీయులు వచ్చిపోవుచుండిరి. ఒకనాఁ డొకవిప్రుఁడు శంకరునకుఁ దనపుత్రిక నీయఁదలఁచి బంధువుల వెంట నిడుకొని యార్యాంబ కాసంగతి తెలిపి యామె యనుమతిపై బ్రహ్మ

ఛాత్రులకు విద్యలఁ గఱపుచున్న శంకరుని గాంచవచ్చి, యాతఁ డప్పటికిఁ జెప్పుచున్న ప్రబోధసుధాకరమందలి కాంతాగర్హణము విని, విముఖుఁడై యార్యాంబను గాంచి జరిగినసంగతి చెప్పి, శంకరుని జాతక మామెవలనఁ గొని యరయుచుండఁ దోడివారిలోని యొకదైవజ్ఞుఁడు శంకరునకు నాయు వల్పమని చెప్పెను. తోడనే వారందఱు నిరాశులై వెడలిరి. ఆమాటవిని ఆర్యాంబ విలపించుచుండ శంకరుఁడు వచ్చి దుఃఖకారణ మెఱిఁగి "యమ్మా! మరణము దేహికి సహజ" మని విరాగవచనముల నుద్బోధించి యమృతత్త్వము సంన్యాసమునఁ గాని లభింపదని కైవల్యోపనిషదర్థ మెఱిఁగించి "సంన్యసింప ననుజ్ఞ" నిమ్మని వేఁడుకొన, నామె మఱింత దుఃఖింప, సాంత్వనవాక్యముల నూరార్చెను. ఇందలి యౌచిత్యమును బూర్వోత్తరవిరోధాభావమును మెచ్చఁదగి యున్నది.

ఇఁక సంన్యాస స్వీకారఘట్టమునఁ దల్లి యనుమతి పొందక సంన్యసింపరా దను శాస్త్ర దూరసిద్ధాంతము దొలఁగించుటకును ప్రవాహరూప మగుకథ మఱుఁగు పడకుండునట్లును నార్యాంబకు స్వప్నము కల్పింపఁబడెను. అందు శంకరుఁడు మకరాకృష్టుఁడై యేటిలో మునిఁగి పోవుచు నట్టకేలకుఁ దల్లియనుమతి పొందినట్లు చిత్రింపఁబడిన భాగము 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజే' త్తనుశ్రుతి కవిరుద్ధముగాను, లోకమర్యాదానుసారముగాను జక్కఁగ ఘటింపఁబడినది. సంన్యాసఘట్టమున మూలము ననుసరించుచు, నందులేని మహావాక్యచతుష్టయము పంచదశి ననుసరించి పద్యములందు వివరింపఁబడినది. ఆమహావాక్యములు సూత్రభాష్యరచనకు నెట్లు బీజము లయ్యెనో వివరింపఁ బడినవి.

మూఁడవ యాశ్వాసమున నర్మదానది పొంగినపుడు శంకరుఁడు తన కమండలువున నింపె ననుకథ యణిమాదులలోని వశిత్వవిభూతి సిద్ధికి స్ఫోరకముగా నిందుఁ గలదు. ఈయుపపత్తి మూలమున లేనిది.

శివుఁడు మూలనిరూపమునఁ గనఁబడినకథయం దద్వైతభావ పరీక్షకై శివుఁ డట్లు శంకరుని యాంతరదృష్టి యందే కన్పట్టె ననుట యెంతయు నుచితముగా నున్నది. సనందనుఁడు పద్మపాదుఁడైనకథ యందు లఘిమసిద్ధి బలమునఁ బద్మపంక్తిపై నడచి వచ్చెనని మూలమున లేకున్నను లఘిమసిద్ధి హేతువుగాఁ జెప్పుట యుక్తముగా నున్నది. దీనివలన యోగశాస్త్రసత్యత్వము ధ్రువపడుచున్నది. 'మన కనుభవము లేని' దని యిట్టివానిని ద్రోసిపుచ్చినచో యోగశాస్త్రమునకు వైయర్థ్యము తప్పదు. ఉపరి శాస్త్రమును ధిక్కరించిన యపరాధము పైఁబడక మానదు.

తరువాత వ్యాసశంకర వాదఘట్టము. 'వ్యాసుఁడు కలిద్వాపర సంధి యందలివాఁడు. శంకరుఁడు కలియుగము కొంతగడచినతరువాతి కాలమువాఁడు. ఈ యిద్దఱకు వాద మె? ట్లని కొందఱు శంకించుచున్నారు. వారిమతమునఁ బురాణములు ప్రమాణములే యగుచో శంక కవకాశములేదు. ఆంగ్లభాషాకోవిదులు వ్యాసుఁడను నామము బిరుదమనినారు; కావచ్చును. కృష్ణద్వైపాయనుఁడనునది బిరుదముకాదు గదా! అతఁడు చిరంజీవులలో నొక్కఁ డని మఱువరానిది. చిరంజీవియే యగుచో నేల కానరాఁ డని గ్రంథకర్త పద్మపాదునిముఖమున శంకించి, జ్ఞానతారతమ్యమువలనఁ గనఁబడుటయుఁ గనఁబడకుండుటయుఁ గలుగునని, దృష్టాంతపూర్వకముగా స్థిరపఱుచుట రమ్యమును యుక్తిసహామునై యొప్పుచున్నది. వ్యాసశంకర సంవాదమున మూలమును వ్యాఖ్యయు జోడించి శాస్త్రానుసారముగ వాదమంతయు గద్యమున రచించుటచే భావమంతయుఁ దేటతెల్ల మగుచున్నది.

చతుర్థాశ్వాసమందలి కుమారిలభట్టు చరిత్రమున మూలమునకు భిన్నముగఁ బెక్కుమార్పులు చేయఁబడినవి. చరిత్రల నాధారముగాఁ గొని కాఁబోలు. మూలమున లేకున్నను భట్టపాదుఁ డుత్కలాంధ్ర దేశ

ముల సంధియందలి జయమంగళ మను గ్రామమున జన్మించె ననియు, నాంధ్రుఁ డనియు, గ్రంథకర్త తనయాంధ్రాభిమానము ప్రకటించెను. అందుఁ గుమారిలునకీర్తి కేపాటి కళంకము సోఁకకుండ మూలమందలి పరస్పరవిరోధములను బరిహరించి వన్నెపెట్టెను. గురుఁడు మేడనుండి సిద్రితుఁ డగు తన్నుఁ ద్రోయింప భూమిపైఁ బడునప్పుడు "వేదము ప్రమాణమే యగు నెడల నేను జావకుందును గాక" యని భూమిపైఁ బడి వేదమహిమచే బ్రతికియు "ప్రమాణ మగు నెడల" యను సంభావనార్థక ప్రయోగమువలన నొకకన్ను పోఁగొట్టుకొన్న కుమారిలుఁడు రాజుకోరికపై గొండనుండి భూమి కుఱుకుచు "వేదమే ప్రమాణ మగునెడల" యని మరల సంభావనార్థక ప్రయోగము గావించియు నేహానిని బొందలే దనుట విరుద్ధము కాదా? ఆ భాగమున 'వేదము ప్రమాణము. కావున నా కేహానియుఁ గలుగ' దనుదృఢనిశ్చయముతోఁ గొండనుండి క్రిందఁబడి యక్షతదేహుఁడై వేదమహిమను బ్రకటించె ననుమార్పు సమంజసముగా నున్నది. మఱియు "జైన మత రహస్యములను జెప్పిన గురువు మరణమునకుఁ దానే కారకుఁడ"నని గురువధ పాపము తొలఁగఁ దుషాగ్నిప్రవేశరూప ప్రాయశ్చిత్తము చేసికొన్నట్లు మూలమునఁ గల కథయందు— గురువధ కాతఁడు కర్త కాఁ డనియు నాతఁ డొనర్చు తుషాగ్ని ప్రవేశము వ్రతము కాని ప్రాయశ్చిత్తము కాదనియు, స్మృతిసమ్మతముగ నిర్ధరించిన మార్పు మిగుల నుచితముగా నున్నది.

అనంతరకథ మండనమిశ్రునిది. ఈ ఘట్టమున మండనశంకరుల 'కుతో ముండ్యాగళా న్ముండీ' యని యారంభింపఁబడిన ప్రశ్నోత్తర పరంపర యా యిరువురకు ననుచితముగా నుండు నని కాఁబోలును మండనశంకరుల శిష్యు లనుకొన్నట్లు మార్పఁబడినది. మండనునంతటి మహాపండితుఁడు శంకరునంతటి మహనీయుఁడు తనయింటికి రాఁగా

నిష్ట మున్నను లే కున్నను నట్లు నీచాతి నీచముగా 'నీతల్లిముండ' మున్నగు రీతిని దూషించె ననుట యీరెండు పాత్రములకుఁ గళంక మే కదా! ఇఁక మండనుఁడు సంన్యాసి మొగమును జూడఁడఁట. శ్రాద్ధ భోక్తలుగ వ్యాసజైమినులను నర్చించు చున్నాఁడఁట. వీరు సంన్యా సులు కారా? జైమిని తనకు సమ్మతుఁ డైనను శంకరునివలెనే వేదాంతి యగు వ్యాసుఁడు ప్రతికూలుఁడు గదా! అట్టివాని నెట్లు మండనుఁడు నిమంత్రణము చేయును? వ్యాసజైమినులు మండనశంక రుల వివాదమును వినుచు నూరక యుండినారా? సూత్రభాష్య పరీ క్షకై శంకరునొద్దకు వృద్ధబ్రాహ్మణ రూపమున వచ్చిన వ్యాసుఁడు 'స్వస్వరూపమునఁ గాన్పింపు' మని శంకరునంతవాఁడు వేఁడుకొనఁగా నిజరూపమునఁ దోఁచిన వ్యాసుఁడు, నేఁడు మండనునింటికి శ్రాద్ధ భోక్తగా వచ్చినాఁ డనుట యసంగతము మీఁద మండనుఁడు వాద మునం దోడిపోయి తన పూర్వమీమాంసా మతమునకుఁ దీక్షకరుఁడైన జైమిని యాశయమును గూర్చి సందేహించుచుండ జ్యోతీరూపమున గోచరించి 'శంకరమత మే నామత' మని యంగీకరించిన జైమిని శ్రాద్ధ కాలమున పెదవి యెత్తక వారిద్దఱికలహము వినుచు నూరకుండె ననుట మిగుల నసంగతముగా నున్నది. ఇచట 'కుతో ముం' డీత్యాది మండనశంకర నిందాపరంపర నీ గ్రంథకర్త పరిహరించినఁ లెస్సగా నుండెడిది. కాని సంస్కృత శంకరవిజయము 'లన్నిటియందు నుండు టయుఁ బండితలోకమున బహుప్రచలితమై యుండుటయు హేతువులు గావచ్చును. కాని మహాపురుషులగు మండనశంకరులనోట నీయశ్లీల ములు పలికింపక వారలశిష్యులచేఁ బలికించుట కొంత నయ మన వచ్చును. ఇచటిమూలగ్రంథములవిరోధము పరిశీలింప నీకథ హేయమో యుపాదేయమో తెలియఁగలము. మాధవశంకరవిజయమున జైమిని వ్యాసులు భోక్తలని యున్నది. చిద్విలాసుని శంకరవిజయవిలాసమునఁ

పితృస్థానమున వ్యాసుని నిలిపి యర్చించుచుండఁ బాదరాసిద్ధివిద్యా శక్తిచే నంతరిక్షమునుండి దిగి శంకరుఁడు తనంతఁ దానె విశ్వేదేవ స్థానమునందు నిలిచెనని కలదు. ఆనందగిరికృత శంకరవిజయమున వ్యాసుని మంత్రిబలమున రావించి పితృస్థానమున నెలకొల్పి రెండవ భోక్త లభింపక, విశ్వేదేవస్థానమున సాలగ్రామము నుంచి యర్పించు చుండఁగా, నాకాశవీథినుండి శంకరుఁడు దిగె నని కలదు. మూఁడింటి యందును మండనశంకరుల యశ్లీలసంభాషణము స్థూలముగనో సూక్ష్మ ముగనో యున్నది గాని లేకపోలేదు. ఏతదనురోధముచేఁ గాఁబోలు నీగ్రంథకర్తయు నాశ్లేషసమన్వితనిందాభాగము విడువఁ జాలక పోయెను. కాని వ్యాస జైమినులను బరిహరించుట మాత్రము నుత్యము.

పంచమాశ్వాసమున మండనపరాజయానంతర ముభయభారతి తోడి శాస్త్రవాదఘట్టమునందు, శంకరుఁడు కామశాస్త్రమునఁ బ్రజ్ఞ లేక యుభయభారతివలన గడువొంది యమరుకనృపాలుని మృతకళే బరమందుఁ బరకాయప్రవేశవిద్యాశక్తిచేఁ జొచ్చి శతాధికసంఖ్యాక లగు నాతని భార్యలతో నిష్టభోగములఁ బొంది కామశాస్త్ర మనుభవ పూర్వకముగ నేర్చి వచ్చి యామెను జయించె నని యుపలబ్ధములగు నన్నిసంస్కృత విజయములందుఁ గనఁబడుచున్నది. ఈ కథ శంకరు నకుఁ బరకాయప్రవేశవిద్య 'తెలియు' నని తదీయ యోగశక్తి బ్రకటింపఁ బుట్టియుండును. పరిశీలింపఁగాఁ బూర్వోత్తరమీమాంసా శాస్త్రములందు వాదింపఁ బూనిన మండన శంకరుల వాదమునం దుభయభారతి ప్రవేశించి కామకళలోఁ బూర్వపక్ష మొనర్చుట యనుచితము, నసంగతమును గాదా? శంకరుఁ డంత దోడిపోయిన మాత్రమునఁ గించిద్జ్ఞత కలుగు ననుట మఱియు నసంగతము. మండన శంకరుల ప్రతిజ్ఞ లేమి? ఉభయభారతి పూర్వపక్ష మేమి? ఒకవేళ శంకరుఁ డాకామకళ మన్నెఱుఁగకున్నను సర్వజ్ఞుఁడు కావున నాశాస్త్ర

కుండలి రహస్యములను బఠించి గ్రహింపఁ జాలఁడా? అనుభవము లేసిదే యాశాస్త్రము తెలియదా? ఈ రసాభాసము నంతయుఁ దొలఁ గించుటకై యీ గ్రంథమునఁ జేయఁబడిన మార్పెంతయు నౌచిత్యా ధాయకము. మీమాంస విడిచి కామకళయందు భారతి ప్రశ్నింప నవ కాశము కల్గించుకొనుటకై యంతఃకరణ చతుష్టయ విమర్శనమున మనస్తత్వ ప్రసంగముదెచ్చి, దానినుండి కామమును గూర్చినచర్చ, యందుండి స్త్రీపురుష జాతివిశేష ప్రసంగమును నేర్పుగాఁజేసినట్లు చూపి, యీ శాఖాచంక్రమము దోషమని శంకరునిచేఁ బలికించెను.

కాని సభానియమానుసారముగాఁ బ్రతివాదిని గాక యధ్యక్షు రా లగు భారతిని గాదనుటకు వీలులేక పోయెనని శంకరుఁడు గడువు వేఁడి మండనుని గ్రంథాలయమునుండి కామకళా గ్రంథములు గొని దూరమున నున్న కొండగుహఁ జొచ్చి యా శాస్త్రమంతయు నధ్యయ నించి పరకాయప్రవేశ విద్యచే నొకచిలుక మృతదేహమునఁ జొచ్చి శబరున కొకనికి దొరకిపోయి యుభయభారతి సన్నిధిని జేరుకొనెనని మార్పఁబడినది.

పూర్వమీమాంసామతము ననుసరించి వాదింతు ననియుఁ, బ్రమాణము వేదము లనియు, నోడినచో సంన్యాస స్వీకారము పణ మనియు, మండనుని ప్రతిజ్ఞ. "ఉత్తర మీమాంసామతము ననుసరించి వాదింతు ననియు, నుపనిషత్తులు ప్రమాణమనియు, నోడినచో సంన్యా సము విడిచిపెట్టుట పణ మనియు శంకరుని ప్రతిజ్ఞ. ఆ ప్రకారము వాదము జరుగఁగ మండనుఁ డోడిపోయెను. మండనుని పక్షము చేకొని భారతి వాదింపఁ బూనెను. ఆమెభర్త ప్రతిజ్ఞాప్రకారము పూర్వ మీమాంసానుసారము వాదింపవలసియుండెను. ప్రసక్తాను ప్రసక్త ముగాఁ గామశాస్త్రమునకుఁ ద్రోవఁ దీయుటచే సభానియమాను సారము భారతి పరాజిత యైనట్లేకదా! అయినను సభాధ్యక్షురాలగుటచే

బాధియగు శంకరుఁ డామెను ధిక్కరింప నవకాశము లేమిఁ 'గా' దనక యాశాస్త్ర మభ్యసింప గడువు కోరెను. తన తప్పెఱిఁగినది కావున భారతియు నంగీకరించెను. అటుపైని కామకళ నేర్చి చిలుక దేహమునఁ బరకాయ ప్రవేశవిద్యచేఁ జొచ్చుట యేల కల్పింపబడె ననఁగాః- పరకాయప్రవేశ మొనర్చునది కేవల శుద్ధాత్మ మే యగునేని కర్తృత్వ భోక్తృత్వము లు లేక కర్మబంధముఁ కలుగకుండును. లింగదేహముతోఁ జొచ్చినపు డచటికర్మముల కెట్లు జీవుఁడు బద్ధుఁడు కాకుండును? శ్రీ శంకరుఁడు పరకాయ ప్రవేశమున లింగశరీరముతోఁ జొచ్చిన ట్లానందగిరి శంకరవిజయమున "అమృతపుర మితి ప్రసిద్ధం కంచి త్పట్టణ విశేషం ప్రాప్య తత్పతౌ మృతే, తదీయదేహం చితిగతం జ్ఞాత్వా, తత్పురాంతిక కోటరే నిజదేహం సంస్థాప్య, పరకాయ విద్యాప్రపంచేన లింగశరీరమాత్రేణ చ సాభిమానో జీవ శ్చితిగత నృపతి కళేబర నిష్ఠ బ్రహ్మరంధ్రం ప్రావిశత్ (58అధ్యాయము.) అని కలదు. చిద్విలాస కృత విజయవిలాసమున కేవల మాత్మరూపమునఁ జొచ్చెనో లింగ శరీరముతోఁ జొచ్చెనో మొదట జెప్పఁబడలేదు గాని మరల స్వశరీరమునఁ జొచ్చునపుడు మాత్రము. శ్లో॥ కలవింకాకృతి ర్భూత్వా తేజః పుంజ దురీక్షణః। బ్రహ్మరంధ్రపథా దేహ న్నిస్సార తదాద్భుతం. ఇతస్తతః పరిచరన్ తనుం వృష్ట్వా చితోపరి"యని లింగదేహముతో అమరకుని దేహమువిడిచి స్వశరీరమునఁ జొచ్చినట్లు కలదు. మాధవ శంకర విజయమున 'మహీపస్య వర్ష్మ గురు యోగబలో౽విశ దాతివాహిక శరీరయుతః, (ఆతివాహికేన జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రాణమనోబుద్ధి రూపేణ లింగశరీరేణ యుతః, వ్యాఖ్య) అని లింగశరీరముతోఁ జొచ్చినట్లే కలదు. లింగశరీరయుతుఁ డగుజీవుఁడు కర్మబద్ధుఁడు కావలసి వచ్చును. కేవల శుద్ధాత్మ మే యగునెడల నచటి కామకళారహస్యములను గ్రహించుటకు బుద్ధి యుండకపోవుటచే వ్యర్థప్రయాస మగును.

లింగదేహముతో నేఁగి కామశాస్త్రము నేర్చివచ్చినపిదపఁ బర కాంతతో యత్యాశ్రమి యగు నాచార్యుఁడు సభయందుఁ గూర్చుండి యాశాస్త్రమున వాదించుట యెట్లు? ఇంతకంటె దుష్కృత్యము వే ఱుండునా? దానిచే నపకీర్తి కాకుండునా? ఈవిధమగు సర్వవిధ విరోధ ములు తొలఁగునట్లుగా మండనమిశ్రునింట సకలవిద్యలు నేర్చినశుకము లుండుట ప్రసిద్ధము కాన దాని కనువుగాఁ గీరదేహమునఁజొచ్చి శంకరుఁ డుభయభారతి సన్నిధిచేరి, ప్రసంగవశమున నామె చెప్పిన తమ వాదము విని కామకళయందు వాదించి, ఇచట మధ్యవర్తి లేఁ డని సపరి వారముగా మండనుని నాయమను దనశరీరమున్న గుహాయొద్దకుఁ దెచ్చి నృసింహస్తవ మొనర్చుచు శుకదేహము విడిచి స్వదేహమునఁ జొచ్చెను- అని యీగ్రంథమునఁ జేసినమార్పెంతయు సముచితము గాను ధర్మ్యముగాను నొప్పారుచున్నది.

అంతియే కాదు. ఉభయభారతి పాతివ్రత్యకథ వలనఁ బాతి వ్రత్యమహిమ ముద్ఘాటింపబడినది. ఇచటి కథాసంవిధానము మెచ్చఁ దగి యున్నది. స్త్రీలకుఁ బాతివ్రత్యము తప మనియు 'తపసా దుష్క రం నాస్తి' యను సూక్తి చొప్పున భీష్మునకుఁబోలె స్వచ్ఛందమరణము కలిగె ననియు, నామె శరీరము విడిచి తేజోరూపమున శ్రౌతాగ్ను లందు లీన యగునప్పుడు వాణీరూపముతో శంకరునకుమాత్రమే గోచ రించె ననియు నాఁటినుండి యాయనఘుఁ డాశారదకు దాసుఁడై నట్లును ఘటించిన భాగము గాంచి రసజ్ఞులును, ధర్మజ్ఞులును శిరఃకంప మొనర్పకపోవరు. ఈ సందర్భమున శంకరుని గొప్పతనమే కాక మండ నుని పాండిత్యమును, వైభవమును, గర్మశ్రద్ధయు దానిని మించి యుభయభారతియొక్క పాండిత్యము వాదనైపుణియుఁ బాతివ్రత్య మును బ్రస్ఫుటము లగుచున్నవి.

షష్ఠాశ్వాసమందలి కాపాలిక కథలో శంకరుని శిరము తెగఁ గొట్టుకొనిపోవ శూలహస్తుఁడై వచ్చిన కాపాలికుని నృసింహరూప ముతోఁ బద్మపాదుఁడు పైఁబడి గోళ్ళతోఁ జీల్చి చంపె నను ఘట్టమున నృసింహరూపుఁ డగుపద్మపాదుని జూచి కాపాలికుఁడు దేహస్మృతి లేక పడిపోయె ననియు, శంకరుఁడు కనువిచ్చి యెదుట నున్న యుగ్ర నృసింహుని స్తుతించి శాంతుఁ గావించి, తెలుకొని భయమున వడఁకి పోవుచు 'రక్షింపు' మని పాదములపైఁ బడిన కాపాలికుని కభయ మిచ్చి 'యద్వైతవిద్యోపదేశమున శిష్యునిగాఁ జేకొనె' నని మూలము నకు భిన్నముగాఁ గలదు. పద్మపాదుని సంతతగురుభక్తి, మంత్రశక్తి వెల్లడి యగుటయే గాక శంకరుని పరహింసా రూప సాహసకృత్యమునఁ గలుగు కళంకమును తొలఁగి పోయినది. ఆచార్యుని దేహాభిమానశూన్య తయుఁ బరోపకారదీక్షయుఁ బతితపావనత్వమును దయాళుత్వమును విశదమైనవి. మూలమునకు దూరముగాని యీమార్పంతయు హృద్య ముగా నున్నది.

సప్తమాశ్వాసమున శంకరుఁడు తల్లికి నుత్తరక్రియలఁ జేయు సందర్భమునందు మార్పు గావింపఁబడెను. స్వగృహమందుఁ దల్లి మర ణింపఁగా వెనుకటి వాగ్దానము ప్రకారము శంకరుఁడు సన్న్యాస ధర్మ ములను బాటింపక యామె కుత్తరక్రియలు చేయఁబూన, నిజ దేశ వాసులు దాని కంగీకరింపక, యటనుండి వెడలిపోయి, యగ్నియైన నీయక బాధింపఁగాఁ దల్లిశరీరము నింటిపెరటి గుమ్మమువద్ద దహన మొనర్చి యందలి విప్రుల శపించెనని మూలము. సన్న్యాసి గృహస్థోచిత స్మార్తకర్మము లొనర్చుట యశాస్త్రీయమై యుండ, సంప్రదాయ విరుద్ధముగ ధర్మవ్యవస్థాపకుఁడగు శంకరుఁడు తల్లి కుత్తరక్రియలు తానే చేయఁ బూనెననుట హాస్యాస్పదము గాకపోదనియు, "గృహోప కంఠేషు చ వః స్మశాన మద్యప్రభృత్యస్త్వితి తాంశ్చశాప। తదా

ప్రభృ త్యేవ గృహోపకంఠే ప్యాసీత్ స్మశానం కిల హంత తేషాం" (ఇప్పటికిని కేరళవాసులకు గృహోపకంఠమే స్మశానము) అను మాధవ గ్రంథవచన ముండుటంబట్టియు రెండింటికి నవిరోధముగా నుండునట్లు శంకరుఁడు సంన్యాసము స్వీకరించునప్పుడే 'క. కేయైనన్ బగలేనియు, నేయెడఁ గానిమ్ము నీకు మృతి యొదవినచో, నాయెడ నను మదిఁ దలఁపుము, పాయక యరుదెంచి పరమపద మొందింతున్. గీ. కొడుకు యతి యైనచో జనకులకు నంత్య! సంస్క్రియలు లేకయున్న మోక్షంబు కలుగు.(2-189, 190)నని యుత్తరక్రియలు చేయుదు నని కాని చేయ నని కాని తెలియకుండఁ బలికి నట్లును, వాగ్దానము ప్రకారము తల్లి మరణకాలమున వచ్చి యామెకోర్కెపై శివదూతలను బంపివేసి, విష్ణు దూతలను రావించి వారివెంబడి వైకుంఠమున కంపి యుత్తరక్రియలను జేయుఁడని జ్ఞాతులను బిలిచి చెప్పెననియు, నపుడు జ్ఞాతులు పుత్రుఁడవు నీవు చేసికొనవలసినదే. నీవు దూరమున నున్నయెడ మేము చేయక తప్పదు. కాన మా కేమియు సంబంధము లేదని నిరసింపఁ గోపించి, వారిని శపించె ననియు, అనాథప్రేతసంస్కారరూప మగు నాపద్ధర్మముగాఁ బరిగణించి తానే పారలౌకకక్రియలు నిర్వర్తించె ననియు నీగ్రంథకర్త చేసినమార్పు మిగుల సమంజసము సయుక్తికముగను నున్నది. ఈ మార్పునకు నొకకొంత యనుకూలముగా "తదా సస్మార జననీ పుత్రం శంకరదేశికం। ఆసన్నమరణా సాధ్వీ బుధ్వా తత్సత్యభాషితం...... ముమూర్షుం మాతరం వీక్ష్య విప్రాన్ సర్వా నథాహ్వాయత్, అనాగ తేషు తే ష్వేష శశాప యతిదూషకాన్" అని చిద్విలాస కృతశంకర విజయవిలాసగ్రంథము కనఁబడుచున్నది. మరణకాలమునఁ దల్లిస్మరింప వాగ్దానము ప్రకారము శంకరుఁడు వచ్చి మరణింప నున్న తల్లిని జూచి, జ్ఞాతులను బిలువఁగా, వా రెవ్వరును రారైరి. అందుల కలిగి శంకరుఁడు వారిని శపించెను. అనువాక్యములఁ బరిశీలింపఁ బిలిచినను

జ్ఞాతులు రాకుండుటకుఁ గారణ మూర్ధ్వదైహికక్రియలు తమ్మును జేయ నాజ్ఞాపించు నని యూహింప నవకాశము కనఁబడుచున్నది. ఆగ్రంథమున శంకరుఁడు తానే యుత్తరక్రియలు చేయుదు నని కాని గృహోపకంఠము స్మశాన మగుఁగాక యని శపించినట్లు కాని లేదు. జ్ఞాతులు రాలేదు. అనువాక్యముమాత్రము ప్రకృతమందలి మార్పున కాధారము గాకపోదు.

శంకరుఁ డాపద్ధర్మముగా మాతకుఁ బారలౌకిక్రయలు చేసినట్లును, నయ్యది యధర్మమందు రేని "తేషాం తేజోవిశేషేణ ప్రత్యావాయో న విద్యతే। తదన్వీక్ష్య ప్రయుంజానో రౌరవం నరకం వ్రజేత్" యను స్మృతిచొప్పునఁ తేజశ్శాలికిఁ బ్రత్యవాయము కలుగదు. కలిగినను దపశ్శక్తిచే దానిని శమింపఁజేసికొనును. అట్టిమహాత్ము లెవరైన సాహస మొనర్ప, నితరులు గూడఁజేయఁ బూనుచో దుర్బలు లగుటచేఁ బ్రత్యవాయము దాటఁజాలరని "సాహసంచ మహాతాం, అవర దౌర్బల్యా" దిత్యాది గౌతమధర్మసూత్రముల ననుసరించి ధర్మనిర్ణయము సొగసుగఁ జేయఁబడెను. ఇయ్యది సామాన్యవిషయము గాదు. ఇట్టి ప్రసంగమే కుమారిలభట్టచరిత్రమునను గలదు. కావ్యము లీరీతిగాఁ జతుర్వర్గసాధనములుగా నుండవలయునే కాని రస మని పలుకుచు ధర్మాధర్మ వివేకము లేక యిచ్చవచ్చినట్లు రచింపఁబడినవి సత్కావ్యము లగునా?

అష్టమాశ్వాసమున యమమతనిరాస సందర్భమున నాచికేతోపాఖ్యానము మూలమున సూక్ష్మముగా నుండఁగా నాగాథ కాధారమగు కఠోపనిషత్తును బట్టి విపులముగ నీగ్రంథమున సంఘటింపఁబడుట ముదావహము. ఇంచుమించుగా నేఁబది మతములను శంకరుఁడు ఖండించినట్లు మాధవ శంకరవిజయ వ్యాఖ్యాత యెచటనుండి సంగ్రహించెనో కాని "ఇదమత్రావధేయ" మ్మనియు "అత్రేద మవధేయ".

ష్మనియు నుపక్రమించి ౬౫౩ శ్లోకము లొకచోటను, ౬౯1 శ్లోకము లొకచోటను మొత్తము 70½ శ్లోకములు తన వ్యాఖ్యయందు ననుసంధించెను. ఆగ్రంథ మంతయు శ్రమపడి పద్యరూపమున నాంధ్రీకరించి గ్రంథకర్త యాంధ్రజనుల కృతజ్ఞతకుఁ బాత్ర మయ్యెను.

నవమాశ్వాసకథయంతయుఁ గ్రమముగా మూలానుసరణమే. అయినను తుది నుపసంహార ఘట్టమున నొకవిచిత మగుమార్పు గలదు. మాధవశంకరవిజయమున దేవతాప్రార్థితుఁడై శంకరుఁడు కైలాసమున కేఁగి నట్లున్నవృత్తమును దత్తాత్రేయప్రేరణమున స్వస్వరూపజ్ఞానము నొంది శంకరాచార్యుఁడు శివునియవతార మగు దక్షిణామూర్తిగాఁ బరిణమించినట్లు రచించి ముగించుట యీగ్రంథమునకు మకుటాయమానమై విరాజిల్లుచున్నది.

చ. వికృతమహాజ్ఞతాగహనవీథులఁ జిక్కి భవాఖ్యదావపా
వకపరిపచ్యమాను లగువారల కందఱ కాత్మవిద్య తె
ప్ప కలిపి పోవ మౌన మెడసల్పి వటద్రుమమూలమున్ దృజిం
చి కదలె శంభుమూర్తి శమశీలమునం గొని శంకరాకృతిన్, 2_14

శా. మౌనవ్యాఖ్యను బ్రహ్మతత్త్వ మెఱిఁగింపన్ వామదేవాది స
న్మౌనుల్ శంకలు వాసి శిష్యు లయి సంభావింతు రేదేవు, నా
జ్ఞానానందమయుండె శిష్యజనరక్షాదీక్ష మర్త్యాకృతిన్
బూనన్ శిష్యతఁ గాంచి కొల్చెదరు ధన్యుల్ వేవు రత్యాహృతై. 3_82

అను నేతత్కావ్యము ననుసరించి శంకరుఁడు దక్షిణామూర్త్యవతార మగుటం జేసి తుట్టతుదకు దక్షిణామూర్తిగా నిరూపించి మంగళాంతముగాఁ గావ్యమును ముగించిన యీ గ్రంథకర్త నైపుణ్యము మెచ్చఁదగియున్నది. గ్రంథ మాద్యంతము తలస్పర్శముగాఁ జూచి యితివృత్తమందలి మార్పును గూర్చి యథామతిని తెలియఁ జెప్పితిని. రచనామార్మికు లింకను సూక్ష్మాంశముల గ్రహించి యానందింపక పోవరని నమ్మకము గలదు.

## శాస్త్ర విషయములు

శంకరవిజయము కావ్యమని ఛందోబంధము కాంచి యను కొనుటయే కాని యాలోచింప శాస్త్రసముచ్చయ మనుకొనఁదగి యున్నది. పూర్వోత్తర మీమాంసలందును, తర్కశాస్త్రమునను, వివిధమతసిద్ధాంతములందును, వాదప్రతివాదములు లేని తావొకటియు లేదు. మూలగ్రంథమునఁ గల యీ శాస్త్రములే కాక, కామశాస్త్ర, వైద్యశాస్త్రములనుగూడ నీకవి ప్రసంగవశమున నిందుఁ జొప్పించి యించుమించుగా సర్వశాస్త్రసముచ్చయమనిపించెను. అందుఁగామకళా విషయముగా నీగ్రంథమునందుఁ జూపఁబడిన శాస్త్రయుక్తుల గాంచ, నెంతయు నాశ్చర్యము కలిగినది. కామశాస్త్రమున స్త్రీపురుషజాతులు, కళాస్థానములు, వశ్యక్రియలు మున్నగువిషయములు మాత్రమే యుండుననియు, నాశాస్త్రము నధ్యయనింప జారులొక్కరే యధికారు లనియు నింతకు మును పనుకొనువాఁడను. కాని యీ గ్రంథమాదలి యాశాస్త్రమర్యాద లరసినదాది యిదియేమా? యనుకొనుచున్నాను. వాత్స్యాయన సూత్రములపై శాస్త్రీయముగా నడచిన వాదప్రతివాద మందలి యుక్తులును, పాతివ్రత్యధర్మరక్షణోపాయములు నెవని కాశ్చర్యము కలిగింపవు?

మండనుని ధర్మపత్నియుఁ గీరదేహప్రవిష్టుఁడగు శంకరుఁడును నీకామకళయం దెంతగ శాస్త్రవాదము జరిపినను, బఠితలకు జిగీషా తన్మయత గలిగించి, సంస్కృతకవులుకూర్చిన కామకళా వాదమునకుఁ బవిత్రత నాపాదించి గ్రంథకర్త పండితాదరపాత్ర మయ్యెను. ఈకావ్యమున నాఘట్టము చదువుచుండఁ దుచ్ఛశృంగారభావములకు మనసు చొరక శాస్త్రయుక్తి రచనాలీలయందు మనస్సు విలీన మగుచుండును. శాస్త్రజ్ఞులై పఠించుచో నాపూర్వపక్షసిద్ధాంతక్రమము నెఱిఁగి మఱియు మెచ్చుకొన కుండరు. ఆ శాస్త్రరచనా పాటవ మట్టిది.

తరువాత నవమాశ్వాసమున భగందరవ్యాధిపీడితుఁ డగు శంక రాచార్యునకుఁ జికిత్సకై యొసంబను మని పద్మపాదుఁడు చూపిన యుప పత్తు లన్నియు నాయుర్వేదోదితములే. ఆవిషయము మూలమున లేకున్నను గ్రంథకర్త చరకసంహితాద్యాయుర్గ్రంథ సిద్ధాంతముల వెల్ల డింపఁ దలఁచి "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ"మ్మను వేదాంతసిద్ధాంత మూని శంకరుఁడు చికిత్స వల దని వారించినట్లును నట్లు లైనచో నాయుర్వేదమూసరు లైయుండ్రను కలుగు నని కర్మవాద మును బ్రతిఘటించిన చరకాచార్యుని సిద్ధాంతమువలన నాయుర్వేద మునకుఁ బ్రవృత్తి సంభవించినట్లును, జరకసంహితయందలి దైవ వ్యపాశ్రయపరికరణమే యాధారముగాఁ గొని సముచితముగా రచించెను.

ఆసిద్ధాంతము నంతయును గ్రంథకర్త రచించుట యధికమైనట్లు స్థూలముగాఁ గనిపింపవచ్చును. కాని శంకరాచార్య సంతతి దేహాభి మానశూన్యుఁ డగుమహావేదాంతిని జికిత్సకై సమ్మతింపఁ జేయుట సామాన్యవిషయము కాదు. ఆయుసఘుని క్షేమమే తమక్షేమముగా భావించి యాయనకంటె హెచ్చుగా బాధపడుచున్నశిష్యులు ప్రార్థించి నను, స్వకపోలకల్పితము లగుయుక్తుల నెన్ని చెప్పినను సర్వజ్ఞమూర్తి యగు నాయన చికిత్స కంగీకరింపకపోవుట సత్యము. కాని సకలశాస్త్ర ముల మథించిన మేధావి యగుటచే శాస్త్రప్రమాణమునకుఁ దప్పక సుల భముగా బద్ధుఁ డగు నని తెలుపుచున్నట్లు మగుటచే నంత సుదీర్ఘమగు వాదము పద్మపాదునిచేఁ జేయించుట యసంగతము మాత్రము కాదు. వేదశాస్త్రములందుఁ బ్రమాణబుద్ధి గల ప్రాజ్ఞు లెల్లను నిట్టి శాస్త్ర విషయవిమర్శనములందు విసువ రని యనుకొందును. ఇట్టివిశేష విషయ ములను గ్రంథకర్త శక్యమైనంతవఱకు విశదీకరించెను. శాస్త్రములం దలి సంప్రదాయములు గురుముఖమునఁ గాని సుబోధములు కావు.

అయిన నట్టిగ్రంథములఁ జదువఁ బాఠకలోకమునకు జిజ్ఞాస పొడమి యేకొంతయైన నభ్యసింపఁ బ్రవృత్తి గలుగునేమో యని నాయాశ.

వ్యాకరణశాస్త్ర రహస్యములు మూలమునం దున్నవి సాధ్యమైనంతవఱకు నాంధ్రీకరణమున గ్రంథకర్త విడువక చూపుట ముదావహము. వ్యాకరణశాస్త్రము వశము కానిదే యట్టి ప్రయోగవైచిత్రి కనిపెట్టుటగాని, ప్రయోగించుటగాని యశక్య మనుసంగతిమాత్రము విజ్ఞులు మఱువకుందురు గాక!

మూలమునందుఁ గల శాస్త్రవిషయములను గూర్చి యించుక పరిశీలింతము. మండన శంకర వాదఘట్టమునఁ బూర్వోత్తరమీమాంసా శాస్త్రసమ్మతముగాఁ 'దత్త్వమసి' మహావాక్యముపై వాదప్రతివాదములు. ఆవాదమందే తమతమ మతము నిలుపుకొనుటకై న్యాయశాస్త్రము నుపనిషత్తులును, భగవద్గీతయు స్వీకరింపఁబడినవి. తుదకు వ్యాకరణశాస్త్రముగూడ వాదమందుఁ గానవచ్చును.

ఇటువంటి ఘట్టములలో నీలకంఠపండితునితోడి వాదమును, భట్టభాస్కరునితోడి వాదమును బ్రౌఢములు. ఆరెండును కేవల తర్కశాస్త్రసమ్మత మగు సిద్ధాంతముల ననుసరించియే నడచెను. మూలానుసార మీ కావ్యమం దంతయుఁ గలదు. కాని భట్టభాస్కరవాదమునం దుది నున్న హేత్వాభాసములచర్చ మాత్రము విడువఁబడినది. ఇట్టి శాస్త్రవాదస్థలములు గద్యమయముగ రచియించుటయే న్యాయము. మఱియు శారదా పీఠాధిరోహణసమయమున శంకరునకు సర్వమతములవారితోను సర్వశాస్త్రములతోను సూక్ష్మరూపమున వాదప్రతివాదములు గలవు. అస్మన్మతస్వరూపము వివరింపఁబడెను. ఇవి యన్నియు మాధవగ్రంథములోనివే.

ఔచితి ననుసరించి కథాసంవిధానమునందు మార్పులుగావించి నట్లే యిక్కడి యనుచితస్థలములఁ బ్రసంగము వచ్చిన శాస్త్రవిషయ

ములు కొంతయేని స్పృశించి విడిచెను. శంకరుఁడు కామశాస్త్రమభ్య సించు సందర్భమున నలంకార నాట్యాభినయశాస్త్రములతో నాశాస్త్రమునకుఁ గలసంబంధము సూక్ష్మముగాఁ దెలియఁబఱచుచు, నం దలంకార శాస్త్రమును శంకరునివంటి సకలశాస్త్రజ్ఞుఁడు, మహావేదాంత విజ్ఞాని యేదృష్టితోఁ బఠించునో చక్కఁగా నిరూపించెను. శంకరుఁ డాశాస్త్రము లన్నియుఁ జదివి-

మ. అగునే యిట్టు లలంక్రి యాభినయ నాట్యంబుల్ 'రసోవై స'య
న్నిగమాంతోక్తి ప్రమాణమై వెలయ వర్ణించున్-రసోత్పన్నహృ
ద్యగుణానందము నెల్ల తావులను బ్రహ్మానంద సబ్రహ్మచా
రిగ; సత్యంబొకొ? స్తావకంబొ యని తర్కించున్ గ్రహించున్ దుదిన్.

పరమాత్మను బోధించు 'రసోవై స' యను శ్రుతివాక్యమునే ప్రమాణముగాఁ గొని 'రసోత్పన్నానందమే బ్రహ్మానంద సబ్రహ్మచారి' యనిన యాలంకారిక సిద్ధాంతము గాంచి సర్వవేద వేదాంత సారజ్ఞుఁ డగుటచే నాశ్చర్యమునొంద కుండునా? ఆలంకారిక మతమున రసమే పరబ్రహ్మమని సిద్ధాంతము గదా! ఆ విషయము రసగంగాధరమున స్పష్టము.

అట్టి సిద్ధాంతముల నరసి యరసి పరమార్థ మవగతము చేసికొని దుదకు 'గీ॥ అతుల క్షోదక్షమముగ నయ్యతి సుమాస్త్ర, శాస్త్ర పాథోధి మథియించి సారమధిగ, మించెఁ దలయూఁచె మెచ్చె హసించెఁ బెద్ద, నిశ్వసించె జుగుప్సించె నెమ్మనమున' నని పరమార్థము ప్రకటించెను. వేదసమ్మతము లగుశాస్త్రము లను సందర్భశుద్ధిగాఁ బ్రదర్శించుట యీ గ్రంథకర్త వాంఛితముగాఁ గనఁబడును.

శంకరుఁడు పరకాయప్రవేశ మొనర్చినచిలుక మండను నింటి చిలుకలతో వేడుకగా వాదించినటుల కల్పించి, యప్పుడును 'సీ. అష్ట విధంబైన యవధానముల వేదములు తలక్రిందుగాఁ జదువునేర్పు'

అనియు, శంకరుని వేదాధ్యయనకాలమును సి. బ్రౌనుదొరగారాశ్చర్య మొందఁగ వేదవికృతుల నవధానవిధుల నడిపె- యనియుఁ "ఘనక్రమ జటాదిక వికృతులచే నవధాన మొనర్చు సంప్రదాయము వేదవేత్తల కుండెడి" దని సూచించెను. ఆ యష్టావధానము మాత్రమే గాఁ గవిత్వమం దష్టావధానము వచ్చియుండును. ఇట్టి ప్రాచీన సంప్రదాయములు రేఖామాత్రముగ నచ్చటచ్చటఁ జూపించుటది గ్రంథకర్త చేసిన మేలు మఱువఁదగనిది.

## భాషాంతరీకరణము - కవిత్వము

ఈ గ్రంథము భాషాంతరీకరణము కాదు. అట్లని కాకపోదు. అనువాదమైనను ధారాశుద్ధి గలిగి స్వతంత్రరచనవలె సమ్మదావహముఁ గూడ గోచరించుట విస్మయజనకము కాక మానదు. సంస్కృతాంధ్ర వాఙ్మయములందు స్వాతంత్ర్యము గలయీరచయితయొక్క సంస్కృత భాషావిశేషము లెట్టివో తరువాతఁ దెలిపెదను. ముందుగా నాంధ్ర భాషాభిజ్ఞతను గూర్చి యీకవి మున్ను రచించిన మాసత్రయచరిత్రమున కుపోద్ఘాతము వ్రాసిన యాంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలాంధ్ర పండితులు, విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రులుగారి వాక్యము లిట నుదాహరింతును.

"వీరికవితాస్రవంతి యతినిర్మలమై మనోజ్ఞముగ జాలు వాఱుచుండును. గొగ్గిపద్య మొక్కటియుఁ గానరాదు. రచన యంతయుఁ బ్రసాదగుణభరితము. ఆవాసము కోనసీమ. ఆమీఁద వ్యాకరణ పాండిత్యము. అయినను వీరికవిత నారికేళపాకమునకు దూరమైనది. మధురాతిమధుర మగు కోమలపాకము నాశ్రయించినది. ..నా యెఱుక కందినంతలో ననితర సాధారణ మనఁ [illegible] మొక్కటి యీ విద్వత్కవికిఁ గలదు. శాబ్దికముగఁ గాని యార్థికముగఁ గాని యేదే నొక

జిజ్ఞాసాప్రసంగము కలిగినపుడు ప్రస్తుత సందేహ నివారకముగాఁ బ్రాచీనకవితల్లజుల మత మెట్టిదో యను ప్రశ్న ముదయించుట యేతడ వుగా నెన్నిటినో ప్రామాణికప్రయోగములను గుప్పతిప్పలుగా వీరు ప్రదర్శించుచుందురు. ఈశక్తి యద్భుతావహము. ప్రాచీనకృతులను సూక్ష్మమార్గమునఁ బరిశీలించుటయు నందెట్టివిశేష మగపడినను నద్దానిని సరసముగా గ్రహించుటయు, గ్రహించినదానిని విడువకుండ ధారణ సేయుటయు, నట్టిది సమయమునకు స్ఫురించుటయు నొకేబుద్ధి కలవడుట యరుదు. కవితావిషయముల నెట్టి చర్చ యేర్పడినను నద్దానికి సాధకముగనో బాధకముగనో బ్రాచీన మత నిరూపక మగు ప్రయోగపరంపర వీరిబుద్ధికి స్ఫురించి తీఱవలసినదే. ఒక్కొక్క మేధ యొక్కొక్కవిషయమున నిశితమై యుండుట ప్రకృతిలక్షణము."

దీనినిబట్టిఁ యీకవి యాంధ్రభాషారహస్యవేత్త యనియు, సరసకవితారచనానిపుణుఁ డనియు ధ్రువపడుచున్నది. ఈ విషయమున నింతకంటెఁ బ్రమాణ మేమి కావలయును?

ఈయనకు సంస్కృతవాఙ్మయ విశేషములయెడఁ గూడ దెలుగుఁ భాషయందుఁ గలపటిమ కల దని యొక్కమాట చెప్పినఁ జాలును. అయినను ఆవిశేషములు గూడ దిఙ్మాత్ర ముదాహరింతును. కావ్య లక్ష్మికి శబ్దార్థములు శరీర మని యాలంకారిక సమయము. దోషరహితత్వము, గుణసహితత్వము నర్థమునకు వలెనే శబ్దమునకుఁ గూడఁ గలిగిననే కావ్యలక్ష్మి సర్వాంగసుందరి యగును. శబ్దసౌష్ఠవము వ్యాకరణశాస్త్రముచే సిద్ధింపవలసినదే. అట్టి శబ్దసౌష్ఠవము నర్థసౌష్ఠవమును నీకావ్యమునందు సర్వత్ర నిండియున్నది. ఆంధ్రభాషారహస్యములు మాదృశుల కపరిచితములు గావచ్చును గాని సంస్కృతభాషావైచిత్ర్యము చూచి యానందింపఁ గల్గుదుము. కాన నావైచిత్ర్యము గొంత తెలిపెదను.

శ్లో॥ ధన్యంమన్యవివేకశూన్యసుజనంమన్యాధికన్యాసటీ,
వృత్తోన్మత్తనరాధమాధమకథాసంమర్దదుష్కర్దమైః ॥

అను మూల మందలి ఖశ్ ప్రత్యయాంతము లెట్లాంధ్రీకరింపఁబడెనో యని చూడఁగా, నట్టి యర్థము గలశబ్దము లాంధ్రమున లేకుండుటచేతను గ్రంథకర్త యాశబ్దముల సొగ సెఱిఁగినవాఁ డగుటచేతను వానిని విడువఁజాలక యాసొగ సాంధ్రులకుఁ దెలుపు కుతూహలమున— "ధన్యం మన్యులు బుద్ధిశూన్యులు పవిత్రం మన్య లంభోధిరాట్కన్యాసర్తన మత్తులౌనరవరాకశ్రేణి దుష్కీర్తి మాలిన్యంబొందిన" యని యాంధ్రీకరించెను. ఈ యాంధ్రీకరణముచూడఁగనే శ్రీనాథకవిరాజుయొక్క 'గమికర్మీకృతనైకనీవృతుఁడు' జ్ఞప్తికివచ్చినది. అభూతతద్భావమున వచ్చు 'చ్వి ప్రత్యయమువంటి' ప్రత్యయము తెలుఁగునందు లేకపోవుటచేతను, దానిసౌందర్య మాంధ్రులకుఁజూపించు కుతూహలముచేతను, దత్కవి రా జట్లు ప్రయోగించెను. అ వ్యాకరణపరిశ్రమ మెఱుగనివారికి సులభముగా నట్టివి పరిహసింపఁ బాత్రము లైనను దానిసొగసు చెడకుండ శయ్య భేదింపకుండ నాంధ్రమం దదుకుట సామాన్యవిషయము మాత్రముకాదు. కావ్యమున సర్వత్ర యట్లుండు ననుకొనరాదు. కొన్ని స్థలములందు మాత్రము చమత్కారజనకముగా మూలమందలి వ్యాకరణరహస్యములు ఘటింపఁ బడుచు వచ్చెను. అట్లే యిక్కవియు సహృదయమోదావహముగా నచ్చటచ్చట మూలమందలి విచిత్రప్రయోగములను విడువక చూపెనని నాయాశయము. నైషధమువలెనే సర్వశాస్త్రసముచ్చయ మనఁదగు నిట్టి కావ్యము నచ్చ తెలుఁగు పదములతోఁ జెప్పుటయుఁ గష్టమే. చెప్పినను సరసముగా దాని భావము గ్రహించుటయుఁ గష్టమే.

కాని శనకామలక వర్షకథలోని దరిద్రబ్రాహ్మణి పలుకులు సాతోచితముగా నెంత లలితముగానున్నవో యరసినఁ దెలియును.

క. కనుమూపు చినుఁగుపయ్యెద, కొన కుతికంటున ఘటించుకొని యాగ్రహమే
దిని దలుపోరఁగ దీనా, ననమాత్రము కానఁబడఁగ నడఁకువ ననియెన్.

గీ. తొలుత నాతండ్రి? యీపాడు నిలయమునకు
వేల వచ్చితి వీదినం బెటకుఁ జనినఁ
నచట నిటు లగునే మొకో యనుచు వగతుఁ
నెట్టి దుశ్శకునంబున నిలువెడలితొ.

ఉ. కటకట! యిట్టియొండ నడుగాళులు పొక్కఁగ, జెమర్పమోము, మై
పటిమ మడంగ, మాధుకరభైక్షముకై యరుదెంతు బిడ్డ! ని
న్నెటు చను మందు? పొమ్మనక యే మొనరింపఁ గలన్? దరిద్రితా
ర్భటి నడఁపీనుఁగై మను నభాగ్యను నీ మొగ మెట్లు చూచెదన్.

ఉ. గ్రామము వాడవాడల నిరంతరమున్ దిరిపంబు నెత్తి నా
స్వామి ననున్ దనూజులను సాకుచునుండును, దెచ్చుదానిలో
సామి మగండు, సామి నిజసంతతియున్, భుజియింపఁ బెట్టి- యా
యామెతుకుల్ భుజించి కొఱప్రాణముతో మనుచుందు నందనా!

అని యిట్లు జాతీయములతో మధురాతిమధురముగ రచింప నేర్చియు నీకవి శంకరాద్యుదాత్తపాత్రముల వర్ణనలందును సంభాషణములందును గంభీరమగురీతి నాశ్రయించుట పాత్రానుగుణరచనచే రసికజనామోదము గాంచుటకే యని యెంతును. ఇందు నాలుగైదు స్థలములందు సంస్కృతశబ్దవైచిత్రి మెఱయ శంకరవర్ణనము గలదు. మూలమున నున్నదియే సొగసు చెడకుండ నాంధ్రమున మిళితమై యాసంస్కృత పదజాలము రత్నకళికలవలె గావ్యలక్ష్మిశరీరము నలంకరించుచున్నవి. మచ్చున కొకటిరెండు మాత్రము చూపెదను.

"శ్లో". తత్త్వజ్ఞానఫలేగ్రహి, ర్ఘనతరవ్యామోహముష్టింధయో
నిశ్శేషవ్యసనోద్ధరంభరి, రఘప్రాగ్భారకూలంకషః ।
లుంటాకో మదమత్సరాదివితతే స్త్రాపత్రియారుంతుదః
పాదః స్యా దమితంపచః కరుణయా భద్రంకరః శాంకరః ।

అని శంకరపాదవర్ణము మూలమునఁ గలదు. ఇందలి 'ఫలేగ్రహి, ముష్టింధ, యోదరంభరి, కూలంకష, లుంటా, కారుంటా, దామితం పచ, భద్రంకర' శబ్దము లెంతయేని హృద్యములు. అర్థచమత్కృతి లేకపోలేదు. కాని దానిని శబ్దవైచిత్రి కబళించి వేసినది. ఆశబ్దచమత్కృతి కొంతయైన ననువాదమునం జూపలేకున్న నా పద్యమువలనఁ గావ్యమునకు గలుగుశోభ చాలతక్కువ. కావుననే

మ. అమలజ్ఞానకళాఫలేగ్రహి, ఘనవ్యామోహ ముష్టింధయుం
బమితర్థివ్యసనోదరంభరి, యఘపాగ్ర్యార కూలంకష
బు మదావ్యద్మర మిద్ధతాపహరణంబున్ శాంకరం బౌ పదా
బ్జము కారుణ్యరసామితంపచముగా భద్రంకరం బయ్యెడున్.

అని యాంధ్రీకరింపఁ బడెను.

ఫలేగ్రహి, ఫలశబ్దమున కేదంతత్వమును, గ్రహి ధాతువునకు ఇన్ ప్రత్యయమును 'ఫలేగ్రహి రాత్మంభరిశ్చ' యను సూత్రముచే నిపతింపఁబడఁగా సిద్ధించినరూపము 'నాడీ ముష్ట్యోశ్చ' యనుసూత్రముచే 'ముష్టింధయ' రూపసిద్ధి. ఈరీతిగా నసామాన్య సూత్రములచే సిద్ధించిన ఉదరంభర్యాదిశబ్దముల కన్నిటికిఁ బ్రక్రియ చూపినగ్రంథ విస్తరమగు నని విరమించి యట్టి ప్రయోగవిశేషములను దిఙ్మాత్ర ముదాహరింతును. అమర్త్య దోహాల విహారము. (విహారము) 1-13 జరీజృంభద్వచోనిర్ఝరము 2-39. కండూలరసన 2-31. కచాకచి, గదాగది, భుజాభుజి 2-50. సర్వాంగీణము 2-52. సాంకాశినము, సాంపాశినము 2-54. నదీష్ణులు 2-38. స్నిష్ణాసువు 2-168. సముజ్జిహీర్షుఁడు 2-193. త్రైయంబకాపరరూపుఁడు 2-201. ఆటాట్యమానుఁడు 3-70. సౌవస్తికము, పచేళిమము, అలంకర్మీణము 3-77. దిదిత్స 3-104. కూలముద్రుజము 3-111. పాపచ్యమానము 6-68. వాతంధయము 6-66. గూఢోత్ముఁడు 7-141. అనిదంపూర్వము 7-201. స్వశభర్మలు

7-261. దేహాన్ప్రిలయ 8-141. ఉగ్రింపశ్యులు 8-183. మాన షట్త్యము 8-389. హస్తగ్రాహము 9-69. ద్వ్యాయుష్త్ర్యాయుష ములు 9-131. మున్నగునవి యీగ్రంథమున నెన్నియో కలవు.

కొన్ని మూలమం దున్నవియును, గ్రంథకర్త వ్యాకరణవేత్త యగుటం గొన్ని స్వకీయములును. ఈరీతిగా మూలమునందలి శబ్ద చమత్కారము శక్యమైనంతవరకు నాంధ్రీకరణమున నిముడ్ప నీగ్రంథ కర్త చూపిననైపుణి నుతిపాత్రము. స్వతంత్రరచనముకంటె నాంధ్రీకర ణము శ్రమకరము. మూలమందలి యర్థసౌందర్యము, శబ్దాలంకార ములు, మార్మిక ప్రయోగములు సరిగాఁ దూఁచిన ట్లనువాదమున వచ్చుట దుర్లభమైనను గష్టపడి యేయొకకొంతయో యనువాదమునఁ జూపఁబడినచో మూలమునందలి సొగసు తేఁజాలక పోయెనని పెదవి విఱుతురు. ఒకవేళ వశ్యవాక్కగు నేమహాకవి యైనను దేఁగలిగినచో నీసౌందర్య మంతయు మూలములోనిదే. అనువాదకునియుపజ్ఞ యిం దేమి కల దని తేలికఁగా బలుకుదురు. ఏభాషస్వభావ మాభాషది. ఒక భాషయందుఁ గలసౌలభ్య మింకొకభాషకు గుదరకపోవుట నైసర్గికము. మూలమందలి సౌందర్యమున నేకదేశ మైనను ననువాదభాషా స్వభావ ముతో మేళవించి యతుకులు గనరాకుండ రచయిత యనువదింపఁ గల్గెనా? లేదా? యనునంశము మఱువఁదగనిది. ఈగ్రంథకర్త యను వదించినచోట్ల నెల్ల నాంధ్రకవితకుఁ గల నైసర్గికమార్గము స్ఫురింప రచించి కృతార్థుడయ్యె ననియే చెప్పవచ్చును. పంచ మాశ్వాసమున లక్ష్మీనృసింహస్తవ మాంధ్రీకరింపబఁడెను. 'లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్' అనుమకుటము 'లక్ష్మీనరసింహ నాకొసఁగుమీ భవ దీయకరావలంబమున్' అని తెనిఁగించి యా మకుటముతో నడిపిన యాస్తవ మంతయు స్వతంత్రరచనవలె నున్నది.

కఠినతర మగు శ్లేషస్థలము లందును దెలుఁగు పదములచేతనే యర్థద్వయము నీగ్రంథకర్త చూపఁగలిగె ననుట కొక యుదాహర ణము మాత్రమే తెలిపెదను. శ్లేషకవితచే హరిహరుల కభేదము చెప్పిన శంకరకృతస్తవము మూలమునఁ గలదు. అర్థశ్లేష మున్నచోట్ల నాశబ్ది ముల నెట్లేని యాంధ్రీకరణమున బిగింపవచ్చును. కాని శబ్దశ్లేషమం దాశబ్దము లాంధ్రమునఁ గుదురవుగదా? అచట నీకవి యెట్లు సంత రింపఁ గల్గెనో చూతము.

'శ్లో॥ సమావహన్ కేసరితాం వరాం య స్సురద్విష త్కుంజర మాజఘాన- అని నృసింహునకు శివునకు నభేద వర్ణనము. వరాం=శ్రేష్ఠ మగు, కేసరితాం = సింహత్వమును, సమావహన్ = వహించుచున్న వాఁడు, అని నృసింహపక్షమున నర్థము. సరితాం=నదులలో, వరాం= శ్రేష్ఠయగు గంగను, కే=శిరస్సునందు, సమావహన్=వహించు చున్న వాఁడు అని శివపక్షమున నర్థము. ఇందు 'కే' యనునది సప్తమ్యంత మొకపక్షమునను, 'కేసరితా' మని పదైకదేశ మొకపక్షమునను నగు చున్నది. దీనిని గ్రంథకర్త సులభముగాఁ దెలుఁగుగా మార్చె ననుట యద్భుతావహము కాకమానదు.

గీ. 'సటలపెంజాలు మెఱయ' అని యాంధ్రీకరణము. (సటల= జూలుయొక్క, పెంజాలు=పెద్దగుంపు, అని నృసింహ పక్షమున నర్థము. సటల=జడలయందున్న, పెంజాలు = పెద్దప్రవాహము, అని శివపక్ష మున నర్థము) ఇచట స్వతంత్రరచనవలె ధారాళమగుశయ్యతో నచ్చ తెలుఁగు పదములతో నీశ్లేషకవితయందుఁ గృతార్థుఁడైన యీగ్రంథ కర్త నేర్పు సామాన్యమా? భాషాంతరీకరణ మనిన నేరీతి కారీతిగా సరి పుచ్చఁగలిగి యిట్లుండవలెనుగదా!

మఱియుఁ బ్రభుసమ్మిత మగు వేదమున నేధర్మము చెప్పఁబడునో సుహృత్సమ్మిత మగుపురాణముచే నేధర్మము చెప్పఁబడునో ఆధర్మ మే

రసయుతముగాఁ గాంతాసమ్మిత మగుకావ్యముచే బోధింపఁ బడునను నభియుక్తోక్తి స్ఫురింపఁజేయు తలంపుతోఁగాఁబోలును. శ్రీవేంకటరావు పంతులుగారి వంశవర్ణనమున గోత్రపురుషుఁడగు భరద్వాజుని బురాణ గాథలననుసరించి గాక, వేదముననుసరించి యీకవివర్ణించెను. అయ్యది ప్రసంగాంతర మైనను ఈగ్రంథకర్తకు వేదమార్గమునందుఁ గలభక్తి సూచింపఁ దెలుపవలసి వచ్చినది.

'భరద్వాజో హ త్రిభి రాయుర్భి ర్బ్రహ్మచర్య ముపాస। తగ్ంహ జీర్ణిగ్ం స్థవిరగ్ం శయాన మింద్ర ఉపవ్ర జ్యోవాచ। భర ద్వాజ యత్తే చతుర్థ మాయుర్దద్యాం, కి మేనేన కుర్యా ఇతి। బ్రహ్మ చర్య మే వైనేన చరేయ మితి హో వాచ। తగ్ంహ త్రీన్గిరిరూపా నవిజ్ఞాతానివ దర్శయాంచకార। తేషాగ్ం హైకైకస్మాన్ముష్టి నాదదే। స హోవాచ భరద్వా జే త్యామంత్ర్య। వేదావా ఏతే। అనంతావై వేదాః। ఏతద్వా ఏతైః స్త్రిభి రాయుర్భి రన్వవోచథాః। అథ త ఇతర దననూక్త మేవ। ఏహీమమం విద్ధి' అనువేదవచనములు గొని హృద్యముగా

"సీ. త్ర్యాయుషం బొంది జరార్తుఁడై యిల వ్రాలి
యును బ్రహ్మచర్యంబు నుడుగలేక
యూర్చుచు నింద్రుఁ డాయువు చతుర్థం బిచ్చి
చూపింప వేదరాశులను జూచి
పర్వతత్రితయంబు భాతి భాసిల్లు వే
దత్రయంబునకు వందనము సేసి
యింద్రు సానతిని ద్రియీగిరులం దుండి
పిడికెఁడు పిడికెఁ డయ్యెడ గ్రహించి
గీ. భూమికిం దెచ్చినట్టి యభూత పూర్వ
చరితుఁ డని వేదవినుత యశస్కుఁడై "య
నంతములు వేదము" లటంచు నవనిఁజాటి
నట్టి మహితు భరద్వాజు నగునె పొగడ."

అని రచించెను. మఱియుఁ గనకామలక వర్షగాథయందును మూలమున లేని శ్రీసూక్తముచే లక్ష్మిని నుతించుటయుఁ గూడ వేద మహిమ వెల్లడించుతలంపుననే కదా! ఆవేదమంత్రముల యర్థము సర సముగాఁ దెలుఁగునఁజూపి యీకావ్యమునకుఁ బవిత్రతయు నౌచితీ సంపత్తియు ఘటించి గ్రంథకర్త ధన్యతఁ గాంచె.

ఆద్యంత మొక్కరీతిగా రచింపఁబడిన గ్రంథము లరుదుగా నుండును. ఇన్నివిధము లగుశాస్త్రములను, మతములను నిమిడ్చి యాద్యంతము సకలగుణపరిపూర్ణముగా రచింపఁబడిన యీశంకర విజయ ముత్తమకావ్య మని నిస్సంశయముగాఁ బలుకవచ్చును. ఒక వంక సంస్కృతకవిపండిత లోకమునకును, నొకవంక నాంధ్రకవిపండిత లోకమునకును, నానందజనకముగా నీప్రబంధము రచించినకవి విద్వ త్కవి యనిపించుకొనుటలో నాశ్చర్య మేమున్నది ?

కావ్యలక్షణములు

నాదృష్టికి గోచరించినంతలోఁ గొన్నికొన్ని విషయములు మాత్ర ముద్ఘాటించితిని. రసజ్ఞులగు ప్రాజ్ఞులింకను నిందుఁ గల వివిధ గుణముల గ్రహించి యానందింపక మానరు. ఆంధ్రవాఙ్మయమున శృంగారప్ర బంధములు బహుళములు. అట్టి వాఙ్మయమున మునిఁగి తేలియు నీకవి మునిత్రయచరిత్రము శంకరవిజయమువంటి శాంతరస ప్రధానప్రబంధ ముల రచింప నాస్థ గలిగి, యందుఁ బరకోటినొంద రచనసాగించుట యాశ్చర్యము. ఇందు శాంతము ప్రధానరస మని మూలమున—

శ్లో॥ నేతా యత్రోల్లసతి భగవత్పాదసంజ్ఞో మహేశః
శాంతి ర్యత్ర ప్రకచతి రసః శేషవా నుజ్జ్వలాద్యైః.

అని నిర్ణయింపఁబడినది. శివగురుని తపస్సు మొదలుకొని శంక రుఁడు యథేతారపూర్తిదాఁక శాంతరసమే. నడుమ నంగములుగా రసాంత రము లున్నవి. జిగీషను బురస్కరించుకొని కామకళాప్రసంగమున వీర

రసమే కాని శృంగారరస మచట లేదు. అమరుకకథ యున్నచో శృంగార రససంబంధ ముండెడిది రసముకొఱకు నౌచిత్యము పాడొనర్చుటకంటె శృంగారరసము విడిచినను గావ్యమునకు లోపమురాదు. నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయాద్యష్టాదశ వర్ణనములతోడి కావ్యముగ నియ్యది రచింపఁబడలేదు. సందర్భోచితముగా నందుఁ గొన్ని ప్రసక్తములైనపుడు విడువఁబడలేదు. ఇట్టి చారిత్రక కావ్యములం దయ్యవి ముడివెట్టుట యనుచితము. ఏవర్ణనములు లోపించినను శంకరుని యాకార గుణ కీర్తి పాండిత్యాదివర్ణనము మూలానుసారముగా గ్రంథకర్త రచించి శ్రీ భగవత్పాదులయెడఁ దనకుఁగల యసమాన భక్తి వెల్లడించుకొనెను. ఆభక్తి గ్రంథరూపమున వెల్లడియగుటచే దానే కాక పఠితలుగూడఁ దరింప సాధనమయినది. ఇట్టి యుత్తమకావ్యములే కదా స్వమత, స్వదేశ, స్వభాషా గౌరవములకు సార్వకాలిక రక్షకములు. కావున నింతతోఁ దృప్తిపడక యీగ్రంథకర్త శ్రీవేంకటరాయ సమర్పితమందిరమున సుఖముగా నివసించుచు నిట్టి కావ్యములింకను రచించుఁగాక! పరమేశ్వరుఁడు శ్రీవేంకటరావు పంతులుగారికి నీ గ్రంథకర్తకు నభీష్టఫలదాత యగుఁగాక !

స్వస్త్యస్తు.

అమలాపురము తాలూకా,
భట్నవిల్లి.
22-11-1947

'తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ'
బులుసు అప్పన్నశాస్త్రి.

# ఆ ము ఖ ము

శ్రీ రామచన్ద్రాయ నమః

కం. శ్రీమచ్ఛంకరులకు నవి
రామంబుగ మ్రొక్కి వెంపరాల కవీంద్ర
శ్రీమచ్ఛంకరజయకృతి
కాముఖము రచింతుఁ గవిబుధావళి కరుణన్.

శ్లో॥ అష్టవర్షే చతుర్వేదీ ద్వాదశే సర్వశాస్త్రవిత్ ।
షోడశే కృతివాన్ భాష్యం ద్వాత్రింశే ముని రభ్యగాత్॥

శ్రీమద్భరతఖండమునఁ గేరళదేశములోఁ గాలట్యగ్రహారమున నార్యాంబా శివగురుతపఃఫలంబై తద్గర్భశుక్తిముక్తాఫలంబై యవతరించి, యెనిమిది యేండ్ల యీడున నాల్గు వేదములను నధ్యయనించి, పండ్రెండేండ్ల ప్రాయంబున సర్వశాస్త్రముల నభ్యసించి, సకలకలాపారంగతుండై శ్రీ గోవిందభగవత్పాదుల శుశ్రూషించి మహావాక్యోపదేశము గాంచి, పదునాఱేండ్ల వయస్సున నుపనిషద్బ్రహ్మసూత్ర భగవద్గీతా ప్రస్థానత్రయంబున కద్దముల వంటి భాష్యములను సంతరించి, పద్మపాదహస్తామలకతోటక సురేశ్వరాచార్యాది శిష్యకోటి ననుగ్రహించి, యాసేతుశీతాచలము పర్యటించి, తన పాదధూళిచే సమస్తభారతదేశమును బవిత్రీకరించి ధర్మము నుద్ధరించి, నలుదెసల శారదాపీఠముల స్థాపించి, మహాకవియై శివానందలహరీ సౌందర్యలహర్యాది స్తోత్రకావ్యములఁ రచించి, మహాపండితుఁడై నాస్తిక పాషండ మతముల ఖండించి, మహామేధావియై ప్రస్థానత్రయమునకే కాక సనత్సుజాతీయ విష్ణుసహస్రనామ గౌడపాదకారికాది గ్రంథములకు భాష్యములను వివేకచూడామణ్యాది ప్రకరణములను నిబంధించి, మహాచార్యుఁడై యద్వైతబ్రహ్మతత్త్వము నుపదేశించి, జ్ఞానమార్గమును బోధించి భారతీయుల కందఱకు మోక్షమార్గము చూపించి, కాశ్మీరశారదాలయమున ద్వాదశద్వారవిద్వాంసులను జయించి, శ్రీశారదాదేవిని మెప్పించి, సర్వజ్ఞసింహాసనము

నధిరోహించి "జగద్గురువు" లని విఖ్యాతి గాంచి వెలుఁగొందిన శ్రీ శంకరభగవత్పాదాచార్యుల నామమును వినని విజ్ఞుఁడు భారతీయులలో నుండఁడు. శ్రీ శంకరులు పరమశివావతారమని పురాణములు ముక్తకంఠముతో నుద్ఘోషించుచున్నవి.

శ్లో॥ కల్యాదౌ ద్విసహస్రాంతే లోకానుగ్రహ కామ్యయా ।
చతుర్భిస్సహశిష్యైస్తు శంకరోఽవతరిష్యతి ॥
(భవిష్యోత్తర పురాణము)

శ్లో॥ కల్యబ్దౌ మజ్జమానాంస్తాన్ దృష్ట్వానుక్రోశతోఽబ్రువే ।
మదంశజాతం దేవేశి! కలావపి తపోధనమ్॥

కేరళేషు తదా విప్రం జనయామి మహేశ్వరి ।
తస్యైవ చరితం తేఽద్య వక్ష్యామి శృణు శైలజే ॥

కల్యాదిమే మహాదేవి! సహస్రద్వితయా త్పరమ్।
కేరళే శకలగ్రామే విప్రపత్న్యాం మదంశతః॥

భవిష్యతి మహాదేవి! శంకరాఖ్యో ద్విజోత్తమః।
ఉపనీతస్తదా మాత్రా వేదాన్ సాంగాన్ గ్రహీష్యతి॥
(శివరహస్యము)

శ్లో॥ కరిష్య త్యవతారాణి శంకరో నీలలోహితః।
శ్రౌతస్మార్తప్రతిష్ఠార్థం భక్తానాం హితకామ్యయా॥

ఉపదేక్ష్యతి తద్జ్ఞానం శిష్యాణాం బ్రహ్మసంజ్ఞితం।
సర్వవేదాంతసారం హి ధర్మాన్ వేదనిదర్శనాన్॥
(కూర్మపురాణము)

శ్లో॥ వ్యాకుర్వన్ వ్యాససూత్రార్థం శ్రుతే రర్థం యథోచివాన్।
శ్రుతే ర్న్యాయః స ఏవార్థః శంకరః సవితాననః॥
(శివపురాణము)

శ్లో॥ విదంతి వేదవిద్యాం చ ద్విజాః కర్మాణి వై కలౌ।
కలౌ రుద్రో మహాదేవః శంకరో నీలలోహితః॥

ప్రకాశతే ప్రతిష్ఠార్థం ధర్మస్య విక్రుతాకృతిః।
యే తం విప్రా నిషేవంతే యేన కేనాపి శంకరమ్॥
కలిదోషాన్ వినిర్జిత్య ప్రయాంతి పరమం పదమ్॥
(లింగపురాణము)

అట్టి భగవత్పాదుల పవిత్రచరిత్రమును వారి సాక్షచ్ఛిష్యులును ననంతరకవులును వేనోళ్ళఁ గీర్తించిరి. అవియే శంకరవిజయములు.

## శంకర విజయ పరంపర

ఆనందగిరి ప్రాచీన శంకరవిజయము, చిత్సుఖాచార్యుల బృహచ్ఛంకరవిజయము, చిద్విలాసుని శంకరవిజయవిలాసము, గోవిందనాథుని శంకరాచార్యచరిత్రము, శంకరానందుని శంకరవిజయము, వ్యాసాచలకవి శంకరదిగ్విజయము, మాధవవిద్యారణ్యుల సంక్షేపశంకరవిజయము, వల్లీసహాయకవి యాచార్యదిగ్విజయము, రాజచూడామణిదీక్షితుని శంకరాభ్యుదయము, సదానందుని శంకరదిగ్విజయము, పురుషోత్తమ భారతి శంకరవిజయ సంగ్రహము, తిరుమలదీక్షితుని శంకరాభ్యుదయము, అనంతకవి శంకరాచార్యచరిత్రము, వ్రజరాజకవి శంకరదిగ్విజయసారము, గోవిందాచలకవి శంకరదిగ్విజయసారము, విద్యాశంకరభారతీస్వామి శ్రీశంకరచిద్విలాసము మొదలగునవి యెన్నియో సంస్కృతకావ్యములు వెలసినవి. పురాణములు, జినవిజయము, పతంజలిచరిత్రము మొదలగు వాని యందు శంకరుల ప్రశంస కలదు. ఇన్ని కావ్యములు పుట్టినను శంకరుల తల్లిదండ్రులు, దేశము, కాలము, జీవితఘట్టములు మొదలగు విషయములలో నివి యన్నియుఁ బరస్పరము భేదించుచున్నవి. వీని నిర్ణయము చరిత్రకారుల కొక జటిలసమస్యయైనది. శంకరవిజయకర్తలు వారి త్రముల నిట్లు తికమక పడుటకు వేఱొక కారణము గలదు. ఆవిషయము మున్ముందు వివరింతును.

## శంకరుల దేశము

ఆదిశంకరుల జన్మదేశము కేరళము నందలి కాలటి యని యించుమించుగా నన్ని శంకరవిజయము లందును గలదు. అనంతానందగిరి శంకరవిజయము "చిదంబర" మని వాకొనుచున్నను నది గ్రాహ్యముగాదు. అభినవశంకరుల దేశము చిదంబరము.

## శంకరుల కాలము (క్రీ. పూ. 509–477)

పాశ్చాత్యపండితులు తత్ప్రభావితులగు భారతీయ చారిత్రకులు శంకరుల కాలము క్రీ శ. 788–820 అని చెప్పుచున్నారు. శృంగేరీమఠపరంపర ననుసరించి శంకరుల కాలము క్రీ. పూ. 36. ద్వారకా కాంచీ పూరీ మఠేతివృత్తములు సర్వజ్ఞ సదాశివబోధుల "పుణ్యశ్లోకమంజరి" "సదాశివబ్రహ్మేంద్ర సరస్వతి" "గురురత్న మాలిక" "ఆత్మబోధుని" "సుషమ" "జినవిజయము" మొదలగునవి శంకరుల కాలము క్రీ పూ. 509–477 అని నొక్కి వక్కాణించుచున్నవి. అభినవ శంకరులు కామకోటీపీఠము నధిష్ఠించిన వారిలో 38వ యాచార్యులు. ఆదిశంకరుల జననీజనకు లార్యాంబా శివగురులు. అభినవశంకరుల మాతాపితలు విశిష్టావిశ్వజిత్తులు. ఆదిశంక రుల దేశము "కాలటి". అభినవ శంకరుల దేశము "చిదంబరము". ఆదిశంకరుల జన్మకాలము నందనసంవత్సర వైశాఖశుక్ల పంచమి. అభినవశంకరుల జన్మకాలము విభవసంవత్సర వైశాఖశుక్ల దశమి. ఆదిశంకరుల జీవితకాలము 32సంవత్సరములు. అభినవ శంకరుల జీవితకాలము 52 సంవత్సరములు. ఆదిశంకరుల వలెనే యభినవ శంకరులు కూడ భారతదేశము నందంతటను బర్యటించి కాశ్మీరములో సర్వజ్ఞసింహా సనము నధిరోహించిన వారు. అభినవశంకరులు క్రీ.శ. 801-839 కాలములోఁ గామ కోటీపీఠము నలంకరించిరి. సూక్ష్మేక్షికతోఁ బరిశీలించినచోఁ జిత్సుఖ వ్యాసాచలాదుల శంకరవిజయము లాదిశంకరుల చరిత్రగను ననంతానందగిరి శంకరవిజయ మభినవ శంకరుల చరిత్రగనుగోచరించును. అభినవశంకరాచార్యులు కూడ నాది శంకరాచార్యుల వలె మహా ప్రభావశాలులగుటచే శంకరవిజయకర్తలు వారి జీవితచరిత్రలను సాంక ర్యముగావించినారు. దీనిని గమనింపక చారిత్రకు లభినవశంకరుల కాలమును (క్రీ.శ. 820)ఆదిశంకరులకు ముడి పెట్టినారు. ఆదిశంకరులు కల్యబ్దములు 2663(i. c. 478–477 B. C.) కాలములో నున్నారనుటకుఁ బ్రబలమైన శాసనప్రమాణము గలదు. అది శంకరులకు సుధన్వుఁడు సమర్పించిన తామ్రపత్ర శాసనము.

శ్రీ మహాకాలాయ నమః

శ్రీ మహాకాల్యై నమః.

శ్రీమ త్సదాశివాపరావతారమూర్తి– చతుష్షష్టికలావిలాసవిహారమూర్తి– వర్ణా శ్రమవైదిక సిద్ధాంతోద్ధారకమూర్తి – మామకీన సామ్రాజ్యవ్యవస్థాపనమూర్తి – విశ్వేశ్వరవిశ్వగురుపదజగజ్జేగీయమానమూర్తి– నిఖిలయోగిచక్రవర్తి శ్రీమచ్ఛంకర భగవత్పాదపాదపద్మయోః భ్రమరాయమాణసుధన్వనో మమ సోమవంశ చూడామణి యుధిష్ఠిరపారంపర్యపరిప్రాప్తభారతవర్షస్యఅంజలిబంధపూర్వికేయంరాజన్యస్య విజ్ఞప్తిః

భవద్భిః దిగ్విజయోఽకారి. సర్వే వాదినః పరాకృతాః. సర్వే వర్ణా ఆశ్ర
మాశ్చ కృతయుగవత్ పూర్ణే వైదికాధ్వని యోజితాః సంతో యథాశాస్త్ర మాచరంతి
హి ధర్మమ్. బ్రహ్మ విష్ణు మహేశ్వర మహేశ్వరీ స్థానాని అశేషదేశవర్తీని ఉద్ధృతాని
సర్వం బ్రహ్మకుల ముద్ధారితం విశిష్యాఽస్మద్రాజకుల మాన్వీక్షక్యాద్యశేషరాజ
తంత్ర పరిశీలనే నోన్నీతం భవతి. బ్రహ్మక్షత్రాద్యస్మత్ప్రముఖ నిఖిలవినేయలోక
సంప్రార్థనయా చతస్రో ధర్మరాజధాన్యో ద్వారకా- బదరీ – జగన్నాథ– శృంగర్షి
క్షేత్రేషు శారదా- జ్యోతి– గోవర్ధన– శృంగేరీమతాపరసంజ్ఞకాః సంస్థాపితాః తత్రో
త్తరదిశో యోగిజనప్రాధాన్యేన ధర్మమర్యాద రక్షణం సుకరమేవేతి జ్యోతిర్మతే
శ్రీ తోటకాపరనామ్నః ప్రతర్దనాచార్యాన్, అథ శృంగర్ష్యాశ్రమే శృంగర్షిసమస్వ
భావాన్ పృథ్వీధరాభిధేయ హస్తామలకాచార్యాన్ భోగవర్ధనే స్వత ఏవ అభిమతత్వేన
అత్యంతోగ్రస్వభావానపి సర్వజ్ఞకల్పపద్మపాదాపర నామధేయ సనందనాచార్యాన్,
అథ బౌద్ధకాపాలకాది సకలవాది భూయిష్ఠపశ్చిమస్యాం దిశి వాదిదైత్యాంకురః పునః
మా భవత్వితి శారదాపీఠే కిల ద్వారకాయాం జైనైః ఉత్పాదిత వజ్రనామ నిర్మిత
భగవదాలయాది దుర్దశా దూరీకృత్య భగవద్భిః త్రిలోకసుందరనామ్నా పునః సన్నిబద్ధ
భగవదాలయ శ్రీకృష్ణాది సకలమర్యాదా సంప్కృతాయా మధిగతాశేషలౌకిక వైదిక
తంత్ర విశ్వవిఖ్యాత కీర్తిసర్వజ్ఞానమయాన్ మండనమిశ్రాపర నామధేయ సురేశ్వ
రాచార్యాంశ్చ అస్మత్సర్వలోకాభిమతిపూర్వక మభిషిచ్య, ఏవం చతుర్భ్యః ఆచార్యేభ్య
శ్చతస్రో దిశ ఆదిష్టా భారతవర్షస్య ఏతే తత్తత్పరప్రణాడ్యా నిజనిజమేవ మండలం
గోపాయంతో వైదిక మార్గ ముద్భాసయంతు. సర్వే వయం తత్తన్మండలస్థా
బ్రహ్మక్షత్రాదయః తత్తన్మండలస్యైవ ఆచార్యస్య అధికారాధికృతా వర్తిష్యామహే
చ. మహద్వినిర్ణయ ప్రసక్తౌ తు సురేశ్వరాచార్యా ఏవ ఉక్తలక్షణతః సర్వత్ర వ్యవ
స్థాపకో భవంతు. భగవతా మనుశాసనాచ్చ. అస్మద్రాజసత్తైవ నిరంకుశగురుసత్తాపి
ఉక్తమర్యాదయా జగత్యవిచలం విచలతు. పరివ్రాజకో హి మహాకులీనత్వవైదు
ష్యాది విశిష్టాచార్యలక్షణైః అన్విత ఏవ శ్రీ భగవత్పాదపీఠానా మధికార మర్హతి.
న తు వినిమయేనేత్యేవ మాదినియమబంధో భగవదాజ్ఞాసముపబుద్ధః సమస్తైః అథ
అస్మదాది బ్రహ్మక్షత్రాదివంశోద్భవైః పరమప్రేమ్ణా ఉత్తమాంగేన ఆద్రియత
ఇత్యేతాంవిజ్ఞప్తిం అంగీకుర్వంతు భగవంత ఇతి స్వస్త్యస్తు లోకేభ్యః యుధిష్ఠిర
శకే 2663 ఆశ్విన శుక్ల 15.

శ్రీ సుధన్వసార్వభౌమః*

ఈ హేతువుల నెల్లఁ బురస్కరించుకొని శ్రీ టి. ఎస్ నారాయణశాస్త్రిగారు (The Age of Sankara) ఎ, నటరాజ అయ్యర్‌గారు, శ్రీ యస్. లక్ష్మీనరసింహశాస్త్రి గారు (The Tradttinal age of Sri Sankaracharya and the Maths) శ్రీ కోట వెంకటాచలముగారు Chronology of Nepal History Reconstructed ఆదిశంకరుల కాలము క్రీ. పూ. 509-477 అని సోపపత్తికముగా నిరూపించినారు వీరి వాక్యములను బరికింపుడు.

If historians have their own reasons to believe that Sankara flourished in 788-820 A. D. we have equally valid or More valid reasons to believe that Adi Sankara lived during the Period 509 to 477 B. C.

It is therefore clear that the date of Sankara 509 to 477 B. C., is quite reliable and calls for no rivision. or, at any rate Sankara was born and lived in the Pre Christian era, and certainly not in the 9th century A. D. (The Traditional Age of Sri Sankaracharya and the Maths Page 45)

ఈ కాలమును సంస్కృతవాఙ్మయచరిత్రలో శ్రీ మాడభూషి కృష్ణమాచార్యులును, బ్రహ్మసూత్రభాష్యభూమికలో శ్రీ వేంకటాచలశాస్త్రిగారు నంగీకరించినారు. ఈ సిద్ధాంతమే పండితామోదమును బడసినది. ఈవిషయమును గూర్చి శ్రీ శంకర భగవత్పాదకాలనిర్ణయః" అను గ్రంథమును వ్రాయ తలపెట్టితిని గాన నింతకంటె వివరింపను. పైని చెప్పబడిన శంకరవిజయములలో మాధవాచార్యుల శంకరవిజయమే మనదేశములోఁ బ్రచురప్రచారముగాంచినది. దీని ననుసరించియే దేశభాషలలో ననేక శంకరచరిత్రలు వెలసినవి. మన యాంధ్రభాషలోఁ గూడఁ బద్యకావ్యములు గద్యకావ్యములు రచితములైనవి.

---

*1. The Age of Sankara : Pages 220, 221

2. The Traditional Age of Sri Sankaracharya and the Maths Pages : 152, 153

(Reproduced from the Vimarsa Page 29)

## మాధవ విద్యారణ్యులు (1302–87 A. D.)

భారతదేశేతిహాసములో ముఖ్యముగా సంస్కృత వాఙ్మయచరిత్రములో శ్రీ శంకరభగవత్పాదుల పిమ్మట నంతటి ప్రఖ్యాతి గాంచిన వారు విద్యారణ్యులు.

శ్లో॥ శ్రీమతీ జననీ యస్య సుకీర్తి ర్మాయణః పితా।
సాయణో భోగనాథశ్చ మనోబుద్ధి సహోదరౌ॥

యస్య బోధాయనం సూత్రం శాఖా యస్య చ యాజుషీ।
భారద్వాజం యస్య గోత్రం సర్వజ్ఞ స్స హిమాధవః॥

అను పరాశరమాధవీయావతారికను బట్టి వీరిది బోధాయనసూత్రము, భారద్వాజ గోత్రము, తైత్తిరీయ యజుశ్శాఖ యని, శ్రీమతీమాయణులు జననీజనకులు, సాయణభోగనాథులు సోదరు లనియుఁ దెలియుచున్నది. మాధవులు మొదట హరి హరరాయ బుక్కరాయ సోదరులకు (1336–1379 A. D.) కులబ్రాహ్మణులై విద్యాగురువులై యమాత్యులుగా నుండి విజయనగర సామ్రాజ్యమును స్థాపింపఁజేసి కర్ణాటకసింహాసన సంస్థాపనాచార్యులని ప్రసిద్ధినొందిరి. పిమ్మట సన్న్యసించి విద్యారణ్యనామముతో శృంగేరీపీఠము నధిష్ఠించిరి. శంకరానందులు, శ్రీ విద్యాతీర్థులు, భారతీతీర్థులు, శ్రీ కంఠాచార్యులు వారి గురువులు. బుక్కరాయల కమాత్యుతుగా నుండుటచే వీరి కాలము చతుర్దశ శతాబ్దమని స్పష్టము. ఆదిశంకరులవలె విద్యారణ్యులు కూడ బహుగ్రంథకర్తలు. చతుర్వేదభాష్యములు, ఉపనిషద్దీపికలు, మాధవీయధాతువృత్తి, పరాశరమాధవీయము, కాలమాధవము, ఆచారమాధవము, వ్యవహారమాధవము, విద్యారణ్యకాలజ్ఞానము, పురుషార్థసుధానిధి, ప్రాయశ్చిత్తసుధానిధి, యజ్ఞతంత్రసుధానిధి, సుభాషితసుధానిధి, అలంకారసుధానిధి, సంగీతసారము, జైమినీయన్యాయమాల– విస్తరము, వైయాసికన్యాయమాలా విస్తరము, అనుభూతిప్రకాశిక బ్రహ్మగీత, దృగ్దృశ్యవివేకటీక, అపరోక్షానుభూతిటీక, బృహదారణ్యకవార్తిక సారము, జీవన్ముక్తివివేకము, వేదాంతపంచదశి, వివరణప్రమేయసంగ్రహము. వేదాంతాశీర్వాదము, శతప్రశ్నకల్పలతిక, సర్వదర్శనసంగ్రహము మొదలగు పెక్కు గ్రంథములను వీరు రచించిరి. ఈ గ్రంథము లన్నియు సాయణమాధవ సోదరులచేఁ గలిసి రచింపఁబడుటచే నిద్దఱ పేరుల తోడను వెలయుచున్నవి.

శ్లో॥ వేదానాం భాష్యకర్తా వివృతమునివచా ధాతువృత్తే ర్విధాతా
ప్రోద్యద్విద్యానగర్యాం హరిహరనృపతేః సార్వభౌమత్వదాయీ।
వాణీ నీలాహివేణీ సరసిజనిలయా కింకరీతి ప్రసిద్ధా
విద్యారణ్యోఽగ్రగణ్యోఽభవ దఖిలగురుః శంకరో వీతశంకః॥

అను శ్లోకము విద్యారణ్యుల ప్రాశస్త్యమును దెలుపుచున్నది. వారి సోదరుఁడగు భోగనాథుఁడు మహాకవియై రామోల్లాసము, త్రిపురవిజయము, ఉదాహరణమాల, మహాగణపతిస్తవము, శృంగారమంజరి, గౌరీనాథాష్టకము, మొదలగు కృతులను రచించినాఁడు. ద్వితీయసంగముని బిట్రగుంట (నెల్లూరు రాష్ట్రము) శాసనము (1356 A.D.) భోగనాథునిచే రచింపఁబడినది. పైనిఁ జెప్పఁబడిన గ్రంథము లన్నియు మాధవాచార్యులు మహాపండితులని నిరూపించుచుండఁగా శంకరవిజయము మహాకావ్యము వారు మహాకవు లని నిరూపించుచున్నది. శంకరవిజయము నందలి ధారి శ్రీహర్షుని నైషధమునఁ దక్కఁ దక్కిన భారవి మాఘాది కావ్యములందుఁ గూడఁ గానరాదు. అందువలననే మాధవాచార్యులీగ్రంథారంభములో___

శ్లో॥ సామోద్రై రనుమోదితా మృగముఖై రానందితా చందనై
ర్మందారై రభివందితా ప్రియగిరా కాశ్మీరజైః స్మేరితా।
వా గేషా నవకాళిదాసవిదుషో దోషోజ్ఝితా దుష్కవి
వ్రాతై ర్నిష్కరుణైః క్రియేత వికృతా ధేను స్తురుష్కైరివ॥

అను శ్లోకములోఁ దాము నవకాళిదాసుల మని సగర్వముగాఁ జెప్పుకొనినారు. ప్రాచీనులలోఁ గూడ నిన్ని గ్రంథములు రచించినవా రరుదు. విద్యారణ్యుల పిదప నప్పయ్య దీక్షితులు శతాధిక గ్రంథకర్తలై వెలుఁగొందినారు. ఆధునికులలో నీకోవఁ జెందిన వారు శ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రులు. విద్యారణ్యులు గావించిన దేశసేవ వాఙ్మయసేవ యెన లేనిది. ఇట్టి విద్యారణ్యుల పవిత్రచరిత్రమును గూడ శ్రీ వెంపరాలవారు "విద్యారణ్య విజయ" మను పేర రచించుచుండుట యాంధ్రుల యదృష్టము.

# ఆంధ్ర శంకర విజయము

మాధవీయ శంకరవిజయమును ప్రధానాధారముగా – నీ యాంధ్ర శంకర విజయమును ప్రబంధపద్ధతిలో రచించినవారు "కవితాభూషణ" "విద్వత్కవిశేఖర" బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు. వీరు సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాతలలో నొకరగుటమే గాక 1) రాయఁడు శాస్త్రీయశశ్చంద్రిక, 2) మునిత్రయ చరిత్రము, 3) వేంకటేశ్వర శతకము, 4) శబర శంకరవిలాసము, 5) మదాలసా విలాసము, 6) వరదగురు యశోవికాసము, 7) జీమూతవాహన చరిత్రము, 8) భద్రాద్రిరామ శతకము, 9) శ్రీనాధతారావళి, 10) ఆంధ్ర రాజ్యేందిర, 11) పోతన, 12) ప్రభావతీ ప్రద్యుమ్నవ్యాఖ్యానము, 13) మనుచరిత్ర వ్యాఖ్యానము మొదలగు సద్గ్రంథములను రచించిన వారు. వీరి కృతులలోని కెల్ల నీ శంకరవిజయకావ్యమే నాయకమణివంటిది. వీరు మునిత్రయ చరిత్రమునందే

సీ॥ ఎవ్వాఁడు ధర జనియించె షణ్మతముల
స్థాపించి లోకరక్షణము సేయ
నెవ్వాఁడు బాల్యమం దెలమి సాంగముగఁ బ్రా
మిన్కుల నొక్క ప్రేల్మిడి గ్రహించె
నెవ్వాఁడు సంన్యాన మెనసె నక్రగృహీత
చరణుఁడై మాత్రనుజ్ఞప్తిఁ గాంచి
యెవ్వాఁడు సాక్షా న్మహేశ్వరుం డని పద్మ
పాదాదులకు స్తుతిపాత్రుఁ డయ్యె.

తే॥ నట్టి శ్రీశంకరాచార్యు నంత వాని
కాత్మవిజ్ఞానబోద్ధయై యఖిలజగము
నుద్ధరించిన గోవిందయోగిచంద్రు
మహిమ మెన్నఁదరంబె సామాన్యులకును (4_203)

అని శంకరవిజయరచనకు బీజము నాఁటినారు. తెలుఁగులో నింతకు ముందు శంకర చరిత్రము లుండఁగా మరల నిది యెందుల కను ప్రశ్నమునకు వీరే మొదట నిట్లు సమాధానం చెప్పిరి

చ. మతగురు పుణ్యకీర్తిఁ బలుమాఱు స్మరించుటఁజేసి, ఘోరసం
స్మృతివెత భావిజన్మములనేని దొఱంగు నటంచుఁగా రహిం
కృతిఁ గృతిసెప్పఁ బూననటు వెంచఁగఁబోల; పెఱుంగ నొక్కొ
స్నతిరసయుక్తిఁ బల్వురు మహాకవు లిద్ది తెనుంగుసేయుటల్ ?

సీ॥ పలుల నిదేల రామాయణం బన్నచో
నీప్రపంచక మెల్ల నెల్లవేళఁ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళ
తనరుచి బ్రదుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నది
తనదైన యనుభూతి తనది గాన
తలఁచిన రామునే తలఁచెద నేనును
నాభక్తిరచనలు నావి గాన

అను విశ్వనాధవారి పద్య మింతకంటెను సూటియైన సమాధానము.

శ్రీ హర్షుని నైషధము తరువాత నంతటి ప్రౌఢకావ్యము శంకరవిజయము. దీనిపై సంస్కృతములో "అద్వైత రాజ్యలక్ష్మి" "శంకరవిజయడిండిమము" అని రెండు వ్యాఖ్యానములు వెలసినవి. ఇట్టి ప్రౌఢకావ్యమును తెనిఁగించుటకుఁ గేవల కవితాసంపత్తియే గాక సర్వశాస్త్రము లందును గూలంకషమైన పాండిత్యము కావల యును. సకలమతరహస్యములు తెలియవలయును. కావున నిట్టి దానిని రచించుటకు విద్వత్కవి శేఖరులగు శాస్త్రిగారే కడుంగడు సమర్థులు వీరు కేవలము మూలమును మాత్రము ననువదించుటతోఁ తృప్తిచెందక పోతనగారు భాగవతానువాదమున శ్రీధరీయ వ్యాఖ్యానుజోడించి నట్లు డిండిమవ్యాఖ్య నంతటిని జోడించుచు దీనిని తెనిఁగించినారు. అందువలననే 1843 శ్లోకములలో నున్న సంస్కృతమూలము శాస్త్రిగారి సుందర హస్తములో 2500 గద్య పద్యములు గల బృహత్కావ్యముగా రూపొందినది.

# కథాసంవిధానము - ఔచిత్యదృష్టి

ద్వాపరయుగాంతమున భూభారాపనోదనార్థమై శ్రీకృష్ణపరమాత్మ యవనీతలమున నవతరించి దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి శ్రీమద్భగవద్గీత నుపదేశించి ధర్మమును స్థాపించెను. కలియుగమున 2500 సంవత్సరములు గడచు నప్పటికి నాస్తికమతములు ప్రబలినవి. ధర్మము నశించినది. పాపము పెచ్చుపెరిగినది. యజ్ఞము లంతరించినవి.

సీ॥ వేదవాదులఁ జూచి వెక్కిరించెడి వారు
శీలవంతులను దూషించు వారు
యజ్ఞసంభారమ్ము లపహరించెడి వారు
ఋత్విగ్గణంబు గాఱించు వారు
క్రొత్తదులను జెఱగొంచుఁ గూడెడి వారు
దైవమ్ము లేదంచుఁ దలఁచు వారు
ప్రకృతియే సృష్టికారణమం చఱచు వారు
ప్రత్యక్ష వాదులై పరఁగు వారు

తే॥ వర్ణభేదమ్ము తలఁగింప వలె నటంచు
నఖిలపాషండసంప్రదాయములఁ దెచ్చి
యలజడి యొనర్ప సాఁగిరి నాస్తికేష
మవధి దాఁటు మహాంభోధి యనువు దోఁప (4–12)

అను విధముగా భారతీయులు దీనస్థితికి దిగ జారినారు. అట్టి సమయమున ధర్మసంస్థాపనార్థమై కుమారి లభట్టపాదు లవతరించి వేదమతము నుద్ధరించిరి. పిదప–

ఉ॥ ఆదియుగంబునన్ గపిలుఁ డన్యయుగంబున దత్తమౌని యా
మీఁది యుగాన వ్యాసుఁ డటు మీఁది యుగంబున శంకరుండు జ్ఞా
నాదిక మిచ్చి ప్రోతు రిల నంచును శైవపురాణ ముండె (5–26)

కృతయుగమునఁ గపిలాచార్యుల వలెఁ త్రేతాయుగమునఁ దత్తాత్రేయుని వలె ద్వాపరమున వ్యాసభగవానునివలెఁ గలియుగమున శ్రీ శంకరభగవత్పాదు లవతరించి యుపనిషన్మతమును స్థాపించినారు. ఆర్యాంబా శివగురుల తపస్సు శంకరుల జననము మొదలు శంకరులు సర్వజ్ఞ సింహాసనము నధిరోహించుట వఱకును గల కథ యథా మాతృకముగానే సాఁగినది. శంకరులు పరమశివావతార మని యిందు వాచ్యముగాఁ జెప్పఁబడక వారి లోకోత్తరకృత్యములచే వారు శంకరావతార మని వ్యంగ్యమర్యాదచేఁ బ్రతిపాదింపఁబడినది. కుమారిలభట్టు చరిత్రము మూలములోఁ బ్రథమసర్గము నందే గలదు. జైత్రయాత్రకు వెడలెడు సమయమున మార్గమధ్యములో నొక వృద్ధ పండితుఁడు శంకరులకుఁ గుమారిలుని చరిత్రము చెప్పిన ట్లిందుఁ జతుర్థాశ్వాసములోఁ జేర్పఁబడినది. ఇచట ననువాదములోఁ గుమారిల, భట్టు చరిత్రము మూలము కంటె విస్తరింపఁబడినను శంకరుల కథతో గలిసినది. ఇట్లే యుభయభారతీ మండన మిశ్రుల వివాహాది కథ మూలములోఁ దృతీయ సర్గమున విస్తరముగాఁ గలదు. కథాగమనము కుంటుపడు నను తలంపుతో ననువాదములో మండనమిశ్ర వివాహాది కథ పరిహరింపఁబడి శంకరమండపసంవాదము విస్తరింపఁబడినది.

ఈ కథ యందొక ముఖ్యమైన మార్పుగలదు. మండనుని జయించిన పిమ్మట నుభయభారతిని గామశాస్త్రములో నోడించుటకై శంకరు లమరుకుని దేహములోఁ బ్రవేశించి యతని రాణులతోఁ గ్రీడించి కామశాస్త్ర రహస్యములు గ్రహించి వచ్చి వాదములో నామెను జయించినట్లు సంస్కృత శంకరవిజయములం దన్నింటను గలదు. కాని శంకరుని వంటి యాజన్మబ్రహ్మచారి పరదేహముతో నైనను బరదార త్రములతోఁ గామక్రీడలలో నోలలాడె ననుట కథానాయకుని చరిత్రకుఁ గళంకా పాదక మగుట మొదటి యనౌచిత్యము. మహాసభలోఁ బండితు లందఱు వినుచుండ బరవనిత యగు నుభయభారతితోఁ గామశాస్త్ర విషయములు ప్రస్తావించుట రెండవ యనౌచిత్యము. "యద్యదాచరతి శ్రేష్ఠః॥ యనున్యాయమున శంకరుని వంటి యోగి భోగలాలసుఁ డగుటచే వ్యభిచారము దోషము కాదను బుద్ధి సామాన్య జనులకుఁ బొడమినచో లోకములో ధర్మహాని వాటిల్లుట" మూఁడవ యనౌచిత్యము. ధర్మము నుపదేశించుట మహాకావ్యము యొక్క ముఖ్యప్రయోజనము గాని యధర్మమును బ్రతిపాదించుట కాదు. ఇట్టి ఘట్టములు మూలమునం దున్నను వానిని ధర్మాను గుణముగా మార్చుటయే కవుల కర్తవ్యము. ధ్వన్యాలోకములో నానందవర్ధనాచార్యులు.

శ్లో॥ అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్।
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా॥

అని యొక్క చెప్పినారు.

శ్లో॥ యత్ స్యాదనుచితం వస్తు నాయకస్య రసస్యవా।
విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్॥

(సాహిత్యదర్పణము)

అని యౌచిత్యానుగుణముగా మూలకథను మార్చుట కాలంకారికులు సమ్మతించినారు. ఇది మహాకవి క్షుణ్ణమార్గమేగాని క్రొత్తది గాదు. "ఐతరేయ బ్రాహ్మణములో "హరిశ్చంద్రో హ వైధస ఐక్ష్వాకో రాజాఽపుత్ర ఆస। తస్య హ శతం జాయా బభూవుః" అని యున్నను ప్రబంధకవులు చంద్రమతి యొక్కతెనే భార్యగా వర్ణించి హరిశ్చంద్రుని యేకపత్నీవ్రతమును నిరూపించినారు. కవి కులగురువగు కాళిదా సభిజ్ఞానశాకుంతలములో మహాభారత కథావిరుద్ధమైనను దుర్వాసుని శాపమును గల్పించి దుష్యంతుని పాత్రను గళంకము లేకుండఁ గాపాడినాఁడు. అట్లే యిచటఁ గూడ శంకరులు కామశాస్త్రము నభ్యసించి యొక చిలుక దేహములోఁ బ్రవేశించి యుభయభారతితో వాదించి జయము నొందినట్లు కథను మార్చుట వెంపరాలవారి కావ్యనిర్మాణ చాతురికి భూషణమే యగును. శ్రీ శంకర చిద్విలాసములో నుభయ భారతీ శంకరసంవాదములో నీ కామశాస్త్ర ప్రఘట్టకముఁ దొలఁగింపఁబడినది. మఱొక్క సంగతి. వ్యాస శంకర సంవాదఘట్టములో వృథాజల్ప మొనరించు వ్యాసుని శంకరులు కొట్టిన ట్లానందగిరి శంకరదిగ్విజయములోఁ గలదు. ఇట్టి ఘట్టములను బెంచి శంకరుల కీర్తికిఁ గళంకము తెచ్చుట కంటె వానిని విడిచి పుచ్చుటయే మేలు.

## రెండు రమణీయ ఘట్టములు

ప్రథమాశ్వాసము నందలి దరిద్రబ్రాహ్మణి కథ. పంచమాశ్వాసము నందలి యాచార్యమండన మిశ్రసంవాదము నిందు మూలము కంటె విస్తరింపఁబడినవి. మాధుకరమునకై శంకరు లొక యింటికిఁ జేర నా బ్రాహ్మణగృహిణి పెట్టుట

కేమియు లేక యొక యుసిరికాయ నాతని చేతిలో వైచినది. ఆమె దారిద్ర్యమును జూచి నంతనే శంకరుల హృదయము కరిఁగినది. ఆమె లేమిని బాపఁ దలఁచి లక్ష్మీ దేవిని శ్రీసూక్తముతో స్తుతించినారు. ఆమె కనికరింపలేదు. అంత శ్రీ విద్యామంత్రమును జపించి స్తోత్రము గావించినారు. ఇచట—

ఉ॥ అంబుధిరాజు నంతటి మహాత్ముని గర్భము నందుఁ బుట్టి పీ
తాంబరు చెట్ట వట్టి యమృతాదుల సోదరివై జగత్ప్రభు
త్వంబునఁ బట్టభద్ర వయి తల్లిరొ! యీ దృశులైన పేదవా
రిం బరికించి లోఁ గనికరింపవు న్యాయమె నీకు నిందిరా!

సీ॥ అన్యాయకృత్య సమాచరణచణాత్ము
లైనవారల గృహాభ్యంతరముల
నక్షకేళీ విహారాయత్త చిత్తదు
ర్వ్యసన సక్తుల పదన్యాసములను
నధ్వగస్వాపతేయ ప్రాణహారక
చోరనాయకుల మంజూషలందు
విటధనాకర్షణ విక్రీత నిజతనూ
పుంశ్చలీదంత సంపుటిక లందు

తే॥ వాస ముంచెదు గాని పాప మ్మెఱుఁగని
సత్యశౌచ దయార్జవశమదమాది
సుగుణనిలయుల నిలయముల్ చొర విదేమి
పాప మోతల్లి! యీ పక్షపాత మేల? (1—174)

అను పద్యములు లక్ష్మీదేవి హృదయమును గూడఁ గరఁగించు నంతటి శక్తి కలవై కరుణారసధారను వర్షించుచున్నవి. శంకరుల స్తవమునకు సంతసించిన లోకమాత కనకామలకధారను వర్షించినది. దరిద్రబ్రాహ్మణి తన భాగ్యము పండిన దని హర్షించినది. ఈ ఘట్టము శ్రీ విశ్వనాథవారి హృదయము నెక్కువగా నాకర్షించినది. 46 పద్యములలో నడిచిన యీ కథ యొక ఖండకావ్యమువలె నొప్పుచున్నది.

రెండవది యాచార్యమండన సంవాదఘట్టము. కుమారిలభట్టు నాదేశాను సారము మండనమిశ్రుని జయించుటకై యాచార్యులు శిష్యులతో మాహిష్మతీపుర మున కేఁగిరి. మండనులు భిక్ష కాహ్వానింపఁగా శంకరులు వాదభిక్ష నర్థించిరి. మండనుఁ డంగీకరించెను. పూర్వమీమాంసను గైకొని మండనుఁడు జీవేశ్వరుల భేదమును నిరూపింపఁ బొచ్చెను. ఉత్తరమీమాంసను గైకొని శంకరులు జీవేశ్వ రైక్యమును ప్రతిపాదించిరి. "తత్త్వమసి" వాక్యముపై శాస్త్రవాదము తీవ్రముగా సాగినది. చివరకు మండనమిశ్రుఁ డోడెను. అంత నుభయభారతి వాదమునకు దిగి చివరకుఁ గామశాస్త్ర విషయములు ప్రశ్నించెను ఆచార్యులు గడువుగోరి కామశాస్త్ర ములు పఠించి గుహలోఁ గళేబరము నుంచి యొక చిలుక దేహములోఁ బ్రవేశించిరి. ఒక శబరుఁడా చిలుక నుభయభారతి కమ్మెను. ఈ చిలుక కాదంబరి యందలి బాణుని చిలుకను, రాజశేఖర చరిత్రమునందలి మల్లనగారి చిలుకను, ప్రభావతి యందలి పింగళివారి చిలుకను మించినది.

సీ॥ అష్టవిధంబైన యవధానముల వేద
ములు తలక్రిందుగాఁ బలుకు నేర్పు
పూర్వపక్షముల నొప్పుగఁ దా ననువదించి
నిర్నిబంధముగ ఖండించు నేర్పు
వాచావిరోధశాఖా చంక్రమము లందు
నిగ్రహస్థాన మొందించు నేర్పు
తతవాఙ్ముఖము లుపోద్ఘాతోపసంహార
గుంఫితమ్ములుగ వ్రాయుచ్చు నేర్పు (5-121)

కలిగి "శుకావతార" మని పేరు వడసినది. ఉభయభారతిలో నాయా శాస్త్రములు చర్చించుచుఁ బ్రసంగవశమున" శంకరు నిరుత్తరుఁ గావించిన నీ ప్రశ్నమున కే నుత్తరం బిత్తునె___

తే॥ ఇంచువిలుకాని కళ లెన్ని యెట్టి వవ్వి ?
వాని నెల పెంచ నెది ? శుక్ల బహుళపక్ష
ములను నెట్లు ప్రవర్తిల్లుఁ బొలఁతు లందు
నెటులఁ దోఁచును బురుషులం దెటులఁ దోఁచు ?

అని కదా భవదీయప్రశ్నంబు" అని మొదలు పెట్టి కామశాస్త్ర రహస్యముల నుద్ఘాటించి యుభయభారతి శంకరులకు సమాధానము లొసఁగి వాత్స్యాయన కొక్కోక మహర్షుల మతములకు సమన్వయము చూపినది. ఆ శుకపాండిత్యమున కుభయభారతి యచ్చెరు వొంది తన సందేహనివృత్తికై భర్తతోఁ గలసి శుకమునుగైకొని శంకరుల యొద్దకుఁ బయన మైనది. ఆ చిలుక "లక్ష్మీనరసింహ! నా కొసఁగుమీ! భవదీయకరావలంబమున్" అని నృసింహస్తవము సగము గావించి క్రిందఁ బడినది. ఆ స్తవమును బూరించుచు గుహ నుండి శంకరులు వచ్చిరి. అట్లు వచ్చిన శంకరులను గాంచి యుభయభారతి—

క॥ తల యెత్తి నీ ముఖం బెటు
తిలకింతున్ జిలుక యనుమతిన్ రతిపతి మి
న్కులు సిగ్గుమాలి నీతోఁ
బలికిన ధార్ష్ట్యమ్ము క్షమించి వచ్చిన దేవా!

తే॥ శుకము పద్యార్థమును బఠించుచునె కూలి
ప్రాణము వొలంగ గుహనుండి పయి సగంబు
చదువు చేఁతెంచు నినుఁగాంచు సమయ మాది
నొడలు చచ్చిన య ట్లయి యున్న దాన (5—204)

అని క్షమాపణము వేడుకొని శంకరులు పరమశివుఁ డని గుర్తించినది. శంకరులు కూడ నుభయభారతిని శారదావతారముగా గుర్తించిరి. ఈ మార్పుచేఁ బూర్వోక్తానౌచిత్యదోషములు తొలఁగుటయే కాక స్త్రీలతోఁ గామశాస్త్ర విచారము గూడ దను నీతి శంకరుల చర్యవలన, స్త్రీలకు లజ్జయే సహజభూషణ మను నీతి యుభయభారతి పలుకుల వలన ధ్వనించుచున్నవి. అష్టమాశ్వాసములో యమమతనిరాసప్రసంగములో నాచికేతూపాఖ్యానము కఠోపనిషత్తు ననుసరించి విస్తరింపఁబడినది. ఇట్లే కథలు మూలము కంటె విస్తృతి వహించినను యథాసందర్భముగా నదుకుటచేఁ గథావస్తువున కేకత్వము సిద్ధించినది.

## కవితాశైలి

శాస్త్రిగారిది ప్రసన్న గంభీరమైన శైలి. మూలకావ్యములోఁ బెక్కు శ్లోకములు గౌడీరీతిలో సాగినవి. అట్టి శ్లోకము లందలి సమాసములు చెడకుండఁ దెనుఁ

గునకుఁ దెచ్చుట యొక నేర్పు. వ్యర్థములగు పదములు చొరకుండ నన్వయకాఠి న్యము లేకుండ సుదీర్ఘ సంస్కృత సమాసములు చేర్చుట యందును వీరికిఁ గల కౌశలము నిరుపమానము.

అనువాదపద్ధతిని దిలకింపుఁడు——

శ్లో॥ జాటాటీరజటాకుటీరవిహరన్నైలింపకల్లోలినీ
క్షీణీశప్రియకృన్నవావతరణావష్టంభగుంభచ్ఛిదః
గర్జంతోఽ వతరంతి శంకరగురుక్షోణీధరేంద్రోదరా
ద్వాణీనిర్ఝరిణీఝరాః క్వ ను భయం దుర్భిక్షుదుర్భిక్షుతః॥

శా॥ జాటాటీర జటాకుటీతట నట త్స్వర్ణిమ్నగా భూమిలో
కాటాట్యప్రథమావతార పటుగర్వాటోప లుంటాకమై
ఘాటిన్ గర్జిలు శంకరాచల లుఠ ద్వాణీస్రవం తీఝరుల్
దూటాఁడున్ జగదీభయప్రదపులౌ దుర్భిక్షు దుర్భిక్షముల్.

శ్లో॥ సాహంకార సురాసురా వళికరా కృష్ణభ్రమన్మందర
క్షుబ్ధక్షీరపయోబ్ధివీచి నచితైః సూక్తైః సుధావర్షణాత్।

అను మాధవీయ శంకరవిజయములోని సమాసము

శ్లో॥ సాహంకార సురాసురావళికరా కృష్టభ్రమన్మందర
క్షుభ్యత్ క్షీరధి వల్గువీచివలయశ్రీగర్వ సర్వంకషాః।

జగన్నాథుని రసగంగాధరములో సమానముగాఁ గన్పట్టుచున్నది.

దీన్నికి వెంపరాళవారి యనువాదము.

శా॥ సాహంకార సురాసురౌఘకరకర్షా ఘూర్ణ దుద్దామ మం
థాహార్యక్షుభితామృతార్ణవ తరంగాకార వాచా సుధా
వ్యూహాసారమునన్ భవాహ్వయదవాగ్ను్యద్విగ్నమౌ జంతుసం
దోహం బొందెడు తాప మార్చు గురుఁ డెందున్ నుత్యుఁడౌ టబ్రమేః

ఇట్లు మూలము నందలి సంస్కృతసమాసము లెన్నియో యందము చెడకుండ నాంధ్రానువాదమునఁ బ్రతిబింబించినవి. ఇంకఁ దెలుఁగుపలుకుల కూర్పునకు రెం డుదాహరణములు చూపుచున్నాను.

శ్లో॥ విక్రీతా మధునా నిజా మధురతా దత్తా ముదా ద్రాక్షయా
క్షీరైః పాత్రధి యార్పితా యుధి జితాల్లబ్ధా బలా దిక్షుతః।
న్యస్తా చోరభయేన హంతి సుధయా యస్మాదతి స్తద్గిరాం
మాధుర్యస్య సమృద్ధి రద్భుతతరా నాన్యత్ర సా వీక్ష్యతే॥

ఉ॥ తియ్యఁదనంబు నంతియును దేనియ యమ్మెను ద్రాక్ష ప్రీతిచే
నొయ్యన నిచ్చెఁ బాత్ర మను నూహను క్షీర మొసంగె నిక్షువున్
గయ్యము నందుఁ గోల్పడె వగన్ సుధ చోరభయాప్తి డాఁగెఁ గా
కెయ్యెడ లేని తియ్యదన మెట్టులఁ గల్గెను కంకరోక్తికిన్. (2–43)

ఇవి యనువాదమువలెఁ గాక సొంత పద్యముల వలె నలరారుచున్నవి.

## పూర్వకవ్యనుకరణములు

శాస్త్రిగారు పూర్వకవుల ననుకరించు స్వభావము గల వారు కాక పోయినను వాల్మీకి నుండి నేఁటి వఱకుఁ గల సంస్కృత సాహిత్య సముద్రమును, నన్నయభట్టు నుండి చిన్నయ్యసూరి వఱకుఁ గల యాంధ్రసాహిత్య సముద్రమును నాపోశనము పట్టినవా రగుటచేఁ గొన్ని యనుకరణములు తప్ప లేదు. శ్రీనాథమహాకవి వలె వీరు కూడఁ దమ కావ్యములో మూలేతరశ్లోకములను సంఘటించిరి. మచ్చునకుఁ గొన్ని యనుకరణములను జూపుచున్నాను.

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మా ద్వబాహు రపరో హరిః।
అఫాలలోచనః శంభు ర్భగవాన్ బాదరాయణః॥

తే॥ నాల్గు మోములు డాఁచిన నలువ యతఁడు
రెండు చేతుల నారాయణుం డతండు
కన్ను నొసటను లేని ముక్కంటి యతఁడు
వ్యాసముని నాఁగ సామాన్యుఁ డని తలంతె ? (3–257)

భర్తృహరి

శ్లో॥ స్తనౌ మాంసగ్రంధీ కనకకలశా విత్యుతమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపి చ శశాంకేన తులితమ్।
స్రవన్మూత్రక్లిన్నం కరివరశిరఃస్పర్ధి జఘనమ్
మహుర్నింద్యం రూపం కవిజనవిశేషై ర్గురుకృతమ్॥
(వైరాగ్యశతకము–16)

సీ॥ లాలాంబుఝురపరిప్లావితంబగు లేమ
మోవి యెట్లమృతంపు బావి యగును (చూ-శం 2–140)

కాళిదాసు

శ్లో॥ నిధానగర్భామివ సాగరాంబరాం, శమీ మివాభ్యంతర లీనపావకామ్।
నదీ మివాంతఃసలిలాం సరస్వతీంనృపః ససత్వా మ్మహిషీ మమన్యత॥
(రఘు–3–9)

ఉ॥ అంబుజబంధుగర్భయగు ప్రాగ్దిశ యొప్పు (శం. వి. 1–87)

ఇట్లే "రింఖదధర్మ" (9–89) అను పద్యములో "శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్" (కుమా–5–33) అను కాళిదాస కుమారసంభవ శ్లోకవాక్యము గ్రహింపబడినది.

వేంకటాధ్వరి

శ్లో॥ శ్రేయాంసి భూయాంసి మహావదాన్యః ప్రేయాన్ ప దేయా జ్జనకాత్మజాయాః।
కాకాయ కంకాయ చ యోఽదితేష్టం దాశాయ కీశాయ చ రాక్షసాయ॥
(విశ్వగుణాదర్శము)

సుగంధి....కంకకాకదాశకీశ కామితార్థదాయకా। (శం. వి. 5–272)

శ్లో॥ మిథ్యౌషధై ర్ధూంత: మృషాకషాయై రసహ్యాలేహ్యై రయథార్థతైలై:।
వైద్యా ఇమే వంచితరుగ్ణవర్గా: పిచండభాండం పరిపూరయంతి॥

శ్లో॥ న ధాతోర్విజ్ఞానం న చ పరిచయో వైద్యకనయే
న రోగాణాం తత్త్వావగతి రపి నో వస్తుగుణధీ:।
తథాప్యేతే వైద్యా ఇతి తరలయంతో జడజనా
నసూన్ భృత్యా మృత్యో రివ వసు హరంతే గదజుషామ్॥

(విశ్వగుణాదర్శము)

సీ॥ వాతపిత్త శ్లేష్మవైవిధ్య మెఱుఁగరు
వైద్యకజ్ఞానలవంబు గనరు
రోగకారణము నిరూపింప నేరరు
వస్తుగుణంబు లేవంకఁ దెలియ
రన్నతలేహ్యములు మిథ్యౌషధమ్ములు గూర్తు
రయథార్థతైలమ్ము లాచరింతు
రకట: మృషాకషాయములు పచింతురు
దంభమ్ము గర్వమ్ము దలఁగ నేర

తే॥ రామయుల పాలిటికి ద్రవిణాశఁ బుడమి
కవతరించిన యమభటు లనఁగ నద్య
తన భిషక్కులు పెక్కు రుక్కునఁ బిచండ
భాండమును నింపుకొంద్రు భూభార మడఁచి (శం. వి. 9–81)

శ్రీనాథుఁడు

ఇంకఁ దెలుఁగు కవులలో శ్రీనాథుఁ డనిన వీరికిఁ బ్రాణమగుటచేఁ గొన్ని తావులం దనుకరించిరి.

సీ॥ సింహాసనము చారుసితపుండరీకంబు
చెలికత్తె చెలువారు పలుకుఁజిలుక
శృంగారకుసుమంబు చిన్ని చుక్కలరాజు
పసిఁడి కిన్నెరవీణ పలుకుఁదోడు
నలువ నెమ్మోముఁదమ్ములు కేళిగృహములు
తళుకుటద్దంబు సత్కవుల మనసు
వేదాదివిద్యలు విహరణస్థలములు
చక్కని రాయంచ యెక్కిరింత

యెపుడు నేదేవి కాదేవి యిందుకుంద
చంద్రచందన మందారసారవర్ణ
శారదాదేవి మామకస్వాంతివీధి
నిండు వేడుక విహరించు చుండుఁ గాత! (శృ. నై. 1–5)

సీ॥ నలువ నెమ్మొగములు నాట్యమందిరములు
ధవళాంబురుహము ముత్యాల గద్దె (శం. వి. పే. 5)

ఉ॥ కందవు గాజుపాఱవు వికారము నొందవు పూతిగంధముం
జెందవు వాడ వప్పురము సీమల నల్లడ వామకర్ణముల్
క్రిందుగ దీర్ఘనిద్రలు ధరించి శయించిన జంతుదేహముల్
సుందరి! యిట్టి చోద్యములు చూడము తక్కిన తీర్థభూములన్
(కాశీ–3–105)

చ॥ కలఁగదు తాప మెక్కదు వికాసము దప్పదు వేసరిల్ల దు—
(శం. వి. 1–7)

సీ॥ పరిపూర్ణహేమకుంభములు హస్తంబుల
ధరియించి యిరువంకఁ గరులు గొలువ
బహుళమై వరశంఖపద్మ మహాపద్మ
మకరాది నిధులు నేమమునఁ గొలువ

వింజామరలు దాల్చి వెనుక దిక్కున దేవ
గంధర్వగుహ్య కాంగనలు గొలువ
నెలవంక బలువంక నింద్రాది దివిజులు
సేవాంజలులు మౌళిఁ జేర్చి కొలువ

తే॥ ధర్మపంకజకర్ణికా భద్రపీఠి
కాగ్రమున నిండు కొలువుండి యఖిలలోక
రక్షణము సేయు నిన్నేను బ్రస్తుతింతు
నసమ సౌభాగ్యగుణధన్య! యద్రికన్య! (కాశీ—3-48)

సీ॥ క్షీరార్ణవాంతర శ్వేతాంత రీపమ్మ
నందు సంఫుల్ల పద్మాకరమునఁ (శం. వి. 1-17)

సీ॥ కఠవల్లిఁ బఠియించుఁ గఠము సంశోధించుఁ
బ్రాణోపనిషదభిప్రాయ మరయుఁ
బరిపాటి ముండకోపనిషత్తుఁ దాపనీ
యోపనిషత్తు నభ్యుపగమించు
దఱియు నధర్వవేదశిరః ప్రపంచంబు
లారణ్యకము త్రోవ లరసి చూచుఁ
బ్రశ్నోపనిషదర్థ పరిమళంబు గ్రహించు
శ్రీ భగవద్గీతఁ జిత్తగించుఁ

తే॥ దలవకారంబు శ్వేతాశ్వతరము ననెడు
నుపనిషత్తులు దలపోయు నొయ్యనొయ్యఁ
గాశికాక్షేత్ర విప్రయోగ ప్రభూత
హృదయ సంతాతశాంతికై యిల్వలారి (కాశీ—2-151)

సీ॥ కఠవల్లి తోడ శిక్షావల్లి శోధించు
వర్ణించు నానందవల్లి యలరి (శం. వి. 2—69)

ఇందలి "జనురత్యయతోయము" (6—176—178) అను తోటకాచార్యుని పద్యములు

చదువు నపుడు కాశీఖండమునందలి బృహస్పతి చదివిన తోటకపద్యములు (కాశీ. 4-249—251) గు ర్తునకు వచ్చును. అట్లే

"వేదపురాణశాస్త్ర పదవీనదవీయసి యైన" (కాశీ-7-161) అను పద్యపాద మును గు ర్తునకుఁ దెచ్చును.

"వేగమెలర్ప నయ్యతి దలీయసియౌ పదవిన్ గ్రమించి" (శం.వి.-3-13) అను పద్యపాదము

పోతన

"విద్యావతాం భాగవతే పరీక్షా" యని లోకము నందలి యాభాణకము. శంక రుల నిత్యపారాయణగ్రంథములో భాగవత మొకటి. చిన్ననాఁడే తల్లికి భాగవతము చదివి వినిపించెడి వారు.

సీ॥ జనకుఁ గాదని నృసింహుని జేరు ప్రహ్లాదు
నవితర సామాన్యమైన భ క్తిఁ....
బసిపాపఁడయ్యుఁ దపః పటిష్ఠత ముకుం
దుని పదం బంటిన ధ్రువుని శ క్తి
నిస్సంగుఁడై గోచి నేని దాల్పక విరా
గకళావతారమౌ శుకుని ర క్తి
సంగదోషమున సారంగమై విప్రుఁడై
తరియించు నా జడభరతు ము క్తి

సాంద్రమోదాశ్రు రోమాంచ జడిమ ఘర్మ
ముఖ్య సా త్త్విక భావ సమ్ముద్రితాంగుఁ
డగుచు భాగవతపురాణ మంబ కొఱకుఁ
జదివి వివరించె నారేయి శంకరుండు (శం. వి. 2-165)

ఈ యాంధ్రీక ర్తలు కూడఁ బోతన భాగవతభక్తు లగుటయే కాక "పోతన" యను గ్రంధమును రచించిన వారు. పై పద్యములోఁ బోతనగారికిఁ బ్రియమైన యంత్యాను

ప్రాసము వాడుట విశేషము. దుష్కరప్రాసములు, యమకములు, వంత్యానుప్రాసములు నెత్తుకొని పద్యముల నవలీలగా నడిపించుటలో నాంధ్రసాహిత్యములోఁ బోతనగారి దగ్రతాంబూలము. శాస్త్రిగారు హడ దుష్కరప్రాసములను హేలగా నడుపుటలో సమర్థులు.

శా॥ సంధ్యానాసట దిందుశేఖర .... .... .... .... (5–1)

శా॥ ఆశ్చర్యంబున ముగ్ధి .... .... .... .... .... (2–195)

క॥ అస్త్రాయిత తృణఖండ.... .... .... .... .... (5–271)

ఇందు క్త; క్ష; ంఖ; గ్ర; చ్ఛ; డ్వ; ణ్య; త్య; త్ర; త్వ; త్ర్య; త్స; ద్వ; ధ్య ంధ్య; న్మ; న్య; ప్త; ప్ర; భ్య; భ్రి; ర్క; ర్గ; ర్జ; ర్ణ; ర్ద; ర్య; ర్వ, ర్హ; ల్య; వ్య; వ్ర; శ్చ; శ్వ; ష్ట; ష్మ; స్త; స్థ స్త్ర; ; హ్మ; మొదలగు కఠిన ప్రాసములు వాడఁబడినవి.

క॥ క్రూరుఁడుఁ గాపాలికమత
చారుఁడ సద్వ్యయమతాభిచారుఁడఁ బాపా
చారుఁడ జారుఁడఁ జోరుఁడ
భీరుఁడ నీ కడను గప్పి పెట్టుట మేలా! (6–75) (8-412) (9–110)

క॥ విడువుఁడు భ్రష్టాచారము .... .... .... .... (8–412)

క॥ వాయువుననొ మాయువుననొ .... .... .... (9–110)

ఈ పద్యములు పూర్తిగాఁ బోతనగారి శైలిలో నడచినవి. ఇందలి యంత్యానుప్రాసములను శబ్దాలంకారప్రకరణములోఁ జూపుచున్నాను.

తెనాలి రామకృష్ణుఁడు

వీరికిఁ దెనాలివారి కవిత్వమనంగ మక్కువ యెక్కువ.

సీ॥ [illegible]
[illegible]

సీ॥ కంఠదఘ్నాంబు మగ్నశరీరుఁడై పుండు
వంటి సీతున నుండు వడఁక కుండ

(మునిత్రయ చరిత్రము 2—64)

అని రామకృష్ణుని మునిత్రయ చరిత్రమునందె యనుకరించినారు. సాధారణముగా మన ప్రబంధకవులు నాయికానాయకుల సౌందర్యమును వర్ణించు నపుడు పద్యములనే వ్రాయుదురు. రామకృష్ణుఁడు మాత్రము పాండురంగ మాహాత్మ్యములో రాధాదేవిని వర్ణించు నొక సుదీర్ఘ వచనము ననుసంధించినాఁడు వీరు కూడ శంకరుల సౌందర్యమును వర్ణించుచు నొక వచనమును రచించిరి. ఈ రెంటికిఁ బోలిక లెక్కువగాఁ గలవు.

ధూర్జటి

ధూర్జటి మహాకవి రచించిన శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యమునకు శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు లఘుటీకను వ్రాయఁగా దానిని వ్యాఖ్యానముగా విస్తరించి రూపు దిద్దినవారు వెంపరాలవారు. అట్టి ధూర్జటిని వీరనుకరించినవి రెండు తావులు గలవు.

చ॥ చెలువకు బిడ్డకుట్టు విలసిల్లఁగ భిల్లపురంధ్రు లంతలోఁ
బిలువరె! మంత్రసానిఁ దలపెట్టరె! కాయము గూర్ప లేమకున్
జలకముగాఁచరే కొలను చయ్యన త్రవ్వరె! మందగామినిన్
నిలువఁగ నీకురే! యనుచు నేర్పరులై కడు సంభ్రమింపఁగన్.

(కాళహస్తి—3—26)

సీ॥ మంత్రసాని కిఁకొక్క మాఱంపరే! వార్త
యాలసించినదేమొ యరయుఁ డనుచుఁ
గ్రచ్ఛఱ నారణ్యక శ్రుతి మంత్రోద
కముల సంపాదింపఁ గడఁగుఁ డనుచు
నిలువలేకున్నది మెలఁత శివాలయం
బున నందిఁ ద్రిప్పిరాఁ జనరె యనుచుఁ

గార్తాంతికులు ప్రొద్దు కట్టుకోఁదగు సమ
యంబు శీర్షోదయం బయ్యె ననుచుఁ

తే॥ జల్లరేః కలినీళ్ళు కంచంబు గొట్టి
చెచ్చెరఁ బరుండఁ బెట్టరే చేట లోనఁ
జూచెదరదేమె వేన్నీళ్ళు కాఁచ కనుచుఁ
జెలుల యెలుఁగులు పురుటింటఁ గలయఁ గ్రమ్మె.

(మునిత్రయఖా–4–169)

శా॥ కాంచెన్ వంచితపాంచ భౌతిక సుఖాగారాంగమున్ జిన్మటీ
సంచారాంచితరంగమున్ మునిమనః సమ్యక్పరిష్వంగమున్
బంచాస్త్రాసుమరు ద్భుజంగము కృపాపాణింధమాపాంగమున్
బ్రాంచన్ముక్తికళత్రసంగము ఫణారాజన్మహాలింగమున్

(కాళహస్తి–1–112)

చ॥ నతజనమోహభంగము ననంతపథస్పృగమేయశృంగమున్ (శం.వి. 6-5)

ముప్వురు మహాకవులు

ఈ శతాబ్ది యుత్తరార్ధములోఁ దిరుపతి వెంకటకవుల యుగము గతించిన పిమ్మటఁ బ్రాచీన సంప్రదాయము ననుసరించిన ముప్వురు మహాకవులు గలరు. ప్రాచీన కావ్యములతోఁ దులఁదూఁగు మూఁడు మహాకావ్యములు గలవు. మొదటివారు విశ్వనాథవారు. రెండవవారు పెంపరాలవారు. మూఁడవవారు మధునాపంతులవారు. మొదటిది రామాయణ కల్పవృక్షము. రెండవది శంకర విజయము. మూఁడవది యాంధ్రపురాణము. వీనిలో రామాయణ కల్పవృక్షము శంకరవిజయములకుఁ గొన్ని పోలికలు గలవు. విష్ణుమూర్తి యవతారమై జన్మము నెత్తించిన శ్రీరామచంద్రుని పవిత్ర చరిత్రమును వర్ణించి రామార్పణమైనది కల్పవృక్షము. మహాశివుని యవతారమై జన్మము నెత్తించిన శ్రీ శంకరభగవత్పాదుల పావనజీవనమును వర్ణించి రామార్పణమైనది శంకరవిజయము. మొదటి కృతికి ప్రేరకులు శ్రోతలు మహాత్ముల సంస్థానాధి

పతులు శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళిగారు. రెండవకృతికిఁ బ్రేరకులు శ్రోతలు శ్రీవెంకట రామాముద్రణాల యాధిపతులు శ్రీమదీదర వెంకటరావుపంతులుగారు. ఇవి రెండును ప్రౌఢప్రబంధములే. ఇద్దఱిది విలక్షణమైన శైలియే. ఓజోగుణభూయిష్ఠముగా నడచిన పద్యములు రెంటను గలవు. కావ్యములు రెండును వ్యాఖ్యానము నపేక్షించునవి.

శా॥ హేరంబోన్నత శూర్పకర్ణవివర హ్రీకారియై షణ్ముఖ
స్ఫారద్వాదశ నేత్ర గోళవివృత ప్రాకారమై శైలక
న్యారాజ న్నవఫాలమండల విభుగ్నక్రీడమై యాశ్చల
ద్దీర్ఘుగ్రప్రమథంబుగా ధనువు మ్రోఁగెన్ దేవలోకంబునన్
(కల్పవృక్షము)

శా॥ ప్రావృట్కాల విజృంభమాణ ఘనధీరధ్వానడింభంబు.... (శంకరవిజయము)

శా॥ సంధ్యావేళలఁ బ్రాచి నిర్జలదమై సాఁగన్ బ్రతీచీదిశా
వంధ్యప్రక్రియ మేఘముల్ మెఱుపులున్ వాల్లభ్యకాంతిప్రభా
కంధ్యుల్లోల తరంగభాగ్ఝరి ధనుఃకాండంబులై యేఁచఁగా
నాంధ్యం బొక్క దెసన్ మఱొక్క దెస మార్తాండ ప్రభాముద్రలై.
(కల్పవృక్షము)

శా॥ సంధ్యానానట దిందుశేఖర శిరశ్చంచ ద్వియన్నిమ్నగా.... (శంకరవిజయము)

ఇట్లు దీర్ఘ సమాసములతోడను దుష్కరప్రాసములతోడను నడచిన పద్యములు రెండు కావ్యము లందును సమానము.

సీ॥ మహి వేదము స్వతః ప్రమాణమా పరతః ప్ర
మాణమా యనెడు సంభాషణముల
ఫలము నిచ్చునది నిచ్చలు కర్మమా పర
మాత్మయా యనెడు వ్యాహారములను
జగము శాశ్వతమా యశాశ్వతమా యంచుఁ
గెరలి వాదించెడి గీః ఫణితుల
యత్యాశ్రమంబొ గృహస్థాశ్రమంబొ మో
క్షదాయకంబగు ననెడు నుడులఁ

తే॥ గిరభామిను లేగృహద్వారబద్ధ
పంజరస్థమ్ములై శాస్త్రపటలి శ్రుతులఁ
జదివి వాదించు కొనుచుండు నదియ మాశ్ర
ఘుండు మండన పండితుం డుండు గృహము (శ. వి. 4–122)

వెంపరాలవారు వర్ణించిన యీ చిలుకలు మండనమిశ్రుని యింటఁ బెరిగిన వగుటచేఁ బండితులతో వాదమునకుఁ గాలు ద్రవ్వుచున్నవి.

మ॥ సమరం బిమ్మర! పాఱిపోకుర! తురాసాహ! నిరీహా! యటం
చమరీకైశిక సూనముల్ తునిఁగెరా! యంచున్, గడించెన్ యశం
బమరేభం బిది కుంభయుగ్మమున వ్రయ్యల్ వారియంచున్ వచో
భ్రములై చావడు లందుఁ బంజరశుకీవారంబులుం బల్కెడున్.
(కల్ప–సుందర–232)

విశ్వనాథవారు వర్ణించిన యీ చిలుకలు రాక్షసుల యింటఁ బెరిగిన వగుటచే దేవతలతోఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వుచున్నవి.

ఈ రెండు మహాకావ్యములు తకారద్విత్వ ప్రాసము సమశ్లైలి గల మంగళ మహాశ్రీవృత్తముతో ముగియుట యొక విచిత్ర సంఘటనము. పఠింపుఁడు.

చిత్తభవకోటిశత శృంగహరణక్షమ విశిష్టకమనీతర రూపా!
మత్తసురశాత్రవ సమాజ విచలత్తిమిరమండల విపాటన నవార్కా!
యుత్తమ తపస్వి హృదయోదరనట త్పదపయోజయుగ! మంగళమహాశ్రీ
వృత్త విమలామృత పవిత్రిత జగత్త్రితయ! వేదచయ నిశ్శ్వసితధామా!
(శంకరవిజయము)

చిత్తజ తనూభసిత శేఖరిత రేణు పరిశీర్ణనిచయ స్నపితభావా!
మత్తగజచైత్య గళ మంథరనవాస్త్ర గతి మంజుల తనూకలితహేలా!
వృత్తదళ ముక్తిరువిస్ఫుటిత భక్తఫల విద్యుతి తమోదరస రూపా!
ప్రాత్తనిజ ధర్మచయ రక్తజన తాకృతి పరంపరిత మంగళమహాశ్రీ!
(కల్పవృక్షము)

విశ్వనాధవారి కల్పవృక్షము, వెంపరాలవారి శంకరవిజయము మధునాపంతులవారి యాంధ్రపురాణము చిరకాలము మనఁగల గ్రంథములు.

## ఛందో విశేషములు

"సర్గై రనతి విస్తీర్ణైః శ్రవ్యవృత్తైః సుసంధిభిః" యను దండాచార్యుల వచనము ననుసరించి యీప్రబంధమునం దుత్పల చంపకమాలాది సామాన్యవృత్తములే గాక మాలిని, పృథ్వి, పంచచామరము, ఉత్సాహము, తోటకము, స్వాగతము, మత్తకోకిల, భుజంగప్రయాతము, వనమయూరము, మంగళమహాశ్రీ, దండకము, మొదలగు విశేషచ్ఛందములు వాడఁబడినవి.

యతివిశేషములు ;

ఆంధ్రలాక్షణికులకు వ్యాకరణాంశముల కంటె యతి ప్రాసములను నియమించుటలో నభినివేశము మెండు. తెలుఁగు కవుల సామర్థ్యము యతిప్రాసములను బట్టి నిర్ణయించుట పరిపాటి. అందువలననే యడిదము సూరకవి "కవిత నేరుపు యతిఁగూర్చు కైపె దెలుపు" నని రామలింగేశ్వర శతకములోఁ జెప్పినాఁడు. ఇందు సామాన్యయతులే గాక ఛందశ్శాస్త్రములలోఁ జెప్పఁబడినవి. ఛంధశ్శాస్త్రము నభ్యసించు వారికి వీని పరిశీలన మావశ్యకము. కొన్ని యతుల నప్పక వీయానుసారము చూపుచున్నాను.

మ॥ శంకరుఁ డర్థిన్ దెలుపున్ మహాత్ములకు జిజ్ఞాస్యార్థముల్ పెల్లుగన్ (3-10)

శా॥ జ్ఞానానందమయుండె శిష్యులకు రక్షాదీక్ష మర్త్యాకృతిన్ (3—82)
ఇవి విశేషవళులు.

సీ॥ జ్ఞానగర్వులు యతుల్ నను యడించప రటంచు (3—12)
ఇవి తద్భవవ్యాజయతులు

మ॥ మృదువాగ్ధారలు కల్పసూనలహరుల్ హృద్యైతదీయార్ధ
ఇవి ఋత్వసామ్యవళులు

సీ॥ ఋత్విగ్గణంబు గాటించు వారు (4—12)
ఇది ఋవళి

సీ॥ కష్టధమ్మిల్లమల్లీస్రజంబు (3–183)

ఇది ఇవళి. దీనిననంతుఁడు ఛందోదర్పణములోఁ పేర్కొనినాఁడు.

మ॥ కాంతురు జ్ఞానుల్ తమ జ్ఞానశక్తి కొలఁది న్లోకంబులం దన్నిటన్ (3-261)

ఇవి బిందుయతులు

మ॥ అని తద్ధ్యాన వథావతీర్ణుఁ డయి దత్తాత్రేయుఁ డగ్గించుచుం
డనె కైలాసము శంకరుం డగజ విఘ్నస్వామి షాణ్మాతురుం
డును నందీశ్వరముఖ్యపారిషదులందున్ దోఁచి వీక్షించుచుం
డనె శీతాద్రియ రాజతాద్రియయి కన్పట్టన్ యతీ శానుఁడున్ (9-27)

ఇందు మూఁడవ పాదమున ననుస్వార సంబంధయతి.
రెండు నాలుగు పాదములలో ననునాసికాక్షరయతి.

శా॥ మీమాంసాగమవజ్రపంజరము బంహిష్ఠార నిక్షేపము (4–8)

ఇందు మవర్ణ విరామము.

చ॥ యతిపతి మ్రోల వ్యాసముని కంటెను మున్ గపిలర్షిపై ఖరిన్ (8–424)

ఇది పంచమీ విభక్తి విరామము.

తే॥ దేహ మూఁది జీవాత్మ యెందే నియోఁగు (8-226)

ఉ॥ నీదు వృథాప్రతాప మిఁక నేనియు (8-324)

ఇందలి యేని శబ్దములు, ప్రాదులు, నిత్యసమాసములు, నఞ్ సమాసములు మొదలగు వాని కచ్చుతోడను హల్లుతోడ నుభయవళులు చెల్లును. శాస్త్రిగారి కావ్యములోఁ గొన్ని శబ్దములకు రెండు యతులను వాడి చూపినారు.

ప్రాణశబ్దమునకు

తే॥ ఆయువు సమాప్తమగు దాఁకఁ బ్రాణికోట్లు (4-192)

ఆ.వె. ప్రాణ మెల్ల దాని పైనె యుండు (7–103)

రుద్రాక్షశబ్దమునకు

సీ॥ రుద్రాక్షధారణ శివు ననుకరింప (3–214)

సీ॥ తాల్చె వక్షమున రుద్రాక్షమాలికలతో (2-123)

స్వాంతశబ్దమునకు

తే॥ అగుచు నీర్ష్యాభరాకుల స్వాంతు లగుచు (3—141)

క॥ స్వాంతుండై యిట్టు లడిగె సవినయఫణితన్ (6-83)

సిద్ధాంతశబ్దమునకు

ఉ॥ సి ద్ధాంతము లభ్యసింప గడు వంది చనెన్ గద (5—159)

ఉ॥ సి ద్ధాంతములన్ దనర్చు యతి తల్లజు భాష్యము (3—236)

సాష్టాంగశబ్దమునకు

శా॥ హారున్ శంకరుఁ జేరి తా నలిపె సాష్టాంగప్రమాణంబులన్ (4—156)

శంకరాచార్యుఁ గొలుతు సాష్టాంగ నతుల (శ.వి.పీ. 7)

ద్వీపశబ్దమునందలి యచ్చునకు

చ॥ ఋత మగు బ్రహ్మఁ దాఁ బొడమి ద్వీపమునందు (3-226)

కుతికంటు (కుతిక + అంటు) శబ్దము నందలి యచ్చునకు

చ॥ అసువులు కంట నిల్పి కుతికంటునఁ జేలకొనన్ (1—176)

ఎడాట (ఎడ + ఆట) శబ్దమునందలి యచ్చునకు

చ॥ అకట మహానుభావుల యెడాటమునన్ (శం. వి. 7—50)

దీనికి విజయవిలాసము నందుఁ జేమకూరవారి ప్రయోగము

చ॥ అన్నలపట్లఁ దమ్ముల యెడాటమునన్ నముఁ డంచు నెన్నఁగా (1—27)

ఇట్లే యిందలి నారాయణ (2-164) క్రచ్చుఱ (2-167) ద్వైపాయన(3-44) నారాయణ, బాదరాయణ (3—258; 8—399) నా స్తిక (4—95) ద్వార (4—156) నాక (5-41) ఉదార (7—56) పరాయణ (7—217) ఉపాస్య (8—106) ఉపేత (8-129) ఔద్ధత్య (8—418) రసాయన (2-29; 9—100) మొదలగు యతివిశేషములు పాఠకు లెఱుంగవలయును.

ఋప్రాసము :

ఉ॥ నీ ఋణ మెట్లు దీర్చుకొన నేర్తు మకారణ మేఁగుదెంచి బం
గార మొనర్చితయ్య .... .... .... .... .... (శం. వి. 1–179)
దీనికిఁ బూర్వకవుల ప్రయోగములు

క॥ ఆ ఋషి కుమారు కట్టిన, చీరలు నతిమృదులములు(నన్నయ-అరణ్య-3-104)

క॥ ఆ ఋషుల పృశ్న మంగీ, కారం బొనరించి (పాండు–1-97)

## వ్యాకరణ విశేషములు

మూలకావ్యకర్త లగు మాధవ విద్యారణ్యులు పాణినీయ ధాతువృత్తి విధాతలు. ఆంధ్రీకర్త లుభయభాషా వ్యాకరణజ్ఞులు నగుటచే మూలము నందలి వ్యాకరణ రహస్యప్రయోగము లన్నియు నిందుఁ బ్రతిబింబించుటయే కాక కొన్ని క్రొత్త ప్రౌఢ ప్రయోగములు కూడ వచ్చి చేరినవి. ఈ ప్రయోగముల ప్రక్రియను జూపినచో గ్రంథము పెరుగు నను తలంపుతో రెండు పద్యములను మాత్ర ముదాహరించుచున్నాను.

శ్లో॥ కలశాబ్ధికచాకచిక్షమం క్షణదాధీశ గదాగదిప్రియమ్।
రజతాద్రి భుజాభుజిక్రియం చతురం తస్య యశః స్మ రాజతే॥

తే॥ కలశవారాశితోఁ గచాకచి యొనర్చి
కైరవాప్తునితో గదాగది యొనర్చి
రజతశైలంబుతో భుజాభుజి యొనర్చి
యుల్లసిలు శంకరార్యు సంపుల్లయశము (2-50)
"కచేషు కచేషు గృహీత్వా, గదాభిశ్చ గదాభిశ్చ ప్రహృత్య,
భుజైశ్చ భుజైశ్చ ప్రహృత్య-ఇదం యుద్ధం ప్రవృత్తమ్॥

అను విగ్రహమున" తత్ర తేనేదమితి సరూపే (2-2–27) అను సూత్రముచే బహువ్రీహిసమాసమునందు "అన్యేషా మపిదృశ్యత్" (6-3-137) అను సూత్రముచేఁ బూర్వపదాంతమునకు దీర్ఘము వచ్చి "ఇచ్ కర్మవ్యతిహారే" (5-4-127) అను సూత్రముచే సమాసాంతమున కుఇచ్ ప్రత్యయము వచ్చి కచాకచి గదాగది, భుజాభుజి యను రూపము లేర్పడెను.

ఇట్లే "కాణాదసేనాముఖమున ఖడ్గాఖడ్గి" (7–136) అను పద్యములో ఖడ్గాఖడ్గి, శస్త్రాశస్త్రి, యష్టీయష్టి, గదాగది యను ప్రయోగములు వాడఁబడినవి.

ఈ కావ్యములో మిక్కిలి విచిత్రప్రయోగములు గల పద్యము

తే॥ చేరి తన్ను శుశ్రూషించు శిష్యజనుల
కామము సమూలఘాతమ్ముగా వధించు
సరవి రోషంబు చూర్ణపేషముగ నూఱెఁ
జెండె లోభాదికముఁ దృణచ్ఛేదమగును (2–20)

ఇచట మూలములో "సమూలఘాత మవధీత్" చూర్ణపేషమపిషత్, తృణసముచ్ఛేదంసముచ్ఛిచ్ఛిదే" అను ప్రయోగములు గలవు. ఇవి ణములంతము లగు ధాతువులు. సమూలాకృతజీవేషు హన్ కృఞ్ గ్రహః (3-4-36) అను సూత్రముచే హంతి ధాతువునకు; శుష్కచూర్ణరూక్షేషు పిషః (3–4–35) అను సూత్రముచే 'పిషి' ధాతువునకు; "ఉసమానే కర్మణి చ" (3–4–45) అను సూత్రముచే "ఛిది" ధాతువునకు 'ణముల్' ప్రత్యయము వచ్చి సమూలఘాతము–చూర్ణపేషము–తృణచ్ఛేదము–అను రూపము లేర్పడును. కషాదిషు యథావిధ్యనుప్రయోగః (3-4-46) అను సూత్రముచే నే ధాతువు ణములంతముగాఁ బ్రయోగింపఁబడినదో యా ధాతువునే యనుప్రయోగ ధాతువులుగాఁ బ్రయోగింపవలయును. తద్భిన్నధాతువును బ్రయోగింపరాదను నియమముచే "సమూలఘాతమవధీత్" అని మూలములోఁ బ్రయోగింపఁబడినది. కాని యా శ్లోకమును తెనిఁగించునపుడు సంస్కృత తిజంతములు తెలుఁగునకు రావు. కావున నాధాత్వర్థములు గల తెలుఁగుధాతువులను గలిపి "అవధీత్" (హన + హింసాగత్యోః వధాదేశః) అను దానికి "వధించె"నని, అపిషత్ (పిష్లృ–సంచూర్ణనే) అను దానికి 'నూఱె'నని సముచ్ఛిచ్ఛిదే (ఛిదిర్-ఛేద-ద్వైధీకరణే) అను దానికిఁ జెండె నని తెలుఁగు ధాతువులను వాడుట మిక్కిలి చమత్కారముగా నున్నది. ఈ శ్లోకము మాఘము నందలి "పురీ మవస్కంద లుసీహి నందనమ్" (1–51): మాఘభూమిక పుటలు 62....66) అను శ్లోకమువంటిది. పెంపరాలవారు మహావైయాకరణు లనుట కీ పద్య మొక్కటి చాలును. ఇట్లే మూలములో" అప్సాం ద్రప్సం సులిప్సం" (4-93) అని యుండఁగా 'చవి కల కుంపెరుంగు దిని'(2–45) అని ప్రయోగించినారు. ద్రప్సము; కుండపెరుఁగు.

"కుంపెరుఁగు నాఁగ ద్రప్ప మగును" (2–259) అని నుదురుపాటి వెంకన యాంధ్రభాషార్ణవము. దీనినే సూర్యరాయాంధ్ర నిఘంటువు గ్రహించినది. ఇట్లు మూలము నందలి సంస్కృత శబ్దమునకు సరియగు తెలుఁగు శబ్దమును వాడుటకు నుభయభాషల యందు సమాన మగు నధికార ముండవలయును. ఇందలి ముష్టింధయ, కూలముద్రుజ (పీ.31) భ్రాతరదాకృతి (పీ.117) పుత్రీయన్మనము (1–38) పశ్య తోహర (2–32) ఉగ్రంపశ్య (6–197) మొదలగు శబ్దములు సంస్కృతపండితుల నాకర్షించునట్లే పాదమ్మకై (పీ.98) అలంకారించు (పీ.108) ఫైకముకై (1-147) కుంపెరుంగు (2–45) పొంబూలు (2-109) ప్రపచియించు (4-164) పిటుకై (5–32) రాగవుఁడు (7-111) అచ్చోటు (8-167) బసుమము (8–157) ఉరుసము (9–107) అపద్మూలు (9–128) మొదలగు ప్రౌఢపదములు తెలుఁగు పండితులను మురిపించునవి.

## శంకరవిజయము - మహాకావ్యలక్షణములు

ఆచార్యదండి కావ్యాదర్శములో నగరార్ణవశైలాది వర్ణనములతో సర్గబంధము గలది. మహాకావ్య మని నిర్వచించి "న్యూన మప్యత్రయైః కైశ్చి దంగైః కావ్యం న దుష్యతి" కొన్ని వర్ణములు లేక పోయినను మహాకావ్యత్వమునకు క్షతిగల్గ దని చెప్పినాఁడు. సందర్భము లేకపోయినను బదునెన్మిది వర్ణనలను గావ్యమునందు గొనిపి నచోఁ బాఠకులకు వైరస్యము పుట్టి రసపుష్టి గల్గదు. ఈ కావ్యము నందుఁ గేరళదేశ వర్ణనము(1-9) కాలట్యగ్రహారవర్ణనము(1-10..17) దౌహృదవర్ణనము(1..75 82) పుంసవనము (1-83....88) కుమారోదయము నాయకాభ్యుదయము, వర్షర్తువు, శర దృతువు, గంగానదీవర్ణనము, త్రివేణీసంగమము, ప్రాతఃకాల వర్ణనము (9-145) మధ్యాహ్నవర్ణనము (3-87) మందానిలము(4..119) శ్రీశైలవర్ణన(6..216) వివిధ పుణ్యస్థలములు, నాయకదిగ్విజయము మొదలగు వర్ణనములు గలవు.

వర్ణనావైచిత్ర్యము—కల్పనా నైపుణ్యము :

కవియొక్క సామర్థ్యము వర్ణనలను బట్టి కల్పనలను బట్టి తెలియును. మూల కారుని వలెనే యీ యాంధ్రీకర్తలు కూడ సుందరవర్ణనలు చేయుటలోను మధుర

కల్పనలు చేయుటలోను నిపుణు లనుటకు మూలమునందు లేని వారి సొంతపద్యము లను రెండింటిని జూపుచున్నాను. సనందనుఁడు (పద్మపాదుఁడు) గంగానదీ పద్మములపై నడచి వచ్చునప్పటి దృశ్యము కన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడినది.

సీ॥ పుష్పాంతరమునకుఁ బోవు తుమ్మెద పాడ్కి-
జలజాంతరమునందుఁ జరణ ముంచు
డోలికాకేలికాందోళితుండును బోలెఁ
గమలమ్ముతోఁ బాటు గాలి నూఁగుఁ
బురుషరూపముఁ దాల్చు సరసిజాలయ వోలె
నలవోక నొక కంజ మందు నిల్చు
నేకాననం బూను లోకేశుఁడ ట్లొక
సితసరోజమున నాసీనుఁ డగును

తే॥ అనుపదం బ్రబమొందుచు నతఁడు గురుకృ
పా త్తలఘిమవిభూతి మహత్త్వమునను
దెఁటి కంటె వాయువుకంటెఁ దేలిక యయి
పద్మవీథిని జని గురువరుని జేరె. (3-147)

ఇట్లే మాలని రూపమును వీడి శివుఁడు ప్రత్యక్ష మైనపుడు వర్ణనము (3–103) వ్యాసుని వృద్ధబ్రాహ్మణరూపము (3_193) మొదలగునవి కన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడినవి.

శా॥ ఏలా చందనకుందసూనమధుపుల్ హేలాగతిన్ గ్రోలి యు
ద్వేలానందముతో లవంగసుమమాధ్వీకంబునుం గ్రోలఁగా
వ్రాలంబోయి తదుష్ణగంధమున కోర్వన్‌రాక భృంగమ్ము లం
దాలాపించును ఝంక్రియామధుర గేయంబుల్ వనీవీధులన్ (1-5)

కేరళదేశమున వనములలోని తుమ్మెద లేలాచందనకుంద పుష్పము లందలి తేనెను ద్రాగి యా యానందముతో లవంగ పుష్పములందలి తేనెను గ్రోలుటకై వ్రాలి యందలి యుష్ణగంధమున కోర్వలేక ఝంకృతులతోఁ దియ్యని పాటల నాలాపించుచున్నవఁట. ఈ కల్పన మెంతయు సహజముగా నున్నది.

రసప్రధానమై నది మహాకావ్యమని యాలంకారికుల నిర్ణయము. భరతమహర్షి నాట్యశాస్త్రము నుండి జగన్నాథుని రసగంగాధరము వఱకుఁ గల గ్రంథరత్నము లతో నలంకారశాస్త్రము రత్నాకరము వలె వృద్ధిచెందినది. వివిధ ప్రస్థానములు వెల సినవి. రసమే కావ్యాత్మ యని భరతముని మతము. అలంకారములే కావ్యశోభాకరము లని భామహుని మతము. గుణములే కావ్యశోభాహేతువులన దండి మతము. రీతి కావ్యాత్మ యని వామనమతము. ధ్వని కావ్యజీవాతు వని యానందవర్ధన మతము. ధ్వని యనుమానములో నంతర్భవించునని మహిమభట్టమతము. వక్రోక్తి కావ్యజీవిత మని కుంతకమతము. ఔచిత్యమే కావ్యాత్మ యని క్షేమేంద్రుని మతము. చమత్కా రమే కావ్యాత్మ యని విశ్వేశ్వరకవిచంద్రుని మతము. ఇట్టి విభిన్నప్రస్థానములలో భరతముని రససిద్ధాంతమును నానందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమును దక్కిన యాలంకా రికులందఱు నంగీకరించిరి. వస్త్వలంకార రసధ్వనులలో రసధ్వని యుత్తమమైన దని యభినవ గుప్తపాదులు సిద్ధాంత మొనర్చినారు. ఈ సిద్ధాంతమునే పిమ్మట మమ్మట జగన్నాథాదు లంగీకరించినారు. ఈ కావ్యమునందలి గుణములు, రీతులు, పాకములు,వృత్తులు,నిరూపించినచో గ్రంథము పెరుఁగును గానఁ గొన్ని చమత్కార ములను, అలంకారములను రసధ్వనులను బరిశీలింతము.

చమత్కారములు ;

'వాగర్థేచమత్కారే కావ్యం కావ్యవిదో విదుః' చమత్కారమే కావ్యాత్మ యని చమత్కార చంద్రికయందు విశ్వేశ్వరకవి చంద్రుని సిద్ధాంతము. రసగంగాధ రములో "రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్" అని కావ్యలక్షణమును నిర్వ చించి "ఇత్థం చమత్కారజనక భావనావిశేషయార్థ ప్రతిపాదక శబ్దత్వం యత్రప్రతి పాదితార్థవిషయక భావనాత్వం చమత్కారజనకతావచ్ఛేదకం తత్త్వం, స్వవిశిష్టజనక తావచ్ఛేదకార్థప్రతిపాదక సంసర్గేణ చమత్కారత్వవత్త్వమేవ వా కావ్యత్వమితి ఫలితమ్" అని పండితరాయలు కూడ నదే సిద్ధాంతమును స్థాపించినాఁడు. ప్రస్తుత కావ్యమునందలి కొన్ని చమత్కారములను బరికింతము.

తే॥ కర్మకాలము నందు మూర్ఖాళి తోడ
మాదృశులకు వాకొంట ధర్మమ్ము గాదు
తెలివి యతి భంగముగఁ బల్కఁ దెలిసె నోరి
యతికి భంగ మొనర్చు నా కగునె దొసఁగు (4–145)

ఇది యాచార్యమండనమిశ్రసంవాద ఘట్టములోనిది. మొదటి పాదములో "మూర్ఖ + ఆళి" యని యఖండవళి. దీని నప్పకవి యంగీకరింపలేదు. కవి ప్రయోగములు గలవు. యతులనఁగా సన్న్యాసులు. ఇచట నఖండవళిని వాడి యతిభంగముగా నిరూపించుట చమత్కారముగా నున్నది.

ఉ॥ కానఁగఁ బాపబీజ మురుకర్మ.... .... ....(5–178)
ఉ॥ అనగగహ్వరాంతరము నందున.... .... ....(5–180)

ఇచట మొదటి పద్యములోఁ జిలుక సగము పద్యము చదివి "యథోముఖా ప్తిఁ బడుచుంటి" నని క్రిందఁబడినది. శంకరులు కడమ పద్యమును బూర్తి చేయుచు గుహనుండి వచ్చిరి. మొదటి పద్యములోఁ జిలుక యాపిన పదమునుండి శంకరులు పూర్తిచేసి నది సగమునుండి మొదలై యొకే పద్యములో నిముడుట యొక చమత్కారము.

ఆచార్య మండనమిశ్రసంవాదఘట్టములో శంకరులు మండనమిశ్రుని జయింపఁగనే "అట్టి యెడ సభ్యుల సాధువాదంబు లొక్కతఱి మిన్నంటి దేవతూర్యంబుల నతకరించె"నని చెప్పి

మ॥ దివిషత్తూర్యధిమింధిమిస్వన మిళద్గీతిస్ఫురద్గాన వా
హవరంగాప్త జయేందిరాశుభ వివాహక్షిప్త ముక్తాఫలో
త్సవ సంసూచక పుష్పవర్షనిబిడ ద్యావాపృధివ్యంతరా
ళవలక్షద్యుతి లిప్తకీర్తిలలనా లాస్యోద్ధవేద్ధాకృతీ (4–182)

అని యాశ్వాసాంత పద్యమును గూర్చుట చమత్కారముగా నున్నది. శాస్త్రఘట్టములు వచ్చినపు డాశాస్త్ర పారిభాషిక పదములతోఁ బద్యములు వ్రాయుట యొక చమత్కారము.

"స్వపక్షస్థాపనాహీనముఁ బరపక్షవిదళనమాత్రావసానము నగు వితండావాదము నకుద్యుక్తుండై"

కానఁ దాద్రుశపల్లవగ్రహణమాత్ర
కల్పనాల్ప జల్పనక్రమము విడుము (8-429)

అను వాక్యము తర్కరసికులకు మోదమును గలించునది. ఇట్లే "భేదమునకు దత్తాంజలియగు" (8-432) మొదలగు నైయాయిక వాక్యములు వాదమునం దుపయోగించుట చమత్కారము.

ఉ॥ "త్రిభిషగ్వరులు జారిపోయిరెటో భేషజ శబ్దము ధంభమానటుల్" (9-120)

భేషజ మనఁగా మందు. లోకమునం దీశబ్దము గర్వముఁ బడాయి) అను నర్థములో వాడఁబడుచున్నది. మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రములో—

సీ॥ సౌందర్యమునఁ గొంత సరివత్తు రాశ్వనే
యులు భేషజం బూని యుండరేని (1—28)

అని రెండర్థములందును వాడినాఁడు. శంకరులకుఁ జికిత్స చేయ వచ్చిన వైద్యులు రోగమును శమింప నేరక వారి యశక్తిని గప్పిపుచ్చుకొని వెడలిపోయి రను సందర్భములో "భేషజశబ్దము ధంభమానటుల్" అని భేషజశబ్దమును వాడుట చమత్కారముగా నున్నది.

క॥ తోడనె తెలవాఱుటయును
నిడంబుగఁ గలకలధ్వనిని విహగములా
మోదన మొనరింప వినుచుఁ
గ్రీడించుచుఁ బ్రకృతి కన్ను గీటి హసించెన్ (9—145)

ఇందుఁ "గన్నుగీటి హసించెన్" అను వాక్యము చమత్కారము నినుమడించుచున్నది.

## శబ్దాలంకారములు

పాదాదియమకము :

పంచ॥ చలాచలాకృత వ్రజద్విశాల కేశరాట్చమూ
తలాచలావనీతలాః నిశాటవాటపాటనో
చ్చలాయుధా ... లాయుధోజ్జ్వలాది నాయకీనశౌర్యుఁ జం
చలాచలామరేంద్రలక్ష్మి జగ్రసు ... (3-268)

పాదాంతయమకము :

శ్లో॥ "యస్యామూర్తిః క్షమయా మునీశ్వరమయీ గోత్రా సగోత్రాయతే" మూలము.

శా॥ గోపుంగన్న తదీయమూర్తి క్షమ సా గోత్రాసగోత్రమ్ము శో
భాసుగ్రం బగు కీర్తి విద్యల బడయున్ భాషావిభాషత్వమున్
గాఢం బున్ శ్రితకోటి కిమ్ముతఱిఁ గల్పద్రుకల్పంబు సీ
మాము త్తద్యుతి దానిఁ బోల్ప జగముల్ మందాక్ష మందాక్ష మౌ (3—2)

మూలము నందలి "మందాక్షమందాయతే" యను దానికి "మందాక్షమందాక్షమౌ" యని వాడుట పద్యమునకు ఎంతశోభను చేకూర్చినది. మందాక్ష=సిగ్గుచే: మంద: మందగించిన, అక్ష : ఇంద్రియములు గలదని భావము.

వృత్త్యనుప్రాసము :

శ్లో॥ హృద్యాపద్యవినాకృతా ప్రశమితావిద్యామృషోద్యా" మూలము.

ఉ॥ వేద్య మవద్యమున్ జహదవిద్యమునై యమృషోద్యమై సుధా
స్వాద్య మతాతివోద్యకులిశాద్య విభేద్యము పత్క్లేశనిష
ద్యాద్యము యోగపద్య హృతసాధ్యమవద్యమునై ముముక్షుసం
పాద్యమునైన శంకరు నపారశిబోద్య మిడున్ సుఖాద్యమున్ (2—36)

అంత్యానుప్రాసములు :

మ॥ అలరుం గాలటి యగ్రహార మమరోద్యానానుహార మ్మనా
విలవేదశ్రుతవైదుషీనిరుపయోర్వీ నిర్జరప్రాజ్ఞమం
డలకావీరవిహార మన్వహవితాన ప్రీణితామర్త్య దో
హలవీహారము కేరళక్షితి వతంసాన్మానసకల్హారమై (1—13)

కం॥ తొలిచెఁ దనమేను యతి రా
ట్తిలకుఁడు కలికలుషభంగ ధిక్కృత తుంగన్
జలదుత్తుంగతరంగన్
నలలితపాతాళగంగ శైలాసంగన్ (6—4)

కం॥ నతజనభవభరను నతి
నుతియాత్రామృత, రమారజ్ఞుని శ్రమరాంబా
కృతసంస్తుతిఁ గొలిచెన్
యతింద్రుణాతార్జుమని మల్లికార్జునుభక్తిన్ (6—6)

ఇట్లే యిందు ప్రావృట్కాల (2-35) అతఁడొకపాటివాఁడె (4-83) అపుడు దక్షో క్షమంబైన (4-20) నతజనమోహాభంగము (6-5) పరుల మేలు గొలకె (6-18) అమలగుణాకరత్వమున (6-19) మ్రోలను మహాశపాలి (8-198) చేరె వసంత రంబు (9-20) మొదలగు పద్యములలోను షష్ఠ్యంతములలోను నంత్యానుప్రాసములు గలవు.

చ॥ నిరుపమ శంకరోక్తిపరిణీతమనస్కుఁడు తేనె సూనెగా
నరయుచు ద్రాక్ష శిక్షనిడి యద్దిర! క్షీరము క్షారమంచు వా
చలుచుచు మోచకాచ మనఁజాగి సితన్ భసితంబటంచుఁ జె
చ్చెర వెగటొందుఁ గుందు నిరసించు హసించు రసించు మించుగన్ (2-42)

ఈ పద్యములో రెండేసి పదముల కనుప్రాసమే కాక చివరిపాదము నందలి క్రియామాలిక ముక్తాయింపువలె నుండి "సవ్యసాచి నింద్రోపలరోచిఁ జూచి తలయూచి యులాచి రసోచితంబుగన్" అను చేమకూరవారి పద్యమును గుర్తునకుఁ దెచ్చుచున్నది.

## అర్థాలంకారములు

ఉపమ :

ఉ॥ అంబుజబంధు గర్భయగు ప్రాగ్దిశ యొప్పు .... .... ....(1-87)
క॥ సుతపూర్ణోత్సంగ మయిన సతి రంజిల్లై .... .... .... ....(1-95)
మొదలగు వాని యందుపమాలంకారము స్ఫుటము.

అనన్వయము :

క॥ ఆ మహితసముని .... అతని కతఁడె తుల నిక్కముగా (2-37)
ఇందు శంకరులకు శంకరులే సాటి యని చెప్పుటచే ననన్వయాలంకారము.

అసమాలంకారము :

క॥ కలుగఁడు తత్సదృశుఁడిలా తలమునను .... .... (2-25)
ఇందు మూఁడు కాలము లందును శంకరులను బోలు వాఁడు లేఁడని చెప్పఁబడుటచే నసమాలంకారము. ఈ యలంకారము శోభాకరమిత్రుని యలంకార రత్నా

# శ్రీ శంకర విజయ కథా సంగ్రహము



## ప్రథమాశ్వాసము

భరతఖండమునఁ బ్రసిద్ధమగు కేరళదేశమందుఁ గాలటి యను నగ్రహార మొకటి యుండెను. అందు శివగురుఁ డను బ్రాహ్మణుఁ డార్యాంబ యను భార్యతోఁ గాఁపురము చేయుచుండెను. వేదవేదాంగవేత్త, యజ్వ తపస్వియు నైయాద్విజుఁడు దేవమనుజఋణముల మాత్రము దీర్చుకోఁ గల్గెనే కాని సంతతిలేకుండుటచేఁ బితౄణము నుండి విముక్తుఁడు కాఁజాలక, పరిపరిగతులఁ జింతించి తుదకు భార్యాయుతుఁడై సమీపమం దున్న వృషగిరీంద్రముఁ జేరి యందు స్వయంవ్యక్తలింగాకృతిఁ దనరారు పార్వతీపతిని బెద్దకాలము సేవించెను. అట్లు కొన్ని వత్సరము లరుగ నొకనాఁటి శివరాత్రి మహాపుణ్యకాలమున నాదంపతు లుపవసించి పగ లెల్ల శంభుసేవానిమగ్నులై రేయి జాగరణం బొనర్చ దీక్షనుండిరి. అత్తఱి శివగురునకు జాగ్రన్నిద్రామధ్యస్థితి కలిగి చూచుచుండఁగనే యాకాశమందుఁ గైలాసము వలె నొకతెల్లని పెద్దమేఘము మెఱుపుఁ దీఁగెల తళతళలలోలయఁ గానవచ్చి క్రమముగా భూమికి డిగి యెట్టయెదుట నిలిచి నట్లగుటయుఁ దదేకదృష్టిఁ జూచుచుండ నామేఘమధ్య మందొకవ్యక్తి కదలుచున్నట్లును, దేహార్ధమున స్త్రీత్వ మమర నచ్చెరువు గొల్పుచుఁ గ్రమముగా నయ్యది పురుషుఁడై నట్లును దోఁచెను. పరిశీలింపఁ దలను జందమామ, కనులయందు దయారసము, హస్తములందు నభయవరదముద్రలు గలిగి యాపురుషుఁ డర్ధనారీశ్వరుఁడై యెదుట నిలుచుటయు శివగురుఁడు సాష్టాంగనతిపూర్వకముగ వివిధము లగు స్తుతు లొనర్చుచు జిరకాలముగఁ గఠిననియమములఁ గృశించినవాఁ డగుటచేతను నానందాతిరేకముచేతను వివశుఁడై భూమిపయి సొమ్మసిల్లి వ్రాలుచుండఁ బరమశివుండు కరుణాళుం డగుట దనకుడిచేయి చాచి తటుక్కునఁ బట్టి యెత్తి 'నీవును నాలుగను ధవ

టుల నుపవాసంబుల దస్సితిరి. కావున నాఁకలిదీఱఁ దినుం డని యొక మామిడిపండ్ల గుట్టచూపింప నందొక్కటి సుందరమును సురభిళమును నై మనంబు నాకర్షింపఁగఁ జిన్నదగు పండును గరద్వయంబునం బూని యెత్తుచుండఁగనే చే జాఱి క్రిందఁబడి యాపండు శీర్ణమగుటయు నందలి రసము నల్దెసల వెల్లువగట్టుటయు, గాంచి త్రుళ్లిపడి కన్ను దెఱచునంత — నెదుట శివలింగము, దీపమును, రవంత కనుమూసి కొనియున్న గృహిణియుఁ గానఁబడఁగ నయ్యది స్వప్న మని నిశ్చయించుకొని దానిఫలమును గూర్చి తనలోఁ దాన అయ్యో! మామిపండ్లగుట్టను భగవంతుఁడు చూప నాచిన్నపండొకటియే యేల కైకొంటిని? కైకొంటినిబో నది సగము పైకెత్తుచుండనే భూమిపయి నేల పడెను? అని కొండొకవిచారించి 'కొడుకొకఁడు పుట్టును. వాఁడు సకలగుణపూర్ణుఁడును జగద్విఖ్యాతుఁడు నగును గాని పూర్ణాయుష్మంతుఁడు కానేరఁ డని స్వప్నఫలంబు నిర్ణయించుకొని పరమేశ్వరున కట్టి యనుగ్రహము మాయెడఁ గలిగె, నేమొనర్పఁగల మనుకొనుచు నీవృత్త మాద్యంతము వినినచో బిడ్డలు లేమికిఁ బొందు వంతకంటె నెక్కువ వంత నొందగల దని తలంచి యెట్టకేలకు భార్యతో మాకంద ఫలవృత్తాంత మంతయు భూమిపైఁ బడుట మాత్రము చెప్పక చెప్పెను. ఆర్యాంబయు నొడలెఱుంగని సంతోష మొంది శివునకుఁ బార్వతికి సాష్టాంగనమస్కారము లొనర్చి నుతించెను.

తెల్లవాఱుటయు నాదంపతులు సమీపగత యగు పూర్ణానదిని స్నానమొనర్చి వృషగిరీశ్వరుని బరివారదేవతలతో యథావిధిగ నారాధించి యావ్రతమ్మున కుద్యాపనమ్ము నడపి యింటికి వచ్చి పెక్కురు బ్రాహ్మణుల కన్నదానము సేసిరి. బ్రాహ్మణభుక్తాన్నశేషము శివప్రసాదబుద్ధి శివగురుం డారగించె, నార్యాంబయుఁ దదనుజ్ఞ మెసవెను.

ఆనాఁడ పరమేశ్వర తేజ మాఁయసన్నము నందుఁడి యార్యాంబ గర్భమునఁ జొచ్చి క్రమముగా నెదిగి నవమాసములు పూర్తియైన పిదప మనుజబాలకాకృతిం బుడమి నవతరించెను. శివగురుఁ డానంద మొంది జాతకర్మాది సంస్కారములు యథావిధిగ నడపెను. పురుటిదిన ములు సుఖముగఁ జనుటయు నేకాదశవాసరమున సకలబంధుమిత్ర యుతుండై యా శివగురుండు తనయునకు 'శంకర ప్రసాదమునఁ బుట్టె ననియో, లేక లోకముల కెల్ల శుభమును గలిగించువాఁ డగు ననియో కాని 'శంకరుఁడు' అని నామకరణ మొనర్చెను. ఆర్యాంబయు వత్స లత దీపింప బిడ్డని సకలోపచారములఁ బెంచుచుండెను. బాలచంద్రుని రీతి నాబాలుఁడు పెరుఁగుచుండెను. ఆతని చేష్టలందును మాటలందు నపూర్వమహిమము కానవచ్చుటం జేసి శివగురుం డమితామోద మొందుచుండెను. ఇట్లు నాలుగేండ్లు గడచునప్పటికె యాబాలుఁడు మాటలు నేర్చుటే కాక, స్వభాషతో నితరభాషలు లిపులు నేర్చు కొనుటఁ గాంచి తండ్రి శివగురుఁ డాతని కుపనయనసంస్కార మొన రించి వేదాధ్యయన మారంభింపవలె నని యన్నివిధముల యత్నిం చుచు, నా సంస్కారము జరుగకుండఁగనే శరీరము వాసెను. ఆర్యాంబ భర్తృవియోగమునఁ బరితపించుచుండ శంకరుఁడు విరాగసంపన్నము లగు సూక్తులఁ నందఱు నచ్చెరువొందఁ దేర్చెను. ఆబాలుం డనుప నీతుఁడగుటచే శివగురునకు నార్యాంబా ప్రార్థనమున జ్ఞాతులు పార లౌకిక క్రియల నెఱవేర్చిరి. మరుసటి వత్సరమున నాయమ గోరఁగా శంకరున కుపనయనసంస్కారమును జ్ఞాతులు సలిపిరి. శంకరుఁ డట్లు సంస్కృతుఁడై వేదాధ్యయనార్థమై గురుని వెంటఁ దన్మందిరమున కరిగెను. గురుకులవాసపూర్వకముగా బ్రహ్మచర్యవ్రతము నిష్కళంక ముగ నడుపుకొనుచు నేకైకసంథగా వేదప్రపంచ మంతయుఁ గబళించి సకలశాస్త్రములు సర్వకళలు నభ్యసించెను.

ప్రాతఃకాలమున స్నానముచేసి, సంధ్యావందన మొనర్చి గాయత్రీ జపము, పంచాక్షరీమంత్రోపాసనము, సలిపి యగ్నికార్యము సేసికొని సబ్రహ్మచారులతో వేద మధ్యయనించి మధ్యాహ్నకాలమైనంత మాధుకరవృత్తి నన్నము భిక్షించి తెచ్చికొని భుజించుచు బ్రహ్మచర్యవ్రతదీక్ష నుండు నత్తఱి నొకనాఁ డా గ్రామమున మాధుకరార్థమై వెడలి గర్భదరిద్రురాలగు నొక బ్రాహ్మణి యింటికిఁ బోయి 'భవతి! భిక్షాం దేహి' యనుటయు నాయమ ఖిన్నురాలై యాయవారమునకై తన భర్త గ్రామములోని కేఁగి నాఁడనియుఁ దాను నిరుపేద ననియుఁ దుదకుఁ గట్ట గుడ్డ లేనిదాననవియు విలపించి యైన నీవంటి యుత్తముఁ డింటికిరా నూరక పంపరా దని యిల్లు నలుఁగడ వెదకి యొక యుసిరిక కాయ మాత్రమ యున్న దని కన్నీరు వెట్టుకొనుచుఁ శంకరుని చేతియం దిడెను. ఆతఁ డాయమ దారిద్ర్యబాధకు మిగులఁ దపించుచు నచటన కూరుచుండి యాచమించి మహాలక్ష్మిని శ్రీసూక్తమున స్తవము సేసి యాత్మీయానర్ఘళకవితం బొగడుటయు నంతరిక్షమునుండి యా దరిద్ర గృహచత్వరమునఁ గనకామలకములు వర్షముగాఁ గురిసెను. అంతట బ్రాహ్మణి కృతజ్ఞతను బరిపరిగతులఁ దెలుపుచుండ నాయమభర్త వచ్చి శంకరు ననేకగతుల నుతింపఁ దన యనహంకృతి బయలుపడ "నిది యంతయు మీయదృష్టవిశేషమే కాని నావలన నేమియుఁ గా"లేదని చెప్పి గురుకులమునకుఁ జనెను. దానితో నాతనిమహిమ మాయగ్రహారమున మెఱపు మెఱసి నట్లొకపఱి వ్యాపించెను.

## ద్వితీయాశ్వాసము

తరువాత గురుగృహమునందుండి శుశ్రూషసేయుచు నేఁడేండ్లయీడు వచ్చుసరికి సాంగోపాంగముగ వేదశాస్త్రము లన్నియు నభ్యసించి సమావర్తనవ్రతము సేసికొని గురుల యనుమతి నొంది యింటికి

వచ్చి తల్లిని దర్శించి, మ్రొక్కి, యామె దీవెనలంది విద్యలన్నియు నావృత్తి చేసికొనుచు, వటువులకుఁ గోరిన విద్యల నధ్యాపించుచుండెను. తల్లి యాతని విద్యావివేకాదులు చూచుభాగ్యము తండ్రికి లేకపోయెఁ గదా యని వగవ, విరాగోక్తులఁ జెప్పి యామెకుఁ జిత్తశాంతి గల్గించుచుండెను. ఒకనాఁ డాయమ యూరినంటి ప్రవహించుచుండు పూర్ణానదికి మధ్యాహ్నసమయమున స్నానమాడఁ జని వచ్చునప్పుడు దారియందు రెండుచేఁ గాలుచున్న యిసుకయందు నడుగులు పుటపుట పొక్కి లెక్కి నడువఁజాలక సొమ్మసిల్లి కూలుటయు నా వృత్తాంతము శంకరుఁడు విని పరుగెత్తి వచ్చి యాయమకు శైత్యోపచారములు చేసి తేర్చి యింటికిఁ దెచ్చి సేవదీర్చుచుండెను. ఆసమయమ్మునఁ గేరళదేశాధీశ్వరుని మంత్రి శంకరుని గౌరవపూర్వకముగ రాజాజ్ఞ చొప్పునఁ గొనిపోవ వచ్చి చూడఁగా శంకరుఁడు మనసు వికలమై జననీశుశ్రూషాపరుఁడై యితర మెఱుంగకుంట యరసి రాజునకు నావృత్తాంతము దెలుప దిగ్గన నశ్వము నెక్కి శంకరుని కడకు వచ్చి 'ఆర్యా! మీజనని నిత్యము స్నానముచేయు నది కడుఁగ నక్కఱ లేకుండ నదీశాఖ యొకటి మీగృహం బొరసికొని ప్రవహింప నేర్పాటు చేసితిని. రేపకడఁ జూతువుగాక' యని పలికి 'బాలుఁడయ్యు సకలవిద్యాపారంగతుం డయ్యె శంకరుం' డన ప్రజలెల్ల నద్భుతముగాఁ జెప్పుకొనుచుండ విని యొక్కపరి నిన్ను సందర్శింపఁ దోడ్కొని రమ్మని మామంత్రి నంపితిని. ఆతండు మీమాతృశుశ్రూషాపరాయణత్వమ్ము దెలుప నచ్చెరువుపడి నేను స్వయముగా దర్శించి పోనెంచి వత్తును. ఇవె కానుకలు. వీనిఁ గైకొని యీమదగజ మెక్కి యొక్కమాఱు మాగృహమునకు వచ్చి నన్నుఁ బవిత్రుఁ జేయు మనుటయు, శంకరుఁ డాకానుకలు ముట్టక "రాజేంద్రా! బ్రహ్మచారి యిభాదివాహనారోహణము సేయ నర్హుఁడె? వర్ణాశ్రమధర్మరక్షాతత్పరుఁడవు. నీవే యిట్లుపలుక న్యాయమా? అన నాభూపతి తనప్రమాదమునకు లోలోన నొచ్చు

కొనుచు 'నార్యా! నేను రచించిన నాటకత్రయము మీకు వినిపించి యెందేని నెఱసు లున్న సవరించుకొండలంతు' ననుటయు నప్పుడు చదువు మని విని 'రసవంతముగా నున్న' వని మెచ్చుకొని నావలన నింకేమేని పనిగలదా? యనఁ బుత్త్రిలాభార్థినై మిమ్ము వేడుచుంటి ననుటయు నీ కవశ్యము పుత్త్రులు గలుగు నుపాయము సెప్పుదును ముందీకాన్కలుగాఁదెచ్చిన బంగారంతయు నీగృహస్థులకుఁ బంచిపెట్టు మని యట్లు చేయించి రాజు సంపుచు సంతతిగలుగ వేదోక్తమగు యాగముసేయ నేకతముగా నుపదేశించుటయు నాతని సుగుణగణముల వర్ణింపుచు సపరివారముగ రా జరిగి మఱునాఁడు వేకువనె పూర్ణానదీ ప్రవాహమును శంకరునిగృహమునొద్దకుఁ దెచ్చెను. ఆతఁ డుపదేశించిన ప్రకారము యాగమును జేసెను. దానితో నాతని ఖ్యాతి నల్గడల వ్యాపించి కాలటియం దడుగిడఁ జోటు లేనట్లు జను లాతని జూడ మూఁకలు గట్టిరాఁదొడంగిరి. పూర్ణానదీసారణీజలాస్వాదనమున నయ్యగ్రహారవాసు లంద అపరిమితానందము నొందిరి. శంకరుండును జననియు స్వస్థచిత్తులైరి. నడుమ నడుమ శంకరునకుఁ దమపుత్త్రికల నిచ్చి పెండ్లిసేయఁ బెక్కురు భూసురులు రాఁగా వారికిఁ దన యసమ్మతిని దెల్పి పంపివేయుచుండెను. అది యరసి యొకనాఁడు తల్లి శంకరుని జేరి పెండ్లి యాడుమని ప్రేమపూర్వకముగా నెంతయో దూరము బోధించెను. కాని యాతఁడు బాలుఁడ నగు నాకిప్పుడు పెండ్లి యేమని యాయమమాట త్రోసిపుచ్చెను. ఆర్యాంబయు లోలోన వగపు దిగమ్రింగి యూరకుండెను. ఆమఱునాఁ డొకసంపన్న గృహస్థు బంధుసమేతముగా వచ్చి తనకూఁతు నాతని కీయ నెంచినట్లు ముందుగా నార్యాంబకుఁ దెలియఁ జెప్పి వటువులకు విద్య గఱపుచున్న శంకరుని జేరి సన్మానితుఁడై యాతఁడు చెప్పుచున్న పాఠమును సబాంధవుఁడై వినుచుండెను. శంకరుండును దరువాతిపాఠమును వటువులకు బోధించెను. నాఁటిపాఠము ప్రబోధసుధాకరమందలి కాంతాగర్హణప్రకర

ణము. అది యంతయు విపులముగ నుపన్యసింప విని పెండ్లిమాట తల పెట్టనేరక యాతని యనుమతి నొంది యార్యాంబ కావృత్తాంత మంతయుఁ జెప్పి శంకరుని జన్మపత్త్రంబును జూడఁ గోరిరి. ఆర్యాంబ తెచ్చి యీయ వారిలో నొకఁడై వజ్జుఁ డది చూచి తలయూఁచి మెచ్చుకొని తుదకుఁ బెదవి విఱువ 'నేమి యట్లంటిరి? నాతండ్రులారా!' యని యార్యాంబ యడుగ నాతఁడు 'సర్వవిధముల నీతఁడు మహోత్కృష్టుఁడు కాని యాయువుమాత్రము మధ్యమ మైనను గాకున్నది' అని చెప్పెను. ఆగృహస్థుమాటాడక సబాంధవముగా నేఁగ బుత్త్రుని యల్పాయుష్యముఁగూర్చి యార్యాంబ గొల్లుమని యేడ్వసాగెను. తోడన శంకరుండు వచ్చి యాసంగతి నంతయుఁ దెలిసికొని తల్లికి విరాగము నుపదేశించుచు శరీరము లశాశ్వత మని ధ్రువపఱచి, మృత్యువు లేనివాఁడొక మృత్యుంజయుఁడు కావున నాతని సేవించి యమృతతత్త్వ మొందువాఁడఁ గాన ననుజ్ఞ నొసంగుమని యమృతతత్త్వ మనఁగా ముక్తి యనియు దానికై సంన్యసింప ననుమతింపు మనుటయు నాయమ మఱింత వగచుచు వృద్ధను దిక్కులేనిదానను, నన్ను డిగవిడిచి సంన్యసించి పోదువేయని దీనముగఁ బలికి యనుమతింపకుంట యరసి శంకరుఁడు తల్లి కుపశాంతివచనములేవేవో చెప్పి యొంటరిగఁ గూరుచుండి తనలోఁ దర్కించుకొని తుదకు సంన్యసింప నిశ్చయించుకొని తల్లికి శుశ్రూషలు సేయుచుండెను. ఒకనాఁటిరేయి యాయమ కోరఁగా భాగవతమున ధ్రువప్రహ్లాదాదిభక్తులచరిత్రములు చదివి యందలి రహస్యముల నన్నింటిని విప్పి చెప్పెను. దాన నయ్యిరువురకు మనస్సున నాందోళనము హెచ్చి యెట్టకేలకు నిద్రపట్టెను. అరుణోదయవేళ మేల్కొని శంకరుఁడు సశిష్యుఁడై నదికి స్నానార్థం బరిగె. ఇంట నిద్రించుచున్న తల్లి ముక్తకంఠముతో నేడ్చుచు మేల్కొనెను. ఆయమ దుఃఖధ్వని విని శంకరుండు స్నానముచేయువాఁడు పరుగుపరుగున వచ్చి యేమి తల్లీ! యని సంభ్రమమ్మున నడుగ, నామెసుతుని కంఠము

కౌఁగిలించుకొని 'తండ్రీ! యిది కల యని నిన్నుఁ జూచి యనుకొంచుంటిని. కాని యిది నిజమనుకొని యెంత దుఃఖించితిని రా!

పూర్ణాయువుతో యతివయియేని బ్రతుకుము

యనుటయు నా స్వప్నము చెప్పుమని శంకరుఁడు డుగ నామె యిట్లనియె. "ఈపూర్ణానది పొంగిపొరలి వచ్చుచుండెను. నేనును నీవును స్నానార్థమై యరిగితిమి. నీచేయూఁది నేను గట్టిదగ్గున మగు నీట స్నానము చేయుచుంటిని. నీవు లోని కీఁదుచుఁ బోవుచుండ నొకమొసలి కాలుపట్టుకొన నీవు మునిఁగిపోవుచు 'నమ్మా! యిప్పుడైన సంన్యసింప ననుజ్ఞయి'మ్మంటివి. ఏమనుటకు నోరాడక విలపించుచుండ మరలఁ గొట్టుకొనుచు నీటిపైకి లేచి అమ్మా యేమంటి వనుచు మరల మునిఁగి పోయి యిఁకఁ గానరావైతివి. దానితో నొడ్డునఁ గూలి మూర్ఛిల్లి యేడ్చుచుండఁగా మెలఁకువ వచ్చెను. ఇల్లు నలుఁగడ నరసితిని. నీవు కానరాలేదు. దానితో మఱింత దుఃఖము కల్గినది." అన విని శంకరుఁడు వెఱఁగొందుచుఁ దల్లి నూరార్చి యాభుజబంధమున నుండియే భవబంధము తొలఁగ 'సంన్యస్తం మయా" యని మానసికముగ సంన్యసించుటయు తెల్లఁ బోయి తల్లి 'యిదేమిరా! తండ్రి! నాకు దిక్కెవ్వరు?' అని కుంద వగవవల దని చెప్పి జ్ఞాతులు వీరందఱు నిన్నుఁ గాపాడుదురు. నీదేహము మృత్యువశమగునెడ సంస్కారము నొనర్చి ధనమంతయు స్వీకరింపఁ గలారు. నీమృతి రేయియైనను బగలైనను నను స్మరింప వచ్చి పరమపదము నొందింతును' అని చెప్పి జ్ఞాతులఁ బిలిచి పితృధనమంతయు వారి కొసంగి తల్లిని బోషింప వేడుకొని యందఱి యనుమతినిబొంది సమీపమున నున్నవిష్ణ్వాలయమున కేఁగి యాదేవునకు మ్రొక్కి 'నీతల్లి క్షేమమునకై రాజును బ్రోత్సహించి తెచ్చిన నదీసారణి తరంగముల తాఁకున నీదేవళము కూలనున్న' దను నశరీరవాణి వినవచ్చుటయుఁ దత్క్షణమె కేరళాధీశ్వరు రావించి యాదేవుఁడు

నీవాంఛితము దీర్చును. క్షేమకర మగు వేఱొక తావున దేవళము నిర్మింపు మనుటయుఁ దదాదేశమున మునుపు క్రతు వొనరించి యిష్ట సిద్ధిఁబడసిన హేతువున నారాజన్యుడు శ్రీహరికి నబాధమైనచోటఁ బెద్ద గుడి తోడన కట్టించుటయు, శంకరుండు తద్దేవతావిగ్రహముల నుద్ధరించి మూఁపునఁ బెట్టుకొని తెచ్చి యందుఁ బ్రతిష్ఠ సేసి యచట గదలి చనియె. అట్లు వెడలి నర్మదానదీతీరమున నున్న గోవిందయతిచంద్రు నాశ్రమంబున కరిగి గుహాముఖంబున నాతనిపాదము దర్శించి ప్రదక్షిణించి ప్రసన్నుఁ జేసికొని బ్రహ్మోపదేశమును గోరఁ, గరుణ వొడమి యామహాత్ముఁడు మహావాక్యచతుష్టయముచే బ్రహ్మస్వరూపము నెఱుఁగఁ జెప్పి సంన్యాసనియమమ్ము లన్నియు వివరింప శంకరుఁడు యోగాభ్యాసము సలుపుకొనుచుఁ గొంతకాల మచ్చట నుండెను.

## తృతీయాశ్వాసము

అట్లు గోవిందభగవత్పాదుల పాదసేవ సేయుచు యోగాభ్యాసమొనర్చు నత్తఱి వర్షాకాలము వచ్చుటయు నక్కాఱువానలకు నర్మద పొంగి మునుల యాశ్రమంబుల నెల్ల ముంచివైచుచుండ గురువుల తపంబునకచట విఘ్నము ఘటిల్లునోయని శంకరుఁడు తనచేతికమండలువు నర్మదానదీపూరంబున నొడ్డి తదుల్బణమంతయు హరించెను. ఆ సంగతి తెలిసి గోవిందయతి శంకరుం గాంచి యష్టవిభూతులు నీకు సిద్ధించినవి. నదీజలము కమండలువున నిముడ్చుట వశిత్వమనెడి యష్టమ సిద్ధి. ధన్యుఁడవు. నీవుకాశి కరిగి విశ్వేశు సేవించుకొనుము. తొల్లి గురుదేవుఁడగు గౌడపాదమహర్షి యొక కథచెప్పె, వినుము. “మున్నొకప్పుడు హిమవన్నగంబున నత్రిమహర్షి యొకయజ్ఞముచేయుచుండ వ్యాసుఁడచటికి వచ్చెను. ముని లెల్లరు పూజించి కోరఁగా వేదాంతార్థ ముపన్యసించెను. పిదప నీరచించిన బ్రహ్మసూత్రములకు నేటిపండితు లిచ్చవచ్చి నయర్థములను గల్పించి చెప్పుచున్నారు వానిని వారించు భాష్యం

టత్యావశ్యక మనుటయు, మునులారా! యిట్టి ప్రసంగమే కైలాసమున నీశ్వరుని సభయందును వచ్చెను. అప్పుడు నే నిట్లంటిని. నాతో సముడొకఁడు పుట్టును. ఆతఁ డుద్రేకమునొందిన నదీజలమును గమండలువునఁ బట్టి త్రావించు వశిత్వసిద్ధి గాంచి మెఱయుచు, గోవిందయతికి శిష్యుఁడై యుండుననియు నాతఁడు దుర్మతముల ఖండించి యద్వైతము జగతిని స్థాపించు ననియుఁ జెప్పితిని. అనిపల్కి— చనె" వత్సా! యది నేఁడు నిజమయ్యెను. కావున నుత్తమనిబంధనరచనలచే జగత్తు నుద్ధరింపు మనెను. తోడనె గురుని కరుణారసభరితమగు నాశీస్సు లంది శంకరుఁడు కాశికేఁగి గంగానదిని నవగాహ మొనర్చి విశ్వనాథు సేవించుచు నుండెను.

అయ్యెడ నొకనాఁడు బ్రహ్మచారియు, వేదవేత్తయునగు నొక బ్రాహ్మణబాలుఁడు శంకరుని పాదముల వ్రాలి 'మహాత్మా! భవవార్ధి దాఁటఁ గోరి వచ్చితిని. కరుణాప్లవ మొసఁగి రక్షింపు' మన లేవ నెత్తి నీవృత్తము చెప్పుమన 'నార్యా! నేనొక విప్రబాలుఁడ. కావేరీజలపూతమగు చోళదేశము నా వాసభూమి. సనందనాఖ్యుఁడను. సంసారము తరింపంగోరి మహాత్ములకై జగంబున నా పరిభ్రమింపని తావు లేదు. నాభాగ్యమున నేఁటికి నిన్నుఁ గంటిని. నన్నుద్ధరింపు మని పెక్కువిధముల వేఁడ నాతనికిఁ బారమహంస్యపద మొసంగి శంకరుఁడు ప్రథమశిష్యునిగా గ్రహించెను. అది గాంచి యొందఱో జ్ఞానవంతులు శిష్యులై కొలువఁ జొచ్చిరి.

అంత నొకనాఁటిమధ్యాహ్నకాలమున శంకరుఁడు సశిష్యుఁడై స్నానార్థము గంగ కరుగుచుండఁ ద్రోవలో నొకమాలఁడు కల్లుద్రావి తూలుచు సమీపగతుఁడయ్యెను. వానిని దూరముగాఁ దొలఁగు మని యతి పలుకఁగా నన్నెడఁ గలుగఁ బొమ్మనుచుంటివి? దేహమా? దేహియా? ఇప్పుడు తొలఁగదగినది ? అని ప్రశ్నింప నొడలు-జల్లు

మన నయ్యతిపతి యీతండు సాధారణశిష్యవచుండు గాఁడని తెలిసికొని జగమంతయు నాత్మగా నెవ్వఁడు దృఢబుద్ధి నెఱుంగునో యాతఁడు ద్విజుఁడైనను మాలఁడైనను నాకు వంద్యుండె! హరిమొదలు పురుగుదాఁకా పర్యంతమగు దేహులందు దోఁచు చేతనయే నేను గాని దృశ్యము గా నను దృఢబుద్ధి గలవాఁడు పుల్కసుడైనను నాపాలిటిగురువే! యను నేతా దృశజ్ఞాన స్ఫోరకసూక్తుల నుతించుచు భక్తిపారవశ్యమునఁ గన్నులు మూసికొన లోనిచూపునందు నామాలఁడె శివాకారముగాఁ గానరాఁగ నొడలు గఱుపొడువఁబొగడుచుండె అంతనాశివుఁడు వ్యాససూత్రముల కద్వైతపరముగ భాష్యము రచింపఁ బ్రేరేపింపఁ గొంతవడికి స్వాస్థ్యము నొంది పరమేశ్వరుఁ డట్టిరూపముతో నేలా కానవచ్చె నని పరిపరి గతుల వితర్కించుకొనుచు నేటి కరిగి స్నానమొనర్చి మాధ్యాహ్నిక కర్మకలాపము నిర్వర్తించుకొని యాశ్రమంబుసేరి పరమేశ్వరుధ్యానించి కాశినుండి బదరికారణ్యమున కరిగి యందుండి ప్రస్థానత్రయము రచి యించి యద్వైతార్థప్రతిపాదకము లగు పెక్కుగ్రంథముల నిర్మించి వానిని శిష్యులకుఁ బాఠము సెప్పుచుండెను.

అట్లు చదివించునప్పుడు ప్రథమశిష్యుఁడగు సనందనుని సారెకుఁ బిలిచి 'యది యట్టుల, యిది యట్టుల' యని భాష్యరహస్యముల, దెల్పుచుండుట నరసి యితరశిష్యుల కందఱు కీసువొడమి గురునెడ నిసుమంత యవిధేయత వెలిఁబుచ్చ నయ్యనఘుఁడు సనందనుదృఢభక్తి వీరికిఁ దెలుపుదుఁగాక యని గంగ కద్దరి నుండఁగా సనందనా యని పిలచెను. ఇవ్వలకు రానెంచి యాతఁడు నావకై యత్నింప నేదియుదొరకక గురుభక్తియే నావగా నెంచి గంగాప్రవాహమున 'జే'యని కాలుంపఁ గాలిక్రింద నొక తామరపూవు పుట్టి యుండెను. ఆతఁడు రెండవపాద మెత్త నింకొకటి పుట్టుటఁ గాంచి గురుని కరుణకదా కారణ మనుకొని నిర్భయముగా అందునిలిచి గంగయంచుఁ బొడముచుండెడు

పద్మపంక్తిపై నడచి యీవలకువచ్చెను గురుఁడాతని లక్ష్మీమవిభూతిసిద్ధి కానందించి యభినందించెను. శిష్యులెల్లరు సిగ్గువడి క్షమియింప వేడుకొనిరి. నాఁడుమొదలు సనందనుఁడు పద్మపాదుఁ డయ్యెను.

తరువాతఁ బాశుపతు లమ్మహాత్ము నెదుర్పఁ దన్మతము ఖండించివైచెను. ఆవార్త జగమెల్ల వ్యాపింపఁ గాశీనివాసులు శంకరుని కీర్తిని బహువిధములఁ గొండాడిరి. అంత నొకనాఁడు ప్రాతర్వేళ శిష్యులకు భాష్యపాఠములు చెప్పుచుండ నొకవృద్ధబ్రాహ్మణుఁడరుదెంచి సత్కృతుఁడై 'తదంతర ప్రతిపత్తౌ' యను బ్రహ్మసూత్రభాష్యమడిగి శంకరుఁడు దెలుప వేయివిధముల ఖండించివేసెను. శంకరుఁడును వాని ఖండనమంతయు ననువదించి ప్రతిపూర్వపక్షమునకు సమాధానము సెప్పెను. ఈరీతిగా వారిరువురకు నెనుమిదిదినములు వాదము నడచెను. పొంత నుండి యరయుచున్న పద్మపాదుఁ డీతఁడెవఁడో మహానుభావుఁ డని యెంచి "శంకరుఁడన సర్వజ్ఞుఁడగు శంకరుఁడే, ఆతనితో వాదించువాఁడు బాదరాయణుఁడే కాని యన్యుఁడు కాఁబోఁడు. అట్టితఱి నావంటి కింకరుఁ డేమిసేయఁగలఁ డని యనుటయు శంకరుఁ డామాటకొడలు జల్లన నావృద్ధుని పాదముల వ్రాలి వ్యాసుఁ డని స్తుతించెను. ఆద్విజుఁడును సంతోషపడి క్షమింపవేఁడుచున్న శంకరుని గౌఁగిలించుకొని సూత్రభాష్య మంతయుఁ బరిశీలించి చూచి మెచ్చుకొని 'నాయనా! బ్రహ్మ మొదట నీకిచ్చిన యాయు వెనిమిదేండ్లే. తరువాత నీతపశ్శక్తిచేఁ బదునారేండ్లు మాత్ర మయ్యెను. కాని యది నీభాష్యప్రచారమునకుఁ జాలదు. కావున మఱొకపదారేండ్లు నీకాయువు గలుగ వర మిచ్చితి నని పలికి యంతర్హితుం డయ్యెను. నిశ్చేష్టుఁడై చూచుచున్న పద్మపాదుఁ డయ్యా! మీతో వాదింపఁ దగినవాఁడు సూత్రకర్త యగు వ్యాసుఁడంతవాఁడు గాని యన్యుఁడు కానోపఁడని వ్యాసుఁ డంటినే కాని యాబ్రాహ్మణుని వ్యాసుఁడని మీరు నుతింప వింతగ నుండెను.

అదిగాక మీరే సూత్రభాష్యమునఁ గలిద్వాపరసంధి యందు వ్యాసుండు సూత్రముల నిర్మించినట్లు రచించితిరిగదా! ఆనాఁటివ్యాసుఁ డిప్పు డెట్లు వచ్చు నని శంకరు నడుగ నాతండు వత్సా! ఆనాఁడు సూత్రముల రచింప నీనాఁ డుండఁ డని నీకెట్లు తోఁచినది? అయన చిరంజీవులలో నొకఁడని వినలేదా? అట్లయిన నా కేల కానరాఁ డందువా? జ్యోతిర్మయులగు నాదివ్యపురుషులు జ్ఞాననేత్రమునకుఁ గాని గోచరింపరు. మొదట నీవలెనే నేనును వృద్ధద్విజుఁ డనియే వాదించి తిని. నీవు వ్యాసుఁ డనునంత జ్ఞానదృష్టి నరసితిని. వ్యాసుఁడై కాన వచ్చెను. నీకుఁ దుదిదాఁక వృద్ధుఁ డగు పాఱుఁ డయియే కానఁబడెను. జ్ఞానప్రమాణానుసారము తత్తద్విధముగా సర్వమును గోచరించును. కాని మనకుఁ బ్రత్యక్షము కానంతమాత్రమున నేదియు లేదనరా దని దృష్టిభేదమును గూర్చి వివరించి వ్యాసుని నుతించి పరవశుఁడై కొండొక సేపు నిల్చిపోయెను. పిమ్మట గురుని యానతి స్మరించి దిగ్విజయమునకై వెడల నెంచిముందు తనభాష్యములకుఁ గుమారిలభట్టుచే వార్త్తికములు చేయింపఁ దలఁచి దక్షిణదిక్కునకు వెడలెను.

## చతుర్థాశ్వాసము

అట్లు వెడలి వచ్చునప్పుడు మార్గమం దొక బ్రాహ్మణుఁ డను గమించువాఁ డుబుసుపోకకై కుమారిలుని చరిత్రము మొదటినుండియు శంకరున కీరీతిఁ జెప్పఁ దొడంగె. మహాత్మా! కుమారిలభట్టనఁగా వేద మార్గరక్షణమునకై మహేశ్వరు నాజ్ఞచే భూమి నవతరించిన కుమార స్వామియే యందురు. ఆతనిని గూర్చి యెన్నో కథలు గలవు. ఉత్క లాంధ్రదేశసంధియందుంగల జయమంగళ మను గ్రామ మాతని జన్మ స్థానమఁట. బాల్యముననె యుపనయనాదిసంస్కారములు గాంచి శ్రుతిస్మృత్యాదిక మంతయు నేర్చి పాండిత్యశౌర్యము గలిగి తంత్ర వార్త్తికమను మీమాంసాగ్రంథమును రచించెను. ఆనాఁటికి దేశమం దంతట జైనాదిమతములు వ్యాపించుటచే వేదవేత్తలకు, యజ్వలకు

నిలువ నీడ లేకుండెను. అది గాంచి కుమారిలుఁడు కటకటా! వేదమున కిట్టి దిక్కు లేనితనమా? అని దుఃఖించి నాస్తికులతోఁ బెక్కుసభలందు వాదమునకు డీకొని తన్మతరహస్యము తెలియఁగమిచే నోడిపోవుచు వచ్చెను. ఆపరాభవము మాపుకొనుటకై ప్రతిపక్షరహస్యవిజ్ఞాన మావశ్యక మని యెంచి జైనమతగురువుల యొద్ద కేఁగి వారి మతగ్రంథములఁ గఱపుఁ డని వేడుకొని నిరాకృతుఁడై మాయచేసియైనను జదువవలెనని జైనపరివ్రాజకవేషము దాల్చి యొక జైనమతోపదేష్టకు శిష్యుఁడై చదువ మొదలిడెను కొలఁదిదినవాయిగా నంతయు నతిశ్రమపడి నేర్చెను. అంత నొకనాఁ డాగురువు వేదమును పరిపరిగతుల నిందింప మొదలిడెను. అది విని కుమారిలుఁడు కొంతతడవు లోలోన దుఃఖించి యోఁపినను నాఁగకుండుటచే గన్నీటి బొట్టొకటి విడిచెను. సహాధ్యాయు లదిచూచి పాఠానంతర మాతని పరోక్షమున గురువుతో 'వీఁడొక వేదవేత్త' యయి యుండును. మాయావేషమున మనవిద్య నేర్వవచ్చిన దొంగ. కాకున్న మీరు వేదమును నిందింప నట్లు దుఃఖించునా? అని పలుక గురుఁడు మండిపడి యీరేయి నిద్రించునప్పుడు మేడమీఁదనుండి క్రిందికిఁ ద్రోయుఁడన వారట్లు చేసిరి. త్రోపువడి మేల్కొని కుమారిలుఁడు "వేదమే ప్రమాణ మగుచో నాకు హాని కలుగకుండుఁగాక' యనుకొనుచుఁ గ్రిందఁ బడి మరణింపక బ్రదికెను. కాని వేదమే ప్రమాణ మగుచో అని సంశయించుటచే నొక కన్ను మాత్రము పోయెను. జైనాదు లనిన నంతకమున్నే రోఁతగల యాబుధున కీద్రోహకృత్యము కోపమును మచ్చరమును వృద్ధిచేసెను. ఆకోపముతో విజయయాత్రకు వెడలి ధరణియంతయు నప్రతిహతముగ జరించుచు రిపుల జయించుచుఁ దుదకు సుధన్వనృపుని యాస్థానమున గల నాస్తికుల జయింపవచ్చెను. రాజసభఁ జొచ్చి యందలి విపక్షపండితులను వాదమున జయింప రాజు కుమారిలపక్షపాతి యయ్యెను. అది గని జైనులు వాది దౌర్బల్యమున నోడినమాత్రమున వాదము

కకు న్యూనత యుండునా? అనిరి. రా జది విని వేదము జగత్కారణ
మంటివిగదా! ఈకొండ యెక్కి క్రిందఁ బడి చావక నిలిచిన యెడ
వేదమున కట్టి మహిమము గలదని నమ్మవచ్చు ననుటయుఁ గుమారి
లుఁడు తత్క్షణమే యచట నున్న కొండశిఖర మెక్కి శ్రుతిమాతకరు
ణచే నాకే యపాయమును గలుగ దని ధీరముగాఁ బలుకుచు, భూమికి
దుమికి యక్షతదేహుఁడై నిలుచుటయు రాజు జైనులం గాంచి వేద
ప్రామాణ్యమున కింతకంటెఁ బరీక్ష యేమికావలెను? ఇప్పుడేని వీని
మతము నొప్పెదరా? ఒప్పరా? యనఁగా వార 'లయ్యా! మంత్రమ
ణ్యౌషధుల శక్తిచే శరీరము రక్షించుకొనవచ్చు నని పలుకఁగా జైను
లయెడ నిరసనము గలిగి "యింతకంటెఁ బరీక్ష యేమికావలెను? మీ
మాట నీచముగా నున్న" దని ధిక్కరించి 'యిరువాగువారిని నొకతీవ్ర
పరీక్ష యొనర్చెదను. అం దోడినవారు యంత్రశిలలఁ బడి చచ్చుటయే
పన్నిదము' అని పలికి యొక కుండయందు రహస్యముగాఁ బాము నొక
దానిఁ బెట్టించి మూఁత గట్టిగానిడి యిం దేమున్నదో యెఱింగి యెవరు
చెప్పుదురో వారి మతము ప్రమాణముగ గ్రహింతు నని ప్రతినఁ
బూనెను. ఇరు తెగవారును ప్రాణాంతక మగు నా ప్రతినకు భయప
డుచు నిండ్లకుఁ బోయిరి. ఆరాత్రి కుమారిలుఁడు కంఠదఘ్న మగుజల
మందుఁ దాను, దనపక్షమువారు నిలిచి సూర్యు నుపాసింప వచనీ
యాంశము సూర్యమండలమునుండి వారికి వినిపించెను. దానికి వారు
ధైర్య మొంది మఱునాఁడు సభకు వచ్చియుండిరి. నాస్తికులును తమ
జ్యోతిషవిద్యాపాటవమునఁ గుండయం దేమున్నదో యెఱుంగుట కప్పుడ
గణితము సేసి తెలిసికొని రాజుం గాంచి యిందొక పా మున్నదని
చెప్పిరి. అంతట రాజు కుమారిలు నడుగ సభామధ్యమున నున్న ఘట
మున కెదుట నిలిచి యాపాఁపతేనిపైఁ బవళించి శ్రీమహావిష్ణు వున్నాఁ
డనెను. అది విని ప్రతిపక్షులు నవ్విరి. రాజును సందేహముతోఁ గుం
మీఁదిమూఁత తొలఁగింప నారాయణుని దివ్యమూర్తి కనఁబడు

యుఁ గడ గడ వడఁకి కుమారిలుని పాదములపైఁ బడి నన్ను శిష్యుఁగాఁ స్వీకరింపు మని ప్రార్థించి యోడినవారిని యంత్రశిలలఁ ద్రోసి చంపుఁ డని యాజ్ఞాపింప భటులు తోడనే జగమునం గల నాస్తికులను వెదకి వెదకి మడియించిరి. వారిలోఁ గొందఱు ప్రాణభీతిచేఁ బరదేశములకుఁ బాఱియు వేదమతము స్వీకరించియుఁ బ్రాణముల నిలుపుకొనిరి. తక్కు గలవారెల్ల రాజభటులచే హతులైరి. అట్లు మరణించువారిలోఁ దనకు జైనమతవిద్యను జెప్పిన గురువు గూడ నుండె నని యెఱిఁగి కుమారిలుఁ డా గురుద్రోహపాపపరిహారమునకై ధర్మపరిషన్నిర్ణయప్రకారము నిష్కృతులనేకము గావించికొని పరిశుద్ధుఁడై ప్రయాగక్షేత్రమునఁ బెక్కుయాగము లొనర్చి మమతాశూన్యుఁడై తపం బొనరించుచున్నాఁడు - అని కుమారిలుని వృత్తాంతము నావిప్రుఁడు చెప్పుచుండ శంకరుండును వినుచు గమనాయాసంబు నెఱుంగకుండఁ బ్రయాగ కేఁగి యందుఁ ద్రివేణిని స్నానము చేయుచుండ 'గురువధప్రాయశ్చిత్తముగాఁ గుమారిలుఁడు తుషాగ్నిప్రవేశము చేసినాఁ' డని విని యెంతయు వగచి యాపౌరులవలన నాతని యున్నచో టెఱింగి సశిష్యుఁడై వేవేగఁ జని చూచునంతఁ దుషాగ్నిమధ్యమున సగపాలు దేహము కాలిపోయిన కుమారిలునిఁ గాంచి యాతని దృష్టిపథమున నిలిచి నమస్కరించుటయుఁ బొగచేఁ గన్నులు చూడరాకున్నను నెట్లో విచ్చి శంకరుం గని యాతని వృత్తాంతము దెలిసికొని శిష్యులచేఁ బూజలు సేయుంచి 'నీదర్శనమున నాజన్మము ధన్యమైనది' అనుటయు శంకరుండు "సుధీంద్రా! గురువధ, యీశ్వరనిరాసము నను దోషములఁ దొలంచుకొనుట కీతుషాగ్నిప్రవేశము చేసితి వని జను లనఁగా వింటిని. అది నిజమా?" అనుటయు "మహాత్మా! గురువధమువలనఁ బాపము కలుగు నేమో యని యానాఁడే పెక్కురు ధర్మవేత్తల నడిగి 'తనంతఁ దాను బన్నిదము వేసి ప్రాణములు గోల్పోయిన గురువు నెడ నీకుం గర్తృత్వ మేమి గలదు? వేదరక్షార్థము నీవు యత్నించితివి. నీత ప్పేమియు లేదు' అని

వారివలన వినియుఁ బాపభీతిచేఁ బెక్కు యాగాదికములు నిష్కృతిగాఁ జేసికొన్నాను. కర్మశీలుఁ డగువిజ్ఞుఁడు శరీర మసమర్థ మగునప్పుడు భృగ్వగ్నిజలపాతములచే నిర్మముఁడై శరీరము విడువవలె నని స్మృతులం దరసి యీవ్రతముఁ బూనితిని గాని వేఱు గాదు. వేదము స్వతః ప్రమాణ మని ప్రకటింపఁ గర్మఫల మీశ్వరుఁ డొసంగఁజాలఁ డని నిరసించితిని గాని యీశ్వరాభావ మెన్నఁడును బలికి యుండను. ఇయ్యగ్ని ప్రవేశము వ్రతముసుమా! ఈవ్రతము పూనకమున్న నీదర్శనభాగ్యము కలిగినచో నీరచించిన సూత్రభాష్యమునకు వార్త్తికపాఠము రచించి యుందు ననయతి 'ఇప్పు డైనను మించినది లేదు. కమండలూదకమునఁ దుషాగ్ని నార్పివేయుదును. లేచి రచింపు మనఁగాఁ బుణ్యచరితా! పూనిన యీవ్రతము విడుచుకొనుట న్యాయ్యము కాదు. అంత్యకాలమున భగవంతుఁడ వగు నీవు మోక్ష మొసంగ సన్నిధానము సేసితి వంతియ చాలును. తారక ముపదేశించి కృతార్థునిఁ 'జేయుము వార్త్తికరచనమే వాంఛిత మేని నాశిష్యుఁ డగు మండనమిశ్రునిజయించి యాతనిచేఁ జేయింపు మని కుమారిలుఁడు మండనుని పాండిత్యమహిమాదిక మంతయుఁ, జెప్పుటయు శంకరుం డాతనికి బ్రహ్మస్వరూప మెఱుంగం బల్కు బ్రహ్మానంద మొంది కుమారిలుఁడు సర్వబంధవిముక్తుఁడై భౌతికదేహము విడిచి పరమేశ్వరతేజమున విలీనుఁ డయ్యెను.

శంకరుఁడును శిష్యులతోఁ గూడ నాక్షణమే యాకాశమార్గమున మండనుఁ డుండుమాహిష్మతీపురమున కేఁగి యందలి వీథిం జనుచు మండనపరిచారికలఁ గాంచి, వారివలన 'మండనుఁడు సంన్యాసుల మోము చూడఁ డనియు, నేఁడు పితృశ్రాద్ధము నెఱవేర్ప నున్నాఁ డనియుఁ, దెలుప, నచ్చట నున్నయొక దేవళమందుఁ దాను విడిసి తన రాక యాతనికిం దెలుప శిష్యుల నంపెను. వారును బోయి కవాటబద్ధమగు ద్వారమునఁ బిలిచిపిలిచి యెట్టకేలకది తెఱువఁబడ- లోని కేఁగుచుండ మండనశిష్యు లెదురై వారి రోధించి నిందింప నిరుత్తగ

వారికిఁ గొంతతడవు వకోౖక్తులతో వివాదము నిర్మర్యాదముగ సాగెను. ఆసంగతి మండనుఁ డెఱిఁగి సబంధుపరివారుండై శంకరు నొద్దకు వచ్చి భిక్షావందనము సల్ప- యతీంద్రుఁడు వాదభిక్షార్థము వచ్చితిని గాని యన్నభిక్షార్థము కాదనుటయు భిక్షాంతరము వాదము కావింతము రమ్మని కోరిన మండనుసితోడ నాతనియింటి కరిగి యాతనివలనఁ బూజితుఁడయ్యెను. మండనుఁడు యతీంద్రునితో 'దేవా! మనవాదమున జయాపజయములు నిర్ణయింప మధ్యవర్తిగా నొకని దేవలయును గదా! నిమంత్రితులగు నీద్విజులు జైమనీయ వైయాసక సిద్ధాంతవేత్తలు. కాన వీరియందొకని నేర్పఱుచుకొందమా? అనుటయు శంకరుఁడు వారు వీరు నేల? నీధర్మపత్ని సకలవిద్యల విశారద యగు శారద యని విందును. ఆమెయే జయాపజయనిర్ణయ మొనర్చు నన- గృహి పన్నిదము దెల్పు మనుడు నోడినవాఁ డోడనివాని యాశ్రమము గొనుటయే యని శంకరుఁడు పలికెను. మండనుఁడు సమ్మతించెను. ఆమఱునాఁడు సభ యారంభ మయ్యెను. జనులెల్ల విన మండనుఁడును శంకరుఁడును మరలఁ దమ ప్రతిజ్ఞలను వెల్లడించిరి. ఆసమయమున మండనునిభార్య యుభయ భారతి సభకు వచ్చి యధ్యక్షపీఠ మలంకరించి యిరువుర మెడ లందుఁ జెఱియొక పువ్వులదండను వైచి 'ఎవ్వరి మెడ యందలి పూలమాల ముందుగ వాడిపోవునో యాతం డోడినట్లు, యని దైవప్రమాణముఁ బలికి గృహకృత్య నిర్వహణార్థ మింటిలోనికిఁ జనెను.

తరువాత మండనశిష్యులకును శంకరశిష్యులకును వాదోపవాదములు కొంతతడవు నడచెను. అందు మండనశిష్యులు వెనుకాడుట యరసి మండనుఁడు శంకరునితో వాదింపఁ మొదలిడెను. వేదములే కాని వేదాంతములు ప్రమాణములు కా వని తొలుత వాదించి యందోడి 'తత్త్వమసి' యను శ్రుతివాక్యము భేదశ్రుతి యని తర్కసిద్ధాంతములచే శ్రుత్యుపనిషత్ప్రమాణములచే వివరించి యన్నిమార్గములందును

శంకరునిచే నపజయము నొంది యాఱవదినంబున మూఁగ యట్లూర కుండెను. సభ్యుల సాధువాదంబులు మిన్నుముట్టెను.

## పంచమాశ్వాసము

అత్తఱి భర్త యురమునవాడి వ్రేలాడుసుమస్రజము గాంచి యుభయభారతి తత్తఱ మొందుచుండె. మండనుండు జైమినిమతంబు నిరస్తమయ్యె నని ఖేదము ప్రకటింప శంకరుఁడు జైమినియాశయము సచ్చిదాత్మము నెఱుంగుటకై కర్మమార్గము సాధన మనియే సుమా యనుటయు నాతని కాసంశయము పోవక జైమినినస్మరించెను.తోడన జైమిని తోఁచి శంకరుఁడు సాక్షాత్పరశివుఁ డనియు, నతని యుపదేశము గ్రాహ్యము. తదీయమతమే నామతము' అనియుఁ బలికి తిరోహితుఁడగుటయు సందియము లెల్లఁ బాసి మండనుఁడు శంకరుని శరణముగా వేఁడుకొనెను.యతిపతియు నాతనిని శిష్యుఁగా స్వీకరింప నెంచి యుభయభారతి వంకఁ గాంచుటయు,నాపె యాతని యాశయ మెఱింగి ఆర్యా! అర్ధదేహమగు నన్నుఁ గూడ జయింపనిదే నీకుఁ బూర్ణవిజయము సిద్ధింపలే దనెను. అపుడు శంకరుఁడు 'సాధ్వీ! పురుషులు స్త్రీలతో వాదించుట యనుచితమనగా; జనకునితో సులభయు యాజ్ఞవల్క్యునితో గార్గియుఁ దొల్లిఁ వాదింపలేదా?జయకాంక్ష గలవారు వాదమున స్త్రీపురుషవిభేద మెన్నరాదనియాపె పలికి యొడఁబఱిచెను. అంత నయ్యిరువురకు బదునేడు దినములు వాదమునడచెను.ఎందును వెనుదీయని శంకరుని పాండితీప్రాగల్భ్యములకాయమ యచ్చెరువు నొంది యీశాస్త్రములం దీతఁ డజయ్యుఁడని తలంచి పుట్టు బ్రహ్మచారిగదా వీనికిఁ గామశాస్త్ర మచుంబితమై యుండును. వాదమును దానిలోనికిఁ దివిచి యందు జయింతును అని తలంచి ప్రసక్తానుప్రసక్తముగఁ గామమును గూర్చి ప్రసంగించుచు, మన్మథకళలఁగూర్చి ప్రశ్నించుటయు శంకరుఁడు దెల్లఁబోయి'అమ్మా!' వాదమునకు సంబంధింపని యిట్టి ప్రశ్నము నన్న డుగుట చే నిగ్రహ

స్థానము నొందితివి. అయినను సభ కధ్యక్షురాలవగుటచే నిన్నుఁ
గాదనరా మింజేసి యూరకుండవలసివచ్చినది. అనాఘ్రాత మగు కామ
కళారహస్యము నన్నెట్లడిగితివో కదా యని వింతగ నున్నది. వాద
ధర్మము ననుసరించి యొక్కమాసము గడు విమ్ము. తరువాత వచ్చి
యందె వాదింతును అని గడువొంది, యొక కొండగుహ యందు శిష్యు
లతో నివసించి కామకళాగ్రంథము లన్నియు శోధించి యందలి రహ
స్యము లన్నియుఁ దెలిసికొని యాశరీరముతోఁ బరకాంతతో వాదింప
నధర్మ మని యొక చిలుకదేహమునఁ బరకాయప్రవేశ విద్యచేఁ
జొచ్చి యొక కిరాతునకుఁ బట్టువడి వానిచే మండనునింటికిఁ గొంపోఁ
బడెను. అచట మండనుని పరిచారిక లాచిలుకతో శబరుని నుభయ
భారతియొద్దకుఁ దెచ్చుటయు, నామె వానికిఁ గాన్కలనిచ్చి యాచిలుకం
గొని తదద్భుతధీశక్తికి వింతపడి పతి సన్నిధిని దానిశక్తిఁ బ్రకటింపఁజేసి
యుపవాసవ్రతదీక్షిత యగు నామె యుబుసుపోకకై కొని చని యొంటి
మెయి నుండి ప్రసంగవశమున శంకరునకుఁ దనకు నడచిన వాదము
చెప్పఁగా 'నే నుత్తర మిత్తునా' యను చిలుకపలుకున కీయకొనఁ గామ
కలావిధాన మంతయుఁ గీర ముపన్యసించుటయు నామె దాని కచ్చెరు
వొంది కొంతసేపు కళలం గూర్చియుఁ గొక్కోకవాత్స్యాయనుల ప్రామా
ణ్యముం గూర్చియు వివదించి- తుదకు నేదియు నిర్ణీతము గాకుండు
టచే మధ్యవర్తిగాఁ జిలుక చెప్పినప్రకారము మండనుని దెచ్చెను.
ఆయన యావాదోపవాదము లాలించి, యీయర్థము నేర్వ శంకరుఁ
డరిగెను. ఆయనపుఁ డిది నిర్ణయించును. నేఁడో రేపో రాఁగలఁ డను
టయుఁ గీరము తాను వచ్చునప్పుడు 'శంకరుఁ డిటకుత్తరమున నున్న
కొండగుహయందు సమాధి నున్న డెవరో మును లనుకొనుచుండ
వింటి ననియు, నైదాఱుదినముల ప్రయాణ మగు ననియుఁ దెల్ప నుభయ
భారతియు మండనుఁడును సపరివారముగా శుకసహితులై యాకొండ
గుహ కరిగి శిష్యులవలన శంకరుఁడు సమాధియందున్నట్లు విని గుహ

గ్రవర్తి యగు వట మహీజము నీడఁ గూర్చుండి సేదదీర్చుకొనుచుండఁ బంజరస్థమగు శుకము లక్ష్మీనృసింహుని స్తవమొనర్ప నారంభించెను. అందఱు నానందాద్భుతరసనిమగ్నులై వినుచుండ 'సంసారవృక్షము నుండి యధోముఖుఁడనై క్రిందికిఁ బడుచుంటి' నను నర్థముగల శ్లోకార్థమును జదివి పంజరమునందే యాధారదండమునుండి క్రిందఁ బడి పోయెను. అందఱు నిర్విణ్ణులై చూచుచుండఁ జిలుక విడిచిన పద్యములోని పైసగము చదువుచు గుహనుండి శంకరుఁడు ఇవ్వలకు వచ్చుట యరసి మండనాదులు నాచార్యశిష్యులును నాశ్చర్యచకితు లగుచు నర్ఘ్యపాద్యాదికమున నర్చించుటయు నుభయభారతి తాను జయేచ్ఛచేఁ జేసిన కాపటికత్వము వెల్లడించి యాతప్పిదమును క్షమింప వేఁడుకొని తనభర్తయుఁ దాను నోడిపోవుట యంగీకరించి 'భర్త నెడఁబాయఁ జాలకయట్టి యవినీతిప్రసంగము సలిపితి' ననియుఁ జెప్పెను. మండనుఁడును 'దేవా! శుకదేహమునఁ జొచ్చి కామకళాభ్యాసము నాశాస్త్రమున వాదోపవాదములును సలుపు దోషమునకుఁ బరిహారకముగ నృసింహస్తవముసేసి పరకాయప్రవేశవిద్యాప్రభావమున మానవదేహమున మరలఁ జొచ్చి, యసాధారణమహిమము వెల్లడించిన భవదీయ చరిత్రము గొనియాడ నేనేపాటివాఁడను' అని తనయోటమి యొప్పుకొని సశిష్యుఁడగు నయ్యతిపతిని దోడ్కొని మాహిష్మతికిఁ దిరిగి సపరివారుఁడై వచ్చి, ధనగృహకేదారాదికములు సంతతికిఁ బంచియిచ్చి సంన్యాసస్వీకారమునకై ప్రాజాపత్యేష్టి సలిపి యగ్నిహోత్రముల నాత్మారోప మొనరించుకొని సంసిద్ధుఁ డగుటయు, వాద ప్రారంభించి నది మొదలు ఉపవాసవ్రతదీక్షితయయి నవసి పోయియున్న యుభయభారతి శంకరునితో 'ఆర్యా! నాకును నాపతికిని దాంపత్యసంబంధమున సాక్షియగు నీయగ్ని నాభర్తృహృదయమునఁ జొచ్చుచుండ నూరక చూచుచు నీదేహముతో నేనుమాత్రము మిగిలియుందునే? అని పలికి పతితో 'నాథా! నాప్రాణములకు నీవ యధీశ్వరుఁడవు, కావున నిన్ను

విడిచి నేనుంట తగవుకాదు. కాన నీయగ్నితోపాటు నన్నుఁగూడ నీయందుఁ జేర్చుకొమ్ము’ అని భర్తపాదములయొద్దఁ బద్మాసనాసీనయై యోగము పూని శరీరము విడిచి యగ్నులయందుఁ దేజోరూపమునఁ బ్రవేశించెను. అంత నాతేజమున సాక్షాద్భారతీరూపమును శంకరుఁడు గాంచి యామె పాతివ్రత్యప్రభావమును బెక్కురీతులఁ గొండాడి యామె పేర శృంగగిర్యాదిక్షేత్రముల మఠమును స్థాపించి యామె పాతివ్రత్య యోగశక్తులను లోకమునకు వెల్లడింతు నని ప్రతినఁ బూని మండనునకుఁ దురీయాశ్రమము నొసఁగి ‘తత్త్వమసి’ యను సూక్తిని శంకారహిత మగున ట్లుపదేశించి సురేశ్వరుఁ డను నామము నొసంగి ధన్యు నొనర్చెను. అంత నాయనఘుఁడు మగధదేశమునందే పర్యటించుచు సంన్యాసధర్మములను బాలించుకొనుచు బ్రహ్మానందమునొంది బహుకాలము గడపెను. పండితలోకమున కెల్ల నసాధ్యుఁ డగు మండను నోటఁ బుచ్చుటతో శంకరుకీర్తి మిన్నుముట్టి ప్రతివాదుల గుండెలు నీరుగాఁ జేసివైచెను. పిమ్మట శంకరాచార్యుడు శిష్యులతో దక్షిణదిక్కునకుఁ జైత్రయాత్రార్థము వెడలెను.

## షష్ఠాశ్వాసము

అట్లు వెడలి శ్రీశైలముం జేరి భ్రమరాంబామల్లికార్జునుల సేవించి యాప్రాంతముల నద్వైతమతము వ్యాప్తి నొనర్చుచు నుండు నెడ నొకకాపాలికుఁడు శంకరు నెట్లేని సంహరింప నెంచి యాయనను దర్శించి నుతించి “మహాత్మా! శరీరాభిమానము లేనివా రగుటచే మిమ్ముల నొకటి కోరుకొందును. కపాలధరుఁ డగు పరమేశ్వరుని మది నిడుకొని యీశరీరముతోఁ గైలాసమునకుఁ బోవుటకై పెద్దకాలము తపమొనర్చితిని. అంతఁ గపాలి పొడసూపి చక్రవర్తి శిరమైనను సర్వజ్ఞ శిరమైనను నగ్నియందు హోమమొనర్ప నీకోర్కి సిద్ధించు ననెను. చక్రవర్తి నాకు లభింపఁడుగదా; సర్వజ్ఞునికై వెదుక నీవు గాక జగమున

సర్వేఁగునుఁ గానిపింపఁడు. దధీచి ప్రభృతులవంటి వాఁడవు. నీవలన నా కోర్కె నెఱవేఱు నని వచ్చితి" ననుటయు దేహాభిమానదూరుండగు జగద్గురుఁ డాతనిం గాంచి "అట్లే యొసఁగెదను. నేను వివిక్తస్థలమున సమాధియం దున్నతఱి వచ్చి నీయభీష్టము నెఱవేర్చుకొను మంతియ కాని శిష్యులు చూచుచుండ వచ్చిన నీకోర్కె నెఱవేఱదు. వారు నా యెడఁ బరమభక్తులు కాన నెఱిఁగి రేని సహింప" రని సంకేతము చేసి మఱునాఁడు సమాహితచిత్తుఁడై యొంటిగ నుండెను. శిష్యులు స్నానమున కేఁదో చనిరి. భీకరాకృతితో నాకాపాలికుఁడును వచ్చి శూల మెత్తి శంకరు నేయ నుంకించి, యాయన వెనుకభాగమున జీఁకటి యందుఁ జంద్రనిప్పులట్లు రెండుజ్యోతిస్సు లగపడుటయు, నెత్తినకాలును గేలు నట్లయుండఁ బెద్దకేక వైచి యుపగతసంజ్ఞుఁ డయి క్రిందఁ బడి కొంతసేపటికి సచేతనుఁడై 'అదే సింహము నామీఁదఁ బడ నుండెను. మహాత్మా! రక్షింపు' మని మొఱ్ఱవెట్ట, సమాధిఁ బాసి గురువరుఁడు కను విప్ప గాపాలికుఁడు గిలగిలఁ దన్నుకొనుచుంట కనవచ్చుటయుఁ జేరవచ్చి యూరార్చి వెనుక నున్న సింహమువంకఁ గాంచ నారసింహరూపము తోఁచుటయు ప్రాంజలియై యద్దేవు ననేకవిధములఁ బొగడి యాకాపాలికు రక్షించి శాంతింపు మనుటయుఁ గ్రమముగా నాసింహము శాంతించి పద్మపాదుఁడయి కానఁబడియెను. కాపాలికుఁడును లేచి 'నరహరి! యెటువోతివి? రక్షింపు' మనుచు నేడ్చుచు శంకరుని పాదముల వ్రాలి తన దుస్సంకల్పము క్షమింప వేఁడుటయు నాయనఘుఁ డాతని యెడ సదయుఁడై తురీయాశ్రమ మొసఁగి శిష్యునిగాఁ బరిగణించుకొనెను.

అంత పద్మపాదుని గని శిష్యులందఱు నీకెటు నృసింహదేవుఁడు వశుఁడయ్యె నని యడుగ "నే నహోబలక్షేత్రమున ము న్నొకప్పుడు తపం బొనరించుచుండ నొక బోయశిశువు నాకడకు వచ్చి స్వామీ! యేల యిట్లు శ్రమపడెద వని యమాయికముగ నన్నడుగఁ 'గంథము

డాఁక మనుష్యాకారముగల సింహ మీయడవిని గల దని విని దాని వెదకుచున్నా నని నేనంటినో లేదో యి దెంత పని యని యా చెంచుబుడుతఁడు తీఁగలతో గట్టిన్నసింహుని దెచ్చి నా యెదుట నిడుటయు నచ్చెరువొందుచు నుతించి 'దేవా! మునుల కేని యగోచరుండ వగు నీ వీవనచర శిశువున, కెట్లు వశుఁడవైతి'వని యనుటయు నద్దేవుండు 'వీని భక్తి యనితరసాధారణము. చెంచులక్ష్మి నన్నుద్దేశించి 'రమ్మనిన రమ్ము, పొమ్మనినఁ బొ' మ్మని పాడునట్టి పాటను జెంచులు పాడుకొనుచుండ విని దానిని వీఁడు భక్తిపరవశుఁడై పాడుచుండ సామగానముకంటె మిన్నయై యాపాట నన్ను నాకర్షించి వీనివశ మొనర్చినది. ఇంతకాలము నుండి తపము చేయుచుంటివి గదా! నీవు ఇన్నాళ్లలో వీనివలె నచంచల చిత్తవృత్తితో నున్న దెన్నాళ్ళో యరసికొనుము. నేఁడుగదా వీనిమూలమున నట్టి పరిపాకమునకు వచ్చితివి? వచ్చుటతోడనె యిదిగో గోచరించితి నని చెప్పి మాయ మగుటయు నయ్యో! కిరాతశిశువుపాటి వివేకిని గానైతినే యని వగచుచుండ 'ఓడకుము. శత్రుపీడఁ గల్గుచో నను స్మరింపఁ గాపాడుదు నని యశరీరవాక్కొక్కటి వినరాఁగా స్వస్థుఁడనైతిని. గుహునకు నేఁడు వచ్చిన శత్రుపీడ వాదేయని నే ననుకొనుచుండ నా దేవుఁడు గురుని రక్షించి నాప్రాణము నిలువఁబెట్టె' నని తన పూర్వవృత్తము చెప్పి వారి నందఱ నాశ్చర్యచకితుల నొనర్చె. తరువాత జగద్గురుఁడు సచ్ఛాత్రుఁడై యవనిఁ బర్యటించుచు గోకర్ణ క్షేత్రమున కరిగి గోకర్ణేశుఁ గొండాడి హరిశంకరాఖ్యక్షేత్రము సేరి హరిశంకరుల నభేదబుద్ధిఁ బూజించి శ్లేషకవితచే నభేదముగ నుతించి, యటఁ గదలి మూకాంబాదర్శనార్థియై యరుగుచుఁ ద్రోవ యందు మృతుఁడగు తమబాలుని కళేబర మొడియం దిడుకొని విలపించు విప్ర దంపతులఁ గాంచి, జాలి నొంద 'రక్షింపలేని దయాళుత్వము దుఃఖమునకె యాను జుమీ' యని యశరీరవాణి వినవచ్చుటయు 'నీ వనినది నిజమే! మూఁడు జగముల నేలు నీకొకనికే దయచూప నర్హత గల'దని

యహంకారదూరుండై పలుకుటయు మృతబాలుఁడు పునరుజ్జీవితుఁడై యుండుట కాపంచాశ్చర్యములఁ గలిగించెను. శంకరుండును మూకాంబాలయముఁ జొచ్చి యద్దేవిని బూజించి శాస్త్రవిధాన మెల్ల నద్వైత పరముగ సమన్వయించి పరమాత్మరూపిణిగా నాదేవిని లోకోత్తరరీతి నుతించి యటనుండి బల్యగ్రహారము చేరెను.

అందుఁ బ్రభాకరుఁడను విప్రుఁడు గలఁడు. వానికొడుకు పుట్టినప్పటి నుండియు నొక్క రీతిగనే జడుఁడుగా నుండెను. పదుమూఁడేండ్లప్రాయము వచ్చెను. మూఁగయటు లుండును. శంకరుని మహిమను వినుచున్న యావిప్రుఁ డాయూరు శంకరుల రాక విని సుతుని జూపి వాని వృత్తమంతయు వినిపింప నాబాలుని జేరఁ బిలిచి యెవ్వఁడవు నీ వని యడుగుటయు నంత మున్నెన్నఁడు నెవరితోడ మాటాడని శిశువు నవ్వుచు గురూత్తమా! దేహేంద్రియాద్యతీతుండగు పరమాత్మస్వరూపుఁడ నను నర్థముగల పద్యములఁ జెప్పుటయుఁ బరమార్థము కరతలామలకముగా నెఱింగిన వాఁడగుటచే హస్తామలకుఁ డని పేరిడి తండ్రిని సమాధాన పఱచి యాబాలుని శిష్యునిగా గ్రహించి తోడ్కొని చని శృంగగిరి చేరి యందు నాలయము గట్టించి దానియందు మహాపతివ్రతాతిలక మగు నుభయభారతిపేర భారతీదేవిఁ బ్రతిష్ఠ గావించి భారతీసంప్రదాయుని సురేశ్వరాచార్యు నచట నెలకొలిపి మతవ్యాప్తిఁ జేయ నాజ్ఞాపించెను. అచట నప్పరమేశ్వరిని నిరంతరమారాధించుచున్నతఱి నొక బ్రహ్మచారి శిష్యత్వము గోరి వచ్చి యనవరతము నఖండభక్తి సేవింపఁ జొచ్చెను. ఆసేవయందును గురుని శాటికలేటినీటియందు లెస్సగ నుదికి యాఱవేసి యందిచ్చుటయం దెక్కువ శ్రద్ధగలిగియుండెను. ఒకనాఁ డాతఁడు గురుని శాటికలు గొని యేటి కరిగి యుదుకుచున్న సమయమునఁ బద్మపాదాదులు పాఠము చదువ నెంచ శంకరుఁడు 'గిరి వచ్చు దాఁకఁ దాళుఁ డనఁ, బద్మపాదుండు నవ్వుచు 'నార్యా! మందబుద్ధి

యగు గిరికై ప్రతీక్షించుట యేల? యనుటయు- వాని గర్వ మడంగ మనస్సుచేఁ జతుర్దశవిద్యలును గిరి కనుగ్రహించెను. గిరియు నచ్చెరు వొందుచు గురునిఁజేరి యద్వైతార్థనిబిడమగు తోటకవృత్తములచే గురుని నుతింప నందఱును నద్భుతపడి చూచుచుండిరి. గురువరుండు నాతనికిఁ దోటకాచార్యుఁ డని బిరుదునామ మొసంగి ముఖ్యశిష్యులలో నొకనిగ స్వీకరించెను.

అట్లు శిష్యచతుష్టయవిరాజితుండై శంకరుఁ డుండునెడ సురేశ్వ రుం డేదేని గ్రంథము రచించి గురుల కార్యభారంబు కొంత యపన యింపఁ దలంచి తనతలంపు విన్నవింప విని గురుచంద్రుఁడు నాభాష్య మునకు వార్తికసారము రచియింపుము. ఇయ్యది నీగురుఁడగు కుమారి లుని వాంఛితము. ఆయన బ్రహ్మభూయంబు నొందుతఱిఁ దనకాకోర్కి యున్నట్లు చెప్పెను. అది చేసినచో నాయన యాత్మకు శాంతియు లోకోపకారమును నగు నని పల్కుటయు సురేశ్వరుండును దానికై పూనుకొనెను.

ఆసంగతి వినిన చిత్సుఖాదు లగు శిష్యులు సురేశ్వరుఁడు చెంత లేనితఱి గురునితో 'మహాత్మా! పూర్వమీమాంసానిష్ణాతుఁడై కర్మ వాది యగు సురేశ్వరుని మీభాష్యమునకు వార్తికము రచింపు మనఁ కభీష్టమగు కర్మమతసిద్ధాంతముల నందుఁ జొప్పింపక మానఁడు. ఁడు వాదమం దోడి బలవంతముగ సంన్యసించినవాఁడు. కావున మమాదివిభూతియుక్తుఁ డగు పద్మపాదుని నియోగింపరాదా? మీకు క్తుఁడు, పాండిత్యమున నసాధారణుఁడు గాఁడా? కాదేని మీ పాద సంవాహనరూపమగు తపమున నఖండవిజ్ఞాన మార్జించుకొన్న యానంద గిరిని నియోగింపవచ్చునే' యనిరి. అది విని పద్మపాదుఁడు హస్తామ లకుఁ జూపి యీతం డఖిలాద్వయార్థనిధి యగు టెటింగి, మీ రేకదా హస్తామలకుఁ డను బిరుదనామ మొసంగితిరి? కావున నీతనిని నియో

గింపఁ దగు' ననెను. అది విని యాచార్యుఁడు నవ్వి యీతండు జ్ఞ యగునే కాని యథావిధిగ విద్యలను గురులొద్దఁ జదువకపోవుటఁ శ్రుత్యర్థనిర్ణయమున కీతఁ డనర్హుఁడు. ఇతఁ డనేఁడు మూకుఁడై వర్తిలుట మీరును గాంచినారే కదా! జనన మొందునపుడ సకలవేదశాస్త్రములునెఱిఁగిన బ్రహ్మరతుఁడేకానిందు బాహ్యప్రపంచ మెఱుంగమి గ్రంథరచన కనర్హుఁ డనుటయు- నీతనికి శ్రవణాదులు లేకయ సకల విద్య లెటు వచ్చినవి? అని యడుగు శిష్యులకు గురుఁ డిట్లనెను. తొల్లి యమునానదీతీరమున నొకమునీంద్రుఁడు తప మొనర్చుకొనుచుండెడి వాఁడు. ఈహస్తామలకుఁడు శిశువై యున్నతఱి వీనితల్లి వీని నెత్తికొని నదికి స్నానార్థ మరిగి తాను స్నానముచేసి వచ్చుపర్యంతము కొడుకు నరయుచుండ నమ్మునిని వేఁడి యచట డించి తోడి బోటులతో స్నానార్థ మరిగెను. వీఁడును నిలునటు దోఁగాడుచు నల్లఁ జని యయ్యేటఁ బడి ప్రాణములను బాసెను. స్నానానంతరము తల్లి వచ్చి పిల్లనికై వెదకుకొని యేటఁబడి కొట్టుకొనిపోవుచున్న బాలశవము నెత్తుకొని మునిచెంతనుంచి బోరన నేడ్చుచుండ, సమాహితుఁడైన యయ్యతి బాహ్యవాసనల నొంది యెఱింగి యాశిశువు శరీరమునఁ జొచ్చి వారల దుఃఖము పోఁగొట్టెను. చచ్చి బ్రతికినాఁడు శిశువని యందఱు నానందించిరి. వీఁడు వేదశాస్త్రముల నెఱింగినను బాహ్యప్రపంచ మెఱుంగమి భాష్యములకు వ్యాఖ్య రచింప ననర్హుండు. సరస్వతీసాక్షికముగా సర్వజ్ఞత్వము గన్న సురేశ్వరుఁడు దక్క నన్యుల కాగ్రంథము రచింప నర్హత లేదు. ఇందఱు మీ రసమ్మతిని దెలుపుచుండ నాతఁ డొకవేళఁ బూనుకొనినను గ్రంథమునకు విఘ్నము రావచ్చును. ఈరీతి నిషేధించుట యనుచిత మనియైనఁ దలంపరే యనెను. అంత చిత్సుఖాదు 'లార్యా! పద్మపాదుఁ డర్హుఁ' డని మరలఁ దెలుపుటయు గురుండు వార్త్తికరచనమునకు సురేశ్వరుండె యర్హుఁడు. పద్మపాదుఁడు భాష్యముపై వేఱొక వ్యాఖ్య రచియింప వచ్చునని యాజ్ఞాపింప సురేశ్వ

డఁపు 'మహాత్మా! పద్మపాదుఁడే యాగ్రంథము రచించుఁగాక' యని తన కేల నున్న గ్రంథము గురుని పాదముల కడ నుంచుటయు 'నైష్కర్మ్యసిద్ధి' యను నాగ్రంథము నరసి సంతసించి శిష్యులకుఁ జూపుటయు వారలు సిగ్గువడిరి. అపుడు సురేశ్వరుఁడు కటకటఁ బడి రచించుచున్న వార్తికపాఠమును బాఱవైచి యూరకుండెను. పద్మపాదుఁడు భాష్యమునకుఁ డీక రచించెను. పూర్వభాగమునకుఁ బంచపాదిక యనియు, నుత్తరార్థమునకు వృత్తి యనియు నయ్యది యలరారెను. వ్యాససూత్రములకు డిండిమ మను నొక వ్యాఖ్య రచించి గురుపాదులకు సమర్పించెను.

అనంతర మొకనాఁడు సురేశ్వరునితో 'మంగళాచరణబలము లేక నీకృతి విఘ్నమొంది యుండవచ్చును. కాని నీమనస్సు క్షోభించుటచే, బద్మపాదుని గ్రంథమైనను గట్టెక్కుట దుర్ఘటంబు' అని కనులు మూసి ధ్యానించి పద్మపాదుని టీక యయిదుపాదములె నిలుచును. అందైనను రెండు సూత్రములు మాత్రమే రహించును. శాపవశంబున మనుజుఁడవై పుట్టిన బృహస్పతివి; నీవు రచించు భాష్యటీక యాకల్పము వెలుఁగొందు గాక, యని యాశీర్వదించి తోటకాదులను బ్రహ్మవిద్యాంచితము లనుగ్రంథముల రచింప నాదేశించెను. వారును బెక్కుగ్రంథముల రచించి యద్వైతమతవ్యాప్తికిఁ దోడ్పడిరి.

## సప్తమాశ్వాసము

పద్మపాదుఁడు తీర్థయాత్రకై గురుని వేఁడి సెలవొంది వెడలెను. శంకరులు తల్లి కవసానదశ ప్రాప్తించుచున్నదని యెఱింగి, యోగవిద్యచే నాకాశమార్గంబునఁ జని, తల్లిని సమీపించి, యామె హృదయమునకు ప్రశాంతిఁ జేకూర్చి, యామె కోర్కె ప్రకారము ముందు రప్పించిన శివదూతల నంపి, విష్ణుదూతల రావించుటయు, నామె బ్రహ్మానందాను

భవంబుతో విమాన మెక్కి విష్ణుదూతలచే నర్చిరాది మార్గంబునఁ బరమపద మొందెను. అనంతరము జ్ఞాతులరావించి యామె శరీరమున కంత్యసంస్కారములు సేయుఁ డన, నవనీతులయి నీవు లేని యప్పుడు మేము చేయుదుముగాని నీవు సన్నిధి నుండ మాకేమి పని యని నిరాకరింపవారిని గర్మబాహ్యులు వేదబాహ్యులునుగా శపించి, యాపద్ధర్మముగాఁ దాన సంస్కారమునకుఁ బూనుకొని యగ్ని నిండని వేఁడి, నిరాకృతుండై తల్లిదక్షిణభుజమథనమున నగ్నిని బుట్టించి శవవహనార్థ మెవ్వరును రాకుండుటచే "నింటి పాణిద్వారము నొద్దఁ దల్లి శవము నుంచి దహించి 'యిది మొదలుగా నీకాలటి గ్రామవాసులకుఁ బెరటి ద్వారమే స్మశాన మగుఁగాక' యని శపించి యథావిధిగఁ దల్లికిఁ బారలౌకిక క్రియలు నెఱవేర్చి, స్వాస్థ్య మొంది, జగంబునం బాదుకొనిన కుమతంబుల రూపు మాపనెంచి పద్మపాదుని రాకకై చూచుచుండెను.

గురు ననుజ్ఞ నొంది పద్మపాదుఁడు కాళహస్తీశ్వరుని భజించి, కాంచి కరిగి యేకామ్రేశ్వరునిఁ గామాక్షిం బూజించి, కల్లాలేశుఁ గొలిచి, పుండరీకపురమున శివు నారాధించి, శివగంగ మునింగి, నటరాజు సేవించి, కావేరిని స్నాన మొనర్చి, శ్రీరంగేశ్వరుఁ గొలిచి, సేతువుం గాంచ నరుగుచు మార్గమధ్యమున నున్న మాతులునిం జూడం జనుటయు, నాతండు సబాంధవముగా సమ్మానింప నలరి, వారలకు ధర్మంబులు చెప్పి, సేతువు చూచి వచ్చుదాఁక స్వకృతభాష్యటీక దాఁచి యుంచుమని మేనమామ చేతి కిచ్చి బయలువెడలి దుశ్శకునముల గణింపక సశిష్యుఁడై చనియెను. మేనమామ యనిన నసాధారణపండితుఁడు. మీమాంసక శేఖరుఁడు. అతఁడు పద్మపాదుని గ్రంథమంతయు నాతని వలన వినియుంటచేఁ దన మతమునకు హానికర మని తలంచి గృహమందుంచి యిల్లు తగులఁ బెట్టె అయ్యో! నాయింటి

మాట కేమి? మేనల్లుని గ్రంథము కాలిపోవుచున్నదే! అని గొంతెత్తి విలపించె నని కింవదంతి గలదు.

ఇకఁ బద్మపదుం డట్లు తీర్థయాత్ర కరిగి రామేశ్వరమున రామనాథు సేవించి మరలివచ్చి గృహదాహవృత్తాంతము విని గ్రంథనాశమున కంటెను మాతులుని గృహదహనమున కార్తి నొంది గ్రంథము నాబుద్ధియందే కలదని మరల వ్యాఖ్య రచింప నుపక్రమించు టెఱింగి, బుద్ధిని హరించు పదార్థము దెచ్చి మాతులుఁ డన్నమం దిడి తినఁజేసెనని జనులందురు. ఆవార్త విని తనవలెఁ దీర్థయాత్రాపరులగు సతీర్థ్యులు కొందఱు కనవచ్చుటయు, నాసమయంబున గురువరుఁడు కేరళమున నున్నట్లు విని యందఱు నటకరిగి గురుని దర్శించి మ్రొక్కి, వారియోగక్షేమము లరయుతఱిఁ బద్మపాదుఁడు తనమాతులుఁ డొనర్చిన దుష్కృత్యముఁ జెప్ప—సురేశ్వరుని వార్తికరచనము నాఁడు చెప్పి యుండలేదా? మీ రానాఁ డాతని మదికిఁ గలిగించిన పరాభవాగ్నియే నీగ్రంథము కాల్చినది. కాని మేనమామయుఁ గాదు. అగ్నియుఁ గాదు. ఇతరులకుఁ జిత్తక్షోభము కలిగింప నది యూరకుండునా? అది యటుండ నిచ్చి మున్ను శృంగగిరిని నాకు వినిపించిన పంచపాది మాత్రము నేను మఱువలేదు. దానిని వ్రాసికొమ్మని యాగ్రంథమంతయుఁ జెప్పెను. పద్మపాదుఁడది వ్రాసికొని యమితానంద మొందెను.

అంత నవ్వార్త కేరళదేశాధీశ్వరుఁడు విని తననాటకత్రయమును నగ్నిపాలగుటఁ జెప్ప, శంకరుండు తొల్లి వినియుండుటచే నవియును జెప్పెను. రాజు వానిని లిఖించుకొని మీయభీష్ట మే మనుడుఁ గాలటివాసులకు నేనిచ్చిన శాపము పాలింపు మని పలికెను. ఆతఁ డది శిరసావహించి తనపురికిం జనియెను.

అనంతరము సహస్రశిష్యులు వేష్టించి తోడరా, సుధన్వభూకాంతుఁడు ధనుర్ధరుం డయి వచ్చుచుండ, సేతువు దాఁటి బోవ వెడలెను. త్రోవలో మధ్యార్జునం బను శివక్షేత్రమున కరిగి మధ్యార్జునేశ్వరు నారాధించి పాపముల రూపుమాపి, యాదేవుని 'నిగమసమ్మతమైనది యద్వైతమా? ద్వైతమా? యని యడుగుటయు నాలింగము శిరోభాగమునుండి యొకదివ్యజ్యోతి వెలువడి 'యద్వైతమె సత్య' మని ముమ్మాఱు బొబ్బ వెట్టి మాయ మయ్యెను. చూపఱు విస్మితులై యాక్షణమే శంకరునకు శిష్యులై పంచాయతనపూజాపరులై, యద్వైతమతము స్వీకరించి కృతకృత్యులైరి. పిదప శాక్తులు శంకరుని గాంచవచ్చి తమమతము ప్రశస్తమైనదనియు, స్వీకరింపు మనియుఁ బలికి శంకరునిచే నావాదమెల్ల ఖండింపఁబడ—శిష్యులైరి. వారివెంట లక్ష్మీభక్తులు, శారదోపాసకులును రాఁగ వారినిగూడ వాదమున నోటఁబుచ్చి, యందఱ నద్వైతమతతత్పరులుగను బంచాయతన పూజానిరతులుగను నొనర్చి, యనంతరము మూఁగిన వామాచారులగు శాక్తుల సిద్ధాంతము లెల్ల ఖండించి, ప్రాయశ్చిత్తములఁ జేయించి వారి నద్వైతుల నొనర్చెను.

పిదప నాచార్యపాదులు రామేశ్వరమునకు సహశిష్యముగాఁ జని రామనాథు సేవించుచు మాసద్వయ మచట నుండిరి. అయ్యెడ, శైవులు, రుద్రభక్తులు, జంగములు, పాశుపతులు ననువారు గుములు గుములుగ వచ్చి వేదప్రమాణములతోఁ దమతమ మతస్వరూపముల నెఱిఁగించి లింగధారణము ముఖ్యమని తెలుప- నయ్యతిపతి లింగధారణ మవైదిక మని యుపపత్తులు చూపి, ఖండించి స్మార్తకర్మపరాయణులుగ వారి నెల్లర నొనర్చి లింగాంకనధారణము మాన్పి, యద్వైత విద్య నుపదేశించి శిష్యులుగ ననుగ్రహించి యటనుండి యనంతశయనక్షేత్రమున కరిగె.

## అష్టమాశ్వాసము

ఆక్షేత్రమునందుఁగల వైకుంఠుని భక్తి సేవించుచు నొక్క నెల యుండు నప్పటికి శంకరాచార్యుల యశంబు విననోపక వైష్ణవ, పాంచరాత్ర, వైఖానస, భక్త, భాగవత, కర్మవిహీనులను షడ్విధవిష్ణుభక్తులు వరుసగా వాదింపవచ్చి తమతమ మతముల నుపన్యసింప విని యందలి లోపముల నెల్లఁ జెప్పి, ఖండించి వారి నందఱ శిష్యులుగాఁ జేసికొని, యటనుండి సుబ్రహ్మణ్యక్షేత్రమున కరిగి యచట నాసుబ్రహ్మణ్యస్వామి యథావిధిఁ బూజించి, తండోపతండములుగ వచ్చు జనులకెల్లరకు నద్వైతప్రబోధమ్ము సేయఁ దొడఁగె.

అది గాంచి హిరణ్యగర్భమతస్థులు శంకరుని బ్రతిఘటించి యోడి దాసులైరి. పిదప వహ్నిమతస్థులు నట్లే శిష్యులైరి. తరువాత సౌరమతస్థులు కొందఱు స్వమతప్రాశస్త్యము తెలుపఁ బూని, ఖండితులై జగద్గురుని పాదముల నాశ్రయించిరి. అనంతర మట నుండి వాయవ్యదిశకు వెడలి మార్గమధ్యమునఁ బ్రజలచే మహారాజోపచారముల నొందుచు వారల సందేహముల నన్నిటిని దూలించి యద్వైతవిద్యారహస్యముల వెల్లడించుచు దైవచింతకుల నందఱ శిష్యులుగా ననుగ్రహించుచుఁ దిన్నగా గణవరమను పురము చేరెను.

ఆగణవరము గణపతిక్షేత్రము. అచటిప్రజ లందఱు గాణపత్యమతస్థు లగుటచే నెవ్వరును శంకరు నాదరింపరైరి. అయిన నచటఁ బద్మపాదుఁడు బాకం బొనరించి యందఱకు భిక్షలు సేయుచుండె. అట్లు జరుగుచుండ నొకనాఁటి సాయంకాల మయ్యతీంద్రుని శిష్యు లందఱు గుంపులు గట్టి వివిధవాద్యములతో శివతాండవలీలల నటింపఁ బూనఁ, గ్రమముగా జనులు చూడవచ్చి తన్మయులై తాముగూడ నటింపఁ జొచ్చుట, గాణపతు లరసి 'సంన్యాసులు చేయు నాట్యము మన

వంటిగృహస్థులకుఁ దగదు. వీరిమత మాకాశమువలె శుద్ధశూన్య మని యాక్షేపింప శంకరభగవత్పాదులు వారిం బిలిచి యావిషయ మటుండ నిచ్చి మీమతమెట్టిదో తెల్పుదురే యనుటయు, వారలు గాణాపత్య మాఱు విధము లనియు సర్వమతశేఖర మనియుఁ దుం డైకదంతాది చిహ్నధారణ మావశ్యక మనియు, వారలు దెల్ప - హారిద్రాగణపతి నవనీతగణపత్యుచ్ఛిష్టగణపత్యాది భేదమ్ముల వివిధమూర్తుల సేవించు నాగాణాపత్యుల నందఱను వాదమ్మున నోడించి శిష్యులం జేసికొని, వారల స్మార్తకర్మపరాయణులనుగా నద్వైతవిద్యానిరతులుగ నొనర్చి తామ్రపర్ణీతీరస్థు లగు ప్రజల కద్వైతవిద్యావిషయమునఁ గల సంశయమ్ములు దొలఁగించి, తన్ను సేవింప వచ్చిన కాంచీపురీజనులం బోలె వారిని ననుగ్రహించి, యాంధ్రుల రక్షించి, వేంకటేశ్వరపాదపద్మంబుల సేవించి, విదర్భరాజనగరము చేరెను. ఆవైదర్భుఁ డెదురుగ వచ్చి శంకరాచార్యుఁ బూజించెను. యతీంద్రశిష్యు లచట వాదింప వచ్చిన భైరవమతానుయాయులఁ దూల్చిరి. పిదపఁ గర్ణాటదేశమునఁ బర్యటింప నుత్సహించుయతీంద్రుని గాంచి విదర్భభూపతి 'ఆర్యా! కర్ణాటదేశము కాపాలికాకీర్ణము. ఆస్తికులకది చేరరాని దని పలుకుటయు, నధిజ్యధన్వుఁడగు సుధన్వుఁడు 'మీ కేభయమునురాదు స్వామీ! వీఁడు మీభక్తుఁడు గలఁ'డని పలుక నప్పుడె కన్నడమున కేఁగెను. అది యెఱింగి క్రకచుఁడను కాపాలికగురు వొకఁ డుగ్రాకారుఁడై శంకరుం గాంచి 'యోయీ! భస్మము దాల్తువు గాని కపాలము దాల్పవేల? బొంత దాల్తువు గాని రక్తసిక్తములగు నరశీర్షమాలికలను దాల్పవు. మద్యమునను భైరవుని బూజింపవు. ఆదేవుఁడు నిన్నె ట్లనుగ్రహించు? నని నిహీనముగా వదరుటయు నీఖలుని మెడవట్టి యవులకు నెట్టుఁడని సుధన్వుఁ డాజ్ఞాపింపఁ దద్భటులు వాని నవ్వలకుఁ ద్రోయ 'మిమ్ములను జంప కున్న నేను గ్రకచుఁడనే యని పగచాటి యాకాపాలిక గురుఁడు వెడలిపోయి కపాలిగ

ణము గూడఁ గట్టుకొని యతులనందఱ వివిధాయుధంబుల నేయుటయు, నాద్విజులు భయపడి పఱచుచుండ. సుధన్వుండు ధనుర్ధరుఁడై యెదిర్చి కపాలిబలమును జీకాకొనర్చుచుండ వేఱొకవంకనుండి కపాలిభటులు విప్రులపైఁ బడిరి. వారెల్లరు భీతిలి శంకరుని మఱుఁగుచొచ్చుటయు నయ్యాచార్యుండు వారి కభయమొసంగి, యాకాపాలికబలము నంతయు హుంకారముచే బూదిగ నొనర్చెను. సుధన్వుఁ డీవంక వచ్చుచుండిన కాపాలికుల నెల్ల నుఱుమాడెను. అంతఁ గ్రకచుఁడు మండిపడుచు శంకరుం జేరి 'దురాత్మా! నామహిమముం జూతువుగాక' యని యొకకపాలము చేఁబూని భైరవుని ధ్యానింప విచిత్రముగ నందుఁ గల్లు పొడముటయు, నాకల్లు సగము ద్రావి మరల భైరవు ధ్యానింప నాదేవుఁడు ప్రత్యక్ష మయ్యెను. వాఁడు దేవునకు మ్రొక్కి "దేవా! నీపాదాశ్రితులగు నిందఱఁ జంపిన యీదుష్టయతిని ద్రుంపు" మన నద్దేవుండు మండిపడి "మత్స్వరూపుఁడగు యతీంద్రుని జంపు మంటివిరా" యని శూలమున వాని శిరసు నఱకి నటింపఁ జొచ్చెను. అంతట శంకరుం డాక్రోధభైరవు సన్నుతించి 'దేవా! యద్వైతమతప్రబోధ మొనర్చుచుండ నీభక్తుఁడు వీఁడు వచ్చి నిందించి, నిచే హతుఁడయ్యెను. ఇందలి సత్యాసత్యముల నీవెఱిఁగింపఁదగు ననుటయు 'నీవుభగవంతుఁడవు. నీ వొనర్చు సర్వము నే నొనర్చునట్టిదే. కలిప్రభావమున గ్రూరులైన నీబ్రాహ్మణాధములఁ దరింపఁ జేయుము. మంత్రబద్ధుండ నగుటచే నీదుష్టునకుఁ బ్రత్యక్ష మైతిని గాని ధర్మముచేఁ గా'దనిపల్కి యంతర్ధాన మగుటయు, హతశేషు లగు వటుకాదులు భయపడి శంకరుని పాదములపైఁ బడి రక్షింపు మన వారిని గరుణించి, శిష్యులచే వారికి, బ్రాయశ్చిత్తము గావించి స్మార్తక్రియాసక్తులుగ నొనర్చెను. పిదపనున్మత్తభైరవుఁడను కాపాలికుఁ డొకఁడు వచ్చి స్త్రీపురుషజాతులు రెండే కాని జాతియనునది లేదనియు, వీని కిస్త్రీయే భార్య కావలె నను

నియమము లేదనియు, స్త్రీపుంససంయోగసుఖమె ముక్తియనియు నట్టి సంగమమున భైరవుఁడానందించు ననియు, నుపన్యసింప- యతీంద్రుఁడు విని ముందు నీచరిత్రము తెలుపుమన 'నామాతామహుఁడు కల్లు గీసి యమ్ము వాఁడు. మా యమ్మ తనశరీరము నితరుల సుఖమున కిచ్చెడు సువ్రిత' అని పలుకుటయు నీనీచుని దూరముగాఁ దొలఁగఁ ద్రోయఁ డన, శిష్యులు వాని నవ్వుల కీడ్చివైచిరి.

తరువాతఁ జార్వాకులను, సౌగతులను, క్షపణకులను, జైనులను, బౌద్ధులను జయించి శిష్యులఁ గావించికొని, మల్లపురమున కరిగి మల్లారి భక్తులను వశపఱచుకొని, పశ్చిమదేశమున కరిగి విష్వక్సేనమతస్థుల నద్వైతులఁ గావించి, మన్మథమతము నిరాకరించి, కుబేరమతము హాతా హాత మొనర్చి, యింద్రమతము నిరసించి, యమమతము శ్రుతిస్మృతుల నుదాహరించి ఖండించి, వరుణ, వాయు భూమి, తీర్థ మతముల నుగ్గాడి, శూన్యవాదము నుఱుమాడి, వరాహమతము గెలిచి, లోక సేవకమతము పోఁగొట్టి, గుణోపాసకమత మడంచి, సాంఖ్యమతము చెండాడి, కాపిలమత మెగురఁగొట్టి, పరమాణువాదమతము పటాపంచెసి. కర్మవాదము ధిక్కరించి, చంద్రమతము తృణీకరించి, యంగారకాది గ్రహోపాసకుల నద్వైతులఁ గావించి, పితృమతము ఖండించి, గరు డానంతమతమ్ములు గెలిచి, సిద్ధోపాసకమతము చీల్చివైచి, గంధర్వో పాసకుల గండడఁచి, బేతాళార్చకుల వశపఱుచుకొని, నీలకంఠమతము నఖండతర్కవాదపటిమఁ జెల్లాచెద రొనర్చి, తన్మతానుయాయుల నందఱ నద్వైతుల నొనర్చి, జగజ్జేయమానకీర్తి నలరారెను.

## నవమాశ్వాసము

తరువాత సౌరాష్ట్రాదిదేశంబులఁ బర్యటించుచు నిజభాష్యము లను వ్యాప్తి నొనర్చుచు ద్వారవతి కరిగి యచటఁ బాంచరాత్రుల

గెలిచి, యుజ్జయనీపురమున కేఁగి, యందు భట్టభాస్కరుఁ డనుమహా తార్కికశిరోమణిని బెద్దకాలము శాస్త్రవాదము సలిపి జయించి, బాహ్లికదేశమున నాస్తికమతస్థుల నోడించి, ఖండనకారు నంతటి మహా పండితుల వశమొనర్చుకొని కామరూపదేశమున కేఁగి యభినవగుప్తుఁ డను మహామాంత్రికు నోటఁబుచ్చ, నాతఁడు కపటహృదయుఁడై శిష్యునివలె నాశ్రయించి వెంటరాఁజొచ్చెను.

ఈరీతి నానాదేశముల నానామతముల జయించి, సర్వత్ర యద్వైతమత విజయధ్వజముల నెలకొల్పి, శంకరుఁ డుండ నాయనకు భగందర మను నసాధ్యవ్రణమొకటి పాయుస్థానమునఁ బుట్టెను. దేహాభిమానములేనివాఁ డగుటచే నామహాత్ముఁడు చికిత్స కంగీకరింపకున్నను బద్మపాదాదులు దేశదేశములు తిరిగి వైద్యులందెచ్చి, చికిత్స చేయించి నిరుపయోగమగుట నాచికిత్స మాన్పి, వారి నంపి, మృత్యుంజయాది మహామంత్రోపాసన మొనర్చి యావ్యాధి మాన్పిరి. గురువరునకు నవ్రణము మాన నారంభించిన నాఁడే యభినవగుప్తున కట్టివ్రణమే పుట్టి గురునకుఁ బూర్ణముగ మానునాఁ డాతఁ డావ్రణముచే మరణించెను. కాకతాళీయముగ నిటు గలిగిన మరణమునకుఁ బద్మపాదుఁ డాభిచారిక మొనర్చె నందురు. అది నిజ మనఁదగినది గాదు.

శంకరులు స్వస్థులైనపిదప నొకనాఁడు గౌడపాదమహర్షి కాన వచ్చి పూజితుఁడై గౌడపాదకారికాభాష్యము సాంతముగ విని దీవించి కన్మొఱంగెను. ఆమఱునాఁడు కాశ్మీరదేశమున శారదాదేవ్యాలయమున సర్వజ్ఞపీఠము గల దనియు, నందు సర్వజ్ఞుఁ డగువాఁడె కూర్చుండ నర్హుఁ డనియు, నాల్గుద్వారములందును దిగ్దంతులవంటి పండితు లుండి యెక్క వచ్చినవానిని వాదమున నోడించి పంపుదు రనియుఁ, బ్రాగాది ద్వారములు మూఁడును దెఱచియుండును. దక్షిణదేశమునుండి వచ్చి

దక్షిణదిగ్ద్వారము తెఱచిన పండితుఁడే యింతదాఁక రాలే, దనియు, నొకవార్త విని సశిష్యుఁడై యతిసార్వభౌముఁ డచటికి వెడలెను. జయజయారావములతో శిష్యులు వెనుకొనఁ, రాఁగ శారదాలయమున కరిగి దక్షిణదిగ్ద్వారంబునఁ బోవుచుండఁ గణాదమతపండితుఁ డడుగు ప్రశ్నమున కుత్తరము సెప్పి, యాతని మరలింపఁ, బరమాణువాది యయ్యతి నెదుర్చ నాతని నిరుత్తరు నొనర్చి, చనుచుండ, నంతలోఁ గాపిలుం డడ్డుపడి యడిగిన ప్రశ్నములకుఁ దగు ప్రతివాక్యము చెప్పి, యాతని నంపెను. బాహ్యార్థవిజ్ఞానశూన్యవాదు లగు బౌద్ధులు శంకరు నెదిరింప నండఱకు నుచితముగ సమాధాన మిచ్చినంత, దిగంబరమతస్థుఁ డయ్యతితో డీకొనెను. వానిని నిరాకరించునంత జైమినీయమతవిదుఁడు వాదమునకుఁ బూన, నాబుధుని క్షణమున జయించుటయు- నాసకలపండితు లాయతీంద్రు మేధాసంపద కచ్చెరు వొంది దక్షిణద్వారము తెఱచి త్రోవ చూపఁ బద్మపాదుని కే లూఁది లోని కరిగి, సింహాసన మెక్కనుండ నొకయశరీరవాణి యాకశమునుండి 'అన్నా! నీవు మున్నె సర్వజ్ఞుఁడవు. పరీక్ష కాఁగి యిప్పుడును నైతివి. సర్వజ్ఞత యొకటియే పీఠాధిరోహణమునకు హేతువు గాదు. విశుద్ధత కూడ నుండవలెను అది నీయెడ సందేహము. పరకాంతతో మదనకళారహస్యముల వాద మొనర్చి పాపము మూట గట్టుకొంటివి. త్రికరణశుద్ధి లేదుగాన నీ పీఠము నెక్కఁ దగవు' అని వినిపింప "అమ్మా! పాక్షికభావము లేకుండు నట్లు మండనుతోడి వాదమున నుభయభారతిని సాక్షిఁజేయ, నామె తన భర్త యోటమికి భయపడి తానే వాదమునకు దిగుట నాతప్పగునా? ఆఁడుదానితో వాద మెట్లనఁగా గార్గ్యాదికాంతల వాదకథలు తెల్పి, ఆమెచే నన్నొప్పించి వివద్యమానాంశము విడిచి కామశాస్త్ర విచారమునకుఁ దింప, గడువొంది, యాశాస్త్ర మామె జయింపఁ జదివి, పరకాంతతోఁ గామకళావాదము సేయ నవకీర్ణి నగుదు ననుతలఁ

పున శుకదేహము సొచ్చి యామె నోడించి తద్దోషపరిహారముగ శ్రీనర సింహుని స్తుతించి, మరల మానుషదేహ మొందితిని. ఇందు నా యపరి శుద్ధత యేమికలదు? అంతియకాదు. నా కోడి మండనుఁడు సంన్యసించుట కగ్ని లాత్మారోప మొనరించుకొనునప్పు డాసాధ్వి యోగశక్తిచే నగ్నులందు లీన యగునప్పు డామె దివ్యతేజమున వాణీరూపము చూచి తిని. ఆవాణీదేవివి నీవే. కావున నాచరితము చెప్పనేల? అదియుంగాక యద్వైతమతస్థాపనకై కామశాస్త్రము నరసితినే కాని, కామవశుఁ డనై యరసితినా? నాపరిశుద్ధి జగత్తునఁ జాటుటకై యిట్లు లంటివేమొ! నా హృదయము మమత్వము లేక పరిశుద్ధమైన దని నీ వనిన నంతియేచా లును. నాకీపీఠారోహణము లేకున్న నేమి" యనుటయు మింటనుండి శంకరుపయిఁ బూలవాన కురియ, నచటిబుధు లాయనను నుతించిరి. శారదయు "భో స్సర్వజ్ఞ! పీఠాధిరోహణకళ్యాణ మిత్యోఽస్తు తే' యనెను. అంత శిష్యులు బలసి కొలువ సర్వజ్ఞసింహాపీఠమున శంకరాచా ర్యు లుపవిష్టులైరి. ఆకసమున దేవదుందుభులు మ్రోసెను. పూవుల వాన దేవత లయ్యతిపైఁ గురిసిరి. ద్వంద్వవిదూరుండగు నమ్మహితుఁడు కేవల స్వమతగౌరవార్థమే సర్వజ్ఞసింహపీఠ మెక్కుటంజేసి నిగమధ ర్మంబు పూర్ణంబుగనడువఁ గట్టడచేసి, కాశ్మీరమునుండి శృంగగిరి కరిగి వ్యాసుఁడిచ్చిన వరము తలఁచి ముప్పదిరెండవయేడు వచ్చుట తెలి సికొని తనమనమున:— ద్వారవతిం గల శారదాపీఠమున హస్తామల కుని, బదరికావనమందలి జ్యోతిర్మఠమున దోటకాచార్యుని, జగన్నాథ మునఁ గల గోవర్ధనమఠమునఁ బద్మపాదుని, శృంగగిరిని శ్రీపీఠమున సురేశ్వరుని, బాలకులుగ నియమించితిని. అద్వైతరాజ్యలక్ష్మి యచం చలముగ నిఁక వెలయు నని ధైర్యమూని, యచటనుండి బదరికావని కరిగి యచటఁ బాతంజలయోగవేత్తల నోడించి వారికి నిజభాష్యములఁ గఱపి

కీర్తి కెక్కెను. అంత నాయనకు ముప్పదిరెండేండ్లు పూర్తియగుట యుఁ గేదారమున కరిగి యచట శిష్యులకు బాధానివృత్తికై యుష్ణజల ప్రవాహము సృజించి, యాయువు పూర్తియగుట యెఱింగి హస్తామ లకుని ముద్దిడుకొని, సురేశ్వరు నాదరించి, తోటకుని గౌఁగిలించుకొని, తక్కువారి నుచితరీతుల సమ్మానించి, గురుపరంపరకు మ్రొక్కి, కేదా రనాథు నెదుట నాసీనుఁడై ప్రాణాయామ మూని తురీయావస్థ నొంది బ్రహ్మరూపమున నద్వైతస్థితిఁ గాంచి, యులరార నామహాత్ముని ధ్యాన పథమున దత్తాత్రేయుఁడు పొడసూపి, కైలాసము సపరివారుం డగు శివునిఁ జూపి, వారందఱు నీరూపములే యని తెల్పి, శివుఁడని స్తుతిం చుటయు - నాహిమగిరి కైలాసగిరి యయి యాయన దక్షిణామూర్తి స్వరూపుఁడై ప్రమథులచే దేవతలచే మునులచే స్తూయమానుఁడై యొప్పెను.

కథాసంగ్రహము

సమాప్తము.



# విషయసూచిక



## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

శ్రీ గురుమూర్తయే నమః

# శంకర విజయము

## అవతారిక

శా. శ్రీమద్వేంకటరాయమంత్రివరసంసేవ్యాంఘ్రి, సుబ్బాంబికా
ధామాలంకృతి భానువంశమణి, సీతాస్వాంతకంజాత జా
తామోదస్పృహయాళుభృంగము, యతీంద్రారాధ్య, మధ్యాత్మవి
ద్యామాంగల్యము రామనామపరమాత్మం బోము లోకంబులన్.

సీ. రాఘవాకారపరబ్రహ్మచిత్కళ
యగణిత నలినజాండైకజనని
వేదవాదన సముత్పాదితోదయ, భక్త
కల్యాణసంధానకల్పవల్లి
యాదిలక్ష్మి మనుష్యావతారము, విదే
హక్ష్మావిభుతపోనంతఫలము
క్షితిసతీగర్భశుక్తి సమిద్ధమౌక్తికం
బసురవిస్తారసంహారరాత్రి

గీ. రాజితేదర వేంకటరాయమంత్రి
సంతతార్చితపాదాంబుజాత సీత
సర్వసంపత్కరత్కటాక్షములు జాలు
కొనఁగఁ గనుఁగొంచు జగముల మనుచుఁగాత. 2

సీ. మందస్మితాంచిత సుందరవదనమ్ము
విస్మమరాసిత కాంతి మసృణమూర్తి
మాణిక్యవల్లకీ క్వాణనోత్సుకము చం
ద్రావతంసోత్తమాంగాభిరామ
ముచ్చావచాభరణోజ్జ్వలాఖిలమూర్తి
యాదృతజ్ఞానముద్రాతిరమ్య
మవిరతతారుణ్య మనవధికారుణ్య
మాత్మవిద్యాప్రదానాదిమగురు



గీ. వగుచు 'శ్రీ దక్షిణామూర్తి' యనఁగ 'శ్యామ
లాంబ' యనఁగ నద్వైత భావంబు గాంచి
పూరుషుండును స్త్రీయు నపుంసకమ్ము
గాని స్త్రీపుంసములజ్యోతిఁ గాంతు మదిని. 3

ఉ. ఆదిమదంపతుల్ సలిపినట్టి తపంబున వేదభూజ శీ
ర్షోదితపూ ఫలంబు, జగదుద్గతిబీజము, భక్తసంసదా
మోదకరుండు, మోదక విముగ్ధకరుండు, దయాకరుండు, లం
బోదరుఁ డంతరాయలవ మొందని వైఖరిఁ బ్రోచు మత్కృతిన్. 4

సీ. నలువ నెమ్మొగములు నాట్య మందిరములు
ధవళాంబురుహము ముత్యాలగద్దె
శ్రుతి తచ్ఛిఖలు సన్నిహిత పరిచారికల్
చేదోడు వాదోడు చిలుకదంట
పదునాల్గు జగములు పాలించురాజ్య, మా
జానేయవాహమ్ము మానసౌక
మాత్మసంతంధయు లలకవుల్ గాయకు
లమృతాక్షరశ్రేణి యక్షమాల

గీ. యగుచు వెలయంగ నేదేవి యలరు నట్టి
విశ్వజనయిత్రి వాఙ్మయ విశ్వరూప
శారదాదేవి శంకరాచార్య విజయ
సరసకృతిసృష్టి మద్రసజ్ఞను వసించు. 5

మ. జగముల్ ప్రోవఁగ సంకులశ్రుతుల వ్యాసంబున్ బచారించి య
చ్చుగ; ముక్తాకృతి బ్రహ్మ మద్వయముగా సూత్రించి, వేదార్థ గు
ప్తిగ శ్రీభారతమునన్ రచించి చిరజీవిత్వమ్మునన్ నేఁడునున్
భగవంతుం డయి వెల్గు వ్యాసముని సంప్రార్థింతు విద్యార్థినై. 6

సీ. బ్రహ్మాండగోళమున్ పట్టని విజ్ఞాన
మై దేండ్ల యీడున నవధరించి
వ్యాసతాత్పర్యసర్వస్వమ్మునకు నద్ద
ములుగ భాష్యత్రయమ్మును రచించి

యాసేతుశీతాద్రి సద్వైత గుప్తి యా
పాదిల్లఁ బీఠముల్ పాదుకొలిపి
ద్వైతసిద్ధాంతజల్పాక పాషండ వై
తండికషండమ్ము గండఁడంచి

గీ. మహితపారమహంస్య సామ్రాజ్య పట్ట
భద్రుఁడై జగమ్మున ధర్మపాలనమ్ము
చేసిన శివావతారప్రసిద్ధు నాది
శంకరాచార్యుఁ గొలుతు సాష్టాంగనతుల. 7

మ. కలమున్ జేతను బూని పద్య మని యేకాసంతయున్ వ్రాయఁగాఁ
దలఁపుం జెందిన ముందు మ్రొక్కవలెఁగా దాసంస్కృతాంధ్రమ్ములన్
గలమర్మంబులు నాకుఁ దెల్పి కవితా నైపుణ్యముం గూర్చు చా
వలి లక్ష్మీనరసింహశాస్త్రిగురుదేవస్వామికిన్ భక్తితోన్. 8

శా. తర్కవ్యాకృతిపారదృశ్వు నిఖిలాంధ్రజ్యోతిషాంగ్లోక్తి సం
పర్కున్ సూర్యబుధేంద్రశిష్యమణి దర్భావంశ్యు సర్వేశవి
ద్యార్కున్ వ్యాకరణోపదేశికు ద్వితీయానంతు నెంతున్ శుభో
దర్కత్వంబు కృతజ్ఞతన్ బడసి మత్కావ్యంబు రంజిల్లఁగన్. 9

గీ. కవియశఃపాత్రులై పేరు గనిన ఘనులఁ,
దలఁ చెదఁ బురాత నాధునాతన విభేద
రహితముగఁ, దద్వితీర్ణసారస్వతామృ
తము భవార్తికి జీవనౌషధము గాన. 10

మ. చదు వన్యంబున, సంస్కృతాంధ్రములసంస్కారంబు దూరంబు, నె
మ్మది గర్వాస్పద, మాస్యగహ్వరము దంభధ్వాంతసాంద్రంబు, దు
ర్మద మత్యర్థము, సర్వ మాత్మ మను ధైర్యంబొప్ప గద్దించు క
ద్వద మూర్ధన్యుల; కట్టివారి కృప మత్కావ్యం బుపేక్షించుతన్.

శా. నా కేలూరికి నిత్యమైత్ర్యమును గృష్ణారాయసామంతమి
త్రాకాంక్షాపరిపూర్తియున్ గలుగ, దివ్యల్లాంఛనంబై తగన్
నా కేలన్ గవిసింహకంకణము సంధానించియానందుఁడౌ
మా కాంద్రేగుల రామచంద్రసఖు సమ్మానించెదన్ నెమ్మదిన్. 12

శా. భావింతున్ మదిలోఁ గృతజ్ఞతమెయిన్ బాలుట్ల ఫాలాంకు స
ద్భావున్ వేంకటారాయచిత్తగృహశుంభద్రామ నామాంకితం
బై వెల్గొందఁగ శంకరార్యజయకావ్యం బేను నిర్మించు న
ట్లావిష్ప్రీతిని సంఘటించిన కవిత్వాంతర్యవిత్సత్కవిన్. 13

కం. ఈరీతిఁ బ్రాక్కవీంద్రా
చారము నెఱవేర్చి విబుధసదయకటాక్షా
ధారమున జగద్గురువరు
చారిత్రము గూర్ప నెంచుసమయమునందున్. 14

సీ. ఎవనితాత సృజించె భువిని వైకుంఠపు
రమ్ము నెల్లూర్మండలమ్మునందు
నెవనితండ్రి యొనర్చె నేలికల్ మెచ్చ గ్రా
మాధికారముతోడి యన్నదాన
మెవని భ్రాతృద్వయ మెలమిఁ దపంబున
వాణిజ్యమున వన్నె వాసిఁ గాంచె
నెవని దత్తకుమారుఁ డింగ్లీషు విజ్ఞాన
శాస్త్రపట్టపరీక్ష జయము వడసె

గీ. నెవఁడు వేంకటరామాఖ్యఁ బవరు ప్రెస్సు
కంపెనీ శ్రేష్ఠి విఖ్యాతిఁ గన్నవాఁడొ
యతఁడు వేంకటరాయసమాహ్వయుండు
వెలయుఁ గులదీపకుం డను విమలకీర్తి. 15

ఉ. శ్రీదరమావిలాసము హసింపఁగఁ జాలెడుసార్ద్రతార్థవ
చ్ఛ్రీదరమాభిసృష్టుఁ డతిశిష్టుఁ డమేయ యశోవిశిష్టుఁ డ
య్యాదరవంశదుగ్ధజలధీందుఁడు వేంకటరాయమంత్రి న
న్నాదరమొప్పఁ దోడ్కొని యొకప్డు స్వహర్మ్యముఁ జేరియందులన్

శా. ఆతిథ్యంబు నొసంగి భక్తియుతుఁడై యయ్యాతిథేయుండు శ్రీ
సీతారామపదద్వయిన్ మనమునన్ జిత్రించి, పాలాంక వి
ఖ్యాతున్ బావమఱందిఁ గాంచుడును, వక్కాణించె నావిజ్ఞుఁ డీ
భావిన్ వేంకటరాయుఁడెందమునఁదన్ వ్యాఖ్యానమై తోఁపఁగన్.

ఉ. రాయఁడు శాస్త్రియంత బుధరాజశిఖామణి మెచ్చ నాతనిన్
నాయకుఁ జేసి తత్త్రిమునినాథచరిత్రము పద్యకావ్యమా
ఛాయ రచించి నేఁ డది ప్రసన్నగతిన్ సభలోఁ బఠింప నా
ప్యాయన మొప్ప వింటిమి సభాసద సాధువచఃప్రశస్తితోఁ. 18

క. శంకరగురువిజయము నల
లంకముగ రచింపఁ దఱవులంబట్టి మదిన్
సంకల్పము గల దంటిరి
వేంకటరాయనికి నదె యభీప్సితము సుమీ! 19

చ. తన యిలువేల్పుపై తనరు దాశరథిన్ గృతినాథుఁ జేసి చ
క్కన రచియించి శంకర జగద్గురు దిగ్విజయప్రబంధ మ
ప్పన మొనరింప నిన్నడుగ భావమునన్ దలపోయుచుండు రా
మునియభిలాషసైత మదె పో సమకూర్చెను మిమ్ము నిర్వరన్. 20

వ. అనుటయు రచనాసందిహానమానసుఁడనై. 21

క. గ్రాసం బన్యుల దైనను
వాసము దన దంచు నుండవలె నంద్రు గదా
వాసము లేమిని గవితా
వ్యాసంగము క్షీణదశకు వచ్చిన దంటిన్. 22

క. అది విని యవ్వేంకటరా
విది యెంతటి పని? ప్రబంధ మీరు రచింపన్
సదనము రచింపఁబడదో
యెద నాచింతను ద్యజింపుఁడీ యిఁక ననుచున్. 23

మ. సహజౌదార్యమొ, ప్రాజ్ఞలోక దురవస్థా పీడనా కర్ణనా
సహనత్వంబొ వచింపఁగాఁ దరమె? తత్సౌజన్య జన్యోక్తి మ
ద్గృహమున్ దత్క్షణమే రచించి యిడు రీతిన్ దోఁప హృత్తాపమున్
బహుకాలాతిదురాపమున్ దొలఁగి యానందమ్ముగన్ మున్గియున్.

గీ. మునుపు బ్రాహ్మణచాపలమున రచింప
నెంతునే కాని యర్హుఁ డనే తలంప?
ప్రతుల శాస్త్రములను నదీష్ణు లగుకవులె
శంకరోదంత మనినంత జంకుచుండ. 25

ఉ. "ఎక్కడ శంకరాద్యగురుహృద్య చరిత్ర? వరాకి నైన నే
నెక్కడఁ? బట్టుకొల్పెద రిదేల? చిరార్జితకీర్తి వార్ధిలోఁ
గ్రుక్కనఁ గూల" నంచుఁ గలఁకన్ బరువెత్తు సరస్వతిన్ గవుల్
ద్రుక్కక తద్గుణస్తుతికిఁ జొన్పుదు రెట్టివొ తత్ప్రభావముల్. 25

వ. అనుటయు నవ్వేంకటరాయ మంత్రిచంద్రుం డిట్లను. 27

సీ. శబ్దశాస్త్రముతోడి సంస్కృతాంధ్రోభయ
భాషారహస్యవిజ్ఞాన మెనసి
పదియు మూఁడేఁడులపాటు శ్రీసూర్య రా
యాంధ్రనిఘంటుకృత్యమున మెలఁగి
శబరశంకరవిలాసము వేంకటేశ్వర
శతకాదులగు కృతితతి రచించి
ప్రథిత తాతాసుబ్బరాయశాస్త్రికి ముని
త్రయచరిత్ర మ్మంకిత మ్మొనర్చి

గీ. 'కవి' పరీక్షను సింహకంకణము బిరుదు
గాఁ గొని 'కవిత్వభూష' ణాంకమ్ము వడసి
యున్న నీ వెన్న శంకరాభ్యుదయకావ్య
సృష్టి దక్షుండవే యంచు నెంతు మేము. 28

క. మా యిలువేలుపు రాముఁడు
నీ యొసఁగెడు కృతికిఁ దుష్టినిం గనుచో శ్వ
శ్శ్రేయసములు లభియించును
బ్రాయికమై మనకు నిరువురకు నని యనుడున్. 29

గీ. ప్రేరకుఁడు రామభక్తుఁ డుదారహృదయుఁ
డల్లరాముఁడు కృతికి నాయకుఁడగునటు
కావ్య మనిన జగద్గురు భవ్యచరిత,
చక్కసమకూడె నని సాధ్వసముఁ గుదించి. 30

మ. సమయోన్మీలిత మాలతీ పరిమళా సారౌఘ ముష్టింధయ
క్రమమై, దిక్తటకూలముద్రుజములై రాజిల్లు శ్రీశంకరా
ర్యమహాసద్గుణపుంజ మేడ? నస దౌ నస్మాదృశుం డేడ? నై
న మదాచార్యకృపాకటాక్షమె ననున్ గావింపదో ధన్యుఁగన్. 31

శా. ధన్యంమన్యులు బుద్ధిశూన్యులు పవిత్రంమన్యు లంభోధిరా
ట్కన్యానర్తనమత్తు తా నరవరాకశ్రేణి దుష్కీర్తి మా
లిన్యం బొందిన నాసరస్వతిని క్షాళింతుఁ గా యతివ్రాత మూ
ర్ధన్య శ్రీగురుశంకరార్యచరితోద్యత్కీర్తి దుగ్ధాంబుధిన్. 32

మ. అధివాసింతుఁ ద్రిలోకరంగనటదుద్యచ్ఛంకరాచార్యయ
త్యధిరాట్కీర్తి నటీపటీరపటుచూర్ణాకీర్ణ ధాత్రిన్ గుపూ
య ధరాధీశ ఖరీవిషాణనిభ వంధ్యాసూనుతుల్య క్షమా
ప్రతిభౌదార్య పరాక్రమాదినుతిదుర్గంధాక్త మద్భారతిన్. 33

వ. అని యించుక సాహసంబూని ప్రయోజ్యప్రయోజకకర్తృతా
ధాముఁడు రాముఁడే యయినను, నేతదీయ హృదయపుండరీక
దహరస్థుఁడై పలుకుచున్నవాఁడని యెఱింగియును, ప్రత్యక్షముగాఁ
బ్రేరకుండైన నాయకుండగు వేంకటరాయసచివు వంశంబు
నానృణ్యంబు వడయ వర్ణించువాఁడ. 34

## కృతిసంధాతృవంశవర్ణనము

సీ. త్ర్యాయుషం బొంది జరార్తుఁడై యిల వ్రాలి
యును బ్రహ్మచర్యంబు నుడుగలేక
యూర్చుచు నింద్రుఁ డాయువు చతుర్థం బిచ్చి,
చూపింప వేదరాశులను జూచి
పర్వతత్రితయంబుపగిది భాసిల్లు, వే
దత్రయంబునకు వందనముసేసి
యింద్రునానతిని ద్రియాగిరులందుండి
పిడికెఁడు పిడికెఁడు వడిగ్రహించి

గీ. భూమికిం దెచ్చినట్టి యభూతపూర్వ
చరితుఁడని వేదవినుతయశస్కుఁడై 'య
నంతములు వేదము' లటంచు నవనిఁజాటి
నట్టి మహితు భరద్వాజు నగునె పొగడ. 35

గీ. అతఁడె యాను భారద్వాజుఁ డనగఁ సకల
శాస్త్రవిజ్ఞాత, కతిపయశాస్త్రకర్త

వేదమున కాతఁ డిడినదే భిక్ష యనఁగ,
జగము కాచిన యవ్వేత్త సాటి యెవరు? 36

ఉ. ఆతఁడు గోత్రకర్తగ ద్విజాన్వయశాఖలు పెక్కు పుట్టి ధా
త్రీతలమెల్ల నల్లుకొని తేజరిలున్ శ్రుతిశాస్త్రపారగ
ఖ్యాతిని; నం దొకండు దనరారు నృపాశ్రయమొంది లౌకిక
ఖ్యాతిఁ ద్రియాపథానుచరమై వెలనాఁటి నియోగిశాఖ నాన్. 37

గీ. ఆఱువేలనియోగిశాఖాఖ్యఁ గూడ
నొంది యవ్వెలనాఁటి నియోగిశాఖ
ప్రథితమా నందు నీదరగ్రామమందు
వెలసె నొకవంశ మదె యింటిపేరు గాఁగ. 38

క. ఆయీదరవంశమున ర
మాయుక్తుఁడు ధీయుతుండు మల్లమరా జ
గ్రీయతను మూలపురుషుం,
డై యమరెడుశాఖ యొకటిఖ్యాతం బయ్యెన్. 39

గీ. అల్ల మల్లమరాజున కాత్మజుండు
లక్ష్మిరాజు, తత్పుత్రుండు లక్షణాన్వి
తుఁడగు వెంకమరాజు, తత్సుతుఁడు రామ
రాజు తత్సూతి పోలమరాజు నయ్యె.

ఉ. పోలమరాజు ప్రాఁతఁ జదువున్ జిననాఁటనె నేర్చి తా నతం
ద్రాళుమనీషచేతఁ గరణంబయి పై యధికారివర్గమున్
బాలితులన్ సమంబుగ మనంబు నొసంగి వశీకరించుకొం
చేలెను గ్రామ మాత్మయశమెల్లలు దాఁటి భ్రమింప నెల్లెడన్. 41

క. పోలమరాజాతఁడు సుగు
ణాలంబం బయిన మంగమాంబికయందున్
శ్రీలుఁడు పితృభక్తుండు ద
యాళుఁడు నగు తనయు రామయాహ్వయుఁ గనియెన్. 42

గీ. ప్రబలతరరాజకార్యనిర్వహణశక్తి
మీఱి వెంకటగిరి జమీందారువలనఁ

కొనె మొఖాసాగ భూఖండమును రచించె
నటనె వైకుంఠపురము రామయప్రధాని. 43

ఉ. కోటయుఁ గందకమ్ము నలుగోపురముల్ బురుజుల్ హజారముల్
కూటము లంపసాలలు సకుంఠితరీతి సృజించి యచ్చటన్
హాటకరత్న సృష్ట రుచి రాలయవాసిగఁ జేసి రామునిన్
గాటపు భక్తిఁ గొల్చెఁ గలకాలము రామయ రామదాసు నాన్. 44

గీ. నారికేళ గువాకు ధాన్య ప్రభృతి ప
దార్థములు గూర్చి వాణిజ్య మాచరించి
యర్థములు రాసులుగను రామయ గడించె
గరమునం దున్న దేముకో పరసవేది. 45

సీ. ఆర్జించినాఁ డగణ్యం బైనవిత్తముల్
చేతి కెమ్మికలేని రీతి నొసఁగెఁ
గొలిచె నిష్ఠను రఘుకులదీపకుని నెద
నెలకొల్పి తత్పాదనీరజములు
క్షేత్ర బీ జాంకప్రసిద్ధముల్ గణితముల్
పద్యమయమ్ముగాఁ బరిఢవించె
సన్నుతించెను రామచంద్రుఁ జాటు ప్రబం
ధాంకమాలికలఁ దానై రచించి

గీ. కట్టె వైకుంఠపతి వచ్చి కాఁపురమ్ము
సలుపఁ బురమును రాజోపచారయుక్తి
యీదరకులాంబురాశి పూర్ణేందుఁ డతఁడు
రామయామాత్యుఁ డుద్దామధామసీమ. 46

మ. తన శ్రీశైలముయాత్ర యాత్రికజనుల్ దాహ మ్మటంచార్వఁగా
విని సొమ్మెంతొ వ్యయించి నిర్జల తదుర్విన్ బావిఁ ద్రవ్వించి త
జ్జనులకా నీరము గ్రోల్చి కాని చనఁ- డాదాక్షిణ్యమున్ గార్యదీ
క్ష నెటన్ రామయమంత్రి నేర్చెనో యశక్యం బేరికిన్ బేర్కొనన్. 47

శా. కాంతారమ్మున నర్ధరాత్రముతటిన్ కార్మొగ్గున్న చీఁకట్ల నే
కాంత మ్మేఁగుచునుండఁ జోరికులు రామామాత్యు రోధింపగాఁ

జెంతన్ గల్గినదేవతార్చనము నిచ్చోఁ దాన భీతిల్లి వా
రంతన్ మ్రొక్కితొలంగ నాశమము ధైర్యంబెందునుం గందు మే.

ఉ. గాదెలునిండ ధాన్యములు గాబులనిండఁగఁ బాలెకాక యా
జ్యాదిపయస్యముల్, గృహము నం దతిథివ్రజ గోష్ఠపాళి ధే
న్వాదిపశూత్కరంబును నిరంతరమై యెసలార దానల
క్ష్మీదయితుం డతండు వెలసెన్ సితకీర్తుల భోగపూర్తులన్. 49

చ. తగవరి వక్త భోగి నెఱదాత కవీంద్రుఁ డతంద్రధీయుతుం
డగణితనీతిసీమ గణితాగమపూర్ణుఁ డుదీర్ణరామభ
క్తి గలుసు రామమంత్రి జగతిన్ పురుషార్థనిదానుఁడై మెలం
గఁ గలియుగంబునున్ గృతయుగం బయి రాజిలెనంద్రు తద్విదుల్. 50

క. 'కాసులవారింట నదిర!
కాసులబంగారు పొడమెఁ గద' యనుఖ్యాతిన్
భాసిలు రంగమఁ బెండిలి,
సేసికొనియె రామయార్య శేఖరుఁ డెలమిన్. 51

ఆ. 'అష్టపుత్ర బహుధనావాప్తిర' స్తంచు,
సలుపు బుధుల దీవనలు ఫలింప
రామసుకవి గనియె రంగాంబయందు నె
న్మంద్రబిడ్డలను, ననంతధనము. 52

సీ. త్రవ్వించె నిర్జలస్థలి బావి శ్రీశైల
యాత్రికజనులు సౌఖ్యమ్ము గాంచఁ
"జెఱువు వేయించె నచ్చెరువుగా" వైకుంఠ
పురి పొలమ్ముల సస్యములు ఫలింపఁ
గట్టించె నిష్టేపకల్పమహాభక్తి ది
వ్యంబుగా రామదేవాలయంబు
విప్రులకిచ్చె నివేశముల్ కట్టించి
యెనమండ్రు బిడ్డలఁ గనియెఁ బ్రీతి

గీ. నిలిపెఁ దోఁటలు కృతులు తానే రచించె
సప్తసంతతు లిటు శాస్త్రసమ్మతముగ
నొందఁ గల్గెను రామయార్యోత్తముండు
ధన్యజీవనుఁ డెల్లవిధంబులందు. 53

సీ. మందార కుం దారవింద సుందరకీర్తి
యగుచుఁ బట్టాభిరామయ్య యనఁగ
రసవత్కవిత్వ నిర్భరకావ్యరచనా వి
హారుఁడు రామకృష్ణయ్య యనఁగ
ధైర్యశౌర్యాసమౌదార్య గాంభీర్య గే
హము లక్ష్మినారాయణప్ప యనఁగ
త్యాగ భోగ విరాగ యోగానురాగుఁడై
యలరి పట్టాభిరామయ్య యనఁగ
గీ. నాత్మజులు నల్వు రౌల శేషమ్మ రామ
లక్ష్మి యాదిలక్ష్మమ మహాలక్ష్మమ యన
నలువు రాత్మజ లొప్ప నందనవనంబు
డంబు గని రామమంత్రి కుటుంబ మొప్పె. 54

క. ఆ రామయ సచివమణి కు
మారులలో నవరజుఁడు రమారమణపదాం
భోరుహఘటితమనస్కుఁ డు
దారుఁడు పట్టాభిరామయాఖ్యుఁడు మెఱయున్. 55

క. పట్టాభిరామయార్యుఁడు
పుట్టిన దాదిగను రామపూజాపరుఁడై
చుట్టాలకు సురమణి దయ
పుట్టి ల్లనఁ బొలిచె మహి నభూతోపముఁడై. 56

గీ. ఆ మహాత్ముఁడు పట్టాభిరామమంత్రి
సాధుశీల లక్ష్మినరసమ్మ యనెడు
రామచంద్రుని రామయనామమహితు
తనయఁ బెండ్లాడెఁ బిత్రుదేవతలు చెలంగ. 57

ఉ. మానితశాంతశీల, పతి మన్ననకెక్కిన మద్దరాలు, స
న్మానితబాంధవాతిథివితాన, పురాణకథాశ్రుతీందిరా
ధ్యానవిలోలమానస, క్షమాభినవక్షమ యాచుఁ దోఁచు ల
క్ష్మీనరసాంబ యంబయొ శచీసతియో యనసూయయో యనన్. 58

సీ. అత్తాఁడుబిడ్డ లేలా? దాసియేనిఁ ద
న్నాడిన విని యెదురాడ నోడుఁ
బతియాజ్ఞమా టేల? పసిపాప కోర భీ
తిల్లుచుఁ జెప్పిన దెల్లఁ జేయు
బంధులవఱ కేల? పరదేశులేని రా
నాదృతిఁ బెట్టు నున్నంతలోన
నర్థుల కడిగినయంత యిచ్చుట యేల?
పాత్రున కడుగకే బహుత నిచ్చు

గీ. యకుటిలామృతహృదయ దయామయాత్మ
యగుచు నీదర నరసాంబ; యామెదృష్టిఁ
బెద్ద లన దేవతల్, సుతుల్ పిన్న లనఁగ
నల్లనివి నీళ్లు, తెల్లని వెల్లఁ బాలు. 59

గీ. ఆ నరసమాంబ యందుఁ బట్టాభిరామ
సచివమణి గాంచె సుత చతుష్టయము వరుస
రామయాహ్వయు వేంకటరావును పెలి
గొండరాయని వేంకయాఖ్యునిఁ గుమారు. 60

క. పెలిగొండ్రాయఁడు నాల్గేఁ
డులయీడున జనకులకుఁ గడుపుశోకము సం
ధిలజేసె నట్టిశోకము
గలుగని పుణ్యాత్ము లెందుఁ గలరో లేరో! 61

వ. పట్టాభిరామమంత్రిపరోక్షమున నా నరసాంబ బిడ్డలతో దండ్రి
యగు రామచంద్రునిరామయకడ నుండె. 62

సీ. గతభర్తృకను గూఁతుఁ బితలేని మనుమలఁ
గాచి పెంచిన దయాకరహృదయుఁడు
తల తెగిపోవుచిక్కులయందునే నన్ను
తము పల్కలేని సత్యవ్రతుండు
ప్రాణహాని తటస్థపడినను గర్మలో
పము లేని ధర్మప్రవర్తనుండు
అర్ధరాత్రము నూర్గు రతిథులువచ్చిన
నేని మృష్టాన్నమ్ము నిడెడు దాత

గీ. కంకణముపాడు మున్నగు గ్రామములకుఁ
గరణ మయి యేలుధర్మాధికారి రామ
చంద్రురామయ నరసాంబజనకుఁ డనఘుఁ
డలరు సిరిసంపదలుగల్గి లలితకీర్తి. 63

క. నరసాంబాతనయులు ము
వ్వురును త్రిమూర్తులను త్రిగుణములఁ త్రిగణంబున్
దొరయుచు మాతామహుమం
దిరమునఁ బెరిఁగిరి తదీయ నిరుపమరక్షన్, 64

వ. అందు.

ఉ. రామయ పెద్దవాఁడయి కరం బలరారుచు రామయాఖ్య మా
తామహసంస్కృతుం డయి యథావిధిఁ జేయుచుబ్రహ్మచర్య ము
ద్దామము విద్దియన్ గఱచి తా నధికారము దానఁ గాంచి పై
పై మెఱయందొడంగె మెఱుపా యనుచాయను నీత్యుపేతుఁడై.

క. కడగొట్టువాఁడు వెంకయ,
కడుభక్తిని దల్లి నన్నగార్లఁ గొలుచుఁ దా
విడిముడియుఁ బుడుకుఁ జదువులుఁ
కొడుకును గూఁతురును మనుమగుఱ్ఱలు వెలయన్. 66

గీ. వారిలోన ద్వితీయుండు భాగ్యమహిమ
నద్వితీయుఁడు డమ్మూరుపురియందుమాత్ర

మధ్యముఁడు, సర్వజనులందు మహిమను బ్రథ
ముఁడయి వేంకటరాయఁ డభ్యుదయ మొందు. 67

ఉ. రామయమంత్రి కట్టినపురంబును గోటయుఁ బేటలున్ సుధా
ధామములుం బసుల్ ధనము ధాన్యము సర్వముఁ గాలకర్మ పా
కామితధాటి నెక్కడవి యక్కడ నే మటుమాయమయ్యె నా
రా మహి నేరికిం దరతరంబులుగా వశమయ్యెనే సిరుల్. 68

గీ. బొగ్గ భువి స్రగ్గి, వ్రజమై పొదలునట్లు,
చెఱకు నలఁగి క్రాఁగియును జక్కెరయగునటు
మన్ను బలుకాఁకఁ గాచ హామాడికఁ గష్ట
జీవి నయవృత్తిచే సుఖజీవి కాఁడె. 69

సీ. దారిద్ర్యఘోరాంధకారమం దుదయించె
నమృతాంశుబింబమ ట్లాదియందు
నజ్ఞానకాంతార మంతయుఁ బరశు వ
ట్లడఁచి విద్యామార్గమందు నడచె
సంసారసాగర సంతరణార్థమై
వాణిజ్యతరి పోతవాహుఁ డయ్యె
ధరణీరమాకీర్తి తరుణుల సాపత్న్య
కలహకేళులఁ గాంచి కులుక నేర్చె

గీ. దీనజనులకు భూమ్యవతీర్ణకల్ప
తరువు, సారస్వతామృతదానఘనుఁడు
ఘనత రేదరవంశముక్తాఫలోత్త
మాయితుం డగు వేంకటరాయమంత్రి. 70

శా. సారాచారుఁ డుదారమానసుఁడు శశ్వద్విద్వ దాశీర్వచో
వారాభీష్టుఁడు, సంస్కృతాంధ్ర కవితావల్లీప్రసూనాయితో
దార స్వచ్ఛయశోభిరాముఁడు రమాప్రాణేశ భక్తప్రభుం
డౌరా వెంకటరాయమంత్రి యనఁగా నార్జించె సత్కీర్తులన్. 71

సీ. తన యిలువేలుపై తనరు శ్రీరఘురాము
నామకీర్తనము సంతతము జరుగు
రామభక్తుండు పితామహుఁ డతని నా
మము రాముఁ డగుటఁ దత్ స్మరణ గలుగు
మాతామహుండు రామయ, రామమూర్తి మి
త్రము వారిపేళ్ళు నం దిమిడియుండు
బట్టాభిరామయాహ్వయుఁ డగుతండ్రినా
మైకదేశముగూడ నదుకుట యగు

గీ. ననియు నంతయు రామమయం బొనర్ప
నగు ననియుఁ గంపెనీకి రామాఖ్యఁ బెట్టి
తమ్మున కొసంగి యది; యాదిఁ దన సమాఖ్యఁ
గలిపె వేంకటరా వాండు కంపెని నిడి. 72

క. వేంకటపదపూర్వకరా
మాంకన మగు కంపెనీకి నధ్యక్షుఁడుగా
వేంకటరామయ కాఁగలఁ
డింక ననెడియర్థ మొదవదే యం దరయన్. 73

క. వేంకటరామాకంపెని,
వేంకటనాయకుఁడువోలె వెలయుచుఁ గలిలో
సంకల్పితార్థసిద్ధి న
శంకముగ నిరక్షరాస్యసమితికి నొసఁగున్. 74

సీ. వేంకటరామకంపెని కద్యతన భర్త
'రామా' కు భూతపూర్వప్రభుండు
ప్రథితవేంకటరామ పవరు ముద్రాలయ
త్రాత 'పారంభవిద్యా' ప్రణేత
బహుబాల బాలికా పాఠశాలా నేత
నైకవిద్యార్థి సంఘాన్నదాత

గ్రంథకర్తృచకోరరాజి కళానిధి
లలితకళాత్యభిలాషుకుండు

గీ. మందరోద్ధర్త భారతామందభావ
సుందరత్వప్రదర్శనానందపూరి
తాంతరంగుఁడు మాతృభాషావనవ్ర
తుండు వేంకటరాట్సుచివుండు వెలయు. 75

చ. బడులను విద్యలన్ బడయు బాలుర నిర్మలినాంతరంగముల్
పొడ వగు సుబ్బమాహ్వాయ విభూషిత పాండుర సౌధరాజమున్
గడుకొని యిచ్చు విప్రభవనంబులు సత్కవికావ్యసూక్తులున్
విడుదులుగాఁ జెలంగు నల వేంకటరాయని కీర్తికాంతకున్. 76

సీ. కటిదఘ్నపంకసంకలితమాక్రాంతలు
శ్రమపడి ఘంటాపథములు సేసె
సంధకారమున నల్లాడు బాధలు తీర్చెఁ
బ్రతిచతుష్పథము దీపములు నిలిపి
త్రావ నీరము లేనితావుల మధురోద
కూపాంబునాళసంకుల మొనర్చె
నిల్లిల్లు కాల్నడ నేఁగి జనేష్టముల్
తెలిసి తీర్పించెఁ దాఁ దీర్చెఁ గొన్ని

గీ. పౌరలోకకృతజ్ఞతాస్ఫోరకముగఁ
బేట యేలూరుపురిఁ దనపేర వెలయ
వరలుఁ బురపాలసంఘసభ్యతను బెక్కు
హాయనములుగ వేంకటరాయమంత్రి. 77

ఉ. ఆడినమాట తప్పఁ డెదురాడఁడు పెద్దలమాట, కెవ్వరే
మాడిన మానమూనుఁ, దగవాడెడు శత్రువుచిత్తమేని నో
నాడఁడు, దైవభక్తి విడనాడఁడు, రచ్చకు రాఁడు సత్యమున్
వీడఁడు, గూడఁ డల్పులను వేంకటరావు జనించు టాదిగన్. 78

సీ. మాతామహుని యాలమందఁ గాచినవాని
యాలమందలు నేఁ డనంత మయ్యె
ననుగృహ మ్మరిగి వారాన్నముల్ దినువాఁడు
సతతాన్నదానసువ్రతము నడపు
నిలువ నీడయు లేక కలఁగువానికి నేఁడు
హర్మ్యముల్ గృహము లిన్నన్ని కావు
తన కండ యైనమిత్రము రామమూర్తి ని
నేఁడు వ్యాపారాన నెలవుకొలిపె

గీ. నిట్టి పరిణతి గర్వింప కెవఁడు మనును?
గనఁడుగాక నాఁడును నేఁడు గర్వలవము
మచ్చునకునైనఁ గలనైన మాటకైనఁ
గాని వేంకటరాయప్రధాని యౌర. 79

శా. పుత్రున్ వేంకటరత్నమున్ గురుపదంబుం జేసి యాంగ్లేయవా
క్పాత్రుఁ దన్ను నొనర్చినట్టి కరుణావారాంనిధిన్ సత్త్రా
డ్గోత్రాలంకృతి బాపనాఁబను సుతుండో యన్నటుల్ భక్తియు
న్మైత్రిన్ వేంకటరావు నేఁటికిని సంమానించు మేలెంచుచున్. 80

ఉ. ఏయెడ నెవ్వరుఁ దృణము నేని యొసంగని దుర్దశన్ సహా
ధ్యాయుఁడు రామమూర్తి యగదా ననుఁ దేల్చె నటంచు ద్రవ్యపున్
సాయమొనర్చి వర్తకమునన్ నెలకొల్పె విపన్ను నాసఖున్
బాయక తాఁ గృతజ్ఞతకుఁ బాల్పడి వేంకటరావు దారతన్. 81

ఉ. పన్నగభర్తకేని యలబ్రహ్మకునే నివి యిన్ని వి న్ని యం
చెన్ని వచింప నౌనె? ధన మెన్నక వేంకటరాయమంత్రి పై
కొన్నతమిన్ ఘటించువడుగుల్ గృహదానములున్ వివాహముల్
జన్నములున్ బడుల్ గుడులు సావడులున్ సలిలాన్నసత్రముల్. 82

ఉ. ఆర్యనుత ప్రశాంత సుగుణాంబుధి వేంకటరాయమంత్రి యా
దార్యము రామభక్తి విబుధారణం బటు లుండ; శంకరా
చార్యులసేరు సెప్ప వివశం బగుభక్తి విరక్తి వేరియా
చార్యకమందు నేర్చెనో యసాధ్యములై కనిపించు భేర్కొనన్. 83

ఉ. అద్వైతనార్యలోకతరణార్థము నిత్యము ధూపదీప నై
వేద్య పురస్సరార్చనలు వేళకు సల్పు నిబంధనమ్ములన్
హృద్యముగా మఠంబు రచియించి జగద్గురు విగ్రహప్రతి
ష్ఠాద్యనవద్య కార్యములకై పనిఁబూనెను ధర్మకర్తయై. 84

క. అంకితముగ రామునకున్
శంకరవిజయమ్ము నప్పనము సల్పుచుఁ ద
చ్ఛంకరమత మనువుపఱచు
వేంకటరాయని తలంపు వినుతింపఁ దగున్. 85

శా. అద్వైతప్రతిపాదకార్థనిబిడవ్యాహార మా శాంకరీ
యద్వైపాయనసూత్రభాష్యమును నిత్యం బందు బోధింపఁగా
విద్వాన్మాన్యము పాఠశాలయును భావిన్ సంప్రతిష్ఠింపఁ దా
హృద్వీథిన్ దలపోయునాఘను తలం పీడేఱు లక్ష్మీకృపన్. 86

శా. భారద్వాజసగోత్ర మత్కృతిసుతా పాణిన్ గ్రహింపన్ బుధా
చారం బొప్పమి నో, రఘూద్వహుని దా జామాతఁగా భావఁగా
నారాధింపఁ దలంచియో, గతమమత్వాహంకృతిత్వమ్మొ, కా
నీ రామార్పణ మంచు శంకరకథన్ జేయించెఁ గావ్యంబుగన్.87

ఉ. భీష్మసమానసువ్రతుఁడు వేంకటరాయఁ డజస్ర మైహికా
ముష్మికవిద్యలన్ బ్రచురముల్ పచరించుటమాత్రకాక యా
ముష్మిక మాఫలంబె తలపోసి మహౌషధశాల సర్వరో
గోష్మనితాంతశాంతికయి యుంచెను "మోడలుఫార్మసీ"యనన్.88

సీ. ఉదయించినాఁడు నెల్లూరుమండలిని వై
కుంఠపురం బను కొట్టికయందుఁ
జేరినాఁ డెటులో వేలూరుపురం బాంగ్ల
విద్యాభ్యసనకాంక్ష విడువ కలఁప
జదువుకొన్నాఁడు వైశ్యశ్రేష్ఠుఁడగు గ్రంధి
రామమూర్తి నిజమిత్రంబు గాఁగ
వర్ధిల్లినాఁడు శ్రీవరుడగు రామునా
యమున వాణిజ్యమ్ము నాచరించి

గీ. దేవ భూదేవభక్తి మహావిరక్తి
గర్వరహిత స్వతంత్రతల్ గన్నవాఁడు
ఉన్నవాఁడు పరోపకారోత్సుకతను
మన్నవాఁడు వేంకటరాయమంత్రిమౌళి. 89

శా. వాణిజ్యమ్మున నేర్పు, రాము నెడలన్ భక్తిప్రపత్తుల్, విని
ద్రాణత్యాగకళాప్రవీణత, కవిత్వాసక్తి, దేవాలయ
క్షోణీదేవ నిశాంతనిర్మితియుఁ గైకొన్నాఁడు పైతామహ
త్రాణద్రవ్యము గాన నీదిగకులోత్పన్నుండు దాయాదుఁడై. 90

చ. పరమ విరక్తుఁడై వనుల పాలయి పోయినయన్న రామయన్
భర మని చూడ కేఁగి పలు పాట్లకు లో నయి తెచ్చి, యెట్టులో
పరిణయముం బొనర్చి, సహభార్యవి దండ్రిగృహాన నిల్పె, నా
భరతున కొక్కవాసిఁ బయి వాఁ డయి వేంకటరావు ధీరతన్. 91

సీ. తనబంతిఁ బదిమంది దిన కున్నదిన మొక్కఁ
డుండదే గార్హస్థ్య మూనుటాదిఁ
దనపేర నెన్నిసంస్థలు పుట్టెనో తల
యెత్తి వ్యాపారమం దెసఁగుటాదిఁ
దన్నాశ్రయించి యెందఱు మనుచుండిరో
గ్రంథముద్రాపణక్రయము లాదిఁ
దన దానదీక్ష నెందఱకు విద్యలు వచ్చె
నో పాఠశాలల నుంచుటాది

గీ. సుబ్బమాంబిక చేపట్టుశుభముహూర్త
మెంతప్రబలమ్మొ కాని యదృష్టరేఖఁ
బట్టి పాతాళముననుండి బయలుసేయ
నెగడె వేంకటరా వంట నిక్కువంబు. 92

సీ. ఎవ్వాఁడు మౌద్గల్యఋషిగోత్ర మైన గో
పాలునివారింటఁ బ్రభవమొందెఁ
గృషి సేసి పండించి యెవ్వాఁ డతిథికోటి
కన్నంబు వెట్టె నిత్యవ్రతముగ

సేవాఁడు భూతదయావాలమ్మై దైవ
భక్తి భూసురసేవానురక్తి మించె
స్ఫురదీదరాన్వయు కరహీరకళిక సీ
తమసాధ్వి యెవ్వానిధర్మపత్ని

గీ. యట్టి వేంకట నరసయాఖ్య ప్రధాని
తనయ సౌశీల్య సౌభాగ్యధన యనంగ
నలరు సుబ్బమాదేవి నర్ధాంగిగాఁ గ్ర
హించె వేంకటరాయమంత్రీంద్రుఁ డెలమి. 93

క. ఈదర సుబ్బమదేవికి
సాదరమృష్టాన్నతర్పితాతిథితతిఁన్
లేదుర యీధర సాటి త
లోదరి సోదరలయందు నున్నది యేమో! 93

సీ. తన యనావిలసతీత్వము సత్కుటుంబినీ
జనముపాలిటి యొజ్జసాని గాఁగఁ
దన యన్నదానవ్రతం బన్నపూర్ణాభ
వానికిఁ దోఁబుట్టువావి నెఱపఁ
దన చక్కఁదన మమర్త్యసితంబినీకదం
బంబున కాచార్యకంబు నఱుపఁ
దన యనితరసుసాధప్రతిభార్జిత
విద్య వాగ్దేవితో వియ్య మొందఁ

గీ. దన దయారసపూరితాంతఃకరణము
నూత్ననవనీతమునకు ననురిగు గాఁగ
నెగడె వేంకటరాయమంత్రిగృహలక్ష్మి
సుజనవినుతగుణాలంబ సుబ్బమాంబ. 95

శా. ఆ సౌశీల్యము నా వివేకయుతవిద్యాపాటవం బా క్షమం
బా సౌరూప్యము నా వచోమధురిమం బా యన్నదానాదరం
బా సౌభాగ్యనిదానవీ సజనతాత్యంతానుకంపాప్తి యా
హా సిద్ధించునె సుబ్బమాంబికకుఁ గాక న్యాంగనాపాళికిన్. 96

గీ. పరమసాధ్వి సుబ్బాంబతోడ్పాటు కతనఁ
గాదె వేంకటరాయు విఖ్యాతి ప్రబలెఁ
ఐకకంఠ్యమ్ము లేకున్న నాలుమగలొ
నర్చు నొకధర్మమును శుభాంతముగ నగునె. 97

సీ. పది యిత్తు నన్న నేఁబది యీఁ దగవులాడు
గుడ్డ యీ బోఁ గూడు కూడఁ బెట్టుఁ
జదువు చెప్పింపఁ బో సాదమ్ముకై పోవు
వడు గొనర్పఁగఁ బెండ్లి వలదో యనును
ఎలిమిఁ బెండిలిసేయ నిల్లు లే కెల్లను
నిలుకట్టి యీ నెంచ స్థలమొ యనును
గుడి కట్టఁ గలహించు గోపురాదుల కవ్వి
కట్టింప స్థిరవృత్తికై పెనంగు

గీ. ధర్మకార్యమ్ము లొనరించుతఱిని బ్రాణ
విభున కొక్కఁకు పైఁ జదివినది యదిం!
యనఁగఁ బతితోడ భూతదయాబ్ధి సుబ్బ
మాంబ వాదాడ ముచ్చట యగును జూడ. 98

గీ. కుందనపుఁ బైడిమణితోడి కూర్పువోలెఁ
బూవునకుఁ గమ్మతావులపొత్తుపగిద
నమరె వేంకటరాయ సుబ్బాంబి కాను
కూలదాంపత్య మున్నతకోటి కెక్కె. 99

గీ. తనయ నొంటిగ నత్తింటి కనుపలేక
తనయు జానకీరాముఁ దో ననిపె నంట
తండ్రి వెంకట నరసప్రధాని కెంత
ప్రేమయొ సుబ్బమాంబిక పేరు సెప్పు. 100

ఉ. రామపదాబ్జ చింతన ధురంధరుఁడై విలసిల్లి జానకీ
రాముఁడు, సుబ్బమాంబిక కరం బనురక్తిని జూప, విద్యలన్
క్షేమ మెలర్ప నేర్చి కుడికేలయి వేంకటరాయమంత్రి క
క్షామ యశంబు గూర్చి. చనెఁ గాని జనించునె యంతవాఁడిలన్

గీ. అక్క సెలియండ్రలో సుబ్బమాంబ యొక్క
తియ తనదు చెల్లె లనుచు మతిం దలంచు
జానకీరామయార్యుఁ, డా సరణి సుబ్బ
మాంబయుఁ దలంచు నన్న యా నతని గాంచి. 102

గీ. కొడుకు వెంకట నరసయ్యాఖ్యుండు సీత
మాఖ్య పుత్రిక తనపేరి నవని నిలుప
నవని నిలిపి నిలింప పురాధివాసి
యయ్యె జానకీరామయ్య యౌవనమున. 103

క. పరమేశ్వరకృప వేంకట
నరసయ్యయు, సీతమయు ననామయ దీర్ఘా
యురుపేతు లగుచు విభవా
కరు లయి విద్యావివేకఘనతన్ మనుతన్. 104

క. సోదరమృతి శోకాంబుధి,
నీఁదఁగలే కందు మునిఁగి యెటో తేర్కొనెఁ ద
త్సోదరి సుబ్బాంబిక చిన
సోదరుఁ డగు శేషయార్యుఁ జూచుకొని మదిన్. 105

క. శేషయ వేంకటరాయు న
శేషవ్యాపారభరణశేషుఁడయై సం
తోషం బక్కఱుఁ గూర్చుచు,
భూషణమై కులమునకు; సపుత్రక మలరున్. 106

చ. "పడఁతుల మేలుబంతి యయి భాసిలుసాధ్వికి సుబ్బమాంబకున్
గడుపు ఫలింపదాయె" నను గాటపులోపము సోదరీకుమా
రుఁడు పటుబుద్ధిరూపరుచిరుండగు వేంకటరాముఁ డర్మిఁ బెం
పుడుకొడుకై తొలంచి, కులముం నిలిపెన్ బితరుల్ తరింపఁగన్. 107

క. వేంకటరామయ ప్రతిభా
సంకలితాంగ్లేయసారసారస్వత బీ

జాంకురిత వాఙ్ముఖముల న
లంకరించును సభాస్థలంబుల రక్తిగా. 108

సీ. ముక్తాఫలప్రాయముగ వ్రాయఁగా నేర్చు
సమృతమ్ము గురియ మాటాడ నేర్చు
వ్యవహరింపఁగ నేర్చుఁ బాదుషాతోనైనఁ
బరిహరింపఁగ నేర్చుఁ దురితపథము
తళుకు దిద్దఁగ నేర్చుఁ దండ్రి వాణిజ్యానఁ
దల్లియాజ్ఞను దలఁ దాల్ప నేర్చు
నేకపత్నీవ్రతం బెలమిఁ బ్రోవఁగ నేర్చుఁ
బాలింప నేర్చు సేవకులఁ బ్రేమ

గీ. దీనజనబాంధవుం డాంధ్రదేశమాత్ర
నర్ఘమకటాగ్రఖచిత హీరాంకురంబు
శ్రీయుతేదర వేంకటరాయమంత్రి
సుతుఁడు వేంకటరామార్యుఁ డతులయశుఁడు. 109

ఉ. శ్రీవసితన్ ముకుందుఁడు, శచిన్ సురనేత, రతిన్ మరుం, డుమా
దేవి శివుండు, గైకొనినతీరున వేంకటరాముఁ డర్మిలిన్
దేవిగఁ గృష్ణవేణి రమణీమణిఁ గైకొనె ఖ్యాతితోఁ; జిరం
జీవులు పుత్రవంతు లయి చెన్నెసలారుత వారు దంపతుల్. 110

గీ. ఆ కొడుకుఁ గోడలును నిజార్ధాంగలక్ష్మి
తన్ను సేవింప నిత్యాన్నదానసవ్ర
తుండు వేంకటరాట్సచివుండు వెలయు
రామపూజల శంకరారాధనముల. 111

షష్ఠ్యంతములు

క. ఏవంవిధ సుగుణ శ్రీ
భావుకహృద యేదరాన్వయాభరణ

శ్రీవేంకటరాయహృదయ
భావితసుకుమారపాదపంకేజునకున్. 112

క. షడ్వికృతిదూరునకు నరి
షడ్వర్గవిదారునకు నిసర్గఘనతమో
ద్రుడ్విమలాకారునకు పు
ర్వేడ్విసుతస్థామదళదహితసారునకున్. 113

క. వీర్యవదర్యమతన యా
జర్యస్నేహప్రదీప్త శౌర్యునకు, మహా
క్రౌర్యకుటిలహార్యాత్మజ
నిర్యాతన దధ దశారుణికకార్యునకున్. 114

క. హార్దమృదువిభీషణ సౌ
హార్దవశాభయవచో నిరాఘాటునకున్
నిర్దయమర్దిత దుర్గమ
దుర్దశ దుర్దశముఖాది దోస్పాటునకున్. 115

క కల్యాయితశరనిధికి న
హల్యాకల్యకరణ మహౌషధికి జగ
త్కల్యాణకరణగుణసా
కల్యోదధి కార్షజీవికాసేవధికిన్. 116

క. సీతారామునకు నరి
స్నేతృవినుతధామునకుఁ జణితముక్తిలతా
స్ఫీతారామునకు నప
ర్ణాతస్వీజప్యనామునకు రామునకున్.

వ. సభక్తిసమర్పణంబుగా నా రచియింపం బూనిన శ్రీశంకర
విజయంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన.

---

శ్రీ ర స్తు.

# శంకరవిజయము

## కథాప్రారంభము



### కేరళ దేశ వర్ణనము



లము వర్ణాశ్రమ ధ
ర్మాలంబము వేద శాస్త్ర హార్మ్య మఖిల స
స్యాలకిత సుక్షేత్ర మి
లాలంకృతి భరతఖండ మలరుఁ బ్రసిద్ధిన్. 1

సీ. పటు భోగగరిమ నేఁబదియాఱు దేశాల
ననుపమానం బను యశము వడసి
కాశ్మీర మటు శైత్య కార్కశ్య మెఱుఁగక
యెండవాఁడిమి కలనేని గనక
యేలా లవంగ తాంబూల సేవన మెల్ల
దేశమ్ములకు నుపదేశ మిచ్చి
ముక్కారు ముద్దిను సెక్కి త్రొక్కఁగఁ బండు
సార కేదార విస్తరము గలిగి

గీ. యివతళించు సమీరు పుట్టిల్లనంగఁ
జిదిమిపెట్టిన నెత్తావి సీమ యనఁగఁ
దేజరిలుచుండుఁ గేరళ దేశ మల్ల
భరతఖండము తల పూవుబంతి యగుచు. 2

క. అందలి సీ రమృత మ్మిం
దిందిర వేణులు సురీ ప్రతిచ్ఛాయలు, త
చ్చందన వనములు నందన
నందనములు, త్రిదివ మిదె నాఁగ దనరారున్. 3

సీ. ఏమూలఁ జూచిన నేలా లవంగాది
సురభిళ ద్రవ్య విస్తరము మెఱయు
నేవంకఁ గనుఁగొన్న హిమవాలుకా చంద
నాది శీతల పదార్థాఘ మెసఁగు
నేయోరఁ గాంచిన నింద్రనీ లాబ్జరా
గాదిరత్నముల చాయలె తనర్చు
నేదండ నరసిన నిక్షు రంభా నారి
కేళ పూగాది వనాలి దోఁచు

గీ. భోగ భాగ్యైక నిలయంబు భూమిలోక
కల్పవన కల్ప మనుప మానల్ప శిల్ప
లలిత సౌధావసథము కేరళము దనరు
వసుమతీసతి రతనాల బరిణ యనఁగ.

శా. ఏలా చందన కుందసూన మధువుల్ హేలాగతిన్ గ్రోలి యు
ద్వేలానందముతో లవంగసుమ మాధ్వీకంబునుం గ్రోలఁగా
వ్రాలంబోయి త దుష్టగంధమున కోర్వన్ రాక భృంగమ్ము లం
దాలాపించును ఝుంక్రియా మధుర గేయంబుల్ వనీవీథులన్.

చ. చలువల కిక్క, గంధవహ శైశవ కేళి విలాస సౌధ, ము
జ్జ్వల మృదుపల్ల వోల్లసిత చందన పాదప జన్మభూమి యు
వ్వలిమల వియ్యమౌ మలయపర్వత మండన యుంటఁజేసి కే
రళ మనరాళ శీతలిమ రాజితమై క్షితిఁ గాంచె సన్నుతుల్.

చ. కలఁగదు తాప మొక్కఁడు వికాసము దప్పదు వేసరిల్ల దూ
[illegible] బాయదు స్థిరాకృతి వీడ దొకప్డు బుద్ధి ము
[illegible], [illegible] దెప్పుడు [illegible], [illegible]
[illegible] కేరళంబునన్.

సీ. కాసార వాపికా కైతరాంచితమ్ములై
యారామములు సర్వ మలరుచుండు
సామాన్య సంజ్ఞ నారామమ్ము లనుటె కా
ని యవెల్ల గుసుమిత నిష్కుటముల
యట్టి నిష్కుటముల నజిరోపవనములఁ
బ్రతిసౌధమును గన్నుపండు వౌను
దత్సౌధములయం దుదార భోగములఁ జూ
ఱలుగొంచు సంపన్ను లలయుచుండు
గీ. రట్టిసంపన్ను లెల్ల విద్యాభిరతుల
యట్టిబుధు లైహికాముష్మికాధిక సుఖ
కర్మములఁ జేసి రోసి మోక్షంబు నొంద
నుత్కటేచ్ఛ వహింపక యుండలేరు. 8

క. చందన చర్చిత కేరళ
సుందర దోరోరు హోపగూహన భాగ్యం
బొందుచు నందు మలయగిరి
మందానిలుఁ డాడు రేపు మాపన కెపుడున్. 9

కాలట్యగ్రహార వర్ణనము

శా. ఆవిర్భావము నొందెఁ దొల్లిట స్వయంవ్యక్తోరులింగాత్మకుం
డై విశ్వంభరఁ గేరళాన వృషశైలాధిత్యకాసీమఁ బూ
ర్ణా వాహి న్యమృతాభిషేకము నజస్రం బందఁ గారుణ్య పా
రావారంబు మహేశ్వరాహ్వయ పరబ్రహ్మం బజిహ్మాకృతిన్. 10

గీ. స్వప్నమునఁ దచ్ఛివాద్భుత వైభవమ్ము
గనిన యొకరాజు తచ్చోదనమునఁ గట్టించె
సంతత ప్రభమైనప్రాసాద గోపు
రాదు లేర్పాటొనర్చెఁ బూజాదులకును. 11

క. ప్రణతార్తి హరుం డగు త
త్ఫణిభూషణు కృప నిరీతిభావమునం గళాఽఽ
పణమై కాలటి యను బ్రా
హ్మణాగ్రహారంబు వెలయు నాగుడిపజ్జన్. 12

మ. అలరుం గాలటి యగ్రహార మమరోద్యానానుపహార మ్మనా
విల వేద శ్రుత వైదుషీ నిరుప మోర్వీనిర్జర ప్రాజ్ఞ మం
డలికా వీరవిహార మన్వహ వితాన ప్రీణి తామర్త్య దో
హల వీహారము, కేరళ క్షితి వతం సాయ్మాన కల్హార మై. 13

సీ. ఏయూరిపొలమేర నిందుశేఖరుని కా
ణాచి వైవృషగిరీంద్రము వెలుంగు
నేయూరి చేరువ రాయుచుం బరమప
విత్ర పూర్ణానది వెల్లివిరియు
నేయూరిపొలములం దేకాలమును నేత్ర
పర్వమై సస్య సర్వస్వ మొసంగు
నేయూరి గృహముల నింపారు దనము ధా
న్యములు [illegible]

[illegible]. ప్రబల [illegible]
ము [illegible] వంచి
[illegible]
[illegible]. 14

[illegible]
[illegible]
బూరి [illegible]
నడుమ మిద్దెలు [illegible]

నలుకుముగ్గులను జేమాకులఁ దలపించు
వేద్యంగణాళింద వితతి మెఱయ
స్వాహా స్వధా వషట్ స్వనపూర్వ హుత హవ్య
సురభిధూమము లెల్లచోట్ల సుడియ

గీ. ఈతి తస్కరపీడా రుజా ప్రసక్తి
లేక ధర్మావలంబనశీలిక మఱుచు
సంతత బ్రహ్మపాఠ ఘోషమ్ము పొదల
వరలు నాబ్రహ్మపురి బ్రహ్మపురిని మించి. 15

గీ. యజ్వ కానట్టి ద్విజుఁ డందు నగపడఁ డన
నందునే సోమిదమ్మ కాకున్న గృహిణి ?
యెల్లవిప్రు లధ్యాపకులే యనంగ
నెల్లవటువు లధ్యేత లం చేల పలుక ? 16

ఉ. నాలుగువేదముల్ చదివినన్, బఠియించిన నాఱుశాస్త్రముల్
చాలును విద్య లంచు నలసత్వము నొందక, కర్మకాండ మూ
మూలము నాచరించి, పరమున్ మదిఁ గోరి, యనాద్యవిద్య ని
ర్మూల మొనర్చు విద్య కయి రోయనివాఁ డొకఁ డుండఁ డచ్చటన్.

శివగురుచరిత్ర

క. అం దుండు సకలవిద్యా
విందువు విద్యాధిరాజ విఖ్యాతాఖ్యుం
డిందుధరుఁ డెవని నందను
నిం డండ్రిఁగ వలచెనో జనింప నరుండై. 18

ఉ. ఆతని పూర్వపుణ్యము [illegible]
పేతుఁ డొకండు బాలుఁ [illegible] జ్ఞా[illegible] వా
గీతి గురుండ యా [illegible] వ్వ[illegible] ని
ర్ధూత భవుండు దా 'శి[illegible]. 19

ఉ. వాఁడును బ్రహ్మచర్య పరిపాలనకై గురుగేహ వాసియై
యోడక సేవసేయుచు నిజోచిత మాధుక రాన్న భోజియై
పోఁడిగ నగ్నికార్య మిరుప్రొద్దును దప్పకచేయుచున్ దమిన్
వీడక కూడ కన్యుల స్వవేదము నధ్యయనించెఁ బ్రార్తిగా. 20

గీ. కలుగునె క్రియా ద్యనుష్ఠాన ఫలక మర్థ
బోధము విచార రాహిత్యముననుగాన
శ్రుతులఁ జదివి విచార మానూరి సలిపె
నరయ వేదంబు దుర్బోధతరము గాదె. 21

క. భయభక్తుల నిజశాఖా
ధ్యయనముతో నన్యశాఖికాధ్యయనము సే
సియు సంగము లరసి గురుని
దయను సమావృత్తుఁడై యుతం డిలు సేరెన్. 22

ఉ. మందిర మట్లు చేరి తనమాతకు మ్రొక్కఁగ నాపె నందనున్
[illegible] వాకె చన్నచో
[illegible] నాఁ
[illegible] మాటయున్. 23

సీ. [illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
సాంఖ్య [illegible]
[illegible]

గీ. క్షితిని విద్యాధిరాజ ప్రసిద్ధిఁ గనిన
తన సమాహ్వాయ మన్వర్థతను రహింప
బుత్ర బుద్ధివిశేష బుభుత్సు వగుచు
శివగురుఁ బరీక్షసేసి హర్షించెఁ దండ్రి. 24

చ. అటు జనకోదితుం డయి స్మితాస్యవిభా హసితాబ్జుఁ డౌచుఁ దో
ల్తటి గురుపంక్తి నెంచి సరళంబుగ నుత్తరమిచ్చు పుత్రు వా
క్పటిమకు వేదశాస్త్ర మతికౌశలి కుబ్బెను దండ్రి సంస్క్రియా
స్ఫుట మగువాక్కు విజ్ఞున కపూర్వ ముదం బుదయింపఁ జేయదే.

క. శ్రోత్రియుఁ డంతర్వాణి ప
విత్రకులుఁడు మంజురూపవిభవుఁ డనుచు నా
ధాత్రీసుర సుతునకుఁ దమ
పుత్రికల నొసంగఁ బెక్కు భూసురు లరుదేన్. 26

ఉ. అం దొక సత్కులప్రభవుఁ డైన ద్విజన్మునిపుత్రి భవ్యరూ
పం దత శాంతి దాంతి గుణ పాలిక బాలికఁ దెచ్చి బాంధవా
నందము మీఱఁ బెండిలియొనర్చెఁ గుమారునకున్ ద్విజుండు మి
న్నందిన వైభవంబున ముదంబుధిఁ దేల జనంబు లందఱున్. 27

గీ. విధి యుతంబుగ దేవేంద్ర విభవ మమరఁ
బరిణయం బన్నినాళ్ళ శుభప్రద మయి
జరిగెఁ జుట్టాలు సత్కారభరితు లగుచు
దీవన లొనర్చి చని రాత్మదేశములకు. 28

మ. అనురూపాకృతి, సౌమ్య శీల, మృదుల వ్యాహార, సౌహార్ద పా
లన దీక్షా మతి, బంధుతా సురభి, బాలారత్న మార్యాంబ నాఁ
గ, నిరూఢిం గనుకాంత యాశివగురు ఖ్యాతాఖ్యుఁ డౌకాంతుతో
మనువొందన్ గిరిజామహేశ్వర సధర్మం [illegible] 29

సీ. అత్తమామలకుఁ బా దాభివందన పూర్వ
మఖిల శుశ్రూషల నాచరించు
బతి కనుసన్నఁ బ్రవర్తించు క్షీర నీ
ర న్యాయమున భేదరహిత వృత్తిఁ
దనివార నతిథి బాంధవుల కిష్టార్థ వి
శ్రాణనంబున సంతసంబు గూర్చు
గృహకృత్య భార నిర్వహ ణావసరమున
వంచిన నడు మెత్త దించు కేని

గీ. సకల సౌభాగ్య భాగ్య లక్షణ సమేత
యగుచు నయ్యార్యనే కాక యువని నెల్లఁ
బరమసాధ్వీ ప్రశంసఁ బ్రప్రథమ కక్ష్య
నందె నార్యాంబ గుణకదంబావలంబ.

గీ. [illegible] దుత్కంఠ నాచరించె
[illegible]
[illegible]
[illegible]

సీ. [illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]

గీ. స్మరనిభాకృతి యుర్వీసమ క్షముండు
వాగ్రమాధికరణం బయి వరలు నా ద్వి
జుండు సర్వగతులను బూర్ణుండె కాని
నందనముఖేక్షణాదృష్ట మొందఁడాయె. 32

క. గోవులు ధనములు బహుస
స్యావృతకేదారములు ననర్ఘగృహము సం
భావన బంధుసమాగమ
మావిప్రు నలర్ప వాత్మజాప్రాప్తి నయో! 33

శా. "ఈయోఁ డుద్భవ మొందుఁ బుత్రుఁ డిఁకనియ్యోఁడున్ జనెన్ గానియీ
పై యోఁడేని జనించు" నన్న మతితోఁ బ్రాయంబు సా మేఁగుడున్
జాయం బల్కు బుధుండు ప్రాయము తనూసారంబువోయెన్ గనుల్
గాయల్ గాచె వెలంది! పుత్రముఖ వీక్షా వ్యర్థ కాంక్షార్తిచే. 34

క. సుతుఁ గంటిమేని మన కా
తతశుభములు గలుగుఁ బంచతం బొందిన నం
చతివ! యుపాయము లరసియు
వితయయి నాపుట్టు వెంచి వెతగాంతు మదిన్. 35

గీ. గరిత! పుత్ర పౌత్ర క్రమాగతిని మనల
నెవరు గణియింత్రు లోకమం దింక మీఁద
ఫలిత మగుశాఖిఁ గాక ప్రవాళవేళఁ
బ్రసవ ఫల శూన్య తరువు నెవ్వండు దలఁచు. 36

చ. అన విని పల్కెఁ దత్సతి 'మహాత్మ! శివాఖ్య చరిష్ణు కల్పశా
ఖిని భజయింపఁ జిక్కు మన కేల స్థిరైకఫలంబు- భక్తిమ
జ్జనుఁ డుపమన్యుఁ డొందిన ప్రసాదము సాక్షియ కాదె? దేవకో
టిని జడిమంబు నొందుట ఘటిల్లదు మర్త్యుల నొందు కైవడిన్ 37

సీ. ఝాటఝాటమున నుచ్చైరవంబునఁ బొంగు
గాంగవేణికకు సాష్టాంగ మెఱఁగి
శ్రుతిసూక్తివితతి భాసుర సుస్వరంబుల
వినుచు పాణికపాలమునకు మ్రొక్కి
యనుపదం బుల్కి స్వయంగ్రహా పరిరంభ
సౌఖ్యమ్ము పతి కిచ్చు సతి నుతించి
అఱచు నావ్యక్తరోదయ హేతు వగుఢక్క
ననుకరించు పదాంగదాహిఁ బొగడి

గీ. హా యటంచు మహీసురుం డాత్మయంద
శివునితాండవ మూహించి చింతసేసి
కనులఁ గట్టినయట్లైనఁ గలఁగి యశ్రు
లొలుకఁ బులకితగాత్రుఁడై యొఱఁగు ధరణి. 44

క. జాయయు స్వచ్ఛాయయటుల్
కాయము నియమోపతాప కఠినత నవయన్
నాయకుఁ బాయక వృషధర
నాయకు బహుకాల మర్చనంబులఁ దనిపెన్. 45

ఉ. చిన్నిపిపీలికల్ మొదలు చెట్టులు గుట్టలు గట్లు పుట్టల
చ్ఛిన్నతదేకభక్తి విధుశేఖరరూపములై కనంబడన్
గన్నులు మూసినన్ దెఱచినన్ మది భేదముపోయి యావ్విజుం
డున్నలినాక్షియున్ దముఁ గనుంగొని రెండొదౌ శివబుద్ధిలోకన్.

క. క్రమముగ సకల చరాచర
మమలం బగు హృదయ దర్పణాధిష్ఠితమై
యమరఁ దమ కిరువురకు లో
కమున కభవునకు నభేదకలనము గలిగెన్. 47

మ. జల దాచ్ఛాదిత సూర్యబింబమువలెన్ శైవాలజా లావృతాఁ
చలితోయాంబువుపోల్కి మాయ దను నాచ్ఛాదింపఁ గప్పట్టిన
ట్టుల కప్పట్టనియట్లు తోఁచు శశిచూడున్ జూచుచున్ గొన్నినా
ళు లవిచ్ఛిన్న తపంబు లాద్విజుఁడు నాలుం జల్పి రేకాకృతిన్. 48

క. అంబుదము విరియ భాస్కర
బింబము పొడసూపుపగిదిఁ బృథుతరమాయా
సంబంధ మ్మొడయ నసం
తం బానందమ్ము శివునితత్త్వము తోఁచెన్. 49

గీ. ఇది యది యటంచు నన నేల యెల్లకరణ
కర్మములు, వార్థియం దనేకస్రవంతు
లణఁగి తాదాత్మ్య మొంది న ట్లాయఖండ
తేజమున మున్గిపోయి శాంతిల్లె నల్ల. 50

క. ధ్యాతృ ధ్యాన ధ్యేయ భి
దాతీ తాద్వైత భావ నాఁచంచలమై
వీతతరం గాంబుధిగతి
నా తాపసులకు విచిత్ర మగుస్థితి యమరెన్. 51

చ. సగుణము నిర్గుణంబు నగుశాంకర తేజము శాంతమానసా
బ్జగత మొనర్చి పూజల జపంబుల ధ్యానములన్ సమాధులన్
బగళులు రేలు నద్దిర క్షణప్రతిమంబులు గాఁగఁ బుత్తు రా
ల్త్ర[illegible] లది [illegible] [illegible]లన్ [illegible]వంగ ననంగ నెంతయున్.

క. వడలక [illegible] [illegible] [illegible]
మది [illegible] [illegible] [illegible] [illegible] [illegible]లన్
మొదలం[illegible] [illegible] [illegible]
[illegible] [illegible] [illegible] వెన్నవలెన్. 53

వ. అంత బాలప్రాలేయరోచిర్మౌళికి నిస్తంద్రకరుణారసం బద్ధరామర జాయాపతులవంక వంకలై తొలంక నుంకించు నత్తరుణంబున మహాశివరాత్రి పుణ్యకాలం బరుదెంచుటయు. 54

శివగురునకు శివుఁడు ప్రత్యక్షమగుట

చ. శమ దమ మూర్తులైన ద్విజజంపతు లత్తఱి నాప్రభాత మ
ద్దమరెయిదాఁక నీశ్వరపదంబులు గొల్చుచుఁ బాడి పాడి వి
శ్రమమును జెందఁ దచ్ఛివ పురస్థిత భిత్తిక నాని మేను, నే
త్రము లొకయింత మూసి వసుధాసురుఁడొక్కక్షణంబుపుచ్చుడున్.

సీ. గగనమార్గమ్మందు నిగనిగ మను నొక్క
వెలిమబ్బు తెలిగట్టువలెను దోఁచెఁ
జూడఁజూడఁగ నొక్క సురుచిరంబు మెఱుంగు
చిరచిర నిటునటు పరుగువాఱె
నామేఘ మంతంత నవనికి దిగివచ్చు
నట్లు పురోభాగమందు నిలిచెఁ
దన్మధ్యసీమ నుత్తమ కాంతి యొకమూర్తి
తెరఁ బాయు నర్తకి సరణి మెఱసెఁ

గీ. గ్రమముగాఁ బూరుషుం డయి కదలఁజొచ్చె
నభయ వరద ముద్రాంచిత హస్తయుగము
తలను జాబిల్లి, కనుల మందస్మితార్ద్ర
కరుణ యరమేన సతి, గల్గి గిరిశుఁ డయ్యె. 56

చ. అటువలెఁ దోఁచు శంకరుఁ గృతాంజలియై చలితాఖిలాంగుఁడై
చొటచొట నశ్రువుల్ దొఱఁగఁ జూపుల కందనిరూపు నేత్రసం
పుటమున నాని యాని స్తవమున్ బచరింపఁగ మాట రాక యు
క్కట! భువి వ్రాలె నాద్విజుఁడు, గౌరియమోయని జాలిఁదూలఁగన్

క. హైమవతీ వక్షోజ మృ
గీమద జంబాల మేచకితమై, నిజభ
క్తామరతరు వగు, వలకే
లామృదుఁ డట్టు సాచి పట్టె నతనిఁ దటుకునన్. 58

ఉ. పట్టి సుతుండు తె మ్మనెడు దపంబులఁ గ్రుస్సితి రీవు జాయయున్
బొట్టకుఁ గూడ జెఱుంగర తినుం డొకపండునుమాత్ర మంచుఁ జె
న్నట్టగ మామిడిం డ్లనుపఁ గోమల కాంతి సుగంధ పూర్ణమై
నట్టిది భిన్నపం దొకటి యాతఁడు చేకొనెఁ గేలుదోయిటన్. 59

చ. కరయుగళంబునన్ సగముగాఁ బఱిచి కెత్తుడుఁ; దద్రసాల ము
ర్వరఁ బడి తద్రసంబు పరివాహము గట్టఁగఁ గ్రుమ్మఁ బాటుమై
నెఱిఁ గను విచ్చి నల్దిశ లనేకవిధంబులఁ గాంచియున్ హరున్
వరముగ నిచ్చు తత్ఫలమువాసనయున్ గనఁజాలఁ జింతయున్. 60

క. వలిమల యల్లుఁడె చెంగట
నిలిచి ఫలం బొసంగినటు గణించును గానీ
కల యని తెలియక యాతఁడు
కళవళమును జెందె నొక్క క్షణము మనమునన్. 61

చ. మనసు దిటంబు సేసికొని మాయను ద్రోపి పరిస్ఫుటంబుగాఁ
గనుఁగవ విచ్చి చూడఁ గఱకంఠుని లింగము గంటరీతి నుం
డిన యొకవిప్రు నాట మగుడద్దురఁ గూరినయాలు దేవళం
బును [illegible] సర్వేశ్వరు పొందెఁ గలం గనుఁగొన్నదానికిన్. 62

క. ఇట్టి కలఁ గంటి, [illegible]ట
యెట్టి ఫలం బొదవునో యనేకఫలంబుల్
గుట్టుగ, జూపెన్ [illegible]
యెట్టిఫలంబునకు [illegible] యూహించితినో.

క. అని మది నాస్వప్నఫలం
బునకై కొండొక విచారమును జేసి తుదిన్
దన శాస్త్రానుభవబలం
బున నీగతి నిశ్చయంబు బొందఁగఁ గల్గెన్. 64

చ. సుతుఁ డుదయించు నొక్కఁ డతిసుందరరూపుఁడు పాండితీసము
ద్గత సితకీర్తిచిక్కణసుధాద్రవలిప్త దిగంగనాకపో
లతలుఁడ యౌను గాక విరళం బగునాయువు గాంచు నంచు నెం
చితి నిది యెల్ల నీపెకు వచించినఁ గుందదె నేఁటినుండియున్. 65

క. భగవద్విలాస మట్లుం
డఁగ నెవ్వం డాఁప నోపు; నగజాపతి య
ప్పగిది వర మనుచు వగ లీ
యఁగ నెంచునె భక్తదుఃఖ మరయఁ దలఁచునే. 66

వ. అని కొండొక కళవళ మొంది యొంది తుదకు. 67

చ. అట నొక కంబ మానుకొని యప్పుడ నిద్దురగొన్న ముద్దియన్
దటుకున లేపి యెల్లకలఁ దప్పక యామెకుఁ జెప్పి యప్ఫలం
బటు భువిఁగూలి రూపఱునదంతయు మాత్రము డాఁచెఁ జిత్త ము
త్కటికము నొందినన్ ముఖవికార మొకింతయుఁ దోఁపకయ్యెడన్.

క. ఆనందాశ్రు ఝరంబులు
మేనఁ బొడము గగుఱుపాటు మీఁదఁ బఱవఁగా
మానిని 'ధన్యాస్మి' యని భ
వానీపతి కాచరించె వందనశతముల్. 69

మ. జననీ! మాయెడ నీకు నెంత కృపయో సర్వేశు కారుణ్యదృ
ష్టిని మావంక మరల్చి వంశము ప్రతిష్ఠింపన్ బ్రసాదించి, శే
మని నీశక్తి నుతింతు శక్తిధరు నీడై నాకుమారుండు గా
డను పర్థిల్ల ననుగ్రహింపు మని తోడన్ మ్రొక్కె శర్వాణికిన్.

ఉ. ఆపరమానుభావు లటు సాంబశివున్ గను మూయకుండ ని
ష్ఠాపటిమన్ నుతించుచు నుషస్సమయంబున మెల్ల నేఁగి పూ
ర్ణాపగఁ గు్రంకి వచ్చి తొలియ ట్లభిషేక మొనర్చి తద్వ్రితో
ద్యాపన మాచరించి నిజధామ యియాసువులై ముదంబునన్. 71

సీ. వృష శిఖరీశ్వర శ్రీపాదములకు స
హస్రాభివాదమ్ము లాచరించి
యంబికా దివ్య పాదాంభోరుహ పరాగ
పుంజమ్ము మస్తకంబుల ధరించి
గణనాథ గండ నిర్గళిత మదాంబువుల్
మార్జించుకొని నిజమౌళులందు
శ్రీకుమా రాంఘ్రివారిజ గంధలహరుల
నాసాపుటికిఁ దర్పణం బొనర్చి

గీ. పారిషదవర్గమును బరిపాటిఁ గూడి
పాడి స్పృశియించి సెలవీయ వేఁడి వేఁడి
తిరిగి తిరిగి కనుంగొంచు గిరిని డిగ్గఁ
జాల కెట్టులొ డిగ్గి రయ్యాలుమగలు. 72

చ. అభవపరాత్ములై నియతులై పరిశుద్ధులు తత్సతీపతుల్
శుభదముగాఁ గలన్ దలఁచుచున్ జని యింటికి నన్నవస్త్రదా
నభర సుతృప్త భూసురజనంబుల దీవన లీశ్వరోక్తిసం
నిభములుగాఁ దలంచుచు నసీదృశమోదము నూఁది రాదటన్. 73

ఆర్యాంబ గర్భము దాల్చుట

ఉ. ఆదినమంద శాంకరమహ ర్మిళితంబు ద్విజాతిభుక్తశే
షౌదన మారగించెను తదాజ్ఞను శ్రీశివగుర్వభిజ్ఞఁ ద
ప్పైదలియున్ నిజేశుపదభక్తి మునింగి తదన్నభాగసం
భాద మొసఁగ్ని తాల్చె శివగర్భము గర్భము నిర్భరద్యుతిన్. 74

క. ఆరమణి గర్భ మెదుగ శ
రీర మ్మలరెను బ్రిభాతి రేకము చేతన్
వారిత దృక్పాత జగం
బై రవి మధ్యాహ్న దుస్స హాలోకగతిన్. 76

చ. జగములు నాలుగున్ బది నజస్రము దాల్చుచు భూ జ లాన లా
శుగ వియ దర్క చంద్ర పురుషుల్ నిజ మూర్తులుగా వెలుంగు ప
న్నగపతికుండలుండె లలనామణి గర్భమయత్వ మొందఁగన్
మగువ కఠోరగర్భ గతిమాంద్యము నొందె నటన్నఁ జిత్రమే. 77

సీ. తన తేజమున సతి తనువు నింపి జగన్మ
యుఁడు డాఁగె శివుఁడు త దుదరమందు
సుదతి రమ్య సుగంధి సుమ ధారణం బోర్వ
దన రత్నభూషాది నడుగ నేల
యించుక బరువైన దేపదార్థము గాని
దాల్పంగ నలయుఁ దద్దయు మృగాక్షి
విడిచినన్ విడువ కాబిడకు దౌహృదము చే
కూరిచె వెత దుశ్శరారివోలెఁ

గీ. గోరు దుర్లభ వస్తు వాకోర్కె దీర్పఁ
దేర, నది కా దనుచుఁ గోరు వేఱ యొకటి
నదియు నెటో తేర, రోసి యన్యంబు గోరు
నువిద యది యీయఁ, గనుఁగొంచు నోకిలించు. 78

ఉ. చూలును దాల్చు వార్త వినుచున్ వెలలేని యపూర్వ దుర్లభా
ర్థాళులు గూర్చి బంధు నివహంబులు నూడిదగా నొసంగ నీ
లాలక యాస్వదించి యిసుమంత ముదంబును గాంచు; దుర్వ్యథా
మూలము గాదె గర్భభరముం ధరియించుట పూవుఁబోండ్లకున్. 79

గీ. మనుజధర్మానుసార మిమ్మాడ్కి ననుచె
కాని, శివతేజమును దాల్చు కాంత కార్తి
గలుగు కెట్లఖిలార్తులు మలఁగ జగము
లభవు సేవింతు రంచు మహాత్ము లనరె. 80

సీ. తాను స్వభావావదాత వర్ణం బగు
ఋషభ వాహనముపై నెక్కినట్లు
సంగీత విద్యా విశారదు లైన గం
ధర్వులు బలసి త న్బాడినట్లు
విన యానుయానులై విద్యాధ రాదిక
దివిజులు తను సన్నుతించినట్లు
"జయ జయ రక్ష రక్ష" యటన్న పల్కు లా
లించి తా వరము లందించినట్లు

గీ. కలలు గని తృప్తిపడి మేలుకాంచి లలన
త త్స్వనఃపునరుక్త శబ్దంబు నాల
కింపఁగాఁ జాల, దాదృశ్య మించుకంత
గాంచఁజాల, దచ్చెరువును గనుట దక్క. 81

ఆ. లలన నర్మభాషలను బల్కుఁ బర్యంక
మెక్క వేసటను వహించుఁ గాని
యితరులను జయించి హృద్య విద్యా రాజ్య
సింహపీఠి నెక్కఁ జింతసేయు. 82

గీ. ప్రథమ గర్భ సంస్కార సంపర్కమునను
సర్వగర్భ పావిత్ర్యమ్ము సంభవింపఁ
బురుషసంతాన ముదయింపఁ బుంసవనము
సేసె నార్యాంబ కెలమి నా శివగురుండు. 83

క. ధీమంతులు వొగడ విఘ్న
శ్రీమంతముగా నభీష్ట సిద్ధికినై యా
ధీమంతుఁడు శివగురుఁ డల
సీమంతిని కాచరించె సీమంతంబుల్. 84

గీ. పరమ సాత్త్వికవృత్తులపట్ల సమత
వైషయిక వృత్తులందు నిర్భర విరక్తి
నూను నాసతిచేష్ట త దుదరవాసి
పుత్త్ర చిత్రచరిత్రఁ దెల్పుచుఁ దనర్చె. 85

గీ. అతివ కడుపుననుండియు నర్భకుండు
తలఁగఁ ద్రోచె నురోరుహ ద్వైతఫణితి
తఱిమి వైచె వలగ్న మాధ్యమిక వాద
మరయఁగ మహాత్మ గర్భాంబు లవ్వియగుట. 86

మ. అంబుజబంధు గర్భ యగు ప్రాగ్దిశ యొప్పు, నిగూఢ కృష్ణవ
ర్త్మం బగుజమ్మి యెమ్మె, యుదరస్థ సురద్విప యైన గంగయం
దంబు, నిధాన గర్భ యగు ధాత్రి బెడంగును, శర్వ పూర్ణ గ
ర్భంబు భరించు నాద్విజ పురంధ్రి యెసఁగ్ గననయ్యె నయ్యెడన్. 87

గీ. కుత్తుకుత్తు మటంచును సత్తు వింత
లేమి, యరుచియు, విసు వోకిలింత లడరె
నగలు బిగువయ్యె వగలు మున్నుగనె సడలె
గరిత కంతంత గర్భంబు పెరుఁగుకొలఁది. 88

శంకరుని జననము.

గీ. సుఖముమైఁ బదియవ నెల చొరఁబడంగ
నంత వైశాఖమాసంబునందు శుక్ల
పక్ష పంచమి శర్వ దైవతభ మైన
యార్ద్రయం దభిజి న్ముహూర్తాంతరమున. 89

చ. రవి శశి భౌము లుచ్చతర రాశుల వెల్గ గురుండు కేంద్ర మా
భవనమునన్ విరాజిల శుభగ్రహ యుక్త శుభగ్రహేక్షితం
బవు శుభలగ్నమందు నచలాధిప కన్య కుమారునింబలెన్
శివగురు ధర్మపత్ని సుఖ సేవధియై కనియెన్ గుమారునిన్. 90

ఉ. కోరిక లెల్లఁ బండ ద్విజకుంజరుఁ డాత్మజు మోముఁ గాంచి ము
ద్వారిధి మగ్నుఁ డయ్యె శుచివారి మునింగి హిరణ్య నైచికీ
భూ రుచిరాంబ రాది ద్విజముఖ్యులఁ దేల్చి జాతకర్మ సం
స్కార మొనర్చె శాస్త్రము ప్రకార ముదార విహార హారియై. 91

క. జను లెల్లఁ బొంగి వైరము
లను మఱచి ముదంబునం జెలఁగు టరుదే త
జ్జననమహిమ వ్యాఘ్రాదిక
వన మృగములె వైర ముడిగి వరలిన వనుచోన్. 92

సీ. చిగురొత్తి పూచి కాచి ఫలించె ప్రేమోల్లైన
క్షితిరుహంబులు గూడఁ జిత్రముగను
నిర్మల మధురాంబు నిర్ఝర శాంత ప్ర
చార మొప్పఁగ ధునీ సమితి మెఱసె
యాయజూక గృహంబులందుఁ ద్రేతాగ్నులు
వెలిఁగెఁ బ్రదక్షిణార్చుల వహించి
సుమసౌరభము దాల్చి సుడియుచు హోమాజ్య
గంధిలంబై వీచె గంధవహము

గీ. పుష్ప వర్షము సుర హర్షమును నభోంగ
ణమ్మునం దోఁచెఁ బంచభూతమ్ము లెల్ల స్వ
వాకృతి వెలింగెఁ బంచభూతాత్ముఁ డైన
బాలు నుదయ ప్రభావ సంబంధమునను. 93

గీ. జాతె నద్వైతమత విపక్ష మతవాది
బుధుల హస్తాగ్రములనుండి పుస్తకములు
శ్రుతిశిఖా తతి నవ్వె, వ్యాసుని మనోంబు
జమ్ము వికసించెఁ, గలిగె స్వాస్థ్యమ్ము జగతి. 94

క. సుత పూర్ణోత్సంగ యయిన
సతి రంజిలెఁ బూర్ణచంద్ర సంగతిఁ బ్రాచీ
సతివలెఁ జలరుహ హిత సం
గతిఁ బ్రాగ్గిరి తటియుఁ బోలెఁ గన్నులవిందై. 95

క. ధగధగ మను తనుకాంతులు
నిగనిగ మను చేర లంత నేత్రంబులు గుం
పగు కురులు మెఱయు బిడ్డని
మొగముం గని తల్లి నింగి ముట్టఁగఁ బొంగెన్. 96

ఉ. ముద్దులు మూటగట్టు నిజపుత్రుని రూపము గాంచి మోద సం
పద్దశ మించి కన్న ప్రసవ శ్రమ మంతయు విస్మరించి య
మ్మొద్దియ డెందమం దుదయమూఁ గను ప్రేమముతోడ స్తన్యముల్
తద్దయు వెల్లివాఱ మృదులంబుగఁ బొత్తుల నుంచి కంపిలున్. 97

శా. అంభోజాక్షి పతిన్ వృషాద్రిశివు తాదాత్మ్యంబునన్ జిత్తమం
దుం భావించుచు గర్భదోహదమునందున్ దిన్న స్వాద్వన్న త
త్సంభారాది శివప్రసాదముగ సంభావింపఁగా నేమొ త
త్సంభూతుం డగు డింభకుం డలరె సాక్షాచ్ఛంభు దివ్యాకృతిన్. 98

సీ. అది యేమొ నొసటియం దక్షి యుండినయట్టు
లానవా లున్న దోయతివ కనుము
భుజములందుఁ ద్రిశూలమును బోలు రేఖలు
సుస్పష్టమై యొప్పు సుదతి! కనుము

చందమామ వెలుంగు చంద్రమై కచ బృంద
మంద మొుదెను మంద యూన! కనుము
స్ఫటికసన్నిభ తనూ చ్ఛవులందుఁ గన సగం
బతివయ ట్లగపడు నబల! కనుము

గీ. బిడ్డ తనుకాంతి ముందు దీపిక ల వేల?
యనుచుఁ గాన్కలఁ గొని యరయంగ వచ్చి
నట్టి ప్రతివేశినులు శివుం డనుచు భ్రమసి
పురుటియింటనె గుజగుజల్ వోయి రపుడు. 99

చ. పురుటిదినంబు లభ్యుదయపూర్తిఁ దలిర్ప హితాప్త బంధు లం
దఱుఁ గవగూడి నామకరణం బొనరించెను "శంకరుండ" టం
చరసితిఁ బుత్త్రి శంకరదయాప్తి నటంచునొ "శమ్ కరోతి శం
కర" యని బాలు భావికథఁ గాంచియొ కాని ద్విజుండు పట్టికిన్. 100

వ. అంత ధాత్రీజన సహాయయై యా యార్యాంబ శుక్లపక్ష శశాంకు పగిది దినదినాభ్యుదయంబు నొంద నబ్బాలకు రాత్రిందివము కన్ను మూయక యోముచుండు. 101

ఉ. బాలకు ముద్దు నెమ్మొగముపైఁ బడు ముంగురు లల్ల నొత్తి, కెం
గేల స్పృశించి యెత్తి గిలిగింతలు వాఱఁగఁ జేపువచ్చు చ
న్బాలను ద్రావఁ బెట్టి వదనంబున లాలలుఁ బాలుఁ గాఱఁగా
సోలిన వాతెఱఁ దుడిచి, జోటిక నిద్దురపుచ్చు సెజ్జపై. 102

చ. జలకము లార్చి, మేని తడిఁ జల్వమడుంగున మెత్త నొత్తి, వీ
నుల తడి వోవఁ జేలకొన నోవక ద్రిప్పుచుఁ, జ న్నొసంగి, క
జ్జలమును గంటఁ దీర్చి నునుఁజా[illegible] [illegible]ట్ట [illegible]సంటఁ బెట్టి, పా
త్తుల నిడి, జోలవాడుచు వక్షా[illegible] [illegible]యు బాలకున్. 103

సీ. కరము లాకసమువంకకుఁ జిమ్మి చూరకే
పాలబుగ్గలు గుంటపడఁగ నవ్వుఁ
గమికిళ్లు పట్టి ముఖమ్మందుఁ జొనుపుకొం
చొక ప్రక్క కొదిగి పన్నుండి కేరుఁ
జరణాంగుళముల హస్తముల నల్లనఁ బట్టి
నోటఁ జొన్పంగ నారాట మొందు
నవ్యక్త మధురమై యమర నుంగుంగ యం
చనిత రావేక్షంబ యాడుచుండు

గీ. నలుకు డెది యైన వినఁ జూచుఁ, బలుకరించు
వారి గుఱుతింప నేర్చు, ఛీత్కారములకుఁ
గులుకుమై నవ్వు, మఱి యెత్తుకొనుఁ డటంచుఁ
జేతు లందించు వేడ్క నాచిన్నికందు. 104

గీ. బొజ్జ నునుసెజ్జ మోవంగ బోరగిల్లి
పండి శిరమెత్తి కరములు రెండు మోపి
చిఱునగవు లాల లొలుకు వాతెఱ నటింప
నాడుకొను బాలుఁడు కిశోర హరివిధాన. 105

చ. క్రమముగఁ గూరుచుండుట కరంబుల మేదిని నాని జానుచం
క్రమణము నేర్చి యింట నెటుగన్నఁ గనంబడుచుండి లేచి వి
ద్దెము లొనరించుచుఁ జిలుకతీఱున 'అమ్మ' యటంచు 'అత్త' యం
చమృత రసంబు చిల్కఁ జెవులందు ద్విజార్భకుఁ డెల్లవారికిన్. 106

సీ. 'అమ్మ' యం చలఁత మాటాడ 'నో' మ్మని ప్రణ
వోపాసనము సల్పుచుండె ననుచు
'అత్తత్త' యనఁ 'దత్త్వమసి' మహావాక్యార్థ
ముల్లమందు స్మరించుచుండె ననుచు

'అన్నన్న' యని పల్కునప్పుడు నేతి నే
త్యుపలబ్ధి నూహించుచుండె ననుచు
నలరి 'హం' మ్మనిన 'బ్రహ్మహ' మ్మనుచుఁ దాన
యుపరతాత్ముం డగుచుండె ననుచు
గీ. సాంజలికుఁ డౌచు 'దాసోహ' మంచు ముద్దు
కై యనంగఁ దా "సోహ" మ్మటంచు హంస
జప మొనర్చెనె యంచు దచ్చైశవాస్ఫు
టోక్తులం దర్థ మూహించుచుండుఁ దండ్రి. 107

సీ. ఏకాబ్ద వయసునందే నేర్చె వర్ణస
మామ్నాయ మఖిలంబు నాత్మభాష
నబ్దద్వయ వయస్కుఁడయి లిఖితాక్షర
ప్రజ్ఞుఁడై వ్రాసి చెప్పంగ నేర్చె
హాయన త్రితయ వయస్కుఁడై కావ్య పు
రాణముల్ విని తదర్థము లెఱింగె
గురుల కక్లేశమాసరణి నేర్చిన విద్య
సహపాఠులకు బోధ సలుపఁజాలె
గీ. సముదిత రజస్తమస్కుఁ డయ్యును రజోఽభి
ఖేలనమునాఁడె యెఱిఁగె నిఖిలము లిపులు
మధుర భాషణములఁ బ్రజా మానసములు
వెన్న నొనరింపఁజాలె నా చిన్నిబిడ్డ. 108

వ. అంత. 109

క. హుతవహు తేజం బాజ్యా
హుతుల వెలుఁగుపగిది నాశిశూత్తము తను వం
చిత చౌల సంస్క్రియా సం
స్కృతమై వితత ద్యుతుల వహించి రహించెన్. 110

క. అతఁ డుపపాదన నిరసే
క్షితమతి యయ్యును జదివె నిఖిలకావ్యము లా
హ్యాతిపూర్వక మాగమసం
హతిఁ గర్కశతర్కనయరహస్యము లెఱిఁగెన్. 111

గీ. వాదజల్పవితండాకథాదిదక్షు
లై వచశ్శక్తి వాదిచయంబుఁ దూల్చు
బుధులు నేని సురేజ్యునైపుణి మెలంగు
శంకరునిముందు మాఱాడ జంకుచుండ్రు. 112

క. ఓడింపుద మని పంతం
బాడి బుధులు వక్రవచనులై మతముల మా
టాడిన నోడక వారలఁ
బ్రోడవలెన్ గెలుచు శంకరుఁడు శిశు వయ్యున్. 113

క. ఫణిరాట్కథావధీరణ
చణ మగు నముక్రమోక్తిసరణి విని సుధీ
మణు లగువాదులు నుత్తర
మణువంతయు నీరు తప్పు లగు ననుభీతిన్. 114

గీ. పరిథితుఁడై శేముషీమదగ్రణియు నైన
యతఁడు ఖండింప నట్టిదుర్మతము లేదు
ఖండితాత్మమతంబు నొక్కండుగాని
నిలుపుకొన్నది లేదు యత్నించియేని. 115

క. రవివర్చోంచితుఁ డమ్మా
ణవకునిచే నిజకులము దనర్చె నవతు లే
కవనిన్ సుతవర్ధనమునఁ
బ్రబరుఁడ నైనాఁడ నని శివగురుఁడు దనిసెన్. 116

కం. మూడేండ్లీడున సుతునకు
చూడాసంస్క్రియ నొనర్చి, శుభగతి నైదేం
డ్లీడున నుపనయనమ్ముం
గూడ యథావిధి నొనర్చె గురుఁ డత్యాస్థన్. 117

గీ. కన్నులం గన్న ప్రజకె శంకరుని బ్రహ్మ
చారి వేషంబు దృష్టి నొసంగ దనిన
గాసి కోరెచి కడుపునఁ గన్నవారి
కపుడు గల్గిన హర్షాన కవధి యున్నె. 118

కం. ఆ తీరున శంకరు నుప
నీతు సలిపి, శివగురుండు నిష్ఠుర దైవా
ఘాతమున శాశ్వతముగా
భూతలమును విడిచి స్వర్గమునకుం జనియెన్. 119

చ. తనయునికాన్న దుర్లభము, తద్విభవాదులు చూచు టంతకం
టెను గడుదుర్లభంబు; ధరణీసురుఁ డాతఁ డపారపూ తప
బును బచరించి యెట్టెటులొ పుత్రుని గాంచెను గాని యక్కటా
తన తనయోదయంబు తనుఁదాఁ గనుభాగ్యము గాంచఁ డయ్యెడున్.

గీ. మూర్ధమున వేయిపిడుగులు మొత్తినటుల
తనువు బగ్గని మండిపోయినవిధాన
మానసము ఛిన్నభిన్న మౌమాడ్కి నోట
నవశయై వ్రాలె నార్యాంబ యవనియందు. 121

చ. అటువలె మూర్ఛనొంది ఘటికాంతరమందు ససంజ్ఞయై యుర
స్తటమును మోదికొంచుఁ గనుఁదమ్ముల నశ్రులు వెల్లివాఱ ను
త్కటతమచింత మున్గి గళగద్గదికధ్వని పెచ్చుమీఱఁ జెం
గటిజనుఁ లేల? రాలుఁ గరఁగన్ విలపించెఁ బతిన్ స్మరించుచున్.

ఉ. దీపిక యారఁ బాడఱిన దివ్యగృహంబువలెన్ భవచ్ఛరీ
రాపగమంబుచే నశుభమై బరువై చెడి డిందకున్న యీ
పాపపుదేహ మగ్నిశిఖపాలొనరించియ వెంట వచ్చి నా
థా! పరమందు నిన్గలియుదాన నటంచు విలాపమొందఁగా. 123

శంకరుఁడు తల్లి నూరార్చుట

క. అంతట హితు లాయమ కుప
శాంతివచనములను జెప్పఁ జల్లాఱద త
త్సంతాప, మట్టు లనుగతి
కెంతయుఁ జింతించు తల్లి కిటు శిశు వనియెన్. 124

ఉ. అమ్మరో! యిట్టు లేడ్వఁ దగునా? వగవన్ విని తండ్రి వచ్చునే
యిమ్మహి నెల్లకాల మెవఁడేని మనంగలవాఁడె? దేహి క
ర్మమ్మునఁ బుట్టు, వృద్ధిగను, గ్రుగ్గును, నైజగుణంబు వాప దై
వమ్మున కే నసాధ్య మిటు వందురి చేయున దేమి చెప్పుమా. 125

ఉ. ఈ వెటనుండి వచ్చితివొ యెచ్చటి కేఁగుదొ యెన్నిబాములం
దీవిభుఁ జెంది యుంటొ గణియించుకొనంగ సమస్తమోహముల్
ద్రోవక యే తొలంగుఁ, గనుదోయి మొగుడ్ప జగంబె సున్న, త
ల్లీ! విలపించు టేటికిఁ జలింపకుమీ భవితవ్య మెంచుచున్. 126

క. ఏవాఁడు మడిసె నని వా
పోవుదువో యట్టివాఁడు పుట్టఁడు జావం
డీవివిధవికృతులును దను
భావము లని మది నెఱింగి పడయుము శాంతిన్. 127

శా. మాయానాటక మీజగంబు - తనువుం బాత్రమ్ము గాఁ జేసి య
స్థేయుం డోపురుషుండు సౌఖ్యము మహార్తిన్ జెందిన ట్లాడి, యా
యాయుష్కాలము చెల్లఁగా యవనికాభ్యంతర్గతుండై పునః
కాయప్రాప్తి నటించుఁ జూ భరతవాక్యం బుంప దేనాఁటికిన్. 128

క. ఎవరికి వారే యనియెడు
వివేకిజనసూక్తి తల్లి! వినవా? కో పతివెం
ట వెడల మంటం బడిన, ని
రుపురుం గలియుదురొ కలియరో కర్మగతిన్. 129

మ. తనువుం దాల్పఁగఁజాల దుస్సహము వైధవ్య మ్మటంచున్ దొలం
గ న దెల్లన్ జెడునే "యవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ" యం
చన రే ప్రాజ్ఞులు; నేఁడు గ్లువ్యథ రే పైనన్ మ తెందైన నీ
కనుభోక్తవ్యముసూవె మానుకొనుమమ్మా ఘోర మియ్యత్నమున్

క. అని యెదేఁడులబాలుఁడు
జననికి దుఃఖోపశాంతి సలుపఁగ విని లో
చనములు మనములు నీరయి
జన మాతనియెఱుక కార్తి సంతస మొనస్సెన్. 131

గీ. సాధ్వి యార్యాంబ పతివెంట సహగమనము
సేయఁ దలఁచియుఁ బుత్రుఁ బోషింపకొఱకు
బాంధవ జ్ఞాతి పుత్రుల ప్రార్థనమునఁ
బ్రాణములు దాల్పవలసె దుర్భరము లైన. 132

క. ఆతటి నాబాలకుఁ డుప
నీతుఁ డగుట బ్రహ్మమేధ నిపుణర్త్విఙ్మం
త్రాతతము పారలౌకిక
మాతని జనకునకు నాహితాగ్నికి కొనర్చెన్. 133

శంకరుని వేదాదివిద్యాభ్యాసము

గీ. బలిని దలఁదొక్కి రోదసీతలము గ్రమ్మ
వెడలువామనవటుమూర్తి విష్ణుఁ డనఁగ
సాంగ మగుబ్రహ్మవర్చసం బనఁగఁ బంచ
వత్సరవయస్కుఁ డానూత్నవటువు మెఱసె. 134

క. ఉపనయనశబ్ద మర్థస
ముపేత మగునట్లు గురునియొద్దకుఁ జని య
చ్చపుభక్తిఁ బఠించెను ద
న్నిపుణుఁడు సాంగముగ నాల్గునిగమము లోలిన్. 135

ఉ. ఇంచుక గాని లేఁత యెపు డింతటివిద్య గ్రహించె నద్భుతం
బంచుఁ బ్రజల్ నుతింప, వటు లందఱు తోడఁ బఠింపఁజాల కిం
చించుక వెక్కువెక్కుఁ బడ నెవ్వఁడు వీనికి విద్యఁ జెప్పలేఁ
డంచు గురుండు జంక నతఁ డధ్యయనం బొనరించెఁ జెచ్చెరన్. 136

ఆ. ద్విత్ర మాసముల యధీతి నాయావిద్య
గురుసమత్వ మొందె, గురువుపగిది
నతఁడ వేదముల సహాధ్యాయులకు లెస్స
చెప్పఁజాలె నతివిచిత్ర మెన్న. 137

మ. శ్రుతులన్ బ్రహ్మ, తదంగబోధమున గార్గ్యుం, డర్థతాత్పర్యసం
గతమాతత్కథలన్ బృహస్పతి, తదుక్తప్రాజ్యకర్మాంతర
జ్ఞతలన్ జైమిని, తద్వచఃకలితవిజ్ఞానంబునన్ వ్యాసమా
ని, తదీయాభినవాకృతిన్ వటుఁడు వాణీపూర్ణతన్ భాసిలెన్. 138

ఉ. నూతి మిత ప్రయోజన మనూనజలం బగు తీర్థమం దటుల్
గౌతమ భట్టపాద భుజగప్రవరాదుల శాస్త్రపాఠసం
భూత సుఖంబులెల్ల నొకమూల నణంగినయట్లు తోఁచె న
ద్వైత పవిత్ర శాస్త్ర జనిత ప్రమదాబ్ధిని వాని కయ్యెడన్. 139

ఉ. మాధుకరాన్నభుక్తి గురుమందిరవాసము వేదపాఠమున్
బోధము దేశికాంఘ్రియుగపూజనమున్ సహపాఠిమర్మ భా
గాధమనీషయున్ మెఱయ గాంగతరంగఘుమంఘుమారవో
ద్బాధక వాఙ్ముఖంబుల నతండు హరించెఁ బ్రజాంతరంగముల్. 140

సీ. స్నానం బొనర్చి యుషఃకాలముననె మా
ర్తాండున కర్ఘ్యప్రదానమిచ్చి
యష్టోత్తరము శతం బావృత్తి గాయత్రి
యంచితమనువు జపించి భక్తిఁ
బంచాక్షరం బుపాసించి తోడన యగ్ని
కార్యంబు విధిపూర్వకముగ నెఱపి
సబ్రహ్మచారు లాశ్చర్య మొందఁగ వేద
వికృతుల నవధానవిధుల మెఱసి
గీ. పరమసాధ్వులు వాత్సల్యభరితచిత్త
లగుచుఁ బెట్టెడు మాధుక రాన్న మెలమి
నారగించుచు బ్రహ్మచర్యవ్రతంబు
గడుపుకొనుచుండు నిష్కలంకముగ నతఁడు. 141

మ. జలపాత్రమ్మును జోలెఁ గైకొనుచు సాక్షాద్భూతవేదంబు నా
బలు తేజంబున మించి శంకరుఁడు తద్బాడబ్యగేహాంగణ
స్థలి మధ్యాహ్నము సేరుచున్ 'భవతి భిక్షాం దేహి' యన్నంత సా
ధ్వులు వడ్డింతురు షడ్రసాన్నములు పుత్రుం గాఁగ భావించుచున్. 142

గీ. మాధుకరమును బెట్టు మమ్మా యటంచు
వేరిగృసీమ కరుగు నవ్వార లెల్ల
ధన్యు లయినట్లు భావించి తడయ కింటఁ
గలిగి నంతటిలోఁ బెట్టి కడపుచుండ్రు. 143

దరిద్రబ్రాహ్మణి కథ

క. ఒకనాఁడు మాధుకరమున
కొకగర్భదరిద్రు వసతి కొయ్యనఁ జని య
య్యకలంక చరిత్రుం డా
యకఁ గని "భిక్షాం ప్రదేహి" యని పలుకుటయున్. 144

క. కనుమూపుఁ జినుఁగుఁబయ్యెద
కొన కుతికంటున ఘటించుకొని యాగృహమే
ధిని దలు పోరగ దీనా
ననమాత్రము తోఁప నిలిచి నలఁకువ ననియెన్. 145

గీ. తొలుత నాతండ్రి యీపాడునిలయమునకు
నేల వచ్చితి పీదినం బెటకుఁ జనిన
నచట నిటు లగునేమొకో యనుచు వగతు
నెట్టిదుశ్శకునంబున నిలు వెడలితొ. 146

చ. కటకట యిట్టియెండ నఱిగాళులు పొక్కఁ జెమర్ప మోము మై
పటిమ మడంగ మాధుకరభైక్షముకై యరుదెంతు బిడ్డ! ని
న్నిటు చను మందుఁ బొమ్మనక యే మొనరింపఁగలన్ దరిద్రతా
ర్భటి నడపీనుఁగై మనునభాగ్యను నీముఖ మెట్లు చూచెదన్. 147

ఉ. గ్రామము వాడవాడల నిరంతరమున్ దిరిపంబు నెత్తి నా
స్వామి ననున్ దనూజులను సాకుచు నుండును దెచ్చుదానిలో
సాము మగండు, సాము నిజసంతతియున్, భుజయింపఁ బెట్టి యా
యామెతుకుల్ భుజించి కొఱప్రాణముతో మనుచుండు నందనా!

ఉ. ఇందలిస్త్రీలు మాధుకరవృత్తిని వచ్చెడివారి మందిరా
ళిందమునందు గోమయవిలేపనపూర్వకరంగవల్లికా
సుందరసీమ నిల్పి పరిశోధితపాత్రల షడ్రసాన్న మా
నందముతోడఁ బెట్టుదు రనన్ వినుచున్ గనుచుందు నిత్యమున్.

క. ఐనన్ నా కటువంటి మ
హానందము నొందుభాగ్య మబ్బదుగద! నా
దీనస్థితి కంతము లే
దే నే భిక్షించి తినుచు నేమి యొసఁగుదున్. 150

గీ. దాని కేమి? నీవంటియుత్తముం డతఁడ్కి-
తోపనతుఁడైనఁ బనుపు టయుక్తమనుచు
నిలు నలువలంకు నరసి యామలకఫల మొ
కండు దొరకంగ నది యిడఁగాఁ దలంచి. 151

క. తలు పోరఁజేసి మొగమును
వల కేలునుమాత్ర కానబడ మఱుఁగున న
న్నెలఁత నిలిచి యాయుసిరిక
ఫల మొసఁగుచు వటున కిటుల పలికెఁ గలఁకన్. 152

గీ. నిజము వక్కాద నీవు నాత్మజునివంటి
వాఁడ వౌట; నాయన్న యీప్రక్క నిలువ
నకట! కాల్దిగిసట్టిబట్టకును నోచు
కొనమి నని పల్కి కన్నీట మునిఁగి వగవ. 153

క. కని నవనీతము కైవడి
మనసు కరఁగిపోయి ప్రతిమమాడ్కి నిలిచి యా
యనఘుం డాయమ దారి
ద్ర్యనిరాస మొనర్ప నెంచి దయ నిటు వలుకున్. 154

శా. అమ్మా! చింతఁ దొఱంగు; తా వకదరిద్రావస్థ యీనాఁడ భ
స్మమ్మా నమ్ముము నీవు నీపతిసుతుల్ సంతృప్తిగా సర్వసౌ
ఖ్యమ్ముల్ శాశ్వతభక్తి నొందఁగలవా రయ్యెందిరా శ్రీకటా
క్షమ్మున్ గాంతురటంచు లక్ష్మిఁ బొగడంగాఁ బూనె స్తుత్యుక్తులన్.

సీ. హైరణ్యవర్ణయు హరిణియు సౌవర్ణ
రాజతస్రజయు హిరణ్మయయును
బురుష గోశ్వ హిరణ్య పరిపూర్తి సంధాత్రి
యశ్వగజస్యందనాభిరామ

కాకార హాటకప్రాకార సోత్స్మిత
యార్ద్రియు జ్వలియించునట్టిదియును
తృప్తయుఁ దర్పయిత్రియుఁ బద్మసంస్థిత
పద్మవర్ణయు శుభాస్పదవిలోక

గీ. చంద్రయు యశఃప్రభాస యుజ్జ్వలనశీల
దేవజుష్ట యుదార పద్మినియు ననఁగ
నాదిమధ్యాంతరహిత యైనట్టి యాది
లక్ష్మికి నమస్కరింతు నలక్ష్మిఁ బాప. 156

గీ. తల్లి! యాదిత్యవర్ణ నీతపమునకు వ
నస్పతియు బిల్వవృక్ష మన్ప్రథ జనించెఁ
దత్ఫలంబు లడంచు- నీతపముకతన
నాంతరం బగుమాయ, బాహ్యం బలక్ష్మి. 157

క, ఓముత దేవసఖుఁడు చిం
తామణితోఁ గీర్తితోడ న న్నెనయుచుఁ ద
ల్లీ! మును జనియించితి నీ
భూమిని నా కొసఁగు కీర్తి పోలుపు సమృద్ధిన్. 158

గీ. అంబరో! క్షుత్పిపాసా విలాత్మ జ్యేష్ఠ
యగు నలక్ష్మిని మాయింతు నమ్మ నేన
యీవు నసమృద్ధిని నభూతి నెల్లదాని
నస్మదీయాలయమునుండి యపసరింపు. 159

క. భూరూప మొంది గంధ
ద్వార, దురాధర్ష, భూతతతి కీశ్వరి, ని
త్యారోపితపుష్టి, కరీ
షారంజిత యైన లక్ష్మి నాహ్వానింతున్. 160

క. చేతమునకుఁ గామము నా
కూతియు, వాకునకు సత్యగుంఫమ్ముఁ బశు
వ్రాతాన్నములకు రూపుం
బ్రీతి నొసఁగు నీవు నను సమీపింపఁగదే. 161

క. శ్రీపుత్రక! కర్దమ! కృపఁ
జేపట్టుము నన్ను, నావసింపుము గృహమునన్
గాఁపుంపు పద్మమాలిని
నీ పడసిన మాతఁ బద్మినిన్ శ్రీదేవిన్. 162

గీ. ఎలమి నబ్దేవతలు సృజియింత్రు నాదు
కార్యజాతమ్ము నెపుడు స్నిగ్ధమ్ము గాఁగ
నోయిచిక్లీత! నాయింట నుండునట్లు
చేయఁగదవన్న మీతల్లి శ్రీపురంధ్రి. 163

గీ. పుష్టియును, బుష్కరిణి, యష్టి, యష్టికరయు
నార్ద్రయు హిరణ్మయయు, నబ్జ హైమ మాల్య
చంద్రయును సూర్యయు సువర్ణసరస పింగ
లాంగి యగులక్ష్మి జాతవేదా యొసంగు. 164

క. ఏదేవికరుణ బహుధన
గో, దాసీ, తురగ, పురుషకోటిఁ గనెదనో
యాదేవి ననపగామిని
శ్రీదేవిని జాతవేద చెచ్చెర యిమ్మా. 165

క. అని శ్రీసూక్త విధానం
బున సంస్తుతిసేసి చిత్తమున శ్రీవిద్యా
మనువు జపియించి స్తోత్రం
బొనరించెను సరసపద సముజ్జ్వల ఫణితిన్. 166

సీ. క్షీరార్ణవాంతర శ్వేతాంతరీపమ్ము
నందు సంఫుల్లపద్మాకరమునఁ
గాంచనాంబుజ కర్ణికా సింహపీఠికా
సీనయై వృతసురీసేవఁ గొనుచు
సవ్యాపసవ్యపార్శ్వములఁ గుంభియుగంబు
స్వర్ణకుంభాంబుల స్నానమార్ప
శయయుగంబునఁ గుశేశయయుగ్మ మలర ర
త్నాభరణద్యుతు లలమ దెసలఁ
గీ. శచియు ధనదాంగనలు నిరు చక్కి నిలిచి
నిటలతటమున నలకముల్ నటనసేయఁ
జామరలు వీచుచుండ నాస్థానిఁ దీర్చు
త్రిభువనైక మహారాజ్ఞి శ్రీ భజింతు. 167
మ. నిధినిక్షేపము లెల్లఁ జుట్టి కొలువన్ హేమాబ్జసింహాసనం
బధిరోహించి సుపర్వమౌళిమణిరుగ్వ్యాలీఢపాదాబ్జయై
విధివిష్ణ్వీశుల లోకపాలనకళావిఖ్యాతులన్ జేయు నం
బుధికన్యామణి నాదిశక్తిని గరంబుల్ మోడ్చి సేవించెదన్. 168
క. కామగవీ కల్పక చిం
తామణులకుఁ దోడఁ బుట్టి ధనరూపిణియై
తామరసాక్షుని వక్షో
ధామమున వసించులక్ష్మి ధ్యానమొనర్తున్. 169
చ. అని రచియించుశంకరు రమాభినుతుల్ విని పేదరాలు 'యా
చనికులు కాంక్షితార్థము లొసంగెడువారలవృద్ధిఁ గోరి దీ
వెన లొనరింత్రు గాదె' యని స్వాంతమునన్ దలపోయుచుండ మిం
టను శతకోటి శంపలబెడంగునఁ దేజ మొకండు దోఁచినన్. 170

ఉ. మేను చలింపఁ జూపు మిఱుమిట్లుగొనఁగ హృదయంబుజల్లనం
గా నఖిలేంద్రియంబు లడఁగఁగ నిరుపేద నెలంత మూర్ఛవో
నానియతాత్ముఁ డామెఱుఁగునందు రమాకృతిఁ గాంచె నేమొ త
న్మానస మంటఁదాఁకెడు విధంబున సన్నుతి సేసె నీక్రియన్. 171

గీ. అమ్మ! కడగంట నేని నీవరయు దేని
జడుఁడె గానిమ్ము పార్థివేశ్వరుఁడ యగును
ఒత్తిగిలి నీవుపేక్షించి యున్నఁ జక్ర
వర్తియేని యాచకచక్రవర్తి యగును. 172

ఉ. అంబుధిరాజునంతటి మహాత్ముని గర్భమునందుఁ బుట్టి, పీ
తాంబరు చెట్ట వట్టి, యమృతాదులసోదరివై, జగత్ప్రభు
త్వంబునఁ బట్టభద్ర వయి, తల్లిరో! యీదృశులైన పేదవా
రిం బరికించి లోఁ గనికరింపవు న్యాయమె నీకు నిందిరా! 173

సీ. అన్యాయకృత్య సమాచరణ చణాత్ము
లైనవారల గృహాభ్యంతరముల
నక్షకేళీవిహారాయత్త చిత్తదు
ర్వ్యసనసక్తుల పదన్యాసములను
నధ్వగస్వాపతేయ ప్రాణహారక
చోరనాయకుల మంజూషలందు
విటధనాకర్షణ విక్రీత నిజతనూ
పుంశ్చలీదంత సంపుటికలందు

గీ. వాస ముందువు గాని పాప మ్మెఱుఁగని
సత్యశౌచ దయార్జవ శమదమాది
సుగుణనిలయుల నిలయముల్ చోరవి దేమి
పాప మోతల్లి! యీపక్షపాత మేల? 174

మ. సతతంబున్ భవదీయపాదసరసీజధ్యానముల్ జేయుచున్
బతి భిక్షించి గడించువస్తువుల సంతానమ్ముఁ బోషించుచున్
వెతలం జిక్కియు పట్టెఁడోరెమున కేనిన్ నోచుకోనట్టి యీ
సతి నీక్షించి కరంగ కున్నదె భవత్స్వాంతంబు పద్మాలయా! 175

చ. అసువులు కంట నిల్పి కుటికంటునఁ జేలకొనన్ ధరించియున్
వసతికి వచ్చుయాచకుఁ 'జనంగదె' యంచు వచింప నాల్కరా
కుసిరికకాయ నిచ్చె నిది యొక్కటి 'భూరిగుణంబుగాఁ' గృపా
ప్రసరణ మూన్చి యీయమ దురంతదరిద్రత మాన్పు మిందిరా.176

క. అని మనసు నాటఁ బల్కుట
యును నభమునుండి తద్ద్విజోత్తమ భవనాం
గనసీమఁ గన రమాకృపఁ
గనకామలకములు ధారగాఁ గురియుటయున్. 177

ఉ. చేతన నొందియున్ విగతచేష్టితయై సతి స్వప్నమో నిజం
బో తెలియంగరాస్థితి నొక్కనిమేషముకాల ముండి య
త్యాతతభక్తి సిగ్గు నెడఁదట్టి పటూత్తము పాదపద్మముల్
చేతుల ముట్టి కన్నుఁగవ చేర్చి ముద్దిడి పల్కె నీక్రియన్. 178

ఉ. నీబుణ మెట్లు దీర్చుకొనవేర్తు మకారణ మేఁగుదెంచి బం
గార మొనర్చితయ్య మదగార మసాధ్యమహాదరిద్రతా
ధారమ, యింద్రజాలమువిధంబునఁ దోఁచును భాగ్యవార్థితా
పారదురంత మత్కలుష భంజనముల్ గడగంటఁ జేయుటన్. 179

క. ఎంతటిపాప మొనర్పక
యింతటి పేదఱిమిఁ గందునే? నే నడుకా
సంత యుసిరికఫలంబున
కింతటిసిరి యెట్లు? నీమహిమఁ గా కనఘా! 180

ఆ. దానఫలము వృద్ధిహీనుల నొందుఁ బా
త్రానుగుణముగా నటంచు ప్రాజ్ఞు
లిట్టిపాత్ర మొదవునే యెంతపుణ్యుల
కైన? నాకె పేల నబ్బెఁగాక. 181

ఉ. ద్వారక కెట్టులో యరిగి తాపము నొందుచు ద్వారమందు దా
వారిక రుద్ధుఁడై యెటులొ వార్తను బంపు కుచేలుఁ దెచ్చి ధా
నారుచిఁ జొక్కి కాదొకొ ధనం బిడెఁ గృష్ణుడు మున్ను; నీవు దాఁ
జేరఁగ వచ్చి లచ్చి దయసేసితి నేఁ డిదె దీనురాలికిన్. 182

గీ. అనుచు నాయమ వినుతించునవసరమున
నాయవారంబునకు నేఁగి యలసి వచ్చి
నట్టియాగృహమేధి యుదంత మెల్ల
విని తదంఘ్రులఁ బడి మ్రొక్కి వినుతిసేయ. 183

చ. అది గని శంకరుఁడు దరహాసము మోము నలంకరింప భూ
త్రిదశునకున్ దదీయసుదతీమణికిన్ జరణాభివాదముల్
హృదయము పల్లవింప నొనరించి వచించెను 'మీయదృష్టసం
పద పరిపాక మొంది సిరివచ్చెను నేను నిమిత్తమాత్రుఁడన్. 184

ఉ. నన్నను మించువా రనుదినంబును మీయిలు సేర రారొ? మీ
కన్న దరిద్రులిండ్లకు నిరంతర మేనును బోనొ? కాని యీ
యున్నతి మున్ను మీకొదవ, దొక్కని కేను నొసంగనైతి; ముం
దెన్నఁడొ మీ రొసంగినదియే ఫలియించెను గాల మబ్బుటన్. 185

క. ధర్మార్థకామముల నతి
నిర్మలవిఖ్యాతిప్రసిద్ధినిం గనుచు మహా
శర్మమున వరలుఁ డిఁక, నని
యర్మిలి గుహవసతి కరిగె నందఱు వొగడన్. 186

క. ఆయుసిరికఫలముల నవు
డాయక పుట్టికల గాదియల ధాన్యమ్ముల్
పోయుగతిఁ బెట్టెయలలోఁ
బోయుచు నానందసింధువున నోలాడున్. 187

సీ. కాంక్షించు గృహమేధి కర్ణకుండలకంక
ణాంగుళీయకధారణార్థ మెదను
గోరుచుందురు పుత్రకులు కటకాంగద
కర్ణికాకాంచ్యాదికము ధరింప
నభిలషింతురు తనయలు హేమనూపుర
కేయూరహారకింకిణులు దాల్ప
బేరమ్ము సేయు సొన్నారిఁ బిల్చి పడంతి
సౌవర్ణపాత్రాది సంతరింప

గీ. నవుర! శంకర కరుణాకటాక్ష సముప
లబ్ధ కాంచన నిత్యకల్యాణ పూర్ణ
మందిరావాస సముదితానంద పరవ
శాంతరంగమ్ము తోడ నహర్నిశంబు. 188

ఆ. మెఱపు మెఱసినట్టికరణి నవ్వార్త వ్యా
పింప నగ్రహారవీథులందు
జనులు గుములుగట్టి చనుదెంచి శంకరుఁ
గాంచి మ్రొక్కి యభినుతించి రపుడు. 189

మ. "దివి మందారమహీజమట్లు భువి ధాత్రీదేవ దేవవ్రజో
త్సవమున్ గూర్చు నుదారహారిగుణవిస్తారుండు శ్రీశంకరుం
డవురా" యంచుఁ బ్రజల్ నుతింప గురునభ్యాశంబునం దభ్యసిం
చె విశేషించి సమస్త శాస్త్రములనార్జించెన్ యశోరాశులన్. 190

ఆశ్వాసాంతము

శా. అర్ణోరాశిశయానసంధృతమనుష్యాకార! దీవ్యద్యశః
పూర్ణస్వర్ణసుధారసాతలదిగాభోగా! దిశేభాహిరా
ట్కర్ణాపంతుదభగ్నశాంకరధనుష్టాంకారపాణౌకృతో
దీర్ణశ్రీ విజయేందిరా జనకపుత్రీసత్కళత్రత్రయా! 191

క. సత్త్వానందాద్భుతసం
విత్త్వాకృతి! నిత్యసుకృతివేంకటరాయా
మాత్త్వవినుత్య! సుమిత్రా
పత్త్వాగ్ణకృత్యముదితభావ! విభావా. 192

మాలిని. కుశికతనయయాగాకుల్యహేత్యామిషాశి
క్రశిమకరణనానాస్త్రప్రయోక్త్రర్భకాత్మ
విశదపదపరాగస్పృష్టిసద్వాశ్మభావాఽఽ
విశ దపదప రాగస్పృష్టితుష్టర్షి కాంతా! 193

ఇది శ్రీగురుకరుణాసమాసాదిత కవిత్వ వెంపరాల
సూర్యనారాయణనామధేయప్రణీతంబయిన
శంకరవిజయంబునం
బ్రథమాశ్వాసము.



శ్రీగురుమూర్తయే నమః

# శంకరవిజయము

## ద్వితీయాశ్వాసము


దర వేంకటరాయ
శ్రీద రచిత సాదరార్ఘ్య ధృత మితిరహితా
మోదరసోదయ! మేదుర
సోదర సౌభ్రాత్ర పాత్ర సుచరిత! రామా!

వ. అవధరింపుము.

శంకరుని యాకారవర్ణనము

క. కమనీయరూపవిలసిత
రమణులు తగుపతి వరించి రంజిలుక్రియ ను
త్తమమగుసకలకల లను
త్తము శంకరుఁ జేరి భాగ్యదశ నింపారెన్. 1

క. సరహాస్యసకలవిద్యా
భరభరితుండై యశఃప్రభలఁ బ్రబలినశం
కరుదేహం బుపమానో
త్కరకథయును సైఁపనట్టికాంతి వహించెన్. 2

మ. జల మిందూపలమున్ స్రవించునెడఁ దచ్చంద్రాశ్మమం దబ్జమే
మొలవం గల్గినఁ, దత్పయోజమున సంభూతంబయేనిన్ గొలం
కలకాసారమునన్ గుశేశయమ్ము మేలై పుట్టెనే, నద్ది దాఁ
దులనన్ శంకరభవ్యపాదమున కొందున్ గాక యెట్టెట్టులో. 3

చ. అమలినశంకరాంఘ్రి లలితాబ్జసమం బనుచున్ దదాస్యబిం
బము ద్విజరాజమండలనిభం బని యందురుగాక, ప్రేష్యభా
వ మెనసి పద్మపాదుఁ డలపద్మముఁ గాల నడంగఁ ద్రొక్కె, వ
క్త్రము ద్విజరాజమండలనిరంతరసేవ్యము నయ్యె నారయన్. 4

ఉ. "అంచితమైనయోగు లనయం బతినిర్మల మాచరించుచో
నెంచి హృదంబుజమ్ముల వహింతురు శంకరుపాదపద్మమున్
నించుఁ దదాస్య మింద్రముఖనిర్జరదుర్లభ మాసుధారసం
బం" చనఁ దమ్మి కంఘ్రి, శశి కాస్యము, మిన్నలు గావె యెన్నఁగన్.

మ. అమలజ్ఞానకళాఫలగ్రహి, ఘనవ్యామోహముష్టింధయం,
బమితక్షుద్వ్యసనోదరంభరి, యఘప్రాగ్భారకూలంకషం
బు, మదాద్యద్మర, మిద్ధతాపహరణంబున్ శాంకరం బౌపదా
బ్జము కారుణ్యరసామితంపచముగా భద్రంకరం బయ్యెడున్. 6

మ. చరణాఘాతభిదాద్రవణోత్కీర్ణితభాస్వత్సూనుదోష్కుండు చ
త్వరపాదాహతిమారితప్రణతబృందద్రోహివిఖ్యాతిమ
ద్భికుఁడుం డౌపరమాత్ముఁడే యగుటఁ దద్దివ్యాంఘ్రి మాహాత్మ్యని
ర్భరు లావారినొనర్చు నెప్పుడు గతాపస్మారరోగార్తులన్. 7

మ. నవసత్యాభ్యుదయంబునన్ వెలుఁగుచున్ సారస్వతోజ్జృంభహే
తువునై ప్రాపితతారుఁడై తిమిరముల్ తూలంగ, స్వాలోకముల్
దవులన్ జిమ్మెడు తత్కళాధరునిపాదక్రాంతి మాధుర్యమై
భవయుక్తం బగుటన్ హరించు ఘనతాపం బూ[illegible].

గీ. నతియొ ముక్తిద మతనియానతపదంబొ
యనుచు వివదింత్రు ప్రౌఢి శ్రుత్యర్థవిదులు
గాని తత్పాదభక్త్యాంఘ్రి కమలసృతర
జఃపరీరంభకృతియె మోక్షంబు నొసఁగు. 9

వ. మఱియుఁ బాలకడలి పెన్నురువులమురువైన చౌదంతి తొండంబు డంబు విడంబించుచు విమలపట్టాంశుకావృతంబులగు తదూరుయుగంబు రాజిల్లెఁ, ద్రిమేఖలాలంకృతం బగునప్పండితుకటీతటిహాటకవల్లీత్రయాంచిత స్ఫాటికశైలతటి గేలిసేయుఁ; నాశ్రుతిమార్మికుని కేలుదోయి పుస్తకరూప

వేదపాఠ మొక్కంటను, వాదివినిహితతామ్నాయాంతర్గత కంటకోద్ధారార్థంబుంబోలె బోధముద్ర నొక్కంటం బూని మెఱసెఁ; నతిమృదులంబులు లలితంబులు నగునమ్మహాత్ము కరపల్లవంబులు పొందమ్మిడాలునకుం బాటచ్చరంబులును, నమరద్రుమంబుల లేఁజివుళ్ళకు సహచరంబులు నయ్యె. శరదిందుకిరణధవళంబై బిసతంతుసుకుమారం బైనయుపవీతంబుఁ దాల్చి విజయలక్ష్మీశయ్యాతలంబై యురరవిశాలంబై మాంసలంబై తదీయోరస్స్థలి చూడ నొప్పారె. బహిరంతశ్శత్రునిగ్రహాలాంఛనజయస్తంభయుగీసంభావన శుంభల్లక్షణోపేతంబులు పరిఘాకారంబులునై తద్దోర్దండంబు లుద్దండకాంతి గండుమీఱెఁ; బ్రతిపక్షశిక్షణదక్షంబగు విజయశంఖంబుం బోలి ధీరధ్వనిం గంఠంబు దీపించెఁ; గెమ్మోవిఁ దవిలినపలువరుసబిరుసువెలిడాలు నవనవం బగు పవడంపుఁదీవెల నలమిన శారదగబైనపండువెన్నెలలఁ దలపన్ని యొప్పె. సంతతముఖాశ్రిత సరస్వతికినై విధాత నెలకొల్పిన నిద్దంపుటద్దంబు లనఁ గపోలఫలకంబులు తులకించెఁ; బయోధిసంభూతం బగునిందుబింబంబు పగిదిఁ గాక సర్వలోక సుకృతజలధిసముద్గతం బగు తదాననంబు సద్గుణప్రకాశకంబై దీపించె. యదంతరావాసయై యిందిరాసుందరి దీనవసుమతీదేవపురంధ్రీదారిద్ర్యపిశాచోచ్చాటనమంత్రం బగు కనకధారావృష్టి నెఱపె నట్టి యయ్యనఘుని లోచనమహిమంబు వర్ణింప నరిది. దుర్వారవైరిదూషణవిజృంభణ క్షయసముల్లసితసేతుకారకంబులు, నతికాయవిభ్రమధ్వంసకంబులు, సంసారిశాఖామృగహర్షాధాయకంబులుఁ బయోబ్ధివీచివదలంకారంబులును లంకారులు నగు నాతాపసకులచంద్రునికటాక్షాంకూరంబులు శ్రీరామచంద్రకటాక్షములకు వియ్యంబులయ్యె నంతియకాక. 10.

మ. అతిఘోరక్షితిగూఢకంటకకులంబై మారదావాగ్నిహే
త్యతులంబై బహుశార్తిపంకిలతరంబై యామయానేకపో
ద్ధతమై ధైర్యముఁ దూల్చుసంసృతికదధ్వం బిమ్మహాయోసవి
స్తృతి మాయించుఁ దదీక్షణంబులు సుధావృష్టిక్రియాదక్షముల్. 11



ఉ. ఆకరుణాబ్ధిఁ జేయ త్రిపథాపగ యంచుఁ దదాననాచ్ఛభ
స్మాకలితత్రిపుండ్రకము నందురు కొంద, ఱ దెట్టు లైనఁ నౌఁ
గాక, త్రయీశిఖార్థము లఖండముగా వివరించుప్రౌఢిచేఁ
గైకొన నున్నకీర్తులత్రికంబునకున్ బ్రతిభూ త్రయం బగున్. 12

గీ. కాంచి యెవ్వానినిరుపమాకార మెదల
నిపుణులు మనోజ్ఞు మదనుఁ దృణీకరింత్ర
తండు శాంభవలీలావతార మనుచు
సుందరుఁడు నంచు జను లెంచ సుగమమె కద. 13

చ. వికృత మహాజ్ఞతాగహనవీథులఁ జిక్కి భవాఖ్యదావపా
వకపరిపచ్యమాను లగువారల కందఱ కాత్మవిద్య లె
స్స కఱపి ప్రోవ, మౌన మెడసల్పి వటద్రుమమూలమున్ దృజిం
చి కదలె శంకరాకృతిని జేకొని యింబుగ శంభుమూర్తియే. 14

శా. స్ఫాయచ్చండవిరుద్ధవాది కుహనాపాండిత్యవైతండికుం
డై యాశంకరుఁ డుద్భవింపఁ బదభక్త్యానంతతాపవ్యథా
పాయం బాయె నధీశులై వషఁకి రావై భాషికాదుల్ కథా
వైయాత్యప్రతిభల్ నశింపఁ జెడి రవ్వైశేషికాద్యుద్ధతుల్. 15

గీ. మదనజయమున సర్వజ్ఞమహిమ విబుధ
శస్యతను శంకరుం డల్లశంకరుండె
కాని యాతండు యజ్ఞవిఘాతకుం డి
తఁడో యజ్ఞక్రియాసాధకుండు దలంప. 16

క. ఆమహితుసముని నొకనిఁ గ
లామాత్రతులానుకారి లక్షింపఁగ నౌ
నేమి జగత్త్రియవిబుధ
స్తోమంబునకి నతని కతఁడె తుల సిక్కముగా. 1

క. నందనమున సురతరు లటు
మందారములందు బహుసుమములటు లం దిం
దిందిరములయటు శంకరు
నందు సుగుణబృంద మందమందు నసంఖ్యన్. 18

మ. ఘనమాకామము వస్తుచర్చఁ, బ్రతిఘూకార్కశ్యహింసల్ క్షమా
ర్జనచే, దైన్యపరిగ్రహానృతకథాశల్ తుష్టిచే, మత్సరం
బనసూయన్, మదమానముల్ పర*మహాత్మ్యాధ్యానవిత్తాశయా
ప్తిని ఖండించె నతండు తృప్తిపటిమన్ దృష్ణాపిశాచింబలెన్. 19

గీ. చేరి తన్ను శుశ్రూషించుశిష్యజనుల
కామము సమూలఘాతముగా వధించె
నరవి రోషంబు చూర్ణపేషముగ నూఱెఁ
జెండె లోభాదికముఁ దృణచ్ఛేదముగను. 20

సీ. ఘర్మమర్మచ్ఛిదాకారులై దివమందె
కాంత యీచంద్రమఃకరము లేమి?
యవి కావు ముగ్ధరో! యభవ నవీనావ
తారశంకరగుణోత్కరము సువ్వె,
ప్రాణేశ! యశ్లేని వ్యాకోచ మెట్లొందఁ
జాలె నీయుత్పలషండ మెల్లఁ?
జెలియరో! యద్ది విస్మేరదిక్కామినీ
పాండురాపాంగ ప్రభాప్రవాహ

గీ. మనుచుఁ బ్రశ్నోత్తరములు దిగంతదంతి
దంపతుల కయ్యె; శంకరాత్యంతవిమల
సుగుణనిబిడాంబరాచ్ఛన్నజగములందు
ముసుపులో గ్రుద్దులాట పెంపెసఁగుకతన. 21

* "పరులమే లగ్గింపఁగా నేర్చు బుద్ధిని" అని పాఠాంతరము.

మ. కనులం గాంచదు మాక్షికద్రవము, ద్రాక్షన్ శిక్షలం బెట్టు, నె
మ్మనమం దెంచదు క్షీర, మిక్షురసముం బాటింప, దాశాంతలం
ఘనజంఘాలము మాధురీమదభరాక్రాంతంబు నౌశంకరా
ర్యనిసర్గామలసద్గుణోత్కర మనార్యారుంతుదాకారమై. 22

సీ. త్యజియించుకొనుఁగాక ధాత్రి సర్వంసహా
ఖ్యాసమ్ము శంకరుక్షాంతిఁ గాంచి
పరిహరించునుగాక బాహులేయుఁడు గర్వ
విస్తృతి శంకరువిద్య లెఱిఁగి
వఱునట్లుగొనుఁగాక బాదరాయణికీర్తి
శంకరు వైరాగ్యసార మరసి
విడువఁజూచునుగాక వేధ వాక్చాతురి
శంకరువక్త్రతాశక్తిఁ దెలిసి

గీ. యట్టిక్షాంతియు నట్టివిద్యామహత్త్వ
యట్టివైరాగ్య మట్టివాచాతిదాక్ష్య
మొక్కశంకరునందుఁగా కొరులయందుఁ
గాంచఁ దర మౌనె వేయి పల్కంగ నేల? 23

శా. గోముం గన్నతదీయమూర్తి క్షమ నా గోత్రాసగోత్రమ్ము, శో
భాముగ్ధం బగుకీర్తి విద్యఁ బడయున్ భాషావిభాషత్వమున్
గామంబుల్ శ్రితకోటి కిచ్చుతఱి నాఁ గల్పద్రుకల్పంబు సీ
మాముక్తద్యుతి దానిఁ బోల జగముల్ మందాక్షమందాక్షమా.

క. కలుగఁడు తత్సదృశుఁ డిలా
తలమునను బురాతనాద్యతనులం దొకఁడున్
గలుగఁ డిఁక ననాగతమునఁ
గలిగెనె మేరువును బోలఁగలగిరు లెందున్. 25

గీ. పొదలెఁ దత్కాల మక్కావిదునిచేత
మెఱసె నతఁడును సౌశీల్యగరిమచేతఁ
దనరె నాసుశీలమును విద్యామహత్త్వ
వెలిఁగె నావిద్యలు నమేయ వినయలక్ష్మి. 26

గీ. గుణములు చివుళ్ళు, సత్కీర్తి కుసుమములు, శ్రే
యస్సమృద్ధులు తేంట్లు, క్షాంతి యనంతరసము,
బోధము ఫలంబు గాఁగ స్వర్భూజములు
రాజిలెను దద్విచక్షణరాజమౌళి. 27

శంకరవాగ్వర్ణనము

గీ. కవివరుం డగునతనివాక్చతురిమంబుఁ
గాణభుజవాణి, కాపిలవాణి, యార
గేంద్రవాణియుఁ గనఁజాల వింత యనిన
నితరఫణితులగతి వచియింపనేల? 28

గీ. భట్టభాస్కరమర్దనప్రాప్తదుర్ద
శానిమగ్నాగమాంతహస్తగ్రహమ్ము
లయినశాంకరవాక్సిద్ధవహమ్ము లొలుకు
నక్షరం బగుభవ్యరసాయనంబు. 29

శా. జాటాటీరజటాకుటీతటనటత్స్వర్ణిమ్నగాభూమిలో
కాటాట్యప్రథమావతారపటుగర్వాటోపలుంటాకమై
ధాటిన్ గర్జిలుశంకరాచల లుఠద్వాణీస్రవంతీఝరుల్
దాటాఁడున్ జగతీభయప్రదము లౌదుర్భిక్షుదుర్భిక్షముల్. 30

సీ. మానసమత్తసామజయూథపమువారి
బోధభూపతివాసమునకు ద్వారి

దురితపూర్ణాపారదుర్వాదనిస్సారి
సూరిహారీకృతాకారహారి
యమితచింతాతూలహరణవాతలహరి
తతసంసృతిపయోధితారణతరి
యయినశంకరు నిగమార్థవాగ్వైఖరి
వెలసెఁ గథావర్వకలితసూరి

గీ. జాలకందూలరసనాసనాళభూమి
పతనకారణారణ్యక్రశుకీనిపాత,
మచలితాద్వైతలక్ష్మీజయాంకఘంటి
కాఘణంఘణ ముపనిషద్గంథిలంబు. 31

సీ. ఘనసారకస్తూరికాగంధసంరంభ
పరిరంభణప్రియంభావుకములు
తాపోపగమనిర్మథనవిశాకరకరా
హంకారభారకూలంకషములు
ద్రాక్షాసితామధుగోక్షీరమధురిమ
వ్యాపారపూర్ణశివంకరములు
నవనవోద్భిన్నపల్లవగుచ్ఛకాంతిసం
దోహదోహలపశ్యతోహరములు

గీ. త్యక్తకంటకప్రాజ్ఞపాంథప్రకీర్ణ
దీపితాద్వైతమోక్షఘంటాపథసమ
లంకృతామ్లానకుసుమమాల్యాంకితోర
ణములు శంకరుమృదుభాషణములగములు. 32

ఉ. దవ్వుగఁ జిమ్మి దుర్ణయవితానరజంబుల, నీతిబాధలన్
ఉవ్వి, గుణాళి మేల్పడి, సిరుల్ గనుశంకరువాక్సమీరముల్
మవ్వపుఁదావు లొల్కి విషమంపుభవాటవిలోన నాధియన్
క్రొవ్వినయగ్గివేఁడిమిని గూరిననెవ్వగ లెల్లఁ జివ్వతన్. 33

మ. రసనారంగనటచ్చతుర్ముఖవధూరత్నాంఘ్రిమంజీరభూ
రసితంబో! విలసత్త్వదీయకటిభారస్ఫారసౌవర్ణసా
రసనారావమొ! తచ్చలత్కరయుగీరాజన్మణీకంకణో
ల్లసితక్వాణమొ! నాఁగ శంకరుకలాలాపంబు లేపారెడున్. 34

శా. ప్రావృట్కాలవిజృంభమాణఘనధీరధ్వానడింభంబు, వా
త్యావిక్రాంతివిఘూర్ణదర్ణవచలత్కల్లోలజృంభంబు, మ
ల్లీవల్లీప్రసవోదయత్పరిమళాశ్లేషప్రలంభంబు, వి
ద్యావారాంనిధియైనశంకరుపటీయస్సూక్తి గుంభం బిలన్. 35

ఉ. *హృద్య మపద్యమున్ జహదవిద్యమునై యమృషోద్యమై సుధా
స్వాద్య మరాతిచోద్యకులిశాద్యవిభేద్యము సత్కళానిష
ద్యాద్యము యాగపద్యహృతసాద్యఘవద్యమునై మోక్షసత్పురీ
పద్యయునైన శంకరు నపారశివోద్య మిడున్ సుఖాద్యమున్. 36

సీ. ఆయాసమునకు నవాంకూరమును బీజ
రూపంబు ఘనమనస్తాపమునకుఁ
బూర్వరంగమ్ము ప్రభూతసంక్లేశమ్ము
లకుఁ బ్రాగ్భవాపూర్వలబ్ధములకు
వినఁ జెప్పరాని వేవేలదోషములకుఁ
బ్రస్తావనాడిండిమ స్తనితము
గార్మణం బనృతసంకథనమ్మునకు నిష్క-
టమ్మసచ్చింతాచయమ్ములకును

గీ. నగు చమేయావిచింతనీయాప్రధృష్య
మైనదేహాద్యహంకార మంతరింప

---

* (1) సుధా-అమృతమువలె; సు-మిగుల; అద్యము-తినఁదగినది: (2) సాది-జీవులయొక్క; అఘవద్యము-పాపోక్తి; (3) శివోద్యము-శుభోక్తి; (4) సుఖాద్యము-సు, ఖాద్యమగు సుఖమునందలి యాద్యము,

శంక రార్యోక్తి యనుపరశ్వథము దక్క-
నఱుకఁ జాలినసాధనాంతరము గలదె. 37

గీ. నాద్వైతనసూక్తిగర్భశుక్త్యంతరుదిత
మౌక్తికం బగుశాంకరీయోక్తి కృపణ
కప్రతారణహాతి బౌద్ధ కాపథహాతిఁ
జెడి పడిన యాశ్రితులకు సంజీవనంబు. 38

మ. ఘనఝంఝానిలకంపితద్యుతటినీ కల్లోలకోలాహల
స్వనసోదర్యము నైకదుర్మతరజఃపాళీహరం బౌచుఁ బే
ర్చిన శ్రీశంకరకోవిదేశ్వరజరీజృంభద్వచోనిర్ఝరం
బనుకూలించు నధర్మదుర్మతనిఖాతాశాంతి శాంతింపఁగన్. 39

ఉ. ఆరఁగ నవ్వమల్లెపువ్వులందలితావులఁ గౌఁగిలించి మం
దారమరందధారలఁ దొనంకెడి కమ్మఁదనమ్ముఁ ద్రేన్చియా
చారవిచారసింధు వగుశంకరుప్రన్ననిపెన్నుడుల్ సుధీ
వారమనంబు లన్నకొన బాళిగొనన్ వలపింపఁ జేయవే. 40

మ. అనవచ్ఛిన్నసుఖానుభూతి నిడునయ్యార్యోక్తిధారాసుధా
వనధిన్ దేలునెవండు నాసపడునే ద్వైతిప్రబోధమ్ములన్?
గనునే కచ్చరదుష్పటచ్చరజరత్కంథానుబద్ధాదరం
బును జిత్రం బగుకాంచనాంబరశతంబున్ దాల్చువాఁ డెవ్వఁడున్.

చ. నిరుపమశంకరోక్తి పరిణీతమనస్కుఁడు తేనె నూనెగా
నరయుచు, ద్రాక్ష శిక్ష నిడి యద్దిర! క్షీరము క్షారమంచు వా
చఱచుచు మోచ కాచ మనఁ జాగి సితన్ భసితం బటంచుఁ జె
చ్చెర వెగటొందుఁ గందు నిరసించు హసించు రసించుమించుగన్.

ఉ. తియ్యఁదనంబు నంతయును దేనియ యమ్మెను, ద్రాక్ష ప్రీతిచే
నొయ్యన నిచ్చెఁ, బాత్ర మనునూహను క్షీర మొసంగె, నిక్షువున్

గయ్యమునందుఁ గోల్పడె వగన్, సుధ చోరభయాప్తి డాఁగెఁగా
కెయ్యెడ లేనితియ్యదన మెట్టుల గల్గెను శంకరోక్తికిన్. 43

ఉ. కప్పుర మప్పుగాఁ గొసియెఁ, గస్తురి గాంచెఁ బఱించి, మల్లియల్
చెప్పినసేవ సేసి పడసెన్, విలిచెన్ మఱి కుంకుమంబు దా
నెప్పుడొ చందనంబు హరియించెను శంకరుపల్కుఁదావులన్
జెప్పఁ దరంబె దన్మహిమ నిత్యసముల్లసనాతిధన్యమ్ముల్. 44

ఉ. చవిగలకుంపెకుంగు దిని, చాలఁగఁ బాలనుఁ గ్రోలి, యించులోఁ
జవుల నెఱింగి, త్రావి వరుసన్ బువుఁదేనియ జుంటితేనె మే
లవు కదళీఫలాలు దనివార మెసంగినవాఁడు శంకరా
ర్యవచనమాధురిన్ గనుడు నవ్వియ కావు సుధన్ స్మరించునే? 45

చ. భవదవధుప్రతప్తజనపాళికిఁ గ్రప్పుఁజల్లు, మోక్షభా
గ్గవికి నిసర్గనిర్మలతరం బగుమార్తికయష్టి, యద్వయా
త్మవిపులసౌఖ్యవృష్టికృతతామరసాకరహంసి, శంకరా
ర్యవచనధార పుణ్యమున నబ్బును బుద్ధివిశుద్ధిసిద్ధికిన్. 46

సీ. మహిమాభిరంజితామ్నాయశేఖరగణా
వాపమం దంకురారోప మొంది
యమలామలసురేశ్వరాదికశిష్యసూ
క్త్యంబుధారాసేచనంబు వడసి
కలితకైవల్యకాంక్షారూపలలితప
లాశసంహతుల నుల్లాస మూఁది
విజ్ఞానధనలిప్సువిబుధమనస్సాల
జాలాధిరోహణలీలఁ గాంచి

గీ. తత్త్వబోధప్రసూనసంతతిని బూచి
యమృతఫలదయై ద్విజాతి కుపాస్య యగుచు

నలరు సోమావతంసనవావతార
గురువచోవల్లి యొసఁగు భక్తులకు శుభము. 47

మ. నటదీశానకిరీటకోటివిలురన్మందాకినీద్వేషు లు
ద్భటనిర్భిన్నసుధాసరోవరపరీవాహావగాహుల్ మదో
త్కటతద్వైతమతానుయాయి దురహంకారాభిచారుల్ పరి
స్ఫుటవేదాంతము లైనసూక్తులఁ దనర్చున్ శంకరుం డున్నతిన్.

శా. సాహంకారసురాసురౌఘకరకర్షాఘూర్ణదుద్దామమం
థాహార్యక్షుభితామృతార్ణవతరంగాకారవాచాసుధా
వ్యూహాసారమునన్ భవాహ్వయదవాగ్న్యుద్విగ్నమౌ జంతుసం
దోహం బొందెడుతాప మార్చుగురుఁ డెందున్ నుత్యుఁడౌట బ్రమే?

శంకరుని కీర్తి వర్ణనము

గీ. కలశవారాశితోఁ గచాకచి యొనర్చి
కైరవాప్తునితో గదాగది యొనర్చి
రజతశైలంబుతో భుజాభుజి యొనర్చి
యుల్లసిలు శంకరార్యసంఫుల్లయశము. 50

క. పరిశుద్ధుఁ డెవ్వఁ డిల నను
తఱి శంకరుకీర్తి కోడి తన్మ్రదితఁడై
హరిణాంకుఁ డాకళంకము
దొఱఁగుట కే కాదె జలధిఁ దోఁగును నేఁడున్. 51

సీ. ధమ్మిల్లముల వినూతనమల్లికాసుమ
స్రగ్వినిర్మాణకౌశలిని జూపుఁ
గాంతలలాటభాగమునఁ జందనరస
చిత్రకశిల్పవైచిత్రిఁ జూపు

గ్రీవాంతరమునఁ దారావలీహారబం
ధురరచనాతిచాతురిని జూపు
మొనసి సర్వాంగీణముగఁ జంద్రికామల
క్షౌమధారణపటిష్ఠతను జూపు

గీ. నహహా! బహుళదివసప్రభృతివ్యతీతరాశ
పూరితాపూర్వశాంకరీయోరుకీర్తి
పూరములు హరిదంగనావారముల క
ల్పితాకల్ప మొనరింప నాత్మ నెంచి. 52

సీ. ఉత్సంగములఁ జేర్తు రొండొరుఁ ద్రోపాడి
హరిదంబుజేక్షణోత్కరము వేడ్కఁ
గరముల నల్ల నాకర్షించుఁ దారకా
బృందమ్ము ప్రేమనిష్యంద మెసఁగఁ
దనివోవ ముద్దాడు దరికి రాఁ దివిచి యా
కాశమ్ము రాగసంగతిఁ జెలంగి
కై జాఱెనేని జిక్కంచ డటంచును వియ
ద్గంగ దివ్వును నిఱికౌఁగిలింతఁ

గీ. జక్రవాళమ్ము పిలుచుఁ బ్రసన్నవృత్తి
శేషఫణి యాటలాడుకోఁ జిత్తగించు
శంకరార్యయశోహరిణాంకమూర్తి
యద్భుతం బైనసౌందర్య మరసి మురిసి. 53

గీ. *కాంచు హరిదంతపంక్తి సాంకాశిన-మ్మొ
నర్చుఁ జంద్రుని సాంహాసినము-వెలార్చుఁ
నమృతచతురిమ సాంలోపినమును-సలుపుఁ
దిమిరసాంఘాతిన మ్మాసుధీయశమ్ము. 54

---

* "అభిషేధౌ భావ ఇనుణ్" సమ్-ఏమంతాత్, కాశః-ప్రకాశ ఇతి, భావే ఇనుణ్ 'ఇణి నః' సం - కాశ్ - ఇన్ - సంకాశిన్ - అణ్ - సాంకాశినమ్. ఏవమేవ సాంహాసినం, సాంలోపినమ్, సాంఘాతినమ్.

చ. కుతుక పతన్మృగేంద్ర నఖకోటి విదీర్ణకరీంద్రకుంభ ని
ర్గతనవమౌక్తికచ్ఛవి నికాయనిబద్ధ నియుద్ధలై మహా
క్షితిధరఘూర్ణన క్షుభితసింధు చలత్పృథులోర్మి మైత్ర్యపే
క్షితలయి లోకమందు విలసిల్లెను శంకరుకీర్తిమాలికల్. 55

చ. చిరముగఁ జక్రవాళదరి! చెందె దనావిలభావ మల్లశం
కరుసితకీర్తిచంద్రు నిఱిగౌఁగిటఁ బట్టుముదంబు చేనొకో?
సరిసరి నీవు నుత్పలిని! సమ్మద మొందవె? యేలె? యన్న న
య్యిరువురకున్ స్మితంబు జనియించెను బ్రశ్నల కుత్తరంబుగన్. 56

శా. దుర్వారాయతగర్వవైరిసుమనస్తూలౌఘవాతూలమై
నిర్వేలాద్భుతబోధశీతకిరణోన్మేషర్ధిదుగ్ధాబ్ధియై
నిర్విఘ్నప్రసరద్భవాహ్వయదవాగ్నిస్ఫీతసంతాపశాం
త్యర్వాచీనపయోదమై సితయశుం డాశంకరుం డొప్పెడున్. 57

క. ఇతిహాసపురాణంబులు
స్మృతులును శాస్త్రములు పొరిఁబొరిన్ బుధజనసం
యుతుఁడై యరసి యతం డు
న్నత మగు సర్వజ్ఞతాపదంబున్ బడసెన్. 58

క. ఆయన మఱిమఱిఁ గాంచెను
వైయాసకశాంతివాక్ప్రపంచము, నుపశాం
త్యాయత్తశుద్ధతం గనె
నామెడ సర్వజ్ఞభావ మట్లలవోకన్. 59

గీ. చక్కఁ జతురాస్యుఁ డయ్యు నసత్ప్రపంచుఁ
[illegible] ముండె యయ్యును నభోగ
యోగి యనఁ గామజేత యయ్యును విరూప
దర్శనుం డనఁ బ్రథితుఁడై తనరె నతఁడు. 60

ఉ. ఆననమందు వాణి యలరారుటఁ బద్మజుఁ డంచు, సత్క్షమా
శ్రీనిరతాభిషక్తి విలసిల్లుట వారిజనాభుఁ డంచు, నా
ర్యానుపమానభక్తి రచితార్ధ్వాణుఁ డౌటఁ బురారి యంచు న
మ్మానిసమాను శంకరుఁ బ్రమాణపురస్సర మెంత్రు కోవిదుల్. 61

ఉ. ఆపురుషోత్తముల్ గవియురాస నయోనిజయై జనించి మా
యాపరభిక్షునీత యయి నైకనరానుసృతిభ్రమంబునన్
గోపన యైనసత్తఁ బ్రతికూలబుధారులఁ గెల్చి, కొన్నయా
తాపసరూపదేవునవతారమ కాదొకొ 'శంకరుం' డనన్. 62

గీ. సంతతబ్రహ్మచర్యదీక్షావిభూతి
నతఁ డనూచానుఁ డగుటె కా దనుపమాన
కుశలతను మహాంతర్వాణిఁగూడ నగుట
నడపె గురుఁడు సమావర్తనవ్రతంబు. 63

క. ఏడేండ్లయీడునకు నిటు
లీడెఱుఁగని పాండితీమహిమఁ గని గురులన్
వేడి సెలవొంది వటువుల
వీడుకొని యతండు నిజనివేశము సేరెన్. 64

శంకరుఁడు తల్లి కడకు వచ్చుట

ఉ. చేరి నిజాంబికాంఘ్రిసరసీజయుగంబున కొయ్యనన్ నమ
స్కారము లాచరించి స్వసుఖం బెఱిఁగించుచు నామె సేమ మిం
పార నెఱింగి బాంధవుల నందఱ సాదరసూక్తులన్ బుర
స్కార మొనర్చి శంకరుఁ డఖండసుఖంబున నుండె నింటిలో. 65

ఉ. సప్తశరద్వయోంచితుఁడు శంకరుఁ డాక్రియ నిల్లుసేరి, య
త్యాప్తత మాతృదేవత సమర్చనలన్ దనియించుచున్ సరో

జాప్తుని సప్తజిహ్వుని నుపాస్తి యొనర్చుచు వేదశాస్త్రసం
ప్రాప్తమతి ప్రకాశనిరవద్యసముద్యముఁడై విరాజిలున్. 66

క. తరుణుఁడు కినియండు వయః
పరిణతుఁ డాసన మొసంగుఁ బ్రణయమ్మున నె
ల్లరు నంజలి నొదలఁ గూ
ర్తురు పసివాఁ డైన శంకరుం డగపడినన్. 67

సీ. భయభక్తియుక్తులై పాయనివటుల న
ధ్యాపించుఁ గోరినయాగమములు
శ్రుతివిదీక్షులఁ బరాజితులఁ జేయు వధాన
మొనరఁగా వికృతుల నుగ్గడించి
పలుకుఁ దద్వియావాక్యముల ననులోమ వి
లోమరీతుల బుధాళులు నుతింపఁ
గమ్రవీణాక్వాణకల్పంబుగా సామ
గాన మొనర్చు జా ల్గరఁగిపోవ

గీ. నలువ నలుమోముఁదమ్ముల మొలచినట్టి
మెలపు దులకింప నిర్దోషవిలసనముగ
వేదముల సాధనను జేయు విడువకుండ
శంకరుఁడు సజ్జనవ్రాతకింకరుండు. 68

సీ. కఠవల్లితోడ శీక్షావల్లి శోధించు
వల్లించు నానందవల్లి యలరి
పఠియించు భృగువల్లి కఠమానర్థ మెఱుంగు
ఛాందోగ్యమున రహస్యములఁ దెలియు
నరయు శ్రద్ధను బృహదారణ్యకమ్ము న
ధ్యయనించి చూచు నారాయణమ్ము

ముండకమాండూక్యములయర్థములు గ్రోలుఁ
దాపనీయార్థముల్ దఱచి చూచుఁ

గీ. గనును భగవద్గీతార్థ మనుపదముగ
బాదరాయణసూత్రతాత్పర్య మరసి
సమ్మదాశ్రుప్రపూర్ణలోచనసరోజుఁ
డౌచుఁ బరవశుఁడై పోవు నాబుధుండు. 69

గీ. పాణినీయవార్త్తికమహాభాష్యవిరచ
నాధ్వముల నధ్వనీనుఁడై యనుపమాన
మైనతత్త్వప్రభావమ్ము లాత్మఁ దలఁచి
సలుపు జోహారు లక్షరాక్షరమునందు. 70

ఆ. భాట్టజైమినీయపటిమ మాస్వాదించి
గాఢగూఢనిరవకాశతత్త్వ
దీయఫణితులను మదిం గంపశిలలభే
దనముగాఁ దలంచి వినతిసల్పు. 71

క. పరివిమలమతి గురులొద్దను
శ్రవణము గనినట్టివేదశాస్త్రమ్ముల న
ట్లవిరతమననక్రియ నా
త్మవశమ్ములు సేసికొనె నతం డవహితుఁడై. 72

ఉ. పుత్రునిపాండితీ మతిసముల్లసనంబు నిరంతరాశ్రిత
చ్ఛాత్రగణప్రబోధము వచఃపటిమంబు తపశ్చికీర్ష స
న్మైత్రియుఁ గాంచి తల్లి ప్రమదంబునఁ బొంగుచు, నంతలో నిహా
ముత్రఫలానభీప్సితసముత్సుకతన్ గని క్రుంగు భీతిమై. 73

చ. ముదిసి వ్యాపీకశక్తి గడపుట్టుట నమ్యలసాయ మొంద నె
మ్మదిఁ దలపోయుతల్లి కణుమాత్రము పీడ ఘాసంగకుండఁ ధ

త్పదములఁ గొల్చు నాబుధుఁడు ద్వైతభావనఁ బోధసేయు "న
య్యది యటు లిద్ది యిట్టు" లని యాయమకోరిక ముక్తిమార్గముల్.

క. కడుపునఁ దన్నుం గన న
ప్పుడఁతుక పడినట్టిపాట్లు, పతితో వహ్నిం
బడక తనకొఱకుఁ బ్రాణం
బొడల నిలుపుకొని తపించు టుల్లముఁ గలఁపన్. 75

మ. 'తనవైదుష్యము తండ్రి గాంచకయ యంతం బొందె' నం చాపె కం
టను నీ ర్వెట్టఁగఁ జూడఁజాల కడుగంటన్ సంస్కృతిప్రేమమున్
దునియున్ వేదపురాణశాస్త్రములయందున్ గన్నకైవల్యసా
ధనవైరాగ్యనిధానసూక్తి ఋషిగాథాబోధనన్ బ్రేల్మిడిన్. 76

ఆర్యాంబకొఱకు నదీపూర మింటిదరికి శంకరుఁడు దెచ్చుట

క. ఒకనాఁ డాయమ గ్రామాం
తికతటినికి స్నానమాడ నిచ్చ లయగు న
ట్లొక తెయ మధ్యాహ్నము సూ
ర్యకిరణపరితప్తసికతిలావనిఁ జనుచోన్. 77

చ. చండకరప్రతాపహతి సొరుచెడన్ మయి వాఁడి ఘస్త్రవాః
కాండములన్ మునుంగ నఱకాళులు పొక్కఁ దమంబు కన్నులన్
నిండఁగ శ్వాస మాడ కవనీస్థలిఁ ద్రెళ్ళఁగ నయ్యుదంత మె
వ్వండొ వచింప శంకరుఁడు వైళమ యేఁగి కలంక నొందుచున్.

క. వివశ యగుజననిఁ గని యా
స్రవంతి నీరమును దెచ్చి చల్లియుఁ దత్సం
భవనళినీదళముల మె
ల్ల విసరి యుపచారములఁ గలంగుచు సలుపన్. 79

క. ఆర్యాంబ తేఱుకొని పరి
చర్యలు గావించుసుతుని సౌజన్యమహా
దార్యములకు జననీహిత
ధుర్యతకును బొంగు చలంతతో నిలు సేరెన్. 80

గీ. చేరుజననికి శిశిరోపచారవిధుల
దాహశాంతి యొనర్చి నాతల్లి నదికి
నరుగఁ జాలనిముదుసలి వైతి వకట!
'వల' దనుచు నీదుకోర్కె ద్రోవంగఁ జాల. 81

క. అని పలుకుచుండునత్తఱి
చనుదెంచెను గేరళేంద్రుసచివుఁడు మీ ద
ర్శనభాగ్యకాంక్షియై మా
జనపాలుం డనిపె, ననుచు సంభ్రమయుతుఁడై. 82

ఉ. భక్తిభరంబునన్ వినతభావ మెలర్ప నమస్కరించి శాం
తోక్తులఁ దల్లిఁ దేర్చువిబుధోత్తముతో ననె నీదు వైదుషీ
శక్తి జనంబు దెల్ప నృపచంద్రుఁ డనారత మాలకించి యా
సక్తిని నిన్నుఁ గాంచి నిజజన్మకృతార్థతఁ గాంచ నెంచుచున్. 83

క. సన్నీపరివారముతో
నిన్నుం గొనితేరననిపె నేఁడ మహాత్మా!
సన్నిధిసేయుం డని తగ
విన్నప మొనరింప బుధుఁడు విని వినకున్నన్. 84

ఉ. నివ్వెఱ నొంది మంత్రి జననీపరిచర్యల మగ్నచిత్తుఁ డౌ
నవ్విబుధావతంసునియుదంతము సొంత మెఱింగి యార్య! మీ
సెవ్వగ దీఱు టెంతపని? నీజననీహృదమాభిలాష నేఁ
డివ్విధినేని దీరు నృపుఁడే తలపెట్టిన నేది కా దిలన్. 85

వ. అని పలికి పరివారము నచట నిలిపి పవనజవనం బగుహాయం బెక్కి యతిత్వరితగతిం జని యెదురుసూచుచున్నయన్నృపతికి శంకరుని మాతృ శుశ్రూషా దీక్షయు నితరానపేక్షయు నభివర్ణింప విని తేఁడును సిద్ధయు దద్దరల్లి ప్రగ్గడం గాంచి. 86

క. నీరాకరాకృతిగ నొక
సారణి తద్భవనసవిధసరణిగ నెపుడుం
బాఱఁగఁ ద్రవ్వింపు నదీ
పూరమనోహరముగా నిపుడె యని మఱియున్. 87

మ. భూపాలోత్తముఁ డంత శంకరపదాంభోరుడ్దిదృక్షావశుం
డై పర్యంతపరీతమంత్రిభటసేనాధీశుఁడై యశ్వధా
రాపాండిత్యము మించ వ్రేల్మిడిని జేరన్ వచ్చి తత్కోవిద
శ్రీపాదాంబురుహద్వయంబుఁ గయిసేసెన్ మౌళిరత్నచ్ఛవిన్. 88

క. వటువై శిశువై వాచా
పటువై వెలుఁగొందు నవ్విపశ్చిన్మణి నై
కటికుం డగు నక్కేరళ
కటకాధీశ్వరు సుఖాదికము లడిగి తగన్. 89

గీ. పరిజనసమేతుఁడై నభూపతికి సముచి
తాదరోక్తుల సంతసం బావహింప
జనపతియు భక్తి మౌళి నంజలి ఘటించి
మృదులమధురోక్తులను వచియించె నిట్లు. 90

క. ఆకాంక్షింతును మది యా
ప్మాకీనపదద్వయీసమర్హణభాగ్య
శ్రీకల్పితజన్మపవి
త్రీకరణము; నేఁటి కయ్యదియు సిద్ధించెన్. 91

శా. బాలుం డయ్యు శ్రుతిశ్రుతానవరతవ్యాఖ్యావిధానైపుణో
ద్వేలుం డంచును వించు నిన్నుఁ గన నువ్విళ్లూరుచుండంగ నీ
వేళన్ సూర్యఖరాతపాహతిగతాభిజ్ఞానమాత్రంఘ్రిసే
వాలీనుం డయి తంచు మంత్రి వచియింపన్ వత్తు నాత్రమ్మునన్.

క. అని యార్యాంబాక్షేమం
బును మును విని వినయమున నృపుఁడు మ్రొక్కి వచిం
చె నదీవిమలాంబువగా
హనమునకై చింత దక్కుఁ డంబయు నీవున్. 93

క. పూర్ణాశైవలినీపూ
తార్ణోనిత్యావగాహనానందరమా
పూర్ణు లయి జనని నీవు ను
దీర్ణచరితు లగుదు రెల్లి తెలవాఱినచోన్. 94

గీ. వగవఁ బని లేదు దాని కోస్వామి యొక్క
మాఱు మన్మందిరము మీపదారవింద
రజమునఁ బవిత్రమొనరించి రాఁగ భద్ర
వారణముఁ దెచ్చినాఁడ నావాంఛఁ దీర్పఁ. 95

వ. అని పూర్ణాపగాపూరపూర్ణంబుగ సారణి నిర్మింప నొనరించిన తన
యత్నంబు తెలిపి గజం బెక్కు మని కోర శంకరుండు ఋషిప్రశ
స్యంబుగ ని ట్లనె. 96

గీ. అజినపరిధానమాధుకరాన్నభుక్తు
లమర శ్రద్ధ సంధ్యావందనాగ్నికార్య
వేదపాఠముల్ గురుసేవ విధిగ వటులు
చేయవలె నంచు శ్రుతియ శాసించుఁ గాదె. 97

మ. నయమార్గప్రచరిష్ణుశీల! ధరణీంద్రా! నైజకర్మంబుఁ బా
సి యిభాద్యర్థమభోగముల్ వడయ వాంఛింపంగ మాబోంట్లకున్
నయమా? వర్ణము లెల్లఁ దత్తదుచితన్యాయాధ్వవర్తిష్ణులై
నియమం బూనఁగ రాజు నిల్పవలెఁ గానీ వే ఱనన్ ధర్మ్యమే? 98

వ. మజ్జనని నిత్యమజ్జనక్రియ కీ వొనర్చినయుపకృతి కెంతయుఁ గృతజ్ఞుండ నంతియ కాని యాశ్రమధర్మోల్లంఘనము సేయ మనసొగ్గదనుటయు.

చ. అనయము వెల్లనై నృపతి యాతనిధర్మపథానువర్తనం
బును నుతియించి కాన్కగఁ బ్రభూతసువర్ణము నప్పనం బొన
ర్చి నతులు సేసి తాను విరచించిన నూతననాటకత్రయం
బును వినిపించెఁ, బ్రీతిఁ దెలుపున్ సెఱసుల్ గలవేని యన్మతిన్.100

క. రసగుణరీతి లలితములు
సుసంధిరుచిరములు సకలసుకవీష్టము ల
య్యసదృశనాటకములు మా
నసమునకు ముదంబు గూర్చెనన్ శంకరుఁడున్. 101

క. "నరపాల యిట్లు రససం
భరితము లయి నిష్కళంకభారము లగు సుం
దరకావ్యమ్ములు గలుగవు
ధర నీక నావలన వాంఛితము గలదె? యనన్. 102

గీ. అమృతధారాధురంధర మ్మమితహృద్య
సార మగు శాంకరీయభాషణము వినుచు
విరచితాంజలిబంధుఁడై ధరణివిభుఁడు
గోరె స్వోపముఁ డైనకుమారుఁ బడయ. 103

ఉ. అంతట శంకరుండు వసుధాధిపు నిట్లను హాటకంబు నా
కింత ప్రియంబు గా దొసఁగుమీ యిట నుండు గృహస్థకోటికిన్

గాంతువు కామితం బచిరకాలముసంద చనంగదన్న సు
స్వాంతముతో నటంచు జనవల్లభు నంపుచు నేకతంబునన్. 104

గీ. రాజవరవంశవృద్ధికారణము గాఁగ
శుభ్రత్వుదిత మైనయిష్టి వారుచ్చి యుచిత
సత్కృతులఁ దన్ప; తేఁడును సంతసించి
యతని గుణములఁ బొగడుచు నరిగెఁ బురికి. 105

క. అరిగి మఱునాఁడ పూర్ణా
సరిదంభోఘురము వాఱుసారణి యల శం
కరు భవనసవిధసీమం
బొరయుచుఁ బ్రవహింపఁ జేసె నుత్సాహమునన్. 106

ఆ. తివిరి శంకరోపదేశానుసారమ్ము
సలిపె నిష్టి శాస్త్రసమ్మతముగ
భక్తి గలుగువారిఁ బాలించు నామ్నాయ
మదియ కాదె సృష్టి కాదికర్త. 107

వ. అంత. 108

సీ. తనపుత్రుశక్తి కత్యద్భుతస్వాంతయై
యార్యాంబ యానందమందుఁ దోఁగె
జననీమనోఽభిలాషము దీరెఁ గద యని
శంకరునాత్మ స్వాస్థ్యమ్ము నొందెఁ
దనిసెఁ గేరళవిభుండును గురుకట్న మ
భ్యర్థితంబుగ నీయ నబ్బె ననుచుఁ
బరమావధియ మాతృభక్తికి శంకరుం
డను జనస్తవము లభ్యధిక మయ్యె

గీ. నలరి రాబాలగోపాల మగ్రహార
వాసులును దత్సుధీంద్రప్రభావముదిత
వసుమతీపాలరచిత శాశ్వతమహోప
కారభరితకృతజ్ఞతోదారు లగుచు. 109

ఉ. కాలటియగ్రహారమునఁ గా లిడఁగా నవకాశ మబ్బ న
ట్లోలిని జుట్టుఁబట్టఁ గలయూళులవా రరుదెంచి దత్సుధీ
బాలశశాంకుఁ గాంచి పదపద్మము లక్షుల కద్దికొంచుఁ బొం
బూలను బూజసేసిరి యపూర్వతదీయమహాత్మ్య మెన్నుచున్. 110

సీ. ధరణీసురార్భకపరివీతుఁడై యుడూ
త్కర వేష్టితామృతకరుని మించి
ధవళయజ్ఞోపవీతభ్రాజిఁడై గాంగ
ఝరశోభి నీహారధరముఁ బోలి
లలితకృష్ణాజినాలంకృతుండై నీల
పటదీపితప్రలంబఘ్ను నవ్వి
ముంజమంజిమపుంజ మంజుకటీరుఁడై
సహరితలతిక ద్యుశాఖి మీఱి

గీ. బ్రహ్మవర్చసతాండవరంగమండ
పాయితానన నలినస్రవన్మధూళి
నిర్ఝరితవాఙ్ముఖోక్తి నిర్ణిద్రబుద్ధి
వెలుఁగు శంకరుఁ గని జనుల్ విమలు లైరి. 111

క. సకలార్థతత్త్వవిత్తా
ధికుఁ డయ్యును శాస్త్రవిహితదృఢతరభక్తిన్
బ్రికృతోపచారముల జన
నికి ముద మిడు నాతఁ డతివినీతి ఘాసంగన్. 112

గీ. శంకరునకు శరణ్యము జనని యామె
కగు శరణ్యము పుత్రుఁ; డన్యోన్య యోగ
విరహ మెంతయు దుస్సహం బిరువురకును
సన్నిధానమ్ము త్రిజగతీశాసనమ్ము. 113

శా. విద్యావంతుఁడు బుద్ధిమంతుఁడు గుణాన్వీతుండు పూతుండు సం
పద్యుక్తుండు ప్రసూపదాంబుజయుగీభక్తుం డటంచున్ గృహ
స్థోద్యోగంబు ఘటింపఁ గన్యలఁ గులీనోత్తంసు లీ రాఁగఁ ద
ద్విద్యామూర్తి గొనంగ నొల్లఁ డసటన్ ద్రవే లుంచు టేలాయనన్.

శంకరుని పెండ్లాడుమని తల్లి కోరుట

శా. ఆర్యాంబిక యొక్కనాఁడు సుతు నత్యాసక్తిమై డాసి "బి
డ్డా! యేనెల్లసుఖంబు లొంద నిఁకఁ గోడల్ వచ్చు టెన్నండొ? యీ
కాయక్లేశము లెంతకాలము పడంగా నుండెనో? కాని నా
కాయుష్యంబు నశింపకుండె, నన వాహో పెండ్లిమా టెన్నఁడున్. 115

క. నీ వెంతో విద్య నేర్చి శు
భావహవిధిఁ బెండ్లియాడి యాలును బిడ్డల్
సేవింప వరలుతటేఁ గనఁ
గావలె ననుకొనిన తండ్రి కనఁ డాయెఁ గదా. 116

ఉ. వృద్ధను నేను నట్లు గతియింపక మున్న మదీయలాలసా
సిద్ధి యొనర్చి యింటను వసింపు సుఖంబుగ, నిప్పు డెందఱో
శుద్ధకులుల్ తనూజలను సుందరరూపలఁ బెండ్లిసేయువాం
ఛోద్ధతి వచ్చి చూచి చనుచుండి రిదే యదనయ్య దానికిన్." 117

చ. అని యిటు తల్లి పల్క విని యాత్మజుఁ డుక్రియఁ బల్కెఁ 'దల్లిరో!
వినిచితి నీమనోరథము వింటిని, బాల్యుఁడ నేఁడ పెండ్లియా

డ ననువె? ప్రోడనై యెటు కడంగుదునో యిపు డేమి పల్కుదున్
వనటను గాంచు టేల? బలవంత మదృష్ట మ దెట్టు లున్నదో. 118

గీ. ఈశరీరబంధమ్మున కేవపడుచు
నుండ నొకబంధ మామీఁద నొకటి యిట్లు
బంధసందోహమునఁ జిక్కి బాధపడుట
కెట్లు మన సొగ్గుఁ గనుచుండి యెల్లజగము. 119

ఆ. ఫలము వృంతమందు బద్ధమై వ్రేలుట
పాకదశకు వచ్చుదాఁకఁ గాదె
యవుల నీశ్వరుండె యగుఁగాక పడకుండ
నదుకఁగలఁడె వృంతమందుఁ దల్లి! 120

క. అని తన మనోభిలషితం
బునకు విరుద్ధముగఁ బలుకుపుత్త్రునిబోధం
బును గా దనఁజాలక య
వ్వనిత నిరుద్ధాశ్రువుల నవాక్కయి నిలిచెన్. 121

శంకరునకుఁ గన్యనీయనొక విప్రుఁ డేఁతెంచుట

ఉ. అమ్ముఱునాఁడ యొక్కవసుధామరుఁ డాతని కాత్మజన్ వివా
హ మ్మొనరింప బంధునివహమ్మును దోడ్కొని తద్బుధేంద్రుగే
హమ్మున కేఁగుదెంచి తనయాశయ మార్యను గాంచి చెప్పి త
త్సమ్మతి శంకరాంతికము చయ్యనఁ జేరి కనంగ నయ్యెడన్. 122

సీ. ఆసీనుఁ డయ్యె, గుశాసనమ్మందుఁ బ
ద్మాసనబంధదార్ఢ్యమ్ము మెఱయఁ
దాల్చె వక్షమున రుద్రాక్షమాలికలతో
విలసిల్లునజినోపవీతములను

దృఢముగా, దీర్చెనతిస్వచ్ఛభసిత తి
ర్యక్త్రిపుండ్రములు వెల్గుచునొసంట
గౌపీనమును మౌంజికటిబంధము వెలుంగ
నలరె స్మితాంచితాస్యంబుతోడ

గీ. జుట్టుకొని భక్తి మీఱ శిష్యులు పఠింప
శాస్త్రముల నేకతాయనస్వాంతుడగుచు
జెప్పుచుండె శంకరసుధీసింహుడరయ
దుస్సహంబయి బ్రహ్మతేజస్సు పొలయ. 123

శా. ఆవిప్రేంద్రుడును బంధువుల్ హితులు దామంతంతఁ గూర్చుండి నీ
రావప్రక్రియ నాలకింప నిటు శాస్త్రప్రోక్తదుర్భేదస
ద్భావంబుల్ వివరించుచుండెను సుధాధారల్ విడంబాఱ నం
తేవాసివ్రజసంశయచ్ఛటలు శాంతింపన్ బటూపంచలై. 124

గీ. వింటిరే జీవుఁడారీతి వెనుకభవము
లందొనర్చిన పాపపుణ్యప్రభేద
కర్మ మనుభవించుచునుండుఁ గాయ మాఁది
మమత వహియించి యదె సాధనముగ నకట. 125

గీ. అది ప్రబోధసుధాకరమందు దేహ
నిందనప్రకరణము నుండి వచింతు
విషయనిందాప్రకరణమ్ము వినుఁడు శ్రద్ధ
ఘోరభవవారిరాశిసంతారకంబు. 126

ఆ. వెంగలీఁడు దేహి విషయజకర్దమ
మార్జనమ్ము ప్రాలుమాలి మఱచుఁ
బడు గృహస్థధర్మపంకమ్మునన్ దుర
దృష్టదృష్టి విరసవృత్తి యగుచు. 127

ఆ. ఆలు రూపహీన యగునేని నరునకు
నంతకంటె దుఃఖ మనుచుఁ గలదె
యమితరూపయుక్త యగునేని దనకుఁ గా
కన్యపురుషవశము నందుఁ గాదె. 128

ఆ. బిచ్చగాఁడొ బంటొ నెచ్చెలియొ పర
పురుషుఁ డెవఁడొ కాని యరయు సాభి
లాషదృష్టితో విలక్షణోదారరూ
పవతియేని భార్యవంక నెలమి. 129

క. తనభర్త కంటె నాసే
చనికాంగుని బురుషు నన్యుఁ జూన యరసి నె
మ్మనమున వానిని వెదకదె
మనమునఁ బురుషుండు పరరమణి వెదకునటుల్. 130

ఉ. ఆగతి మంజురూప యగు నాలిని జూచి ప్రతిక్షణంబు కో
పాగతి క్షీణుఁడై బలిభుగంతరపాతి బలిక్రియన్ సుఖం
బేగతిఁ బొందఁ, డాచెలియ యేతరియై తనయాజ్ఞ మీఱుచో
నోఁగద వైరి మించినది, యన్యులఁ గోరునదేని యేమనన్. 131

క. అని పలికి దీనిపై వ్యా
ఖ్య నొనర్తును విపులముగ సమాకర్ణింపుం
డని కాంతాగర్హణ మొన
సినభణితమ్ముల నుపన్యసించె నిటువలెన్. 132

మ. జననం బాదిగఁ జచ్చునందనుక పీసంబేని సౌఖ్యం బెఱుం
గనిజీవుండు దురాశఁ జిక్కుకొని సౌఖ్యభ్రాంతి నా లంచు నం
గన నోర్తున్ గళమందుఁ గట్టుకొని పంకంబందు నిర్మగ్నుఁడై
వసటం జెందుచు దిక్కుమాలి కృశుఁడై వర్తించు దీనంబుగన్.

గీ. సకలశాస్త్రార్థసారవిజ్ఞాతయేని
లేమ వాల్జూపులకుఁ జిక్కి లేడిపిల్ల
వలె ననుగమించుఁ గాని గెల్వంగ నేరఁ
డని వయస్యులతోడఁ బ్రహ్లాదుఁ డనఁడె. 134

చ. పరమరహస్యముం దెలియఁ బల్కెద నెంతటివిజ్ఞుఁడైన నుం
దరియిఱిగుబ్బచన్గవ గనంబడునంత మనోజవిక్రియా
భరవికలాత్ముఁడై సుకృతపాపవిభేదవిహీనుఁడై వశీ
కరణవృథాప్రయాసమునఁ గాఱియపాటు వహించు నిస్సిరో. 135

క. మూత్రపురీషాసృక్కృత
పాత్రములం దేమి సుఖము ప్రాప్తించును స్త్రీ
గాత్రమ్ము ముక్తివల్లి
దాత్రం బని యెంచి బుధుఁడు దలఁగి చనవలెఁ. 136

శా. భిక్షాన్నాదనుఁడై యెదోకడ సుషుప్తిం జెందునవ్వర్ణి కం
జాక్షిం జేకొనుటాదిఁ దృప్తియగునిద్రాహారముల్ లేక చి
త్తక్షోభంబున విత్తవద్గృహబహిర్ద్వారంబులం జిక్కి త
ద్వీక్షాప్రాప్తికి మోక్షలక్ష్మికిఁ జెడున్ విజ్ఞానవిభ్రష్టుఁడై. 137

క. "సంసృతిలతికాకందము
హంసగమన దాని కాస నందనివాఁడే
హింసలఁ గాంచఁడు ముక్తవ
తంసుం" డని బలి యనండె దామోదరుతోఁ. 138

గీ. పుత్రకేదారధనధాన్యశత్రుమిత్ర
భావములకు నిదాన మబ్జాతనయన
దాని నొక్కతె విడువ నేతత్సమస్త
చింతలు నశించు నాశ్రయాసిద్ధివలన. 139

సీ. లాలాంబుర్ఘురపరిప్లావితం బగులేమ
మోవి యె ట్లమృతంపుబావి యగును
మసృణచర్మచ్ఛన్నమాంసగేందుక మైన
సతికుచం బెటు సుమస్తబక మగును
సంకులాంత్రాబద్ధకంకాళ మగుచెలి
దేహ మెట్లు మెఱుంగుదీఁగ యగును
దూషికాబాష్పసందోహప్రసవ మైన
చానక న్నెటు సరోజాత మగును

గీ. అహహా! పాదాదిశీర్షపర్యంత మరయఁ
గుణలవము గోచరము గాని గొమ్మఁ గాంచి
పురుషుఁ డాసాస వెంబడి పోవు టెన్నఁ
గామినీమాత్ర గర్తసంగతికిఁ గాదె. 140

క. అని యిటు శిష్యులమనముల
కును హత్తు నుపన్యసింపఁ గూర్చుండిన వా
రనుమానించుచుఁ బరిణయ
మనఁజాలక యతనిసత్క్రియలఁ జేకొంచున్. 141

ఉ. సంబర మెల్ల డిందువడఁ జల్లఁగ వారలు సేరవచ్చి యా
ర్యాంబకు నయ్యుదంతము సమగ్రముగా వినిపించి జన్మప
త్త్రంబును బుచ్చుకొంచు విశదంబుగ నయ్యది చూచి లేశమా
త్రంబు ముదంబు చూప రథరంబు మెదల్పర మిన్న సూచుచున్.

శంకరుఁ డల్పాయువని తల్లి విలపించుట

చ. అది గని యాసుధీజనని యాత్రముతో "నది యేమి తండ్రులా
ర! దయ వహించి చెప్పరె చిరంబుగ నాయువు గల్గి సర్వసం
పదల మదాత్మజాతుఁడు శుభంబులఁ బొందునె" యంచుఁ బల్కు న
మ్మదితభయంబుఁ గాంచియు నమోఘవచస్కుఁడొకండుదాననున్

సీ. చదువు నీతఁడు వేదశాస్త్రముల్ సరహస్య
మఖిలవిద్యలు నేర్చె నరయుమాత్రఁ
బాండిత్యసామ్రాజ్యపట్టాభిషిక్తుఁడై
యెదురు లేక జగంబు నేలఁగలఁడు
యశముచే సర్వదిగంతవిశ్రాంతుఁడై
పరిపంథితతిఁ బాఱఁబాఱఁ దఱుము
జ్ఞానామృతమ్ము పైఁ జల్లి సంసృతికర్గ
మోద్విగ్న మగులోక ముద్ధరించు

గీ. శాశ్వతగ్రంథరచనావిశారదుఁ డగుఁ
జక్రవర్తిత్వమో లేక సన్యసనమొ
యొందునట్టి మహారాజయోగ మెనసె
నన్నియును లెస్స కాని యే మందు నమ్మ! 144

ఆ. అనుచు నంగుళమ్ములను లెక్కయిడి యుత్త
మాయు వరయ మధ్యమాయు వేని
గానరాద యని సగంబు సగంబు మిం
గుచు వచించె నామె కుంగి పోవ. 14

ఉ. ఆద్విజుఁ డాప్తబంధుయుతుఁడై చనె వచ్చినత్రోవఁబట్టి యా
పద్విచలన్మనోబ్జ యయి పైదలి యంతట వంత మున్గ, యా
వద్విషయంబు శంకరుఁడు వచ్చి యెఱింగి సవిత్రిఁ బల్కు నం
విద్విభవాభిరామపదవీలలితోక్తుల శాంతియుక్తులన్. 146

మ. జననీ యిట్టు లకాండశోకమును గాంచన్ ధర్మమే? కర్మమే
మని శాసించినఁ దప్పునే ప్రబలవాతాఘూతనిర్ధూతకే
తనచీనాంశుకకోటిచంచలము గాదా దేహ? మేమూర్ఖుఁడున్
గనునే సుస్థిరబుద్ధి దానియెడ వక్కాణింపు కా దన్నచోన్. 147

క. సుతు లెందఱ సతు లెందఱ
గతజన్మంబులను బొందఁ గంటివొ నీ కా
సుతసతు లిపు డుండిరె సం
సృతిసంగము పాంథసంగమే కద జననీ. 148

క. ఉపచయగతి దేహంబై
యపచయగతి నదె శరీర మగు నని బుధు లం
డ్రుపచయము నపచయం బీ
ప్రపంచమున సంతతప్రవాహములుగదా! 149

ఉ. ఈనవరంధ్రిముల్ గలమెయిన్ బవనం బెటు లిన్నినాళ్లు దా
నై నిలువంగఁ జాలె నని యచ్చెరు వొందఁగ నౌను గాక యే
దే నొక ఛిద్రమందుఁ బడి యేఁగుట చోద్యమె యిన్నియున్ గృతాం
తాననపంక్తి గాఁ దలఁపుమా వలపున్ విడునాడు దీనిపై. 150

క. మృతియే దేహంబునకుఁ బ్ర
కృతి యని జీవించుటే వికృతి యనియు మహా
మతు లనుట వివేకించిన
ఋతము; జగద్విపరిణామ మెవ్వం డాఁపున్. 151

క. నేఁడో రేపో మఱి యే
నాఁడో యీదేహవితతి నశియించుఁ గదే
నేఁ డైన ఖేద మింకొక
నాఁ డైన ముదంబు గలుగునా నాతల్లీ! 152

గీ. మర్త్యులు శతాబ్దినడుమన మాసిపోన
మర్త్యులు యుగాంతమున నేని మడియువార
కాలమునఁ దారతమ్యంబె కాని మృత్యు
వొందనట్టివాఁ డొక్క మృత్యుంజయుండ, 153

చ. తరతర మాయమేఁశు నమృతత్వనిదాను నుపాస్తి సేయ దు
స్తర మగుమృత్యువుం గెలువఁజాలుము మంతియు కాని యిట్లుదు
ర్భర మగువేదనన్ బొరసి ప్రాణము గావఁగలారమమ్మ నీ
తర మగునేని నాకు నమృతత్వము గాంచ వరం బొసంగుమా. 154

క. విను మొకనుడి కైవల్యో
పనిషత్తు వచించు "నమృతభావము త్యాగం
బున నగుఁ గర్మమునఁ బ్రజా
ధనములఁ జేకూర" దనుచు ద్రఢిమ మెలర్పన్. 155

శంకరుఁడు సంన్యసింపఁ దల్లినిగోరి నిరాకృతుం డగుట

చ. భ్రమవశతన్ భవాధ్వమున బమ్మరిలన్ సుఖలేశసంగ్రహం
బమరదు సర్వసంగపరిహారము గాఁగఁ దురీయమైన యా
శ్రమమును బూని శంభునిఁ బరాత్పరునిం భజయించి జన్మమ
ర్థము గన నీయనుజ్ఞ నమృతత్వము గాంచఁ దలంతు నంబరో. 156

మ. అని సంన్యాసజిఘృక్షుఁ దెల్పునుడు లల్పాయుష్కుఁ డన్మాట కం
కంపెను నిర్ఘాతనిపాతమై ధృతిగిరిన్ భేదింప ఖేదంబుతో
నను "నాతండ్రి యి దేటివాంఛితము? ప్రాణం బున్నయన్నాళులే
ని ననున్ గాచుచు నుండకుండ నెటకేనిన్ బోదె సంన్యాసివై. 157

సీ. మాను మీబుద్ధి, యాలింపుమా కుమార!
పూని గార్హస్థ్యమును, గాంచి పుత్రకులను,
జేసి క్రతువులఁ, బొందు సంన్యాస మపుల,
నిదియ సత్సంప్రదాయ మం చెఱిఁగి కొనుము. 158

చ. అకట! త్వదేకపుత్రను గదా బ్రిదుకంగలదాననే నిరూ
వికలత వీడి; నేను మరణించినచో నెవరయ్య యార్ధ్వదై
హికవిధు లాచరింతు రతివృద్ధ ననున్ విడనాడి పోవుకో
రిక యెటు గల్గె సర్వము నెఱింగియు నీక్రియ జాలిమాలితే. 159

ఉ. నావుడు శంకరుండు కరుణంబుగ నేడ్చెడితల్లిఁ జూచి చిం
తావిలచిత్తుఁడై జననియంగద నెల్ల నిరస్తమోహవా
ఛావిసరంబుచే నుడిపి సర్వవిధిజ్ఞుఁడు గాన నొంటియై
భావమునం దిటుల్ తలఁపఁ బాల్పడె నెన్మిదియేండ్లయీడునన్.

గీ. సంసృతిని రోసె నామానసంబు మివుల
విడువఁజాలక తల్లి తపించు నకట!
యెటులో యొప్పించి చననింత యెంతుఁ గాని
బుద్ధిఁ దలపోయ ధర్మ విరుద్ధ మిద్ది. 161

క. ఏయహము విరక్తుం డగు
నాయహమ పరివ్రజించు టది విధి యని యా
మ్నాయమ్ము తెలుపు టెఱుఁగవె
యీయమ యశరణ్య వృద్ధ యేఁడ్చుట కెంతేఁ. 162

క. అని మనమున యత్యాశ్రమ
మును గొనఁగా నిశ్చయించి మోమున ఖేదం
బును జూపక సేవలఁ ద
జ్జనయిత్రిని దనిపెఁ దగ యథాపూర్వముగన్. 163

ఉ. ఆయమ కోర భాగవతమందలిపుణ్యకథానకంబు లా
ప్యాయన మొప్పఁగాఁ జదివి యర్థము సెప్పి తదీయఖేదమున్
బాయఁగ దట్టె సమ్మదమునన్ హృదయాబ్జము పల్లవించి నా
రాయణనైకరూప చరితామృతసేచన పూరితంబుగాఁ. 164

సీ. జనకుఁ గా దని నృసింహుని జేరుప్రహ్లాదు
నని తరసామాన్యమైనభక్తిఁ
బవిపాపఁ డయ్యుఁ దపఃపటిష్ఠత ముకుం
దునిపదం బంటిన ధ్రువునిశక్తి

నిస్సంగుఁడై గోచినేని దాల్పక నిరా
గకళావతారమహా శుకువిరక్తి
సంగదోషమున సారంగమై విప్రుఁడై
తరియించు నాజడభరతుముక్తి

గీ. సాంద్రమోదాశ్రు రోమాంచజడిమ ఘర్మ
ముఖ్యసాత్త్వికభావసమ్మద్రితాంగుఁ
డగుచు భాగవతపురాణ మంబకొఱకుఁ
జదివి వివరించె నాశేయి శంకరుండు. 165

క. భాగవతమందుఁ జదువు వి
రాగులచరితములు హృదయరాజీవమునన్
మూఁగి యళులటుల మొరయ వి
రాగము ముప్పిరిగ దృఢతరంబై పొదలెన్. 166

మ. "గురు వెవ్వం డగునో? లభించునొకో నాకున్ బ్రహ్మవిద్యాధురం
ధరభావ" మ్మనుచింతచేఁ గొడుకు "వృద్ధన్ నన్నుఁ బోనాడి కవ్రి
చ్చుఱ యత్యాశ్రమ మూనునేమొ సుతుఁ డం" చార్యాంబయున్
గన్న మూ
యర యారాత్రి, సుషుప్తికిన్ రిపులు చేతోనంతచింతల్ గదా. 167

గీ. ఎట్టకేలకు నిద్రించి రిరువు రరుణుఁ
డుదితుఁ డౌతఱి లేచి శిష్యులను గూడి
శంకరుం డేఁగె నదికి స్నాను వగుచు
సుప్త యగుతల్లి యింట నేడ్చుచును లేచె. 168

చ. అటువలె మేలుకాంచి కలయన్ నలుదిక్కులు సూచి యింట నె
చ్చటఁ సుతుఁ గానలేక తనుసంధులు ప్రీలఁగ ముక్తకంఠయై
యటమట నేడ్వఁజొచ్చె నదియుం దవగాహ మొనర్చుచున్నయ
వ్వటువులఁ గూడి శంకరుఁ డవార్యగతిన్ బఱతేర నింటికిన్. 169

శా. ఆరీతిన్ హృదయంబు జాఱ నిది యే మమ్మా యటంచంబికన్
జేరన్ వచ్చుకుమారుఁ గంఠమున సంశ్లేషించి, నాతండ్రి క
న్నారన్ ని న్గనఁగంటి, మంటి వెటు లన్నా డెంద మిందాఁకఁ గం
గారై నీ రయిపోయెఁ బ్రాణము గళాగ్రప్రాంతమై యాడెడిన్.170

క. తనయా యది స్వప్నం బని
నినుఁ గని యనుకొనుచునుంటి నిజ మనుకొని పొం
దినవగకు మేర గలదే
మనుమా యతి వగుచునే నమందాయువవై. 171

గీ. అనుటయు వితాకు గదుర నయ్యనఘుఁ డాత్మ
నెట్టు లీయమ యిటు తెలియించెనో క్కా
యనుకొనుచు నమ్మ! దాని కే మల్లస్వప్న
మంతయు వచింపు మనుడు నార్యాంబ పలుకు. 172

సీ. పరిపూర్ణవారినిర్ఝర మహాచుఁ బూర్ణాత
రంగిణి మిన్నంటఁ బొంగినట్లు
లానదీపూరమం దవగాహ మొనరింప
నేను నీచేయూఁత నేఁగినట్లు
కటిదఘ్న మగునుదకముల నే నీరాడు
చుండిన ట్లీ వీఁదుచుండినట్లు
వలదు రార మ్మని పలుమ తే నన్నట్టు
లీ వీఁదుచును లోని కేగినట్టు

గీ. లంతలో నీపదాగ్ర ముగ్రాకృతి యగు
నొక్కమకరంబు వట్టిన ట్లుపతపించు
చనుమతింపు మిక్కడని సంన్యాసమునకు
నఱచు బల్కిన యటు కలయందుఁ గంటి. 173

ఉ. కొండయె మాళిఁ గూలినటు కొండొక నిల్చి తపించు చెంతరా
గుండియదానవో కద! యొకొండు వచింపక మిన్నకుండ న
క్కాండములన్ బుటుక్కు మని కన్గొనుచుండ మునింగి లేచి "నా
కొండన కానతీవె" యను చొక్కము నుంకిడినట్లుగానరాక్. 174

ఉ. "కోరిక దీఱకుండఁ బ్రతికూలమృతిక్ గన నేల తండ్రి నీ
కోరిన యాశ్రమంబె కయికొంచు సుఖంపడు"మంటిఁ గాని వాః
పూరమునంద మాయమయి పోఁ గని యక్కట పుత్రు మ్రింగితిక్
గోరిక దీర్పనైతి నని కుందుచు నెవ్వఁడు గానరామికిన్. 175

ఆ. ఱొమ్ము చఱచుకొనుచు నెమ్మోము నొదల
మోదుకొనుచు బాష్పపూరమగ్న
నగుచుఁ దీరభూమి నడలుచున్నటు పాడు
కలను గంటి మేలుకంటిఁ దుదకు. 176

క. మేలుకొని యేడ్చుచునె నలు
మూలలు గృహ మరసి నీదుపోఁడిమి గనమిన్
గాలుం గే లాడక యిలఁ
గూలితి నే మందు నిన్నుఁ గోల్పోయినటుల్. 177

క. అని యేడ్చుచుఁ గంఠము వీ
డనిజనని మొగంబు నిజపటంబున నొయ్యో
య్యన నొత్తుచు నిటులను, న
య్యనఘుఁడు దైవంబుచేత కబ్బురపడుచున్. 178

శా. తల్లీ! యేటికి శోక మొందెదవు? నాదైవమ్మ నీస్వప్నమై
తెల్లం బౌనటు తెల్పెఁ గాంచుము స్రవంతీరూపసంసారమం
దుల్లోలంబుల దుస్స్పృహామకరపీడోత్పాతినై మున్గి యా
పల్లుప్తాసువు గాఁగ నుంటి ననుభావం బందు దీపింపఁదే. 179

## శంకరుండు సంన్యసించుట

క. అని జననీభుజబంధం
బున నే భవబంధ మూడిపో సంన్యాసం
బును మానసికముగ గొనె నొ
య్యన "సంన్యస్తం మయా" యటంచు నుడువుచున్. 180

ఆ. తెల్లఁబోయి తల్లి యుల్లంబు జల్లన
నెంతపని యొనర్చి తింతలోన
శోకవశత నంటిఁగాక నీవిప్రయో
గంబు సైఁపఁగలనె కన్నతండ్రి! 181

శా. నా కెవ్వా రిఁక దిక్కు పుత్రక! నినున్ గాపాడి నీప్రాపునన్
జేకొందున్ సకలోపచర్యలు జరాజీర్ణాంగి నైనప్పు డం
చాకంఠంబుగఁ గోరికల్ గలిగి కాదా నాఁడు నీతండ్రితోఁ
బోకున్నా; నెటుగాక యుండ నడవిన్ బోఁ ద్రోసి పో నుంటివే. 182

క. శారీరపాటవముతో
ధీరతయుఁ దొలంగె నిట్టిదీనావస్థన్
భారము నీకే యగునెడ
నేరికిఁ గాకుందుఁ దండ్రి యేర్పడఁ జెపుమా! 183

క. నా విని యామాటలకుం
భావము చలియింప కతఁడు పల్కెను మమతా
భావ మభావ మ్మయి చెడ
నేవంవిధ మధురమృదుల హితభణితములన్. 184

ఉ. ఏల విలాప మొంద జననీ! భవ మీఁగి బయల్పడంగ? నా
భీల దవానలార్చి రభివేష్టితవాస నికుంజనిష్క్రమో
ద్వేలభయాతు రైణముగతిన్ మన మల్లల నాడిపోవ, నె
వ్వేళనొ సంన్యసింప కెటు పీటిడిన్నై చెడఁజూతు నెంచుమా. 185

క. కలలో ననుజ్ఞ యిడు ట
వ్వాలఁ బెట్టుము నన్నుఁ గాంచి పలుకవె యతివై
యిల బ్రతుకు మనుచు, నిప్పుడు
కలఁగెద వేలమ్మ పోవఁగా నే నుండన్. 186

సీ. పుత్రుఁ డనెడివ్యామోహమ్ము పొందుకతన
నింత దుఃఖింతుగాక యొకింతతత్త్వ
మరసి యిటు సంన్యసించునా కర్థాకృత్య
మెదియొ శాసింపు మఖిలమ్ము నెఱుఁగు దీవ. 187

శా. నీదేహంబు రుజావశం బగునయేనిన్ గాతు రర్థోపచా
రాదిన్; మృత్యువశంబ యానెడయథార్థప్రక్రియన్ సంస్కృతుల్
భేదం బెంచక చేయువారలు ధనాప్తిన్ సత్ప్రజాభీతి దా
యాదుల్ వీరలు నమ్ము మింక భయ మేలా నీమదిన్ దల్లిరో.

క. రే యైనన్ బగ లేనియు
నేయెడఁ గానిమ్ము నీకు మృతి యొదవెడుచో
నాయెడ నను మదిఁ దలఁచినఁ
బాయక యరుదెంచి పరమపద మొందింతున్. 189

క. కొడుకు యతియైనచో జనకులకు నంత్య
సంస్క్రియలు లేక యున్న మోక్షమ్ము కలుగు
నేదియో లోక మొంది యం దెల్లపుణ్య
మఱిన భువిఁ గూలుపీడ నీ కమ్మ యేల? 190

గీ. విధవ ననదను నను నింట విడిచి సుతుఁడు
సంన్యసించెనె యని కుందఁ జనదు నీకు
నిచట నే నున్న నీ వొందు దెట్టిఫలము
దానికి సహస్రగుణఫల మ్మానఁగలవు. 191

చ. అని జననిన్ వచించి వినయంబున జ్ఞాతులఁ బిల్చి సంన్యసిం
పను గడుదూర మేఁగెద సమస్తము మత్పితృవిత్తమున్ గ్రహిం
చి నెనరు పూని వృద్ధదశఁ జెంది యనాథగ నున్న కన్నత
ల్లిని నరయుం డటంచు ముకుళించిన కేల్గవ వేఁడి యెంతయున్. 192

గీ. అనఘుఁ డాతండు మమత నహంత వీడి
బాష్పపూరమ్ము లోలుకునంబను దదీయ
నికటమునఁ బెట్టి జనని సంతృప్తి పఱచి
సవిధవిష్ణ్వాలయము సేరఁ జనియె భక్తి. 193

చ. చని యదునందనాంఘ్రిజలజంబులకుం బ్రణమిల్లునంత నో
య్యన యశరీరవాణి విన నయ్యె "భవజ్జననీహితార్థ మా
జనపతి దెచ్చునిత్తటిని సారణి భంగము లీతటంబు భే
దనమొనరించె దేవళము తప్పక కూలు" నటంచు భోరునన్. 194

శా. ఆశ్చర్యంబున మున్గి కేరళనృపాలాగ్రియు రాఁ బంచి "చే
తశ్చింతాపరిపూరకుం డగు ముకుందస్వామి నీ; కాపగాం
భశ్చంగచ్చటులోర్మిభగ్నతట సంవాసాతిబిభ్యత్తదం
తశ్చింతల్ దొలఁగన్ స్థిరంబుగ గుడిన్ గట్టింపు మోభువరా. 195

క. అనుడు మును తదాదేశం
బునఁ గ్రితు వొనరించి కామమును బడసిన యా
జనపతి యప్పుడ కట్టిం
చె నబాధక మైనచోట శ్రీహరికి గుడిన్. 196

వ. అంతదాఁక శంకరుం డద్దేవళంబునను ముకుందు నుపాసించుచు నిలిచియుండి నిజకరంబుల నాకృష్ణవిగ్రహ ముద్ధరించి మూపున భరించి తెచ్చి నూతనాలయమునఁ బ్రతిష్ఠించి చిరంబుసుఖంబుండు మని ప్రార్థించె నంత. 197

క. జగతీసముజ్జిహీర్షుం
డగు పుత్రుచరిత్ర మరసి యార్య యవిద్యన్
డిగ విడిచి యనుమతించియు
వగ పొందును మరల మాతృభావప్రమదిమన్. 198

గీ. తల్లిచే యదుకులదైవతంబుచేత
నతఁ డనుజ్ఞాతుఁడై భవ మంద రోసి
సంన్యసింప సుదూరము చనఁ దలంచె
నాస్థికుం డెంచునే యబ్ధినడుమ దుముక. 199

శంకరుఁడు బ్రహ్మోపదేశము గోరి యేగుట

క. ఈరీతి మాతృ మాధవ
కారుణ్యము వడసి విగతకామ్యార్థుండై
కూరిచి మదిఁ గృష్ణపదాం
భోరుహముల నతఁడు గేహమును విడిచి చనెన్. 200

గీ. రూఢిఁ ద్రైయంబకాపరరూపుఁ డతని
యెదుటఁ గాముఁడు నిలువలేఁ డింత యనిన
నమ్మహానుభావున కెట్టు లంటుఁ గామ
మూల సంసారపాశ బంధాలు తలఁప. 201

ఉ. మున్ను విధుండు ధాత స్మరమోహితులై చని రుత్పథంబునం
దన్నన, మోహినీకచకుచాదుల నేనును గాంచి వెంబడిన్
సన్నకసన్నఁ బోతి నని శంభుఁడె నేఁడు స్మరార్తివార్త కా
సన్నుఁడు గానిభిక్షు వగు జాడ నకాముఁ డతండు రంజిలెన్. 202

క. సుర పూర్వామర విద్యా
ధర నరగంధర్వులకు మదం బడఁచెను శం

బరవైరిం గెలిచిన శం
కరుఁడు మునిస్తుత్యుఁ డగుట కనఁ జిత్రింబే. 203

మ ఎట వైరాగ్యమతండు మున్గనెనొ కానీ, శాంతికిన్ లోఁగె హృ
త్స్ఫుట, మద్దేగమనాదిక్రియల సొంపున్ దాంతి, పాటించె వి
స్ఫుటమౌ క్షాంతి మృదుత్వ, మయ్యుపరతి న్బోయె హృష్టీకార్థసం
ఘటనం, బింక సమాధి ధ్యానవితతౌత్కంఠ్యమ్ము చేకూరిచెన్.

ఉ. శ్రీఅనివేదుకగ విధివితీర్ణకృతాత్మతనుస్థితిన్ గృహా
దారమమత్వముగ విడిచి తత్పరతగ శివు నిల్పి మానసా
ధారమునందుఁ దా విజనతాలలితాయనయానపూరితా
పారముదంబునన్ జనియె భారము దూరము నాక యెక్కటిన్. 205

గీ. పోవుచును మార్గమున వనమ్ములను నదుల
నగపురగ్రామనివసజ్జనంబు గనుచు
బ్రహ్మమే యైంద్రిజాలికుపగిది నద్భు
తేంద్రజాలము సూపు నం చెన్ను మదిని. 206

గీ. దండితాఖిలకాపథమండలుఁడు జ
గద్గురుఁడు దండ మూనెను గరమునందు
వాదినివహంబు నిజనిజార్థ్యముల కీడ్చు
నలజరద్గవిఁ దన త్రోవ మెలపుకొఱకు. 207

శా. దండం బూని యతండు కావసియెడన్ దైన్యంబునన్ వైదికుల్
కొండల్ పట్టరె విశ్వకద్రుతతి తేళ్లుంబోలె? నుచ్ఛృంఖ లా
ఖండాహంకరణాన్యమర్మ విభిదాకండూలజిహ్వాగ్రపా
షండాఘాతము నొంది ఖండుచును బెల్చున్ గాంధిశీకాత్ములై. 208

శంకరుఁడు గోవిందయతికడ కరుగుట

ఉ. ఇందుభవానదీతటి రహించుచు శాంతినిశాంత మైన గో
విందయతీందు నాశ్రమనివేశముఁ గావులు మేనఁ దాల్చి కై
యం దొకదండ మూఁది కదియం జనె శంకరుఁ డస్తశైలమౌ
ళిం దివసావసానమున లీల ఖరాంశుఁడు చేరె నయ్యెడన్. 209

గీ. తటకుజాయాతవాతపోతముల సేద
యణఁగ నాతఁడు ధృతవల్కలాజినవిట
పములఁ దపువులు మునులవాస మని తెలుపఁ
గనియెఁ గోవిందయతి తపోవనము వేడ్క. 210

గీ. ఆయతీంద్రునియుపదేశ మందఁగోరి
యచటియతు లెల్లఁ దెలుప నాయనఘుఁ డెఱిఁగి
యరసె బ్రాదేశమాత్రవివరము ద్వార
మైన గోవిందసాధుగుహాలయంబు. 211

క. అరసి ప్రసన్నసమ్మద
కారి యగు యతీంద్రుగుహకుఁ గావించెను ము
మ్మాఱు ప్రదక్షిణనతు లటఁ
జేరి మునులు వినఁగ వినుతి సేసెను భక్తిన్. 212

క. పక్షీంద్రధ్వజుపా న్పయి
ప్రత్యక్షపదాంగదమునై సహస్రధరణిభృ
త్కక్షితిఁ దలఁదాల్చు మహా
చక్షుశ్శ్రుతినాథరూపు సన్మునిఁ గొలుతున్. 213

గీ. నిజసహస్రముఖీక్ష్వాజనిత భయమునఁ
బఱచిరే శిష్యు లని దానిఁ బాసి యేక

వదనమున శాంతుఁడై శిష్యపటలిఁ బ్రోవ
నిల జనించు పతంజలి వీవ కావె. 214

ఉ. అల్ల పతంజలిన్ గొలుచునప్డు ప్రమాదముసేసి శప్తుఁడై
కల్లరి రక్కసుం డగునొకానొకపండితుఁ గొల్చి భాష్యముల్
గొల్ల వటద్రుపత్త్రములకోటి లిఖించియు లేఁగ మేయుటన్
జిల్లులు వోవఁ బూరణము సేసి మహిన్ వెలయింతు వీవకా. 215

గీ. అవనివివరముననె యధోభువన మెనసి
తన్మహాభాష్యమును యోగదర్శనమ్ము
శేషఫణిసన్నిధిని విమర్శించి వసుధ
వితత మొనరింపవే జగద్ధితము గోరి. 216

ఉ. వ్యాసతనూజుఁ డౌశుకమహామునిశిష్యుని గౌడపాదు నా
యాసము రోసి కొల్చి పరమార్థ మెఱుంగు విస్పృత్వరప్రభా
వాసము శాంతివాసము దయాంబుధి నిన్ను భజించి బ్రహ్మసం
స్థాసుఖ మొంద నీచరణసన్నిధిఁ జేరితి నంచు భక్తితోన్. 217

మ. అనఘుం డాతఁ డిటుల్ నుతింపఁగఁ దదీయాదృష్టశక్తిన్ సమా
ధినిరుద్ధస్థితి వాసి చిత్త మలరన్ దెల్వొంది 'యెవ్వాఁడ వీ'
వను గోవిందయతీందుఁ బ్రాగ్జనన పుణ్యవ్రాత జాతాత్మబో
ధనసంసూచకమైనవాక్కుల ననెన్ దాంతుం డతం డీక్షియన్. 218

ఉ. కాను ధరిత్రి, నంబువులు గా, ననలంబును గాను, వాయువున్
గాను, నభంబు గా నెపుడు, గా నిఁకఁ దద్గుణముల్, హృషీకసం
తానము గాను; వాని కెడద వ్వగుచున్ బరమత్వసంపదన్
బూను శివుండ నేను బరిపూర్ణపరాత్మవిబోధసుందరా! 219

గీ. అనుచు నద్వైతదర్శనజనితము లగు
శంకరోక్తుల గురుఁడు హర్షంబు చెంది
"కంటిని సమాధిదృష్టి శంకరుఁడె భువిని
నవతరించెఁ ద్వైదాకృతి ననుచు వత్స". 220

క. అని చరణములు గుహాముఖ
మునఁ జూపఁగ శంకరుండు పూజించినతోఁ
డన యాచార మిదియ యని
యనఘుం డుపదేశమిచ్చె నాశిష్యునకున్. 221

క. పరమాత్మ నెఱిఁగి యుండియు
గురుశిష్యులసంప్రదాయగుప్తికినై శం
కరుఁ డాత్మవిద్యఁ గన న
గ్గురునకు శుశ్రూషసేసి కూర్చొను దృష్టిన్. 222

గోవిందయతి శంకరునకు బ్రహ్మోపదేశము సేయుట

గీ. భక్తిపూర్వాచరిత తత్సపర్యలకును
ముదితుఁడై యుపదేశించె సదమలాత్ముఁ
డై నశంకరునకుఁ జతురాగమాంత
గత మహావాక్యముల నిట్లు యతివరుండు. 223

ప్రజ్ఞానం బ్రహ్మ

గీ. కాంచ విన మూరుకొనఁగ బల్కఁగ రుచుల
సంగతి మెఱుంగజాలు ప్రజ్ఞాన మేది
తనరు; నదె బ్రహ్మ మనునర్థమును వచించు
ఋఙ్నిగమ శేఖరోక్తి యెఱిఁగికొనుము. 224

అహం బ్రహ్మాస్మి

గీ. ఆత్మవిద్యాధికారి దేహంబునందుఁ
బూర్ణ మగుబ్రహ్మ 'మే' నను బుద్ధిఁ బూని
సాక్షి యగు, నయ్యదియ బ్రహ్మసంజ్ఞ మను య
జుర్నిగమశేఖరోక్తి నెంచుము మనీష. 225

తత్త్వమసి

గీ. తత్పదార్థంబు బ్రహ్మమ్ము, త్వంపదార్థ
మజ్ఞుఁ డగుజీవుఁ, డది యైతి వనుచు నైక్య
మును ఘటించెడి 'అసి' యని వినుచు సామ
వేదశేఖరవాక్యంబు వినుము దెలియ. 226

అయ మాత్మా బ్రహ్మ

* గీ. స్వప్రకాశాపరోక్షత వరలునదియ
యాత్మ యనఁగ నహంకార మాదిదేహ
మవధి యగుదానికంటె వే ఱగును బ్రత్య
గాత్మ యనియె నథర్వవేదాంతసూక్తి. 227

వ. అని మహావాక్యచతుష్టయం బుపదేశింప శంకరునకు సందార్చం
బగు 'ప్రజ్ఞానంబ్రహ్మ' యను మహావాక్యముచే 'అథాతో బ్రహ్మ
జిజ్ఞాసా' యని బ్రహ్మమ్మునంద సకలవేదాంతములకుఁ దాత్పర్యప
ర్యవసానంబు వర్ణించిన వైయాసకసూత్రగ్రంథమందలి ప్రథమా
ధ్యాయ మంతయుఁ గరతలామలకంబయ్యె. యాజుషంబగు "అ

---

* గీ. స్వప్రకాశము ప్రత్యక్ష మప్రమేయ
మఱి యహంకార మాది దేహాంత మైన
దదె 'యిది' యనంగ వెల్గు బ్రహ్మం బనెడు న
థర్వవేదావతంసోక్తి తత్త్వ మెఱుగు.

హం బ్రహ్మాస్మి” యను మహావాక్యమున నహంకారోపలక్షితం బగునాత్మకు బ్రహ్మత్వవిధానమునెడఁ గలుగువిరోధముల నెల్ల సర్వప్రమాణావిరోధముగా వారించి సమన్వయించిన ద్వితీయాధ్యాయమంతయు హృద్గతంబయ్యె. సామవేదోదిత మగు ‘త త్త్వమసి’ మహావాక్యమువలన జీవబ్రహ్మభేదంబునకు సాధనం బగు తృతీయాధ్యాయమంతయు ముంజేతికంకణంబయ్యె. మఱియు నాథర్వణం బగు ‘అయ మాత్మా బ్రహ్మ’ యను మహావాక్యము వలన నిత్యాపరోక్షం బగుప్రత్యగాత్మకు బ్రహ్మత్వంబు చెప్పి య విద్యాధ్వంసన మొనర్చు చతుర్థాధ్యాయమందలియర్థ మెల్ల విస్పష్టం బయ్యె నిట్లు. 228

గీ. సాంప్రదాయిక వ్యాసవిజ్ఞాతృసూక్త
సూత్రమతగతి ననుసరించుటఁ గృపాళు
వైన తన్ముని శాస్త్రగూఢార్థజాత
మిద్ధగతి శంకరుఁడు సూక్ష్మబుద్ధి నెఱిఁగె. 229

సీ. నారాయణునకు మున్ నలినగర్భుఁడు పుట్టె
నతఁడు గాంచెను వశిష్టాఖ్యమౌని
నతనికి శక్తి నా సుతుఁ డుద్భవించెఁ గాం
చెను బరాశరుని నమ్మునివరేణ్యుఁ
డతనికిఁ గల్గె సత్యవతియం దలవ్యాసుఁ
డామహర్షికి సుతుఁడయ్యె శుకుఁడు
శుకమహామునికి శిష్యుఁడుఁ గౌడపాదుఁ డా
తనికి గోవిందనాథర్షి శిష్యుఁ

గీ. డట్టిగోవిందయతి శిష్యుఁ డై పఠించి
పడసె బాల్యాశగత ఫణిపతి కటాక్ష

సముపలబ్ధమహాశబ్దశాస్త్ర మెల్ల
గురుకటాక్షమ్ముకల్మి శంకరుఁడు తాల్మి. 230

గీ. ఇటుల ప్రాగ్జన్మపుణ్యసుఘటము నున్న
తంబు హంసాదికార్చ్య మహాస్థాన మైన
యంతిమాశ్రమ మాశంకరార్యుఁ డొంది
వెలిఁగె నాత్మానపాది రంజిలెడుపగిది. 231

## ఆశ్వాసాంతము

ఉ. అర్దితదుర్దమాచలభిదాత్మజశౌర్య! యజర్యసారి సా
హార్దవివృద్ధదోర్బలపరాస్తకణేహతికర్త్రధూర్తహ్రా
ద్దుర్దశవక్త్రముఖ్యసురదుర్హృదనీక! కబంధదోర్యుగీ
నిర్దయమర్దనోద్వమితనిస్తులశక్త్యనలాహుతాశరా!

క. మాయామానుష! మహాని
ధ్యేయానాద్యంతరంతతేజా! త్రిజగ
ద్గేయా! యీదర వేంకట
రాయామాత్యాత్మరాగరంజితచరణా!

పృథ్వీవృత్తము. త్రియీశిఖరధర్మహర్మ్యతలరోచమానాకృతీ!
వ్యయీకృతనుకేతుపుత్ర్యసుసమీరణోదీరణా!
భయంకరగతిస్ఫురత్పరశురామగర్వఘ్న జ
స్మయోపశమహేతునిప్రితవిధానరఘుంత్రూనిలా!

ఇది శ్రీ గురుకరుణాసమాసాదితకవిత్వ వెంపరాల
సూర్యనారాయణ నామధేయప్రణీతంబైన
శంకరవిజయంబున
ద్వితీయాశ్వాసము.



శ్రీ గురుమూర్తయే నమః

# శంకరవిజయము

## తృతీయాశ్వాసము



ప్రియ! యాదర సుబ్బాం
బా ప్రాణేశాంతరంగమణిసౌధవిహా
ర ప్రీణన! మాని త్రా
ణప్రీణితభావ! పూతనామా! రామా!

వ. అవధరింపుము.

యత్యాశ్రమము స్వీకరించిన శంకరుని వర్ణనము

క. యతిపతి యతం డలరె లో
హితశాటీపల్లవాపిహిత తనుం డై యా
యతసంధ్యా రక్తాంబుద
తతిసంఛాదిత తుషారధరకూట మనన్. 1

గీ. మృదుం డై తా నౌట నతం డబ్జోద్భవ మడంచి
యుద్యదంభోజబంధుమయూఖ రక్త
శాటికారుణ పల్లవచ్ఛద్మమునను
గళదసృక్పూర తచ్చర్మ మెలమిం దాల్చె. 2

చ. శ్రుతులకుం బూవుందోంట యయి సుప్రథితోత్తమహంసనంసదా
యతగతియై త్రిలోకముల కందంగరాని స్వసత్యధామమం
దతిరతి గాంచి యుంట నితం డౌ నల బ్రహ్మ; బృహిక్రియార్థ మీ
యతియెడ నౌపచారిక మటం చనరాక యథార్థ మయ్యెడున్. 3

శా. మృద్వేకాంఘ్రి మహాఃఖనిన్ ద్రిభువనం బెల్లన్ మితిన్ బూన్చి సం
పద్వృద్ధిక్షయవేళం బాయక యతిప్రాంచద్దశాకారమై
సద్వైరాగ్యమనోజ్ఞమై యమల మానసత్వంబునన్ మించుటన్
'తద్విష్ణోః పరమం పద' మ్మనుచుం వేదం బీయతిన్ బేర్కొనున్. 4

ఉ. భూతివిలేప, గోవిహృతి, భోగిసమాశ్రియ, భూతసంగమో
పేతుఁడు గాక చూపున దహించెఁ బురత్రయిఁగానఁ గేవల
ఖ్యాతు దశాతురీయుఁ బరమార్థము ద్వంద్వవిదూరు భావనా
తీతుని వీని వేదశిఖలెల్ల శివుం డని చేయు వర్ణనల్. 5

చ. పురుషఫలోరురోపకృతి పూజ్యము- లేదు సువర్ణధర్మ మెం
దరయ మహార్చిశోజ్జ్వలవిభారిస మేతము పార్థివంబు నౌ
నరద మిటుల్ సహాయవిరహంబున నష్టపురంబు లోర్చు శం
కరు నిగమాంతముల్ శివునిగా వచియింపక యుండు నేక్రియన్.

మ. వ్యసనాసార దురంత దుష్కృత ఘనంబై దుర్దమాఘోర తా
మస మాసంస్మృతివర్షవేళ కెడయౌ * మార్గమ్మునన్ నిల్చి వై
రిసుధీకీర్తి బిసాంకురగ్రసనపూర్తిన్ హంసవంశోద్ఘ మి
చ్చ సమీచీనతరాశయాప్తి నలరున్ సన్మానసక్రీడలన్. 7

ఉ. క్షీరము నీరమున్ గలియుచెల్వున బ్రహ్మజగంబు లేకమై
వే ఒనరింపరానియెడ వేర్పడఁజేసి యశేషదోషదు
ష్పారము లైన శీలవదబుద్ధసుబుద్ధులు శుద్ధిసేసి యొ
ప్పారె సజస్ర మప్పరమహంస, ద్విజాతిలలామ మెంతయున్. 8

శా. నీరక్షీరనయంబునన్ బుధులకేనిన్ దథ్యమిథ్యావిచా
రారంభం బొనరింపరానియెడ నొయ్యన్ జేయుటన్ శంకరుం
డారూఢిన్ బరహంస యౌ- నటుల సేయన్ శక్తి లేనట్టియె
వ్వారున్ నింబఫలాశనైకరసికధ్వాంక్షానుజన్ముల్ గదా. 9

మ. పఱపున్ బాహ్యతమోహతిన్ గలుగు సర్వప్రాణిదృఙ్మాంద్య-మం
దఱకున్ మే లొనరింప మిత్రుఁడ యగున్- నాళీకబంధుం డగున్
హరియించున్ హితచక్రపీడఁ- బరహంసాకారుఁడై యిట్లు శం
కరుఁ డర్థిన్ దెలుపున్ మహాత్ములకు జిజ్ఞాస్యార్థముల్ పెల్లుగన్. 10

* మర్యాదయందుండి- పాఠాంతరము.

గీ. సంసృతిఁ దొరంగఁ గోరి హంసత్వ మొంది
యతఁడు గోవిందయతిఁ గొల్చు నవసరమున
విషయములఁ జంచలాచలవృత్తిఁ దెలుపు
కరణి మెఱసెను మేఘ మాకసమునందు. 11

వర్షాకాల వర్ణనము

సీ. భువి కిచ్చు మాపుష్పము హరించి తన్నేఁ బా
దముల నం చర్కు నబ్దమ్ము లడ్డె
విషయలోలబుధాత్మవృత బోధకళవోలె
క్షణికకాంతి మొగిళ్ల శంప మెఱసె
విష్ణుపదాప్తి హృద్విమలులకును బ్రహ్మ
ముపదేశమిచ్చె నా నుఱిమె ఘనుఁడు
జ్ఞానగర్వాలు యతుల్ నను యజింప రటంచు
నింద్రుండు విలు దాల్చి యెక్కె రథము

గీ. క్షోణి సత్త్వరజస్తమోగుణము లెనసి
మాయికము లౌవిలాసముల్ మలయునట్లు
కుటజ కందళ బాణాద్రి కుసుమరజము
లలముకొని వనీవాత్య లందంద వీఁచె. 12

క. ఘనదైత్యులు తిమిరచ్ఛవి
తనువులతోఁ జిత్రచాపతతి ఖరఘోషం
బున విద్యుత్పింగాక్షులఁ
జనుదెంచిరి మునుల ధ్యానసవములు సెఱుపన్. 13

గీ. మిన్నలమి వారిదంబు లమేయవారి
ధారలఁ దొరంగఁ జొచ్చె సంతతము నంత

శంకరుం డాత్మమున మానసంబు సేర్చి
యింద్రియప్రవృత్తుల సంగ్రహించికొనియె. 14

చ. సనయపథంబుగా నుపనిషత్తులు సెప్పెడుసాంత్వవాక్కులన్
దన సహజాభిమానము ఘనంబు చిరాత్తమునేని పీడి యొ
య్యన ప్రియుఁడైన యప్పరమహంసునిఁ జేరి స్పృశింప ధీరవృ
త్తిని గనలేక తోడనె తదీయమనీష యడంగె నెందునో. 15

చ. సమయము రోదసుల్ జలదసంగతిలేని యఖండనైజసా
ఖ్యమె తనమూర్తిగాఁ గల చిదభ్రపథంబున సూర్యచంద్రబు
ద్బుములె వెలుంగనేర వనఁగా-నచిరద్యుతివల్లికల్ హుతా
శము నొకయింతయున్ వెలుఁగఁ-జాలునె మాటలు వేయు నేటికిన్.

ఉ. మాయఁ దొలంగి నైజమహిమస్ఫురణంబున నద్భుతావహం
బై యతినిర్మలంబు సహజామితశర్మము గుహ్యమున్ స్వభా
వాయితసత్య మాపరశివం బగు నప్పదమందు నేది యా
దేయము హేయ మెద్ది యను ధీ నతఁ డెప్పు డొనర్పఁ జింతనన్.

గీ. తటిద మేయప్రభానుసృతంబు మేఘ
మల్లవిష్ణుపదం బొందినట్టిదయ్యె
మలినతం జెందె వర్షాగమమున ననిన
భువి విరాగంబు నెవ్వండు పొందకుండు. 18

క. సలిలాశయ కలుషతఁ గని
కలహంసలు మానసోత్సుకములయ్యె; నెవం
డిలఁ గనఁడో యాశ్రయము సెడ
నలి మానసచింత జీవనస్పృహచేతన్. 19

గీ. శుభ్రరుచి యాకలానిధి యభ్రవీథి
సాంద్రఘన మాటచేఁ బ్రకాశంబు వాసె

వరలునొకో మలినాంబరవాసి యైన
యంత నెంతకళావంతుఁ డైన నరుఁడు. 20

గీ. తతపిపాసువు లైనచాతకము లారఁ
గ్రోలె నుదకంబులను జిరకాలమునకు
ఘనసమాశ్రితుఁ డనువగుకాలమందు
నందు నేకద దుర్లభం బమృత మైన. 21

చ. ఇటు చటులానిలక్షతమహీజము ప్రాణిచయప్రచారసం
కటము పయోదనీలరుచిగాఢము నౌ నలవర్షవేళ న
ప్పటుమతి సుధ్యుపాస్యపదపద్ము గురున్ భజియించు చిందుభూ
తటమున నుండె నింద్రియవితానము లోఁచి ప్రమోదమగ్నుఁడై.

చ. తెఱపి గనంగరాక దశదిక్కులు నేకముగాఁ దటిద్రుచుల్
పరఁగ మనుష్యకోటులు కలంగ నభంబున నేన్గుతొండముల్
వరుసన వ్రేలఁ గట్టినబెళంగున నమ్మయధార లొప్పఁగాఁ
గురిసెను బంచరాత్రమతిఘోరగతిన్ సురరాజు వర్షమున్. 23

## శంకరుని యష్టవిభూతిసిద్ధి

గీ. తీరభూజాళితో నగ్రహారసమితి
నొఱసి లోఁగొని నర్మదాసరిద మేయ
పూర మొక్కుమ్మడిని బొంగి హోరు మనుచు
బ్రళయకాలాబ్ధియటు మహీతలము ముంచె. 24

ఉ. తోఁటలు దొడ్లు సర్వవసతుల్ జలపూరనిమగ్నమౌట న
ప్పాటను బెద్దఘోష మొదవన్ నరనారులపత్యయుక్తులై
యోట మునింగి గొల్లుమను చొక్కమెయిన్ బఱవంగఁగాంచి య
ప్పాటున కుమ్మలించి గురుభక్తుఁడు శంకరుఁ డాత్రి మొందుచున్.

క. గురుఁడగు గోవిందయతీ
శ్వరు నచలసమాధి కెట్టిప్రత్యూహము చే
కుఱునో యని వెఱచి తత్పద
సరసిజములు మదిని నిలిపి చంచద్భక్తిన్. 26

మ. అణిమాద్యష్టవిభూతిసిద్ధుఁ డగునయ్యాచార్యమూర్తిన్ మనోం
గణమందున్ నెలకొల్పి తన్నును బరీక్షన్ జేయు రేవాతరం
గిణిపూరంబు కమండలూదరమునన్ గీల్కొల్పి మాన్పెన్ దదు
ల్బణ మెల్లన్; గనె స్వస్థభావమును యావత్ప్రాణు లొక్కుమ్మడిన్.

క. అభిమంత్రించి కమండలు
వభిముఖముగ వఱుత నొడ్డ నంభోధుల కుం
భభవునియాచాంతికి స
న్నిభముగ నది గ్రోలె జగము నివ్వెఱపడఁగన్. 28

ఉ. యోగసమాధినుండి యపు డుత్థితుఁడై గురుఁడున్ జగంబు ల
భ్యాగతులై నుతించుస్వపదాశ్రితు శంకరుఁ జేరి "యింతలో
నీగతి యోగసిద్ధి గను టెంతయు మాకు ముదంబుఁ గూర్చె నే
యోగియు నీక్రియన్ గనునొకో యణిమాదికసిద్ధు లద్దిరా!" 29

క. అని గాఢసమాశ్లేషం
బున శిష్యుని గారవించి పొంగుచు మదిలో
ననితరసాధ్యాద్వైతా
వనదక్షుం డయ్యె ననుచు స్వాస్థ్యము వడసెన్. 30

శ ర దృ తు వ ర్ణ న ము

క. అంతట మాయ దొలంగి య
నంతానందంబు బ్రహ్మ మగపడినట్టుల్

సంతతజలదచయాప
క్రాంతి నొదవెఁ బుష్పవత్ప్రకాశము మహికిన్. 31

ఆ. నీలకంఠనటనలీలకు భరతవా
క్యముగఁ గమలకుముదకాశసుమవి
కాసమునకు నాంది గాఁ దోఁచె శారద
వేళ పరమశాంతలీల మెఱయ. 32

సీ. విద్యచే విమలమై వెలయుబ్రహ్మముభాతి
శరదాగతి నభంబు స్వచ్ఛ మయ్యె
సదుపదేశముల శిష్యతతని యతులట్ల
తనిపె నోషధుల నబ్దములు నీట
మాయికావరణావసాయనిర్మలబోధ
గతి మేఘముక్తుఁడై గ్రాలె విధుఁడు
మత్సరాదులు వోవ మైత్ర్యాదిగుణముల
ట్లబ్దముల్ దొలఁగఁ బొల్పారె దిక్కు-

గీ. లుదరవర్తి భువనము పద్మోల్లసితము
మత్స్యకూర్మమయంబు సంభ్రాంతచక్రి
మగుచు నర్మద పరమహంసౌఘసేవ్య
మగుట విష్ణుదివ్యాకృతి ననుకరించె. 33

క. చిరసంభృతజీవన మ
బ్ధరములు ద్విజపంక్తి కొసఁగి త్యక్తతటిత్సం
దరులై ఘనవీథి గృహో
త్కరము విడిచి ప్రవ్రజింపఁగాఁ దొడఁగెఁ దమిన్. 34

గీ. కౌముదీభస్మచర్చితగాత్రి యొప్పఁ
జంద్రమండలకరక మాసక్తిఁ దాల్చి

కమ్రబంధూకసుమశాటికను ధరించి
యతివిధంబున శరదనేహస్సు వరలు. 35

క. సంగతహంసము హృతరజ
ముం గతపంకంబు క్షోభముక్తమునై పొ
ల్చెం గాసారాంబువు లొ
య్యం గంభీరంబు శంకరాత్మవిధమునన్. 36

గీ. గగన మింపారె శరదబ్జగణపరీత
మగుచు నుజ్జ్వలభానుబింబాంచిత మయి
గంధసారద్రవాక్తమై కౌస్తుభాంచి
తం బగు మురారివిపులవక్షంబు పోలి. 37

క. సముదూఢహాసు లగుటఁ గం
జములు విరిసి వెలిఁగె యోగసంపత్తిఁ బ్రఫు
ల్లములై యున్ముఖములునై
యమలము లగు మునులయంతరంగముల క్రియన్. 38

గీ. చిగురుటాకులకావు లచ్చుగ ధరించి
ధూళిభూతి నలంది మధువ్రతజప
మాలికలు వృంతకళికాకమండలువులు
పూని యతితౌల్యమును బొందె భూరుహములు. 39

గీ. ప్రావృషేణ్యదినంబులు భవ్యమతులు
ధారణాదుల శ్రవణాదిధర్మములను
గడపి పదపద్మధూళి జగము పవిత్ర
మౌనటు చరింపఁ దొడఁగి రయ్యవసరమున. 40

క. గోవిందయతీంద్రుం డం
తేవసదవతంసు బ్రహ్మనిష్ఠితమతి వి

ద్యావల్లభు శంకరుఁ గని
భావమ్మునఁ బొంగి యిటుల పలికెఁ బ్రీతిన్. 41

గోవిందయతి యనుమతిని శంకరుఁడు కాశికేఁగుట

చ. శరదృతు వేఁగుదెంచెను దిశావలయంబు ప్రసన్న మయ్యె, సం
సరణదవానలాంబుధరజాలము వేదకదంబజంబునై
బెరసినతత్త్వపద్ధతి వివేచనసేసి యెఱుంగుపొంటె స
త్వర మరుగంగదే హరనివాసపురంబగు వారణాసికిన్.

మ. గురుదేవుం డగుగౌడపాదముని నాకుఁ జెప్పె నొక్కప్పు త
చ్చరితంబున్ వివరించెదన్ వినుము వత్సా! తొల్లి ప్రాలేయభూ
ధరమం దత్రిమహర్షి సల్పె నొకసత్రింబున్ మహేంద్రాదికా
మరజుష్టంబుగ; వచ్చె దానిఁ గన బ్రహ్మర్షివ్రజం బర్మిలిన్. 43

క. ఆయెడకున్ గృష్ణద్వై
పాయనముని శిష్యగణసమావృతుఁడై, వి
చ్ఛాయఁగఁ బ్రత్యుత్థాన స
మాయుక్తిని బ్రహ్మసదము పూజ లొనర్చెఁ. 44

మ. ఒనరింపన్ దనివొంది వ్యాసుఁడు సదస్యుండై సభాస్తారు లా
య్యనఁ గోరఁ శ్రుతిమస్తకార్థము లవేలాద్వైతవిజ్ఞానసా
ధనముల్ పెక్కు లుపన్యసించెను సుధాధారామదాహంక్రియా
హననోదారమృదూక్తిసారలహరీవ్యాపార మేపారఁగన్. 45

మ. తమసందేహతమంబు డుల్చువినులాద్వైతార్థసిద్ధాంతచాం
ద్రమసజ్యోతులఁ దాపమాఱుట సభాస్తారుల్ నమస్కారపూ
ర్వముగా నిట్లని రైకకంఠ్యముగ దేవా! నీమహత్త్వం బనూ
హ్యము నారాయణదివ్యమూర్తి వని క్రొందాల్చున్ గద్దేలోకమ్ముల్. 46

ఉ. వేదము లెల్లఁ జిక్కువడ విప్పితి వొప్పుగ భారతంబు న
ష్టాదశ తత్పురాణములు చక్కరచించితి యోగశాస్త్ర ము
త్పాదనసేసినాఁడవు, ప్రభావము సూపితి బ్రహ్మసూత్రని
ష్పాదనమందు లోకహితభావుకభావమునన్ దయానిధీ. 47

గీ. అల్ల సూత్రములకు నేఁడు కల్ల లనక
పలుకుచున్నారు విప్రతిపన్ను లగుచు
బుధతతి యథాయథం బర్థములను రేఁగి
వాని వారించుభాష్య మావశ్యకంబు. 48

చ. అని మను లాడుపల్కులకు వ్యాసమహర్షి వచించె నిట్టు లో
యనఘచరిత్రులార! యిటు లాపర మేశ్వరు సత్సభాంతరం
బున నొకనాఁడు దేవమునిముఖ్యులు వాణినియుంద్రిడి నన్నుఁ గ
న్గొని, యనుకూలకాలము గనంగొన నౌ నని యంటె వారికిన్. 49

వ. అట్లనుటకుఁ గారణం బెద్ది యందు రేని

శా. ఆకర్ణింపుఁడు మానులార యొకరుం డస్మత్సమానుండు సు
శ్లోకుం డూర్జిత శేముషీకుఁ డఖిలజ్ఞుం డుద్భవించున్; సము
ద్రేకం బౌంధుజలంబు కుంభమున నర్థిన్ గ్రోల్చు, గోవింద సు
శ్లోకాంఘ్రిద్వయసేవ సల్పుచును శిష్యుండై న యవ్వేళఁ దాన్.

క. దుర్మతములఁ దూల్చు చతఁడు
శర్మదముగ భాష్యరచన సలిపి గురువరున్
నిర్మలయశోవియద్గం
గోర్మిఘటాడోలలందు నూఁగాడించున్. 52

క. అని సాత్యవతేయుఁడు దాఁ
జనె నను చున్ గౌడపాదసన్ముని యొకనాఁ

డనె యోగసమాధిని నిటు
గనుఁగొంటి నటంచు నిజముగా నేఁ డయ్యెన్. 53

క. అణిమాదిసిద్ధిదూరం
డణుమాత్రము సూత్రసంచయార్థ మెఱుఁగు నై
పుణిఁ గనఁ డనుభావ మ్మా
భణితమ్ములఁ గలదుగాదె పడసితి సిద్ధుల్. 54

గీ. ఇది వశిత్వవిభూతిసు మ్మెనిమిదవది
దాఁటియేడును జిక్కక దొరుక దిద్ది
యరయ నెవ్వాఁడు దొలుదొల్తఁ బొరయ లేఁడు
నీసుకృత మేమొ చిక్కె నెన్మిదియు లీల. 55

క. ఉత్తమపురుషుఁడవై తను
పాత్తోపమ! తత్త్వవిత్ప్రవర! క్రన్నన న
త్యుత్తమ నిబంధరచన జ
గత్తును నీవుద్ధరింపఁగావలెఁ గరుణన్. 56

ఉ. కావున వత్స! పొమ్ము శశిఖండకిరీటుపురంబు కాశికిన్
దేవనదీలలామకమనీయము సు మ్మది, యందు నాద్యయా
దేవత నిన్ననుగ్రహమతిన్ గరుణించును నమ్ము మంచు స
ద్భావముతోడ నానతిడెఁ దత్ప్రియశిష్యున కొజ్జ ప్రేముడిన్. 57

గీ. ఇట్టు లనుశాసన మొనర్చి యెపుడు స్వపర
మానితార్ణకామయమాను శిష్య
దృష్టులఁ బవిత్రుఁ జేయుచుఁ బ్రీతిఁ బుచ్చె
సూరతుం డగు గోవింద సువ్రతుండు. 58

శంకరుఁడు కాశిఁ జేరుట

ఉ. పంకజసన్నిభంబు గురుపాదయుగం బెడఁ బాసియుండఁగా
శంకరుఁ డోర్వలేక నతిసల్పి, మనంబును దత్పదాబ్జ ము

దాం్రకిత మాచరించుకొని యారయు చేఁగెను నీపభూజపా
ళ్యంకితబాహ్యదేశ మయి యాగవిధూమిత మైనకాశికిన్. 59

చ. కనె యతిమాళి తా యుగయుగా లతిఘోరముగా భగీరథా
వనిపతి యాచరించిన తపంబులపంటను, యోగిసేవ్య కుం
జనిచయమంజుతీరమును, జంద్రకళాధర జాటజూట సౌ
మనసవతంసమున్, భువనమాంగళికాంగము, గంగఁజెంగటన్. 60

క. హరినఖమునఁ బొడముటనో
హరమౌళి సుధాంశుసంగమాప్తినొ హిమభూ
ధరశిరమునుండి పడుటనొ
సురనది కనవచ్చె స్ఫటికశుభ్రజలంబై. 61

చ. భ్రమరకలారవంబులను బాడుచునున్నటు మారుతోచ్చల
త్కమలగణమ్ములన్ నటనకౌశలి చూపుచు నున్నయట్లు ఫే
నముల హసించుచున్నటు లనారతసంచలదూర్మిపాణిసం
ఘములఁ గవుంగిలించునటు గాంగఝరం బలరారె నత్తఱిన్. 62

చ. ఒకయెడ స్వర్విలాసినుల యోరలువాఱుకటాక్షకాంతి మే
చక మయి, తద్విభూషణలసద్ద్యుతి నొక్కెడఁ జిత్రితంబునై,
యొకయెడఁ దత్కుచచ్యుతసముజ్జ్వలకుంకుమపంకనైకచ
క్రికములఁ బాటలం బయి, విరాజిలుచుండెను గంగ యెంతయున్.

క. సురసింధుసలిలముల శం
కరుఁడు మునిఁగి తేలె నీలకంఠజటాభ్యం
తర గంగాంబు రయహృతుం
డురుతద్యోగాత్తపుణ్యుఁ డుడుపతి యనఁగన్. 64

గీ. స్వర్ణదీవారిబిందుసంకీర్ణ మగుచు
శంకరునిమూర్తి విలసిల్లెఁ జంద్రకిరణ
బృంద సంపర్క గళదంబుబిందు సుంద
రేందుకాంతాశ్మపుత్రికచంద మొంది. 65

క. హరిముఖసురనుతకాశీ
శ్వర పదయుగళంబు నచలభక్తిఁ గొలుచు చా
పురిఁ గొన్నా ళ్లుండెను శం
కరుఁడు ప్రయతచిత్తుఁడై సుఖస్థితి వెలయన్. 66

సనందనుఁడు శిష్యుఁ డగుట

ఉ. అంతట నొక్కనాఁ డొకధరామరబాలుఁ డధీతవేదుఁ డ
శ్రాంతమహాస్నమేతుఁడు విరక్తుఁ డదారపరిగ్రహుండు దు
ర్దాంతభవాతిఘోరజలరాశి తితీర్షను వచ్చి తత్పదా
బ్జాంతికమందు వ్రాలె “నిడుమా కరుణాప్లవ” మంచు వేడుచున్.

ఉ. వ్రాలఁగ నత్తి విప్రగురువర్యుఁడు వల్కె నెవండ వోయి? యిం
దే లరుదెంతు? వెందు వసియించెద వింతటిధైర్య మేలొకో!
బాలుఁడ వయ్యుఁ దోఁచెద వబాలునిలీల నొకండ వయ్యు వే
రేల యనేకు లట్లగుదు నైకతనుప్రియభావ మొప్పఁగన్. 68

గీ. అనుడు ద్విజపుత్త్రుఁ డనె-ననఘాత్మ! హరిప
దాబ్జభక్తిహేతూదక యగు కవేర
జాతటిని వాఱు సస్యవిస్తరము పొదలు
చోళదేశము వాసము క్షోణిసురుఁడ. 69

గీ. పూజ్యులను గాంచ దేశ మామూల మే న
టాట్యమానుండనై వత్తునయ్య యిటకు

సంసృతిపయోధి మున్గఁ ద్రాసంబు గంటి
మనువుమా దేవ! తత్పారగుని నొనర్చి. 70

క. అమృతఝురభంగతుంగము
లమలాపాంగములు వఱపి యార్తుని నను గా
వుము నాగుణదోషవిమ
ర్శమునఁ జెడుఁ "గృపాబ్ధి" వనుయశం బిఁక జగతిన్. 71

మ. నను రక్షించిన 'దీనబంధు' వనుమన్ బ్రఖ్యాతి చేకూడురీ
తిని శ్రీమంతుని బ్రోవ నీ కెటుల సిద్ధించున్? మనుజశ్రేణియం
దున వర్ణింప ఘనుండు సాధుజననుత్యుం డౌ క్రియన్ నూఱుహా
యనముల్ దాఁ గురియన్ బయోధివినుతుం డౌ నా త్రిలోకీగురూ!

మ. భవదీయామలవాఙ్మయామృతసరస్వత్సారసాంచజ్ఝరీ
భవరుచ్యాంబుల నాడునా మతి 'స్ఫురత్పంచేషునిర్వ్యంచితం
బవమం బాత్మహితజ్ఞతారహిత' మం చావారిజాతోద్భవం
బవువిశ్వంబు విలోకమున్ సలుపుకొం చాటాడుతన్ స్వేచ్ఛమై. 73

ఉ. ఆతతభానువాసము హిమాంశుపురంబు మహేంద్రుధామమున్
వాత కుబేర వహ్నిసదనంబులు బ్రహ్మజగంబు నేని య
ద్వైతమతంబు త్వద్వచనపక్కి నెఱుంగు విశుద్ధబుద్ధికిన్
ఖ్యాతవిరక్తిఘాతుకముఁ గౌతుకమున్ ఘటియింపఁజాలు నే. 74

ఉ. ఐహికయోషిదాదివిషయంబు లిసీ విషవల్లికాఫల
వ్యూహము లౌటఁ గౌతుకము నూన్పవు మా కెపుడున్ మనోజ్ఞరం
భాహృదయంగమోరుకుచపాళ్యుపగూహనసౌఖ్యహేతుస
మ్మోహనశక్రలోక మది పుణ్యమయయ్యు నగణ్యమే సుమీ. 75

క. వైరించపదం బేనియుఁ
గోర నికఁ జకోరచంచుకుట్టితపూర్ణా

ఙ్గారిగళదమృతధారాం
కూర మగు భవన్నవోక్తిఁ గోరుదు దేవా! 76

సీ. వాంఛింతు దేవ! ద్వ్యావాభూములందు శి
వంకరం బౌట నీపాదపూజ
ప్రార్థింతు నవయశఃపరిస్తావసావస్తి
కం బౌట నీదు కైంకర్య మెలమిఁ
గాంక్షింతుఁ బాగ్భవాఖండతపఃపచే
లిమఫలం బౌట నీ కమిత సేవ
నభిలషించెదను దీనాఢ్యంకరణ మౌట
యుష్మదీయపదాంబుజోపచర్య

గీ. మలినసంసృతివైరాయమాణము సక
లాధిముష్టింధయమ్ము నీయంఘ్రిసేవ
యబ్బుచో నలంకర్మీణమై ప్రసితము
నై మదీయమనంబు చెల్వాయుఁగాదె. 77

ఉ. క్షోభముఁ గూర్చుసంసరణఘోరరుజన్ శమియింపఁజేయ ని
న్నే భజియింతు వెజ్జులకు నెల్లను వెజ్జనుచుఁ 'భిషక్తమం
త్వా భిషజం శృణోమి' యని వైదికవాగ్వినుతప్రభావుఁ డౌ
నాభవు నూతనావతరణాకృతి వీవ కదయ్య దేవరా! 78

గీ. అని నుతించెడు ద్విజకుమారునకు దయ మ
హాత్ముఁ డతఁ డిచ్చెఁ బారమహంస్యపదము
నతనినె సనందనాహ్వాయఖ్యాతశంక
రాదిశిష్యుఁడుగా మహితాత్ము లందు. 79

ఉ. ఆతరిము మీఱఁ సంసృతిభయంకరవార్ధి తరింపఁ గోరి సాం
యాత్రికుఁ డీవ వైౖ 'మనువుమా' యని చేరినవానిఁ బుణ్యచా

రిత్రిని నుత్తమాశ్రమతరిసమధిష్ఠితుఁ జేసి సత్కృపా
రిత్రముఁ బట్టి త్రిప్పుచు దరిన్ గురుచంద్రుఁడు చేర్చెఁ జల్లఁగన్.

గీ. మఱియుఁ బెక్కురు దేవతాంశములఁబుట్టి
నటుల తేజస్వులగువార లా యతీంద్రు
శిష్యతను బొంది రా మహాక్షేత్రమునఁ ద
మంతట విరక్తు లయ్యె లోకానుగతిని. 81

శా. మౌనవ్యాఖ్యను బ్రహ్మతత్త్వ మెఱిఁగింపన్ వామదేవాది స
న్మౌనుల్ శంకలు వాసి శిష్యు లయి సంభావింతు రేదేవు, నా
జ్ఞానానందమయుండె శిష్యజనరక్షాదీక్ష మర్త్యాకృతిన్
బూనన్ శిష్యతఁ గాంచి కొల్చెదరు ధన్యుల్ వేవు రుత్సాహులై.

మ. పురుషార్థార్థుల సాధుశబ్దములనే భోగీంద్రుఁ డానందని
ర్భరులన్ జేయును, గల్పితార్థముల సంభావించు వాల్మీకి, తాఁ
జిరకాలార్థద దీర్ఘసూత్రసరణిన్ జిక్కొన్చు వ్యాసుండు, శం
కరుఁ డింపారఁ గృతార్థులన్ సలుపు శీఘ్రం బక్షయార్థంబులన్. 83

క. ఆతని హరిసమమహిమా
స్తోతు నుపాసించి తన్మహిమ వక్రపథ
స్ఫీతనిజమతులు సాధువు
లై తనరఁ దలిర్త్రు కాశికావాసిజనుల్. 84

గీ. భానుమండలములఁ జండభానునట్లు
విబుధగమిఁ బారిజాతభూమిరుహ మట్లు
నేత్రకమలమ్ములను వృత్రశత్రునట్లు
శిష్యతతి శంకరుండు రంజిల్లుచుండె. 85

శివుఁడు మాలనిరూపమున శంకరుని బరీక్షించుట

క. అటువలె శుశ్రూషాలం
పటు లగుశిష్యులను గూడి మహితుఁ డతఁడు త
త్పుటభేదనమున నుండఁగ
నట నొకదివసమునఁ బ్రాహ్ణ మపసరిలంగన్. 86

సీ. ఆకాశపురవైరి యలికనేత్రాగ్ని క
ణము లట్లు తపనోపలములు వెలిఁగె
మాయిమై రవి త్రిప్పి మణిభూగతాంశు పిం
ఛము మరీచినదీర్ఘురము స్పృశించె
నంబుజమండమధ్యంబునందుఁ గుటుంబ
సహితంబు కలహంససమితి డాఁగె
వారిమధ్యాభిగత్వరములై మీనమ్ము
లతినిశ్చలత నిల్చి యూడఁదొడఁగె

గీ. సకలశాకుంతగణము భూజాతకోట
రాంతరశయాళువై మూఁగలట్టు లుండె
బర్హితతి శైలకందరాభ్యంతరముల
నణఁగె నాఁటి కఠోరమధ్యాహ్నవేళ. 87

ఆ. అట్టి మధ్యమాహమం దబ్జకుమఁదర
జఃకషాయ యైనసౌరతటిని
నాహ్నికములు దీర్ప నంతేవసద్యుక్తుఁ
డగుచు శంకరార్యుఁ డరుగువేళ. 88

సీ. కార్మొయి ళ్లలము తొల్కాఱునాఁటి యమాస
నడురేయిరుల నవ్వునల్లమేను
మొల నీలిగోచి యూదలఁ దెలయంపె కు
త్తుక వెండికంటె కాళ్లకున్నుమెట్లు

కలు ద్రావినట్టిమైకము తలకెక్కె నె
త్తురు లొల్కునటులున్న తొగరుకనులు
కేల దుడ్డును బల్కు నాలుక యొదుగమి
దడఁబడుమాటల తప్పుపాట

గీ. తనకు సమరంగఁ గఱకుఁజిందమ్ము లూఁడు
పగిది మొఱఁగుచు నల్వంక బలసి కునుకుఁ
బసగునన్ నాల్గుజాగిలా లరుగుదేర
నంటరానట్టివాఁ డెదురయ్యె నొకఁడు. 89

క. బెదరుచు నడుగులు దడఁబడ
నొదుఁగుచు 'దూరముగఁ దొలఁగు మోరీ' యనుచో
విదవరు శంకరగురుఁ గని
పోదవయ్యా యని జనంగముం డిటు లనియెన్. 90

గీ. అద్వితీయ మంచు ననఘ మంచు నఖండ
మను చనంగ మను చనాది సత్య
బోధసౌఖ్యరూపము నటంచు శ్రుతు లెన్ను
నాత్మ వేఱుసేయు దభ్రమయ్యె. 91

గీ. కేల దండకమండులుల్ గీలుకొల్పి
కావులను దాల్చికొని మాటకారు లగుచు
జ్ఞానగంధంబు లేక వేసాలు పూని
గేస్తులను గొంద ఱిటు మోసగింతు రకట! 92

క. పొ మ్మొడగా ననెదవు దే
హమ్మో దేహియొ తొలంగ నగునట్టిది? భే
ద మ్మెన్నె యన్నమయకో
శమ్ముల కొండొంటి కట్టులె సాక్షులకేనిన్. 93

ఆ. ప్రత్యగాత్మయందు బ్రాహ్మణ శ్వపచ భే
దమ్ము నీకుఁ దలఁపఁ దగునటయ్య?
గంగలోనఁ గల్లుకడవలో బింబించు
నర్యమునకు భేద మనుచుఁ గలదె? 94

గీ. దేహముల నెల్ల వెలుఁగు చదేహుఁ డైన
పూర్ణుని బురాణపురుషుని బుద్ధి మఱచి
యేను శుచి ద్విజుఁడను మాల పీ వటంచు
నేల మిథ్యాగ్రహమ్ము యతీంద్ర! నీకు. 95

గీ. అప్రతర్క్య మనంత మవ్యక్త మాద్య
మమల మగురూపమును విమోహమున మఱచి,
యక్కటా యేన్గుచెవివోలె నస్థిర మగు
దేహమం దెట్లహంత సిద్ధించె నీకు. 96

గీ. ముక్తికిని మార్గ మగువిద్యఁ బొంది కూడఁ
దుచ్ఛ మైనట్టి జనసంగ్రహేచ్ఛ విడువ
వెంతవారు మున్గుదురు మాయికవరుఁ డనఁ
జాలు పరమాత్ముని మహేంద్రజాలమందు. 97

ఆ. అంచుఁ బుల్కసుఁడు వచించిన విని మది
నంచితుండు గురుఁడు సంచలించి,
మించునబ్బురమున ముంచినయవ్వావి
కించుప్రీతి మా ర్గ్వచించె నిట్లు. 98

చ. నొడివితి వయ్య సత్యము తనూభృదనుత్తమ "నీఁడు మాలఁ" డన్
వెడమతిఁ బాసితిన్ బరమవేత్తవు నీవచనంబుఁబట్టి; పా్రి
నుడుల నెఱింగి తన్మననమాత్మవికాసము గాంచి యాత్మయం
దెడఁద ఘటింత్రు గాని బుధులెవ్వరు నేర్వ రభేదభావనన్. 99

క. జగ మెల్లను గనఁబడు నా
త్మగ నేదృఢబుద్ధి కెపు; డతఁడు ద్విజుఁడేనిన్
దగ మాలఁడేని వంద్యుం
డగు నని దృఢనిష్ఠ నాకు ననవరతంబున్. 100

గీ. హరిమొదలు పుత్త్రికావధి పరఁగుదేహు
లందుఁ దోఁచెడు చేతన యగుదు నేన
దృశ్య మెన్నండు కా ననుదృఢమనీష
వాఁడు పుల్కసుఁ డేని నాపాలిగురుఁడు. 101

గీ. తత్త్వదర్శానుభవ మెందుతటి నెటనెట
బోధ ముండునో యది యేన పూర్ణముగ ను
పాధిబాధను మిగిలెడుబోధ మేన
యనుధిషణ గల్గునరుఁడు నా కగును గురుఁడు. 102

చ. అని కనుదోయి మోడ్చి ఘటితాంజలియై క్షమియింప వేఁడున
య్యనఘునిలోనిచూపున సహస్రతటిల్లత లొక్కటన్ దళు
క్కనినట్లై తదంతరమునందు నవేందుకిరీట మొప్పఁ దె
ల్లనిమెయితో శివాకృతి విలాసముగాఁ గననయ్యె నయ్యెడన్. 103

సీ. కాండబరీపూర్ణఘటి భక్తజన దిది
తాస్వధృతామృతకలశంబు గాఁగఁ
గరధృతలగుడ మగ్రిమున ముమ్మొన గల్గి
తళుకొందు శూలాయుధంబు గాఁగ
బలసి తో వచ్చు కుక్కలు తన్నుఁ బొగడ సాం
గము లైననాల్గువేదములు గాఁగ
శిరమునందలి పటచ్చరఖండ మరయుచుం
డఁగ సుధాభానుఖండంబు గాఁగ

గీ. నల్లనగు మేను క్రిమముగా దెల్లవాఱ
నెన్నొసటఁ గన్ను మి న్నంటియున్న పాళి
యమరఁగా సచ్చిదానంద మష్టమూర్తి
మూర్తియై తోఁచె నా దివాకీర్తి యపుడు. 104

క. భయ భక్తి వినయ ధృతి వి
స్మయహర్ష సమేతుఁ డౌచు శంకరుఁడు దయా
మయు దృగ్గోచరు మృత్యుం
జయుఁ బొగడం దొడఁగె స్వప్నసదృశదశాప్తిన్. 105

గీ. దేహదృష్టిని దాసుండ దేవ! నీకు
జీవదృష్టిఁ ద్వదంశమై చెలఁగువాఁడ
నాత్మ దృష్టి నీ వాఁడ సర్వాత్మ యిటుల
శాస్త్రతతిఁ గాంచి మతి వినిశ్చయము గంటి. 106

ఉ. లోకము నిస్తమస్కమగు లోపల వెల్పలఁ గూడ దేనియా
లోకముచేత; ముజ్జగములో నెది పేటిక శాంభముగ్ ఖనిన్
సోఁకకె వెల్గు; నేకతమ చూడ మునుల్ ప్రయతింత్రు దేనికై
యాకమనీయసర్వనిగమాంతవతంసముఁ గొల్తు రత్నమున్. 107

సీ. గహన మాపరతత్త్వ మహహా! దెల్పెడుశాస్త్ర
గురుత లక్షింప నెవ్వరితరంబు;
గురువర్యుకరుణ చేకుఱదేనిఁ జదివిన
యాశాస్త్ర మెల్ల నిరర్థకంబు
జ్ఞానవైభవము లేదేని సంచిత మైన
గురుపాళికృప జలాక్షరము గాదె
పరతత్త్వ మది యలవడదేని జ్ఞానవై
భవము నిరాలంబ మవును దోన

గీ. యట్టి తత్పద స్త్వపద లక్ష్యార్థ మగుచు
ననుపమాద్భుతముల పరమావధి యగు
పరమతత్త్వమునకు నమోవాకముల స
మర్పణ మొనర్తు నాయహంమతి గతింప. 108

చ. అని వినుతించుచున్ ముకుళితాక్షుల రెప్పలసందు లొత్తి కొం
చును బ్రిమదాశ్రువుల్ దొఱఁగఁ జొక్కెడునక్కమనీయమూర్తి కి
ట్లని యలదివ్యతేజమునయందు వెలుంగు కురంగపాణి యా
ననముననుండి పాయస మనర్గ వినవచ్చె మృదూక్తి తియ్యనై. 109

ఆ. అస్మదాదిపదవి నందితి నీతపో
నిష్ఠ కొందితిని గరిష్ఠముదము
వ్యాసమహాసిరీతి నస్మదనుగ్రహ
సారపాత్ర మైతి సద్వరేణ్య. 110

మ. శ్రుతులన్ వే ఱొనరించివ్యాసుఁ డటుపై సూత్రించె బ్రహ్మార్థసం
గత మాగ్రంథముఁ గూలముద్రిజముగాఁ గాణాదసాంఖ్యాది దు
ర్మతముల్ బోరన పెల్లగిల్లి పడ ధర్మ తాత్రితమై; నేఁ డథో
గతి నొందెన్, గలిదుర్విలాసమున నాగ్రంథ మ్మపార్థంబునై. 111

ఆ. మూఢమతులు రెండు మూఁడు వేదోక్తులు
బలముగా గ్రహించి భాష్యములను
గూర్చినారు; వానిఁ గోవిదుల్ పెక్కురు
కడఁకఁ జేసినారు ఖండనమ్ము. 112

గీ. కాన వేదాంతసారవిజ్ఞాత వైన
నీవు తద్దుర్మతముల ఖండించివైచి
సూత్రభాష్య మొనర్పు మచ్చుగను శ్రుత్య
పోద్బలితయుక్తిజాతాభియుక్తముగను. 113

క. తావకమై యనవద్యం
బౌ విశ్రుతభాష్య మిందుఁ జూచి సురలసం
భావన వడసి విధాతృ స
భావరివస్యామహోత్సవము గూడఁ గనున్. 114

గీ. భేదవాద భేదాభేదవాద శైవ
సౌర వైష్ణవ శాక్తాద్యసారమతము
లోడఁబుచ్చి మండనబుధు నోర్చి జగతి
స్థాపన మొనర్పు మద్వైతతత్త్వమతము. 115

ఉ. ఛాత్రుల మోహసంతమసచండమయూఖుల నచ్చటచ్చటన్
ధాత్రిని నిల్పి యద్వయమతప్రథితాత్మవివేకపాలన
క్షేత్రములన్ బొనర్చి కృతకృత్యుఁడవై ననుఁ జేసు దంచు వై
చిత్రి శివుండు కన్మొఱఁగెఁ జెందె గురుండును స్వాస్థ్య మల్లనన్.

క. కని స్వాస్థ్యము నలువలఁకులు
గని లోఁ గనినట్టి నీలగళుఁ గాని, వెలిన్
గనిన ప్లవుఁ గాని కానక
మనమునఁ బరికించు చేటిమార్గము వట్టెన్. 117

ఉ. మాలనిమాటలన్ వినుచు మాన్పడి దేశికుఁ డుండ ధారిణిన్
సోలుచు వ్రాలుశిష్యులుకనుంగవ కల్లన గ్గఁ జేతనా
లీలలు; నల్గగడన్ గనుచు లేచి గురున్ వెనుకొంచు నెండలోఁ
గాళులు గాల గంగ మునుఁగన్ జని రాత్మల నబ్రమొందుచున్.

చ. అటు చనుచున్ గురుండు మనమం దిటు తర్కము సేయఁబూనె ధూ
ర్జటి ననుఁ బట్టి చూడ నపరాధము నాయెడఁ గానరాద, తా
నటు ప్లవుఁడై కనంబడుట యద్వయనీతి కభేదభావనా
పటిమయ మూల మంచుఁ దెలుపన్ దలపోసియొకో విచిత్రమా.

సీ. నీపాలఁబడె భాష్యనిర్మాణ మని గురుం
డాడఁడే నన్నంపునాఁడఁ బ్రీతి
నదిగాక బాదరాయణువాంఛితముగూడ
నస్మదుద్దిష్టమే యని యనండె
వత్తు నీపురికిఁ దత్ప్రణయనార్థముగాదె
పరమపావిత్ర్యసంపత్తిఁ దలఁచి
మఱచినాఁడను శిష్యవరణమ్ములో నని
తలఁచినాఁడొకో యుమాదయితుఁ డాత్మ

గీ. గ్రంథలేఖనమునకుఁ బత్త్రములు గంట
ములును సంసిద్ధపఱుపనో మెలపు మీఱ
నీశ్వరుపరీక్ష కగ్గ మా వేళ కలిగె
నలసత వహింప నావంతయైనఁ గాని. 120

శా. 'అద్వైతార్థసుధారసం బొసఁగుభాష్యంబున్ రచింపంగ రా
గద్వేషాదులఁ బాయఁగావలయు, లక్ష్యజ్ఞాన మీయోగికిన్
విద్వత్సమ్మతిఁ గల్గెఁ గల్గదొ స్వయంవిత్పూర్ణుఁ డం' చెంచి రూ
పద్వంద్వమ్మునఁ గాన వచ్చెనొకొ చెప్పం జాలఁ దల్లీలలన్. 121

ఉ. పాశుపతాస్త్రలబ్ధికిఁ దపం బొనరించుకిరీటిఁ జూడ రాఁ
గా, శబరాకృతిన్ బడయఁగా రణమున్ బచరింపఁ గారణం
బాశివుఁడే యెఱుంగవలె నద్దిర! భక్తులఁ జిక్కుత్రోవలన్
గ్లేశము వెట్టి ప్రోచుటలు లీలలుగా శశిఖండమౌళికిన్. 122

మ. అనుకొంచున్ జనుచున్న దేశికునితో నంతేవసచ్ఛ్రేణి యి
ట్లను దేవా! కన మిట్టిచిత్రము ప్లవం దన్నట్టియమ్మాటలే
వినిపించెన్ దదుపర్యుదంతమును భావింపంగ వైవశ్యమున్
గనుటల్ మూలనిషేకయున్ దెలియఁ దొక్కండేని మాయందులన్,

క. అని కలవరించుశిష్యులు
వెనుకొని రా ననుపదమ్ము విస్మితుఁ డగుచున్
జని మాధ్యాహ్నికవిధి సుర
ధునిఁ దీర్చి మదిని గుని ధూర్జటిఁ గనుచున్. 124

ఆ. నిశ్చయించుకొనియె నిఖిలజగద్ధిత
మ్ముగ రచింప భాష్యమును గడంగి
విశ్వనాథుకరుణ వెల్లివాఱుటఁ జేసి
కరతలామలకము కరణిఁ దోఁచె. 125

శంకరుఁడు బదరికాశ్రమమున కేఁగుట

ఉ. అంబుజకుట్మలాంతరసమగ్రనిరోధము వాసి యేఁగు రో
లంబముకైవడిన్ యతిలలాముఁ డతం డవిముక్తపట్టనం
బ్రింబును వీడి హర్షసముదంచితుఁ డై వెడలెన్ బ్రసిద్ధమా
ర్గంబున వేడ్కమై బదరికావనసీమకు శిష్యయుక్తుఁ డై. 126

గీ. అరుగుచుండె నద్వైతవిద్యాభిరూప
సార్వభౌముం డటం చస్త్రశైల మూనెఁ
జంద్రబింబాతపత్త్రి, మాశాలతాంగి
చామరము దాలిచెను బ్రికాశచ్ఛలమున. 127

క. 'దేవనరులకును శాంతం
బై వరలెడి నత్త్రాశ' యను శ్రుతిసూక్తిన్
దోవన్ గల తీర్థములన్
సేవించుచు బదరికావనికిఁ జనఁజొచ్చెన్. 128

చ. ఒకయెడ నుష్ణపూర్ణమయి యొక్కెడ దారుణశీతలంబు నై
యొకయెడ నూటియై మఱియు నొక్కెడ వక్రమునై సకంటకర్మ

శీలనంబున నవివేకధ్వంస మొనర్చి సకలజనుల విరక్తుల నొనర్పం జాలు నుపదేశసాహస్రికా ద్యనేకగ్రంథంబుల నయ్యతీంద్రుండు సంగ్రథించుకొనె. మరల కాశికిం జనుదెంచె.

గీ. శంకరార్యార్కుఁ డుదయించి జగతి వెలుఁగ
బళిర! దుర్వాదిచంద్రప్రభాయుతమ్ము
కుమతికృత దుర్నివరణాంధత మసపటలి
నామరూపమ్ము లొందకుండఁగ నశించె. 135

సనందనుఁడు పద్మపాదుఁ డగుట

గీ. పరులతర్కమ్ము లరుణతరుణకిరణ
సమితి శరనిధివలె నశోష్య మగునైజ
భాష్య మెల్ల నధ్యాపించెఁ బరమవినయ
నిధు లగువినేయులను యథావిధి నతండు. 136

సీ. అట్టుల శిష్యచిత్తాంబుజార్యముఁ డగు
శంకరార్యుని శిష్యసమితియందు
శమపూర్వగుణములఁ బ్రముఖతఁ గని సనం
దనుఁడాది కొంద ఱయ్యనఘునొద్ద
భాష్యములను బఠింపఁ దొడంగి రందు స
నందనుఁ డాశ్రిపు లందరాని
యద్భుతవినయ మొప్పార నిజశ్రుతి
విని గహనార్థవివిత్సఁ జేసి

గీ. మరలఁ బఠియింపఁ గోర, శంకరుఁడు నిజప
దాబ్జ నిరుపమభక్తుని నతని నుపని
షద్రహస్యార్థకోశ మాస్వకృతకోశ
మెలమి ముమ్మాఱు చదివించె నెల్లదియును. 137

ఉ. చీటికి మాటికిన్ బ్రథమశిష్యు సనందనుఁ బిల్చుఁ, బిల్చి ధీ
పాటవ మొప్ప భాష్యములపట్ల రహస్యములన్ వచించు; మి
న్నేటికి స్నానమాడఁ జని యించుక నిల్చినఁ దోడి తేర న
ప్పాటన యున్న శిష్యులను బంపును తాఁ జనుఁ గొన్ని వేళలన్. 138

ఉ. అల్ల సనందనుండు గురునాజ్ఞను వహ్ని భరించి రేవగల్
వల్లె యొనర్చుపాఠములవంక జనించెడి సంశయంబు ల
ల్లల్లన యొజ్జకున్ దెలిపి యందు యథార్థ మెఱింగికొంచు రం
జిల్లు సతీర్థ్యు లీరసముచే నుడుకన్ మనమందు నిచ్చలున్. 139

ఆ. బుద్ధిశాలి శిష్యుఁ బుత్త్రసికం బొను
గూర్మి నాదరింత్రు గురువు లెపుడు
బుద్ధి గలుగ దంచుఁ బాగులక మూర్ఖుండు
గలుగువానిఘనత కలుగుచుండు. 140

సీ. అది యేమి మనకంటె నాసనందనుఁ డూడి
పడినాఁడె యని యీర్ష్యఁ బలుకువారు
నాపాటిశుశ్రూష యహరహంబును మన
మొనరింపకున్నామె యనెడువారు
సకలభూతసమత్వసంపన్నుఁ డగుగురుఁ
డిటు జేయఁదగ దంచు నెంచువారు
నెంతవాఁ డైన నే మిది సాక్షి పాక్షిక
బుద్ధి కం చేమేమొ మూల్గువారు

గీ. నగుచు నీర్ష్యాభరాకులస్వాంతు లగుచు
నొక్కకొన్నాళ్ళు లోలోన నుడికి యుడికి
కుమిలి కుమిలి రవుల్కొని గురుని దూఱఁ
జాల కూరక యుండిరి తచ్ఛాత్త్రగణము. 141

ఆ. అది యెఱింగి యొజ్జ "యదసీయభక్తిఁ జూ
పెదను వీరి" కనుచు నదనుకొఱకు
నరయుచుండి యొక్కతఱి సనందనుఁ డభ్రి
గంగ కవలిదరి మెలంగుచుండ. 142

ఉ. కాంచి లభించె మంచియవకాశమురా యని యో సనందనా!
యంచును జీర 'నో' యనుచు నద్దరి నుండి యతండు వల్క 'ర'
మ్మంచు గురుం డనంగ నరయం బరుదే నిటు నట్టు నావకై
యంచెలఁ గాంచి యేది నరయంబడకున్న నతండు ధీయుఁడై. 143

ఉ. అంతటిఘోరసంసృతిమహాజలరాశిఁ దరింపఁజేసి యొ
క్కింతతరంగిణిన్ గడపదే గురుభక్త్యుడుపం బటంచు ని
శ్చింతమనస్కుఁడౌచు నునిచెన్ బదమున్ గయిమోడ్చి గాంగపూ
రాంతరమందు 'జా గురువరా' యనుచున్ భువి ముంచుకై వడిన్.

కం. పద మట్లుంచెడునచ్చోట
నుదితంబై కమల మొకటి యుండుట గని స
మ్మదమున గురు ధ్యానించుచు
ముదమునఁ బద ముంచి నిలిచె భువి నిలుచుగతిన్. 145

ఉ. రెండవపాద మెత్తఁగ ఝరిణి దనయంతన పుండరీక మిం
కొం డుదయించె దానఁ బద మూనె; నిటుల్ తటినీజలంబులం
దుండి తమంతఁ దా మనుపదోచ్చలనంబునఁ దోఁచుతమ్ము లా
తం డవలీల మెట్టుచు ద్రుతంబుగ నేఁగఁదొడంగె గంగలోన్. 146

సీ. పుష్పాంతరమునకుఁ బోవుతుమ్మెదమాడ్కి
జలజాంతరమునందుఁ జరణ ముంచు
డోలికాకేలికాందోళితుండును బోలెఁ
గమలమ్ముతో బాటు గాలి కూఁగుఁ

బుసుపరూపము దాల్చుసరసిజాలయవోలె
నలవోక నొకకంజమందు నిల్చు
నేకాసనం బూనులోకేశుఁడట్లొక
సితసరోజమున నాసీనుఁ డగును

గీ. అనుపదం బబ్రి మొందుచు నతఁడు గురుకృ
పాత్త లఘిమవిభూతి మహత్త్వమునను,
దేఁటికంటె వాయువుకంటె దేలిక యయి
పద్మవీథిని జని గురువరుని జేరె. 147

ఉ. తామరసాంతరంబులఁ బదంబు క్రమంబున మోపి వచ్చును
ద్దామనిజాంఘ్రిభక్తిపరతంత్రుని శిష్యుని గౌఁగిలించి పూ
ర్ణామలయోగసిద్ధి దెలియం గురుచంద్రుడు 'పద్మపాదుఁ' డన్
నామమునన్ బహూకృతు నొనర్చెను ఆపడి శిష్య లారయన్.

వ. నాఁడాదిగ శిష్యు లందఱును భయభక్తులు మీఱఁ బద్మపాదునెడను గురువరేణ్యునెడను ననన్యసామాన్యవిశ్వాసమ్ము గలిగి గొలుచుచుఁ బ్రస్థానత్రయ మధ్యయనించుచుండు రట్టియెడ. 149

పాశుపత మతనిరాసము

మ. అనవద్యం బగునాత్మవిద్య నిటు లధ్యాపించు నాశంకరుఁ
గని తత్త్వజ్ఞసదంబునం గలకసద్గర్వుల్ వివేకదుర్దు
ర్వ్యనవహ్నుల్ కుమతస్థపాశుపతు లొప్పన్ జేయునాక్షేపముల్
విని యాచార్యుఁడు తద్వికల్పనములన్ వేదోక్తులన్ దూలిచెన్.150

క. అటు దూలిచి తద్గర్వ
స్ఫటి యొకయించుక సడల్చి పటుతరయుక్తి
స్ఫుటము లగుతదాగమములఁ
జటులత మథియించె నీరసంపదునట్టుల్. 151

ఆ. అద్వితీయనిరత యగునీశసమత యె
ట్లగును ముక్తి? భేద మమరి యుండ
ధ్యానజన్య మాట నది నశింపదె? భావ
కార్యములకు నిత్యకలన గలదె? 152

సీ. అవయవహీనంబు లగుగుణంబులకు సం
క్రమము గల్గక యుండుఁ; గాన మోక్ష
దశ నీపశువులందుఁ బశుపతిగుణసంక్ర
మము గల్గునను టసమంజసమ్ము
వనజగంధము వాయువునఁబోలె నియ్యాత్మ
నమరు నీశ్వరుగుణం బనుట పొసఁగ
దల గంధసమవాయి యనిలాప్తి నొసఁగుగం
ధజ్ఞాన, మున్నె వాతమునఁ దావి?

గీ. ముక్తులం జెందు శివుగుణంబు లన నేక
దేశులో కృత్స్నములో యవ్వి తెలుపవలదె
తొంటిపక్షానఁ బూర్వోక్తదోష మబ్బు
నబ్బు శివున కజ్ఞత్వాదు లవలిదాన. 153

మ. అని యి ట్లయ్యతిమౌళి వజ్రకఠినం బౌతర్కపాళిన్ విరో
ధి నిహీనార్థము లెల్లఁ గూల్పఁ స్మయవృద్ధిన్ బండితంమన్యులై
మను నాతాంత్రికు లెల్ల వీడిరి - గరుత్మత్పక్ష ఘాతాతిపా
తన శీర్యత్ఫణనిర్వమ ద్గరళ ఘూర్ణ వ్యాళసంకాశులై. 154

శా. మానిస్తుత్యుఁ డతండు శేషఫణికిన్ మందాక్షమున్ గూర్చె వ్యా
ఖ్యానైపుణ్యమునన్; దనర్చె బహుశిష్యస్వాంతకంజార్కుఁడై,
జానొందించె యశస్సుమాళి జగమున్, శార్దూలవిక్రీడితం
బూనన్ వాదిమృగప్రపంచము నెడన్ బ్రోద్యత్పరాక్రాంతిమై.

క. తతనిగమాంతారణ్య వి
హృతియై యతినిశిత యుక్తి పృథునఖదంష్ట్రా
తతియై యతిమృగపతి దు
ర్మతవాదిద్విపభయంకరత వెలుఁగొందెన్. 156

సీ. బాలుఁ డయ్యు నమానుషశీల మగు ప్ర
భావమున మించునయ్యతిపతిని గాశి
నగరవాసులు విస్మయానంత్య మెనసి
వినుతి సలిపి రిటుల్ భక్తికొనలు నిగుడ. 157

కాశీవాసులు శంకరు నుతించుట

గీ. పలుగతుల సర్వతంత్రముల్ వెలువరించు
నిమ్మహాత్ముచేత ధిక్కరణమ్ము వడసి
భేదవాది భేదాభేదవాది ముఖ్య
మతనదీష్ణులు సతత మున్మూలిక గొంద్రు. 158

ఆ. వీని యాత్మనిష్ఠ కానందమున మున్గి
యంగజారి దోఁచి యాగమాంత
సూత్రభాష్యరచన సొరిదిఁ గావింపఁ జో
దన మొనర్చెనంట ధన్యుఁ డితఁడు. 159

చ. అనఘుఁడు వ్యాసమౌని మను పర్థి జరద్గవిఁ బట్టి దుర్విలో
కన తిమిరస్ఫుర త్కుమతకర్దమమగ్న సముద్ధరించెఁ, ద
త్తనువును భాష్యసూక్త్యమృతధారలఁ జిల్కి యపంకఁ జేసెఁ బె
ల్చన శ్రితలోకశంకరుఁడు శంకరుఁ డాదర మూఁది యిత్తఱిన్. 160

శా. త్రైలోక్యం బెది యిచ్చుకర్మఫలదుగ్ధం బానునో హాయిగాఁ
గ్రోలున్ బ్రాజ్యసవప్రవృద్ధతర విప్రస్థానమం దెద్ది? యా

శ్రీలం బొగవిఁ దర్కపంకమున దుశ్శీలు ర్వడంద్రోయ స
చ్ఛీలుం డయ్యతి భాష్యసూక్త్యమృతవృష్టిం జేసె నిష్పంకగన్161

సీ. బ్రహ్మేతరంబు సర్వము మిథ్య" యనె నంచు
నలిగి కొందఱు క్రూరు లయి తఱుమఁగ
నిగమకర్మ నియోజ్యునిం గొల్వఁదగిన ది
య్యది యంచుఁ గొంద ఱత్యార్తిఁ గుడుప
నర్థచౌర్యమును నర్థాభాసమును బూను
పరులు గొంద ఱొనర్ప వంచనంబు
పరిపరిగతులఁ గొందఱు స్వరూపస్వభా
వము లెఱుంగకయ హాస్యము నొనర్పఁ

గీ. బెద్దయుం బ్రొద్దు దిక్కు కాన్పింప కల్ల
లాడిపోయిన యుపనిషదబల నేఁడు
శంకరార్యాశ్రియంబు నిశ్శంక మెనసి
యనుపమానందరసలాభ మందఁ గల్గె. 162

ఉ. క్రొమ్ముడి వట్టి రాజసభకున్ వడి నీడ్వఁగ దుస్ససేనుఁ డు
చ్ఛమ్ముగ దిక్కులే కడలుసాధ్వని ద్రోవది శౌరి గాచిన
ట్లిమ్మెఱ భేదవాదిజను లీఁచఁగఁ గుందుత్రయీలతాంగి దుః
ఖమ్ము దొలంచి కాచెను జగద్ధితబుద్ధి నితండు బాపురే. 163

మ. కవితానర్గళనీరపూరముల సద్గ్రంథాచ్ఛగంధంబులన్
శ్రవణానందవచోవిభూషల, స్మృతిప్రప్రోక్తిదీపాళి దు
ష్టవచఃఖండనమండనమ్ములఁ బరేచ్ఛాపూర్తిహారంబులన్
మివులన్ బూజ నొనర్చు శంకరుఁడు వాణిన్ మందబందీకృతన్.164

సీ. త్రుంచివేయంగ బౌద్ధుం డెంచి వెన్నంటి
ధావింప నెట్టెట్టొ తప్పి బ్రిదికె

నతికష్టమ:నను గణాదుచే స్వాత్మలా
భము గాంచి యొకయింత భయము వాసె
మార్గమాత్రమ్ము కౌమారిలాదులు నూప
నిజపదగమనంబు నేర్చెఁ గొంత
సాంఖ్యు లార్తిని బాప సదయు లన్యులు ప్రాణ
ధారణావ్రతఁ గూర్ప ధైర్య మొనసె
గీ. నిటుల వెతగూరి గతిమాలి కటకటఁబడి
యెట్టకేలకుఁ దేఱుకొన్నట్టిపురుషుఁ
జేసెను, బరేశునిగఁ గృపాసేచనమున
శంకరుఁడు విశ్వలోకశుభంకరుండు. 165

సీ. ఒకరు భూతగ్రస్తు నకట దేవుని గాంచఁ
జాలక లేఁ డంచుఁ జాటినారు
కొంచియు క్షణికవిజ్ఞాను లొట నొకళ్లు
'లస్తి' యంచన విభీతాత్ము లైరి
భూతమాత్రవియుక్తుఁడై తనర్చును దేవుఁ
డని నిర్ణయించిరి యంత నొక్క-
రఖిలభూతములు గుణావళి వాసి యొ
ప్పారుచుండును దేవుఁ డనిరి గొంద
గీ. అంతియే కాని యందొక్క-రైన భూత
చయమున కసత్త విధియింపఁ జాలకునికి
భయపడెడుబ్రహ్మ కొసఁగె నభయము భూత
సత్త విధ్వంస మొనరించి శంకరుండు. 166

మ. మును చార్వాకులు నిహ్నవించిరి; మృషాభూతాకృతిఁ గూర్చియా
త్మను గాణాదులు డాఁచి; రాపయి బలాత్కారమ్ము చేతన్ నియో
జ్యుని గావించెఁ గుమారిలుం, డమలు సాంఖ్యుల్ తత్ప్రధానాత్ముఁ జే
సిరవా, రాత్మని శంకరుండు నొనరించెన్ నేఁడు సర్వేశ్వరున్. 167

ఉ. పూలును బండ్లు గాడ్పులు సుపర్వభూజలతావితతిన్ హసింపఁగాఁ
జాలి శుభంబు భాష్య మగుశాంకరభాష్యముసూక్తులన్ గనన్
జాలినవారి కన్వయగుణంబులశూన్యములై సరస్వతీ
ఫాలతలాశుభాక్షరనిభంబులు దుర్వృత్తుల్ రచించునే. 168

ఉ. మారకిరాతతీక్ష్ణశర మర్దననిర్దళితాత్మ ధైర్య లా
వారల కల్పితంబులు నబంధహారంబులు నైనగ్రంథముల్
ధీరుఁ డెవండు కాంచు నొకతేప జగద్గురువర్యవక్త్రని
స్సారితశుంభదద్వయవిచారణధోరణి శుద్ధుఁ డైనచోన్. 169

చ. అమృతఝరీమదాపహర మాయతిశేఖరు సత్ప్రణీతితో
సమముగ గ్రంథముల్ రచనసల్ప నిబద్ధ యెవండు పూనెనే
ని మృడకిరీటకోటి తటినీచటులోర్మిలతుల్య మాతరం
గము లుపశల్యకుల్య కడఁకన్ సృజియింపఁ గడంగ కుండునే. 170

గీ. పేదరాలికై బంగార మేది కురిసె
నహహా! యెది యుమాసౌందర్యలహరిఁ గూర్చె
శివభుజంగము భయహారిఁ జేసె నెద్ది
యట్టికవివరు వాగ్ధార హర్ష మిడదె. 171

మ. మృదువాగ్ధారలు కల్పసూనలహరుల్ హృద్యైతదీయార్థసం
పద చింతామణిరుగ్ఝరీగుణనికావారంబు వ్యంగ్యంపుసం
పద స్వర్ధేనుపయస్తరంగములు గా భవ్యస్వకావ్యంబులన్
ద్రిదివంబున్ సృజియించె శంకరుఁడు, సంక్రీడింప నందున్ బుధుల్.

శా. రంభాపక్వఫలాభముల్ నుడువు, లర్థంబుల్ శ్రీమధ్వంససం
రంభంబుల్, మృదువైనవ్యంగ్యము సుధామాధుర్యసాధీయమా
సంభావింపఁగ శంకరార్యరచితాంచత్కావ్యగవ్యంబులం
దుం భాసిల్లెడునొక్క పద్యమె కవిస్తోమంబు రంజించు దాన్. 173

ఉ. వేత్త్రృమనోహరంబు కురువిందనవాంకురతుల్యమైన వా
గ్వృత్తుల కంజపుంజబిలవిచ్యవమాన మరందధారకున్
బొత్తగు నర్థరాశి సురభూజపుఁబూవల పూనువ్యంగ్యసం
పత్తిని మోదమిచ్చు నతిభవ్యము లాయతివర్యకావ్యముల్. 174

మ. యతిచంద్రోద్ధృతమూత్రియీశిఖరభాష్యం బట్టిమాహాత్మ్యసం
భృత మూర్టఁ విని స్వర్ధునీతటగతుల్ విద్వాంను లబ్జాంఘ్రి ప
ద్ధతి గొంచున్ శలభంబు లగ్గిఁ బడు చందం బొంది గర్వావిశ
న్మతి ఖండింపఁగ నెంచి రీసునఁ దలంపన్ లేక భావ్యర్థమున్. 175

క. ఒరసిన నఱికినఁ గాల్చినఁ
బరమావధి వన్నెఁ గాంచుబంగ రటు, రిపుల్
తఱచినకొలంది రంజిలఁ
దొరఁకొనె శంకరునిసత్కృతుల్ భాష్యంబుల్. 176

గీ. శంకరక్షీరవారాశి జనన మొంది
భాష్యశశి యమృతము బుధావళి కొసఁగుచు
నణఁచెఁ దనగోతతులఁ గుమతాంధకార
మవనిసురహృచ్చకోరచయంబుఁ దనిపె. 177

గీ. మహి ననాదివాక్సాగరమంథనమునఁ
బొడమి ధిక్కృతరిపు లగుబుధులు గ్రోల
నను వగుయతీంద్రచంద్రు భాష్యామృత మజ
రామరత్వం బొసంగుచుఁ గొమిగిలె. 178

క. యమిపతిరవి భాష్యద్యుతి
తమ మడఁచుచు సుజనహృదయతామరసవికా
సముసేయుచు నహితదివాం
ధములకు వ్యథ నొసఁగుచును నతంద్రిత మెఱయున్. 179

ఆ. న్యాయమంథమంథనమ్మున నాగమాం
బుధిని భాష్యనూత్నసుధ జనించి
శ్రవణమాత్రమున నొసంగుఁ దా నమృతత్వ
మఖిలవిబుధజనుల కద్భుతముగ. 180

గీ. కమలనాభునిపదమునఁ గలిగె గంగ
భాష్యసూక్తి శంకరముఖాబ్జమునఁ బొడమె
గనఁగ నొక్కటి తనవారి జనుల ముంచు
మగ్నులను దేల్చు నొకఁ డింతమాత్ర వాసి. 181

శా. వ్యాసుం డమ్మఁగఁ జూపె సూత్రకలితన్యాయౌఘరత్నంబు, ల
ర్థాసంపన్నత నాఁ డొకండు గొన రారా సూరు, లీనాఁ డనా
యాసం బయ్యవి దాల్పనే తొడఁగి రర్థావాప్తి విద్వాంసు, లా
వ్యాసుం డొందెఁ గృతార్థతన్, యతిలలామౌదార్యమూలంబునన్.

సీ. సకలపండితలోకజన్మసహస్రసం
పాదితాపారతపఃఫలంబు
శ్రుతిసరోరుహదళాయతలోచనాబృంద
క్లప్తధమ్మిల్లమల్లీస్రజంబు
శుభదవైయాసికసూత్రసుందరమధు
రోద్గతాగణ్యపుణ్యోదయంబు
భారతీచిరభోగ్యభాగ్యవైభవవిస్త
రాయతామూల్యకోశాలయంబు

గీ. నయిన శంకరభగవత్పాదార్యరచిత
భాష్యమును గ్రోలుభాగ్యంబు పడయువారు
భావికాలజనుర్వ్యథాపాయ మొడలి
మోక్షలక్ష్మిస్వయంగ్రహమ్మున సుఖింత్రు. 183

మ. శ్రుతివారాంనిధిమందరాద్రి యగు భిక్షుగ్రామణీగ్రంథప
ద్ధతి- యానందమునన్ బరావరవిదుల్ తన్పొందఁగాఁజేసి దు
ర్మతదుశ్ఛేదతమంబునన్ గనులు వోఁ బ్రాల్మాలు నవ్వారికిన్
స్మృతి నింధానము లై నతర్కఖరరోచిర్దీప్తులన్ జూపుఁ దాన్. 184

సీ. సీతామనోహరు సేతువుచే ద్వైత
ముదిరి గన్న సముద్రభూమిదాఁకఁ
జివ్వన రుద్రుండు తివ్వంగ వంగిన
శృంగముల్ గలమేరుశిఖరిదాఁక
నహరహ మ్మర్కాదు లగుగ్రహమ్ములు పుట్టు
పురుటి ల్లుదయభూమిధరముదాఁకఁ
నపరదిక్కున వరుణాలయవప్రి మ
ట్లలరు నస్తాద్రియవ్వలనుదాఁకఁ
గీ. గేలి సలుపు నిరాఘాటలీల లొప్పఁ
జతురుదధిమేఖలాపరిష్కృతిఁ దనర్చు
నుర్వి శ్రీశంకరార్యసముద్ధృత మగు
బ్రహ్మవిద్య యద్వైతాపవర్గపద్య. 185

వ. అని.

క. ఇటు కాశీపురజనములు
పటుగతి శంకరువిరక్తి పాండిత్యయశో
నటనములు నుతింపఁగ న
క్కటకమె కా దఖిలదిశలు గ్రమ్మె మెఱుపటుల్. 186

వృద్ధబ్రాహ్మణుఁ డయి వ్యాసుఁడు శంకరుని బరీక్షించుట

గీ. ఆ యతీంద్రుఁడు పటుదీక్ష నభ్రతటిని
యంచితకమునందు సూత్రభాష్యమ్ము శిష్య

తతికి శంకాపహముగ బోధ మొనర్చు
చుండఁ గొన్నాళ్లు గడవంగ నొక్కనాఁడు. 187

క. ప్రాతర్వేళన మేల్కని
స్నాతుం డయి నిత్యకృత్యసమవాయకృతి
ప్రీతుండయి యొకవటమహీ
జాతముక్రిందీడ గురుఁడు ఛాత్రులతోడన్. 188

గీ. దర్భవిష్టరములను బ్రత్యగ్రపల్ల
వాస్తరణములఁ గూర్చుండి యలఘుపూర్వ
పక్షసిద్ధాంతముల సూత్రభాష్య మెలమి
బోధ మొనరించుచుండె నపూర్వఫణితి. 189

ఉ. చెంతల నున్న జంతువు లచేతనవస్తువులున్ గరంగి పో
నంతటివారు శిష్యు లవశాత్మతఁ జిత్రసమాను లౌట యే
వింత? శ్రుతిస్మృతీడ్యముగ వేయితెఱంగులఁ దేనె లొల్కవా
క్సంతతి దేశికాగ్రణి విచారణపూర్వము బోధసేయఁగన్. 190

క. కలకలఅనూర్యోదయ మగు
తఱి గూర్చుండిరి యదేమి తన్మయతయొ భా
స్కరుఁ డంబరమధ్యమునకుఁ
నరుదెంచుట యెఱుఁగకుండి రాగురుశిష్యుల్. 191

గీ. ఎట్టకేనియు నెఱిఁగి యిప్పట్టునందుఁ
గట్టిపెట్టుద మిఁక మాధుకరపుభిక్ష
మునకు నరుగుద మే యనుకొనుచు నవుర
నవురులై వారు పో నెంచునవసరమున. 193

సీ. తనయంతఁ దాన కంపన మొందుశిరమునఁ
జికిచిఁకిపల్లవెండ్రుకలు దూల

బీఱనరాలు నిస్సారతఁ బ్రకటింప
నుహ్హుహ్హూ మని దగ్గునులివ్వు మీఱ
సాలెగూండ్లటు సితభ్రూలోమపంక్తులు
గనుఁగవ గనరానికరణిఁ గప్ప
నొకచోట నిడఁబోవ నొకచోటఁ బడుచుండు
నడుగుల తడఁబాటు నడఁ గుదుల్ప

గీ. నుదుట డాకేలు గదియించి యెదుటఁ గనుచు
దండమును వలకేలను దాల్చి వంగి
యుప్పనిన భూమిపైఁ బడునొక్కవృద్ధ
విప్రుఁ డరుదెంచె నచటి కవ్వేళ నలసి. 193

ఉ. వచ్చి యి వేమిపాఠములు వత్సలు! శ్రద్ధఁ బఠించుచుంటి, రీ
రెచ్చటివార? లీతఁ డెవ? రెయ్యది గ్రంథ? మటంచు శిష్యులన్
మచ్చికఁ బ్రశ్న సేయుడు నమస్కృతిపూర్వము లేచి యాసనం
బిచ్చి సపర్య సల్పి వచియించిరి శిష్యులు సుస్మితాస్యులై. 194

ఉ. ఘోరభవాబ్ధి మగ్నజనకోటిఁ గృపామతి నుద్ధరింప శా
రీరకసూత్రముల్ మునివరేణ్యులు వ్యాసులు మున్నొనర్ప; ని
స్సారమతుల్ తదర్థము లసంగతముల్ వచరింపఁ గాంచి యీ
ధీరుఁడు సూపె భాష్యఫణితిన్ మునియాశయముల్ సుసంగతిన్.

మ. జగదాచార్యుఁడు భిక్షుకోత్తముఁడు ప్రస్థానత్రయీభాష్యక
ర్త గతాహంకృతి భేదవాదికుమతధ్వాంతాంబుజాప్తుండు శ్రీ
భగవత్పాదులు శంకరుం డన జగత్ప్రఖ్యాతిఁ గన్నట్టి యీ
సుగుణిన్ మాగురుమౌళిఁ గాంచి యెవరంచున్ బల్క వింతయ్యెడున్

సీ. ఎఱుఁగవా యైదేండ్లయీడునఁ బేదకాం
తకు లక్ష్మి నొసఁగు నుద్ధంతకీర్తి

నాలింపవా యష్టమాబ్దవయస్కుఁడై
సంన్యసించిన మహాశ్చర్యచరిత
వినవొకో యోగసిద్ధిని నర్మదాంబూల్బ
ణమ్ము కుండిక యం దణంచుకథను
దెలియవా వేదాంతకలశవారాంనిధి
మంథాద్రి యితఁ డనుమహితకీర్తి

గీ. జగ మెఱింగినమాగురుచరిత మేము
తెలుపఁ బనరుక్త మగు, నీక తెలియకుంట
యబ్బురం బంచు గర్వ మావంత యుబ్బఁ
బలుకుటయు శిష్యు లాచార్యపాటవమ్ము. 197

చ. అనవుడుఁ దజ్జరద్ద్విజుఁ డహో భవదీయగురుండు బ్రహ్మసూ
త్రనివహ భాష్యకర్తయె? కరంబు ముదం బుదయించె, నౌర! నా
జననము ధన్య మయ్యె నిఁక జ్ఞానసుధన్ గడుపారఁ గ్రోల న
య్యెనె యని యుబ్బిన ట్లభినయించుచు శంకరుఁ గాంచి యిట్లనున్.

శా. స్వామీ! మిమ్ముల భాష్యకర్తలను గాంచం గల్గె మీశేముషీ
సామర్థ్యం బతిమానుషం బని భవచ్ఛాత్రాళి యగ్గించె నే
దీ మీదివ్యవచఃప్రభావము చవుల్ దీపింపఁ గొంతన్ జరా
భూమ చ్ఛన్నమదీయకర్ణముల బ్రుద్దుష్పల్ డుల్లఁగా నింపవే. 199

చ. అనుటయు లేఁతన వ్వొలయ సద్గురుమౌళి వినీతి నిట్లు ప
ల్కెను ద్విజచంద్ర! పెద్దల కగున్ నియమింపఁగ; నంతెకాని నే
ననెడియహంకృతిన్ బలుకు టర్హమె పిన్నల కెన్నఁడేని నీ
పనుపున నాయెఱింగినది పల్కెద నాజ్ఞయొసంగుమా యనన్. 200

క. ఆముదుసలిపాఱుఁడు మదిఁ
బ్రేమం బిగురొత్తఁ బలికెఁ 'బ్రియ మయ్యె భవ

తోఁ గమలవినీత సల్లా
పామృతపానమున ననుచు నాస్థం బలికెన్. 201

శా. సాధ్యం బైనది బ్రహ్మసూత్రముల భాష్యంబున్ రచింపంగ నీ
కధ్యాత్మజ్ఞవతంస! యొడ్లు కగునే? యాలించి పోదున్ దృతీ
యాధ్యాయాది 'తదంత' రేత్యదితసూత్రార్థంబ భాషింపు, త
న్మధ్యాశంకలఁ దూల్చి నీసలుపుసిద్ధాంతప్రపంచంబుతోన్. 202

వ. అనుటయు శంకరుండు వినయాలంకృతుండై "ఓం నమో బ్రహ్మా
దిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యః పరమగురుభ్యో మహ
ద్భ్య" యని. 203

సీ. గురుపరంపరఁ గొల్చి గురువులదయఁ జేసి
యరసిన యర్థ మేర్పడ వచింతుఁ
గాని నాయది యించుకేని గల్ల దటంచు
వినతి సల్పి సుఖోపవిష్టుఁ డగుచు
'శుభమస్తు వినుమి యాసూత్రార్థసారంబు
జీవుండు చనుఁ గరణావసాద
మందుఁ దద్భూతసూక్ష్మాంశమ్ములం గూడి
యనుచుఁ దాండిశ్రుతియందుఁ గథిత

గీ. మయ్యె గౌతమజైమినీయంబు లైన
ప్రశ్నముల నుత్తరమ్ములఁ బ్రస్ఫుటముగ
దీని యర్థ' మ్మటం చసందిగ్ధముగను
మాత్తకొనఁగాదె మదిఁ దెల్పుమా ద్విజేంద్ర! 204

చ. అని యతిచంద్రుఁ డాడిన తదర్థము వించు జరద్ద్విజుండు ప
క్కున నగి వావదూకుఁ డయి కోవిదదిగ్గజమధ్యమందుఁ దా
నిని శతథావికల్పముల నీఱుఁగ జేయుచు ఖండనం బొన
ర్చెను వినువార లద్భుతపరీతమనస్కులుఁ గాఁగ నీక్రియన్. 205

ప. 'వేత్థ యథా పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవంతి' అయిదవయగ్నియందు వేల్వఁబడిన యుదకములు పురుషుం డగు నని యెట్లెఱింగితి వను గౌతమప్రశ్నమునకు 'ద్యుపర్జన్యపృథివీయోషిత్సు' లను పంచాగ్ను లందుఁ గ్రమముగ శ్రద్ధా సోమవృష్ట్యన్న రేతోరూపంబు లగునైదుద్రవ్యములుగాఁ దెలిపి యైదవయాహుతియం దుదకములే పురుషరూపము నొందు నని కదా! సమాధాన మంటివి. యతీంద్రా! జీవుఁడు కరణావసాదమున దేహాంతరము నొందుపట్ల రవంత విచారింతము. 'దేహాంతరప్రతిపత్తి' యందు వ్యాప్తు లగు నింద్రియములును, నాత్మయును గర్మవశంబులై వర్తిలునా? కేవల మాత్మయే యరిగి దేహమట్ల యింద్రియములుగూడ నూత్నముగాఁ బుట్టఁగా నచట భోగస్థానమును గల్పించుకొనునా? కేవల మగుమనస్సే భోగస్థానము నుద్దేశించి యరుగునా? శుకము వృక్షమునుండి వృక్షాంతరమున కెగిరి చనురీతి జీవుఁడే దేహమును విడిచి దేహాంతరము నొందునా? యనెడు వికల్పజల్పనమ్ములఁ గూర్చి వినుము. దేహాంతరమునకుఁ బోవుజీవునితోఁ గూడుకొని యింద్రియము లరుగు ననుట శ్రుతి విరుద్ధము. ఎట్లంటేని 'య త్రాస్య పురుషస్య మృత స్యాగ్నిం వాగప్యేతి, వాతం ప్రాణ, శ్చక్షు రాదిత్యం, మన శ్చంద్రమసం, దిశ శ్శ్రోత్ర' మిత్యాది (మృతుఁ డగు పురుషునివా క్కగ్నిని, ప్రాణము వాయువును, చక్షువు సూర్యుని, మనసు చంద్రుని, శ్రోత్రము దిక్కులను బొందుచున్నవియను) శ్రుతివినవా? మఱియుఁ బ్రథమాగ్నియందు వినఁబడని యప్పులు పంచమాహుతియందుఁ బురుషుఁ డగు ననుట యసాధ్యము. ద్యులోకాదిపంచాగ్నులు శ్రద్ధాదిహోమద్రవ్యపంచకమున కాధార మగు నని చెప్పఁబడెఁగదా! అందుఁ బ్రథమాగ్నియందు హోమద్రవ్యముగాఁ జెప్పఁబడినశ్రద్ధను విడిచి చెప్పఁబడని యప్పులను గల్పించుట సాహసము. ఆశ్రద్ధనే

హోమద్రవ్యముగాఁ జెప్పఁబోవఁ బ్రత్యయ (జ్ఞాన) విశేషత్వప్రసిద్ధ మగుశ్రద్ధను హోమము చేయుట యెట్లు పొసఁగును? ఒకవేళ నప్పులే శ్రద్ధాదిక్రమమునఁ బంచమాహుతియందుఁ బురుషాకృతి నొందు నని యంగీకరించినను—దత్పరిష్వక్తుఁ డైనజీవునకు గమన మెందును వినరామింజేసి జీవునిగమన మసంగతము' అని భూత సూక్ష్మాంశక్రమము, నాసూక్ష్మాంశములతో జీవుఁడు కూడుకొ నుట, జీవునిగమనము నన్నియు మునుమిడి ఖండించునంత. 206

గీ. అతఁడు జెప్పిన దంతయు ననువదించి
ప్రతిభటద్విజు గుండెలపట్టు జాఱ
తీర్థకరుఁ డైనశంకరదేశికుఁ డిటు
ఖండన మొనర్చె స్వమతరక్షకము గాఁగ. 207

వ. అదియెట్లనః—శంకరుం డామునిపాలుని గాంచి మహాత్మా; యవ ధరింపుము. జీవునిదేహాంతరప్రతిపత్తిని గూర్చినశంకాచతుష్టయము సాంఖ్య బౌద్ధ వైశేషికదిగంబరకల్పితములు, నుదాహృతశ్రుతికి విరుద్ధములును గావున ననాదర్తవ్యములు. మఱియు నప్ఛబ్దశ్రవణసామర్థ్యమునఁ గేవల మగునుదకములతో సంపరిష్వక్తుఁడై జీవుఁడు పోవు నని కాదు. ఆభూతసూక్ష్మాంశములం దుదకములే యధికముగా నుండుటంజేసి యప్ఛబ్దము ప్రయోగింపఁబడె ననుకొనినచోఁ బ్రశ్న ప్రతివచనములఁ గలుగువిరోధములు తొలఁగు. ఇఁకఁ ద్రివృత్కరణ శ్రుతియందుఁ దేజోబన్నత్రయమువలన దేహకార్యోపలబ్ధిగలుగుట వలనను, నది త్రయాత్మకమగుటవలనను గేవల మప్పులకు దేహారంభ కత్వము గలుగు ననుట పొసఁగదు. పార్థివధాతువే దేహములం దధికముగాఁ గానవచ్చుట లేదా యందు వేమో? వినుము. ఇతరాపేక్షచే నప్పులకే బాహుళ్యము కలుగుటవలన నప్పు లని గ్రహింపఁ బడెను. కావున నప్పు లనః — సకలము లగుదేహబీజము లని

గ్రహించుట యుత్తమము. ఇంతియు కాదు. దేహాంతరప్రతిపత్తి యందుఁ బ్రాణములగమనము శ్రుతం బగుట లేదా? 'త ముత్క్రామంతం ప్రాణో నూత్క్రామతి, ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి' (ఉత్క్రమించుచున్న జీవునితోఁ బ్రాణ మనుసరించును. ఆప్రాణము ననుసరించి యెల్లప్రాణములు ననుగమించును) అనుశ్రుతియే ప్రమాణము. ఆప్రాణగమన మాశ్రయము లేక సంభవింపదు గానఁ బ్రాణగతిప్రయుక్తములును దదాశ్రయములును, భూతాంతరోపసృష్టములు నగు నప్పులకు గమన మర్థాపత్తిప్రమాణమున సిద్ధించుచున్నది. లోకమందు జీవించి యున్న వానిప్రాణములు నిరాశ్రయములై వేఱుచోటి కటుగుట గాని, యన్యత్ర యుండుటగాని కానము గదా! ఇఁక వాగాదు లగ్న్యాదుల నొందుట యన్ననో గౌణము గాని ముఖ్యముగాదు. ఆశ్రుతియందే చెప్పఁబడిన 'లోమము లోషధులను, కేశములు వనస్పతులను బొందు' ననువాక్యముపఁ గూడ ముఖ్యార్థబాధ కానవచ్చుటంజేసి వాగాదీంద్రియాధిష్ఠానదేవత లగ్న్యాద్యదులుగాన మరణకాలమున వాగాదీంద్రియోపకారనివృత్తిమాత్రమే కలుగు నని పైశ్రుతి కర్థము. అట్లధిదేవతలు నివృత్తము లైనపిదప నింద్రియములు జీవు ననుగమించుట విరుద్ధము కానేర దని యౌపచారికార్థము గ్రహింపనగును. ప్రాణములు లేకయ దేహాంతర మం దుపభోగము గలుగుట యసంభవము. కావున వాగాద్యధిష్ఠాతృ లగునగ్న్యాదిదేవతలు మరణము కలుగ నుపకరింపక నివర్తిల్లుట మాత్రము చెప్పఁ దలఁచి వాగాదు లగ్న్యాదులను బొందు నని యౌపచారికముగాఁ దెలుపఁబడె. అట్లయినఁ 'బ్రథ మాగ్నియం దప్పు' లనుట యెట్లనిన నప్ఛబ్దముచే నాశ్రద్ధయే యభిప్రేతమైనది. కాన నాది (శ్రద్ధాశబ్దవాచ్యాప్పులు) మధ్య (వృష్టిశబ్దవాచ్యాప్పులు) అంతము (రేతశ్శబ్దవాచ్యాప్పులు) లందు నప్పు

లుండుటవలనఁ బై వాక్య మనాకుల మగుచుండుట లేదా? మఱి యుఁ బంచమాహుతియందు నప్పులకుఁ బురుషవచస్త్వ మెట్లని ప్రశ్న కలుగఁగాఁ బ్రతివచనమున హోమద్రవ్యముగా శ్రద్ధాశబ్దా వతారము లేనిచోఁ బ్రశ్న మొకటియును, ప్రతివచన మొక్కటి యునై యేకవాక్యత లేకుండును. ఇందలి శ్రద్ధాశబ్దమునకు మాన సమగు ప్రత్యయము (జ్ఞానము) అని గాని, జీవుని ధర్మ మనిగాని యర్థము చెప్పునెడలఁ బశ్వాదులనుండి హృదయాదులు వేఱుపఱ చినటుల ధర్మినుండి ధర్మమును హోమార్థము విడఁదీయుట యసం భవము. కావున నాయప్పులే శ్రద్ధాశబ్దముచే నుపాదేయము లగు చున్నవి. 'శ్రద్ధావా ఆపః' అను వైదికప్రయోగముచే శ్రద్ధయన నప్పులనుటస్పష్టము. గమనకర్త లగునప్పులకు బీజరూపత్వముచేతను, సూక్ష్మత్వగుణయోగముచేతను మాణవకునందు సాహసపరాక్ర మాదిసామ్యంబున సింహశబ్దమువలెనే యాయప్పులందు శ్రద్ధాశబ్ద ముపపన్నమగుచున్నది. శ్రద్ధాపూర్వక కర్మసమవాయమువలనఁ బురుషులందు మంచశబ్దమువలె నప్పులందు శ్రద్ధాశబ్ద ముపపన్నమగు చుండెె. శ్రద్ధాశబ్దమున కప్పు లనునౌపచారికార్థమున కేని ప్రసిద్ధి వలదా యనునెడ స్వతఃప్రమాణ మగుశ్రుతియే కలదు. 'ఆపో హాస్మై శ్రద్ధాం సన్నమంతే పుణ్యాయ కర్మణే' (పురుషునకుఁ బుణ్యకర్మాచరణమున నప్పులే శ్రద్ధను గలిగించుచున్నవి) యను వేదవాక్య మప్పులు శ్రద్ధకు హేతువులని చెప్పుటఁబట్టి యా యప్పులందు శ్రద్ధాశబ్ద ముపచరిత మగుచున్నది. ఇందుఁ జెప్పఁబ డిన ప్రాణప్రయాణక్రమ మిష్టాపూర్తాదికర్తలై పితృయానమునఁ జను జీవులది గాని సామాన్యజీవులది కాదని యెఱుఁగనగు నని ప్రతివాదిఖండన మంతయుఁ దూల్చి స్వపక్షము మండన మొన ర్చుచు నెన్నిపూర్వపక్షములు సేసిన నన్నింటికి రాద్ధాంతములు సోప పత్తికముగాఁ జేయుచుండ వాదం బతితీవ్రింబుగ నడువఁదొడఁగె.

చ. సురగురు కుండలీశ్వర వచోవిభవాంచితులై వెలుంగు న
య్యురువుర కయ్యె వాక్కలహ మిట్లు దిగాష్టక మట్టిచో నిరం
తర మెడఁ బాయ కుండుహితతంత్రుఁడు పద్మపదుండు ప్రొక్కి శం
కరగురుచంద్రు ని ట్లను నఖండితభక్తి వినీత్యుపేతుఁడై. 209

క. దేవా నీ వలశంకర
దేవుం డవ! ని న్నెదుర్చ దిట మూనినభూ
దేవుఁ డితఁడు వ్యాసుండే
కావలె లేకున్న నిట్టికౌశలి గలఁడే. 210

గీ. శంకరుఁడ శంకరుండు, సాత్యవతేయుండుఁ
డైనహరి బాదరాయణుఁ; డంతవారు
కింకరు గొని వాదుచలువంగఁ గింకరుండ
నైన నే నేమి యిపుడు సేయంగలాఁడ. 211

వ. అనునప్పలుకులందు వ్యాసమహాముని దివ్యనామామృత వర్ణములు చెవుల సోఁకుటయు నొడలు జల్లు మన హృదయంబు దిగ్గన క్షణ కాలంబు మాన్పడియు జగద్గురుం డాజరద్ద్విజునకు సాష్టాంగనమస్కారము చేయుచు భూమియందు దండమువోలెఁ బండుకొని యుండి తదీయపాదపద్మంబులఁ నిజకరపద్మంబులఁ బూని యి ట్లని వినుతింపఁ దొడంగె. 212

మ. కనిపింపంగదె మౌనిచంద్ర! యసితాంగజ్యోతు లుద్యత్పయో
దనికాయంబులఁ జిమ్మఁగా, జడలు తప్తస్వర్ణవల్లీచయం
బును మించన్, గరుణామృతం బొలుకుచున్ భూభాగమున్ జ్ఞానస
స్యనితాంతోన్నతిఁ దేల్చునీయనఘ మానాకార మింపారఁగన్

సీ. శరదిందుబింబభాస్వరకమండలు వొప్పఁ
దాపింఛసచ్ఛాయతనువు మెఱయ
సప్తవింశతిమౌక్తికాప్తాక్షమాల యా
శ్రితతారకావళి చెలువుమీఱ

శార్దూలచర్మవస్త్రజటావిభూతి రు
ద్రాక్షధారణ శివు ననుకరింప
నద్వైతవిద్యాంకుశాంచలమ్మున కహం
కారకరిందౖ మగ్గలము లోఁగ
గీ. నాత్మకృతశాస్త్రశంకూజ్జ్వలాచ్ఛసూత్ర
దామముల నకృత్రిమగోవితానములను
గట్టి యిరుగ్రేవ శిష్యులు చుట్టువాఱ
వెలయునీరూపుఁ జూపింపవే మహాత్మ. 214
వ. అనుచు నానందబాష్పసంప్లుతాక్షుల నుతియిుంచె. 215
క. అటువలె నాబుధవృద్ధునిఁ
బటుమతి ద్వైపాయనునిగఁ భావించి విశం
కటభక్తిని నిటలతటీ
ఘటితాంజలియై నుతింపగాఁ దొడఁగె నిటుల్. 216
ఉ. పాలితశిష్యలోక! ద్విజవల్లభ! దుర్లభతావకీన ని
ర్వేలవిచక్షణత్వము నెఱింగినయంతటినుండి ధాతవో
శూలివో హేళివోక్కొ యనుచున్ వెఱగొందుదు నంతెకాని నా
పాలిటిభాగధేయ మగువ్యాసగురుం డని యెంచ నయ్యెదన్. 217
క. ఈమాడ్కిని శారీరక
మీమాంసాంభోధిఁ దఱచు మేటిని గన మే
సీమను సాత్యవతేయ మ
హామునిగా కెవని కగుఁ దదాశయ మెఱుఁగన్. 218
క. ఆకారమాత్రభేదము
చేకొనువ్యాసర్షి వీవు చిరజీవివి యి
చ్ఛాకల్పితసృష్టివి యే
యాకృతిఁ గనలేవు సంశయమ్ము నా కేలా? 219

శంకరకృత వ్యాసస్తుతి

ఉ. స్వాగతమయ్య్య నీకు మునిచంద్ర! పరాశరపూనిపుత్ర! నీ
వీగతి నాదుభాష్యము పరీక్ష నొనర్చి పరోపకారదీ
క్షాగరిమంబు చాటితి జగద్ధితబుద్ధిఁ బురాణముల్ సమ
స్తాగమసారగర్భము లహా రచియింపవె యెంతవాఁడవో. 220

సీ. కలగూరగంపయై గాసిఁ జెందెడు శ్రుతు
లచ్చుగట్టి విభాగ మనువుపఱచి
వేదసారమ్మున వెదవెట్టి యష్టాద
శపురాణనిర్మాణసఫలతఁ గని
గీతామృతాసారపూతభారతపంచ
మామ్నాయవిరచన యశము గాంచి
యుపనిషత్సారమ్ము నొగి సూత్రములుగ ని
ర్మించి బ్రహ్మంబు చిత్రించి చూపి

గీ. కరతలామలకముగా జగచ్చరిత్ర
మెఱిఁగి వెలుగొందు నీయొద్ద నేను నాదు
భాష్య మన నెంత? శోధింపవచ్చు టరయ
ననుఁ గృతార్థు నొనర్చు నూహానె కదయ్య! 221

చ. కలియుగమందు సోమరులు కాఁగల రెల్లద్విజన్ము లంచు సం
కుల మగు వేదరాశిని గుశాగ్ర మతిఁ విభజించి నాల్గు శా
ఖల నొనరించి వ్యాసుఁ డనఁగా జగమందుఁ బ్రశస్తిఁ గన్ననీ
యలఘుమహానుభావమున కంజలి యొగ్గెద బాదరాయణా! 222

క. ఎఱుఁగకె త్రికాలముల నే
వరుస సృజించితివి భూతభావిభవంతీ
చరితప్రబంధములఁ దా
వరసిన క్రియ; నెంతవాఁడ వయ్య మహాత్మా! 223

గీ. అంతరంగమ్ము సైతమ్ము నలరిచి బహి
రంతరాంధ్యమ్ము స్థూలసూక్ష్మాంధ్య మెల్లఁ
దఱిమి హరియింపఁగలభారతక్షపాక
రుఁడు మెఱసె వ్యాసవారాశిఁ బొడవుసూపి. 224

గీ. సాంగషట్కమ్ము లగుశ్రుతు లఖిలశాస్త్ర
మమ్మహాభారతాంభోధి యలపురాణ
సముదయం బెల్ల నీయంద సంభవిల్లె
నీది కానట్టి వాఙ్మయం బేది జగతి. 225

చ. ఋత మగుబ్రహ్మ దాఁ బొడమి ద్వీపమునందు సహస్రశాఖికా
యుత మగుచున్ - శుకామితసముత్సవమై, మునిచంద్రరూపక
ల్పతరువుగాఁ దనర్చి, నిజపాదసమాశ్రయ మొందునాసుదృ
క్తతి కొసఁగున్ మహోన్నతముగాఁ దనరాముఫలంబు నర్మిలిన్.

గీ. ఆర్తిశమనార్థము గిరీశు నాత్మఁ దాల్తు
ప్రాక్తనగపీచయమ్ము వక్త్రమునఁ గాతు
వరకృపాదృష్టిఁ దొలఁగింతు నరకబాధఁ
జెప్ప నెటు నీగుణమ్ము విచిత్ర కృష్ణ! 227

గీ. కలుగక మలంగక వెలిలోపలలు లేక
యుండు నని దేని వివరించుచుండును శ్రుతు
లట్టి సచ్చిదానందఘనాకృతి పర
మాత్మ వీవ నారాయణాంశావతార! 228

సీ. అని కేలుదోయి ఫాళిని జేర్చి మ్రొక్కుచుఁ
గనుచుండ మదికోర్కి కనుగుణముగ
ముదుసలిపాఱురూపునన ద్వైపాయనా
కారమ్ము తనకు నొక్కనికె తోఁప

పరవశుం డగుచు నిర్భరతరానందస్వ
 త్యాత్మానసుం డయి యంతలోనఁ
దెలివొంది పరగురుదేవ! యంచును వృద్ధ
 విప్రసంఘుల వ్రాలి విడువకున్న
గీ. నాదరంబున నిరుగేల యతిలలాము
నెత్తి కౌఁగిటఁ జేర్చి యవ్వృద్ధవిప్రుఁ
డపరిమితహర్షవారాశియందు మునిఁగి
యిట్టు లనుఁ దేనియలసోన లుట్టిపడఁగ. 229

వ్యాసుఁడు భాష్యమును శోధించి చూచి వరము లిచ్చుట

ఉ. చక్కని జ్ఞానదృష్టిని నిజంబుగ నన్నును వ్యాసపీఠమం
దెక్కఁగఁ జేయునీప్రతిభ కెంతయు సంతస మొందినాఁడ నీ
వెక్కితి వ్యాసుఁ డాదియగుసిద్ధచరిత్రుల లెక్కలోనికిన్
దక్కఁగ నేలుకొంటి సముదంచితపారమహంస్యరాజ్యమున్. 230
చ. పరమబుషీంద్రకోటులు భవత్కృతభాష్యమహత్త్వమున్ నిరం
తరము నుతింపఁగా విని సదాశివుఁ బ్రేరణ వేడ్కఁ బట్టలే
కరయఁగ వచ్చినాఁడ ముద మయ్యె భవత్ప్రతిభావిశేషభా
సుర మగుభాష్యధోరణికి సూరివతంస! చిరాయు రస్తు తే. 231
గీ. అనుచు దీవించు వృద్ధువాక్యశ్రవణస
ముత్థహర్షము రోమాంచపూరకైత
వమున వెలి కుబ్బ శుకమతవార్ధిచంద్రుఁ
డయినశంకరుఁ డవ్వాని కనియె నిటుల. 232
ఉ. పైలసుమంతుముఖ్యులు తపస్వులు శిష్యులుగాఁ జెలంగు ను
ద్వేలవిభూతి వ్యాసగురుదేవునిముందు తృణంబు నేని గా

నేల తదీయసూత్రరవి కేడ్తె ఁ మామకభాష్య మెత్తి ని
వ్వాళి యొసంగ నెంచితి నపత్రపనేని దలంప కక్కటా!

ఆ. మున్ను సాహసము స్వబుద్ధిఁ గావింతు వ్యా
సప్రశిష్యబిరుదశాలి నగుచు
నరసి తత్పదుక్తు లందలిమద్దురు
క్తుల సమీకరింప వలఁతి వంటి. 234

ఆ. అని వచించుశంకరాచార్యుచే నున్న
భాష్య మాదరమునఁ బాణియుగళిఁ
బుచ్చుకొని సమస్తమును బ్రసాదాదిగు
ణాంచితమ్ము ద్విజుఁడు గాంచె వరుస. 235

ఉ. అంతట బ్రహ్మసూత్రహృదయానుగుణార్థము గల్గి నైజవా
క్సంతతి, బూర్వపక్షములకచ్ఛుణఁగించుచు యుక్తియుక్తసి
ద్ధాంతములన్ దనర్చుయతితల్లజుభాష్యము నెల్లఁ గాంచి చే
తోంతరసీమ సంతస మనంతము గాంచి వచించె నీక్రియన్. 236

ఆ. గురునియాజ్ఞఁ జేయ దొరఁకొంటి సూత్రభా
ష్యమ్ము; గానఁ గాదు సాహస మది
యింక సాహసముగ నెంతు సూక్త దురుక్త
ములు పొసంగు నిందుఁ దెలుపు మనుట. 237

క. మీమాంసకాగ్రగణ్యుఁడ
వామూలము శబ్దశాస్త్ర మరసితి గోవిం
దామలచరితుని శిష్యుఁడ
వేమెయి వెలువడు దురుక్త మెది నీనోటన్. 238

గీ. అంధకారమ్ము హరియించి యర్కుఁ డట్లు
వెడలితివి బ్రహ్మచర్యాన విషయములను
జక్కడంచి యప్రాకృతజనుఁడ వౌటఁ
బరమపురుషుఁడ వీవు సర్వజ్ఞమూర్తి. 239

క. అమితార్థగర్భములు నిరు
పమలఘురూపములు గూఢభావము లగుసూ
త్రములు మదీయములు వివర
ణము సేయఁగ నీవు గాక నాథుఁడు గలఁడే. 240

గీ. చాలు నెవఁడు నిసర్గదుర్జ్ఞానతరము
లైనసూత్రములర్థమ్ము లాకళింప
నెంత క్లేశ మ్మగును రచయితకుఁ దలఁప
నంత క్లేశమ్ము వ్యాఖ్యాత కగును గాదె. 241

గీ. అస్మదాశయ మెఱిఁగి యథార్థముగను
భాష్య మొనరింపఁజాలు నెవ్వండు సాంఖ్య
ముఖ్యపీడిత మగుశ్రుతిమూర్ధపథముఁ
జక్క నెవఁ డెత్తుఁ బరశివాంశంబుదక్క. 242

గీ. రోసము సుదూరముగఁ ద్రోసివేసి సకల
కలల మదిఁ దాల్చి గిరజాధికరణసర్వ
మూర్తి యొప్పారవెలుఁగు నపూర్వశంక
రుఁడవు నిన్ను వర్ణింప నెవ్వఁడు వలంతి. 243

మ. మును వ్యాఖ్యన్ రచియించి రెందఱో బుధుల్ పూర్ణంబు సూత్రాశయం
బును సర్వజ్ఞుఁడ వీ వెఱింగినటు లల్పుల్ వారెటుల్ కంద్రు ? కా
వున భేదాన్వయగామికోవిదులపెంపుల్ దూల్చి వేదాంతవి
ద్యను గ్రంథమ్ము లొనర్చి కావు మిఁక నన్నా పోదునా యిచ్ఛమై?

వ. అనుటయు శంకరుండు మహాత్మా నా విన్నపం బవధరింపుము. భవదనుగ్రహంబున భాష్యములు రచించితి. శిష్యులకు బోధించితి. ధైర్యమ్ము వీడక కుమతముల హతాహత మొనర్చితి. నా చేయఁదగిన దీలోకంబున నేదియుఁ గానరాద ముహూర్తమాత్రము మణికర్ణికాతీరంబున సన్నిధానంబు సేసితేని జిరాయుష్మంతుండ నగునీసన్నిధి నీహేయం బగుకాయంబు వాయ నుంటి ననుటయు ముదుసలిపుడమివేలు పి ట్లనె. 245

శా. వత్సా! యింకను నీ కనిర్జితులు భూభాగంబునం దుండ్రు వి
ద్వత్సింహంబులు, వారినిన్ గెలిచి యద్వైతాధ్వరక్షాచణో
ద్యత్సిద్ధాంతములన్ స్థిరంబులుగ సంస్థాపింపఁ బెక్కేఁడు లా
నుత్సర్జించినచో ముముక్షు జననీన్యాయార్భకంబై చెడున్. 246

ఉ. సారతరార్థసంభృతవిశంకటభావయుతప్రసన్నగం
భీరభవత్ప్రణీతకృతిబృందవిలోకజహర్షపూరముల్
ప్రేరణసేయుచుండె యతిబృందమహేంద్రుఁడ వైన నీకు స
త్కారముగా వరంబు నొసఁగన్ వలె నంచు నిదే యొసంగెదన్.

సీ. అంబుజాసనుఁ డిచ్చినట్టియాయువు నీకు
నెనిమిదేఁడులె జనియించుతటికి
నీభాగ్యమహిమ నెన్మిది కెన్మిదేం డ్లెక్కె
గురుతరంబగు తపోభరముకలిమి
నిఁక నొక్కపదియునాఱేఁడులయాయువు
నామాటఁ బట్టి యన్నా లభించు
నాచంద్రతారార్క మవని భాసిలు భవ
త్కృతమైన భాష్యమ్ము రతనమట్లు
గీ. మొనసి దుర్వాదిగర్వముల్ తునియునట్టి
భణితములఁ జేయుమా! యెల్లవారి భేద

బుద్ధిరహితులనద్వైతశుద్ధమార్గ
గాములుగను బ్రహ్మానందధాములుగను. 248

క. అనుజరదవనీసురునకు
ననుమితపారాశరునకు యతిపతి యనుఁ 'బా
వనయుష్మత్సూత్రసహం
చనమున నాభాష్యమును బ్రచారము వడయున్.' 249

చ. అని తనకన్నుదోయి కమృతాంశునికై వడిఁ జల్లనైన రూ
పున వెలుఁగొందు వృద్ధమునిపుంగవు నంఘ్రులు నెన్నొసంటసోఁ
క నతు లొనర్చి శంకరుఁడు గద్గదికస్వరసంభృతాశ్రుఁడై
కనుఁగొనుచుండ నాద్విజుఁడు కన్మొఱఁగెన్ గలఁగన్న వైఖరిన్ 250

వ్యాసువిగూర్చి పద్మపాదునకుఁగలిగిన సందేహమును శంకరుఁడు వారించుట

ఉ. ఆజరదగ్రిజన్ముఁ డటు లంతరితుం డగునంత నొజ్జకం
భోజపదుండు మ్రొక్కి వెఱఫుట్టఁ జలించుచు 'దేవ! యెవ్వఁడో
యాజగతీసురుం డెఱిఁగి తయ్య వచింపు పరాశరాత్మజుం
డో, జితకాముఁడైన శుకుఁడో, హరుఁడో, హరియో, విరించియో.

మ. భగవంతుం డగుబాదరాయణమహాబ్రహ్మర్షి గా కున్న మీ
జగదుద్ధారక మైనభాష్యమునఁ బెల్చన్ బూర్వపక్షం బొన
ర్పఁగలాఁడే' యనుచున్ ఘృణాక్షరముగా వ్యాసుం డటం చంటినేం
చఁ గలిద్వాపరసంధి నుండె నని భాష్యంబందు నేఁ జూడనో. 252

శా. ఆనాఁ డుండినసూత్రకర్త యిపు డయ్యా యెట్లు తా వచ్చి మీ
తో నుచ్చావచవాదముల్ నెఱపి తోడ్తో నేఁగెనో యంచు డెం
దానన్ సందియ ముప్పతిల్లెను భవత్కారుణ్యపాత్రింబ యా
నేనిన్ దీనుఁడు పేఁడు వేఁడినది స్వామీ చెప్పి రక్షింపవే! 253

గీ. అనినఁ జిఱునవ్వు నవ్వి యిట్లనె గురుండు
బలియు ద్రౌణియుఁ గృపుఁడును వ్యాసుఁడును వి
భీషణుం డాంజయనేయుండు భృగుకులుండు
ననెడు నేడ్గురు చిరజీవు లనుట వినవొ. 254

క. విరచించెనఁట కలిద్వా
పరసంధిని బ్రహ్మసూత్రపటలి ననిన ని
త్తఱి వ్యాసుఁ డుండునా యని
యడిగెద నీ కేల గలిగె నన్నా చెపుమా! 255

సీ. జ్ఞాననేత్రమ్మునఁ గాని గానఁగరారు
జ్యోతిర్మయులు మహాసుకృతతనులు
జ్ఞానప్రమాణానుసారంబు వారల
దర్శనం బబ్బుఁ దత్త్వార్థమునఁ
దొలుత నజ్ఞానంబువలన వృద్ధద్విజుం
డట్లువెలితోఁచె మాయామయముగఁ
గ్రమముగా జ్ఞానదీపము జ్వలింపఁగఁ గృష్ణ
తనుఁ డైనవ్యాసుఁడై కనఁగనయ్యె

గీ. నతఁడు చిరజీవి యగుట భక్త్యతిశయమునఁ
గొలుచువారికిఁ దద్భక్తిఁ గోరఁది వివిధ
రూపములఁ దోఁచి నేఁడును బ్రోచుచుండు
సందియము డిందఁ దన్నామజపము సలుపు. 256

గీ. నాల్గుమోములు డాఁచిననలువ యతఁడు
రెండుచేతుల నారాయణుం డతండు
కన్ను నొసటను లేని ముక్కంటి యతఁడు
వ్యాసముని నాఁగ సామాన్యుఁ డని తలంతె, 257

సీ. బ్రహ్మాండగోళపరంపరల్ తనబొజ్జ
యందుఁ దాలిచిన నారాయణుండు
ఆజానశుద్ధదివ్యజ్ఞానకళికల,
నలరారెడు పరశరాత్మజుండు
సరయసద్యోగర్భజనురాత్త తాపస
తేజుఁ డౌసత్యవతీసుతుండు
అఖిలవేదాంతవిద్యాలాభమునకుఁ ద
పోధికుం డగుబాదరాయణుండు

గీ. భారతమ్ముఁ బురాణముల్ పదునెనిమిది
విరచన మొనర్చినట్టి కవిద్రుహిణుఁడు
అతఁడు వ్యాసుఁడు తన్మహితానుభావ
మెంచఁగా సాధ్య మానె విరించి కైన ? 258

ఉ. ప్రాకృతదృష్టిఁ దొల్తఁ గన బ్రాహ్మణవృద్ధయి కానిపించి నీ
వాకున జ్ఞానదృష్టిఁ గన వ్యాసుఁడవై కనుపించె నాకు; నీ
కో కడముట్టువృద్ధదశ నుండిన పాఱుఁడుగాఁ గనంబడెన్
గై కొనఁజేయు భేదముల జ్ఞానమునందలి తారతమ్యముల్. 259

చ. ప్రతిపరమాణువందు నిజభాస్వరతేజము నింపి లోకసం
తతిఁ దనయందుఁ గూర్చుకొను తాత్త్వికులై నమహాత్ముల న్మహిన్
వెతకుట యేల జ్ఞానులకు? వీక్షణరోధక మాతమంబుఁ బ్రా
కృతులు జయింపనేరక 'యదృశ్యులు'గా భ్రమ గొంద్రుగా కెదన్.

మ. కర మీక్షింపఁగరానిద వ్వొగిరి కంక శ్యేన గృధ్రంబు లం
బరమం దుండి యిలాగతార్థముల విస్పష్టంబుగాఁ గాంచు వై
ఖరి నజ్ఞానులదృష్టి కందనియనేకంబుల్ మనోదృష్టి గాం
తురు జ్ఞానుల్ తమజ్ఞానశక్తి కొలఁదిన్ లోకంబులం దన్నిటన్. 261

సీ. జనుసాంధుఁ డీజగంబును శూన్యముగ నెంచఁ
గను లున్నవాఁడు నమ్మునె తదుక్తిఁ
గూపమండూక మకూపారవార్త న
మ్మనిమాత్ర వార్ధి లే దనుట యెట్లు
బధిరుండు శంఖరావము శూన్య మని పల్క
విశ్వసింతురె ధ్వనిఁ వినెడువారు
ముక్కిఁడి సుమనఃఆమోదమ్ము లే దన్నఁ
బూవున నెత్తావి పొనుఁగువడునె

గీ. యటులె యజ్ఞాని ప్రత్యక్ష మాదరించి
లే దనఁ బరోక్షవస్తువు పోదు దానిఁ
గాంచ దక్షుండు జ్ఞాని యొక్కండ కాన
జ్ఞానము నరుండు గడియింపఁ గడఁగవలయు. 262

గీ. తపముననె కాని రాదు చిత్తపరిశుద్ధి
జ్ఞాన మాచిత్తశుద్ధిచేఁ గాని రాదు
తెలియ దపరోక్ష మాజ్ఞానబలము లేక
యిన్నిటికి మూల మాగురుకృపయె సుమ్మి. 263

క. అనుచుం బల్కెను గానీ
మనమునఁ జే వెట్టి కలఁచుమాడ్కిని నావ్యా
సునివిరహ మేఁచ నెట్టెటొ
పనివడి గురుఁ డొందె స్వస్థభావము తుదకున్. 264

గీ. గురునియానతి దిగ్జయస్థిరమనీషుఁ
డై కుమారిలభట్టుచే నాత్మరచిత
భాష్యమునకు వార్తికముఁ గూర్పంగఁ జేయ
వెడలెఁ దొల్త నగస్త్యుండు విడియుదిశకు. 265

## ఆ శ్వా సాం త ము

శా. ధర్మగ్లాన్యపనోదనార్థగతమర్త్యక్షోణి! తత్త్వార్థవి
త్కర్మంద్యాంతరచక్షురధ్వగతలక్ష్యజ్యోతి! యాహత్యలం
కర్మీణోద్యతకార్ముకక్షపితరక్షశ్చక్ర! యావజ్జగ
న్నిర్మాణాదిమహేతుభూతమయమూర్తీ! జానకీనాయకా!

క. వేంకటరాట్సచివమణీ
సంకల్పఫలీకృతిప్రసన్నసురమణీ!
సంకల్పజన్మజనక! ని
రంకుశపౌలస్త్యమదనిరాస శరాసా!

పంచచామరము

చలాఽచలాకృతిప్రజద్విశాలకీశరాట్చ్ఛమూ
చలాచలాఽవనీతలా! నిశాటవాటపాటనో
చ్చలాఽచలాఽఽయుధోజ్జ్వలాజిసాంయుగీనశౌర్య! చం
చలా చలామరేంద్ర లక్ష్మ్యజస్రనుస్థితిప్రదా!

ఇది శ్రీ గురుకరుణాసమాసాదితకవిత్వ
వెంపరాల సూర్యనారాయణ నామధేయప్రణీతంబైన
శంకరవిజయంబున
తృతీయాశ్వాసము.



# శంకర విజయము

## చతుర్థాశ్వాసము





క్షిద్వేంకటరాయా
లక్షితమాహాత్మ్య! భరత లక్ష్మణ శత్రు
ఘ్న క్షితితనయానిలతన
యాక్షామక్షేమకామనాశ్రియ! రామా! 1

వ. అవధరింపుము.

కుమారిలభట్టు పూర్వవృత్తాంతము

ఉ. అట్టుల జైత్రయాత్రికు మహామతి శంకరదేశికుండు దన్
జట్టులు గొల్చిరాఁ బథమునన్ జనుచుండఁగ నొక్కవృద్ధుఁ డ
ప్పట్టున వారిఁ గొల్చి చనువాఁడు ప్రసంగవశానఁ బోలెఁ ద
ద్భట్టబుధేంద్రుపూర్వచరితం బిటు చెప్పఁదొడంగె నేఁగుచున్. 2

క. సర్వజ్ఞ! తమ రెఱుంగని
దుర్వి నెదియు లేదు గాని యున్నవి కథ లా
యుర్వీసురుఁ గూరిచి యవి
సర్వము విని చెప్పవలయు సార మ్మందున్. 3

చ. అతని మహేశునాజ్ఞ ధరయందు నరాకృతిఁ గన్న పార్వతీ
సుతుఁ డగునక్కుమారుఁ డనుచున్ శ్రుతిరక్షణదీక్షితుం డటం
చతిమహిమాన్వితుం డనుచు నందఱు సెప్పుదు రావిచిత్రపుం
గత లవి యెంత విన్న మదిఁ గౌతుక మాఱదు దేశికేశ్వరా! 4

గీ. కలదు జయమంగళ మ్మనుగ్రామ ముత్క
లాంధ్రదేశమ్ములకు సంధియందు, నందు

నంద నాంధ్రులె యందు ద్విజాన్వయమునఁ
బుట్టెను గుమారిలుం డనుపూతవృత్తి. 5

క. పోడమి సకలసంస్క్రియలను
బడసి శ్రుతులు స్మృతులు శాస్త్రపటలిఁ జదివి యె
య్యెడ సాటిలేనిశౌర్యము
కడలొత్తఁ గుమారిలుఁడు జగంబున మించెన్. 6

గీ. భట్టపాదాహ్వయాంతరప్రథితుఁ డగుచు
జైమినిమునీంద్ర విరచితశాస్త్రవార్ధి
గుంభజునిపోలె నలపోకఁ గ్రోలి త్రేన్చి
తంత్రవార్తిక మనెడుగ్రంథము రచించె. 7

శా. మీమాంసాగమవజ్రపంజరము బంహిష్ఠార్థనిక్షేప ము
ద్దామామ్నాయతరీనియామకము శ్రౌతస్మార్తకర్మాకృతి
గ్రామాదర్శము తత్పురాణనిచితార్థగ్రావటంకంబు ప్ర
జ్ఞామంతవ్యము తంత్రవార్తిక మనంగా గ్రంథసామాన్యమే. 8

వ. అది యట్లుండె నత్తఱి. 9

సీ. సర్వవస్తులు పరోక్షజ్ఞానవిషయంబు
లనుచు వాదించు సౌత్రాంతికులును
సకలమ్మును కపరోక్షజ్ఞానవిషయతఁ
బటుమతిఁ జెప్పువైభాషికులును
విశ్వంబు విజ్ఞానవిపరిణామమె యంచుఁ
బలుకుయోగాచారపండితులును
దేహాతిరిక్తంబు దేహప్రమాణ మా
త్మం బని యనుచు దిగంబరులును
గీ. బరఁగ దేహాత్మవాదిచార్వాకమతులు
భూమి యీనినయటు నిండిపోయి వేద

మాత గళహస్తమునఁ ద్రోసి మట్టుచుండఁ
గనులు చిల్లులువోవఁగా గాంచె నతఁడు. 10

గీ. క్రముక తాంబూలపత్త్రి చూర్ణములు గలియ
మదము నారుణ్యము జనించుమాడ్కి దేహ
పరిణతము లైనభూతాళివలనఁ బొడముఁ
జేతన యటన్న చార్వాకనీతి కడలు. 11

సీ. వేదవాదులఁ జూచి వెక్కిరించెడువారు
శీలవంతులను దూషించువారు
యజ్ఞసంభారమ్ము లపహరించెడివారు
ఋత్విగ్గణంబు గాఱించువారు
కొత్తడులను జెఱగొంచుఁ గూడెడివారు
దైవమ్ము లేదంచుఁ దలఁచువారు
ప్రకృతియే సృష్టికారణమంచు చఱచువారు
ప్రత్యక్షవాదులై పరఁగువారు

గీ. వర్ణభేదమ్ము తలఁగింపవలె నటంచు
నఖిలపాషండసంప్రదాయములఁ దెచ్చి
యలజడి యొనర్పసాగిరి నాస్తికౌఘ
మవధి దాఁటుమహాంభోధియనువు దోఁప. 12

సీ. అకృతకమ్ములు శ్రుతు లనుమాట నమ్మరా
దున్నదే కర్త లే కొక్కక్రియయు
నాకమే లేదు జన్మమ్మున నెటుగల్గుఁ
బశుమారణాత్తపాపంబు గాక
పారవశ్యమ్మె నిర్వాణమ్ము గాన సీ
ధురససేవన నది దొరకు హేల

నింద్రియక్షోభమ్ము హింస యాట యభేష్ట
విహరణంబే ధర్మవృత్తహేతు
గీ. వనుచు స్వేచ్ఛాప్రచారులై యాదిగాత
మోదితసుశీలమునుగూడ నుజ్జగించి
కేవలము వేదచోదితక్రియల కెదురు
సలుపుటె మతంబుగా నాస్తికులు ప్రబలిరి. 13

మ. అది యెల్లం గని యక్కుమారిలుఁ డహింసాదిప్రబోధం బొన
ర్చ్చుదయాళుం డగుబుద్ధదేవుమతమున్ గ్రూరంబుగాఁ జేసి రీ
వదరుంబోతులు పెక్కురై యెటు సహింపన్ జెల్లు నీపేడ దు
ర్మదులన్ వీరి నడంపకున్న శ్రుతిధర్మం బెల్ల వమ్మయ్యెడున్. 14

మ. మసి యాయెన్ గులరీతి వేదము కళామాత్రంబు శేషించె వె
క్కసమాయెన్ జినధూమకేతువుల లెక్కింపట్టహా యంచు మా
నస మింతింతగ బ్రీల నాస్తికమతాంతర్వాణులన్ గెల్వ నెం
చి సభారంగములందు నోటువడెఁ దత్సిద్ధాంతమర్మజ్ఞతన్. 15

గీ. శత్రుపక్షరహస్యవిజ్ఞాత కాక
జయము నెటు పొందనో నంచు సౌగతాగ
మంబు పఠియించుపూన్కిఁ దన్మతగురువుల
నెందఱినో వేఁడి వైయర్థ్య మెనసి పోగులు. 16

ఉ. వైదికకర్మశీలుఁడు సవంబు లొనర్చిన సోనికుండు ఛీ
ఛీ దయమాలువాఁ డని హసించుచుఁ దిట్టుచుఁ బొమ్మటంచు మ
ర్యాద దొఱంగి పల్కుటయు నక్కట యెట్టు లెఱుంగు టంచుఁ జిం
తాదహనంబు నిచ్చలు మనం బెరియింప వహించె నాత్మలోన్. 17

క. ఆరీతి గొన్నిదివసము
లోర్చెఁ గానీ జిగీష యుక్తా యుక్తా

చారవిహారుని జేయఁగఁ
జోరక్రియ నేని జదువఁ జూచి మనమునన్. 18

కుమారిలుఁడు బౌద్ధాగమము లభ్యసించుట

మ. "కపటోపాయము వన్నియైన రిపుమార్గంబున్ గ్రహింపందగున్
గపటిన్ గైతవరీతిచే గెలువ నౌఁగా" యంచు భావించి వై
నపరివ్రాజకవేష మూని యొకవైజనప్రాజ్ఞు శుశ్రూషచే
సి పఠించున్ సుగతోక్తిమర్మములఁ దచ్ఛిష్యాంతరాసీనుఁడై. 19

క. కించిన్న్యూనముగా గ్రహి
యించెను దన్మతరహస్య మెల్లఁ దెలియ, నా
వంచన మెఱుంగకుండఁ జ
రించుచు నుండఁగ నొకప్డు క్రించుఁదనమునన్. 20

క. ఆగురువు వేదమాతను
వేగతుల వినింద సలుప వీనులు ప్రిదులన్
మూఁగయటు లుండె నైనను
నాఁగక యాసుధికిఁ గనుల నశ్రులు వొడమెన్. 21

గీ. నింద హెచ్చ బుధేంద్రుకన్నీరు వెచ్చ
నయి కణాకృతి నొక్కమా ఱవని రాలె
బౌద్ధమతలక్ష్మిగూడ నప్పట్ల విడిచె
నాత్మసంశయ భీ జనితాశ్రుకణము. 22

గీ. పాఠము సమాప్త మయ్యె నప్పట్ల నుండ
కెటకొ యాతఁడు సనుడు నచ్చట సతీర్థ్యు
లెల్ల గుమిగూడి కనుఁబ్రామి యెవఁడొ వీఁడు
మనరహస్యము లెఱుఁగవచ్చినఖలుండవ. 23

క. కాదేని మనగురుం డటు
వేదము దూషింప నట్లు విలపించునొకో
వైదికుఁ డగుటయు నిజము ప్ర
మాద మ్మొనరించుపొత్తు మన కందఱకున్. 23

క. అని తర్కించి వినిశ్చయ
మును గురునకుఁ జెప్ప నతఁ డపూర్వామర్షం
బున "వీనిని రే నిద్రిం
చినతఱి సౌధంబునుండి క్షితిఁ ద్రోయుండా." 24

ఉ. నా విని శిష్యు లెల్లరు మనంబునఁ బొంగుచు వల్లె యంచు నా
రే వివశత్వ మొంది నిదురించుతనున్ మహిఁ ద్రోయఁ గూలుచున్
దైవవశాన మేల్కొని యెదన్ దలఁచెన్ 'శ్రుతులే ప్రమాణ మౌ
చో విపులాధిపాతహతి సుంతయుఁ బొరదు' నటంచు ధీరుఁడై. 25

సీ. అటుల తలఁచుచు సౌధాగ్రిముందునుండి
పుడమిఁ బడి కీడొకింతయుఁ బొరయఁ డయ్యె
గాని 'శ్రుతియే ప్రమాణంబ యేని' యనిన
సంశయార్థక మొకకన్ను చదిపి వైచె. 26

కుమారిలుని దిగ్విజయము

మ. తొలుతన్ సౌగతు లన్న నేవపడు, నందున్ దన్ను వారట్లుగా
సిలఁ ద్రోయఁగ మఱియింత దాని బలియించెన్ జెప్ప నేమున్న ద
య్యలఘుజ్ఞాని త్రియీవిఘాతకుల మాయం జేయ మాత్సర్యసం
కలితాంతఃకరణంబునన్ వెడలె దిగ్వాటంబు గూటాడఁగన్. 27

శా. క్రౌంచారాతి వతార మన్నప్రథతో రాజిల్లుచున్ భట్టపా
దాంచన్నామమునన్ జరింపు చర్యణావ్యక్తీకృతం బౌజ్ఞగ

బించఁ జేయుసహస్రరశ్మివలె గౌరీశాజ్ఞ ధాత్రిన్ వెలా
రించెన్ జైమినిసూత్రితం బగుత్రియీబ్బందంబుతాత్పర్యమున్. 28

గీ. అటుల ప్రకటించుచు జయించు చఖిలదిశలు
క్రమముగ సుధన్వనృపతి పురంబు సేర
నెదురు సనుదెంచి మ్రొక్కి భూమీశుఁ డపుడు
పూజ లొనరించె విధ్యుక్తముగను భక్తి. 29

మ. నరనాథార్చితుఁడై బుధుండు ముద మానఁ జేని దీవించి త
త్పరిషన్మధ్యసువర్ణపీఠి నమరోద్యానం బధిష్ఠించునా
సురభింబోలె నలంకరించి సవిధక్ష్మోణీజరాజత్పిక
స్వర మాలించి వచించె భూభుజుని దద్వ్యాజంబునన్ ధీరతన్. 30

క. శ్రుతిదూషకరుతి మలినా
కృతి నీచైర్గతియు నైనయిక్ష్వాకవిసం
తతిసంగతి నీ కోపర
భృతమ ! కలుగదేని ఖ్యాతి కిరవా దనినన్. 31

క. సాభిప్రాయం బగుద్విజు
నాభాషణ మాలకించి యంఘ్రితలన్ప్రో
ష్టాభీలభుజగములవలె
క్షోభించిరి కినుక నచటిసుగతమతస్థుల్. 32

గీ. బుద్ధసిద్ధాంతధాత్రీజములను యుక్తి
పరశువునఁ దున్మి తూటాడి భట్టపదుఁడు
ప్రోగుసేసినతద్గ్రంథరూపకేంధ
నముల రవులించెఁ గోత్రాగ్ని నాల్గుకడల. 33

క. రోషాయణరుచికలితము
లౌ షడభిజ్ఞాననముల నానృపుసభ ప్రి

త్వ్యాపాతపతాఁమ్రినలిన
భూషితసరసీప్రకారమున నలరారెన్. 34

మ. వా రాక్షేప మెలర్ప నొండొరుల గెల్వం బూనువాదోపవా
దారావంబు రసాతలం బవియఁ జేయన్ సాగె; నాధీరుఁ డే
పారన్ గూర్చె నధోగతిన్ క్షణములో నా జైనగోత్రాళికిన్.
సారామేయకఠోరతర్కములఁ బక్షచ్ఛేదమున్ జేయుచున్. 35

ఉ. విజ్ఞుఁడు భట్టపాదుఁ డరిబృందము దాల్చుసనన్యసాధ్యస
ర్వజ్ఞపదంబు నోర్వని తెఱంగున వారిని బొమ్మలట్టు ల
ప్రాజ్ఞులభాతి మానపరిరబ్ధులఁ జేసి, నరేంద్రు డాసి, స్వ
ప్రజ్ఞఁ బ్రశంససేసె శ్రుతివాఙ్మహిమంబు సుబోధ మానటుల్. 36

ఆ. అపుడు రాజు వలికె నాకుమారిలుని వి
ద్యావశంబు గద జయాజయంబు?
లీయహార్యశృంగ మెక్కి వేదమహత్త్వ
మెఱుక వడఁగఁ బుడమి నుఱుకఁగలవె? 37

ఉ. వేదము బ్రహ్మరూప మని వేదమ సర్వచరాచరంబు ను
త్పాదనఁ జేయుఁ బ్రోచును యథార్థ మటంచు వచింతు తత్ప్రియా
మేదురశక్తి నీవు పుడమిన్ బడి చావక నోప కున్న నీ
పాదము లాశ్రయించెద భవద్గురుభావము నమ్మి యుండెదన్. 38

వ. అని ధీరముగాఁ బలికె నంత.

చ. అది విని బౌద్ధు లొండొరుల యాననముల్ గనుఁగొంచు నుండ భూ
త్రిదశుఁ డకృత్రిమోక్తుల స్మరించుచుఁ దద్గిరిశృంగ మెక్కి స
మ్మదమున బొంగి వేదము ప్రమాణమ కాన నొకింత హాని నా
కొదవదు వేదమాతృపదయుగ్మమె నాకు శరణ్య మయ్యెడున్. 40

శా. ఆలింపుండి సమస్తలోకులు! త్రయీవ్యాహారముల్ శాశ్వతం
బాలోచింపఁగ దైవ మాశ్రితచయార్థాధీనమై వెల్గుఁ, ద
ల్లీలాకల్పితలోకసంచయుఁడు నాహృద్వర్తియై యుండి యీ
శైలాగ్రచ్యుతు నన్నుఁ బ్రోవఁగ నుపేక్షం జేయఁడే నమ్మితిన్. 41

మ. అని యుచ్చైర్నినదంబునన్ నిగమమాహాత్మ్యంబు నగ్గించి మె
త్తనిపూసెజ్జను వ్రాలుచందమున గోత్రన్ వ్రాలె నాకాశచుం
బనచుంచన్మణిభృన్మహోన్నతశిరోభాగంబునం దుండి 'జే'
యనుచున్ నిర్భరధైర్య మూని జనహాహాకారముల్ మీఱఁగన్.

క. ద్రాహిత్రపతీర్ణశ్రీ
యోహానిచ్యుతసురాలయు యయాతిఁగ సం
దేహించిరి చూపఱు తం
గాహార్యశిరోనిపతదనంతామరునిన్. 43

ఆ. కొండనుండి తూలపిండంబు డంబున
నరలు నితఁడె లోకగురుఁ డటంచుఁ
దన్ను నమ్మువారి దైన్యమ్ము పోకార్చు
శ్రుతియు యనుచుఁ బలుకఁ జొచ్చె జనము. 44

శా. జీమూతోజ్జ్వలిత గర్జిత శ్రీవణ విశ్లిష్టాత్మకుం జాహ్నభు
క్త్వామాకార తదద్భుతక్రమకృతి శ్రుత్యగ్రతానేకది
గ్ధామ బ్రాహ్మణవృత్తు నతుతు బుధున్ దర్శించి తేఁడున్ శ్రుతి
ప్రామాణ్యమ్ము గ్రహించి దూఱుకొనుచున్ బౌద్ధాళితో నిట్లనున్.

గీ. కరటి కో వేదవాక్కులఁ గలుగు మహిమ
ఎంతగొల్లరా దేవుఁ డున్నట్టు లిప్పుడేని

యనుటయు సమన్తభద్రమతానుసారాయు
లని రసంగీకృతిసిఁ దెల్చె నవనిపతికి. 46

గీ. 'అవనిపాలక! మతనిర్ణయమున కిది ప్ర
మాణ మెటు? లోషధుల మణిమంత్రముల శ
రీరరక్ష యటా' యనుచు నైంద్రియికవిషయ
మపలంపింపఁగ నృపుఁ డల్గి యనియె నిట్లు. 47

శా. ఆకాశోన్నతభూరిభూమిధరశృంగారోహియై వేదవా
చాకారుణ్యబలంబునన్ ధరణిపైఁ జాకుండ వ్రాలంగ, ని
ర్భీకప్రక్రియ నప్రమాణ మనినారే మిమ్ము నేత్రోయ నే
వీఁకన్ మందులఁ జావకుందురో కదా వీక్షింపఁగాఁ దగ్గదే. 48

గీ. అని కుమారిలు బలసియున్నట్టిద్విజుల
బౌద్ధపండితమండలిఁ బాఱఁజూచి
వేదమునకును మణ్యోషధాదులకును
గలమహిమభేదములు చూపవలయు నేఁడ. 49

చ. 'అడిగెద నొక్కప్రశ్న మిము నందుల కుత్తర మేరు చెప్పలే
కెడయుదు రట్టివారి వధియించెద యంత్రశిలావిఘట్టనన్
బడ' నని భ్రూకుటీభయదఫాలము దోఁప ద్విపక్షవాదులున్
గడగడలాడి పోవఁ బ్రతినన్ వహియించి క్షితీశుఁ డయ్యెడన్. 50

క. ఏకతమున నొకఘటమునఁ
గాకోదర ముంచి మూఁత గట్టిగ నిడి మీ
రీకడవ నేమి యున్నదొ
వాకొనవలె ననుచుఁ బిడుగుపాటుగఁ బలికెన్. 51

క. ద్విజుఁడున్ సౌగతులున్ భూ
భుజుఁ గని యెల్లిటిప్రభాతమునఁ జెప్పెద మీ

నిజ మని ప్రసన్ను నొనరించి
నిజవసతుల కరిగి రెదల నెవ్వగ మిగులన్. 52

మ. పచరించెన్ ద్యుమణిన్ గుణించి తప మాబాడబ్యు మారేయి ప
ద్మచయపక్రియఁ గఁరదమ్ము జలమధ్యస్థానులై; యంతటన్
వచనీయాంశ మినుండు చెప్పి యపిధానం బొంద నేఁ తెంచె వి
ప్రచయం; బట్టులె వచ్చె జైనతతి కుంభస్థాపితార్థజ్ఞమై. 53

చ. క్షితిపతి నిందుకొల్వున వసించి సభన్ నలువంకఁ గాంచి చే
రితిరె ద్విపక్షవాదులు నెఱింగితిరే ఘటగుప్తవస్తు వం
చతికుతుకమ్ముతో నడుగ నాస్తికు లప్డు గుణించి జ్యోతిష
ప్రతిభ వచించి రిందు నొకపన్నగ మున్నది యంచు సత్యమున్.

వ. అంత భట్టారకుఁడు సభామధ్యస్థం బగుకుంభంబున కెట్టయెదుట నిలిచి యంజలిబంధ బంధురుండై.

సీ. ఆమ్నాయపేటిక యైనమార్గాండుండు
ప్రాసాదరాజ మేప్రభువరునకు
శబ్దశాస్త్రానుశాసకుఁ డైనశేషాహి
హారంబట్టుతలిమ మేహరాయలుకాని
కఖలాంతరస్థుఁడై యాడించు బొమ్మల
మాడ్కి లోకముల నేమాయలాఁడు
యజ్ఞమ్ములందు హవ్యప్రీతుఁడై స్వర్గ
ఫలమిచ్చు యాయజూకులకు నెవ్వఁ

గీ. డట్టిశ్రీపతి యాదినారాయణుండు
శంఖమును జక్రమును గద శార్ఙ్గధనువు
కరచతుష్టయమున కలంకారములుగఁ
గుండలోఁ గుండలీంద్రుపైఁ బండియుండె. 56

క. అనుటయుఁ దోడిద్విజన్ములు
నని రటువలె; మింటనుండి నది సత్య మటం
చు నొకయశరీరవాణియు
విననయ్యెను సభ్యు లెల్ల విస్మయ మొందన్. 57

క. నరనాథుం డది విని య
బ్బురపడి తత్సమితిమధ్యమునకు రయమునై
నరుదెంచి కాలుఁ గేలుం
గరము వణఁక ఘటము మూఁతఁ గ్రిక్కునఁ దోచె.     58

శా. కుంభాచ్ఛాదనమున్ దొలంచుటయు నక్కుంభీనసాంగంబునం
దంభోజాక్షుఁడు దోశ్చతుష్కమునఁ జక్రాద్యాయుధంబుల్ వెలుం
గం భాషాపతి నాభిపద్మమున వెల్గన్ లక్ష్మి కాళ్లొత్త నీ
లాంభోదమ్మటు లెస్స పండికొనినట్లై మాయమయ్యెన్ వెసన్.

సీ. పృథివీశ్వరుం డశరీరవాక్కెఱుఁగఁ గుం
భాచ్ఛాదన మ్మూడ్చ్చ యరసె లోన
నరయ వాసవునకు నమృతమ ట్లాఘట
మందుఁ జూపట్టెఁ గంజాక్షుమూర్తి
న్యస్తాన్యవస్తుసందర్శనమ్మున ధరా
పతి సంశయము వాసి శ్రుతినె నమ్మె
శ్రుతివినిందకులు దుర్మతికి సిద్ధులుగం డ
టంచు ఘోరముగ రాజాజ్ఞ వొడమె
గీ. నాతుషారాద్రి యాసేతు వవనిఁ గలత్ర
యీవిరుద్ధుల నాబాలవృద్ధకముగ
సంహరింపనిభృత్యుండు చచ్చువాఁ డ
టంచు నతిభీకరముగ శాసించె నృపతి. 60

ఆ. తుంత్రు రిష్టునేని దోష మించుక సేయు
నంతమాత్రమున మహాత్ము లలిగి
చంపలేదె తొల్లి జామదగ్న్యుఁడు పాడి
తప్పె ననుచుఁ గన్నతల్లిఁ దానె. 61

క. స్కందానుచరుం డగునృప
చందికుచేఁ బడిరి ధర్మశత్రులు జైనుల్
క్రిందుగఁ; దత్త్వాలంబా
ప్తిం దనరెడుయోగిచేత విఘ్నములగలిన్. 62

సీ. శ్రుతి ప్రమాణమ్ముగా మతిఁ దలంచెద మంచు
విలపించి మ్రొక్కువారలను దక్క
శ్రౌతకృత్యముల దూఱ మిఁకెన్న డంచుఁ గం
పిలి యంగలార్చువారలను దక్కఁ
జీనాదిదేశముల్ చెదరిపోయి మతంబుఁ
దొలఁగక బ్రతుకువారలను దక్కఁ
నవమానమున నాత్మహత్య కొగ్గి శరీర
ముల విసర్జించువారలను దక్క

గీ. నెల్లెడ వసించు నాస్తిక బృందములను
వెదకి వెదకి వధించిరి విపులయంత్ర
శిలలఁ గదియించి నృపునాజ్ఞఁ దల ధరించి
కలికమున కేని లేకుండుకరణి భటులు. 63

ఉ. కాలగతిన్ దమం బఱఁగఁ గాంతితతిన్ రవిఁబోలి [illegible]
వ్వేళ నశింప వేదపదవిన్ బ్రసరింపఁగఁజేసె విప్రుఁ డుద్దండుం
లీల మృగేంద్రుఁ డొంచుఁ గబళింపఁగ రిపుద్విరదోత్కరంబు [illegible]
గ్రాలె నిరంతరాయగతిఁ [illegible] అఖిల [illegible] 64

కుమారిలుని పశ్చాత్తాపము

మ. అవమానంబున కోర్వ కాత్మవధకృత్యాయత్తు లౌవారిలో
మివులన్ ముఖ్యుఁడుగాఁ గుమారిలునకుం బెంపార బౌద్ధాగమం
బు వినేయుం డని నేర్పినట్టిగురుఁడున్ ముందై నశింపం, దదీ
యవినాశంబున కేన హేతు వని సత్యం బాద్విజుం డార్తుఁడై. 65

ఉ. వంచన మేన చేసి చదువన్ దొరఁకొంటినిగాక మాయ యొ
క్కించుకయున్ గురుం డెఱుఁగునే జయకాంక్ష యిసీ! నయానయం
బెంచఁగనీయ దొజ్జ వధియించినపాపము వాయ నిష్కృతిన్
గాంచనె? యెట్టిదుష్క్రియ నొనర్చితి? నాజయ మేల? కాల్పనే.

మ. అని మీమాంసకుఁ డౌకుమారిలుఁడు ప్రాయశ్చిత్తమున్ గోరి స
జ్జనసంఘంబుల డాయ, వారు "జయదీక్షఁ గొన్న తేజస్వి నం
టునె పాపంబు? గురున్ వధింప నఘమున్ బుణ్యంబు సామాన్యులన్
దునుమన్ గల్గునె? యేటికింత కలఁగన్ దోషజ్ఞ! యాలింపుమా,

శా. తేజశ్శాలికిఁ బ్రత్యవాయ మనుసంధింపంగ రా దంచు ని
ర్వ్యాజస్ఫూర్తి స్మృతుల్ వంచించును; ద్వాదారంభంబు వేదాధ్వర
త్వాజాగ్రన్మహిమాఢ్య మా, నఘము రాగద్వేషమూలంబు-నీ
వాజిన్ రాజభటుండువోలె నిగమజ్ఞా! నిత్యశుద్ధుండవే. 68

శా. ఐనం గాని యుధిష్ఠిరుండు తనక్షాత్రాచారముం బూని యే
నానావైరులఁ ద్రుంచి, యందు గురులన్ బంధూత్కరం బెంచి శో
కానంత్యమ్మునఁ గ్రాఁగి దానికయి ప్రాయశ్చిత్తముం బూనుచం
దానన్ దృప్తికి నీ వొనర్పు తపమున్ ద్యాగంబు యాగంబులున్.

క. అన స్వస్థచిత్తుఁడై య
య్యనఘుఁడు సర్వస్వ మపుడ యాచకుల కొసం

గెను గేహక్షేత్రము లి
చ్చెను భూసురతతికి దండసిలఁ బాపంబుల్. 70

ఉ. యాగము లం దొనర్చిన సహస్రగుణం బగుటన్ బ్రయాగ మా
యాగము మాని యున్నను బ్రయాగము యాగఫలంబు లిచ్చు నం
చాగమ ముంట నాతఁడు ప్రయాగకు నేఁగి వసించి యెన్నియో
యాగములన్ బొనర్చి చరితార్థతఁ గాంచినవాఁడు సత్తమా. 71

ఉ. కర్మఠుఁడై యఘోరకలికాలమహాఘము లొత్తగిల్లి పో
దుర్మతమర్మహం డయి శ్రుతుల్ స్మృతులున్ విరులట్లు విచ్చి గం
ధోర్ముల సర్వలోకముల నూఁపఁగఁ జూపుచు నీప్రయాగనే
శర్మమునన్ వసించు శ్రుతిజాగరమై గురుశాస్త్రవర్మమై. 72

వ. అని కుమారిలభట్టచరితంబు వృద్ధవిప్రుండు దెలుపుచుండ నూఁకొ
నుచు మార్గాయాసంబు గణింపక కతిపయప్రయాణంబుల
సశిష్యుఁడై చని చని. 73

శంకరుఁడు ప్రయాగ కేఁగి కుమారిలుని దర్శించుట

గీ. ఔపనిషదరహోవేత్త యఖిలకుమత
భేత్త యతిమాళి సాధితవేదకర్మ
జాలుని గుమారిలుని వాదలీల విజితుఁ
జేయువేడ్కఁ బ్రయాగమ్ము సేరి యంత 74

చ. అవహితభక్తిముక్కలి మునట్టి నరాళిమెయిన్ సితాసిత
చ్ఛవిగ నొనర్చుపొంటెఁ గృతసంగకళిందతనూజ యైనజా
హ్నవి నఘహంత్రి భవ్యపురుషార్థపథం బగుదాని భిక్షుపా
ర్థివుఁడు ప్రయాగమధ్యగతఁ బ్రేమ కడల్కొనఁ జేరెనొయ్యనన్. 75

సీ. భాగీరథీఝరీ పరిశుద్ధవేగమై
కాళింది యెచ్చోట జాలువాఱు
నమలరుక్సంప్రదాయము నేర్వ నెందేని
నంచలు జలము సేవించుచుండు
శర్వరీసహవాససౌఖ్యార్థులై చక్ర
యుగము లెచ్చటనీట నోలసి యుండు
నాచంద్రతారకం బమరాకృతుల సుఖ
యింతు రెచ్చో మున్క లిడినవారు

గీ. గ్రాలునంతఃప్రవాహ సరస్వతి యెట
యమున యై గంగయు నయి సితాసితముగ
నట్టి వేణీత్రితయసంగమాంబులందు
మునిఁగి శంకరగురుఁ డిట్లు వినుతిసేసె. 76

గీ సిద్ధనది! శంకరజటోపరుద్ధ వగుటఁ
గ్రుద్ధ వయ్యుఁ దన్నిభులఁ బెక్కుర సృజింతు
బద్ధఁ జేయరె జటల నవ్వారలు జడ
బుద్ధు లెఱుఁగంగలారె రాఁబోవుదాని. 77

ఉ. అంబరో! సత్పథానుసరణాతికుతూహల వయ్యుఁదాల్తు హే
యం బగునస్థులన్ సతత మక్కట యే మనుకొంటిఁ గాని స
త్యంబు నెఱింగితిన్ ద్వదమలాంబునిమజ్జను లై నసజ్జనౌ
ఘంబు నలంకరించుటకుఁ గా నివి యెల్ల గ్రహింతు వాస్థమై. 78

గీ. శౌరి స్వాపానుషంగజాడ్యము గను జ
నాళి స్వాపానుషంగజాడ్యాపగతుల
నల్పుదువు విషయవిరక్తజనుల ధూర్త
హాళుల నొనర్తు విది యేమి మార్గమమ్మ. 79

సీ. అనుచుఁ ద్రివేణిని వినుతించుచుఁ గటీర
మున శాటికను జుట్టుకొని కరయుగి
వైణవదండ ముప్పర మెత్తికొని పట్టి
యఘమర్షణావగాహం బొనర్చి
చరితార్థుఁ డయ్యుఁ దా జనసంగ్రహార్థమ్ము
సచ్ఛాత్రుఁడై యందు స్నానమాడు
నత్తఱిఁ దనుగర్భమందుఁ దాలిచి కని
పెంచఁ బాల్గొందుసవిత్రిఁ దలఁచి
గీ. తీర్చుకొని యనుష్ఠాన మత్తీరమునఁ ద
మాలసుచ్ఛాయఁ గల్హారపాళిశీత
వాతసేవల విశ్రాంతి వడయువాఁడు
శంకరుం డొక్కజనవార్త సరగ వినియె. 80

తుషాగ్నిప్రవిష్టుఁ డగుకుమారిలుని శంకరుండు దర్శించుట

గీ. సజ్జనుల కేడ్గడయునై యచలమునుండి
యిలఁ బడి శ్రుతిప్రమాణత నెవఁడు చాటె
నెవ్వనిప్రసాదమున వేల్పు లెప్పటట్ల
యజ్ఞభాగంబు లొందుభాగ్యంబు గనిరొ. 81

క. అట్టిఘనుండు కుమారిల
భట్టపదుం డకట స్వగురువధపాప మఱన్
జిట్టుముకచిచ్చులోఁ బడె
నట్టె త్రయీహృదయవిజ్ఞుఁ డాస్తికుఁ డగుటన్ 82

గీ. ఆతఁ డొకపాటివాఁడె యధీతవేద
జుష్టమంత్రుండు దూరితదుష్టతంత్రుఁ
డఖిలతంత్రస్వతంత్రుండు నిఖిలభువన
మండలీభ్రాంతకీర్తియంత్రుండు దలఁప. 83

క. అనువార్త విని యతియుఁ జ
య్యనఁ జని తుషరాశిసంస్థు నాభట్టపదున్
గనియెఁ బ్రభాకరముఖశి
ష్యనివహ మశ్రుపులు గాఱ నర్చ లొనర్పన్. 84

క. పొగయుచు రవులుతుషాగ్నుల
సెగల నశేషముగ మేను చిటచిటఁ గాలన్
వగలేని మొగము బాష్ప
పగతాబ్జ మనఁ వెలుంగు వానిం డాసెన్. 85

సీ. చరమదేహము భస్మసాత్కృతమయి లోని
యస్థులు కాలి మ్రుగ్గుచు రాల
ద్రవగర్భనాడికాంతములు చిమ్మనఁ గ్రొవ్వు
లన నిప్పఁ జుంయి చుం య్యనుచు నార్పఁ
బలలపిండమ్ములు భస్మమ్ము గాక చి
ట్టైము గట్టి కమరుగంధములు గ్రక్కఁ
గాలఁగా మిగిలి సూక్ష్మముగఁ గాలెడుచర్మ
మున బుస్సు మని కప్పపొక్కు లెగయ

గీ. మలయునిప్పులదహనదూమ్యావ్రపతాన
మునఁ గనుంగవ గనరాక కనుచు నున్న
భట్టపాదుని గని యార్తి పట్టఁజాల
కంతటివిరాగి శంకరుం డశ్రు లొడ్చె. 86

ఉ. అంతలపొంతలన్ గనఁగనొ నసఘున్ యతిచంద్రునిన్ గటా
క్షాంతనిరీక్షఁ గాంచి జ్వాలదగ్నినిభుండు జితారి వేదవా
క్సంతతి రక్షకుం డగు ద్విజన్ముఁ డిదృష్టచరున్ విబుద్ధవృ
త్తాంతుని గంటి నేఁ డనుచు నానినమోదము చెప్ప సాధ్యమే. 87

గీ. అవశుఁడై పడియుండియు నాద్విజుండు
శిష్యతతిచేత భక్తిఁ బూజింపఁ జేసె
భిక్షుఁగాని శంకరుండుఁ దృప్తిని దనర్చి
స్వకృత మగుబ్రహ్మసూత్రభాష్యంబు సూపె. 88

క. అది యట్టిద సుజనదయా
స్పద మయిన నెఖిల మగునిబంధనము యశః
పద మొందుఁ; గానియెడ నం
దదుకుబ్రదుకు గాంచవచ్చు నణఁగన్ వచ్చున్. 89

వ. అంత భట్టపాదుం డాగ్రంథమును గన్నులఁ గాంచి యున్నరని
వగచి యిట్లను. 90

గీ. ఇట్టి దీక్షను నేను గ్రహింపనేని
భాష్యములకు రచింపనే వార్తికములఁ
గనఁగఁ దత్ప్రథమాధ్యాయమున కెనిమిది
వేలవార్తికముల యవలీలఁ గావా. 91

ఉ. సారవిదూరసంసరణసాగరమగ్నులకున్ భవాదృశో
దారచరిత్రు లైనమహితాత్ములసంగతి యొక్కటే సుమీ
పారము సేరఁగాఁ దగునుపాయము గా కితరంబు లేతదు
త్తారణశక్తి నుత్తవె కదా వగ దా సలుపన్ జగద్గురూ! 92

క. చిరముగ భగవంతుని నిను
వరయం గోరెదను; నేఁటి కది తీఱెను సం
సరణార్ణవగు లగు నరులకుఁ
గర మభిమతసిద్ధి యిష్టగతిఁ గలుగునొకో. 93

గీ. కాల మిష్టులతో నొకవేళఁ గలుపుఁ
గలుపు నొకపు డరిష్టు లౌఖులులతోడ
నటుల కలిపియు నెడఁబాపు నంతలోన
కష్టసుఖములు కాలంబుకై వసములు. 94

వ. అనవుడు యతిపుంగవుఁడు 'విబుధేంద్రా! భవదీయచరితం బం తయు వింటి; భావత్కం బగుతంత్రవార్త్తికం బధ్యయనించితి. నీవు మహీతలంబునం దవతరింపవేని జైమినిప్రయాసంబు వ్యర్థంబు గాదె. హవ్యంబుల దేవతలను గవ్యంబులఁ బితరులను దనియించితి. వైదికమతకంటకు లగుజైనాదిపాషండజనంబుల నుచ్చాటనం బొన ర్చి జన్మం బర్థవంతము గావించికొంటి వైన నేమి? నేఁ 'డాజైనగురు ద్రోహము నీశ్వరనిరాస మనునిజదోషద్వయపరిహారకంబుగఁ దు షాగ్నిఁ జొచ్చి' తని కింవదంతి యీక్షేత్రంబునంద యాలించితి. తుషాగ్నిప్రవేశ హేతు వదియ యగునే వినవలతు ననుటయుఁ గుమారిలుఁ డిట్లనె. 95

సీ. చదివినాఁడను వేదశాస్త్రమ్ము లామూల
మాచూడముగ బాల్యమంద శ్రద్ధ
విరచించినాఁడ నిర్భరదీక్షఁ దంత్రవా
ర్త్తికముఖ్యకృతులు శ్రుతిప్రియముగ
గెలిచినాఁడ సభాస్థలుల వితండావాదు
లగుజైనకోటి పెంపఱఁ గడంకఁ
బొందినాఁడ నన్గ్రములు భోగములు యాగ
ముల దైవతర్పణంబు దొలఁచికొంటి

గీ. వేదమార్గరిరక్షిషన్ వెదకి వెదకి
నాస్తికులఁ బలుమాఱు వేఁటాడినాఁడ

వార్ధకమునఁ బ్రయాగకు వచ్చినాఁడ
వ్రతి నవుచుఁ గాల మిటుఁ బుచ్చివైచినాఁడ. 96

సీ. అక్షర మ్మొక్కటి యైనఁ జెప్పినవాఁడు
గురుఁ డనుమాట నే నెఱుఁగనొక్కొ
స్వమతాభిమానవిశ్వాసంబున గురుండు
తనుఁ దా నశింప నాత ప్ప దెట్లు
గురుఁడు సౌధమునుండి కూలఁద్రోయింప జీ
వించియు నింత నిందించితినొకో
నృపతి యూరీతిపన్నిదము పెట్టెను గదా
నేన యోడినఁ జాక నిలుతునొక్కొ

గీ. కుమతవిధ్వంసనము సేయుకొఱకుఁ గెలుతుఁ
గాని గురుఁ జంప నూహించ్చి కాదుగద! య
జాకృపాణీయముగ నది సంఘటిల్లెఁ
జేసికొంటి దానికిని బాచితము దేవ ! 97

శా. నామూలంబున దేశికుండు బలవంతం బైనచా వొందినాఁ
డేమో యంచు ననేకనిష్కృతులు మున్నే చేసికొన్నాఁడఁ జు
మ్మీ మీమాంసకుఁ డౌట; "శత్రుజయమం దేదోషమున్ లేదటం
చామోదించిరి ధర్మవేత్త లలనాఁ డాసేతుశీతాద్రిలోన్. 98

మ. *భృగుపాతంబొ తుషాగ్నిలోఁబడుటొ వారిన్ జొచ్చుటో సల్పఁగా
నగుఁ గాయం బసమర్థ మౌ నెడలఁ గర్మానక్తుఁ డౌ వేత్త' పు
ణ్యగతుల్ హస్తగతంబు లౌ వ్రతి' కటంచామ్నాయముల్ దెల్పవో
పగవా రట్టుల కింవదంతులను నాపై మోపినా రేమొకో. 99

*అనుష్ఠానాసమర్థస్య వానప్రస్థస్యజీర్యతః
భృగ్వగ్ని జలపాతైశ్చ మరణం ప్రవిధీయతే" ఇతిస్మృతిః

క. వానినటుపెట్టు పాండవు
లానాడు తనూనిరీహు లగుచు మహాప్ర
స్థానమ్ము సలుపరే; యటు
లేనుణ్ జొచ్చితిఁ దుషాగ్ని నిది వ్రతము సుమీ. 100

చ. శ్రుతియ స్వతఃప్రమాణ మను మన్ ప్రకటింపఁగఁ బూని వేసిసం
గతి యెహఁబాయ నించుకసుఖంబును గూడఁ బ్రపంచ మీయ న
ర్థ్వాతఁ గనఁ జాలదో-యొకవు డైనను నాశ్రుతిలోకసిద్ధ నం
చితపరమార్థు నీశు నిరసించితిఁ గాని యొనర్చ నిహ్నుతిన్. 101

గీ. నీవు భాష్యమ్ము సేత వింటిని ముదంబు
గంటి నద్దానికిని వార్త్తికంబు గూర్చి
యశము గనువాఁడ నను కుతూహలము గందు
నేమి లాభ మామాట నే నిపుడు నుడువ. 102

ఉ. ఆతతసూరతత్త్వమున నార్యజనంబులఁ బ్రోవఁ,గావ న
ద్వైతము, భూమిఁ బుట్టుభగవంతుఁడ వంచు నెఱుంగుదున్ యతి
వ్రాతలలామ! మున్న కనుపట్టి ననున్ జరితార్థుఁ జేయుచో
నీతటి నిట్టిదీక్ష వహియింప, నిఁ కేమన లాభ మే మగున్. 103

గీ. అకట దీక్ష వహించి తుషాగ్నిఁ బడితిఁ
గాన శాబరభాష్యమ్ముకరణి నీదు
భాష్యమునకును వార్త్తికపాఠమును ర
చించి యశ మొందుభాగ్యము చెందనైతి. 104

క. అన నీషద్వికసితముఖ
వనరుహుఁ డయి గురుఁడు వలుకు వైదికధర్మా
యనకంటకు లగుజైనులఁ
దునుమఁగ బొడమిన యుమాసుతుండవు గావే! 105

గీ. ఆజనుఃపావనుఁడవు నీకఘము గలదె
యేటి కీదుష్కరవ్రతం బిదె కమండ
లూదకము చల్లి బ్రతికింతు నొనర భాష్య
వార్త్తికమ్ము రచింపు ధీవర్య లేచి. 106

ఆ. అనెడు బుధవతంసు నాత్మవిద్వన్మ్యాని
శమధనైకధుర్యు శంకరార్యుఁ
బ్రశ్రయంబు దోఁపఁ బలికె విద్యాధనుం
డైనభట్టపాదుఁ డనువుమీఱ. 107

సీ. నీపల్కు లెస్స, గానీ శుద్ధమైనను
లోకవిరుద్ధముల్ సోఁకఁజాల
నాజానకుటిలులందైన వింటనుబోలె
గుణమె మహాత్ములు గూర్చు చంద్రు
చిరమృతునేని సంజీవింపఁ జేయుదు
పటుదయోర్మిళ దృష్టిపాతమునన
వ్రత మాగమోక్త మారంభించి త్యజియించి
బుధజనాదర మెగ్లు పొందువాఁడఁ

గీ. దెలియనె భవన్మహాత్త? ప్రాణులను ద్రుంచి
మరల సృజియించు నీకు నన్మనుపు టెంత
యైన విడఁజాల నీపూనినట్టివ్రతముఁ
దారకబ్రహ్మ మెఱిగించి ధన్యుఁ జేయు. 108

గీ. జగతి నద్వైతపథము విస్తరిలఁజేయఁ
దలఁచితేని జయింపు విద్వత్పరార్ధ్యు
మండనాఖ్యు దిగంతసంభ్రాంతయశుని;
నతఁడె జితుఁడైన నీవశంబగు జగంబు. 109

ఉ. ఆతఁడు కర్మయోగమును వ్యాప్తి మొనర్చుచు 'విశ్వరూప'వి
ఖ్యాతిని మించె ధాత్రిని; మహాగృహియై శ్రుతికర్మసక్తుఁడై
ప్రీతిఁ బ్రవృత్తిశాస్త్రపదవిన్ బడి, రోయు నివృత్తిశాస్త్ర మ
న్నా!తగుయుక్తివశ్యుని నొనర్చుకొనన్ గడుముట్టుఁ గోరుకల్.110

వ. "ఉంబేకుం" డనుపేర లోకంబునం బరఁగు నవ్విశ్వరూపుఁడు నా
శిష్యుఁడై సకలవిద్యామండనుండు కావుటం జేసి మండనుం డనుబిరు
దనామంబున వ్యవహృతుం డగుచు నుండు, నుభయభారతి యను
పేర నొప్పు నయ్యాయజూకశిరోమణి జాయ "యుంబ" యను నా
మంబున బంధుజనులచేఁ బిలువంబడుచుండు, నాయమ దుర్వా
సోముని శాపంబున మానవియై జనించిన భారతియ యని ప్రసిద్ధి
గల- దది య ట్లుండనిమ్ము. 111

క. ఆవిబుధుఁ డఖిలశాస్త్రక
లావళి నను మించు శిష్యులందుఁ బ్రియతముం
డీ వతనిసతిని సాక్ష్యవి
ధావర్తినిఁ జేసి గెలు మతని వాదమునన్. 112

గీ. అతనిచేఁ దావకీనభాష్యమున వార్తి
కముల గ్రథియింపఁ జేయుమీ యమలచరిత !
సమయమునకు విశ్వేశుచందమున వత్తు
తారకముఁ దెల్పి నను ధన్యతముని సల్పు. 113

మ. నిలు నిర్వ్యాజకృపా!ముహూర్త మిచటన్, నీరూపు యోగీంద్రహృ
న్నలినాత్యంతికభాగ్యమున్ గనుమఁ బ్రాణంబుల్ విడంజూతునం
చలఘుజ్ఞాని యతం డనన్ గురుఁడు శుద్ధాద్వైత మంతర్బహి
ర్గళితాజ్ఞానము బ్రహ్మముం దెలిపె నిష్ఠాఢామలజ్ఞానమున్. 114

క. శంకరుఁ డిటు నిఖిలజగ
చ్ఛంకరుఁ డుపదేశమిచ్చి తారాపథని
శ్శంకగతి మండనాఖ్యు శు
భంకరభవనమున కేఁగ వాంఛించుటయున్. 115

ఉ. మాటలు మాని శాంతిధనమాన్యుఁడు భట్టపదుండు హృత్తమః
పాటన మౌ మమత్వవినివారక మద్వయతత్త్వ మూని జం
జాటము లెల్ల నూడిచి ప్రసన్నము వైష్ణవధామ మొందె న
ప్పాటన శంకరార్యునికృపారస మందుటఁ జూచుచుండఁగన్. 116

శంకరుఁడు మండను దర్శింప నరుగుట

గీ. అపుడు భగవంతుఁ డగుశంకరార్యుఁడు సహ
శిష్యుఁడై యోగశక్తిఁ జెచ్చెర నభోఽయ
నమునఁ జని చేరుకొనియె మండనబుధేంద్రు
కాఁపురం బైనమాహిష్మతీపురంబు. 117

గీ. రత్నకిమ్మీరవరణ మబ్రిమ్ము గూర్చ
నరసి మాహిష్మతీపురాభ్యర్ణవనిని
నంబరవతీర్ణుఁడయ్యె నారాయణావ
తారుఁ డగుభార్గవునిశేవ దండి యతఁడు. 118

చ. వికసితవారిజాతవనవీథుల నాటల నాడు, చూర్మికో
దకకణశీకరంబులను దానములాడుచుఁ, దీరసాలమా
లిక లెగఁ బ్రాఁకి యింత గదలించుచు నయ్యెడ నర్మదానిలా
ర్భకములు భాష్యకారశ్రమభార మడంచి భజించెఁ జల్లఁగన్. 119

ఉ. ఆహరితామలోపవనమందుఁ గృతాహ్నికుఁ డౌచు స్వస్తికా
రోహణశాలియై ఖరకరుండు వెలుంగ గురుండు శిష్యసం

దోహము గొల్చి రా బుధవిధుం డగుమండనుఁ గాంచువేడ్కఁద
ద్గేహము సేరుచుం గనెఁ దదీయభుజిష్యలఁ ద్రోవ నొక్కెడన్.

గీ. నీరు దే నేఁగు నప్పుచారికలను
మండనసుధీంద్రుగృహ మెట నుండు ననుచు
నడుగ నద్భుతశంకరు నతనిఁ గాంచి
ముదితలై యిట్లు వల్కి రమ్ముదిత లాఁగి. 121

సీ. మహిఁ వేదము స్వతఃప్రమాణమా పరతఃప్ర
మాణమా యనెడుసంభాషణముల
ఫలము నిచ్చునది నిచ్చలు కర్మమా పర
మాత్మమా యనెడు వ్యాహారములను
జగము శాశ్వతమా యశాశ్వతమా యన్చు
గొరలి వాదించెడు గీఃఫణితుల
యత్యాశ్రమంబొ గృహస్థాశ్రమంబొ మో
క్షాధాయకం బగు ననెడునుడులఁ

గీ. గీరభామినులు లేగృహద్వారబద్ధ
పంజరస్థమ్ములై శాస్త్రపటలి శ్రుతులఁ
జదివి వాదించుకొనుచుండు నదియ మాప్ర
భుండు మండనపండితుం డుండుగృహము. 122

సీ. ప్రాకారతోరణవ్యాకీర్ణ మయి శిలా
స్తంభశతభ్రాజితంబు నగుచు
గర్భగృహేశ్వరాగారశయ్యాగార
శిల్పనైపుణ్యప్రసిద్ధ మగుచు
సర్వవిద్యాపాఠశాలాప్రపంచసం
భావితతత్పురోభాగ మగుచు

నక్షలర్తు ఫల లతాంతాంచిత తరులతా
భ్యర్హితప్రమదావనాఢ్య మగుచు

గీ. విబుధమండనమిశ్రు నివేశ మదిగొ
తాళభూజోచ్ఛ్రితంబు విద్యాలయాంక
విలసితంబయి రెండువీధులకు నడుమ
వైజయంతంబు తలఁదన్ని తేజరిల్లు. 123

క. అం దొక పెద్దవితర్దిక
యందున్ గద్దియ వసించి యావిబుధుఁడు రా
త్రిందివము శిష్యబృందము
లం దనుప శ్రుతిశ్రుతమ్ములను నేరుపుచున్. 124

గీ. గృహమునసె యుండె నేఁడు పైతృకము నెఱపు
చున్నవాఁ డన్యులను జూడ నొల్లఁ డితరు
లింటఁ గా లిడకుండ బహిఃకవాట
బంధన మొనర్చె నెటు లేఁగువాఁడ వనుచు. 125

మ. పటువాగ్వైఖరి నిట్లు వా రనఁ బరివ్రాణ్మౌళి తాఁ బాదుకా
ఘుటికాసిద్ధు లెఱుంగుటన్ దివి జనన్ గోరెన్ మదిన్, గాని యం
తటిలో నెంచెఁ నతండు ధిక్కరణముల్ గావించు నేమో విశం
కటదీక్షన్ బితృకార్యమున్ నెఱప విఘ్నం బొందున న్భీతిచే. 126

క. కావున ముందుగ నీయం
తేవాసుల నంపి వార్త తెలిపినచో న
న్నావిప్రుం డతిథిగఁ గొని
పోవును దనయింటి కనుచు బుద్ధిఁ దలఁచుచున్. 127

శంకరశిష్యులకును మండనశిష్యులకును వాక్కలహము

ఉ. అచ్చట నొక్కెడన్ నిలిచి యారసి శిష్యుల 'మీర లేఁగి మే
మిచ్చట నున్నవార్త వచియించి బుధేంద్రుఁడు సమ్మతించెనే
నిచ్చటి కేఁగుదెం, డవుల నేఁగుద మప్పుడె' యంచుఁ బంపఁగన్
జెచ్చెర వారు మండనమనీషి గృహావరణంబు సేరుచున్.

ఉ. కాంచ బహిష్కవాట మతిగాఢపినద్ధమహార్గళంబు గా
వించుట గోచరించుటయుఁ బెద్దయెలుంగునఁ బిల్చి పిల్చి 'యో'
యం చొకమాట పల్కినటు లైన నొకింత దిటంబునన్ బ్రతీ
క్షించుచు నుండ మండనభుజిష్యులు తీసిరి తత్కవాటమున్. 129

ఆ. తీయునంత లోని కాయతుల్ బిలబిలఁ
జొచ్చి వచ్చుచుండఁ జూచి 'మీర
లెవ్వ? రేమిపనికి నేఁతెంతు' రివ్వేళ
ననఁగ వారు మండనార్థ మనుచు. 130

చ. మొదలిటికక్ష్య దాఁటి చనఁ బో నట మండనుశిష్యు లొక్కమై
యెదురుగ నేఁగుదెంచి జనియించెడికోపము డిగ్గఁద్రావునె
మ్మదులఁ జలాచలావయవమండలిఁ గోకనదోపమాక్షులన్
మదము బయల్పడన్ దదయనం బరికట్టిరి క్రోఁతిమూఁక నాన్. 131

క. ముండితశిరములు కావులు
దండములు కమండలువులు దాల్చుపరివ్రా
ణ్మండలిని గువ్వకరిగొని
దుండగమునఁ బెలుచ నవ్వఁదొడఁగిరి వారల్. 132

ఆ. నవ్వి పురివ్వఁదిట్టి చివ్వకుఁ జేసాచు
మండనాంతవాసి మండలికిని

శంకరార్యశిష్యసమితికిఁ గొండొక
నడచెఁ దీవ్రజల్పనముల వాదు. 133

వ. అట్లు పెద్దరొదగాఁ గొంతతడవు వాదు నడచినపిదప సద్దుమాన్పి మండనశిష్యుం డొకండును శంకరశిష్యుఁ డొకండును నిట్లు వివదింపఁజొచ్చిరి. 134

సీ. ఎటనుండి రా ముండి యిహీహీ యనుచుఁ బల్క,
నాగళం బే ముండి ననుచుఁ బల్కె
నది కాదు నీతోవ నడిగితి నాఁగ, నా
తెరువు నీతో నేమి తెల్పననియె
నీయంబ మఃంప పోరా యన్నది యనంగ,
నడుగు ని న్న ట్లంట న్యాయ్య మనియె
బీతమా సుర యిట్లు పేలుచుంటివి నాఁగఁ,
బీత మె ట్లగు సుర శ్వేత మనియె

గీ. నెఱుఁగుదువె దాని రంగు నా, నేను రంగు
నీవు తదుచి నెఱుఁగుదు మింత నిజను
టంచు వక్రోక్తులను నిరసించుకొనుచుఁ
గనుక వెలిఁబుచ్చుకొనిరి ప్రాకృతులపగిది. 135

గీ. అల కళంజభక్షణ మదాత్మజాత
దుష్ప్రలాపంబు లిట్టులే తోఁచు ననఁగ
సత్య మాడితివి త్వదాత్మజాతుఁడు పిత
వలెఁ గళంజాశియై పేలువాఁడ యనియె. 136

గీ. ఖరము మోయంగఁ జాలనికంథ నకట
మోయఁగల నీకు దుర్వహమ్ములుగ దోఁచె

నా శిఖాయజ్ఞసూత్రంబు లధమచరిత
బ్రహ్మబంధుఁడ నినుఁగన్నఁ బాతకమురః 137

క. నీజనకుఁడేని మోవం
గాఁజాలనిబొంత మోవఁగలిగితిఁ గానీ
యోజాల్మ! సిగయు జన్నిద
మోజన్ శ్రుతిభార మగుట నుత్సర్జింతున్. 1 8

క. ఆలికి నన్నము పెట్టం
గా లావటి శిష్యపుస్తకభరము మోవం
జాలినబ్రహ్మవినిష్ఠతఁ
దాలుచునీగుట్టు ప్రకటితం బయ్యెఁగదే. 139

క. గురుజనశుశ్రూషఁ దొఱఁగి
తరుణీశుశ్రూషయందు దర్పరమతివై
వరలెడు కర్మవినిష్ఠతఁ
దరలెడు నీనడత ప్రకటితం బయ్యె బలే. 140

క. భామలకడుపునఁ బుట్టియు
భామలు పెంపంగఁ బెరిగిఁ బాలిక నేఁడా
భామల దూఱుచు నుంటి వి
దేమి కృతఘ్నత్వ మూని యేలా బ్రదుకన్. 141

క. ఎవ్వరినుండి జనించితొ
యెవ్వరిచనుఁబాలఁ గ్రోలి యిటు పెరిగితివో
యవ్వేలఁదుల నెటు గవయుదు
పువ్విలుతుని కేళిఁ బశువుపోలిక మూఢా! 142

గీ. యత్నపూర్వ మగ్ను లకట! యుద్వాసించి
వీరహత్య నొందితోరి జడుఁడ!
పరమపదము బ్రహ్మ మెఱుఁగఁగాఁ జాలక
యాత్మహత్య గంటి వోర ఖలుఁడ! 143

క. చోరునివలె దౌవారిక
వారము వంచన మొనర్చి వచ్చెద విస్సి
పారాశరులకుఁ గూడిడ
కౌరా యెటు కుడుటె దేగయట్టుల ఛీఛీ! 144

గీ. కర్మకాలమునందు మూర్ఖాళితోడ
మాదృశులకు వాకొంట ధర్మమ్ము గాదు
తెలివి యతిభంగముగఁ బల్కఁ దెలిసె నోరి
యతికి భంగ మొనర్చు నా కగునె దోసఁగు? 145

క. "యతివలన భంగ" మని స
మ్మతిఁ బంచమ్యంతమున సమాస మ్మోదు
ర్మతి! చెప్పుకొనుము కా కటు
యతి భంగింపంగ నీకు నలవియె యెపుడేఁ? 146

ఆ. బ్రహ్మ మేడ? నిద్దురాచారరతు లేడ?
నెచటెసన్యసనము లిట్టికలిని
మృష్టభోజనార్థ మిట్టుల యతివేష
ధారివై తి వంచుఁ దలఁపవచ్చు. 147

ఆ. నాక మేడ? నిద్దురాచారరతు లేడ?
నగ్నిహోత్రి మేడ? నకట కలిని
గ్రామ్యధర్మతత్పరతనె కర్మఠరూప
ధారి వైతి వంచుఁ దలఁపవచ్చు. 148

క. అని గృహి, యతి, శిష్యద్వయ
మనయము కినుపొంది తీవ్ర మగువాదమునన్
తనతన మర్యాదోల్లం
ఘనమునకై రాత్మకర్తృకతఁ గన కుంటన్. 149

ఉ. కొందఱు లోనికేఁగి తమకున్ యతిరాజికి నైనవాదపుం
దందడిఁ దెల్పఁ గొండొక వితాకయి మండనుఁ డాత్మ నెంచెఁ "గ
ర్మందిని జూడ" నన్న నియమంబున నుండఁగ నాగురుండె తా
నంపెనటే తురీయ మగునాశ్రమ మే మొనరింతు నియ్యెడన్. 150

క. గురుఁడు గురునిగను శంకరు
వరియించి తరించె నంచు వార్త వినియు మం
దిరమం దడుగిడు పారా
శరుల నరయ కుంట శిష్టసమ్మత మగునే? 151

సీ. ప్రబలసిద్ధాంతనిబద్ధ పూర్వామీ
మాంసాగమ మ్మప్రమాణ మెట్లు
లెందుఁ బ్రాయశ్చిత్త మే నెఱుంగక సల్పు
కర్మకాండము మానఁగల్లు టెట్లు
సర్వజ్ఞుఁ డస్మదాచార్యుఁ డే మారసి
సంన్యసించెనొ యెంచఁజాలు టెట్లు
శ్రాద్ధకాలమునఁ బారాశరిభిక్షాప్ర
దాన నిషేధవిధాన మెట్లు

గీ. పాయు టెట్టుల గురుసంప్రదాయసరణి
నిష్టమేని యనిష్టమే నేకమతిని
శిష్యుఁ డాచార్యమతమునే స్వీకరింపఁ
దగు నటం డ్రిప్పుడిచేటు తలఁగు టెట్లు. 152

వ. అని తనమనంబునఁ గొంతసేపు మథనము గావించి భట్టపాదులపా
దముల నమ్మినవాఁడగుటంజేసి యాసుధీసింహుఁడు యతివదనవిలో
కనసిరాకరణ వ్రతంబు తత్క్షణంబ యుత్సర్జించుకొని. 153

మండనుఁడు శంకరునకు భిక్షావందన మొనర్చుట

శా. సందేహమ్ములు వాయదట్టి నిజశిష్యశ్రేణి నీక్షించి 'క
ర్మందుల్ పూజ్యులు శ్రాద్ధవేళ గృహిధర్మం బీఁగ న్యాయంబె? వా
రిందుర్ రాఁ గని మీరు దూఱఁ దగునే యెచ్చోట నున్నా' రటం
చుం దోడ్తోడన మండనుండు సహశిష్యుండై యెదుర్వచ్చి తాన్.

గీ. అర్ఘ్యపాద్యాదికంబుల నర్చ లిచ్చి
తనవినేయుల యవినయమును క్షమింప
వేడుకొని శంకరార్యుఁ డచ్చోట నుండె
ననుపలుకు వించు హర్షించి యంగవించి. 155

శా. పౌరుల్ పిన్నలుఁ బెద్దలున్ హితులు సంబంధుల్ నిజాంతేవస
ద్వారంబున్ దను నంటిరాఁ జని పురాంతర్వర్తి దేవాలయ
ద్వారోపాంతవితర్ది కాసమతలాధ్యాసీను ధీశ్రీసమా
హారున్ శంకరుఁ జేరి తాఁ సలిపె సాష్టాంగప్రణామంబులన్. 156

క. ద్విజుఁ డటు 'సకర్మకా న
ప్రజయా' యను శ్రుతిఁ బఠించి వందన మిడఁగా
బుజుగతి 'నారాయణ' యనుఁ
ద్విజగద్వంద్యుండు తద్యతిగ్రామణియున్. 157

ఉ. వందన మావిధిన్ సలిపి పాద్యము నర్ఘ్యము నిచ్చి భిక్ష మా
మందిరమం దొనర్పవలె మత్పితృదేవత లెల్ల నేఁటితో

నందెద రూర్ధ్వలోకముల నంచును శ్రాద్ధము నేఁడ యంచుఁ గ
ర్మందిలలాము శంకరుని బ్రార్థనసేయ ననున్ స్మితాస్యుఁడై. 158.

ఆ. అన్నభిక్షుగోరి యరుదేర నోయన్న!
వాదభిక్ష మిషఁగ వలఁతివేని
ఋణము నందువాఁడ; గా దందువా చెప్పు
వచ్చినట్టి త్రోవఁ బట్టి పోదు. 159

క. ఓడనివానికి నోడిన
వాఁ డంతేవాసి యగుటె పన్నిదము సుమీ
నేఁడే వాదింతము తగు
ప్రోడల రావింపు ధర్మమూర్తుల సభకున్. 160

క. యత్యాశ్రమి వయ్యు వివా
దాత్యాసక్తుండ వగుట యర్హమె యంటే
శ్రుత్యంతపథావన నై
యత్యమె హేతువుగఁ దెలియుమా బుధవర్యా! 161

చ. జగతిఁ ద్రయీశిరఃపథము జాగృతి నొంది ప్రచారమందు నుం
డఁ గనుట దక్క వాంఛితము నా కెదియున్ గనరాద, నీవు రే
వగలు తదేకదృష్టిని సవంబుల మున్గి భవాగ్నితాప మా
ర్పఁగఁ దగు మన్మతంబును దిరస్కృతిసేయుదు వట్టి దిట్టవై. 162

ఆ. అభిభవించి నిన్ను నఖిలవివాదిని
జగతిఁ దన్మతమ్ము చాటువాఁడఁ
గోనుము నా మతమ్ము గొనకున్న వివదింతు
వో జితోఽస్మి యందువో వచింపు. 163

గీ. అను యతీంద్రుని యర్థయుక్తాభిభాష
ణముల కపదంది కీర్తి సంతతుఁడు బుధుఁడు
నవపరీభావ మొనసియుఁ బ్రవచియింపఁ
బూనె నిజగౌరవము మనంబునఁ దలంచి. 164

గీ. అనునె వీఁడు 'జితోఽస్మి' యంచును సహస్ర
వదనములవాఁడె వాదింప వచ్చెఁగాక
వేదసమ్మతమతమును వీడి యెపుడు
మానిపరికల్పితమతంబుఁ బూనఁబోఁడు. 165

ఉ. 'వచ్చునె యెన్నఁడే నొకవిపశ్చిదపశ్చిముఁ, డౌనె వానితో
నచ్చుగ నాకు వాదకథ' యంచుఁ గుతూహల మొందు నా కిదే
వచ్చె జయోత్సవంబు, మనవాదకథల్ ఫలియించు విద్యలం
దొచ్చెములేని నాశ్రమ; మహో! సుధ యబ్బె నెవండు గా దనున్.

సీ. శమియింపఁజేయుదు యమహంత నేని స్వ
యమ్ముగా నామహిమ మ్మొలుఁగవా
కానిమ్ము కలహమ్ము కలహంససత్కలా
భరితయాస్మాకీనభాషణముల
వినవొ దర్శనపాఠజనిత మహానాప్రౌఢి
వైరిగర్వవనీకుఠారధార
నాసించి తి ల్లేల యత్యల్పభిక్షమ్ము
వాదభిక్షమె యిచ్చువాఁడ మెచ్చి

గీ. వాద మన సిద్ధముగ నున్నవాఁడ జిరము
గా నభిలషింప వాది యొక్కరుఁడు రాఁడ
యట్టిలోపంబు దీఱంగ నరుగుదెంతు
విఁక సందేహమేల యతీంద్రచంద్ర. 167

క. కాని యిటఁ బ్రాడ్వివాకుని
గానన; గెలుపోటములు తగన్ దెలిపెడువి
జ్ఞాని లభింపనివాదున
మౌన కుభయకంఠశోషమాత్రము మిగులున్. 168

క. వాదముల వాదియును బ్రతి
వాదియుఁ గొందురు విపక్షపక్షము, గానన్
వాదించు మనకుఁ దెలుపుమి
యేది ప్రతిన? యెది ప్రమాణ? మెవ రధ్యక్షుల్? 169

సీ. ఏను గృహమేధిముఖ్యుండ నీవు భిక్షు
కాధిపతి విందు మన విజయాపజయము
లకును బణనిర్ణయము సేయు మకుటిలముగ
నవుల వాదింతము జిగీష యచ్చుపడఁగ. 170

క. ధన్యుఁడ నైతిని యతిమూ
ర్ధన్యుఁడు వివదింప నాకుఁ దారసిలుట, వా
గ్జన్యము రే పగు, నిప్డు డ
నన్యమతి నొనర్తు మధ్యమాహ్నక్రియలన్. 171

వ. అని యాబుధుండు కుతపకాలము సమీపించుటఁ దెలిపి పునః పున
రభివాదనపూర్వకంబుగాఁ దనగృహంబునకు విచ్చేయఁ బ్రార్థిం
చుటయు, దండకమండలు ధారియై యిలాగతుం డగుసరోజహితుం
డుంబోలె స్వశరీరకాంతుల దశదిశలు వెలిగించుచుఁ బాదచారియై
సహశిష్యసంతతికంబుగ మానియై శంకరార్యుండు రాజవీథిం జని
చని యొక్కయెడఁ గక్ష్యాంతరమ్ములు గడచి మండన మందిరమ్ము
దరియంజొచ్చి యర్ఘ్యపాద్యాద్యుపచారంబులం బడసి నిమంత్రిత

బ్రాహ్మణద్వయం బెదురు వచ్చి వందనంబు లాచరింప ముది
తుండై యుండ. 172

శంకరుఁ డుభయభారతిని దీర్పరిగ నిర్ణయించుట

ఉ. ఆసరసీజసంభవకులాభరణంబులు జైమినీయవై
యాసకశాస్త్రపారగు లటంచును వారలలో నొకండు ధ
ర్మాసన మెక్కి వాద విజ యాజయముల్ ప్రకటించు నంచు సం
న్యాసివరేణ్యుతో విబుధనాథుఁడు దెల్పుచు నుండునత్తఱిన్. 173

చ. కలువల నీనుసోగ తెలిగన్నులు వీనులకోన లానఁ జె
క్కులఁ జిఱునవ్వువెన్నెల లిగుర్పఁగఁ గొ ప్పువటూస్థలిన్ విభా
సిలఁ దెలిపట్టుఁగం చెలయుఁ జీరయుఁ దాలిచి విశ్వరూపుకో
మలి యరుదెంచి యయ్యతికి మన్నన మిన్నగ మున్ను గానరాన్.

క. పూఁదీవ కమ్మ తెమ్మెర
చే దుసికిలునటుల వంగి, చేర్చి నొసంటన్
జేదోయి వందనం బిడెఁ
బైదలి తను పీ్రడ ప్రౌఢి భక్తియు వంపన్. 175

ఉ. ఆయెడ భట్టపాదుఁ డనినట్టినుతుల్ మది నెంచి శంకరుం
డాయతివన్ మహావిదుషి యంచుఁ దలంచి బుధేంద్రుఁ గాంచి 'యే
లా యొరు లీవివాదముజయాజయముల్ వివరింప? నీమె యే
న్యాయము దీర్పుదానిఁ దలఁచుం దధరింతుఁ దిరిసుదిఁ బల్కితిన్'.
[illegible]

క. అనుటయు నందఱు నౌనౌ [illegible]
[illegible]
[illegible]
[illegible]

ఉ. అందఱు లోని కేఁగి సరయంబుగ స్నానము లాచరించి మా
ధ్యందినకృత్యముల్ నెఱపు నంతటఁ బైతృకకర్మదీక్ష ని
ష్పందతఁ దాల్చి మండనుఁడు భక్తియుక్తి సపర్యఁ దన్పెఁ గ
ర్మందిని వ్యాసజైమినులమాఱట యాాక్షితిదేవయుగ్మముల్. 178

గీ. మోదమున శంకరునకు హస్తోదకమ్ము
"నమృత మ"స్తని మండనుం డర్థి నొసఁగ
శాశ్వతబ్రహ్మలోకవాసమున కరిగి
రతనిపితరులు విశ్వేదేవతలు నపుడు. 179

ఆ. భక్ష్యభోజ్య చోష్యపానీయలేహ్యాది
వివిధభోజనముల నవనిసురులు
ముగురు కుడిరి బ్రహ్మముగ సర్వ మెంచుచుఁ
దృప్తి గదుర గృహియు గృహిణి శ్రద్ధ. 180

క. 'తృప్తాస్స్మ' యనఁగ ముప్పొర
సప్తార్చిస్సముల నన్నజలదానములన్
దృప్తుల నొనర్చి యనిపి ని
జాప్తులతో నన్నశేష మతఁడు భుజించెన్. 181

గీ. చామర లిడంగ శిష్యు లిష్టప్రసంగ
ముల నొనర్చుచు వైదుష్యవిలసనముగ
భోజనాయాస మెడయ నమ్ముగురు కొంత
సేపు మొగసాలయందు నాసీనులైరి. 182

క. ఆవిధి శ్రమ ముడిగి మహీ
దేవు లిరువు రరిగి రెవరి తెన్నున వారల్
రేవాతీరగతం బగు
దేవాలయమునకు నరిగె దేశికవిభుఁడున్. 183

చ. అరిగి కదంబసాలనివహాంచిత మానాకమండపంబునన్
స్థిరముగఁ గూరుచుండి నిజశిష్యులు కోర గురుండు గేస్తుతో
జరిగిననాఁటివృత్తముఁ బ్రసన్నవచస్సరణిన్ వచించుచున్
జరిపెను నాఁటి కే యమృతసన్నిభమై క్రమియింపఁ జల్లగన్. 184

శంకరమండనమిశ్రుల వాదసభ

శా. ప్రాతశ్శోణసరోజబంధురుచి నభ్రం బుల్లసిల్లన్ యతి
వ్రాతాధ్యక్షుఁ డతండు కాల్యములు నిర్వర్తించి సచ్ఛాత్రుఁడై
ప్రీతిన్ మండనపండితౌఘమునకున్ విచ్చేసి చొచ్చెన్ సుధీ
వ్రాతాలంకృత మాసభాభవనమున్ వాదంబు గావింపఁగన్. 185

చ. సకలకలావిశారదను శారద నాత్మసధర్మిణిన్ సమా
ధికరహితన్ బ్రతీతపతిదేవత సాక్షిణిఁ జేసి వాదకా
ర్యకమున నుండె మండనుఁడు ద్వయ్యలియున్ బతియాజ్ఞఁ బ్రాడ్వివా
కకృతికి మేకొనన్ జనులు కన్నులపండువుగాఁ గనుంగొనన్. 186

క. అధ్యాసించెను బరిష
న్మధ్యస్థితధర్మపీఠి మహిళామణి త
త్సధ్యభిరూపత్వవివే
కాధ్యాసను వచ్చుశారదాంబికపోలెన్. 187

గీ. మండనునివాదకుతుకసమ్మర్ద మెఱిఁగి
యలరుచుఁ బరావరజ్ఞుఁ డౌయతి మహేశుఁ
డూనెను బరావరైక్య సంధాన పరము
గా స్వకీయప్రతిజ్ఞ నుత్కంఠ నిట్లు. 188

సీ. అనఘమై పరమార్థమై సచ్చిదమలమై
యద్వైతమై యొప్పునట్టిబ్రహ్మ
మనవధికాజ్ఞానమునఁ జిక్కి ముత్తెపుఁ
జిప్ప వెండిగను ద్రోఁచిన తెఱఁగున

యావజ్జగద్భ్రాంతియై వెలుఁగును దత్ప
రావరైక్యజ్ఞాన మబ్బెనేని
విశ్వప్రపంచంబు విలయంబునొందునం
తన తెల్ల మగును స్వాత్మవ్యవస్థ

గీ. దాన నబ్బు నిర్వాణ ముత్తమము దానఁ
గలుగుఁ దప్పక జన్మమోక్షము ధ్రువముగ,
నిందులఁ బ్రమాణ మెయ్యది యందు వేని
సకలనిగమాంతవాక్యప్రపంచంబు సుమ్ము. 189

చ. విజయముగొందు నిందు, నొకవేళఁ బరాజయమే ఘటిల్లుచో
నిజము వచింతు సంన్యసననిష్ఠ సమస్తము వాసి, కావునన్
ద్విజవర! రోసి, తాల్చెదను దెల్పుల వాదమునందులన్ జయా
పజయఫలంబు లియ్యుభయభారతియే మన కేర్పఱించుతన్. 190

క. అనుచును శంకరభిక్షుం
డనల్ప మగుస్వప్రతిజ్ఞ నటుపూనఁగ మం
డనుఁడు స్వమతప్రతిష్ఠా
పన మగుశపథమ్ము నెఱపె స్పష్టముగ నిటుల్. 191

సీ. చిద్రూపవస్తువుఁ జెప్పఁ బూనఁగ శబ్ద
శక్తి కయోగంబు సంభవిలుట
నప్రమాణమ్ము వేదాంతమ్ము - లేకఁ బూర్వ
భాగమో యటుగాక, వాక్యగమిత
మైన యశేషకార్యంబుల పట్లను
దాఁ బ్రమాణం బయి తనరుచుండుఁ
గనఁ గ్రియామాత్రంబునను బ్రసిద్ధమ్ములౌ
శబ్దంబులకు శక్తి సంఘటిల్లు

గీ. నాయువు సమాప్త మగుదాఁకఁ బ్రాణికోట్లు
సలుపవలెఁ గర్మకాండ మాసక్తి మిగులఁ
గర్మ మటు శ్రద్ధఁ జేయఁగాఁ గలుగు ముక్తి
యంతియే కాని లభియింప దన్యయుక్తి. 192

క. వాదున జయేతరం బా
పాదిల్లిన నీప్రతినకుఁ బరమ విరుద్ధం
బూఁదెద నీ వనినటు లీ
నా దయితయె సాక్ష్యపదమునన్ వర్తిలుతన్. 193

వ. అని. 194

క. యతియున్ గృహపతియుఁ బరా
జితుండు జేత్రాశ్రమంబు సేకొనునట్టుల్
ప్రతిన లిటు సెఱపి యాభా
రతి నిలిపిరి సాక్ష్యవిష్టరభ్రాజితగాన్. 195

మ. పరమాత్కంఠ యతీంద్రుఁడున్ గృహియు సభ్యశ్రేణికై మోడ్పుఁదత్పరిషద్వేదిక నాభిముఖ్య మమరన్ దర్భాసనాసీను లా
తఱి వారిద్వరకంఠసీమ సుమనోదామంబులం బూన్చి య
య్యరవిందాయతపత్త్రనేత్రి యన ని ట్లాలింప సామాజికుల్. 196

క. ఎవ్వరిగళమున విలసిలు
మవ్వపుఁబువుమాల తొలుత మ్లానంబగునో
యవ్వాసిద యోటమి యగు
నెవ్వరు వచియింపఁదగ్గ దే ముందు నిఁకన్. 197

గీ. అంచు దివ్యప్రమాణ మయ్యతివ దెలిపి
యతియుఁ బతియు భుజింప భిక్షాశనముల
నాయిత మొనర్ప నంతర్గృహమ్ము సొచ్చె
నవుల వాదింప వారలు దివురుచుండ. 198

శంకరశిష్యులకును మండనశిష్యులకును జరిగినవాదము

క. మీ రేల మేము చాలమె
యారయుచుండుం డటంచు నాబుధశిష్యుల్
పారాశరివరు శిష్యులు
నారంభించిరి వివాద మండఱు వినఁగన్. 199

వ. అందు మండనశిష్యం డొక్కరుండు శంకరగురుచ్ఛాత్రు నొక్క-
నిఁ గాంచి. 200

క. ఓయతిశేఖర! నీవు తు
రీయాశ్రమ మెట్లు గొంటి స్మృతులున్ శ్రుతులున్
వేయిగతుల సన్న్యాసం
బీయుగమునఁ ద్యాజ్య మనుట యెఱుఁగవె యకటా! 201

గీ. మఱియు శ్రుతులును స్మృతులుఁ బ్రమాణములుగఁ
దెలియఁ బల్కెడ వినుమయ్య! కలినిషిద్ధ
ములు తురగమేధ గోమేధ పలలపైతృ
కాంతిమాశ్రిమ దేవరన్యాయ విధులు. 202

సీ. యజ్ఞాధ్యయనహీన మగు నాశ్రమచతుష్ట
యమ్ము బ్రాహ్మణ్య మెట్లనువుపఱచు
'నహరహ స్సంధ్యా ముపాసీత' యనువిధి
దూరుఁడై యగునె శుద్ధుఁడు ద్విజుండు
యజ్ఞోపవీతచూడాపవర్జనమున
నీరయమ్ము ద్విజుఁ డెట్లు నిస్తరించు
సత్క్షేత్రమునందు సంతతిఁ గనక వి
ప్రుం డెట్టుల పితౄణమును దొలఁగుఁ

గీ. గాన వేదోక్తకర్మసంధానపరత
నంది యక్షయపుణ్యలోకాప్తిఁ గోర
వలయునే కాని యతి యాట కలియుగమునఁ
దలఁపరాని దటంచు విద్వాంసు లనరె. 203

చ. యతివర! స్వర్గరాజ్యతనయాదికముల్ లభియించుఁ గర్మప
ద్ధతిఁ జరియింప నంచు శ్రుతితత్త్వవిదుల్ ద్విజు లెల్లఁ గర్మముల్
మతి నొనరింత్రు; కర్మ మణుమాత్రము వాయఁగరాని దంచు న
చ్యుతుఁడు కిరీటికిన్ దెలుపుసూక్తి నెఱింగియు భ్రష్టు లైతిరే. 204

గీ. కర్మమును గాల మెఱిఁగి తత్కర్మ మర్హ
కాలమున సల్పువానినే జ్ఞాని యండ్రు
విహితకర్మాచరణనిష్ఠ వెలయువాఁడె
భక్తిమంతుండు మఱి జ్ఞానవంతుఁ డనఘ. 205

ఆ. కలినిషిద్ధ మనుట తెలిసియు సన్న్యాస
మెట్లు మీగురుఁడు గ్రహింపఁ దెగియె
నందు బ్రహ్మచారి యయి సన్న్యసించెనే
ప్రక్రమంబు విడిచి వక్రబుద్ధి. 206

క. అన శంకరశిష్యుం డనె
మనీషివర! యింత చదివి మందప్రజ్ఞన్
జననుత్యం బగుజ్ఞానం
బు నెఱుంగక యుంట యబ్రముగఁ గన్పట్టున్. 207

క. ఎందాఁక వర్ణభేదం
బెందాఁక శ్రుతిప్రచార మెసఁగుఁ గలియుగం
బం దంతదాఁక నిలుకడ
నొందును సన్న్యాస మగ్నిహోత్రము లుర్విన్. 208

మ. మఱి సంతానజదోషసంహతులఁ గర్మప్రాప్తదోషంబులన్
దరికొల్పున్ దమవహ్ని స్వర్ణమటు సన్న్యాసంబు; సంసారమం
దరయన్ రాగవిదూరుఁ డౌతఱియ సన్న్యాసాప్తికిన్ గాల మం
దురు శాస్త్రజ్ఞులు, బ్రహ్మచారియు విరక్తుం డైన సన్న్యాం డగున్.

సీ. సకలచరాచరస్థానమై వెలుఁగొందు
బ్రహ్మంబె యజ్ఞసూత్రంబు గాఁగఁ
బరమవిజ్ఞానభాస్వద్దీపకళికయే
జ్ఞానైనకేశపాశంబు గాఁగ
జన్మమృత్యుభయార్తి సమయించు ముక్తియ
యమృతోపమాన యర్ధాంగి గాఁగ
నాత్మైక్యజాత మహానంద ముద్రాను
భవ మాత్మజాత లాభంబు గాఁగ

గీ. నేను నీ వనుభేద మొక్కింత లేక
జగమె తా నయి యుంట సంసారముగను
బరమవిజ్ఞాని భాసిల్లు నిరత మైన
సచ్చిదానందరస సమాస్వాద మెనసి. 210

గీ. వాఁడె యజ్ఞోపవీతి యవ్వాఁడె శిఖయు
వాఁడె సూదారవంతుఁ డవ్వాఁడె పుత్ర
వంతుఁ డగు; వాఁడు పొందులాభంబు బ్రహ్మ
కైన హరికైన హరునకు నైనఁ గలదె. 211

గీ. యజ్ఞసూత్రంబు కర్మాంగ మనిరి బుధులు
కర్మములె వీడుచోఁ దదంగంబు సూత్రి
మేల తాల్పఁగవలె? జ్ఞాన మెపుడు పొడము
నపుడు శిఖఁ దాల్పకున్న నే మగుఁ గొఱంత? 212

ఉ. కావున యజ్ఞసూత్రము శిఖల్ ద్యజియించును యోగి; కర్మకుం
డావిలబుద్ధిఁ దాల్చి నిరంతరకర్మఫలానుభోక్తయై
పోవుచు వచ్చు చెందుఁ గడముట్టఁగఁ జాలక జీవభావమున్
ద్రోవఁగఁ జాలఁ డంచు విబుధుల్ వచియింతురు పెక్కురీతులన్ 213

సీ. కటిసూత్ర మాచ్ఛాదకముగఁ గౌపీనంబు
శీతార్తిఁ బాపి రక్షింపఁ గంథ
నక్షమాలిక సవ్రణాంచితవైణవ
దండంబు నుదకకమండలువును
మధుకరవృత్తిసంపాదితానేకాన్న
భుక్తి శిఖాసూత్రములవిముక్తి
నిత్యకర్మాదికనిరసనంబును బర
బ్రహ్మానుసంధానపాటవంబు

గీ. నిరతమును బూని జ్ఞానసందీప్తి నెనసి
మాక్తికప్రోతసూత్రసంభావనమునఁ
బరమహంస గనందగు బ్రహ్మతేజ
మాపిపీలిక మాబ్రహ్మ మైన జగతి. 214

గీ. అనుచుఁ జకచక మను దివ్య మైనవచన
రచన యతిశిష్యుఁ డాగృహి ప్రథమ శిష్యు
నధరము మెదల్పనీయక యాఁక నెట్టు
నంత విన వచ్చె మధ్యాహ్న మయ్యె ననుచు. 215

వ. తోడన గోష్ఠి చాలించి సాంతేవాసులై యతియుం గృహపతియు
నిశాంతాభ్యంతరమ్మున కరిగి మాధ్యాహ్నికక్రియాకలాపనిర్వర్తన
పూర్వకంబుగా భిక్షలు భోజనమ్ములు నిర్వర్తించుకొని విశ్రాంతి
యొనుంగకయ యప్పుడ గోష్ఠీమందిరము సొచ్చి వివిధవిద్వజ్జనసమ

క్షంబున నిరువాగుశిష్యులు సకలశాస్త్రసమ్మతంబుగా నాసాయము వాదముసేయఁజూచుచు దివసావసానమున యథేచ్ఛమ్మరిగి,రమ్మఱు దివసమునుండి యథాపూర్వము సపరివారంబుగ పరిషత్తలంకరించి యుత్తరోత్తరము లగు ఛాత్రులవాదము లందలి జయాపజయంబుల మోదవిషాదము లొందుచు వచ్చుచుఁ బోవుచుఁ దదేకధ్యానమగ్నమానసులై దివసపంచకం బేఁగించి షష్ఠవాసరమున వేఁబోకఁ గరణీయంబులు తీర్చుకొని సభకు విచ్చేసి మాలాలంకృతకంధరులై శంకరమండనులు తామె వాదమునకుఁ బూనుకొని రయ్యవసరమున. 216

ఉభయభారతీసాక్షికంబుగ శంకరుఁడును మండనుఁడును వాద మొనర్చుట

శా. నానాదేశసమాగతుల్ బుధులు నానాఁటన్ గుముల్గట్టి యా
స్థానం బెల్ల నలంకరించి విన నుత్సాహంబుతో నుండ, శి
ష్యానీకంబులు నొజ్జలన్ బలసి యాయాగ్రంథముల్ చేతి కం
దీ నుండన్ గనవచ్చునాగరజనం బేసద్దు లే కున్నెడన్. 217

ఆ. సాధువాద మొకట సభ్యులు గావింప
శ్రుతుల సాక్ష్యమున స్వమతము నిలుపు
కొనుచు నొండొరులకుఁ గుతుకమ్ము మోదమ్ము
గూర్చునుడుల వాదు కొనలు నిగిడె. 218

ఉ. ఒండొరులున్ బ్రగల్భు లయి యుత్తరముల్ విదళించు చర్చఁ గూ
ర్చుండి స్మితాంచితాననము లొప్పఁగ మేనుల స్వేదకంపముల్
మెండుకొనంగ మిన్నుదెస మిన్నక చూచుచు, నుత్తరంబు లే
కుండుచుఁ, గ్రోధవాక్ఛలము నొందుచు నుండిరి యిర్వరయ్యెడన్.

సీ. అపుడు క్షోదక్షమం బైన యాబుధేంద్రు
దాక్ష్య మరసి యతీంద్రుఁ డుద్ధవిడిఁ దూల్చె

క్షోభితాఖిలపక్షు సత్కోవిదాంతి
కాప్రకాశితకక్షుని వల విపక్షు. 220

ఉ. అంతట మండనుండు స్వమతావననైపుణశూన్యుఁ డయ్యె వే
దాంతవచఃప్రసిద్ధ మయి యద్వయమార్గము నూపునట్టి సి
ద్ధాంతములన్ బరశ్శతవిధంబులఁ దూల్చుచుఁ బల్కెఁ జొచ్చె ని
శ్చింతయు మచ్చరంబు జనియించి జయించుతలంపు మించఁగన్ 221

క. శమధన! హేయోపాదే
యముల విడిచి సిద్ధ మగుపదార్థముఁ దెలుపన్
క్షమ మగువేదాంతోక్తులు
ప్రమాణ మనఁ బొసఁగు నెట్లు పరిశీలింపన్. 222

గీ. కర్తృతాధర్మయుక్తుఁడై కాలు జీవుఁ
డీశ్వరుఁ డకర్తృతాధర్మ మెనసి యుండు
నట్టి ప్రవిరుద్ధధర్మాశ్రయముల కెట్టు
లైక్య మమరుఁ? బ్రమాణ మిం దరయ మనిన. 223

గీ. యతివరుం డను నుద్దాలకాదిగురులు
శ్వేతకేతుప్రముఖశిష్యవితతిఁ 'దత్త్వ
మసి' యనుచు నైక్య మెఱిఁగించి యలరఁజేయు
వాక్యము ప్రమాణ మగు బుధవర్య! యనుడు. 224

మం. హుంఫ డాదులమాడ్కిఁ బాపోపశాంతి
కై జపార్థమ్ము లైనవేదాంతవిదిత
'తత్త్వమ' స్యాదివాక్కు లర్థమ్మునను వి
పక్ష యెటు లొందఁగల్గుఁ జెప్పంగదన్న. 225

శం: అర్థవిదులు హుంఫడాదిశబ్దమ్ము ల
ర్థప్రతీతిచే ననర్థ మనిరి

యర్థ మిట్లు తెల్ల మగుచుండఁ దత్త్వమ
స్యాదికము జపార్థ మనుట యెట్లు? 226

మం. పన్నుగఁ 'దత్త్వమసి' యనుట
విన్నన్ జీవేశ్వరుల కభేదము స్మృత హా
లెన్న మఖకర్త యీశా
భిన్నుం డను స్తుతిఁబోలి విధిశేష మగున్. 227

శం: యూపముఖాధ్వరాంగముల యష్టకరాదిసురాకృతి స్తవా
లాపము కర్మకాండపరిలబ్ధము గావున నర్థవాదతా
ప్రాపణ మొప్పుఁ గాని, యెటు పల్కెదు తత్త్వమసీతివాక్య మా
రా! పరకాండదృష్టముగదా 'విధిశేషమ' యంచు ధీనిధీ. 228

మం: మ. పవమానాన్నమనోర్క్కలాదియగు నబ్రహ్మంబునన్ బ్రహ్మబు
ద్ధి విధింపన్ జనుమాడ్కిఁ గర్మపరివృద్ధిం గోరి యాసూక్తి దాఁ
దివుచున్ జీవునివంక బ్రహ్మమనుబుద్ధిన్; గాన నారోపితా
త్మవిభాసం బగుజీవుఁ గొల్చునిగమాంతంబుల్ ప్రమాణంబు లే? 229

శం: మనమును బ్రహ్మమంచుఁగొలుమా యనువాక్యమునందు బ్రహ్మభా
వనకు లిఙాదికంబు గనుపట్టినయట్టుల ధీవరా! విధా
ననియతి తత్త్వమాదివచనంబుల నున్నదె? జీవునే యుపా
సన మొనరించు నయ్యుపనిషత్తు లటంటివి సత్య మెట్లగున్? 230

మం: చ. యతివర! రాత్రిసత్రమునయందు విధిన్ ఫలదర్శనాప్తి నే
గతి ఘటియింతు, రాపగదిగా నిట ముక్తిఫలశ్రుతిన్ బ్రక
ల్పితవిధి యంచు నీశ్రుతి వివేచనసేయుట పాడి, కానిచో
వితథము గాదె యద్ది "పృథివీపతి శేష" యటన్న కై వడిన్. 231

శం: సరి నీ వన్నటులేని మోక్షము క్రియాజన్యంబ కానన్ విన
శ్వర మా స్వర్గమువోలె, సల్పఁగను, సల్పన్ మానఁగా, నన్యమా

శం: ఆగుము పల్కు కాత్మ విభువౌ నటుగా కణు వౌతఁ జిత్తసం
యోగిత రెండుపక్షముల నూహ యొనర్చినఁ గానరాద యో
*యోగివరేణ్య! సావయవ మొందును సావయవంబుతోన సం
యోగము, గాని తా నవయవోజ్ఝితుతో నెపుడేనిఁ బొందునే. 244

చ. మన సొకయింద్రియం బనియె మాటకు నంటెమి- లోచనాదికం
బునకు సహాయమాత్రమయి పొల్చును దీపమువోలెఁ గావునన్
మనసున కింద్రియత్వ మణుమాత్రము లే, దిఁక నింద్రియంబులన్
మనసును నేన యంట 'యుడుమండలిఁ జంద్రుఁడు' నన్నరీతి నౌ.

మం: అక్షతతిని భేదజ్ఞాన మబ్బదేని
వరలుఁగాక సాక్షిస్వరూపమయి; దాని
తో విరోధ మెనయునీశజీవు లొక్కఁ
డన నెటు ప్రమాణ మాతత్త్వమాదికోక్తి. 246

శం: అలయవిద్యావృతుం డైనజీవునకు మా
యావృతుం డగు పరమాత్మునకును
సాక్షిస్వరూపమై జానొందుప్రత్యక్ష
మెఱిఁగించు భేదంబు పరఁగినట్లు
యాశ్రుతి శుద్ధజీవాత్ముల యైక్యంబుఁ
దెలుపు భిన్నాశ్రయంబులు గనుటను
నవిరోధ మగును- గా దంటేని ♦ పూర్వమై
వెలయుప్రత్యక్షంబు బలవిహీన

---

* మండనుని సంబోధించుట.

♦ 'పౌర్వాపర్యే పూర్వదౌర్బల్యం ప్రకృతివత్' అను జైమినీయసూత్రము ననుసరించి 'ప్రత్యక్షము- శ్రుతి' యను నీరెండిటఁ బ్రథమమగు ప్రత్యక్షమును చరమమగుశ్రుతి బాధించునుగదా' పూర్వం

గీ. మఱి (*) యపచ్ఛేదనయరీతి ననుసరించి
చరమ మగుశ్రుతిచే బాధ పొరయుఁ గాదె
మును గలుగురజతజ్ఞానమునకుఁ బిదపఁ
గలుగు శుక్తిప్రమ ప్రబాధక మ్మగునటు. 247

పర మజాతత్వా దబాధిత్వైవ జాయతే। పర స్యానన్యథోత్పాదా న్నత్వబాధేన సంభవః' అను శాస్త్రమునఁ బరము పుట్టనికారణమునఁ బూర్వశాస్త్రము దేనిని బాధింపకయే పుట్టును. ఇఁకఁ బరశాస్త్రమో పూర్వశాస్త్రబాధకుఁ గాక యితరథా పుట్టనే పుట్టదు. కావునఁ బర మెల్లప్పుడు బాధకమే యగును. ఎట్లనఁ:— బ్రకృతియాగమునఁ గృతోపకారు లగుకుశలు ప్రథమాతిదేశమున వికృతియాగమునఁ బ్రసక్తము లయ్యును గల్ప్యములును, జరమభావులు నగు నిరపేక్షము లైనశరములచే బాధింపఁబడుట లేదా? అట్లే యిందును.

(*) అపచ్ఛేదన్యాయము.— బహిష్పవమానస్తోత్రము నుద్దేశించి యన్వారబ్ధముగా గమనము చేయుచుండు ఋత్విజులలో నుద్గాతకుఁ గచ్ఛాపచ్ఛేదము కలుగుచో 'య ద్యుద్గాతాఽపచ్ఛిద్యేత అదక్షిణం యజ్ఞం నిష్పాద్య తేన పున ర్యజేత' యను శ్రుతిచే- నారంభింపఁబడిన క్రతువును దక్షిణారహితముగ సమాప్త మొనర్చి, సదక్షిణాకముగ మరల యజ్ఞము చేయుట ప్రాయశ్చిత్తముగా విధింపఁబడె. ప్రతిహర్తకుఁ గచ్ఛాపచ్ఛేదము కలుగుచో 'యది ప్రతిహర్తాఽపచ్ఛిద్యేత సర్వవేదసం దద్యాత్' అను శ్రుతిచే సర్వధనదానరూప మైన దక్షిణతో నారబ్ధయాగము సమాప్త మొనర్చుట ప్రాయశ్చిత్తముగా విధింపఁబడె. 'క్రమమున నుభయాపచ్ఛేదము కలుగుచోఁ దొలిదాన దక్షిణారాహిత్యము, రెండవదాన సర్వస్వదక్షిణయను నుభయమునకు విరోధము కావున నుత్తరనిమిత్తకప్రాయశ్చిత్తముతోడనే యారబ్ధక్రతుసమాప్తి నొనర్పవలె' ననెడు నపచ్ఛేదన్యాయమునఁబూర్వమగు ప్రత్యక్షము పరమగు శ్రుతిచే బాధిత మగును.

మం: సంయమీంద్ర! ఘటాదికసరణి జీవుఁ
డఖిలవిత్త్వము లేమిఁ బరాత్మభిన్నుఁ
డగు ననెడియనుమానాన నయ్య భేద
వేదమున కప్డు బాధ రాలేదె కనుమి. 243

శం: నీవు నుడివిన భేదమ్ము నిక్కవమ్మొ
కాల్పనికమో వచింపు నిక్కంబయేని
దవులు దృష్టాంతహాని రెండవదియేని
సిద్ధసాధనదోషంబు నెందు మరల. 249

మం: వినుము స్వప్రత్యయాబాధ్య భేదవత్త్వ
మల ఘటాదికమందు సాధ్యంబు నూవె
*యాత్మబోధముచే నబాధ్యప్రభేద
మొప్ప ననినంత నేదోష మున్నదయ్య? 250

శ: ఎనయ స్వశబ్దము బోధిం
చినది సుఖాదులను జెందుజీవుఁ డనిన మా
♦ కు నభీష్టమ-తద్రహితే
శుని నన దృష్టాంతహాని చొప్పడు మరలన్. 251

---

* 'ఘటజ్ఞానముచేఁ బటజ్ఞానము బాధింపఁబడనట్లే స్వజ్ఞానము చే నబాధిత మగు భేదము ఘటాదులందు సాధ్యము' అని మామతము. ఆత్మజ్ఞానముచే భేదమునకు బాధ లేదని నీమతము (అద్వైతము) నగు టచే సిద్ధసాధనదోషము తొలఁగినది.

♦ స్వప్రత్యయాబాధ్యభేదాశ్రయత్వరూపసాధ్యమునందు స్వ శబ్దమున కర్థము సుఖాదుల నొందుజీవుఁడా? తద్రహితుఁ డగుపరమాత్మ యా? జీవుఁ డనినచో నట్టి భేదాశ్రయత్వము మాకును నిష్ట మగుటచే సాధింప నక్కఱ లేదు. అనఁగా సిద్ధసాధనదోషము. పరమాత్మ యని నచో ఆత్మజ్ఞానముచే సర్వజ్ఞానములు నశించుఁ గాన దృష్టాంతమైన ఘటమందు ఆత్మప్రత్యయాబాధ్యభేదాశ్రయత్వరూపసాధ్యము లేదు.

మం: వ. యోగీంద్రా! మామతమం దీయనుమానప్రమాణమున జీవే శ్వరులకు నిరుపాధికము సాధ్యము. నీమతమున జీవేశ్వరుల కౌపా ధికభేద మేకదా. అదియ యగునెడల నుపాధియగు నవిద్య తత్త్వ జ్ఞానముచే నివర్తింప భేదమునకు మిథ్యాత్వము సిద్ధించుం గావున నీవు సాధించునది జీవేశ్వరుల కౌపాధికభేదమును, మేము సాధించు నది నిరుపాధికభేదము నగుటంజేసి సిద్ధసాధనదోషము పరిహృతం బయ్యెఁ గాదె. 252

శం: ఆర్యా! నిరుపాధికభేదంబునకు (6) దృష్టాంతముగాఁ జూపఁబడిన ఘటేశ్వరభేదముగూడ నవిద్యోపాధిక మగుటచే నచ్చట నిరుపా ధికభేద మంగీకరింపఁబడమింజేసి దృష్టాంతహాని కలిగెడు. మఱియు నీ యనుమానమున 'సాధ్యవ్యాపకత్వేసతి సాధనావ్యాపకత్వ ముపాధిః' అను లక్షణముంబట్టి బ్రహ్మనిరూపిత నిరుపాధికభేదము ఘటాదులందుఁ దప్పక యుంటంజేసి సాధ్యవ్యాపకమై, యసర్వ జ్ఞత్వరూపసాధనము గలజీవునియందు జడత్వము లేకుంటంజేసి సాధనావ్యాపకత్వము గల జడత్వ ముపాధి యగుటచే నీవు హేతు వనుకొనినది సోపాధికమై హేత్వాభాస మగుచున్నయది. మఱియు ఆత్మా పరస్మా దభిన్నః, చిత్త్వాత్, పరవత్ (పరమాత్మవత్) అను ననుమానముచే జీవునకుఁ బరమాత్మాభేదమును సాధించు చిత్త్వరూపహేతువు గలుగుటంబట్టి నీచూపిన హేతువు సత్ప్రతి పక్షితము గూడ నయ్యెనే. 253

మం: వ. (బ్రహ్మపక్ష మగుననుమానము ప్రయోగించి సిద్ధసాధ్య త్వాదిపరిహారమును శంకించుచు) బ్రహ్మ జీవప్రతియోగిక ధర్మి ప్రమాఽబాధ్యభేదవత్ । సంసృతిశూన్యత్వాత్ । అని మేము సాధించుచుంటంజేసి జీవభేదము బ్రహ్మజ్ఞానబాధ్య మని నీ వొప్పు

(6) దృష్టాంతము వాదిప్రతివాద్యుభయసంప్రతిపన్నమే కావ లయు నని శాస్త్రనియమము,

దానికి విపరీతమునే సాధించుచుండుటచే సిద్ధసాధనదోషములేదు. ఘటాదిప్రమచే జీవభేద మబాధ్య మని నీ వంగీకరించుటంజేసి దృష్టాంతహానియు లేదు. 254

శం: ఆ జీవప్రతియోగికభేదము యావద్ధర్మిప్రమాబాధ్యము కా దనియా? యత్కించిద్ధర్మిప్రమాబాధ్యము కా దనియా? అచ్చట ఘటగతమైన జీవభేదమునకుఁ గూడ స్వధర్మిబ్రహ్మజ్ఞానబాధ్యత్వము స్వీకరించుటచే యావద్ధర్మిజ్ఞానాబాధ్యత్వము సంప్రతిపన్నము కామిం దృష్టాంతహాని ఘటిల్లుటంజేసి ద్వితీయపక్ష మాశ్రయింపనెంచనందు స్వరూపాతిరిక్త భేదవాదిమతమున ఘటాదికమందును బ్రహ్మమందును గలజీవభేద మేక మే గావున నాభేదధర్మి యైన ఘటము సంబంధమగు జ్ఞానమున నబాధ్యమైన జీవభేదము బ్రహ్మయందు మా కంగీకృత మగుటచే నీకు సిద్ధసాధనదోషము. ఇంతియ కాదు. సాధ్యకోటియందలి ధర్మిపదముచే వివక్షితము సగుణమా? నిర్గుణమా? సగుణ మందువేని సగుణస్వరూపజ్ఞానముచే భేదమున కబాధ్యత్వము మా కిష్టమగుటచే సిద్ధసాధనదోషము. నిర్గుణ మందువేని యదియు దోషాయత్తమే యగు, నెట్లంటేని వినుము. ఆనిర్గుణస్వరూప మైనబ్రహ్మము తాను పక్షముగాఁ బ్రమిత (ప్రమాణసిద్ధ) మై యగునా? యప్రమితమై యగునా? అందు ద్వితీయపక్షమున నాయాశ్రయాసిద్ధి కలుగు; నీకుఁ బ్రథమపక్షమం దన్నచోః— జీవాభిన్నముగాఁ బరమాత్మ తత్త్వమస్యాది వేదాంతవాక్యములం బ్రసిద్ధ మగుటచే నీవుచూపిన యనుమానమువలన నావేదాంతప్రమాణమునకు బాధకలుగు 'జ్యోతిష్టోమో న స్వర్గఫలదః, క్రియాత్వాత్, మర్దనక్రియావత్" అను ననుమానము 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అను వేదవాక్యమునకు విరుద్ధార్థబోధకమగుటచే నెట్లాభాసరూపమో నీయనుమానమును నట్టిదే. 255

మం: (అనుమానస్థాపనమునం దసమర్థుఁడై యామార్గము వదలి శ్రుతి 256
విరోధము చూపనెంచి)

ఉ. వాసి చెలంగఁ "దత్త్వమసి" వైదికసూక్తిని దూల్చి 'ద్వాసుప
ర్ణా సయుజా' యటన్న*శ్రుతిరాజము జీవున కాత్మకున్ భిదా
న్యాసము గల్గ నయ్యుపవురం దొకఁ డాస్థను బిప్పలాదియై
భాసిల; నొం డభోక్త యయి భాసిలు నం చెఱిఁగించి మస్కరీ! 257

శం: గీ. వినుము ప్రత్యక్షసిద్ధమై విఫల మగు ప
రాత్మభిద కేల శ్రుతి మాన మగుట; నితర
థా తెలియఁగాదె యద్ది, స్వార్థమ్మునం ద
తత్పరము లయ్యు నర్థవాదములు దనరు. 258

వ. అజ్ఞాతార్థంబునందె శ్రుతికిఁ బ్రామాణ్యము జైమిని చెప్పుటంజేసి ప్రత్యక్షసిద్ధమును ఫలరహితము నగుజీవాత్మభేదము దెలుప శ్రుతి యేటికి? తత్త్వమస్యాదివాక్యవిరుద్ధము లగు నేతాదృశశ్రుతులు స్వార్థమునం దతత్పరములయ్యు నర్థవాదతామాత్రములు గాకపోవు.

మం: క. శ్రుతిమూల మగుట గీతా
స్మృతిప్రసిద్ధార్థవాక్యరీతిఁ బ్రమాణ
స్థితిఁ గనుఁ బ్రత్యక్షసమా
ర్జితార్థవాక్యమును నిగమజీవిక యగుటన్. 260

వ. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" యను గీతావాక్యమునకు మూల మగు తత్త్వమసి యనుశ్రుతి ప్రమాణమగు నట్లే ప్రత్యక్షముచే సిద్ధమగు నర్థము బోధించు 'ద్వాసుపర్ణా'యను నీయభేదశ్రుతియుఁ బ్రమాణమే యగును. 261

*శ్రుతి: ద్వాసుపర్ణా నయుజా నఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయో రన్యః పిప్పలం స్వా ద్వ త్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి. అని

శం: వేదమూలం బగుట వేదవిత్స్మృతార్థ
మందు శ్రుతియ ప్రమాణమూ నందువేని
యెటు శ్రుతి ప్రమాణ మగును జీవేశభిదను
శ్రుతిలవాజ్ఞలు సైత మెఱుంగుదాన. 262

ఉ. ఆ నిగమంబు జీవపరమాత్మలఁ జెప్పు నటంచు మాటమా
తాృనకు నంటిఁగా, కిది యదార్థము- సత్త్వమునుండి వేర్పడం
గా నలపూరుషున్ దెలిపి క్రిచ్చుఆ వానికి సర్వసంసృతి
న్యానత పాదుకో నుడువుచున్నది తన్నిగమమ్మె యెన్నఁగన్. 263

మం: దేవ యీశ్రుతి సర్వజ్ఞజీవులను ద్వ
జించి తా నత్త్వజీవులఁ జెప్పునేని
జడమునకు భోక్తృతను జెప్పఁజాలు నేత
దాగమమునకుఁ బ్రామాణ్య మమరు టెట్లు? 264

శం: నేము నీ కళంకనీయుల మూపైంగ్య
మగురహస్య మిట్లు వ్యాఖ్యసేసె
'నత్తి సత్త్వ' మంచు 'నభిపశ్యతి జ్ఞ' యం
చు నదసీయ మంత్రమునకు సరిగ. 2.5

వ. ఎట్లంటేని 'తయో రన్యః పిప్పలం స్వాద్వత్తీతి సత్త్వం, అనశ్న
న్ననో్య:అభిచాకచశీ త్యనశ్న న్ననో్య అభిపశ్యతి జ్ఞః, తావేతౌ
సత్త్వక్షేత్రజ్ఞా' అని పైంగ్యరహస్యము. పిప్పలభోక్త సత్త్వ మనియు
నభోక్తయై సాక్షిమాత్రుఁడుగా నుండువాఁడు క్షేత్రజ్ఞుఁ డనియు
వివరించుటంజేసి సత్త్వజీవులను గ్రహించిన మావాదము నీ
కళంకనీయము. 266

మం: ధీర! సత్త్వశబ్దమ్ము శారీరవాచి
యగుట క్షేత్రజ్ఞపదము పరాత్మవాచి
యగుటఁ బైంగ్యరహస్యోదితార్థమునను
నల్ల వాక్యమ్మునకుఁ దోఁప దన్యపరత. 267

శం: ప్రాప్తరూప! తదేదిత్యాదిసూక్తిఁ
జిత్తమున సత్త్వపదవృత్తి సెప్పఁబడియె.
దాననే చెప్పఁబడియె క్షేత్రజ్ఞశబ్ద
వృత్తి శారీరకద్రిష్టృవిషయమందు. 268

వ. సత్త్వ మన నంతఃకరణ మనియు 'క్షేత్రజ్ఞుఁ డన శారీరుఁ డనియుఁ' ప్రసిద్ధమగుటవలనను పైంగ్యరహస్యమందు నట్లే వ్యాఖ్యాతం బగుటవలనను రూఢియైనది. ఆపైంగ్యరహస్యమున (*) 'త దేత త్సత్త్వం యేన స్వప్నం పశ్య త్యథ యోఽయం శారీర ఉపద్రష్టా స క్షేత్రజ్ఞ స్తా వేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ' అనియుండె. కావున సత్త్వమనఁ జిత్త మనియు క్షేత్రజ్ఞుఁడన శారీరుఁ (జీవుఁ) డనియు నిశ్చితము. 269

మం: 'యేన' యని స్వప్నదృశిధాతు పూని కర్త
చెప్పఁబడెఁ గాన నయ్యది జీవుఁడె యగు
నెలమి క్షేత్రజ్ఞశబ్దాభిహితుఁడు స్వప్న
దృక్కు నఖిలవిదుం డగు నీశ్వరుఁ డగు. 270

శం: అభిహితం బయ్యెఁ దిజ్ప్రత్యయమునఁ గర్త
యమరెఁ గరణార్థమునఁ దృతీయావిభక్తి
ద్రిష్ట శారీరధర్మవిశిష్టుఁ డగుట
యేన పదవాచ్యుఁ డనఘ! కాఁ డీశ్వరుండు. 271

---

(*) యేన=సాధనమగుచిత్తముచేత, స్వప్నం=స్వప్నమును(క్షేత్రజ్ఞుఁడు) పశ్యతి=చూచుచున్నాఁడో, తదేతత్=అయ్యది, అనఁగా ఆచిత్తము, సత్త్వం=సత్త్వము. అథ, యః=ఎవఁడు, శారీరః= శరీరగతుఁడై, ఉపద్రష్టా=చూచువాఁడై యుండునో, సోఽయం=అట్టి యీతఁడు, క్షేత్రజ్ఞః = క్షేత్రజ్ఞుఁడు. తౌ ఏతౌ = అట్టి యీద్వయము, సత్త్వక్షేత్రజ్ఞౌ=సత్త్వమును క్షేత్రజ్ఞుఁడును. అవి వ్యాఖ్యా-

మం: శారీరపదమువ్యుత్తి 'శ
రీరే భవతి' యనునర్థరీతి నగుఁ; దదా
ధారముగ వెలుఁగు నీశుఁడె
శారీరపదాభిధేయసమయము నెనయున్. 272

శం: ఈశుఁడు వెలుంగఁడే శరీరేతరమునఁ
దెలియ శారీరశబ్దాభిధేయుఁ డెట్టు
లగును? నభము శరీరమం దఖిలమందు
నుండుఁగద దాని శారీర మందు రెవరు? 273

మం: జీవునిఁ బ్రాజ్ఞునిన్ దెలియఁ జెప్పక బుద్ధిశరీరభాజులన్
గేవల మిద్ది చెప్పునెడ నిత్యజడం బగుబుద్ధి 'యత్తి' యం
చేవెర వూని భోక్త్రిగ యతీంద్ర! వచింపఁగవచ్చు? నట్లయే
నీవు ప్రమాణ మెద్ది వచియింతువో చూతము గాక యిమ్మెడన్.

శం: ఇను మదాహక మయ్యుఁ దా ననలయుక్తి
దాహకతఁ గాంచుగతి నచేతనమ యయ్యు
బుద్ధి చిదనుప్రవేశము పొందుకతన
భోక్తృధర్మంబుఁ బొందుఁ బ్రబుద్ధబుద్ధి! 275

మం: నీడ యెండధోరణిని జీవుఁ డీశుండు
గనఁగ భిన్ను లనుచుఁ గారకములఁ
బరఁగు; శ్రుతి "ఋతం పిబంతౌ" యని యభేద
వేదబాధకమ్ము గాదె యదియు. 276

వ. "ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే,
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి పంచాగ్నయో యేచ త్రిణాచి
కేతా," అని కఠవల్లీస్థయగు శ్రుతియు "ఋతం కర్మఫలం, పిబంతౌ-పా
నప్రయోజ్యప్రయోజకౌ"యని తద్వివరణమును బ్రమాణములు 277

శం: వ్యవహారసిద్ధభేదము
వివరించు చబాధక మ్మభేదశ్రుతి కా
చవులను భేదశ్రుతి కది
యవు బాధక మత్యపూర్వ మగుటఁ బ్రబలమై. 278

మం: మానాంతరోపబృంహిత
మానాభేదశ్రుతియ బలాఢ్య యగుటచే
మానాంతరవిధుతార్థం
బా నైక్యశ్రుతికి యతివరా! బాధక మా. 279

వ. ఇందుఁ బ్రమాణాంతర మనఁ బ్రత్యక్షప్రమాణమ యుపపన్న మగు. దాన నుపబృంహితం బగుట భేదశ్రుతి బలిష్ఠయై యా ప్రత్యక్ష బాధితార్థమగు నభేదశ్రుతిని బాధించునే కాని యభేదశ్రుతి భేద శ్రుతిని బాధింపనేరదు. 280

శం: నిగమజ్ఞ! ప్రమాణాంతర
మొగిఁ బ్రబలములుగ నొనర్ప నోపక శ్రుతులన్
దగ దుర్బలములుగాఁ జే
యఁ గడంగునుజుమి గతార్థతా దానాదిన్. 281

క. అని యీతీఱున శంకరుఁ
డనయము వాదించి మండనాస్యపిధానం
బొనరించెఁ దత్కళత్రం
బనుమోదింపఁగ దదీయ మగువాదంబున్. 282

వ. అట్టియెడ సభ్యులసాధువాదంబు లొక్కపటి మిన్నంటె దేవతూ ర్యంబుల నతకరించె. 283

—♦ ఆ శ్వా సాం త ము ♦—

మ. దివిషత్తూర్య ధిమింధిమిస్వన మిళద్గీతిస్ఫురద్ధానవా
హావరంగా ప్త జయేందిరాశుభవివాహా క్షిప్త ముక్తాఫలో
త్సవసంసూచక పుష్పవర్ష నిబిడ ద్యావాపృథివ్యంతరా
ళవలక్షద్యుతి లిప్త కీర్తి లలనాలాస్యోద్ధ వేద్ధాకృతీ!

క. పుణ్యాజనపణ్యాపుణ్యావి
గణ్యా! ఖరదూషణాదికతపస్విద్రు
ట్పుణ్యజనాగ్రిణ్యమితా
రణ్యానీదావదహన! ప్రశమితకుహనా!

ఉ త్సా హ ము

నల సుషేణ మైంద వాలినంద నార్కనంద నా
నిలజ జాంబవ ద్గవాక్ష నీల ముఖ్యకపిచమూ
విలసనాత్త విజయపూర్తి! వేంకటాఖ్య మంత్రిహృ
జ్జలజ సతతవాస లోల! తరణివంశ మౌక్తికా!

ఇది శ్రీ గురుకరుణాసమాసాదితకవిత్వ
వెంపరాల సూర్యనారాయణ నామధేయప్రణీతంబైన
శంకరవిజయంబున
చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము



## షష్ఠాశ్వాసము

## సప్తమాశ్వాసము



## అష్టమాశ్వాసము

## నవమాశ్వాసము

# శంకర విజయము

## పంచమాశ్వాసము




యుత! యాదర వేంకట
రాయామాత్యార్చితాంఘ్రిరాజీవ! ముని
ధ్యేయైకజ్యోతీరూ
పా! యామ్నాయాంతదీప్యదాకృతి! రామా!

వ. దేవా! అవధరింపుము.

### మండనుని పరాజయము

శా. సంధ్యానాటదిందుశేఖరశిరశ్చంచద్వియన్నిమ్నగా
వంధ్యోర్మిస్ఫుట ఘుంఘుమారవ సదృగ్వాగ్గుంఫసౌభాగ్య మా
సాంధ్యంబున్ బచరించి శంకరుఁ డనుచ్ఛ్వాసంబుగా మండనున్
వింధ్యాహార్యము సూర్యునట్లు నిలిపెన్ వేదాంతవాదంబులన్. 1

క. గిరిశిఖర నిస్సర న్ని
ర్ఝరధారా ధోరణీ విరాజితమై వా
క్తరుణీ చరణాంగద రవ,
పరిహాసక మై తదుక్తి ఫక్కి సెలంగెన్. 2

ఉ. సభ్యులు మందహాసవిలసన్ముఖులై యతి మెచ్చ వైదుషీ
లభ్యయశఃప్రకాండవికలత్వము మండనుఁ డొందెఁ, దత్సతీ
బిభ్యదుదారచిత్త మనభీష్టము తెల్పక తీరమిన్ వ్యథా
క్షుభ్యదుదంత మయ్యె సభ ఘూర్ణిత మయ్యెను దత్క్షణంబునన్. 3

శా. దక్షుండై యతివాళి నించెడు సుధాద్రాక్షాసదృక్సూక్తి వై
చక్షుణ్యంబులు విశ్వరూపమహిళాసంభాషణముం గాంచి యు

ధ్యక్షత్వంబున మించి సభ్యుల కమందానందసంధాయులై
విక్షోభం బొదవించె మండను మనోవీథిన్ గళస్రగ్రుచిన్. 4

గీ. ఉభయభారతియును భర్త యురమునందు
వాడి వ్రేలెడు సుమమాలవంకఁ గాంచి
కాంచి నిలువెల్ల స్వేదప్రకంపనములు
గండఱువు నా నచేష్టయై యుండు నంత. 5

ఉ. దుర్మతఖండనైకనిరతుం డగు శంకరు నైగమాంత వా
గూర్ముల నాగ్రహం బుడిగియున్ విచికిత్సఁ జలాచలాత్ముఁడై
కర్మజడుండు గేస్తువియె 'గాసిల నేఁటి పరాజయార్థ మా
నిర్మలజైమినీయ మతనిర్మథనార్థము కుందినం తగన్. 9

ఉ. నైగమకర్మమార్గఘటనాచతురుండు తపస్వి యాగతా
నాగతవేది లోకహితయత్నుఁడు జైమిని వ్యర్థసూత్రకృ
ద్యోగము సేయువాఁడె? యని యుల్లము తల్లడ మొందు' నన్న న
య్యోగివరుండు పల్కె విశదోక్తుల డెందము కందళింపఁగన్. 7

క. కాసంతయేని యపనయ
మాసంయమివంకఁ బొడమ, దజ్ఞుల మాటన్
వీసంబు నెఱుఁగఁ జాలుదు
మే సత్యమ్మైన మానిహృదయం బనుడున్. 8

గీ. పండితాజ్ఞేయ మంటి వప్పారికాంక్షి
హృదయ; మది యెట్టిదయ్యె వర్ణించి చెపుమ
యుక్త మని తోఁచెనేని నీయుక్తి దళద
హంక్రియుఁడనై గ్రహింతు నిండారు మదిని. 9

క. అని మండనపండితుఁ డన
విని శంకరదేశికుఁడు వివేకమునన్ వం

దనపూర్వముగా నా జై
మిని పాండిత్యాదికము సమిద్ధతఁ జల్కున్. 10

మ. వినుమా జైమిని సచ్చిదాత్మకలనాభిప్రాయుఁడయ్యున్ జగ
జ్జనముల్ వైషయికేచ్ఛ మున్గుటను దత్సంతారణార్థంబు బ్ర
హ్మనిదానాప్తికిఁ సాధనం బైన పుణ్యంబెన్నఁ గర్మప్రవృ
త్తి నిరూపించెను దత్త్వదర్శ మగు రీతిన్ జాతకారుణ్యుఁడై. 11

క. జ్ఞానావబోధ హేతుక
మైన 'తమేత' మను వచన మది ధర్మచయో
త్థానకముగఁ జూపుటఁ ద
న్మానియు మోక్షేచ్ఛ వని సమర్థింతు మిటన్. 12

వ. అదియెట్లంటేని వినుము 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన' యను శ్రుతి బోధోత్పత్తికి హేతువగుటంజేసి బ్రహ్మచర్యాదికధర్మంబుల నాచరింప విధించుచుండెఁ దద్వచనాపేక్షకంబుగా జైమిని బ్రహ్మనిరతుండ కానఁ గర్మ మవశ్యాచరణీయ మని నిర్ణయించె, నియ్యది యయ్యనఘు నభిప్రాయం బనుటయు. 13

గీ. అదిగె నిటుల గృహస్థు "క్రియార్థకంబు
లగుట శ్రుతులు సఫలము లనార్థకోక్తు
లెల్ల వృథ" యని సూత్రించి ఋషి శ్రుతులకె
సిద్ధవస్తుపరత్వ మేబుద్ధిఁ బలికె. 14

వ. 'ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదర్థానా' మను సూత్రమునందు క్రియార్థకంబు లగుటంజేసి శ్రుతులు సఫలము లగు నక్రియార్థకంబు లగు వాక్యంబులు నిరర్థకంబు లని జైమిని వచించియు

నిగమవాక్యములె సిద్ధవస్తుపరములని యేల తలంచెనో యని సందియ మొందుచుంటిని. 15

చ. అనుడుఁ బరంపరాగతి హితాద్వయ మయ్యును వేదరాశి దాఁ
గనుఁగొన నాత్మబోధఫలకం బగు కర్మముచేఁ గృతార్థమై
తనరుటఁ గర్మకాండ భణితంబులు కర్మపరంబు లంచు జై
మిని విరచించినాఁ డని యమిప్రవరుం డన మండనుం డనున్. 16

గీ. అఖిలవేదములకు సచ్చిదాత్మపరత
యభిమతం బేని జైమిని, కపురుష మగు
కర్మమున కేల ఫలదాతృకత వచించు
నేల పరమేశు నిరసించు సిద్ధచరిత. 17

వ. అనుటయు శంకరుండు. 18

సీ. "కర్తృపూర్వక మీజగం బను ననుమాన
మే యీశుఁ బ్రకటింప నింక వేద
మనువాద మాత్రమై యలరుఁ గా" కనెడు కా
ణాదసిద్ధాంతమ్ము నరసి మాని
యశ్రుతివిదు లోప రౌపనిషదపురు
షు నెఱుంగనంచు నాశ్రుతులె తెలుప
ననుమాన మోపునే యనుభావమున నీశ
పరమైన యనుమాన మురలుటనట్లు

గీ. యుక్తిశతముల నిరసించు చొగిని జగము
పుట్టుట నశించుటయు ఫలంబును సమస్త
మీశ్వరుని వంకఁ గా వనియెను. మదుక్త
మంతయును జైమినీయాశయమ్మె సుమ్ము. 19

చ. అవిదితతన్నిగూఢమహితాశయులై బుధు లమ్మునీశ్వరున్
దవిలి "నిరీశవాదియ యితం డను నంత నిరీశవాదిగా
నవునె పరాత్మవిన్మణి? యహస్కరదీప్రమయూఖపుంజమున్
బవలు నిశాటనాహితతమంబు మలీమసమున్ బొనర్చునే." 20

మండనుని సంశయములు తొలంగ జైమిని ప్రత్యక్షమై చెప్పుట

క. అని యిటు జైమిని హృదయం
బును యతిశేఖరుఁడు తెలుప బుధుఁడును సభ్యుల్
వనితావతంసమును గని
రనన్యసామాన్యమైన యానందంబున్. 21

గీ. అంత నప్పండితుఁడు విదితాశయుండ
యయ్యుఁ గించిద్విశయుఁడై హృదంతరమునఁ
దద్వచఃక్రమజిజ్ఞాసఁ దలఁచు నంత
జైమినియుఁ గోచరించి యీసరణి ననియె. 22

క. విను భాష్యకారుఁ డగు నీ
యన నాసూత్రముల కెద్ది యర్థ మని వచిం
చెనొ యది నాహృదయము సుమి
మనమున సందియము వీడుమా యిఁక సుమతీ! 23

క. గురుఁ డటు చిదేకరస త
త్పరతర్క శ్రుతిశీర్ష భాషితములకుఁ దెలుపన్
బెఱరీతి నొక్కసూత్రము
విరచింతునె తదుపలబ్ధవిజ్ఞానుఁడనై. 24

క. చాలింపుము సందియపడు
టాలింపుము దెల్పెదను రహస్యం బితఁ డు

ద్వేలభవమగ్నలోకము
పాలింపఁ జనించి నట్టి పరమాత్మ సుమా. 25

ఉ. ఆదియుగంబునన్ గపిలుఁ డన్యయుగంబున దత్తపూని యా
మీఁది యుగాన వ్యాసుఁ డటుమీఁదియుగంబున శంకరుండు జ్ఞా
నాదిక మిచ్చి ప్రోతు రిల నంచును శైవపురాణ ముండె నీ
వీదమిచక్రవర్తి మతమే గ్రహియింపు తరింపు సంసృతిన్. 26

మండనమిశ్రుఁడు శంకరుని స్తుతించుట

గీ. అనుచు మండను బోధించి యతిలలాము
మనమునం గౌఁగిలించి జైమిని తిరోహి
తుండయిన యంత నయ్యతీంద్రునకు మ్రొక్కి
యాయజూకావతంస మిట్లని నుతించె. 27

క. ప్రకృతివి జగములకు సమా
ధికరహితుఁడ వతులబోధదేహుఁడ వయ్యుఁ
బికలాత్ములఁ బ్రోవఁగ భౌ
తికదేహుఁడ వైతి వని మదిన్ నినుఁ గంటిన్. 28

ఉ. ఓ యతివర్య? యౌపనిషదోక్త్యద్వితైకపదంబుఁ దత్త్వమ
స్యాయుధ మీవు గైకొని నిరంతర మారయవేని భ్రష్టతా
ప్యాయనసౌగతప్రలపితాంధకకూప పిచండపాతముఁ
బాయఁగఁ జాలునే విలయభావముఁ గాంచక యున్నె యింతకున్.

చ. కలఁ గని మేలుకొంటి ననుగాఢమతిఁ గలయంచె యన్య మా
కలఁ గను మూర్ఖరీతి నవగాఢతమోవశు లౌచుఁ గొంద ఱా
త్మలఁ బరలోక మందు టమృతత్వ మటంచుఁ దలంతు రట్టివా
రలఁ గని నవ్వుచుందురు నిరాకృతమాయులు తావకాశ్రితుల్. 29

ఉ. ఆరయఁ గర్తృతాముఖరమై గతసారము నౌ భవంబుఁ బోఁ
గోరని భేదవాదిమతకుత్సితముక్తి యిసీ యదేల? యో
ధీర! త్వదుక్తముక్తిఫణితిన్ గనఁ జూతు సదాతనంబు సం
సారహరంబు చిత్సుఖరసప్రద నిర్ఝరపాట నీపయిన్. 31

ఉ. రాక్షసకామినీవృత ధరాసుత నీకు ప్రియున్ గనంగ నే
యీక్షితి వాయుసూతి నుతికెక్కెను, మ్రింగిన యీశుకై యవి
ద్యాక్షణదాచరీజఠరదారణమున్ బచరించి యీశు స
ద్వీక్షణపాత్రుఁ జేయు భవదీయమహత్త్వ కియత్త యున్నదే. 32

క. జగదార్తిహరణచణ! భవ
దగణితమహిమంబు దెలియ కాముని వాదిం
పఁగడఁగిన మదపరాధము
తగ క్షమియింపఁగదె సూరత ప్రథముఁడవై. 33

గీ. అప్రమేయప్రతిభు లౌ కణాద కపిల
గౌతమాదులె వేదసంఘాతభావ
నిర్ణయ మొనర్ప మోహ మొందిరి యనంగఁ
జాలుదురె యన్యు; లోక శివాంశంబు దక్క. 34

మ. అమృతాసార కిరద్భవద్వదనజాతాలాప పీయూషభా
స్సముదాయంబు దిశావకాశముల మించన్ జిత్తమాలిన్యబీ
జములై కూడిన కాణభుక్కపిల పశ్యత్పాద శాస్త్రోక్తిసం
తమసస్తోమముతోఁ బ్రయోజనము కానన్ వచ్చునే లేశమున్.

సీ. దేవుని భేదించి గోవుల భజింపఁ
దివిరెడు నభినవ యవననివహ
మవని యంతయుఁ బర్వె, నవ్వారి సేవించు
నవ్వారి కెచ్చట నెవ్విధమున

ముక్తి గల్గునె యంచు మున్నహర్నిశమును
చింతించుచుండుదుఁ జిత్తమంద
సద్వ్యాదిరాజు లుత్సారితకలిమలుల్
విష్ణుతత్త్వాభినివిష్టమతులు

గీ. పరమనిపుణులు నైన భావత్కశిష్య
కుంజరులు సర్వదిక్కులు గూడముట్టి
జృంభణము సూప నిఁక నేల చింత నొంద
సత్వభావితభావ! యాచార్యదేవ! 36

గీ. మందమతికృతవివరణదండశూక
విక్షతిహతంబు లగు శ్రుతుల్ విమలయుష్మ
దుక్త్యమృతసేక మొదవక యున్న వరలఁ
జాలునే యాత్మవిధృతానుశయము లగుచు. 37

గీ. తీవ్రతర దుస్సహ భవోష్ణదీధితి ప్ర
బలత రాతపజాత తాపంబు శాంతి
నందునే భవదీయ సూక్త్యమృతకర మ
యూఖసంపర్కమునఁ దక్క నొండొకంట. 38

ఆ. అకట! కర్మయంత్రమం దెక్కి శ్రుతతహో
దారపుత్రగేహదాసవిత్త
ముల జనించు మానమునఁ గాలు నన్నెత్తి
తల భవాంధకూపబిలమునుండి. 39

క. తొలుబాముల దుష్కర మగు
నలఘుతపము చేసికొంటి; నటుగాక కృపా

జలధి! జగదీశ నీతోఁ
గలుగునె యీవాదజల్పకథ లిటు నాకున్. 39

సీ. శమరూప పూర్వపుణ్యమున కంకుర మెద్ది
దమ సముద్గతి కెద్ది తలిరుటాకు
వైరాగ్యవిటపికిఁ గోరకం బెది సహా
నత్వవల్లిక కేది ననలజొంప
మేకాగ్రతాసుమ బృందంబునకు నమం
దమరందబిందు సంతాన మెద్ది
సంతతశ్రద్ధకు సముదితఫల మెద్ది
ధీరవృత్తులకు విందేయ మెద్ది

గీ. పరమగురువర్య! యట్టి తావకమనోజ్ఞ
వచనపరిచయమును బూర్వభవసహస్ర
సముపలబ్ధ సంఖ్యాతీతసారపుణ్య
పటుపరీపాకమునఁ గాదె పడయఁగంటి. 40

గీ. నాకసంవాసులకుఁ బాపపార్థ మొసఁగు
భువిని భవమగ్నజనులకు మోక్ష మొసఁగు
సత్కృపోర్మిళ నీకటాక్షఝరి దలఁప
ధన్యుఁ డగువాఁడ మున్ను నద్దానియందు. 41

చ. పొలఁతులచన్నుదోయిపయి పుట్టపుఁగొంగు దొలంచి ముట్టి కోఁ
గిలిగొని హాళిఁ జొక్కి కరఁగించి రమించుచుఁ గొంద ఱుంద్రదు గా
కలఘుయశోఽర్థులై నిపుణులై తగువీరలు దేశికేంద్ర వా
గ్గళిత సుధాఝరీ ప్లవనకౌతుకులై విహరింత్రు ధీరతన్. 42

చ. తిమిరహరంబు లౌ విశదదీప్తుల భాసిలు ధ్యానతంతుగుం
ఫ మిళిత తావకోక్తి పృథుమౌక్తికహారమ్ములన్ ధరించి వ్యా

దమునఁ జరించు వీరిఁ దనుఁ దాన వరించును హృద్య విద్య-య
య్యమరవరాదులన్ గొనక యంతటి భూష బుధాళి కున్నదే? 43

ఉ. వేదవికాస హేతు వగు విశ్రుతతావకకీర్తికిన్ బుధుల్
మోదముగం దుర్గా- కల సభోమణిదీప్తికి గూబ లట్లు మో
హోదధి మున్గుతన్ ఖలసముత్కరముల్, గురుశంకరార్చనా
సాదితమోహరాశి నయి శాశ్వతికాత్మసుఖాబ్ధి దోఁగెదన్. 44

సీ. సంతానశాఖ యుష్మచ్చింతనమ్ము నం
దనవనమ్ము భవత్పదప్రణామ
మమరభూరుహవల్లి యనఘ! భవత్సమా
రాధనాతంత్రమర్వారవాంభ
మందాకినీనది సుందరభవదీయ
వరగుణనికురుంబవర్ణనంబు
స్వర్గంబు నేత్రగోచర మౌ భవచ్చర
ణాంభోజయుగళంబు నర్హణంబు

గీ. గావుతఁ బుధుల్ విచారమగ్నత విరక్తు
లగుచు భవదాశ్రయము గాంచి యాత్మలందుఁ
దృణసమంబుగ గణియింత్రు త్రిదివజగము
సచ్చిదానందధుర్య! యాచార్యవర్య! 45

గీ. కాన సంతానకాంతానికాయ్యవిత్త
ములను గార్హస్థ్యకర్మశృంఖలఁ ద్యజించి
శరణముగ వరియింతు నీచరణయుగళి
కరుణ నను నేలుకొనుము కింకరుని దేవ. 46

చ. అని యిటు మండనార్యుఁడు యథార్థతఁ దద్గుణముల్ నుతింప, మె
చ్చినమది నాత్మవేది గురుశేఖరుఁ డప్డు డనుగ్రహించి యా

తనిఁ గొన నెంచి వాని సహాశస్త్రకరిన్ గన, నా పెయుర్ యతీం
ద్రుని మహితాశయంబును గనుంగొని యల్లఁబల్కె నీక్రియన్. 47

భారతి తనపూర్వ వృత్తాంతమును జెప్పుట

క. యతివర! యెఱుఁగుదును భవ
న్మతిఁ దొల్లిటఁ దెల్పె నొకఁడు మౌనీంద్రుఁ డనా
గత మగు నావృత్తాంతం, బ
క్కతను వచించెదను శ్రద్ధగా విను మనఘా! 48

ఉ. శైశవమందు మజ్జనని సన్నిధి నుండ నొకప్డు వచ్చె మౌ
నీశుఁ డొకండు పింగరుగుదీర్ఘతటిత్ప్రతిమానజటాజూ
టీశిరుఁడై త్వగావృతకటీరుఁడు నై సకలాంగలిప్తభ
స్మాశితికాంతిమండలుఁడు నై వసుధాగతశంభుఁడో యనన్. 49

గీ. వచ్చిన మునీంద్రునకు నర్ఘ్యపాద్యముల నొ
సంగి నాతల్లి మౌళి నంజలి ఘటించి
నాభవిష్యచ్చరిత్ర మంతయును దెలుపఁ
బ్రార్థన మొనర్చె నిటు లనురాగ మొలుక. 50

క. మహనీయ! యెఱుంగను నా
దుహిత భవిష్యంబు; తెలియుదు తపో మహిమన్
మహితాత్ములు ప్రణతులకుం
బహుళకృప రహస్య మెఱుకపఱచెదరు గదే. 51

ఉ. ఈయమ కాయు వెంత? సుతు లెందఱు గల్గుదు? రెట్టి వాఁ డగున్
నాయకుఁ? డధ్వరంబుల నొనర్చునొకో? ధనధాన్యపూర్ణ యౌ
నే? యని భావ్యదంతమును బృచ్ఛ నొనర్ప నిమీలితాక్షుఁడై
యాయతి పల్కెఁ జూచినక్రియన్ మదుదంతము నెల్లఁ జిత్ర మౌ.

ఉ. ధారిణి వేదబాహ్యమతధాటికి వేదపథంబు గూల నం
భోరుహసూతి యుద్ధరణమున్ సలుపన్ జనియించు బ్రాహ్మణా
కారవిహారుఁడై ; గిరిశు గౌరి, హరిన్ సిరివోలె, సమ్మహా
సూరిని నీపె పెండ్లియయి సూనులఁ గాంచును గాంచు సౌఖ్యముల్.

గీ. అంతట దురంతకుమతకృతాంత మయి వి
నష్ట మగు నౌపనిషద సన్మతము ప్రోవ
మానుషాకార మూని యీశానుఁ డవని
నిజపదాబ్జవిన్యాసమండిత నొనర్చు. 54

క. యతిరూపుఁ డై నగారి
పతితో నీకూఁతుపతికి వాదము గలుగన్
జితుఁ డగు విసృష్టగృహుఁ డయి
గతి నీ వని కొలుచు నాజగద్రక్షకునిన్. 55

గీ. అని చనియె నమ్మునీంద్రువచోనుసార
ముద్భవించినదాది నెం దోట యెఱుఁగ
నట్టిమత్పతి వేద వేదాంగవేత్త
జితు నొనర్చితి నీవ సూ శివుఁడ వార్య. 56

భారతి శంకరునితో వాదింపఁ గోరుట

ఉ. వినను నామనోహరు సమగ్రముగా జితుఁ జేయ వైతి సా
నగు నన్నుఁ గెల్చి కొనుమీ యితనిన్ నిజశిష్యుఁగా యతీ
శ న! లభించుఁ పూర్ణజయశంసలు నీకు, భవాదృశున్ మహా
జ ని నెదిర్చి వాదము నొనర్పఁగ నాకును వేడు కయ్యెడున్. 57

క. అని యాయజూకవరవ
ర్ణిని యనపేతార్థమును ననింద్యము మధురం

బును నగుపలుకుం బలుకఁగ
విని యయ్యతి ప్రీతి వచింప వేడుక గనుచున్. 58

క. చిత్తము వాదాత్మునకు
యత్తమైన దంటిః వంబుజాక్షులతో ధీ
రోత్తములు వాదొనర్తురె
మెత్తురె యెవరైన ననుడు మెలఁతుక పలికెన్. 59

చ. గరితలొ లాఁతులో యెవరు గాని స్వకీయమతంబు నొంప నో
ర్తురె స్వమతావనప్రతిపరుల్ వివదింపక? యాజ్ఞవల్క్యుఁ డు
ద్ధురగతి గార్గితో, సులభతో జనకుండును మున్ను వాదొన
ర్పరె? ధర వారికీర్తి కొకపాటియునునేని గళంక మబ్బెనే? 60

గీ. అని తరుణి యుక్తియుక్తముగను వచింప
శ్రుతినదీవారిరాశి గుసుండు ముదితుఁ
డై యొడంబడె విద్వత్సభాంతరమున
నుండి యాసాధ్వితో వాద మొనరఁ జలుప. 61

ఉ. అంతట నొండొరుల్ గెలుచునాదట నయ్యతిరాజమౌళి క
క్కాంతకు వాద మయ్యె మతికౌశలగుంఫితశబ్దనిర్ఝరీ
కాంతము తచ్ఛ్రుతిప్రభవగాఢతరాద్భుతవత్సుధీస్తవా
క్రాంతము నౌచు సభ్యజనకర్ణపుటామృతబిందుధారయై. 62

గీ. వారల విచిత్రపదయుక్తిభరితవాద
మాలకింప సహస్రాస్యుఁ డల త్రియాత
నుండు వాచస్పతియు నుశనుండుఁ బోలఁ
జాల రనిపింప నెవఁ డింకఁ జాలు జగతి. 63

క. పగ లసకఁ జేయి యన కి
ట్లగణితమై వాదకథ నియమకాలము ద
క్కఁగ నయ్యతి కాసతికి జ
రిగెఁ బదునేడహము లొక్కరీతినె యపురా. 64

గీ. అపుడు భారతి యకృతకోక్త్యాదులందు
సకలశాస్త్రములను వీఁ డజయ్యుఁ డనుచు
మది విచారించి యొక్కింత కొదికి యంత
లోన దిటపడి నిశ్చయ మూనె నిటుల. 65

ఆ. పుట్టుబ్రహ్మచారి పురిటింట సంన్యాస
మూని సతతనియమధానుఁ డౌటఁ
గామశాస్త్రగ్రంథ మేమియు లేకుండుఁ
గాన నేఁడు గెల్చుదాన దాన. 66

వ. అని నిశ్చయించుకొని పూర్వాహము పూర్వాహ్ణమున నడచిన
ప్రవృత్తినివృత్తిమార్గద్వయమునందలి కీడుమేళ్లవాసి మరలఁ
బ్రసంగంబునకు రాఁ దివిచి యాగరిత యి ట్లను. 67

### ఉభయభారతి శంకరునిం గామశాస్త్రమునఁ బ్రశ్నించుట

చ. యమిజననాథ! నీసమయమందు వచింతు 'మనంబె బంధమో
క్షములకు హేతు' వంచు విన సంతస మయ్యె, మనంబు హేతు వే
క్రియమున నయ్యెనో తెలుపఁగావలెఁ? గర్మము తాన బంధమో
క్షములకు హేతు వౌ మనసు కర్మవశంవద మండ్రుగా బుధుల్. 68

గీ. అనుడు శంకరార్యుఁ డనె సాధ్వి కర్మము
ననుసరించు బుద్ధి యనుట నిజము

మనసు లేని బంధమును గూర్చి యొసఁగేయు
ముక్తి; తనయభావమున ఘటించు. 69

వ. మనంబు తానుండి బంధమును, నశించి మోక్షమును గల్గించునది
కావున భావాభావములచే బంధమోక్షములకు హేతు వగు, బుద్ధి
కర్మానుసారిణి యనుటయు నవిరుద్ధంబ. 70

క. అది సంకల్పవికల్పా
స్పద మయి సత్పదమునం దనద్బుద్ధి, యస
త్పదమున సద్బుద్ధి సదా
యుదయింపఁగఁ జేసె జీవు నుద్దాడించున్. 71

సీ. తనముద్రయున్నట్లు ధనము నా దనిపించి
వనటల ముంచును మనసు గాదె
తనకర్మమున జనించినవాని నాత్మజుఁ
డని సేవ సేయించు మనసు గాదె
యెచటనో జనియించునింతి యిల్లా లని
తనవారి మఱపించు మనసు గాదె
తనశరీరము శాశ్వతం బనిపించి ముం
చును లోభవారాశి మనసుగాదె

గీ. యెఱుక యేలవ మే నుదయించె నేని
మలఁపి యపథమ్మునం బెట్టు మనసు గాదె
రాగకలుషితమై కామరాక్షసునకు
జననకారణ మైనది మనసు గాదె. 72

క. ఏతాదృశదుర్మానస
జాతం బగు కామమునఁ బ్రసక్తుఁ డయినసా

ఖ్యాతిశయము నాభాసిక
మై తనరు నిమిత్తకారణానుగుణముగాన్. 73

చ. కలుగునెడన్ మనోలయము, కల్గదు గామము, దానఁ గామినీ
కలుషముఁ బుత్రమోహమును గాన్పడు, దేహమునన్ మమత్వమున్
దొలఁగు లభించు మోక్షము; మనోలవ మున్నెడఁ గామపీడ వ
ర్థిలి సుతదారబంధపరిధిన్ బడి జీవుఁ డభావుఁడై చనున్. 74

ఉ. నా విని పల్కె నవ్వనిత నాయమె కామము నట్లు దూఱ? దే
వా! వినవా తృతీయపురుషార్థ మటంచన ధర్మ మర్థమున్
గావలెనా? త్రివర్గమునఁ గామము త్యాజ్యమె? వీని మూఁడిటిన్
బోవ నడంచి యుద్దవిడి మోక్షము నొందెడివాఁ డెవం డిలన్. 75

గీ. ధర్మము విశేష్యమై తొల్తఁ దక్కు రెంటి
కిని విశేషణమై పొసంగును గదన్న
ధర్మమును ధర్మమైనదర్థమ్ము కామ
మాను మోక్షసౌధమ్ము సోపానపంక్తి. 76

క. మోహమున, నురమున, దేహము
సాహున, భామల ధరించి సంతతము మహా
కామపురుషార్థదీక్షితు
లౌ మూర్తిత్రియము ముక్తు లగుదురొ కారో. 77

క. ధర్మార్థంబుల నారసి
మర్మ మెఱిఁగి విడిచి నట్లు మాటాడితి, వే
మర్మ మెఱిఁగి కామమ్మును
నిర్మమతఁ దొఱంగి ముక్తినిం గనఁ దలఁతో. 78

మ. అనుడున్ శంకరుఁ డిట్లు పల్కె సుచరిత్రా! తత్త్రివర్గంబు దాఁ
బునరుత్పత్తికిఁ గారణంబు లగుటన్ మోక్షార్థి యమ్మాట ము

న్గినఁ దప్పించుకొనన్ వలెన్ మునుఁగఁ డేనిన్ దప్పఁగా నేఁగనో
నని శాస్త్రంబులు దెల్పవే శుకుఁడు ప్రహ్లాదుండు దృష్టాంతముల్.

క. జనకాదులు సంసృతిలే
పనదూరులు తత్త్వవర్గభాజనులై ము
క్తిని గనుట విశేషవిధి య
గున; యది సామాన్యమగునొకో జగములకున్. 80

ఉ. ముక్తులు గారటందునె త్రిమూర్తుల, వారలు దారలన్ దనూ
సక్తులఁ జేసికొన్నవరుసన్ గనుపింతురు తమఃప్రసక్తిఁ, బ్రి
త్యక్తమతత్త్వయంబున భిదాప్రథలేనివిధాన దంపతి
త్వోక్తికి స్త్రీత్వపుంస్త్వముల యూహములున్ శశశృంగభంగికల్.

ఉ. జ్ఞాని శ్రుతిస్మృతంబుల జనప్రకృతిన్ మదిఁ జొన్పి దానఁ బూ
ర్ణానుభవంబు గాంచుఁ, దన కక్కఱ గల్గ సుసాధ్య మా నిహం
బేని పరంబునేని-యది యెల్లను జ్ఞానమహత్త్వఁ జేపడున్
గాన వృథా శ్రమంబు గలుగన్ వివదింపకు నమ్ముచో నన్. 82

గీ. ధర్మమట్టుల యర్థ, మర్థమ్మునట్ల
కామమును జ్ఞానశక్తిని గాఢముగఁ బ
రీక్ష సేసియ రోసి యీమోక్షపథము
నందుఁ జరియింతు నా తెలియనిది లేద. 83

క. అన నమ్మానిని యతి వం
చనఁ బలుకుచునుండె ననుచు స్వాంతమ్మునయం
దనయము తలపోసి తనకు
ననయం బని యైన నెంచ కనె నీరీతిన్. 84

శా. ద్వైతజ్ఞానరహస్యముల్ దెలియ కద్వైతంబు సిద్ధించునో
క్కో తద్ద్వైతపథానుయోగమును వాకో నుండ ని ట్లాడ నా

నే? తప్పించుకొనంగ యుక్తు లిటు చన్నే పన్నఁగా; జ్ఞాని కూ
హాళీతంబు ఘటిల్ల దంటి విది చోద్యం బద్దియున్ జూచెదన్. 85

వ. అని కామపురుషార్థంబు ధర్మ్యం బనియు సాక్షాత్సాధనము గా కున్నను మోక్షమునకుఁ బరంపరాసాధనం బేని గాక మాన దనియుఁ గా దనియుఁ గొంతసేపు వివదించి ప్రసక్తానుప్రసక్తంబుగా స్త్రీ పురుషజాతివిశేషంబులంగూర్చి చర్చించి తుట్టతుద కయ్యిందువదన కేవల జిగీషాయత్తచిత్తయై యెదిరిం దన్ను మఱచి యిట్లని ప్రశ్నించె. 86

గీ. ఇంచువిలుకాని కళ లెన్ని? యెట్టి వవ్వి?
వాని నెల వెంచ నెది! శుక్ల బహుళపక్ష
ములను నెట్లు ప్రవర్తిల్లుఁ? బొలఁతులందు
నెటుల తోఁచును? బురుషులం దెటుల తోఁచు? 87

వ. అనుచు నతర్కితోపనతముగాఁ బలుకుటయు. 88

క. విద్యల గని యగు నయ్యన
వద్యాంగి జిగీషఁ బిడుగువడినటు లనునా
చోద్యమునకు భిక్షుకపతి
చోద్యమున మునింగి నింగిఁ జూడ్కి నిగిడ్చెన్. 89

క. ఘనుఁ డతఁడు మాఱు పలుకక
మనమున నిటు లెంచెఁ గళలమర్మమ్ము లం జె
ప్పనియెడ జితుఁడ నగుదుఁ జె
ప్ప నెటుల మన మొప్పు రహస్యపట్టున సతితో. 90

ఉ. అంతియ కాదు కామకళయందుఁ బరాజయ మొందుమాత్రనే నొక్కింత కొఱంత గాంతునె? యి దెల్లను జూచు ప్రజల్ యతీంద్రుఁ డక్కాంతకు నోడె నేదో యడుగన్ దగునుత్తర మీయ నేరకం చెంతయు నింతఁ జెప్పుకొనరే సకలజ్ఞత వోదె నేఁటితో. 9

శంకరుఁ డుభయభారతిని గడుపువేడుట

మ. అని భావించి సభాంతరంబున లతాంతాస్త్రాగమమ్మున్ వచిం
పను సందేహముతో నచుంబితకళాప్రశ్నంబు గావించి తం
గన! యిమ్మాగడు వొక్కమాసము సమగ్రం బద్ది నే నేర్చి వ
చ్చి నినున్ గెల్చెద నిద్ది ధర్మమె కదా చింతింప వాదమ్ములన్. 92

ఉ. మానిని! నాకు నెట్లొ యవమానము చేకుఱ వాదరీతికిన్
గాని యనంగశాస్త్రవచనంబులఁ బ్రశ్న మొనర్చి నిగ్రహ
స్థానము నొందె; నైనఁ బరిపత్తునసాక్షిణి నిన్నుఁ గా దనం
గా నగునే, య దేల యొసఁగంగదె సమ్మతి పోయి వచ్చెదన్. 93

క. నావుడు మండనమిశ్రుని
దేవియు సభ్యులును ననుమతింపఁగ శిష్య
పరివృతుఁడై దవుల నొకవ
నీవీథిగతాద్రి కతఁడు నెమ్మిం జనియెన్. 94

వ. మండనమిశ్రుపుస్తకభాండాగారమునుండి వలయు కామశాస్త్ర గ్రంథములు గొంచు నటుల చనిచని యయ్యటవి నిరుపహతి యగు నొక్కకొండ నెక్కి యందొక్కగుహం గాంచి శిష్యులంబిలిచి యిట్లను. 95

చ. సమతలమై పురస్థితవిశాలశిలాఫలకాభిరామమై
యమరిన దా మహాగుహ; తదగ్రవటద్రుపు తత్సమీపమం
దమలజలాప్తమై ఫలభరానత భూరుహమండ రమ్యతీ
ర మగు సరోవరంబును విరాజిలుచున్నవి కాంచి రేగదా. 96

వ. ఇది వసింప ననువుగ నుండు నని పలికి కందమూలఫలాశనుండై యచటన నిలిచి. 97

శంకరుని కామ కలాధ్యయనము

సీ. అధిగమించెను సుమనోస్త్రసంప్రోక్తమౌ
రతిశాస్త్రజలధిఁ బారంగతముగఁ
జదివె నామూలాగ్ర ముదితకౌతుకుఁ డౌచుఁ
గూచిమారవచోనిగుంఫనముల
నభ్యసించెను బహువ్యాఖ్యాపరీక్ష వా
త్స్యాయనకామసూత్రముల నెల్లఁ
గఱచెఁ బ్రత్యక్షరపరిశీలన మొప్పఁ
గూలంకషముగఁ గొక్కోకకృతిని

గీ. నాయికానాయకుల విభిన్నతలు దెలిసె
హావభావంబులు రసంబు లాకళించె
భరతమునినాట్యశాస్త్రము నెఱిఁగె, నంది
కేశ్వరకృతాభినయశాస్త్రహృదయ మరసె. 98

క. శారీరవిచారంబుల
నారయు యోగాగమమ్ము నాయుర్వేదం
బారతిపతిశాస్త్రముతో
వైరుధ్యము నొందుచోట్ల వరుసఁ బరీక్షణ. 99

మ. అగునే యిట్టు లలంక్రియాభినయనాట్యంబుల్ 'రసో వై స' య
న్నిగమాంతోక్తి ప్రమాణమై వెలయ వర్ణించున్ రసోత్పన్నహృ
ద్యగుణానందము నెల్లతావులను బ్రహ్మానందసబ్రహ్మచా
రిగ, సత్యంబొకో స్తావకంబొ యని తర్కించున్ గ్రహించున్ మదిన్.

గీ. అటుల క్షోదక్షమముగ నయ్యతి సుమాస్త్ర
శాస్త్రపాథోధి మథియించి సార మధిగ
మించెఁ దల యూఁచె మెచ్చె హసించెఁ బెద్ద
నిశ్వసించె జుగుప్సించె నెమ్మనమున. 101

మ. మతి యాసంయమిచంద్రుఁ డీక్రియ మదిన్ భావించె - నాత్మస్వ దు
ర్భరవాదోత్సుకతానిమగ్నమతి నప్రిష్టవ్యసంప్రశ్నమున్
బురుషున్ న న్నడిగెన్, సభన్ నిలిచి పూర్వుంబోణి కే నెట్లు లు
త్తర మిత్తున్ మది మెత్తురే జనులు నిందల్ క్రిందుకో కుందునే.

చ. ప్రజ గనుచుండ నిండుసభ భామినితో మదనాగమంబు ని
ర్లజముగఁ బల్కు బెట్టు లబలామణి యొంటి వసింపఁ గాంచి చె
ప్పఁ జనునె, చేర నౌనె, మగవాఁడఁ గదా; గన నొం డుపాయ మం
చజగవపాణిరాణి హృదయాబ్జముఁ జేర్చి భజించు భక్తితో. 103

క. అంతట దశమదివసమం
దంతేవాసులను బిలిచి యతిపతి యను - ని
శ్చింతముగ సమాధిస్థితిఁ
గొంతతడవు పూన నెంచికొంటిని మదిలోన్. 104

చ. అనవరతంబు మీరలు గుహాముఖమంద వసించి యుండి నా
తనువున కేయపాయమును దాఁకకవైఖరిఁ గాచి యుండుఁ డం
చును గుహ సొచ్చి యొక్కెడ విశుద్ధమనంబున దర్భశయ్యపైఁ
దనువును వ్రాల్చి ప్రాణతతిఁదట్టి సమాహితుఁడయ్యె నొయ్యనన్.105

ఉభయభారతికిఁ బరాజయభయము

ఆ. సభ ముగించి యుభయశారద యానాఁడు
మొదలు భర్తృవిరహమునకుఁ గలఁగి
శారదను భజింప సాగెను నియతోప
వాసదీక్ష గొని దివానిశంబు. 106

ఉ. ఓటమి తప్ప దన్నతలఁ పుల్ల మగుల్పఁగఁ బ్రాణనాథుభి
ప్మాటన మెట్లు కంటనరయంగల నన్నభయంబు జీవితో

చ్చాటన కుద్యమింప నిజసంస్కృతివై భవమున్ స్మరింప, క
జ్జోటి పరాభవానలముచొప్పు దలంచి కృశించు నెంతయున్. 107

ఉ. పుత్రులఁ గాంచఁ బో, దుడిగపుంజెలులం బనిఁ బూన్పఁబో, దహో
రాత్రము ముద్దుసేయుశుకరాజి మృదూక్తుల మెచ్చఁబో, దిహా
ముత్రఫలానురక్తి మనముక్ జొరనీదు, నిజేశునిక్ గలా
మాత్రముఁ బాయనేర, దలమానిని భావి స్మరించి భీతయై. 108

క. ఉండునెడ నట కిరువదొ
క్కండవదినమందుఁ జెలిమికత్తె యొక, ర్త
య్యండజగమనకడకు ను
ద్దండరయంబునను వచ్చి దడయ కిటు లనెన్. 109

శబరుం డుభయభారతికిఁ జిలుకను దెచ్చి యిచ్చుట

గీ. అమ్మ! మన వీథిద్వారంబునందు నున్న
వాఁడు శుకయుక్తపంజరపాణి యైన
శబరుఁ డొకరుండు నీదు దర్శనము గోరు
చున్నవాఁడు శుకంబు నీ నున్నవాఁడు. 110

క. మన కీరవారమునకం
టెను దక్కరంబు కళల నిపుణం బని పే
ర్కొనె శబరుఁ డుబుసుపోకకుఁ
గొనవే నీమదికి శాంతి కుదురును జూవే. 111

సీ. అనవుడుఁ దోడి తెమ్మనుచు నంగన పల్క
వేవేగఁ జని బోటి వీథి నున్న
శబరు సకీరపంజరసమేతాగ్రహ
స్తుని లోనికిని దోడుకొనుచు వచ్చె

నంత వనేచరుం డాపంజరము గృహా
ధీశ్వరి గన నెట్టయెదుట నునిచి
మృగయార్థ మేఁగునా కగపడె నీకీర
మటవిని నొకసరస్తటి దుమంబు

గీ. నీడఁ గన్నులు మూసి మానిక్రిమమున,
నది యరసి యబ్రిపడి మెల్ల నడుగు లిడుచుఁ
జేరి పట్టంగ నామోము జేటి చూచి
యేమి ధైర్యమొ గాని తా నిటుల వలికె. 112

శా. అన్నా! నే నొకమానియాశ్రమమునం దాబాల్య మిన్నాళ్లుగా
నున్నా, నెల్లకళల్ గ్రహించి జగమం దున్నట్టిశాస్త్రజ్ఞులన్
గన్నారం గనఁ గోరి వచ్చుచును నీకై చిక్కితిన్ నన్నుఁ జం
ప న్నీ కొండొకముద్దఁ గానె యనుకంపన్ నింపి రక్షింపుమా. 113

ఆ. చదువుకొన్నవారిసన్నిధి ననుఁ జేర్చు
మనెదుఁ గొదువవిద్యలను గ్రహింతుఁ
బారితోషికములఁ బడసి బిడ్డలతోడఁ
బెద్దకాల మనుభవింతు సుఖము. 114

చ. అనుటయు నల్లఁ బంజరమునం దిడి, పండ్ల నొసంగఁ గంటితోఁ
గనమికి వింత నొంది, నుడికారపుసొంపున కుబ్బి, యీపురం
బున కరుదెంచి యిందు బుధముఖ్యుఁడు మండనుఁ డుండునంచు విం
చు నిటకుఁ దెత్తు, నీ వతనిజోటికవంట గదమ్మ నావుడున్. 115

శా. ఔ నేనే యని యాపురంధ్రి ధనధాన్యాన్నాంబరశ్రీల స
మ్మానింపన్ శబరుండు తద్గుణములన్ బల్మాఱు కొండాడి యెం
తేనిన్ బొంగుచుఁ గానకున్ జనుడు; నాధీమత్పయోజాస్య దా
నీ నీతం బగుపంజరంబు తిలకించెన్ గేలఁ బై కెత్తి తాన్. 116

ఉ. అంతటిదాఁక మూఁగయటు లందు వసించుశుకంబు "సాధ్వి! న
న్నంతకహస్తముక్తుఁగ దయామతిఁ జేసితి నీకు భర్తకున్
సంతతికిన్ బ్రభూతశుభసంపద గల్గుత" మంచుఁ బల్కఁ ద
త్కాంత మనంబునన్ తదుచితజ్ఞతకున్ వెఱఁ గంది చెచ్చెరన్. 117

గీ. చల్లనైనహిమాంబుల జలకమార్చి
చక్కెర లనంటిపండ్లు రసాలఫలర
సములు దాడిమఫలముబీజముల మేపి
యలసటను దీర్చి పతిమ్రోలి కపుడ తెచ్చె. 118

ఉ. తెచ్చి తదుక్తియాచితి నుతించి కిరాతుఁ డొసంగువార్త వా
క్రుచ్చి తదీయవిజ్ఞత నెఱుంగఁ గుతూహల మొందు భర్తకై
మచ్చుగ శాస్త్రవాద మొకమాత్ర మొనర్చి ముదంబు గూర్చి లో
మెచ్చుచు గృహ్యకీరముల మించిన దంచును సంతసించుచున్. 119

ఆ. భవనకీరపంక్తిఁ బరిపాటిఁ దెప్పించి
వేదమందు శాస్త్రవాదమందుఁ
బోటి పెట్టి, పెద్దప్రొద్దు వాదించి జ
యించు నాశుకంబు నెఱుక కలదు. 120

సీ. అష్టవిధంబైన యవధానముల వేద
ములు తలక్రిందుగాఁ బలుకనేర్చు
పూర్వపక్షముల నొప్పుగఁ దా ననువదించి
నిర్నిబంధముగ ఖండించునేర్చు
వాచావిరోధ శాఖాచంక్రమములందు
నిగ్రహస్థాన మొందించునేర్చు
తతవాఙ్ముఖము లుపోద్ఘాతోపసంహార
గుంఫితమ్ములుగ వాక్రుచ్చునేర్చు

• మెఱయఁ దద్గృహశుకముల వరుస గెలిచె
నవ్వినూతనశుకము 'శుకావతార
మిది' యనుచు మండనుఁడు సమ్ముదితుఁ డగుచు
మెచ్చి చూడంగ నిల్లాలు మే లనంగ. 121

క. తపముల నుపవాసంబుల
నపగతబల యయినయబల కది కాలక్షే
ప పదం బగునని బుధుఁ డా
సపడియెఁ జిరకాలమైత్ర్యసంబంధమునన్. 122

**ఉభయభారతికిని జిలుకకును జరిగిన కామశాస్త్రసంవాదము**

వ. అంత నయ్యింతి యాశకుంతకులావతంసంబు నంతిపురికిఁ దోడ్కొని
పోయి తగిన యాహారంబు లిడుచు నానాశాస్త్రంబుల వాదము
లొనర్చుచు, నలవోక నమ్మఱునాఁడు ప్రసంగవశంబున శంకరార్యు
నకుం దనకు నడిచిన వాదోపవాదంబులఁ జెప్పునంత నక్కీరంబు
ఱెక్కల ఱిక్కించి యిక్కువదండంబున ముక్కు నిటునటుఁ జక్కఁ
జేసికొని యొయ్యారంబు మీఱ నతివా! శంకరు నిరుత్తరుఁ గావిం
చిన నీప్రశ్నమున కే నుత్తరం బిత్తునె యన నమ్ముదిత సమ్ముది
తయై యేది చూత మనుటయు. 123

గీ. ఇంచువిలుకాని కళ లెన్ని? యెట్టి వవ్వి?
వానినెల వెంచ నెది? శుక్ల బహుళపక్ష
ములను నెట్లు ప్రవర్తిల్లుఁ? బొలఁతులందు
నెటుల తోఁచును? బురుషులం దెటుల తోఁచు? 124

వ. అని కదా భవదీయ ప్రశ్నంబు?

గీ. అంగభవునికళల్ పదునైదు సువ్వొ
సతులయంగుష్ఠ పద గుల్ఫ జాను జఘన

నా భ్యురః కక్ష కంఠ గండ రదన వద
నాక్షి ఫాల శిరమ్ముల నవ్వి యుండు. 125

ఆ. అవి యణీయ మైనయాకృతి రోమకూ
పాష్టమాంశమందు నధివసించు
నతివ! పద్మినీప్రభృతిజాతిసతులకు
నింక వానిగతుల నేర్పఱింతు. 126

చ. క్రమగతి నెక్కు డిగ్గు రతిరాట్కళ లింతికిఁ గృష్ణశుక్లప
క్షములఁ బ్రతీకపంక్తి బడిఁ జానరో! యార్తనదర్శనాదిప
క్షము సుమి శుక్లపక్ష మనఁగాఁ; బెఱపక్షము సూవె కృష్ణప
క్ష మనఁగఁ జెల్లు వీనిని రసజ్ఞు లెఱింగి సుఖింత్రు చాతురిన్. 127

వ. ఇయ్యది సామాన్యంబు, విశేషంబు వివరించెద నవధరింపుము. 128

సీ. పద్మిని కెడమప్రేవను నెక్కు, సితపక్ష
మున డిగ్గు బరపక్షమునఁ గుడిగతి
సితపక్ష మెక్కు దక్షిణగతి హస్తిని,
కపరపక్షమున సవ్యముగ డిగ్గుఁ
గృష్ణపక్షమున దక్షిణగతి నెక్కు, చి
త్రిణి కాద్యపక్షమ్ము దిగు నెడమగ
శంఖిని కసితపక్షమ్మెక్కు యెడప్రేవ,
వలప్రేవ డిగు శుక్లపక్షమందు

గీ. పక్షభేదముచే నిట్లు పథము మాఱి
మెలఁగు నాల్గుజాతు లింతులకు వరుస
మదనకళ కాలి బొటవ్రేలుమొదలు మస్త
కావధిగఁ దోఁచుఁ బది యున్నదవయవముల. 129

గీ. సరవి హస్తినీ, చిత్రిణీ, శంఖినులకుఁ
బద్మినికి, నవయవపరిపాటి దినది
నమ్మగాఁ గామకళ యౌవనమునఁ బ్రబలి
వార్ధకంబునఁ గ్రమకృశత్వంబు వడయు. 130

వ. ఇయ్యది వాత్స్యాయనునిమతము. ఇఁకఁ గొక్కోకునిమతం బన్ననో యింతులకు ననంగకళ శుక్లపక్షప్రతిపదాది నంగుష్టప్రభృత్యవయవముల వామపార్శ్వంబుగా నెక్కి కృష్ణపక్షంబున వలపటివైపుననుండి డిగ్గువిధమునఁ బురుషునకును గృష్ణపక్షప్రతిపదాది దక్షిణపార్శ్వముగా నెక్కి శుక్లపక్షమున వామపార్శ్వముగా డిగ్గు ననియు, శుక్లకృష్ణపక్షవిభాగ మార్తవదర్శనాపేక్షితం బేని బురుషునెడ వ్యభిచరితం బగుటం జేసి చాంద్రమానమాస ప్రథమ ద్వితీయపక్షము లని గ్రహించినటు తోఁచు; స్త్రీపురుషు లిరువురయందుం గర్తృతాసామ్య మున్నను బురుషకళా వివేచనము వాత్స్యాయనుం డేల డిగ్గవిడిచెనో కొక్కోకుండు గ్రహింపఁజాలఁ డయ్యె నది యటుండ నిమ్ము. అట్లు కళామర్మవిదులై తాడన పేషణ దంత నఖక్షత చుంబన చూషణ వషట్కృతాదు లగుదశసంస్కారములును; బేటిత కుట్టిత క్లీత నామిత ఘట్టి తాఖల్యం బనఁగు పంచతంత్రములును, జతురశీతిబంధమ్ములను దెలిసి ప్రయోగనిపుణు లగురసికులకు నీయడిగిన యర్థంబు కరతలామలకం బనుటయు, నక్కాంతారత్నము తదీయ వైదగ్ధి కబ్బిపడుచుఁ గొక్కోకవాత్స్యాయనుల మతభేదము నుద్దేశించి యిట్లను. 131

కొక్కోక వాత్స్యాయనుల మతభేదముపై నడచిన వాదము

మ. చిలుకా! నీమతి మెచ్చఁగాఁ దగు, సమీచీనంబులౌ నీదుప
ల్కులు; కానీ తుదిఁ దత్కళావిధమునన్ గొక్కోక వాత్స్యాయనే

ష్టలకుఁ బల్కితి భిన్నవాక్యతను-బూర్వుల్ సెప్పు నద్దాన న
వ్యులతాత్పర్యమ యాటఁ; జెప్పఁదగు నెట్లో యేకవాక్యత్వముఁ.

ఆ. అఖిలశాస్త్రముల సమన్వయపద్ధతి
యిదియ పూర్వపూర్వఋషిమతంబు
లుత్తరోత్తరర్షి సత్తమాభిప్రేత
మగుటఁ దదనువాద మగును గాదె. 1౮3

వ. కావున వాత్స్యాయనుమతం బరయ నందు రంజనీయయు నధికరణంబు నగు స్త్రీకళాస్థానంబులు కర్త యగుపురుషునకుఁ బ్రథమజ్ఞేయంబు లగుట వివరింపంబడె. దానం బురుషకళాస్థానంబులుం గమ్యమానంబులగుట లేదె? తదంశముం గొని కొక్కోకుండు ప్రస్ఫుటీకరించె నని యేకవాక్యత వచియింప సమంజస మగుటయు నా శుకతిలకం బిటుపలుకు. 1౮4

ఉ. పంచశరాగమాధ్యయనపద్ధతి నెట్టులొ యట్టులే ప్రయో
గించుటయందుఁ గూడఁ బతికిన్ సతికిన్ సమకర్తృభావ మూ
హించి వచించె నాఋషికులేంద్రుడు కారకభేద మున్నట్టుల్
గాంచఁగ నో పటన్న "మతికల్పిత"మందు నిరాకరించుచున్. 1౮5

వ. సతీపతుల కధికరణకర్తృభావ మసంగతంబగుట గర్తృత్వసామాన్య ముచితం బగుటయు నయ్యెంతి యిట్లను. 1౮6

గీ. మాతనిగమాధ్యయనమాత్రఁ బూరుషుండు
నింతియును గర్తృతను వహియింత్రు గాక
యధికరణ మింతి, కర్త నాయకుఁడు సరణి
దంపతులవైఖరిఁ బ్రయోగదశను గాదొ? 1౮7

క. అన విని కిలకిల నవ్వుచు
ననిమిషు శుకము మదననిగమ మాద్యంత మెఱిం

గినదానవె సుచరిత్రా
జనతిలకమ! యిటుల పలుకఁ జనునే నీకున్. 138

ఆ. మేషయుగళకృత సమీకమందుఁ గపిత్థ
యుగళభేదనమున నొగిని మల్ల
యుద్ధమందుఁ గర్త లుభయమ్ము లైనట్టు
లాలుమగలు కర్త లగుదు రతివ. 139

వ. కావుననే 'తే నోభయో స్సదృశీ సుఖప్రతిపత్తి' యని యుభయు లకు సుఖసామ్యము సిద్ధాంతీకరింపఁబడె ననుటయు, నాక్రోత్తడితల మానికంబు తలయూఁచి కామతంత్రమునఁ బురుషుండు స్వతంత్రుఁడా యస్వతంత్రుఁడా యని యడుగ నాకీర మిట్లనె. 140

గీ. కర్మబద్ధుండు పురుషుఁ డా కామతంత్ర
మందె కాదు ధర్మార్థమ్ములందు సైత
మస్వతంత్రుండె కర్మఫలానుషంగ
ముక్తుఁ డౌదాఁక స్వాతంత్ర్యమును గనండు. 141

క. అనుటయుఁ గొండొకతడ వం
గన యుత్తర మీయఁ గానఁగాలేక నభం
బును గాంచి చూపు మరలిచి
యనియెఁ జిలుకతోడ నూతనాంశము గొనుచున్. 142

శా. కోకోక్కర్షిమతంబు నాక్రియఁ దృణాంకూరంబు చందంబున్
న్యక్కారింతువు పారదారికమునన్ వాత్స్యాయనుం డేవియో
వక్కాణించె న వెల్ల ధర్మ్యములె? లేవా వైశికంబం దన
మ్యక్కృత్యాచరణోపదేశములు శుద్ధాంతాంగనాద్రోహముల్ 143

సీ. అన శుకం బిట్లు వల్కెను సాధ్వి! కొక్కోకుఁ
డటుల వాత్స్యాయనుం డాడెఁ డెపుడు
"సాధ్య కాని పడంతి సాధించుటయు, సాధ్య
మైనచెలి నలర్చు, టాత్మ రక్త
రతిఁ గరంచుట" స్మర శ్రుతము ప్రయోజన
మనినఁ గొక్కోకు నే మనఁగఁ గలదు
ధర్మార్థకామత్రితయము పరస్పరా
నుపహతముగఁ బొంద నొప్పు ననుచు

గీ. నందు నేకైకసేవ యనర్థ మనుచు
నైహికాముష్మిక సుఖాప్తి కనువు కాఁగఁ
బలుకు వాత్స్యాయనుం డొకపాటివాఁడె
యగునె నరులకుఁ దద్హృదయంబు నెఱుఁగ. 144

మ. పరదారాభిగమంబు సేయువిటు లుత్పాదించు మాయాధురం
ధరమార్గమ్ముల నెల్లఁ జెప్పి "పరకాంతాలాల్య మాయుర్యశో
హారణం" బంచునుఁ బారదారికరహస్యజ్ఞాత కాఁడేని నే
ర్పరి గాఁ డాత్మకళత్రరక్ష నరుఁ డెవ్వాఁడేని" యం చాడఁడే. 145

క. తనదారల నితరుఁడు వం
చన నిటు లొనరించి కైవసము చేసికొనున్
గనుచుండ ననుచు గృహులకుఁ
ముని సేయుప్రబోధ మెంతముఖ్యమొ తలఁపన్. 146

ఉ. వైశికమందు వేశ్య విటవర్గము నొంచి తదీయవైభవం
బాశుగతిన్ హరించుట కుపాయములన్ ప్రవచించు టెన్న ని
ర్వైశరసాభిలాషమున వేశ్యను జేరినవారు దుస్సహ
క్లేశము గాంతు రంచు నెఱిఁగించి జగద్ధిత మూన్పఁగాదొకో. 147

గీ. అంతిపురికాంతలను గవయఁగ నుపాయ
ములను దెలుపక మున్న తాఁ బలుక లేదె ?
రాజదార లగమ్యలౌ రామలందు
ముఖ్య లని తల్లితో సామ్యమును ఘటించి. 148

క. ఈరెండుప్రకరణంబుల
వైరుధ్యము స్పష్టపఱచు వాత్స్యాయనుచే
తోరీతి; నది సదసదా
చారంబులఁ గలిపి చేయుచాలన యనుచున్. 149

వ. మఱియు గ్రంథాంతమ్మునఁ "గామశాస్త్రతత్త్వజ్ఞుఁడు ధర్మార్థకామమ్ములను బ్రత్యయమ్మును లోకస్థితి నెఱింగి వర్తించునే కాని రాగమ్మున వర్తింపఁ డనియు, నవ్వాఁడు త్రివర్గపాలకుండై లోకవర్తిని యగు స్వస్థితిని బ్రోచుకొనుచు జితేంద్రియుం డగు ననియుఁ, దెలిపి తాను బ్రహ్మచర్యమ్మున సమాహితచిత్తుండై లోకయాత్రార్థమీశాస్త్రరచనకుఁ బూనుకొంటిఁ గాని రాగవశమ్మునఁ గా" దని పలికినపలుకులవలన నమ్ముని హృదయంబు స్పష్టంబు కాదే. కావున మోక్షాధికారలిప్సులై త్రివర్గోపాసనాశీలు రగుశ్రోత్రియులకు నంతర్యాములకు నయ్యార్షగ్రంథ మొక్కటియే ప్రమాణం బనుటయు నవ్వారవర్ణినీలలామ నివ్వెఱపడియు యథాపూర్వముగ ని ట్లను. 150

క. ఈ శాఖాచంక్రమ మే
లా శుకమా పురుషునెడ సుమాస్త్రకళలపై
నాశంకించెదు నా కే
వో శాస్త్రము లంచుఁ బల్కె దొందుప్రసక్తిన్. 151

గీ. కర్త లేక కద సంప్రయోగమున సతియుఁ
బతియు నీమతమందు నో పతగరాజ!

తరుణికిం గల్గు స్మరకళల్ పురుషునకును
గలవో లేవో వచింప కీపలుకు లేల? 152

చ. అన విని కీర మి ట్లను లతాంగి! యనంగకళల్ నృదేహ మె
ల్లను గబళించి రాగముబలంబునఁ బ్రస్ఫుట మాట వానినిన్
బనివడఁ జెప్ప వ్యర్థ మని పల్కిరు పూర్వులు, స్త్రీకళాభిరం
జనపరమావధుల్ మదనశాస్త్రవిధుల్ సకలంబు మానినీ! 153

మ. అటు పుంస్కాండగతాంగజన్మకళ వ్యాఖ్యన్ జేయనే కాదె చె
ప్పట గల్గెఁ గళరూపుఁ దద్గమన తన్మూఖ్యస్థలంబుల్ తదు
త్కటతాకాలముఁ దన్నిరూపకమతద్వంద్వాంతరం, బందు న
క్కట ప్రాబల్యనిరూపణం, బిదియ శాఖాచంద్రమం బయ్యె నే. 154

వ. మన్మథ కళాస్థాన తదారోహ ణావరోహణాది భేదంబుల మతద్వ
యంబు నే నుపన్యసింపఁ గొక్కోకవాత్స్యాయనుల ప్రామాణ్యా
ప్రామాణ్యంబుల కీవ తివిచి శాఖాచంద్రమదోషంబు నాయం
దారోపింప వాదధర్మంబే. 155

క. అన నుభయభారతీసతి
యను- శాఖాచంద్రమమున కగపడి తనుచున్
గనుఁ బ్రామఁ జూచె దవె న
న్ననుటయు శుకమిట్టు లను రుపాకులితమతిన్. 156

చిలుక తగవుదీర్ప మండనుఁ గోరుట

ఉ. ఇద్దఱువాదమున్ విని సమిద్ధమతిఁ గుణదోషముల్ గనన్
ముద్దియ చెప్ప నీపతి ప్రభుండు సుమీ యన నమ్మృగాక్షి తా

నుద్ధవిడిన్ నిజాధిభువునొద్దకు నేఁగి సమస్తవృత్తమున్
దద్ద వచించి తెచ్చెను క్షణంబున వాదజయాభిలాషచే. 157

క. తెచ్చి యుచితాసనమునన్
మచ్చికఁ గూర్చుండఁబెట్టి మహిళామణి వా
క్రుచ్చెను దనకుం జిలుకకు
వచ్చిన వాదోపవాదవైఖరి వరుసన్. 158

ఉ. అంతట నాబుధేంద్రుఁడు జయాపజయంబుల నిర్ణయింప లే
కెంతయుఁ గీరశక్తి నుతియించుచుఁ గామకళారహస్యసి
ద్ధాంతము లభ్యసింప గడు వంది చనెన్ గద శంకరార్యుఁ డ
ద్దాంతుఁ డొకండ తీర్చుటకు దక్షుఁ డతం డెట నున్నవాఁడొకో?

చిలుక చెప్పినప్రకార ముభయభారతియు భర్తయు శంకరుని సన్నిధి కేగుట

చ. అనుకొనుచుండ నిట్టు లను నాశుక మోబుధచంద్ర! శంకరుం
డు నతనిశిష్యు లుందురు గడుంగడుద వ్వగుకాన నొక్కకొం
డ నిచటి కేగుదెంచుతరుణంబున నయ్యటవిన్ మహీజశా
ఖను వసియించి నేను గనుగంటను గంటిని వింటిఁ జిత్రమున్. 160

శా. కందోలమ్ములఁ గందమూలఫలముల్ గైకొంచు మధ్యాహ్నమా
ర్తాండద్యోత విభీతులై యతులు మద్వాసద్రుమచ్ఛాయఁ గూ
ర్చుండన్ వచ్చి ప్రసంగమున్ సలుపుకొంచుండంగ నాశంకరా
ర్యుం డాకొండగుహన్ సమాధిగతుఁడై యున్నట్టు లాలించితిన్.

గీ. ఆ యనఘచరితుఁ డెపుడు బాహ్యప్రపంచ
సంగతుం డౌనొ కాని చూడంగవచ్చుఁ
బంచషాహ వ్రప్రయాణసంప్రాప్య మగుచుఁ
గ్రాల్కుఁ దద్వాసగుహ యుత్తరముగ నిటకు. 162

ఆ. అనుచు శుకము పలుక నాద్విజుం డాలును
సపరివార మటకుఁ జనఁగ నెంచి
కౌర వివదమాను లన్ననిద్రలు గొండ్రె
గెలుపొ యొండొ యాలకించుదాఁక. 163

వ. బిడ్డలను గొంతపరివారంబును గృహంబున డిగ్గవిడిచి యమ్మఱు
నాఁటివేఁబోక. 164

సీ. అర్హాభృత్యానీత యాప్యయానము నెక్కి
యాత్మకళత్రమ్ము నరుగఁ బనిచి
శాస్త్రపుస్తకములు ఛాత్రులు గొని పాండు
కంబళిరథము లెక్కఁగఁ బలికి
యన్నదానార్థపదార్థముల్ వైయాఘ్ర
శకటాళిఁ దేర నాజ్ఞప్తి సేసి
పటగృహపంక్తిఁ గాంబలశకటంబులఁ
బదిలంబుగాఁ దేర బనుపు వెట్టి

గీ. యగ్నిహోత్రమ్ములను దేవతార్చనాప
దార్థములఁ గొంచు మత్తవృషాంచితశక
టాంతరమ్ము నధిష్ఠించి యపుడు వెడలె
మండనుఁడు శంకరుండుండు కొండగుహకు. 165

సీ. పర్యంక శయన దర్పణ దంతకంకతి
కా తాలవృంతాదికముల గములు
కార్పాస వాల్క రాంకవ కౌశేయ ర
ల్లక నిచోలాదిచేలవ్రజంబు
కలశ కందు గళన్తికా శరావ ఋజీష
దర్వ్యాది పచనపాత్రముల గములు
తైలాజ్య గుడ మధు దధి శర్కరాదులు
శాలితండుల సూపసంచయంబు

గీ. గొనుచు దాస దాసీజనం బనువుమీఱ
శకటముల నెక్కి తొలుదొల్తఁ జనుచు విడియ
వలనుపడుచోట్ల నిలిచి లోపములు లేని
యట్టు లమరింప నతనిప్రయాణ మొప్పె. 166

క. అసన భోజన విద్యా
వ్యాసంగంబులను స్వగృహమందటు లట నా
భూసురుఁ డొందుచు నగ్నిను
పాసించును వశమె వానిభాగ్యము పొగడన్. 167

ఉ. శంకరుఁ డేమి తీర్చునొ విశంకటయుక్తుల నీశుకంబు న
న్నంకిలిపెట్టెనే యని నిరంతర మాంతరచింతతో శుకా
లంకృతపంజరమ్ము కరలగ్న మొనర్చి తపించుచుండు న
ప్పంకజపత్త్రినేత్ర పతిపజ్జను బాయక త్రోవ నేఁగుచున్. 168

గీ. స్వయముగాఁ గీరమునకు నాచార్యబుద్ధి
నా సతీమాళి మ్రొక్కి నీరార్చు భక్తి
ఫలరసముతోడఁ దేనెఁ ద్రావంగఁబెట్టు
దాడిమీబీజములఁ దన్ను దారిఁ జనుచు. 169

చ. యమిపతిఁ గాంచువేడుక ద్విజాగ్రిణి తాను గుటుంబినీసమే
తముగ శుకోపదిష్టమగుదారిని భృత్యులు గొల్వ నేఁగి స
ప్తమదిన మొక్కశైలమునుపత్యకఁ జేరె యతీంద్రశిష్యుల
గ్రిమునను దృష్టిగోచరముగాఁగ మనంబునహర్ష మొందుచున్.

సీ. సపరివారమ్ముగా జాయాసమేతుఁడై
శైలాగ్రమును చేరి శంకరార్య
శిష్యులఁ గని గురుశేఖరుఁ జూపరే
యని వేడ వారలిట్లనిరి ధీర!

యీగుహాంతరమునం దేకాంతయోగస
మాధి నున్నారు సుమ్మా ప్రబోధ
మొసరింప నాజ్ఞయీయను లేద నేఁటితో
గడువు పూర్ణం బగునుడి మఱచెనె
యనుచు మాలోన మే మీయహర్ముఖాదిఁ
గలఁత నొందుచున్నారము నిలువుఁడయ్య
యని తదభ్యాగతులకు నర్ఘ్యంబుఁ బాద్య
మిచ్చి పూజించి యలరించి రింపుమీఱ. 171

ఉ. అందఱు తద్గుహాంతికమహావటభూజము పెద్దనీడ నం
దందు వసించి డప్పియిసుమంత దొఱంగుచు నుండునంతలో
సుందరసూక్తులఁ బొగడఁ జొచ్చె నృసింహుని మాకరందని
ష్యందము లందుఁ జిందునటు లాశుక మాశుకవిత్వవిత్తమై. 172

శుకమొనర్చిన నరసింహస్తవము

ఉ. శ్రీనిలయాబ్ధిమందిర! సరీసృపరాజ ఫణామణీఘృణీ
స్నానపవిత్రగాత్ర! మునిసంచయనాథ! ధ్రువాత్మ! చక్రపా
ణీ! నతలోకరక్షక! యహీనభవాంబుధినావ! దేవ! ల
క్ష్మీనరసింహ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్. 173

ఉ. మానితపద్మగర్భశతమన్యు పినాకి కిరీటకోటిసం
ధాన విరాజమాన నలినప్రతిమానపదాబ్జకాంతికాం
తా! నిరవద్య! కంజభవనాకుచవారిజరాజహంస! ల
క్ష్మీనరసింహ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్. 174

ఉ. మానశరోగ్రఘోర గజసూదనబాధఁ గలంగి మత్సరా
హీన నిదాఘపీడఁ గృశియించుచు సంసరణాఖ్య మహామహా

కాననమందుఁ జిక్కి కడఁగానక చింతిలుదుఁగ మురారి! ల
క్ష్మీనరసింహ! నా కొసఁగుమీ భవదీయకరావలంబమున్. 175

ఉ. దీనత మున్గి పోయితి నిదే యతిఘోర మగాధమూల మ
న్యూనతరవ్యథాశతమహోరగసంకుల మూచుఁ దోఁచు నీ
హీనభవాంధువందు, నెటు లీకృపణాస్పద ముద్ధరింతు ల
క్ష్మీనరసింహ! 176

ఉ. పూని భవాబ్ధిలోపలను బొల్చెడు భీకరకాలనక్రము
గ్రానరోకమున్ దెఱచి యక్కట! దేహము గ్రుక్కఁ బట్టి యిం
పూని గ్రసింప రాగరసనోర్మిహతిన్ మతిదప్పియుంటి ల
క్ష్మీనరసింహ! 177

ఉ. కానఁగఁ బాపబీజ ముఁకర్మలతాశత మింద్రియచ్ఛద
వ్యానతి మంగజప్రసవ మార్తిఫలం బగు సంసృతిద్రుమం
బూని యధోముఖాప్తిఁ బడుచుంటి—నటంచు నతాస్యమై శుకం
బానిమిషంబ క్రిందఁబడె నక్కట! పంజరమంద జాఱుచున్. 178

గీ. అర్థపద్యంబుఁ జదివి యధోవనతవ
దనముతోఁ బంజరస్థితాధారయష్టిఁ
బాసి యడుగునఁ బడి యుండెఁ బక్షి, యుభయ
భారతియుఁ జూపఱును విస్మపాటు నొంద. 179

ఉ. ఆ నగగహ్వరాంతరమునందుననుండి వినంగవచ్చె సు
స్వాన మొకండు దాని విన సద్రొనరింపక యెల్లరుండఁగా
మానితకీరసూక్తికషమన్ గొని–కావవె దేవదేవ! ల
క్ష్మీనరసింహ! న కొసఁగుమీ భవదీయకరావలంబమున్. 180

క. అని పఠియించుచు శంకర
మునిచంద్రుఁడు రాహులపదనమును బాసిన చం

ద్రుమనివో లె గహ్వరాంతర
వినిర్గతుండై వెలింగె వికసన్ముఖుఁడై. 181

క. అటు తోఁచి నిటలతటసం
ఘటితాంజలి యగుచుఁ గన్నుఁగవ మోడిచి యి
ట్టటు గనక నృసింహస్తవ
మిటు పూరింపం దొడంగె హృద్యరచనచే. 182

ఉ. ఆనఁగరాని సంసృతిమహాహిరదోగ్రవిషంబు సోఁకి బా
గైనశరీర మూని, ప్రళయానలమధ్యపతత్త్రణాకృతిన్
హానికి లోఁగి యుంటి భుజగాంతకవాహా! సుధాబ్ధిగేహా! ల
క్ష్మీనరసింహా! 183

ఉ. మానవిదూరసంసృతిసమాఖ్య దవాగ్నికరాళకీలసం
తానము చుట్టు ముట్టికొన దగ్ధతనూరుహరాజినై త్వదీ
యానఘపాదపంకజజలాశయ మాశ్రయ మొంద నెంతు ల
క్ష్మీనరసింహా! 184

ఉ. హీనభవాఖ్యజాలముల నిట్టి తగుల్కొని యింద్రియార్థసం
తానము లన్నగాలములఁ దక్కఁగ మ్రింగి విశీర్ణతాలుమ
స్థానమైనమీన మయి యత్యధికార్తి నశింప నుంటి ల
క్ష్మీనరసింహా! 185

ఉ. మానక ఘోరసంసరణ మత్తకరీంద్రము మర్మపంక్తి శుం
డానిహతిన్ నలంప నలినజయి మేను చలింపఁ బ్రాణముల్
స్థానము వాసి పోవు నన్నుతాసము గాంతు జగన్నివాస! ల
క్ష్మీనరసింహా! 186

ఉ. జా నగు మద్వివేకధనసంపద దుర్గము లైనయింద్రియ
స్తేనచయింబు దోఁగిలి త్యజింపక మోహమహాంధకూపగ
ర్భానఁ బడంగఁ ద్రోచిరి దురంతమదంధత గుర్తెఱింగి ల
క్ష్మీనరసింహ! 187

ఉ. శ్రీనలినేక్షణాధిప! కుశేశయనాభ! జనార్దనా! సురే
శాన! సితాబ్జనేత్ర! మధుశాసన! కేశవ! శౌరి! కృష్ణ! వి
ష్ణూ! నిఖిలాసురాంతక! యశోనిధి! దీనుఁడ నం చెఱింగి ల
క్ష్మీనరసింహా! 188

మ. అని యీరీతి శుకోక్తిగుంఫితం బగునృసింహాస్తోత్రమున్ గాంగపూ
రనిరాఘాటవచఃప్రణీతిఁ బరిపూర్ణం బాచరించెన్ మనో
వనజంబుల్ నరసింహపాదయుగళీభక్తిప్రపూర్ణంబులై
వినువా రందఱు తాండవింప యతిభూభృన్మౌళి హేలాగతిన్. 189

గీ. పద్మపాదాదు లగుశిష్యపటలి సంభ్ర
మమున సాష్టాంగముగ వందనము లొనర్చి
పాద్య మర్ఘ్యంబు నొసఁగ నాశ్వాస మొంది
మ్రొక్కుమండనుఁ దజ్జాయఁ జక్కఁ జూచి. 190

గుహ వెడలిన శంకరుఁడు మండను నుభయభారతిని సంభావించుట

క. ఓపుణ్యదంపతులు! మీ
రీపట్టున కేఁగుదెంతు రేటికిఁ బరివా
రోపేతమ్ముగ శ్రమమున
గోపి యయో! నేఁడు రానొకో గడు వగుటన్. 191

క. అని యందఱఁ గలయంగాఁ
గనుఁగొని కూర్చుండఁ బనిచి క్రమముగఁ గుశలం

బును బృచ్ఛచేసి దర్భా
సనమున నాసీనుఁ డయ్యె శంకరుఁ డంతన్. 192

క. యోగక్షేమము లరసెడు
యోగీంద్రుని చరణకమలయుగళి నిటలసం
యోగము గన మండనుఁ డను
యోగమ్ము నొనర్చెఁ బ్రీతియోగము మెఱయన్. 193

శా. దేవా! నీమహిమంబు మాదృశభవాబ్ధిక్రోడనిర్మగ్నదు
ర్భావుల్ జీవు లెఱుంగు టెట్లు? లిది స్వప్నంబో మహామాయయో
భావింపంగ మహేంద్రజాలమొ మహీభాగంబు రూపాంతర
వ్యావృత్తిన్ గనెనో వచించుటకు సాధ్యంబేని వాక్రువ్వవే! 194

ఉ. యోగమహత్త్వఁ గీరతను వోయ్యనఁ బ్రాణముతోన చొచ్చి కా
మాగమవాదమందుఁ దృణమట్టుల మత్సతి నోర్చి తత్త్వమా
యోగము బంధ మంచు నది యూడ్చ నృసింహనుతించి పూర్వదే
హాగతిఁ గన్న ని న్గని కృతార్థుఁడ నైతి మహాత్మ! నేఁ డిటన్. 195

శంకరుఁడు గెలుపొందినటు ఉభయభారతి యంగీకరించుట

మ. అనువేళన్ క్షితి సోఁక నెన్నొసలు సాష్టాంగంబుగా మ్రొక్కి త
ద్వనితోత్తంసము నాయవజ్ఞ క్షమియింపం జూడు గౌరీశపా
వనరూపాంతర! జ్ఞానరత్నఖని! సర్వజ్ఞుండ వీ వన్నమా
టను భావింపక లేనిపోనికడగండ్లన్ బెట్టితిన్ మూర్ఖనై. 196

ఉ. ఉల్లమునందు నీవు గెలుపొందు టెఱింగియుఁ గూడ వల్లభా
యల్లకదుఃఖభీత నయి యడ్డము సొచ్చి స్మరాగమంబునన్
గాళ్లకు బందమున్ వయితుఁ గాని యు వెల్లఁ దృణీకరించి నా
వల్లభు డించి పోవ వనువార్త స్మరింపను మందబుద్ధినై. 19

క. ఆశైశవసంన్యాసిగ
డా శంబరవైరినిగమతత్త్వవిమూఢుం
డౌ శోధింతము డాన; ని
రాఘుం డగు; గెలిచెనేని యపకీర్తి యగుగా. 198

ఆ. అనెదునల్పబుద్ధి నంది నీసర్వజ్ఞ
తామహత్త్వ మకట తలఁపనేర
కిట్టి క్లేశమునకు నెర సేసి నామూర్ఖ
మెల్ల వెల్లడింతు హీనగతిని. 199

ఉ. కాపటికత్వ మెల్ల వెలి గ్రక్కక తజ్జనితాఘ మెట్లు పో
నోవును దేవ! నిండుసభ నుగ్రులితో సమసాయకాగమా
లాపము లెత్తి సంన్యసనలక్షణముల్ దిగఁద్రావి పల్కఁగా
నోపక యోడుఁ దా నను దురూహఁ బ్రవర్తితిన్ క్షమింపుమా.

శా. నీయౌదార్యము సన్నుతింపఁ దరమా నే? నీయతిత్వంబున
ట్లే యస్మత్పతిదేవతానియతిఁ బాలింపన్ దలం పూని కా
దా యాకీరము మేను సొచ్చి స్మరశాస్త్రార్థప్రసంగక్రియా
మేయాభిజ్ఞతఁ జాటె న న్గెలుచు స్వామీ! ధర్మరక్షార్థివై. 201

క. స్వచ్ఛ మగుధర్మపక్షి న
నచ్ఛస్మరకళకు సయిత మదికిన నీసం
విచ్ఛక్తి కసాధ్యంబు జ
గచ్ఛంకర! శంకరా! జగంబుల నున్నే? 202

క. తల యెత్తి నీముఖం బెటు
తిలకింతున్ జిలుక యనుమతిన్ రతిపతిమి
న్కులసిగ్గుమాలి నీతోఁ
బలికిన ధౌర్త్యమ్ము జ్ఞప్తి వచ్చిన దేవా! 203

గీ. శుకము పదార్థ్యమును బఠించుచునె కూలి
ప్రాణము దొఱంగ గుహానుండి పయిసగంబు
చదువు చేఁతెంచు నినుఁ గాంచుసమయ మాది
నొడలు చచ్చినయ ట్లయి యున్నదాన. 204

గీ. సర్వవిద్యల కీవ యీశానుఁడవును
సర్వభూతమ్ములకును నీశ్వరుఁడ వీవ
బ్రహ్మకధిపతి వో పరబ్రహ్మమూర్తి
తలఁప నీవ ప్రత్యక్షసదాశివుఁ డవ. 205

చ. మదనమదాపహార్త ! సుమమార్గణశాస్త్రవివాదపద్ధతిన్
సదమున న న్నెటుల్ గెలువఁజాలక నివ్వెఱ నొంది తత్కళల్
బదఁపడి నేర్వఁగా గడువు న న్నటు గోరి శ్రమంబు నొందుటల్
మది నరయంగ- నీకు నవి మర్త్యచరిత్రవిడంబనల్ గదా! 206

క. ఇరువుర మే మటు నీచేఁ
బరాజయము గనుటకును ద్రపఁ గాంచము, భా
స్కరుచే నిశాకరాదులు
పరిభవ మొందుట యకీర్తివహ మగునొక్కొ. 207

సీ. బాల్యంబునఁ యోగి పల్కినపల్కు ప్ర
త్యక్షమ్ముగా నయ్యె నక్షరాల
నీవు సాక్షాచ్ఛంకరావతారం బాట
మాజన్మములు బుధమాన్య మయ్యె
నాప్రాణనాథుఁ డెంతటివాఁ డగుంగాక
యయ్యె శిష్యుండు నీ కనఘ! యిపుడు
పతివిప్రయుక్తనై బ్రతుకు భారముగ నె
ట్లుందు నీలోకమం దొంటిపాటు

గీ. పతికి నాకు దాంపత్యసంబంధసాక్షి
యైనగృహపతి వహ్ని త్రేతాగ్నిరూప
యజ్ఞపురుషుండు నను డించి యకట భర్త
యాత్మలో లీన మాచుండ నరయఁగలనె? 208

శంకరుఁ డుభయభారతి పాండిత్యమును నుతించుట

మ. అని దుఃఖంబు సుఖంబు గానియొకచిత్రావస్థలో మున్గి యం
గన యుండన్ యతిశేఖరుండును నమస్కారంబు గావించి నా
జననీ! ని న్నొకమర్త్యభామ యన దోషం; బీధరిత్రిన్ బవి
త్ర నొనర్పన్ జనుదెంచువాణి వని తథ్యం బేను వాక్రుచ్చెదన్.

మ. భవదీయాచరమాఖిలాగమకళాపాండిత్య, వాగ్యుక్తిపా
టవ, గార్హస్థ్యవిధావనైకదృఢనిష్ఠా, నాథపాదారవిం
దవిలీనాంతరవృత్తివర్తనము-లత్యాశ్చర్యనిర్నిద్రగా
రవముల్ నామదికిన్ ఘటించె సుచరిత్రాలోకచూడామణీ! 210

గీ. మర్త్యజగమున నే నరమాత్రునకును
నీయభిజ్ఞత లే దన్న నెలఁతుకల వ
చింప నేటికి? నీవు విరించిసతివొ
యంబ వేదాలఁ గన్నగాయత్రివో టు. 211

క. అని యిటు వినుతించు యతీ
శుని పదముల కలికతలము సోఁక నెఱఁగి మం
డనుఁడు దనపురికి యతి ర
మ్మని సాంతేవాసుఁ గోరి యనుమతి గనుచున్. 212

సశిష్యుండయి శంకరుండు మండనదంపతుల కోర్కెపై మాహిష్మతీపురంబు చేరుట

ఉ. వచ్చినత్రోవఁ బట్టి పరివారముతో శకటంబు లెక్కి ము
చ్చిచ్చును దేవతాతతి భజించుతెఱంగున శిష్యులన్ గురున్

బొంచ్చెము లేనిభక్తిఁ దగుపూజలఁ దప్పుచు దీర్ఘయాత్ర న
ట్లచ్చట నచ్చటన్ విడియు చాగృహమేధి యొనర్చెఁ బైనముల్.

సీ. అది సమాధిస్థితి యనుకొంటిమే కాని
యెఱుఁగము గురుని యియ్యోగశక్తి
యోగవిద్యాశక్తు లూహింప నబ్రముగ్మ
శుక దేహ మం దెట్లు చొచ్చె నొక్కొ!
చొచ్చు; గాఁ కామేను పుచ్చి వ్రేల్మిడి మన
యెదుటనే తనదేహ మెటుల చొచ్చె?
నణిమాదిసిద్ధుఁ డౌనాచార్యునకుఁ బర
కాయప్రవేశ మగ్గలమె తలఁప ?

గీ. ననుచు గురునద్భుతావహ మయినయోగ
శక్తి కడుగడ్డునందు నాశ్చర్యపడుచు
నరుగఁ దొడఁగిరి పద్మపాదాదు లొలసి
తత్కలాలాభ లోభసోత్కంఠబుద్ధి. 214

చ. అటు గొని వచ్చి యాబుధుఁడు నాలు సశిష్యుని శంకరార్యుఁ బ్రి
స్ఫుటతరభక్తి భిక్ష లిడి పూజలఁ దేర్చి బంధుతా సుహృ
త్పటలికి సర్వమున్ వినిచి శ్వస్తనకార్యములన్ స్మరించి శే
యెటువలెనో క్రమించి రుదయించె నహస్కరుఁ డంతఁ బ్రాగ్దిశన్.

క. కొడుకులకుఁ గూతులకుఁ దమ
విడిముడిఁ బొలములును బైఁడి వెండియు సమపా
వడువున విభజించి యొసఁగె
నెడ మమతం ద్రెంచికొని మహీనిర్జరుఁడున్. 216

క. యతిచే జితుఁడగు పతిమతి
గతపచి యగు పూఁదండఁ గనుటాదిగ నా

సతి యుపవాసవ్రతదీ
క్షిత యగుటను నవసి వేసఁగిని గదలిక నాన్. 217

ఉ. దంపతు లిర్వు రాత్మ మమతన్ విషనాడి కృతావగాహులై
సొంపుఁ గట్టి కావుల విశుద్ధమనంబులఁ, దోఁచినట్లుగా
సంపద లెల్ల యాచనికసాత్కృతమున్ బచరించి చుట్టముల్
గుంపులు గట్టి రాఁగ సభకున్ జనుదెంచి రపూర్వవైఖరిన్. 218

సీ. స్వస్తివాచనికకై వల్యోపనిషదుక్తి
ఘోషమ్ము దశదిశల్ గొనలు నిగుడ
నౌపాసనాగ్నిఁ త్రేతాగ్నులఁ బుత్రులు
ఛాత్రులు కయికొంచు సరస నడువ
నుపవాసములఁ గ్రుస్సి యుప్పున నిలఁ గూలు
ధర్మగేహిని తోడఁ దరలి రాఁగఁ
గన్నీరు కాల్వలు గట్ట బంధుభుజిష్య
వితతి యంజలి గూర్చి వెనుకొనంగ

గీ. శాంతరసమున కధ్యవసాయ మనఁగ
దోఁచు మండను నంతంతఁ జూచి సభ్యు
లవనిఁ జాఁగిలి మ్రొక్కి జయారవముల
వెల్లడించిరి మది వెల్లివిరియు భక్తి. 219

క, గురుఁడును శిష్యులుఁ జుట్టలుఁ
బరిషజ్జనములును నుభయభారతి పతితో
నరుదేఁ గని విస్మయసా
గరమందు మునింగి తొక్కటక్షణ మత్యుడలన్. 220

సంన్యాసము స్వీకరింపనున్న మండనుని దేహమున
నుభయభారతి యోగశక్తిచే లీన మగుట

సీ. ఆఁడుదానికిని సంన్యాసమ్ము గొనఁగ న
ర్హత యున్నదె విధులందు ననుచు

సంన్యసించెడువేళ సతిఁగూడఁ బతితోడ
నిట్లుండఁగావలె నేమొ యనుచు
మన కేమి దెలియు ధర్మరహస్య మీమెకం
టెను శాస్త్రములను గంటిమె యటంచుఁ
బతితోడఁ బ్రవ్రజింపఁగ నీపె— బిడ్డల
కాధారముగ నెవ్వ రగుదు రనుచుఁ

గీ. బరమవైరాగ్య మాకృతిఁ బడసినట్టు
లరుగుదెంచెడు నాగేస్తురాలి నరసి
గుములు గట్టి వికల్పజల్పము లొనర్ప
సాగి రొక్కుమ్మడిన సభాస్తారు లెల్ల. 221

క. అయ్యెడ మండనవిబుధుం
డయ్యతిపతి కెఱఁగి భవమహాబ్ధిఁ దరింపన్
జయ్యనఁ గృపాతరణిసా
హాయ్యము నివయ్య శాశ్వతామృత మొనయన్. 222

క. అని యటఁ బ్రాజాపత్యే
ష్టిని విధివిహితముగఁ జేసి చెచ్చెర నగ్నుల్
గొని యాత్మారోపమొన
ర్పను గడఁగెడు వేళ యతికి భారతి పలికెన్. 223

శా. దేవా! నాపతి సంన్యసించి చన నీదేహంబు సంతాన మీ
యావాసంబును నాకుమాత్ర మిఁక నేలా? మాకు దాంపత్యదీ
క్షావిధ్యాదిమసాక్షి. యియ్యనలుఁ డస్మత్కాంతు నాత్మంబునం
దావాసింపఁగ నుందునే మిగిలి వైయర్థ్యంబునన్ భూమిపై. 224

ఉ. ఏను దివానిశంబు హృదయేశ్వరు భవ్యపదాంబుజద్వయీ
ధ్యానము దక్క స్వప్నమున నైనఁ దదన్య మెఱుఁగనేని నే

నీనియతాత్మనాత్మకళనేనిఁ దదాత్మను జొచ్చునగ్నితో
మానుగఁ జొత్తుఁగాక యసమానమదీయసతీత్వశక్తిచే. 225

క. అని భర్తృపాదజలజము
లను శిరమునఁ జేర్చి యసువులకు నధిపతి వీ
వనుమాటఁ దలఁచి నీయా
త్మను నాప్రాణములు సేర్పుమా యగ్నులతో. 226

ఆ. అనుచు నుడివి లేచి యాత్మేశుపాదాబ్జ
సన్నిధానమందు సాధ్వి యామె
పరమయోగసరణిఁ బద్మాసనాసీన
యగుచుఁ బ్రాణవాయు వవధిఁ బెట్టె. 227

మ. చరణాంగుష్ఠతలాది వాయుగతి సంస్తంభించి నాభీస్థలం
బురమున్ గంఠము బ్రహ్మరంధ్రమును నొయ్యొయ్యన్ సమాకర్షణం
బురుదారన్ బొనరింపఁ బ్రాణములు దివ్యజ్యోతిరాకారవి
స్ఫురణన్ దేహము వాసి యగ్నిశిఖలన్ జొచ్చెం దటిత్ప్రాయమై.

ఆ. పిడుగుపడినరీతి వింజమాఁకిడినట్లు
క్షణముకాల మచటిసభ్యజనము
మూఁగలట్లు చిత్రములపోల్కి నోటమా
టయును గంటఁ జూపడంగి యుండ్రి. 229

ఉభయభారతి భారత్యవతారమని శంకరుండెఱింగి స్తుతించుట

సీ. ఆదివ్యతేజమం దరసి వాణీరూప
మొదలు జల్లన శంకరుఁడు నుతించెఁ
దీవ్ర మానామె పాతివ్రత్యశక్తికిఁ
జేయెత్తి మ్రొక్కిరి శిష్యకోటి

యాసాధ్వి నియతేంద్రియత్వసంపత్తిని
నోరారఁ బొగడిరి పౌరసమితి
స్వచ్ఛంద మైన తత్పతి మరణంబున
కాస్థాన మాశ్చర్యమందు మునిఁగె

గీ. క్షణముకాలంబు ప్రమాన్పాటు గనియుఁ దెలిసి
తడయ కాత్మను నారోపితము లొనర్చెఁ
దత్పతీదివ్యతేజోవితానలీన
మైన వైతానికాద్యగ్ను లాబుధుండు. 230

ఉ. సాంజలిబంధుఁడై నిలిచి యత్తఱి శంకరదేశికుండు త
న్మంజులదీప్తిపుంజము మనంబున శారదఁగాఁ దలంచి యో
కంజజురాణి వాణి కనుగంటఁ గనుగొనుచుండ వహ్నిలో
నం జొఱఁబాఱి రూపఱుట న్యాయమె? యంచు నుతించె నార్తుఁడై

శా. పాతివ్రత్యతపఃప్రభావ మిల కంబా! చాటి చెప్పంగ నీ
వేతన్మానుషజన్మ మొంది తని యూహింతున్ భవత్పాండితీ
చాతుర్యంబుఁ దలంప మర్త్యభువనాజయ్యం బనూహ్యంబు, వి
ద్యాతత్త్వాకృతి యాసరస్వతిగ సిద్ధాంతీకరింతున్ నినుఁ. 232

గీ. నాకు జితుఁడై ధవుండు సంన్యాస మూనఁ
దనకు వైధవ్య మబ్బుటఁ దలఁచి యీమె
యోగశక్తి నాత్మే శాత్మ నొనరఁ జొచ్చె
లే వసాధ్యమ్ము లిలఁ బతిదేవతలకు. 233

మ. అమృతం బొల్కెడుపల్కులన్ వివిధశాస్త్రార్థప్రసంగంబులం
దమరాచార్యఫణీంద్రషణ్ముఖుల లజ్జాయత్తులం జేయునీ
విమలప్రజ్ఞఁ దలంప మానుషివె సావిత్రీమహాదేవివో
హిమవత్పుత్రివొ లక్ష్మివో యగుదు కాదేఁదల్లి వాగ్దేవివో. 234

ఉ. ఆంతరదృష్టిఁ గాంచ నిగమాంతసరోజవనాంతరాంతరా
క్రాంతవిహారహంసి వని శంభురమేశవిధాతృసేవితా
నంతమహత్త్వ వంచుఁ బరమాణుగతస్థితి వంచు భారతీ
కాంత వటంచుఁ దోఁచె నరకాంతవు మాత్రము గావు మాతృకా.

గీ. వైఖరీరూపవై వెలువడుదు జగతి
మధ్యమాఖ్యను నుందఁట గళమధ్యమందు
నగపడుదు యోగదృష్టిఁ బశ్యంతి నాఁగఁ
గాని నీపరావాఙ్మూర్తిఁ గనుట యరిది. 23;

క. కనుకలికి వినుకలికి వా
఼్మనసముల కగమ్య యయి సమాధి మెఱుపు నాఁ
జను నప్పరాఖ్య వాక్కగు
నిను నస్మాదృశులు చూడ నేర్తురె దేవి! 237

గీ. మనుజదృష్టి ననుసరించుమంత్ర మీవ
జీవదృష్టి ననుం గన్న దేవి వీవ
జ్ఞానదృష్టి మదాంతరశక్తి వీవ
యాత్మదృష్టి నే నన్నపదార్థ మీవ. 238

వ. ఎఱిఁగితి నాత్మ నిన్నుఁ జననీ! పరమేష్ఠికళత్ర మంచు నీ
శ్వరుని సగర్భ్య వంచు నఖిలవాక్కుల కాదిమదేవతాకృతిన్
బరఁగెడుదాన వంచు భువనంబులఁ బ్రోవ రమాదిరూపభా
సుర మగుచిత్కళాంశ మనుచున్ బరమార్థవిచారధోరణిన్. 239

సీ. సర్వకాలము నీసుచరిత సాధ్వుల కొజ్జ
బంతియై జగతి నేర్పడుటకొఱకుఁ
బరమపాతివ్రత్య మరవిందదళనేత్ర
కలషుతపం బంచుఁ దెలుపుకొఱకు

దత్తపశ్చర్యాతిధన్య కసాధ్యవి
జ్ఞానమొం డుండమిఁ జాటుకొఱకు
నట్టి జ్ఞానమున యోగాతీతశక్తి ల
భించు నంచును బ్రకటించుకొఱకు

గీ. శృంగగిర్యాదికక్షేత్రరంగములను
బీఠములను స్థాపింతు నీపేర నందు
శారదాంబ! నీదివ్యతేజం బజస్రి
మావహించి మదర్చితం బౌను గాక. 240

ఉ. అంచు నుతించు చొక్కఁగడె యయ్యతి చొక్కున నుండి మీలితా
క్ష్యంచలనిస్సృతాశ్రుపుషు లాస్యము ముంపఁగ లోని చూపునన్
బాఱించిత చిత్సుధాంబుధి తరంగదభంగతదంగనాకృతిన్
గాంచి యభీష్ట మామె యొసఁగన్ గొనినట్టుల విచ్చెఁ గన్నవన్. 241

మండనుని సంన్యాసస్వీకారము

ఆ. అగ్నిహోత్రముల నిజాత్మ నట్లారోపి
తములుగా యథావిధాన మాచ
రించి కామములఁ ద్యజించి యమ్మండనుఁ
డాశ్రయించె శంకరాంఘ్రియుగళి. 242

గీ. ఎలమి గురుఁడును సన్న్యాసగృహ్యవిధిని
మండనున కంత సకలధర్మముల నడపి
నిఖిలభవదుఃఖహాతికిఁ గర్ణజప మగు
'తత్త్వమసి' సూక్తి నొడివెఁ దత్కర్ణసీమ. 243

క. సన్న్యాసపూర్వముగ నా
ధన్యుఁడు భిక్షించె; నాత్మతత్త్వము గురురా
జన్యుఁడు గఱపి శ్రుతిశిరో
మాన్యము 'తత్త్వమసి' సూక్తిమర్మముఁ దెలిపెన్. 244

గీ. ఘటమటుల జాతిరూపాదికమ్ము కలిమి
నాది యనెడు భిదాప్రథనమ్మునను న
నాత్మ యగుదేహ మీవు కా; వం దభేద
సంస్మృతి విపర్యయజ మంచుఁ జక్క నెఱుఁగు. 245

సీ. దండఘాతమున ధ్వస్తంబగుఘటము లో
ప్యమ్ము; దండాది లోపక మనఁబడు
నాలోప్యమునకు స్వవ్యతిరిక్త దండాది
కమ్మన్నఁగా లోపకముఁగ నౌను
అటు స్వవిలక్షణం బయి ద్రష్టయైనట్టి
యాత్మవస్తువు జ్ఞాత యైనయంత
దేహత్రితయమును దృశ్యత్వ మెనసిన
హేతువునన్ నశియించు; నిట్టు

గీ. లాత్మ మేనికి లోపక మగుచు వెలయు
దేహమునె బ్రహ్మ మనుచు సాధించు టెట్లు
పొసఁగు? ద్రష్టకు మఱి దృశ్యమున కభేద
వచన మున్మత్త విప్రలాపంబు గాదె. 246

ఉ. ఆదిని నీవు కావు సుమి యక్షము లయ్యవి, సాధనాళి దా
త్రాదులపోల్కి; వానియెడ నాత్మత చెల్లదు, కన్ను నాదియన్
భేదము లేదె స్పష్టముగ, వీనియభావము జూడవే సుషు
ప్త్యాదికభావమందు? నటువౌట ఘటాదులపాటె పవ్వి యా. 247

గీ. ఆత్మభావము దా నింద్రియములకు సము
దయగతం బేని యం దొండు వ్యయము నొంద
నాత్మత నశించుఁ; బ్రత్యేకమందు ననినఁ
గాయమె నశించు బహునాయకత్వమునను. 248

గీ. 'చక్షురాద్యన్వతమగ మెంచంగ నాత్మ
భావ' మనఁ గన్న వో స్మృతి పాయవలదె?

స్మృత్యనుభవంబు లే కాశ్రి యేద్ధ మగుటఁ
జూమవాఁ డొక్కఁడు మఱొండు శ్రోత యగును. 249

క. 'చనె నామన మొకయెడ' కనఁ
గను భేదము కలిమి సుప్తికాల లయంబున్
గనుఁ గానఁ జిద్విభిన్నమ
మన, మది గా దాత్మ, కరణమాత్రంబ యగున్. 250

క. భేదావగతి ననన్వయ
మాదుకొనుట నిటులె బుద్ధి యాత్మం బెపుడున్
గా దది, కరణాదింబలెఁ
దాదాత్మ్యభ్రాంతి విడువఁదగు నీ కార్యా! 251

గీ.* చరమకృతిధాతుపదయుక్తి పరఁగుకతనఁ
గా దహంకృతియును నాత్మ; నాదు ప్రాణ
మనుప్రతీతిఁ బ్రాణమును గా దాత్మ, సకల
ముపరతం బగు సుప్తియం దుండుఁ గాక. 252

గీ. ఇటుల దేహాదిభిన్నమై యెసఁగు నాత్మ
తదవివిక్తమై త్వంపదోక్త మగు-విశ్వ
హేతు వగు నాత్మ తత్పదఖ్యాత మగును
దదుభయైక్య 'మసీతి'పదంబు తెలుపు. 2 3

క. అన మండనుఁ డనుఁ దేజం
బునకుఁ దమంబునకు నైక్యమునువలె సర్వ
జ్ఞునితోఁ గించిద్జ్ఞున కే
యనుపున నీవాక్య మైక్య మది కేనో యనుడున్. 254

వ. శంకరాచార్యుండు నవ్వి యిట్లనుఁ. 255

* 'అది వికారాశ్రయం బగునట్టికతనఁ' అని పాఠాంతరము

మ. అరయన్ వాచ్యగ మివ్విరోధ మగుతన్ 'సోఽయం పుమా' నన్నవై
ఖరి; నిప్పట్లను దద్విరోధ మొదయుంగా నిర్విరోధత్వభా
స్వరవాచ్యంబునె కొంచు నేక మగులక్ష్యంబే వచింపంగఁ ద
త్పర మాఁ దత్పదయుగ్మ మన్నెడ విరోధం బెద్ది వాక్రువ్వుమా!

వ. నీ వనిన విరోధ మిద్ది వాచ్య గత మగుం గాక. నిన్న చూచిన పురుషుని నేఁడు విలక్షణవేషంబున నుండఁ జూచినను వాఁడే వీఁడన విరోధము గలుగ; నటుల తత్త్వంపదద్వయవాచ్య మగు పదార్థ మొక్కటియే యని చెప్పు నాశ్రుతియందు విరోధ మేమియుఁ గానరాదు. 257

ఉ. కావున నివ్వివేకమతిఁ గర్మశతాపరిహార్య మై చిరం
భావిత మై తనూప్రభృతిభావగతం బగునయ్యహంమతిన్
ద్రోవుము ఘోరసంసరణదుఃఖవిముక్తికి హేతు వన్న స
ద్భావన నాత్మభావమున భావము దార్చు మజస్ర మోసుధీ! 258

గీ. కాయమున వీడు మమతను గాక భూరి
మాయువహ్నిమాత్రాదిసామాన్య మగుట
నటులె బహిరర్థమమతఁ బోనాడు నిర్వి
శంక మగుచిత్తముఁ బరాత్మవంక నిలుపు. 259

ఉ. తీర మొకండు వాసి పెఱతీరము సేరెడు దీర్ఘమత్స్య మా
తీరముల౦టు భిన్న మయి తీరవిలిప్తము గాక పొల్చునా
ధోరణి జాగ్రదాది విహృతుల్ గయికొంచును దేహ వానికిన్
వేఱయి యుంటె కాదు వినవే కనఁ డించుక వానిధర్మముల్. 260

శా. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు చిదంశం బైననీయందె ధీ
వ్యగ్రత్వంబునఁ గల్పితంబులు; మహీశ్వభ్రాహి దండాది రూ
పోగ్రత్వంబులు రజ్జువందు భ్రమచే నుత్పన్నమౌఁ గాన స
వగ్రేయంబు తురీయతత్పదమ యై తాద్యభ్రమల్ వాయుమీ. 261

సీ. ప్రత్యక్షమయు పరపదము వేత్తకుఁ జేసు
వగు; నజ్ఞునకు దూర మగును జువ్వొ
యంతర్బహిర్వర్తి యైనఁ జిత్తను వెలి
నెమకి యజ్ఞు లెఱుంగ నేర రాత్మఁ
బాంథప్రపాసంగఘటికా నానాఖ్యల
గృహము లౌచు దేహము లేఁగెదరు తుదకు
ననిశ సుఖార్థకృత్యములు దుఃఖదము లౌ
సుఖము జన్మాంతరసుకృతహేతు

గీ. వాక్పటుత విన్నశ్రుత్యుక్తి నొదవును బరి
పక్వమతి కాత్మవిజ్ఞానపాటవంబు
మందగతిఁ బట్టువడు మందమతికిఁ గూడ
సద్గురు వరాంఘ్రిసారసాశ్రాంతసేవ. 262

ఆ. ప్రణవసాధనము నుపాదిష్టకర్మముల్
సేసికొనుచు గురునిసేవణమున
మలము లెల్లఁ దొలఁగ, మానసంబు ధరింప
నోపుఁ దత్త్వబోధ ముక్తరీతి. 263

క. మనసు దివానిశము గురు
ననువర్తించునది- వేత్త యగుగురుఁడె శిష్యుం
డనఁదగు- ననువర్తనఁ దు
ష్టిని గనెనా కృపను జూచు శిష్యునిమోముస్. 264

సీ. ఆమోదపాలనీయము గురునాజ్ఞ, య
య్యది కల్పలత యభీష్టార్థఘటన
నలుగ గురూపదిష్టాత్మదేవత గురుం
డోము- నాతఁడె యల్ల నున్న దిక్కు

ఆచార్యసేవ యిష్టావాప్త్యనిష్టనా
శములకై విధినిషేధములఁ దెల్పుఁ
గొల్చువే ల్పొసఁగుఁ గోర్కులు నైన గురుఁడు లే
కప్పేల్పుఁ గనఁ దెలియంగ నౌనె

గీ. గురుఁ డలరెనేని దేవతోత్కరము నలరు
గురుఁ డలిగెనేని దేవతోత్కరము నలుగు
నాత్మభావన సద్రూపు లగుసురతతి
మదిఁ దలఁచుదేశికుఁడు విశ్వమయుఁడు గాఁడె. 265

చ. అని యిటు లప్పురాణగురుఁ డర్థి మెయిన్ బరమాత్మతత్త్వమున్
వినిచిన మండనుండు భజనీయగురుప్రవరాంఘ్రియుగ్మమం
దు నొసలు సోఁక వ్రాలి త్వదనూనదయామృతవత్కటాక్షపా
తనమున నిన్నివాళులకు ధన్యుఁడ నైతి నటంచుఁ బల్కుడున్. 266

క. గురుఁ డతనికి నొనరిచె స
త్సురేశ్వరాభిఖ్య దిగ్వధూకృతసఖ్యన్
మెఱసె విధాతృసుఖాదిక
తరశంకరముఖ్యశిష్యతన్ గని వాఁడున్. 267

చ. అటు లతఁ డాసురేశ్వరసమాఖ్యను నర్మద నర్మదాధునీ
తటతల మాని యున్నమగధక్షితిఁ జేరి త్రయీశిరోవచః
పటలవిచింతనన్ స్వపదభాగురుసౌఖ్యములో మునింగి త
త్కటకమునందు యుండి బహుకాలము పుచ్చె మమత్వదూరుఁడై.

సీ. పండితాజయ్య మహామండనబుధమదే
భముఁ బట్టి కట్టుఁగంబమునఁ గట్టి
ప్రణతవిద్వత్త్రికరణగతదోషసం
హతి పొల్లువోవఁ దూర్పారఁ బట్టి

సద్గుణాంచితు ♦లైనజనుల కవ్వారి యా
తంగేటిజున్న చందమున నడరి
దుర్గమదుర్మతాద్రులపక్షముల నెల్ల
బిడుగుపాటుగను నొప్పించి ద్రుంచి

గీ. శంకరాచార్యవర్యుఁ డచ్చటు దొలంగి
చనియెఁ గీనాశపాలితాశకును గుసుమి
త వివిధపలాశ విభ్రమద్భ్రమర గీత
మధుర రుతి పూర్ణ వనమార్గ మధిగమించి. 269

ఆ శ్వా సాం త ము

శా. విద్యుత్పింగ పటీ వృతాసితపయోభృత్కోమలాంగాంచితా!
స్వాద్యామేయ దయాంబువర్ష శమితాచ్ఛ స్వాంతతాపత్రయా!
విద్యాలాంగలఫాలకృష్టి దళితాఽవిద్యాఖ్యతృణ్యాంతరం
గోద్యత్స్వాత్మవివేకసస్యఫలరూపోదారమోక్షప్రదా! 270

క. అస్త్రాయితతృణఃఖండ! ము
నిస్త్రీకృతగండశిల! తృణీకృతశివచా
పా! స్త్రైణాభినవపస
వాస్త్ర! పవిత్రేదరాన్వయాబ్ధీందునుతా! 271

సుగంధివృత్తము.

శంకరా బ్జగర్భ జంభశాసనాదిపాయకా!
న్యంకురూపదేవశాత్రవాసుమోక్షనాయకా!
పంకజాతలోచనాప్రపంచ పంచసాయకా!
కంకకాకదాశకీశకామితార్థదాయకా! 272

ఇది శ్రీగురుకరుణాసమాసాదితకవిత్వ
వెంపరాల సూర్యనారాయణ నామధేయప్రణీతంబైన
శంకరవిజయంబున
పంచమాశ్వాసము.



శ్రీ గురుమూర్తయే నమః

# శంకరవిజయము

## షష్ఠాశ్వాసము





వేంకటరాయసచివ
భావగగనవీథికానపాయి సమగ్రేం
దీవరబాంధవ! యెఱ్ఱా
కావనిపాలకమతల్లికా! రఘురామా!

వ. అవధరింపుము.

సీ. సనకసముఁడైన శంకరాచార్యుఁ డల ది
శను మహారాష్ట్రముఖ్యదేశముల శమిత
విమతమతమానుఁడై గ్రంథవితతి వెలయఁ
జేయుచుఁ గ్రమక్రమమున శ్రీశిఖరిఁ జేరె. 1

క. ఆకొండ వెలుంగు స్వయం
భూకాశలమై యహీంద్రభూషప్రియమై
వ్యాకోచమల్లికాగం
ధాకలితక్షితిజమై ద్విపారినిబిడమై. 2

వ. అందు. 3

క. తొలిచేఁ దనమేను యతిరా
ట్తిలకుఁడు కలికలుషభంగ ధిక్కృతసంగన్
జలదుత్తుంగతరంగన్
సలలితపాతాళగంగ శైలాసంగన్. 4

చ. నతజనమోహభంగము ననంతపథస్పృగమేయ శృంగమున్
హతపటుపాపసంగముఁ గలాలపదభ్రగభృంగమున్ సమా
శ్రితపృథుగంగమున్ సుకృతశృంగముఁ దుంగమునైన యాగిరిన్
యతిపతి యెక్కి, కాంచె నఖిలాంగము పొంగఁగ నీశు లింగమున్

క. నతజనభవభర్జను నతి
నుతిమాత్రామృతరమార్జనుని భ్రమరాంబా
కృతసంసర్జనుఁ గొలిచెన్
యతి ప్రణతార్జనుని మల్లికార్జును భక్తిన్. 6

గీ. తీరరుహ భూమిరుహ వినివారితోష్ణ
ప్రమథితాఖిలతృష్ణ నిరస్తకార్ష్ణ్య
మైన కృష్ణానది తటమ్మునందు సంవ
సించెఁ గొన్నాళు లాచార్యశేఖరుండు. 7

చ. అచటఁ బవిత్రకీర్తి విమలాద్భుతవర్తి గురుండు దా స్వయం
రచితము చిత్రవాక్యరుచిరంబు నసద్గ్రహనిగ్రహార్థ మహా
ప్రచురకృతివ్రజంబు గుణరాజివిరాజితు లౌ బుధాళికిన్
స్వచతురిమంబునన్ దెలియఁ బల్కి యొనర్చెను సుగ్రహంబుగా. 8

చ. ఇతరము లాశ్రితంబుల జయించెడి తచ్ఛ్రితభాష్యసంచయం
బతఁ డదసర్థధిక్కరణ మబ్బ వచింపఁగఁ గాంచి యీర్ష్యమే
వ్రితముగ దూఱు పాశుపత, వైష్ణవ, శైవ, మతాద్యజస్రదీ
క్షితుల సురేశ్వరాదియతిశిష్యులు లీల జయించి రత్తఱిన్. 9

గీ. అందుఁ గొందఱు గతమత్సరాభిమాను
లై స్వమత మొల్ల కయ్యతి కైరి శిష్యు
లవులఁ గొందఱు ధృతమన్యులై జఘన్య
మతులు తన్నిధననిరీక్షమాణు లైరి. 10

మ. ఖలనీచోక్తులె వేదవాళ్యు లనుచున్, గల్పించుచున్ వేదముల్,
ఖలవృత్తిన్ నిజవేదమార్గ మెఱియంగాఁ గూల్చుచుం గొంద ఱి
చ్చల సాక్షాత్పరమాత్మ శంకరు నెడన్ స్పర్ధాగతిన్ గృష్ణు నం
దలుకం బాంద్రడకుఁ డట్లుపొందఁ గని రంత్యం బౌగతిన్ జెచ్చెరన్.

మ. యతిరాట్సూక్తి నదీష్ణు శిష్యుల కథావ్యాపారపారీణభా
షితముల్ వెల్గఁ గణాదవాణి గణనాశ్రీఁ గోల్పడెన్, గాపిలం
బు తిరోధానము సెందె, శైవ మశివంబున్ బొందె, గర్హార్హ మ
ర్హత మాయెన్ గనె వైష్ణవంబుగతి దార్గం బారయన్ దుర్గతిన్.

చ. అదయత శంకరార్యుఁ డటు లన్యమతంబుల సంకరం బడం
పఁ దొడఁగె బౌద్ధవాద, మది పద్ధతిగాఁ గొనెఁ దార్కికోక్తి సం
పద, యిఁక నెత్తువెట్టినను బల్కద భాట్టమతంబు, కాపిలం
బది స్ఫుటచాపలం బయి యనాదృత మయ్యెను దగ్ధబుద్ధికేన్. 13

కాపాలికుని చరిత్రము

ఉ. కాల మొకింత యయ్యతి సుఖంబుగ నచ్చటఁ బుచ్చ, నొక్కనాఁ
డాలరి రావణుం డటు సమాత్తమునీశ్వర వేషుఁడున్ సము
న్మీల దనల్పదోషుఁడు వినింద్యకృతిప్రవణుండు నైన కా
పాలికుఁ డొక్కరుండు గనవచ్చె నమాయు నమాను నమ్మునిన్. 14

గీ. అటుల డగ్గఱి కాంచెఁ గామాద్యవశ్యు,
వశ్యవిషయతురంగతపస్విలోక
మృగ్యు, గురుమాళి నుత్య మాత్మీయభావ్య
మెలమిఁ గఱపి రహస్స్థలి మెలఁగువాని. 15

క. చిరముగఁ గోరెడు యతివరు
నరసి మనోరథము సిద్ధి నంది నటు ముదం
బరసి నిజలాభముదితుని
దరిసి గురు వచించెఁ జేయఁ దలఁచినది యిటుల్. 16

మ. సదయాత్మా! భవదీయమైన గుణముల్ సార్వజ్ఞ్య సౌశీల్య భూ
తదయాదుల్ విని కాంచ వచ్చితి సముత్కంఠాతిరేకంబుచే
త దపీయాకృత దేహమాను, విజితద్వైతోక్తి, విధ్వస్తమో
హు దృఢాద్వైతుని నిన్నుఁ గా కొరుని నీయుర్విన్ గనన్ శక్యమే?

ఆ. పసుల మేలుకొఱకె పడసితి వీమూర్తిఁ
గంటి దివ్యగేయక్రమకీర్తి
డులు తపాంగలేశముల సజ్జనులయార్తి
విమలసూక్తిఁ గొందు విశ్వమూర్తి. 18

చ. అమలగుణాకరత్వమున నందితివే భువనైకమాన్యతన్
గ్రిమగతి; విశ్వవిత్త్వమునఁ గంటివయా యభిమానశూన్యతన్
రమణ విజిత్వరత్వకలనన్ గనవో గళహస్తితాన్యతన్
శమివర! కంటి స్వాత్మమ యొసంగు కడంక మహావదాన్యతన్. 19

ఆ. అఖిలశుభగుణాలయములుం బరావర
జ్ఞులును నగు భవాదృశులను గోరి
యెట్టి దుర్లభేష్టమేని బొందకయ కా
ర్యార్థు లెన్నఁడైన నరుగువారె? 20

క. కావున సర్వజ్ఞుఁడ వగు
నీవు నలుపు మేలు వడసి నృకరోటిధరున్
దేవుఁ దనియించి తత్కృపఁ
గావలె ధన్యుండ నెడు కడఁకను వత్తున్. 21

ఉ. ఈ తను వూఁది రాజత మహీధరసీమకుఁ బోయి శర్వుతో
బ్రాతి వసింపఁ గోరి, శతవర్షము లుగ్రతపం బొనర్ప; సం
ప్రీతమనస్కుఁడై శివుఁడు దృగ్గతుఁడై యనెఁ "గాంతు నీయభి
ప్రేతపుమర్థ మయ్యది లభింపఁగ నొక్కటి చేయఁగాఁ దగున్. 22

క. సర్వజ్ఞ శిరము లెగ్గని
సర్వపతి శిరము వేల్పు టొప్పు ననియె మున్
శర్వుఁ, డదిమొదలు పెదకెయు
సర్వజ్ఞుని గననియుఙ్గు జనపతిని గనన్. 23

గీ. కంటి నేఁడు భాగ్యగరిమ జగద్ధితా
చరణు సర్వవిదుఁ బ్రశాంతు నిన్ను
నింక మదనుబంధ మీడేఱు; జనుల బం
ధములు నిన్నుఁ జూచుదనుకఁ గాదె! 24

ఆ. చక్రవర్తి శిరసా సర్వజ్ఞపుత్రియ యో
యస్మదిష్టసిద్ధి కగును హేతు
వందుఁ దొంటి దాత్మనైనఁ దలఁపరా
దున్న దపర; మీర లున్నవారు. 25

క. శిర మొసఁగ మీకుఁ జేకుఱు
స్థిరయశ, మభిమతము నాకు సిద్ధించు "విన
శ్వరము తను వనుట" బుద్ధిం
దఱచి యెది రుచించునో రయొనర్పుము దానిన్. 26

చ. శమధన! నిన్ను దేహము నొసంగు మటన్ మన నొప్పకుండె, స
ర్వ మొసఁగు దాత యైన నొసవంగలఁడే స్వశరీర? మీవు ని
ర్మముఁడవు దేహమం దనభిమానుఁడ వంచుఁ బరోపకారకృ
త్యమునక మేను దాల్చినమహాత్ముఁ డవంచుఁ దెగింతుఁ గోరఁగన్.

ఆ. పరుల క్లేశ మింత పాటింతురో కో యహ
ర్నిశము స్వార్థపరత నెగడుజనులు
పగఱఁ జంప వజ్రి పవి కంచు దాధీచ
మైన యస్థి నిర్దయముగఁ గొనఁడె. 28

క. తృణమటు దధీచముఖ్యులు
క్షణిక మ్మగు నొడలు పసులకై విడిచి జగ
ద్గణముఁ గయిసేయరే గుణ
గణ్యమున స్థిరకీర్తిమూర్తి కాశ్రితు లగుచున్. 29

సీ. ధిక్కృతైషణులు త్వాదృశులు శాంతులు పర
తుష్టికై కాదె తాల్తురు శరీర
మాచంద్రతారార్క మనపాయయశమున
వరలఁడే జీమూతవాహనుండు
స్వార్థపరాయణు లస్మాదృశులు దయా
దూరులు కొంద అుండురు మహాత్మ!
సంతత వాంఛావశంవదులై వివే
కము గోల్పడెదరు కార్యములయెడల

గీ. నరయఁ దనుధారుల కదేయ మఖిలసుజన
గర్హ్య మగు కోర్కెఁ గోరుదుఁ గాక నీకు
ధృతవిరాగున కీరాని దేది యుండు
నిష్ట మొసఁగ నీకంటె నా కెవరు గలరు? 30

క. దేవా! మ్రొక్కెద నీశిర
మీవే యని కాళ్లఁ బడిన హీనుఁ గని దయా
సేవధి యాయతి విశ్వ
వ్యావృత్తమనస్కుఁ డగుచు ననియె నిటువలెన్. 31

ఉ. ఈ విటు గోరితం జలుగ నిచ్చెద శీర్షమె, యేబుధుం డపా
యావిలకాయ మీయ వెనుకాడునొ యర్థులు వేఁడ; నెట్టి ర
త్నావిధు లున్నఁ గాలమువశం బయిపోయెడిపాడు మేనిచే
నావల మేల కల్గు నెడ నద్దియ కాదె పుమర్థ మేరికిన్. 32

చ. వినుము సమాధి నుండెడ విముక్తమునం, దొకరుండ వీవు వ
చ్చినయెడ నిచ్చువాఁడ నిజశీర్షము; నంద తెలుంగ నిచ్చుచోఁ
బని చెడు, వీరె శిష్యు లతిభక్తు లెఱుంగ సహింప; రెవ్వఁడై
నను దను వీఁగ సైఁచునె? స్వనాయకుకాయము డిందు టోర్చునే? 33

క. అని సంకేత మ్మొనరిచి
యనిపినఁ గాపాలికుఁడు నిజావసథము చే
రెను శంకరుఁడును దనయు
న్కిన మిన్నక యుండె భావనిహ్నుతి తనరన్. 34

శా. ఆకాపాలికుఁ డాత్తశూలుఁడు త్రిపుండ్రాంచల్లలాటుండు నా
నాకంకాళవిభూషితాంగుఁడు నితాంతక్షీబుఁ డుష్ణాంశుబిం
బాకారోగ్రవిలోచనుండు నయి యిట్టట్టింత గన్గోక ని
ర్భీకుండై యతిమౌళివాసమహిఁ జేరెన్ ధీరసంచారుఁడై. 35

క. స్నానాదిక నిత్యాను
ష్ఠానములకు శిష్యు లెల్లఁ జన సంకేత
స్థానమున స్థిరత నాత్మ
ధ్యానమ్మున నుండె శంకరాచార్యుండున్. 36

గీ. భైరవాకారుఁడైన కాపాలికుని గ
నుంగొని గురుండు దేహ మొసంగ నెంచి
యాత్మ నాత్మను గూర్చి సమాహితాత్ముఁ
డౌచుఁ గరణోపసంహార మమర నుండె. 37

సీ. నిజసౌఖ్యదిక్కృతానిమిషరాజ్యం బౌచు
నిర్వికల్పసమాధి నెగడువానిఁ
జిబుకంబు జత్రువుఁ జేర్చి జానూపరి
నుత్తానకరముల నొప్పువాని
సామిమీలితవిలోచనుఁ డౌచు నాసాగ్ర
సీమఁ జూపు ఘటించి చెలఁగువానిఁ
బూర్వాంగ మెత్తరంబుగను సిద్ధాసన
మమర సమాసీనుఁ డైనవాని

గీ. శోషితవిబోధమాత్రు హృషీకలయు స
మాహితుండై జగంబు నేమఱినవాని
ఘను సనత్సుజాతాదిసంకాశు శంక
రార్యుఁ గని డగ్గఱగ నయ్యనార్యుఁ డరిగె. 38

వ. ఇట్లరిగి బాహ్యప్రపంచంబు మఱచి నిర్వికల్పసమాధి నున్న న
య్యాచార్యు నరసి మురిసి యెదుట నిలిచి శూలంబు నెత్తి కంఠంబు
గుఱిసేసి యేయ నుంకించు నత్తఱి. 39

ఆ. అయ్యతీంద్రు పిఱుఁద నల్లంత నొకమూలఁ
గోనచీఁకటిని రగుల్కొనియెడి
చండ్రనిప్పులట్లు జ్వలియించు తేజోయు
గంబు గాననైనఁ గంప మూని. 40

క. ఎత్తిన కాలును గేలును
నెత్తిన య ట్లుండఁ బ్రాణ మి ట్ట ట్టయి, వా
యెత్తి నెఱపి యాక్రోశం
బత్తులువ పడెన్ ధరిత్రి నపగతసంజ్ఞన్. 41

మ. పడి యొక్కింతటఁ జేతనన్ బడసి దేవా కావవే నాపయిన్
బడ నుండెన్ గుటిలాంతదంతచలజిహ్వాభీకరం బాననం
బడరన్ వక్రనిశాతవిస్ఫుటనఖం బౌ హస్త మొప్పారఁగా
మెడజూల్నిక్కమృగేంద్ర మొక్కఁడదిగో మిన్నంటుశౌర్యోన్నతిన్.

క. ఆతతబిల మన నోరును
జ్యోతు లనఁగ గ్రుడ్లు మెఱయ నుఱుకఁగ నుండెన్
జేతమ్ము పగిలె శరణా
యాతుని భీతుని ననున్ మహాత్మ మనుపవే. 43

మ. అని యుచ్చైర్ధ్వని మొఱ్ఱ వెట్టఁగ గురుం డాత్మానుసంధాన మం
తన కోల్పోయి బహిష్ప్రపంచగతి నేత్రద్వంద్వముఁ విచ్చి కాం
చినఁ, గాపాలికుఁ డగ్రభూమిఁ గనిపించెన్ జెమ్మటన్ దోఁగి కం
పనమున్ బొందెడిబొందెతోఁడఁ దిరుగం బట్టి కన్గ్రుడ్లతో. 44

క. గిలగిలలాడుచుఁ గన్నుల
వలవల నశ్రువులు గాఱ, వాతను లాలా
జలములు దొఱుఁగ, భయమునఁ
గలఁగెడునవ్వానిఁ గాంచి కరుణామయుఁడై. 45

గీ. అభయహస్త మ్మొసంగి కాయంబు నిమిరి
యొయ్యఁ జేయూఁత నొసఁగి కూర్చుండఁబెట్టి
చల్లని కమండలూదక మ్మల్లఁ జల్లి
ధీర మగు మాటల నొకింత తేర్ప వాఁడు. 46

ఆ. కుదురుకొని యొకింత గురుని పిఱిఁది మూ
లకు నిగిడ్చి చూపులను దటాన
గొంతు కౌఁగిలించుకొని చచ్చితి నటంచుఁ
జావుఁగేక వైచె సరభసముగ. 47

చ. గురుఁ డచలాత్ముఁడై వెనుకకున్ మెడఁ ద్రిప్పి కనంగ నొక్కటన్
నరహరి దివ్యమూర్తి నయనంబుల సోఁకె రసాయనంబుగా
సురుచిరబోధదీపికరుచుల్ హృదయంబునఁ బండువెన్నెలల్
నెఱపె ముహూర్తమాత్రమ యనిర్వచనీయ మవస్థ పైకొనన్ 48

క. నయమున నాఖలు వీడిచి
భయమున భక్తిని నిటాలబద్ధాంజలియై
రయమునఁ దజ్జ్యోతి కెదుర
శయయుగి ముకుళించి నిలిచి చక్కఁ గనంగన్. 49

సీ. కటికజుంజుటుజూలుకడ సోఁకి మబ్బు లే
కినదూదిపింజలై తునిసి చెదర
నుబ్బి గొబ్బునఁ బెట్టు బొబ్బరింతకు భూత
బృందంబుగుండియల్ పేటులెత్తఁ
బృథుహుంకృతులకు మూర్ఛిల్లి లోక 'మిదేమి
వచ్చెనో' యని సురల్ బమ్మరిల్లఁ
గలఁగ మున్నీరు, రక్కసులు కూయిడ నద్రి
కూటముల్ వగుల, దిక్కులు జ్వలింపఁ

గీ. దెగి నభము గూల ధాత్రి దిర్దిర భ్రమింప
నసమ లయకాల కాలాట్టహాస హాసి
ఖరనఖర శాతదంష్ట్రా ప్రకాశచక్రి
మొలయఁ గనవచ్చె నారసింహోగ్రమూర్తి. 50

క. కరవాలము శూలము భీ
కరదృక్ఫాలమ్ము దంష్ట్రికానఖరాంత
ర్భరితాసురాంత్రజాలము
నరసింహుఁడు మెఱవ యతి వణంకెఁ గలంకన్. 51

శా. నాకంబున్ మహియున్ హరిద్వితతి భిన్నాభిన్నమై కూల, ఘో
రాకారంబున మాఱుమ్రోగెడు నృసింహక్ష్వేళ నాలించి చిం
తాకూలంకషచిత్తవృత్తు లయి తత్రత్యుల్ జనుల్ గాంచ రా
నాకాపాలికుఁడున్ యతీంద్రుఁడు నృసింహస్వామియున్ గానరాన్.

ఉ. భీతిలి కొంతసేపు పెదవిన్ గదలింపక చేష్ట దక్కియుఁ
జేతము సక్కఁ జేసికొని జీవము లేనటు కూలి యున్న య
ప్పాతకిఁ జూచి "దేశికుని భంగమొనర్పఁగ వచ్చి నారసిం
హాభిరుషఁ మృతిఁ గనియెనా" యని యెన్నుచునుండి రంతలోఁ.

ఉ. మానవపంచవక్త్రుని సమక్షమునన్ బవమూఁది భిక్షుకే
శానుఁడు ధీరభావము ప్రసన్నతరార్థము నూఱ సంబుధా
రానిభమైన సూక్తిమధురస్ఫురణన్ గవితన్ నుతింపఁగాఁ
బూనె విశుద్ధసత్త్వమయబోధ మగాధముగాఁ గడల్కొనన్. 54

సీ. అట్టహాసభయంకరాకార మేటికి
మందస్మితానన మిందుఁ జూపు
శతకోటిభానుదీధితి సంహరించి పూ
ర్ణేందుకోమలకాంతి విందొనర్పు
తివిచి నెన్నొసటి తార్తీయీకనేత్రంబు
సదయశీతల కటాక్షములఁ గనుము
శితకఠోరసటావిజృంభణం బుడిచి ము
ఖేందుమరీచులై యెసఁగ నెఱపు

గీ. వైజయంతికతోడ శ్రీవత్సముద్ర
తోడ శ్రీకాంతతోడఁ గన్దోయి దనియ
శాంత మగు నీస్వరూప మచ్ఛముగఁ జూపు
మోడెదను జూడ దేవ! నీవేఁడిరూపు. 55

క. ఉపసంహారింపు కోపము
కృప ననుఁ గావంగదన్న కల్పిషమతి పైఁ
డపగతచేతనుఁడై పడె
విపులాస్థలి, పేనిఁ బ్రోవవే తొలుదొల్తన్. 56

క. నీరూపు సాత్త్వికం బఁట
ఘోరము క్రోధనము రూపుఁ గొనఁ దగునె? సుఖ
శ్రీ రేకెత్త శమము గను
మారా! హరి వయ్యు హరగుణాశ దగునాకో. 57

గీ. ఎల్లభయముల నిను స్మరియింప నరుఁడు
వానిఁ బోనాడి సుఖ మొందు వైళ మనినఁ
గనుల నినుఁ గాంచ నింక నేమనఁగఁ గలదు
భవదవేక్షణమే దుర్లభమ్ము గాని. 58

క. స్మరియించి భవచ్చరణాం
బురుహమ్ముల నెల్లవాఁడు ముక్తుండగు నం
దురు, నినుఁ గని యీభైరవుఁ
డొరఁ గెన్ స్మృతి దొఱఁగి వీని నోముట భరమే! 59

గీ. పితృకృతవ్యసనార్దిత దితితనూజు
రక్షణ మొనర్ప, సర్వాంతరాళగతుఁడ
వనుటఁ బ్రకటింపఁ, దలఁచి కాదా నృసింహ
మూర్తివై వెల్వడితి కంబమున మహాత్మ! 60

సీ. విశ్వమ్ము సృజియింతు వృతరజోగుణుఁడవై
చతురాననుం డనుసంజ్ఞ నెనసి
సృష్టి నంతయుఁ బ్రోతు శ్రితసత్త్వగుణుడవై
విష్ణుసంజ్ఞాప్రభవిష్ణు వగుచు
దాని హరింపఁగాఁ బూని తమోగుణం
బలరెదు హరసమాహ్వయుఁడ వగుచు
జగదనుగ్రహబుద్ధి శర్వాదులై తోఁతు
గాక నీ కెవి పుట్టుకయు గుణములు

గీ. వాఙ్మనసదుర్లభంబు తాపకపదం బ
టంచు నామ్నాయసూక్తి పెన్కఱజ వేసి
తెలుపఁగా నేర కెట్టులో తెలియఁ బలుకు
నట్టి నిను దేవ! తెలియఁగా నగునె మాకు. 61

క. ప్రమథ పిశాచక గుహ్యక
సమితియు నరహరి! త్వదాఖ్య శ్రవణము సోఁకన్
దెమలుదు రన రక్కసు లే
క్రమమున నీయెదుట నిలువఁగాఁ గల రరయన్. 62

ఉ. ఈవ జగంబు లెల్ల సృజియింపఁగఁ బెంపఁగ నాదికారణం
బీవ నియంత వౌదు నృహరీ! యనవద్యమనంబునన్ సదా
నీవ కదా విచింత్యుఁడవు నిన్నునె చిన్మయు నాశ్రయింతు నీ
కావలుఁ డోఁడె వీడు మలుకన్ మహికిమ్మభయమ్ము గమ్మనన్.

చ. జగములు కోరుచుండె నిను శాంతిలు మంచు భవత్కృపాతి దూ
రగులకుఁ గోటిశంపల తెఱంగున వ్రేలెడు నిట్టిరూపు చూ
డఁగఁ దర మౌనె? వేగమె యడంపక యున్న నశించిపోవు ము
జ్జగ, ముడిగించి కోపము ప్రసన్నుఁడవై ననుఁ బ్రోవు మోహరీ! 64

మ. సమయం జేయుత నామహాకలుషముల్ సంవర్తకాలోద్యత
ప్రమథాధీశ లలాటపావకశిఖా పాపచ్యమానత్రిలో
క మిళద్ఘోర పటత్పట ధ్వనిసదృక్షం బౌ నృసింహాట్టహా
సము బ్రహ్మాండఘటోదరభ్రమణనాశస్త్యానమై యొప్పుటన్. 65

సీ. ఆనద్ధవాతంధయ గుణమంథాన సం
క్షుబ్ధాబ్ధికల్లోల సుహృద మగుచుఁ
బ్రళయనిర్ణిద్రరుద్రప్రోచ్ఛితరహత
డమరుకధ్వానలుంటాక మగుచుఁ
గల్పాంత జృంభితానల్పాంబుదస్ఫూర్జ
దుమవజ్రగర్వసంహరణ మగుచు
నాదిఘోణీంద్రఘోణాత్రస్యదోద్గత
ఘుర్ఘురనిర్ఘోషఘోర మగుచుఁ

గీ. బద్మజాండ కటాహ విపాటన పటు
కర్ణఘోరధ్వనిస్ఫూర్తి నిర్ణిరోధ
మైన శ్రీనరసింహాట్టహాస మస్మ
దనవధిక పాపసంఘాత మడఁచుఁగాత. 66

క. అని భక్త్యావేశంబునఁ
గనుఁగవ నానందబాష్పకణములు జాలై
తనువును ముంపఁగ మ్రాన్పడి
కనుఁగొను చుండంగ నానృకంఠీరవుఁడున్. 67.

చ. క్రమముగ మాళి జూలు, నలికస్థలనేత్రము, వక్రదంష్ట్ర, లు
గ్రము లగు పంచశాఖనఖరంబులుఁ, గన్నులకెంపు, నట్టహా
సమును, బయోదలీన మగుచంచల లట్టు లణంగి పోవ రూ
పమునను బద్మపాదుఁ డయి భాసిలె నెల్లరు వెల్లఁ బాఱఁగన్. 68

ఉ. కాలును గేలు గూర్చికొని కంఠము శోషిలఁ గ్రుక్కవేయఁగాఁ
జాలమిఁ గుందుచున్ బవనచాలనలాలస శుష్కనాసికా
పాళిఁ గదల్చుచున్ గనులపాప లణంగమిఁ గుబ్బ గొంచుఁ గా
పాలికుఁ డల్లలేచి నలువంకఁ గనుంగొన సాగె వెఱ్ఱి నాన్. 69

క. "నరహరి! యెటు కనుమొఱఁగితి
కరుణను దర్శన మొసంగి కావుము నీ తీ
వ్రరుషా ప్రసాదములు పయిఁ
బఱచుట నేఁ డిచటఁ జచ్చి బ్రదికితి దేవా." 70

క. అని పేరెలుఁగున నుడువుచుఁ
జని శంకరదేశికాంఘ్రిసరసీజమ్ముల్
కనుఁగవకు నద్దికొని శిర
మునఁ బూనిచి ముద్దువెట్టి మ్రొక్కి వచించున్. 71

ఉ. చేసిన తప్పు చెప్పుకొనఁ జెల్లు నటందురుగాదె నిన్ను సం
న్యాసిని సంహరించి మహి నాస్తికవాదము నుద్ధరించు పే
రాసను వచ్చి మాయ నుడులాడి యలీక మొనర్తుఁ గాని కై
లాసవిభుండ వీ వని తలంపన యెంతటి పాపజీవినో. 72

శా. శూలంబూని భవచ్ఛిరోఽపహరణౌత్సుక్యంబునన్ వచ్చి యా
లీలాకేసరిమూర్తి యైనవనమాలిన్ గంటి మోక్షేందిరా
లాలిత్యంబును జూఱగొంటిని జగచ్ఛ్లాఘ్యుండ వౌనీమనో
లీలల్ గా కఘముల్ దొఱంగి శుభముల్ సిద్ధించునే పాపికిన్. 73

మ. తలలన్ బోడు లొనర్చి కావ్రలును గంతల్ దాల్చి భిక్షాన్నభు
క్తులకై గేస్తులఁ బీడవెట్టుచు విరక్తుల్ గాని వేదాంతు లీ
యిలఁ బెంపెక్కిరి వీరిఁ జక్కడఁచుటే యిష్టార్థ మన్బుద్ధి మా
యల వంచింపఁగ వచ్చి నీమహిమఁ దత్త్వార్థంబు వీక్షించితిన్. 74

క. క్రూరుఁడఁ గాపాలికమత
చారుఁడ నద్వయమతాభిచారుఁడఁ బాపా
చారుఁడ జారుఁడఁ జోరుఁడ
భీరుఁడ నీకడను గప్పిపెట్టుట మేలా! 75

ఉ. తప్పుల నొప్పుకొంటి నిదె దాసుఁడ నైతి 'శిరం బొసంగ నీ
వొప్పిన యప్పుడే నెఱుఁగకుంటి భవన్మహిమంబు; కన్నులం
గప్పినచిమ్మచీఁకటు లణంగె నృసింహమహానిరీక్షచే
నిప్పు డెఱింగితిన్ నృహరి యీవు నొకండె యటంచు దేవరా! 76

క. అపరాధము క్షమియింపుము
కపటాత్ముని నన్ను శుద్ధుఁగా శిష్యునిఁగా
నెప మెన్నక నొనరిచి భవ
విపులాబ్ధిఁ దరింపఁ జేయవే నాతండ్రీ. 77

మ. అని వట్టోడు నిరంతరాశ్రిల యతీంద్రాంఘ్రిద్వయీక్షాళనం
బును గావించి స్వ పాపకృత్య పరితప్తుం డై నకాపాలికున్
దన కేల్పాఁచియతీంద్రుఁ డెత్తి చెవి నద్వైతార్థమున్ జెప్పఁ దో
డనె వాఁడొప్పె యతీంద్రుఁడై. భ్రమరకీటం బట్లు తద్భావనన్. 78

క. అంతట నాతఁడు కలలో
వింతలు గని మేలుకొన్న విధమునఁ గనులం
తంతలుగ విచ్చి యూర్చుచు
వంతలు దిగఁద్రావి యిటు స్తవం బొనరించెన్. 79

సీ. బొందితోఁ గైలాసమునకుఁ బోవ నిజోత్త
మాంగ మొసంగు మం చడుగువేళ
నేకతంబునఁ గేల భీకరశూల మం
కించి ద్రుంచుటకు నుంకించువేళ
నాభీల నారసింహాట్టహాస విదీర్ణ
హృదయమై యిల మేను చెదరువేళ
శరణన్నమాత్ర నాదురితంబు మఱచి య
ద్వైతామృత మొసంగి తనుపువేళ

గీ. నొక్కవిధమునఁ గన్పట్టుచుంటి నీకు
లే వహంకార మమకారలేశములు వి
దూరితద్వంద్వ! త్రిజగదుద్ధారకావ
తార! యుష్మచ్చరిత్ర మత్యద్భుతమ్ము. 80

గీ. అనుచుఁ గొండాడి గురునికటాక్ష మొంది
వాఁ డలరుచుండ నప్పద్మపాదుఁ గని ప్ర
సాదితు నొనర్చి తెల్లు ప్రహ్లాదవశ్యు
ననెడు స్నిగ్ధుల కిటు తెల్పె నాచరిత్ర. 81

ఉ. మున్నొకయప్పు డేను దపముం బచరింప నహోబిలాద్రియం
దున్నయగణ్యపుణ్యవన మొక్కటి సొచ్చి యనేకఘస్రముల్
తిన్ననిభక్తిఁ గొల్చితిని దేవు నృసింహుని భక్తవశ్యు నా
కన్నులఁ గాంచఁ గోరి కుతుకం బతిమాత్రముగాఁగ రేవగల్. 82

క. అంత నొకనాఁడు తమి నా
చెంతకు నరుదెంచె బోయశిశు వొక్కం డ
త్యంతాద్భుతరసకాంత
స్వాంతుండై యిట్టు లడిగె సవినయఫణితిన్. 83

ఆ. కాన నేల యొంటిగా నుంటి వోయయ్య!
యేల మాట మాని జాలిపడెద?
వని యమాయికోక్తి నతిమూఢభక్తి న
న్నడుగ నిట్టు లంటి నలఁతి నగుచు. 84

క. ఆకంఠ మ్మద్భుతమను
జాకృతి, కంఠీరవాత్మ మవ్వులఁ గలమెకం
బీకాన నుంట విని నే
నై కొనఁగా వెదకుచుంటి నగపడ కుండెన్. 85

క. అని యంటినో లేదో య
వ్వనేచరార్భకుఁడు కాన వడిఁ జొచ్చి లతా
వినిబద్ధుఁ జేసి నరహరిఁ
గొని తెచ్చెఁ గనుంగొనఁగ నకుంఠితభక్తిన్. 86

ఆ. యతుల యతుల భక్తిలతలకుఁ జిక్కక
మతుల వెతల ముంచు మాయలాఁడు
నేఁడు చెంచుబుడుత నెఱిఁ గట్టువనలతా
వితతిఁ జిక్కి చూచు వెఱ్ఱివోలె. 87

క. అనుకొనుచు లేచి సాష్టాం
గనతులఁ గావించి మునినికాయంబునకున్
మనములకు నగమ్యుఁడ వి
వ్వనచరునకుఁ జిక్కి తెట్లు పరమాద్భుత మా. 88

గీ. అంచు నేఁ బల్క వించు హసించుమొగము
తోడ నాడెను నరమృగేంద్రుండు "వీని
యట్లు బ్రహ్మాదులైన నేకాగ్రచిత్త
మమర ధ్యానింపలే రొకఁడైన నన్ను. 89

ఉ. చెంచులు చెంచితల్ విపినసీమలఁ బాడెడు నావిలాస మా
లించి శిశుత్వ మాది యచలీకృత మానసమందు నన్ను బం
ధించి వశంవదుండ నయితిన్ పర మిత్తు ననన్ హసించుచున్
లంచము లేల నాకుఁ గరుణామయ! యన్న నిరీహుఁ డారయన్. 90

శా. ఆనాఁ డాదిగ సర్వకాలముల సర్వావస్థలం జిత్త మం
దీనామూర్తి నె నిల్పి 'రమ్మనిన రమ్మి పొమ్మనం బొమ్మ'టం
చానందంబునఁ జెంచులక్ష్మి మును నన్నన్నట్టి యాపల్కులన్
గానం బీతఁ డొనర్ప సామనిగమోద్గానంబులై సోలుదున్. 91

క. రమ్మన్న రమ్ము పొమ్మనఁ
బొమ్మని స్వాధీనపతిక పోలిక నాదే
శమ్ముగఁ బాడఁగ వీనివ
ర మ్మిదె యని వచ్చి పోదు రాత్రిందివమున్. 92

శా. అధ్యర్థాబ్దముగా మదాకృతి నిదిధ్యాసాక్రియన్ గొల్తు, బ్ర
హ్మధ్యానాత్ముఁడ వైన దొక్కక్షణమే నం దున్నదే? నేఁడుగా
దా ధ్యాతవ్య నెఱుంగఁజాలితి కిరాతాలాపమూలంబుగా
నధ్యగ్రంబునఁ దోన నిల్వనె? యటం" చత్వర్తితం డొటయున్. 93

చ. అకట! వివేకశూన్య, శబరాత్మజ చిత్తవిశుద్ధిలేశ మ
బ్బక యిటు భ్రష్టనైతి నని భావమునన్ వగ నొంద 'నోడ కో
డకు రిపుపీడ గల్గిన యెడన్ నినుఁ జేరెద' నంచు నభ్రవా
క్కొకటి వినంగనైన మది నూఱడి కొల్తు నృసింహు సర్వదా. 94

గీ. ఒజ్జకును నాకు నెపు డభేదోపచార
మగుట నమ్మహితుని జంప నరుగుదెంచు
రిపుని శిక్షించి జగ ముద్ధరించె దేవుఁ
డందఱము ధన్యులము దక్కెనయ్య గురుఁడు. 95

గీ. ఈచరిత్ర త్రిసంధ్యమ్ము నెవఁడు చదువు
విను నెవం డాతఁ డపమృత్యువును దరించి
భక్తుఁడై భుక్తిభోగుఁడై ముక్తి నెనయు
ననిన ముద మంది రంద ఱాహారిఁ దలంచి. 96

క. శ్రీనరసింహ విచిత్రక
థానక సంశ్రవణజాతతన్మయతా ము
దాశ్రునిరతిఁ దచ్ఛభాహ్వయ
గానమ్ముల నెల్ల రాడఁగాఁ దొడఁగి రొగిన్. 97

గోకర్ణేశ స్తుతి

గీ. అంత నొకనాఁడు సహశిష్యుఁడై యతీంద్రుఁ
డఖిలతీర్థమ్ములఁ జరించు, చపరిధృష్య
మైన కలినుండి ధర్మమ్ము నరయు చుదధి
తటిఁ దనర్చు గోకర్ణతీర్థమున కరిగె. 98

ఉ. హాటకగర్భ కైటభ నిశాటవిపాటన వందితున్ జగ
న్నాటకసూత్రధారు లలనాకలనార్ధశరీరుసర్వ సము

చ్ఛాటిత కామలోభ ముఖశాత్రవజృంభణు వైదికాధ్వశృం
గాటకు శ్రీమహేశుఁ గనుగంటను గాంచి నుతించె నీక్రియన్. 99

గీ. జలధ రాద్వైతవక్త్రలక్ష్ములను నొక్క-
చక్కి, నొకటఁ దటిల్లతాసాధితాంబు
దావినాభావసంప్రదాయమును జాటు
చున్న మన్మథరిపుమూర్తి సన్నుతింతు. 100

క. వల కేలికురంగము డా
పలిమెయి డాల్గటికఁ గొలుకఁ బఱవ, నెడమచేఁ
గల శుకి వరియెన్నని వల
పలిడాల్ తినఁ బఱవ వెలుఁగు భాసము నేనే. 101

క. అంబాగళమంగళసూ
త్రించె యద్గళమునం గరాళవిష మసా
రంబుగఁ జేసెనొ యాభూ
మంబున నైక్యానుభావమహితుఁడ నైతిన్. 102

గీ. అని గుణత్రయాతీతు మహర్షి జనవి
భావ్యుఁ గోకర్ణపతి వచఃప్రసవములను
బూజ లొనరించి సుఖమునఁ బుచ్చె మూఁడు
రాత్రులు జగత్పవిత్రి తత్క్షేత్రమందు. 103

ఆ. అంత వేగఁ జేరె హరిశంకరాఖ్యది
వ్యస్థలము యతీంద్రుఁ డద్ది భక్త
పాపహరకమగు వైకుంఠకైలాస
పురవివర్తభూతముగ నెఱింగి. 104

సీ. అఖిలభేదవాదులభ్రమ లడఁచిపుచ్చఁ
దలఁచి యద్వైతముద్రాప్రదర్శకు లయి

మించు హరిశంకరులను బూజించి యతఁడు
ద్వ్యర్థ మగుసూక్తితతి నిట్టు లభినుతించె. 105

హ రి హ ర స్తు తి

సీ. *విమలసోమకలావిలాసమును వంద్య
మైన మైనమహం బూని యయ్యనాది
1. గోసమాకర్షియై జగద్గోప్త యగు వి
భుం డొసంగుతఁ గుశల మెప్పుడును నాకు. 106

క. గిరిలీలోచితదేహ
స్ఫురణ మహామందరాగమును దాల్చి సుధన్
2. సురల కొసఁగ నవిషాదిగ
వరలెడు దైవతము కరుణ వాంఛింతు నెదన్. 107

---

* 'విమల' యను పద్యము మొదలుకొని పది పద్యములందు విష్ణుదశావతారములను శివుని-శ్లేషముచే స్తుతించుట.

1. మత్స్యావతారము :— విమల - మిక్కిలిపాపముగలవాఁ డగు, సోమక - సోమకుఁ డను రాక్షసునకు, లావి - నాశకమగు, లాసము - క్రీడయును, మైనమహము - మీనసంబంధ మగుతేజమును. ఊని - పొంది, అనాదిగో - పురాతనవాక్కు లగువేదములను, సమాకర్షి - ఆకర్షించినవాఁడు—

శివపక్షమున:— విమల, సోమ, కలా, విలాసము - స్వచ్ఛ మగుచంద్రకళయొక్క సొగసును, మైనమహము - మేనాపత్యమగు తేజము, అనఁగాఁ బార్వతిని, ఊని - గ్రహించి, అనాదిగో - పురాతనవృషభము, సమాకర్షి - ఆకర్షించినవాడు.

2. కూర్మపక్షము:—గిరిలీలోచితదేహస్ఫురణన్ - గిరియొక్క భ్రమణమునకు తగిన దేహముయొక్క స్ఫూర్తితో, మహామందరాగమున్ - గొప్పదగుమందరగిరిని, దాల్చి, సురలకుసుధ నొసఁగ, నవిషాదిగ - విషాదములేనివాఁడుగ, వరలెడు - ప్రకాశించు దైవతము.

శివపక్షము:— గిరి - కైలాసమందలి, లీలా-క్రీడకు, ఉచిత - తగిన, దేహస్ఫురణన్ - దేహస్ఫూర్తితో, మహా - ఉత్సవమునందు (దేవతలది) అమంద-హెచ్చైన, రాగమును - ప్రేమమును, దాల్చి, సురలకున్ - దేవతలకు, సుధన్ - అమృతమును, ఒసఁగన - ఇచ్చుటకే, విషాదిగన్ - హాలాహలభక్షకుఁడై, వరలెడు - ప్రకాశించు - దైవతము.

క. మహిమానసముల్లాసకుఁ
డహహా వరాహీశతనుసమంచితుఁ డాద్యుం,
3. డిహపరసుఖదుఁడు దేవుం
డహరహ మేలుత మదర్పితాంజలిఁ గొనుచున్. 108

గీ. సటలపెంజాలు మెఱయ నస్వప్నరిపుమ
తంగజముఁ గూల్చి యుల్లాసితమ్ముగాఁగఁ
4. బేర్చు ప్రహ్లాదరేఖ నొనర్చు నలపు
రాణపంచాస్యుఁ డగుదేవుఁ బ్రస్తుతింతు. 109

గీ. ప్రథితసవ దక్షబల్యాహరణ దృఢేచ్ఛ
ధృతి నజిన మూని వామనాకృతిని దాలి

---

3. వరాహపక్షమున:— మహి - భూదేవియొక్క, మాన - చిత్తసమున్నతిని, సముల్లాసకుఁడు - తొలంగించువాఁడు, వరాహీ + ఈశ - సూకరీభర్త, అట్టి సూకరముయొక్క, తను - శరీరముచే, అంచితుఁడు - పూజ్యుఁడు.

శివపక్షమున:— మహిమానన్ - మహిమమున, గొప్పతనముచే, సముల్లాసకుఁడు - తాండవముచేయువాఁడు, వర - శ్రేష్ఠమగు, అహీశతను - పాఁపఱేని మేనిచే, అంచితుఁడు - కూడినవాఁడు.

4. నృసింహపక్షము :— సటల - జూలుయొక్క, పెంజాలు - పెద్దగుంపు, మెఱయన్ - అస్వప్నరిపు మతంగజమున్ - రాక్షసశ్రేష్ఠుఁడగు హిరణ్యకశిపుని, కూల్చి ప్రహ్లాదరేఖ - ప్రహ్లాదునిరూపు - (రలయోరభేదః) ఉల్లాసితముగాఁగన్ - ప్రకటనమగునట్లు - పురాణపంచాస్యుఁడు - పురాతనసింహము. (నరసింహుఁడు)

శివపక్షము:— సటలపెంజాలు - జటలయందలి పెద్దనది, మెఱయన్ - అస్వప్నరిపు - రాక్షసుఁడైన, మతంగజము - ఏనుఁగును, అనఁగా గజాసురుని, కూల్చి ప్రహ్లాదరేఖ - పెద్దధ్వనియొక్క రూపు, పురాణపంచాస్యుఁడు - పురాతనుఁడును, ఐదుమోములవాఁడును నగుశివుని.

5. వామనపక్షము:— ప్రథితసవ - ప్రసిద్ధయాగమున, దక్ష - సమర్థుఁడగు, బలి - బలియొక్క. ఆహరణ - హరించుటయందు, దృఢేచ్ఛ - దృఢమగునిచ్ఛచే, కాంతార, హితుఁడు - వనవాసముఁ గోరినవాఁడు, ఆశ్రమిజనతకు - నాల్గాశ్రమముల జనులకు, ఆద్యుఁడు - ప్రథముఁడగు బ్రహ్మచారి.

5. చియును గాంతారహితుఁడై విశిష్టతపము
సలుపు నాశ్రమిజనతాద్యుఁ డెలమిఁ గాచు. 110

గీ. కరధృతలసన్మహాఖండపరశు వయిక
నతతపఃకృతవీర్యనందనుని నర్జు
6. నాఖ్యు నోర్చి నక్షత్రేశ్వరావతంస
విస్ఫురణుఁ డైన వేల్పు మము విడక నన్ను. 111

ఉ. నా కమితాత్మశర్మకలనంబు దయామయుఁడై ఘటించు నా
ళీకభవోగ్రతేజమున లీల రతిప్రియు దుర్దశాననున్
బోకడవెట్టు విక్రమధనుం డగు జోదు, ధరాత్మజాకుచో
7. ష్మైకరహాస్యసాక్షి యయినట్టి రసజ్ఞుఁడు దేవుఁ డెప్పుడున్. 112

---

శివపక్షమున:— ప్రథితసవ - ప్రకటింపఁబడి యాగముగల, దక్ష - దక్షునివలన, బలి - బలిని, ఆహరణ - గ్రహించుటయందు, దృఢేచ్ఛన్ - గొప్ప యిచ్ఛచేత, వామన్ - భామను - భార్యను, ఆకృతిన్ - శరీరమున, తాలిచియును - ధరించియును, కాంతారహితుఁడు - కాంతతో రహితుఁడు. (విరోధము.)

6. పరశురామపక్షము:— కరధృత - చేత ధరింపఁబడిన, లసత్ - వదనుగల, మహా - పెద్దదియు, అఖండ - పూర్ణమగు, (మహా - ఉత్సవములచే, అఖండ - పూర్ణమైనది.) పరశువు - గొడ్డలికలవాఁడు, కనత్తపః - మెఱయు తపస్సుగల, కృతవీర్యనందను, నర్జునున్ - కార్తవీర్యార్జునుని, ఓర్చి-ఓడించి, నక్షత్రేశ్వరావతంస విస్ఫురణుఁడు - రాజశ్రేష్ఠులస్ఫురణము లేకుండఁజేసినవాఁడు.

శివపక్షమున:— చేతఁబూనఁబడిన గొప్ప ఖండపరశువుకలవాఁడు, కనత్తపః - మెఱయు తపస్సులచేఁజేయఁబడిన, ఓర్పు - శౌర్యముచే, నందనున్ - ఆనందించునట్టి, అర్జునున్ - ఓర్చి. నక్షత్రేశ్వర చంద్రరూపమగు, అవతంస - శిరోభూషణముయొక్క, విస్ఫురణుఁడు - ప్రకాశముగలవాఁడు.

7. రామపక్షము :— నాళీకభవ - బ్రహ్మ (అస్త్రము) సంబంధమైన, ఉగ్రతేజమునన్— భయంకరతేజముచే, రతిప్రియున్ - కాంతాసంభోగేచ్ఛువగు, దుర్దశాననున్ - దుష్టుఁడగురావణుని, ధరాత్మజ - సీత.

శివపక్షము :— ఆళీకభవ - అలికమునఁ బుట్టిన, ఉగ్రతేజమునన్ - అగ్నిచే (అళికమునకు రూపాంతరము అళీకము,) తత్సంబంధమైనది ఆళీకము, అగుపుట్టువు గలది ఆళీకభవము— ధర - కొండయొక్క, ఆత్మజ -కూఁతురగు పార్వతి.

మ॥ అవదాతస్థిరధర్మమూర్తి యగుచున్ హాలాహలస్వీకృతి
ప్రవణోదగ్రగళంబు రాజిల వృషావష్టంభకోత్తాలకే
తువు భాసిల్లఁగ, రోహిణీరమణుఁ డెంతో ప్రేమ ముద్దాడు మా
8. ళి విరాజిల్ల-వెలుంగు దైవతము పాలించున్ సనున్ సర్వదా. 113

గీ॥ పరఁగ నాకలితాహితాపముగ నంక
సీమను వినాయకుండు వసింప నుల్ల
9. సిలుచుఁ బూతనామోహకచిత్తవృత్తి
యౌ కలాప కలాపుఁడు నాకు దిక్కు. 114

---

8. బలరామపక్షము:— అవదాత - తెల్లని, స్థిరధర్మ - చలింపని ధర్మముగల, మూర్తి - మేనుగలవాడు, హాలా - కల్లును, హల - నాఁగటిని,- స్వీకృతి - గ్రహించుటయందు, ప్రవణ, ఉదగ్ర - మీఁదియగ్రముగల, గళము - కంఠము, రాజిలన్, వృష - ధర్మము, అవష్టంభక - ఆధారముగాఁగల, ఉత్తాల - పెద్దతాళవృక్షము, అనెడుకేతువు, రోహిణీరమణుఁడు - వసుదేవుఁడు, ముద్దాడు మౌళివిరాజిల్లన్ జుట్టుముడి యొప్పఁగా.

శివపక్షమున;— హాలహల - కాలకూటముయొక్క, స్వీకృతి, వృష = వృషభమునకు, అవష్టంభక - అవలంబనమైనదియు, ఉత్తాల - ఎత్తైన - రోహిణీ రమణుఁడు - చంద్రుడు.

9. కృష్ణపక్షము:— అంకసీమను - సమీపస్థలిని, ఆకలిత - కలిగింపఁబడిన, అహితాపంబుగన్ - పాములకు బాధకలుగునట్లుగ, వినాయకుఁడు - పక్షీంద్రుఁడు వసింపన్, పూతనకు మోహము కలిగించు మనోవ్యాపారము గలవాఁడై.

శివపక్షము:— ఆకలిత — తొండముచేఁ ద్రోవఁబడిన, ఆహిత - శివశిరసున నున్న, అపము- గంగోదకము కలుగునట్లుగా, వినాయకుఁడు, అంకసీమను— ఒడియందు, వసింపఁగా,- పూత - పవిత్రమగు, నామ — నామమును, ఊహక — ధ్యానించువారి. చిత్త — చిత్తములందే, వృత్తి— వర్తనముగలవాఁడు, కలాప—చంద్రుడు — కలాపుఁడు — భూషణముగా కలవాఁడు.

క. సర్వజ్ఞభావుఁ గరుణా
ఖర్వుని మారారిఁ గ్రతువిఘాతుక కృతపూ
10. జోర్వాదరు బోధనిధిని
నిర్వృతిఫలదున్ బరాత్మునిన్ స్మరియింతున్. 115

క. జనముల చేతోవిషయం
బును దాఁటి వెలుంగునది, తమోహారకమున్
11. గనఁగ సదావాసవిధృత
మనమును నా భూమమునకు మఱిమఱి వినతుల్. 116

వ. అని భక్తిరసావిష్టచేతస్కుఁడై. 117

క. మోచాఫలరుచిసూచక
వాచాఫణితుల వృషాకపాయీశులకున్
వాచంయముఁ డర్చన లిడి
వే చనె మూకాంబికానివేశమ్మునకున్. 118

శంకరుఁడు మృతుఁ డగుబాలుని బ్రతికించుట

ఉ. అచ్చట నొక్కెడన్ సుతుఁ గతాసువు నంకము సేర్చి సోరెదన్
హెచ్చిలు వంతఁ గుందెడు తదేకతనూజులు విప్రదంపతుల్

---

10. బుద్ధపక్షమున:— సర్వజ్ఞుఁడు, మారజిత్తు, బుద్ధుని నామములు, క్రతు విఘాతుకు లొనర్చు పూజలయందు గొప్ప ఆదరముకలవాఁడు.
శివపక్షము:— క్రతుఘాతుక — వీరభద్రుని, పూజ — పూజయందు, ఉరుఆదర — పెద్దఆదరముకలవాఁడు.

11. కల్కిపక్షము:— సదావాస — సత్యయుగమందు, కృతయుగమందలి, ఆవాస — నివాసమందు, విధృత — ధరింపఁబడిన, మనము = అభిప్రాయము గలది.
శివపక్షము:— సత్ = సత్పురుషులయొక్క. ఆవాస = నివాసములయందు, లేక సత్ = ఉత్తమములందు, ఆవాస — ఉనికి.

సచ్చరితుల్ గనంబడఁగ శంకరుఁడున్ గరుణాళు వాటఁ దా
నొచ్చిన మానసంబునఁ గనుంగొని వారలఁ దూలెఁ జాలిమై. 119

ఆ. అటుల కుందుచుండ నాకాశవాణి వి
వంగనయ్యె 'రక్షణంబు సేయఁ
జాలనట్టి నరు దయాళుత్వ మెంతయు
దుఃఖమునకె యగును దుది' కటంచు. 120

క. అశరీరవాణి విని య
వ్వశి యనె 'నీమాట నిక్కువము ముజ్జగముల్
గుశలమున మనుపఁ జాలిన
కుశలున కొకనికె సుమి తగున్ దయ సూపన్. 121

ఆ. అని యతీంద్రుఁ డన క్షణాంతరమంద సు
ప్తోత్థితాకృతిని ద్విజోత్తమాత్మ
భవుఁడు లేవ నచటి ప్రజలు సార్వజనీన
తచ్చరిత్రి కద్భుతంబు గనిరి. 122

వ. అటుల కర్తృతారాహిత్యమును భూతదయాపరతయుఁ బ్రకటించి
యా జనపదంబున నొక్కెడ. 123

మూకాంబా స్తవము

క. సాల కృతమాల తాల ర
సాల తమాలాది సాల శాల్యుపశల్య
శైలము సొచ్చెను మూకాం
బాలయ మఖిలార్థసిద్ధి కది తా వగుటన్. 124

గీ. చొచ్చి యుచ్చావచానందజోచ్చబాష్ప
ముగ సముద్గీర్ణరోమాంచముగ నుదార

భక్తిఁ గరుణావలంబ నంబను నుతించె
నాగమాద్వైతములకు నైక్యము ఘటిల్ల. 125

దండకము :— శ్రీమజ్జగన్మాత! సామాగమోద్గీయమానానుభావా త్రిలోకోద్భవోపేత! యామ్నాయ హృత్ప్యంతరాలక్షితజ్ఞానదీపాయితా! శీతశైలేంద్రసంజాత! మాతా! భవద్దివ్యమాహాత్మ్య మగ్గింపఁగా వేదవేదాంతరాశుల్ పురాణంబులున్ సర్వశాస్త్రంబులున్ జాలవంచెంచ నస్మాదృశుం డల్పబుద్ధిన్ దలంపన్ సమర్థుండె? తల్లీ! మితోక్తిన్ నుతింపం బ్రవీణుండె? యాదిత్యసంస్తుత్యనిస్తుల్యచారిత్ర! పారేపరార్ధమ్ముగా నెల్లు నీపాదకంజాతసంజాతభాస్సంచయంబందు మున్మాలుపై నార్పదుల్ దీక్షితుల్ పావకార్కేందులన్ జొచ్చి యావజ్జగచ్చక్రమాలోకవంతంబుగా లీలఁ గావించు విశ్వోదయైకప్రసూ! చిత్తపీఠిన్ మహాభాగు లాకొంద లావాహనాద్యంబులౌ తచ్చతుష్షష్టి రాజోపచారంబులన్ బూన్చి దివ్యాజ్ఞపటీదానపూర్వంబు త్వత్పూజఁ గావింత్రు ధన్యాత్మ! సౌజన్యసమ్మాన్య లాకొంద తత్తచ్చతుష్షష్టి సంఖ్యోపచారంబులం దొక్కఁ డొక్కండె కొంచున్ విశుద్ధాఖ్య నాజ్ఞాఖ్యఁ జెన్నొందు చక్రద్వయిన్ దోఁచు పద్మంబు సద్మంబుగా నెల్లు నిన్నవ్యయానంద మబ్బంగఁ బూజింత్రు సంశుద్ధిదం బంచుఁ గాత్యాయనీ! ప్రాకృతుల్ మర్త్యలోకం ద్రొనర్తు ర్బహిష్పూజనే; మధ్యముల్ గొంద అంతర్బహిఃపూజఁ గావింత్రొకం డుత్తముల్ గూర్తు రంతస్సపర్యైకమాత్రం; బొకం డుత్తమోత్తంసు లిచ్చన్ ద్వదైక్యానుభూత్యేకలగ్నాత్ములై యుండి యేపూజయున్ జేయనే చేయ రోయంబ! లంబాలకా! నీలకాదంబినీడంబరాలంబ తన్వంగి! దీపించు నష్టోత్తరత్రింశతిప్రఖ్య మాతత్కలావాటిలో మేటి యాబోధినీముఖ్య చంచత్కలాపంచకమ్మందు నెల్గొందు యుష్మత్పదాంభోజముల్ పండితుల్ భక్తి బూజింత్రు కళ్యాణి!

కల్పాంతకాలాగ్నిరూపంబునఁ నీవ లోకంబులం గాల్చి, ప్లియూషరూపంబునన్ వహ్నిఁ జల్లార్చి, యవ్వాని సృష్టించి, చంచత్సుధామూర్తివై పెంచు దీవే యటంచున్ నినున్ ధ్యానమున్ సల్పువా రౌదు రీసృష్టి కెల్లన్ స్వయంకర్త్రులో యమ్మ! బ్రహ్మాండభాండోదరీ! భవ్యశాతోదరీ! దేశికోక్తిప్రభావమ్మునన్ మున్న తాఁగన్నయా నిన్నె 'సైవాహ మ'స్మీతి భావంబునన్ బ్రత్యభిజ్ఞానలక్ష్యంబుఁ గావించుకో నేర్చువారే కదా ప్రత్యభిజ్ఞామతాంతర్యవిజ్ఞాతలై ధన్యతన్ మించువా రంబరో! యైహికంబైన భోగమ్ములం బొందఁ గాంక్షించి యాధారచక్రంబునం దుత్తరం బౌనధిష్ఠానచక్రంబునందున్ నినుం గాంచి యారాధనన్ చేయువారున్ మణీపూరకంబందు నిన్నుం గనుంగొం చుపాసించువారున్ భవత్పట్టనప్రాంతసీమాంతవాసంబునే కందు రోదేవి! నిన్నున్ శ్రితానాహతాభిఖ్యచక్రిన్ భజిం తెవ్వ రవ్వారు త్వత్పట్టణాంతర్నివాసంబునైగొందు రీ గౌరి! విశుద్ధాఖ్యచక్రస్థితన్ నిన్నుఁ గన్గొన్నవారల్ త్వదీయంబు సామీప్యమున్ గాంతు, రాజ్ఞాఖ్యచక్రంబు నందున్న ని న్నర్చనల్ సేయువారల్ భవత్సామ్యముం గాంతు, రాపై ధ్రువాభిఖ్య నేపా సహస్రారపద్మంబునం గర్ణికాసీనఁగా నిన్ను వీక్షించి యెయ్యం జతూరీతికైక్యానుభూత్యస్తతాపత్రయుం డైన యాసాధకేంద్రుం డొకం డందు సాయుజ్యమున్ జెందు వందారుబృందారకాపీడసందీపితామందరత్నప్రభాబృంద సిందూరితాత్మీయపాదారవిందా! చిదానందసద్వల్లికాకంద!

తోల్దొల్త నాసాధకేంద్రుండు శ్రీచక్రషట్చక్రకైక్యంబు భావించి యామీఁదఁ జక్రాన నీకు నేకత్వ మీక్షించి, మంత్రానకున్ నీ కభేదంబు లక్షించి, ధ్యానించి ధ్యానించి నీతో నభిన్నత్వముం గాంచు నంచున్ సమస్తాగమంబుల్ ప్రపంచింప మాహాత్మ్య మీ రేడు లోకంబు లిలపారఁగా నేలు శ్రీరాజ్ఞి! యద్వైతసి

ద్ధాంతసామ్రాజ్యసింహాసనాసీన! శ్రీశ్యామలాకారు! మూకాంబికా
రూపకామేశ్వరీ! కామితార్థప్రదాత్రీ! నమస్తే నమస్తే నమః. 126

క. అని వాక్పూజల మూకాం
బను గొల్చి యతండు భైక్షభక్తమునన తు
ష్టిని గనుచుఁ గడపెఁ గొన్నా
ళ్లనయము సాధకులు తన మహత్త్వము పొగడఁ. 127

వ. అనంతరంబ. 128

సీ. హుతవహస్వేద్ధాగ్నిహోత్రసద్గతపావ
నామోద మనుగేహ మల్లుకొనఁగఁ
నిజకర్మనిరతసద్ద్విజులఁ గన్గొని యుప
మృత్యు వల్కుచు వెలికేఁగి బ్రిదుక
ద్విసహస్రసంఖ్యశ్రుతిశ్రితపాఠకు,
లాహితాగ్నులు పొలుపారుచుండ
శ్రౌతరహస్యవిజ్ఞాతలౌ నార్త్విజీ
న విధానచతురు లెందఱో వసింప

గీ. మధ్యనివసదుమానాథమండిత మయి
యలరు శ్రీబలినామాగ్రహారమునకుఁ
జనియె మూకాంబికానివాసమును వీడి
శమధనుఁడు శంకరుండు సచ్ఛాత్రకముగ. 129

హస్తామలక చరిత్రము

మ. కలఁ డాబ్రహ్మపురిన్ బ్రభాకరుఁ డనంగా సర్వశాస్త్రార్థతుం
దిల ధీశాలి, ప్రవృత్తిశాస్త్రకలనాధీనుండు విప్రుం డొకం
డలఘువ్యాప్తి యశోనిమగ్నభువనుం డయ్యాయజూకుండు పు
ష్కలకైదార్య హిరణ్య ధేన్వనడుహోగారాదియై రాజిలున్, 130

క. ఆతనికి సర్వసంపద
లీతీరున నమరియున్న నేమయ్యె యథా
జాతుం డగు నొక్కతనూ
జాతుఁడు సంజాతుఁ డయ్యె సతతము వగవన్. 131

ఉ. రూపునఁ గాముఁ గాంతి మిహిరున్ ముఖరోచి విధున్, క్షమన్ క్షితిన్
రాపులఁ బెట్టువాఁడ- యయినన్ విన వాక్కొన నేరఁ డింత యూ
లాపము నేని, ధ్యానపథలగ్నమనస్కత మందచేష్టుఁడై
యాపసివాఁడు తండ్రికి నిరంతర మాంతరచింత గూర్పఁగన్. 132

ఆ. జడుఁడువోలె సుతుఁడు చరియింపఁ 'బ్రాక్కర్మ
మా? స్వభావమా? గ్రహగ్రహమ్మొ
హేతు' వంచు నెవ్వఁడేని బహుశ్రుతుఁ
డరుగుదేరఁ దండ్రి యడుగ నెంచు. 133

గీ. అంత శిష్యప్రశిష్యు లత్యమితపుస్త
కాఘుభారికులై వెంట నంటి రాఁగ
వచ్చె నాయూరి కొక పూజ్యపాదుఁ డనుచు
విని తనూజుఁ దదంతికమునకుఁ బంపి. 134

ఉ. 'కూడదు శూన్యహస్తముల క్షోణివిభున్, గురు, నిష్టదేవతన్
జూడఁగ' నంచు శాస్త్రములఁ జూచుట నాసుధి సోపహారుఁడై
పోఁడిగ నొజ్జ డాసి ఫలముల్ దరిసించి తదంఘ్రి వ్రాలి కొం
డాడి, కుమారు భస్మపిహితానలసన్నిభు మ్రొక్కఁజేయుడున్. 135

ఉ. ఆవటుఁడున్ స్వజాడ్యము బయల్పడఁ దత్పదసీమ వ్రాలియున్
లేవమిఁ గాంచి, దేశికుఁడు నెమ్మదిగాఁ జెయి వట్టి యెత్తి భూ
శీవికృతాంగమున్ గవుఁగిలించి కపోలము మెత్త నొత్త; భూ
దేవుఁడు విన్నఁబోయి గురుదేవునితో నిటు పల్కె దీనుఁడై. 135

క. దేవా! దేవర వాక్కొనఁ
గావలె నదసీయజాడ్యకారణ; మితరుల్
నీవలె నెఱుంగ, రీతని
జీవిత మాలించి యవులఁ జెపుమా వెరవుల్. 136

మ. పదుమూఁడేఁడుల యీఁడు వీని కిపు డప్రాప్తావబోధంబుగా
నుదితుం డౌటఁ బఠింపలేఁడు నిగమమ్మొక్కర్ణమున్ వ్రాయఁడేఁ
'యది మేధాప్తికి హేతు' వం చుపనయం బత్యాస్థ గావింతు నె
య్యదియున్ మేల్ గనరాదె యేమనదనయ్యా! నామహాపాపమున్.

సీ. తన కీడుజోడైన దారకు లాడుకోఁ
బిలువ నేగం డాడఁ దలఁప బోఁడు
పలుగాకు లగుబాలకులు ముగ్ధుఁడని కొట్ట
వెతనొందఁబోఁడు కోపింపనేరఁ
డొకనాఁ డుపవసించు నొకనాఁడు భుజియించు
స్వైరియై చెప్పిన పనియొనర్పఁ
డులుకండు పలుకండు మెలఁకువ గలిగియు
నింట నందఱు నెలుఁగెత్తి పిలువఁ

గీ. గొంద ఱందు రనేడ మూఁకుం డటంచు
నం దొకండు గ్రహావిష్టుఁ డనుచుఁ బూర్వ
పాపకలితుండొ దైవశాపోపహతుఁడొ
యం దొకం డేను దల్లియు నడలి పోవ. 138

క. అనెడు ప్రభాకరు మాటలు
విని శంకరదేశికుఁడు సవిధవర్తిఁ గుమా
రుని నీ వెవండ విటు జడుఁ
డన నుందే లనుడు నమ్మహాత్ముఁడు పలుకున్. 139

ఆ. మనుజ దేవ యక్షులును గాను బ్రాహ్మణ
క్షత్రి యార్య శూద్రజాతిఁ గాను
బ్రహ్మచారి గేహి వనవాసి భిక్షువుల్
గాను బోధరూప మైనవాఁడ. 140

క. జడ మేను గా, నీఁకను నా
కడ నుంటను జడమె కదలఁగలుగు ననుట కె
న్నఁడు సంశయింప నపగత
షడూర్మి షడ్భావవికృతి సచ్చిన్మయుఁడన్. 141

ఆ. నాకుఁ బోలెఁ గలుగుఁ గాక యియ్యనుభూతి
భువి ముముక్షువర్గమున కటంచుఁ
బదియు రెండు మేలి పద్యాల నొడివెఁ జి
దాత్మతత్త్వ మెల్లయది ఘటించి.

గీ. మిహిరుఁడే లోకచేష్టానిమిత్త మగు ప్ర
మితి మనోక్ష్యాదివృత్తినిమిత్తములు, న
భంబువలె నిర్గతాఖిలోపాధిక మగు
నట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 143

గీ. జ్వలనమును నౌష్ణ్య మటు మనశ్చక్షురాది
నిత్యబోధాత్మ మేకమై నెగడు దేని
నూఁది తా మబోధాత్మ మయ్యును దనర్చు
నట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 144

గీ. ఆననాభాసకము ముఖత్వాప్తి నద్ద
మందుఁ దోఁచిన, లే దన్య మటులె జీవుఁ
డొగిఁ జిదాభాసకుం డన నొప్పు మతుల
నట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 145

గీ. అర్ద మెడలింప నాభాసహాని నొక ము
ఖమె యకల్పనముగ వెల్గు గతి మతిలయ
మునఁ జిదాభాసకుం డయి తనరు నెవ్వఁ
డట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 146

గీ. ద్యుమణి బహుఘటజలములఁ దోఁచు గతి, నె
వఁడు స్వతఃప్రకాశుండు కేవలుఁడు శుద్ధుఁ
డయ్యు బుద్ధులఁ బెక్కైన యట్లు వెలుఁగు
నట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 147

గీ. నిర్మనశ్చక్షురాదికేంద్రియుఁడ యయ్యు
నల మనోచక్షురాదులకు మనోచక్షురాది యాచుఁ
దన్మనోచక్షురాదులకును నందం డెవండొ
యట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 148

గీ. నైకదృక్ప్రకాశుఁడు రవి యాగపద్య
గతిఁ బ్రకాశ్య మ్మటు లనేకమతుల నెవ్వఁ
డేకబోధాకృతిని బ్రకాశీకరించు
నట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 149

గీ. అర్కుఁ డొకఁడయ్యుఁ జలితాంబులం దనేకు
లై స్థిరాంబుల నగ్నిభావ్యత నొకఁ డగు
* గతిఁ జలస్థిరమతుల నెక్కటి వెలుంగు
నట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 150

---

*గీ. తరళజలమం దనేకమై స్థిరముల నొకఁ
డవు చనలభాతి నొకఁడయ్యు సవిత వెలుఁగు
గతిఁ జలస్థిరమతుల నొక్కఁడయి వెలుఁగు
నట్టి- అనిపాఠాంతరము.

గీ. జలధరచ్ఛన్నదృష్టి యగా జనుఁడు సూర్యు
నిష్ప్రభునిగ ఘనచ్ఛన్నునిగఁ దలంచు
నటు విమూఢదృష్టికి బద్ధుఁ డటుల తోఁచు
నట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 151

గీ. అఖిలవస్తువులను బ్రోతమై యనన్య
మయిన నెద్దాని నావస్తు లంటఁ జాల
వభ్రమటు సదా శుద్ధుఁ డచ్ఛాకృతి యగు
నట్టి సచ్చిత్సుఖస్వరూపాత్మ మేను. 152

గీ. తగ నుపాధుల మణుల భేదతయుఁ బోలె
నమరు భేదత బుద్ధిభేదముల నీకు
జలములను వెన్నెలలకుఁ జంచలత పగిదిఁ
జుట్టుకొనె నీకుఁ జలత విష్ణూ! చిదాత్మ! 152

క. అని చెప్పిన యాశ్లోకము
లను బరమార్థమ్ము కరతలస్థామలకం
బన నుంట వానికిని గవి
కిని హస్తామలకసంజ్ఞ క్షితి నెలవుకొనెన్. 153

ఉ. అంతట దేశికేంద్రుఁడు ద్విజార్భకుఁ డెట్లుపదేశ మేని లే
కంతటి బ్రహ్మబోధము తనంత నెఱింగెనొ యంచు నద్భుత
స్వాంతమునన్ దలంచి ద్విజబాలకు మౌళి స్వహస్త మూన్చి న
త్యంతకృపామృతాతిశిశిరాయితదృగ్రుచివీచు లూఁచఁగన్. 154

గీ. హస్తమస్తయోగ మటు సల్పి దీవింప
మాటలాడకుండ మాణవకుఁడు
పోయె నాత్మగేహమున కెల్ల రరుదంద
నపుడు తండ్రిఁ జూచి యనియె గురుఁడు. 155

ఉ. నీసుతుఁ డిట్టి మందమతి నేరఁడు నీపని సేయ, నెందులన్
బాసట గాఁడు నీకు నెది పల్కఁడుగా కెఱుఁగున్ బురాభవా
భ్యాసమునన్ సమస్త; మటు లౌటన స్వానుభవైకగర్భప
ద్యాసమసృష్టి సేసెను నిరక్షరకుక్షియ యైన నేర్పునే. 156

క. లే దితని కింత సక్తి గృ
హాదులయెడ లేదు స్వతను వందును భ్రాంతిన్
దాదాత్మ్యము; లేదు పెఱల
నా దనుమతి యనినఁ గలుగునా యెందేనిన్. 157

క. భవబంధముక్తుఁ డగు ని
య్యవధూత గృహస్థుఁ జేయ నలవియె విద్వ
త్ప్రవరా! యనుపుమి, నాతో
నవు నీకు శుభంబు లనుదినాభ్యుదయంబుల్. 158

శా. అం చాశీస్సు లొనర్చి దేశికుఁడు విప్రాంగీకృతుండై వటున్
గొంచున్; దూర మనువ్రజించిన ద్విజన్మున్ దాంతుఁ గావించి పీ
డ్కొంచున్ స్వైరగతిన్ జనంగ- విబుధుండున్ జేరె స్వాగార మ
ధ్యంచ ద్జ్ఞాననిరస్త పుత్రవిరహోద్య త్స్వాంతచింతాకుఁడై. 159

వ. తదనంతరంబ. 160

శృంగగిరియందు శారదను ప్రతిష్ఠించుట

సీ. ఉండు నేఁడును దప మ్మొనరించుచునె ఋష్య
శృంగుఁ డాత్మభృదంతరంగుఁ డెచటఁ
బ్రవహించు నెచ్చోట స్పర్శమాత్రవితీర్ణ
రంగన్మహాభద్ర తుంగభద్ర
యెట నుండు ప్రాజ్ఞు లధీతస్వశాఖు ల
భ్యాగతోద్భాసితస్వర్గశాఖు
లెందు నుండురు యజ్వ లిజ్యాశతాధిక
ల క్రాంత మంతరితాంతరాయ

గీ. మట్టి శ్రీశృంగగిరికి నయ్యతివిభుండు
పద్మపాదాదిశిష్యులు పజ్జ రాఁగ
నేఁగి శతధృతి మఘవత్ప్రభృతిసుపర్వ
కాండవినుతుం డవాప్తకాముండు నగుచు. 161

క. సిగ్గువడ భుజగపతి, కరితు
భుగ్గురువర నిర్విశేషముగ వాకొనె నం
దగ్గురుఁడు ప్రాణితమములు
క్రొగ్గఁగ జీవేశరైక్యమును శ్రుతిసరణిన్. 1(2

గీ. హరిహయవిమానకల్ప మనల్పశిల్ప
మైన ప్రాసాద మచ్చట నలవరించి
యందు బ్రహ్మాదిపూజిత యైన దేవి
కన్వహార్చననియమమ్ము ననువుపఱచె. 163

సీ. ఏదేవ బ్రహ్మ కిల్లాలుఁగొమ్మగ నెంతొ
పారపాండితిఁ బట్టి పేరఁ బట్టి
యేదేవి వైదగ్ధి కెదురాడఁ జాలక
శంకరుం డంతవాఁ డింకఁ బాత్ర
నేయమ్మ కెదురు లే రీరేడుజగములఁ
బరమపాతివ్రత్యపాలనమున
నాసాధ్వి యోగమహిమ నగ్ని సొచ్చి ప్రాణే
శులో లీనమయ్యెను గడంగి

గీ. మండనార్ధాంగలక్ష్మి యేమానవతియొ
యట్టి భారతీపేర నయ్యాదిశక్తి
నచట సద్వైతపూర్ణసిద్ధాంతలక్ష్మి
ముగను స్థాపించె భిక్షుకపుంగవుండు. 164

ఆ. ప్రీతిన నెఱపి యచట భారతీసంప్రదా
యుని సురేశ్వరాహ్వయుని విధేయు
నెలవుకొల్పె దేవి నిరత మర్చించు చ
ద్వైతమతము జగతి వ్యాప్తి సేయ. 165

క. భారతి యన శారద యనఁ
బేరొంది నిజాశ్రితుల కభీష్టము లిడుచున్
గారుణ్యమూర్తి యయి శృం
గేరిని నాదేవి నేఁటికిని వెలుఁగొందున్. 166

ఉ. ఆజగదేకదేశికుఁ డహర్నిశ మాపరదేవతా పదాం
భోజయుగంబునన్ హృదయమున్ గదియించి సపర్యలన్ మహా
రాజుల కట్టు లాభువనరాజ్ఞి కొనర్చుచు నుండు నంతఁ బూ
ర్ణాజుఁడు బ్రహ్మచారి యొకఁ డాగురుఁ జేరె భవార్తి తీర్పవె. 167

ఆ. ఆత్మధర్మచారి యాచార్యచిత్తాను
సారి యల్పతరవచఃప్రసారి
భూతదయకు జన్మభూమి యై వాఁడు శు
శ్రూష సలుపు శంకరునకు భక్తి. 168

సీ. తొలుత మేల్కాంచి స్నాతుం డయి గురుఁడు సు
ప్రోత్థితుం డగు వేళ కుండు నెదుట
సలిలాదికము బహిష్కార్యార్థ మొనగూర్చి
దంతకాష్ఠమ్మును సంతరించుఁ
గంబళాదుల మెత్తగా నాసన మమర్చు
నందిచ్చుఁ దనుమార్జనాంబరంబు
లుదికి చక్కఁగ గావు లార్మిమై నీటార్చు
నమరించు దేవతార్చార్థ మెల్ల

గీ. వినయమున వేఁడి శ్రీపాదవనజయుగళి
మెత్తమెత్తన నొత్తు 'సామీ' యటంచు
నేఁగుదెంచు సుషుప్తి యందేనిఁ బిలువ
నాతఁ డానందగిరి సమాహ్వాయమువాఁడు. 169

గీ. ఆవులింపండు హాసియింపఁ డండఁ గాళ్లు
సాఁచి కూర్చుండఁ డనఁ దగ్గసమయమందు
నూరకుండఁడు, మాటాడఁ డొకటి వృథగ
వెన్ను కననీఁడు గురు చెంత నున్నయపుడు. 170

క. గురుఁడు విడియు నెడల విడియు
నరిగెడుచో నరుగుఁ, జెప్ప నడఁకువ వినుఁ, జె
చ్చెర సేయుఁ జెప్పకయ హిత
మరసి, యొనర్పండు గురున కహిత మ్మెదియున్. 171

చ. ఒక దివస మ్మతండు నికటోర్వ్విని బాఱుస్రవంతి నొజ్జశా
టిక లుదుకన్ దమిం జని కడింది విలంబ మొనర్ప వాని రా
కకు నయి పాఠ మాఁపి యటు గాంచుచు నయ్యతి శాంతిపాఠ ము
త్సుకు లయి చెప్ప శిష్యతతితోఁ 'గిరి రాఁడొకొ తాళుఁడా' యనన్.

ఉ. అంబుజపాదుఁ డప్డు నిగమాన్తగురూక్తికి నవ్వి బుద్ధిమాం
ద్యంబున శాస్త్రముల్ గన ననర్హునకై గిరికై ప్రతీక్ష సే
యం బనియేమి? యం చవినయంబున భిత్తిని జూప వాని గ
ర్వంబు నడంప స్వాశ్రయులవంక దయన్ బ్రకటింప నొజ్జయున్.

క. కరుణారసమ్ము చూపులఁ
దొరుఁగ నొసఁగె మనసునఁ జతుర్దశవిద్యల్
గిరి కద్దిర! గురుకృప ని
ర్జరధేనువ కాదె శిష్యసమితికి నెందున్. 174

ఉ. పోఁడిగ సర్వవిద్యలును బుద్ధిఁ దమంత స్ఫురింప వైళ మా
మ్రేడితవిస్మయంబున సమీపగతుం డయి పాదుకాద్వయిన్
దోడన వ్రాలి దేశికుని దోటకవృత్తకవిత్వభక్తిఁ గొం
డాడఁ దొడంగె నాతఁ; డరయన్ బరతత్త్వము వెల్లివాఱఁగన్. 175

తోటక వృత్తము } జను రత్యయతోయము సౌఖ్య విప
ద్ఘనమత్స్యము నౌ భవకంధి మునుం
గు ననున్ శరణాగతుఁ గూర్మిని దే
ల్చి నిరంతర మారయు లీల గురూ. 176

తోటక. తెగిపో విషయేచ్ఛలు, దేహగభీ
తెగిపో నొనరించి మతిం బరమా
త్మగతం బొనరించి సదా వరలం
దగు దీవు విమోహ మణంచి సుధీ! 177

తోటక. అది నాయది నే నది యన్మతి నీ
హృది నన్నమయాదుల నీఁగు మజున్
హృదయస్థు ననంతుని నీశుఁ జిదా
స్పదు 'నే' నని యెంచుము భవ్యగుణా! 178

తోటక. అల వారిభిదన్ జలజాప్తనకున్
వలెనే- కలశాది దివంబునకున్
బలె- బుద్ధిభిదామహిమన్ బహుతా
కలనం బది నీకును గల్గుఁ గదే. 179

తోటక. రవిరుఙ్నభచిత్ప్రసరంబునఁ గం
దువు బుద్ధిని లోకమనోగత మా
నవి యెల్లను; గావున నౌ దవికా
రివి సత్పద మౌదువు శ్రీచరణా. 180

క. అని తోటకవృత్తంబుల
ననితరసుజ్ఞాన మైన యథాత్మజ్ఞా
ననిదానం బగు స్తవమును
నొనరిచె 'గురుమూర్తి యాత్మయు నొకండ' యనన్. 181

సీ. శ్రీశంకరాచార్యహృద్యపదాంభోజ
మ్ములు పంటపొలముగా మొలచె నద్ది
ప్రాఁకె నెయ్యది రోదసీకటాహము దాఁటి
తద్దేశికోపఘ్నదండ మూఁది
మోక్షరక్తిఁ బ్రవాళములఁ గాంచె నద్ది త
త్కరుణామృతావసేకంబుఁ బడసి
శీతల తదపాంగపూతమై యెది భవ
తాపవారక మనాతప మొసంగు

గీ. నట్టి గిరిభక్తివల్లి యింపారఁ గాంచె
నమలతోటకవృత్తవృంతావలంబ
నం బగుఫలంబు భోక్తమన స్సురూప
శుకగణాస్వాద్యమాన మాచును దనర్ప. 182

చ. వితతసమున్నతిన్ బడసి పృథ్విపయిన్ బద మూఁది వ్రాలి యు
న్నతపద మొందఁ గోరెడు జనంబులకై మిను ముట్టి తా నధః
కృతభువనత్రియం బగుచు నేదియొ వంశము గల్గు నిచ్చొనా
యతిపతిసేవ శిష్యతమ మంతయు నంత మొనర్చు టబ్రమే. 183

క. ఎఱుఁగకె సుపర్వసూక్తులు
గురుదయ నానందగిరి యకుంఠితగతిఁ జె
చ్చెర వేదశిఖార్థమ్ముల
విరచించెను దోటకాఖ్య వృత్తమ్ములుగాన్. 184

క. అమృతరస మధురి మధురి
ణము లగు తద్వాక్యగుంఫనమ్మున కాశ్చ
ర్యముపడిరి పద్మపాదా
దిమహామతు లకట! తత్సతీర్థ్యులు మతులన్. 185

గీ. అమితభక్తిఁ దదీయాననాబ్జ మాక
రందనిష్యంద మయి పుట్టుపొందు తోట
కాఖ్య పద్యకవిత్వంబు నరసి శిష్ట
జనము లాకవిఁ దోటకాచార్యుఁ డనిరి. 186

గీ. అలఁతి యయ్యు మహార్థ మనల్పనీతి
యుపనిషద్వేద్య పరమతత్త్వోపహితము
శిష్టపదజుష్టమును నౌట శిష్టజనగృ
హీత మయి తత్ప్రకరణము ఖ్యాతి కెక్కె. 187

క. శంకరుచేఁ దోటకనా
మాంక మెనసి పద్మపద నిభాతిప్రతిభా
లంకృతుఁ డౌటఁ దదాది న
పంకిలగతి ముఖ్యశిష్యపద మతఁ డొందెన్. 1:8

సీ. అవని పర్యటనేచ్ఛ యతివరాకారభా
గ్ధర్మార్థ కామ మోక్షమ్ము లొక్కొ
సర్వతోవ్యాప్తి కాంతాధృతమానవ
తనుకఋగాదివేదమ్ము లొక్కొ
యామ్నాయపఠనపాఠాదరవిచరిష్ణు
కమలగర్భచతుర్ముఖమ్ము లొక్కొ
సామీప్య సారూప్య సాలోక్య సాయుజ్య
చతురభిదానమోక్షమ్ము లొక్కొ

గీ. యని వసుంధరఁ గల విబుధాగ్రియాయు
లెదల నుత్ప్రేక్షసేయఁ బెంపెక్కి వెలసె
నబ్జపాద సురేశ హస్తామృతఫల
తోటకాఖ్య తచ్ఛిష్యచతుష్టయమ్ము. 189

శా. స్ఫారద్వాఃప్రఘణ ద్విపేంద్రకట చంచద్దాన కల్లోల వి
స్తారాస్వాదనలోల బంభరవఘూర్ఝంకార నీరంధ్ర ది
గ్ద్వారం బైన మహేంద్రసంపద లనన్ గ్రాయున్ యతీంద్రోక్తవి
ద్యారాజన్య మకింపచానతతి బ్రహ్మానంద సంధానమై. 190

ఉ. ఆనతమంథశైల మథితాంబుధిగర్భసముద్భవ త్సుధా
ఫేనసమానమై యమృతవృష్టినిభం బగు కీర్తితో, నస
న్మానసమార్గ మెల్లఁ గనుమాత్రి నిరుద్ధ మొనర్చు నయ్యతీ
శానుఁడు రాజిలెన్ ద్విపదజయ్యులు శిష్యులు చేరి కొల్వఁగన్. 191

సురేశ్వరుని గ్రంథరచన

వ. అనంతర మొక్కనాఁడు గురుసార్వభౌముఁడు విశ్రాంతుండై యు న్నతఱి సురేశ్వరాచార్యుండు సమీపించి వందన మొనర్చి తద నుజ్ఞ నొంది జగదుద్ధారకంబు నద్వైతసిద్ధాంతప్రచారకంబు నగు నెద్దియేని గ్రంథంబు రచియించి గురువుల కార్యభారంబు గొంత యపనయింపఁ దలంచి యిట్లను. 192

క. గురువర! నీకయి నాకుం
గరణీయం బెద్దియేని గలదే నద్వా
పరముగ ననుఁ బనిగొనుమీ
గురుభక్తుని జీవితమ యగున్ సార్థకమై. 193

చ. అనుచు సురేశ్వరుండు వినయంబునఁ గోర గురుండు పెద్దయూ
ర్పును నిగుడించి యిట్లను నిమత్తరులై ప్రతిపక్షు లిందు నం

దును జెడ వాదమం దోడిచి తత్త్వములుల్ బచరించినట్టి స
జ్జనమణి యక్కుమారిలబుధప్రవరుం జెదఁ బాయఁ జేయెన్. 194

ఉ. నీకు గురుండు నాకు భజనీయుఁడు వైదికధర్మమార్గర
క్షాకృతకృత్యుఁ డాతఁ డవసానదశన్ నను దేశికుండుగాఁ
గైకొని సంన్యసించి తనకామిత మొక్కటిమాత్రి దీఱమిన్
వ్యాకులుఁడై శరీర మెడఁ బాసెనె యంచుఁ దపింతు నిచ్చలున్. 195

చ. ఎనిమిదివేల వార్త్తికము లేన రచించి భవత్కభాష్య ము
ర్విని వితతప్రచార మొనరింపఁ దలంతును గాని తీఱ ద
య్యెను మదభీష్ట మంచుఁ దపియించె ననుం గని బ్రహ్మభూయమున్
గనుతఱి దానికై వగవఁగాఁ బనిలే దని యెంత సెప్పినన్. 196

గీ. జైమినిమతంబు చేపట్టి జైనమతము
నడఁచి నట్టి యుగ్రంపశ్యుఁ డగు హయుండు
ప్రచురపాషండమతగిరీరమ్మద మగు
నతని మది కోర్కి పాలనీయంబు గాదె. 197

ఉ. ఆతని యంతరాత్మకు నిరంతరశాంతియు, మత్ప్రణీతభా
ష్యాతిరహార్థవిస్ఫురణ మబ్బి జగంబు తరించుటల్, త్వదీ
యైతదభీష్టసిద్ధియును నిన్నియుఁ జేకుఱుఁ గాన వార్త్తిక
వ్రాతము సల్పుమా విబుధవంద్య! సమర్థుఁడ వీ వొకండవే. 198

క. నావుడు సురేశ్వరుం డను
భావత్కము భాష్య మరయ వశమె సతర్కం
బై విపులగభీరార్థం
బై వెలయుట జంకెదను మహాత్మ మనమునన్. 199

గీ. అయిన రచియింపఁ బూనెద నమితకరుణఁ
జల్లనై పండువెన్నెల సరణిఁ దోఁచు

భవదపాంగేక్షణములు నాపై నిబడుట
సాధ్వసధ్వాంత మింతింత శాంతిగనుట. 200

ఆ. కొండ యెక్కినట్లు గురుఁ డుల్లమున నుబ్బెఁ
బూని గ్రంథరచనమున కతండుఁ
జెంత వినుచునున్న చిత్సుఖాదులు శిష్యు
లనిరి గురు నొకప్పు డరసి యిట్లు. 201

సురేశ్వరునిపై సతీర్థ్యుల యీర్ష్య

క. గురువర! మీకంటెను మే
మెఱిఁగిన దెది లేదు గాని యిందఱు విద్వ
ద్వరులైన శిష్యు లుండఁగ
దొరకెనె యీకర్మవాది తోడ్పడ మీకున్. 202

సీ. బోధింపఁడే స్వయంబుగఁ గర్మమార్గమ్ము
నిరతమ్ము కర్మతత్పరత మనఁడె
డీకొనఁడే సార్వలౌకికు నీశ్వరే
శ్వరు యుక్తిబహుళత నభావుఁ జేసి
నిరసింపఁడే స్వర్గనిరయాదిదము కర్మ
ఫలమ కా కీశుండు గలుగ డంచుఁ
దలఁపఁడే యీశ్వరప్రశయమ్మును బురాణ
తతి వ్యాసశిష్యశిష్యతను గనుట

గీ. నీదృశుండు వ్యాఖ్యాత యానేని లోక
హితము మాట యటుండ నహిత మనర్థ
మగును మీభాష్య, మీతని యధ్వ మెఱిఁగి
మెలఁగుఁ డని విన్నవిలతు మోయలఘుతేజ! 203

గీ. వెలయ గురుశిష్యులకుఁ బక్షభేద మొదవ
వారి కెటు గురుశిష్యభావము పొసంగుఁ

బొసఁగినను శిష్యపక్షంబు పూర్వపక్ష
మాను గురుపక్ష మవుల సిద్ధాంత మవును. 204

శా. ఆజన్మంబుగఁ గర్మనిర్వహణదీక్షాయత్తచిత్తంబుతో
నీజాగ్రన్మతి తా నొనర్చుటయు కా కెల్లప్పుడుం గర్మమే
బీజం బౌ దిదివాదిసౌఖ్యమున కన్వేషించి తద్భావనల్
యోజింపుండి మనం బటం చితరులన్ బోధింపఁడే యెల్లెడన్. 205

ఆ. ఇట్టివాని కానతిచ్చుచో మీభాష్య
మందుఁ గర్మమతము సడుకకుంట
విడువఁ డీసు తదభివృద్ధిఁ గోరుచు మూల
మునకె చ్యుతిని జేయ ననుమతించుతె. 206

ఆ. వాదమందు నోడి బలవంతముగ సన్న్య
సించి వాఁడు విశ్వసింపఁజాల
మితని మానిపింపుఁ డీభాష్యము సంబంధ
నమ్ము గూర్చు నుద్యమమ్మునుండి. 207

ఉ. 'ప్రీతి నభీష్టకర్మ మొనరింప సమర్థత గల్గు నెవ్వఁడే
నేతఁడెఁ గర్మ మింత త్యజియింపఁగరాదు యతిత్వమున్ గొనన్
ఖ్యాతదురాగ్రహంబె యయినన్ జనుపాంథులు మూఁగ లర్థ్వ లా
రీతికి' నంచుఁ జాటుదుర రెక్కొని భాట్టమతానువర్తనుల్. 208

గీ. అట్టి సంన్యాసదూషకం బైన బొట్టు
మతముననె పక్షపాతి యూ నితఁడు గాన
భాష్యవార్త్తిక మొనరింపఁ బంపు మన్య
దక్షు నొక్కని శిష్యబృందమున నెంచి. 209

చ. నెమకుట యేల యగ్రిధరణీ లక్ష్మినూది విభూతిభూషితుం
డమరఁడె పద్మపాదుఁ? డవురా! వివరింపఁ దరంబె తత్కృశా
గ్రిమతి యపారపాండితి నఖండభవద్పదభక్తి శాంతశీ
లము మహితాత్మ! యాతఁడవిలంబ మొనర్పఁగలాఁడు గ్రంథముల్.

సీ. కైశోర మాది సిక్కలుప మానైష్ఠిక
బ్రహ్మచర్యమునఁ బేర్పడినవాఁడు
సంన్యాస మెనసి యుష్మత్కృపఁ బ్రస్థాన
ధర్మమర్మజ్ఞుఁడై తనరువాఁడు
ప్రాంచితాద్వైతసిద్ధాంతసంవ్యాప్తికై
బద్ధకంకణుఁ డయి పరఁగువాఁడు
లక్ష్మీమవిభూతిఁ గాల్నడ గాంగఝరము ను
త్తరియించి మహి మించు బిరుదువాఁడు

గీ. సకలవిద్యలఁ బుంభావశారదాంబ
యగు సనందనుఁ డిదిగో మీ యడుగుఁదమ్ము
లండఁ గొని యుండ వెదుకంగ నగునె యొరుని
భాష్యవార్తికరచనకై పసుపువెట్ట. 211

గీ. యుష్మదంఘ్రిసంవాహనాత్యుగ్రతపముఁ
జేసి పరమేష్ఠిపత్నిదయాసుధఁ గొని
వరలు నానందగిరి భవద్భాష్యములకు
సరిగ వ్యాఖ్యాన మొనరింపఁ జాలుఁ గాదె. 212

చ. అనునెడఁ బద్మపాదుఁడు కృతాంజలి యై యిటు పల్కు 'దేవ! యి
య్యనఘుఁ డొకండె దక్షుఁడు కరామలకుం డఖిలాగమాద్వయా
ర్థనిధి' యటంచు దేవరగదా బిసుదాఖ్య నొసంగి. మెచ్చి రీ
తని నియమింప నౌను ద్వరితంబుగఁ గూర్చును వ్యాఖ్య యొప్పుగన్.

క. అను పద్యపాదుఁ గని గురుఁ
డను దరహాసము ముఖాబ్జ మం దుదయింపన్
వినుమీ హస్తామలకుం
డనితరసామాన్యమతియ యగు జ్ఞానమునన్. 214

ఉ. కాని సమాహితుం డగుటఁ గాంచఁడు లోకచరిత్ర, విద్యకై
పూనికఁ దండ్రి యెంత శ్రమమున్ గనినన్ జదువం డొకక్షరం
బే నుపవీతుఁ డయ్యు శ్రుతు లించుక నేరువఁ డొజ్జఁ గొల్చి, యె
ట్లైన నవేదబోధుఁ డగునా? శ్రుతిమర్మము లుగ్గడింపఁగన్. 215

ఆ. ఇతఁ డనేడమూకగతి వర్తిలుట మీరు
నరసినారు గాదె యట్టివాఁడు
తగఁడు దీని; కిఁక యథాశాస్త్రము గురూప
దేశ మొందు శ్రుత్యధీతి వలయు. 216

ఆ. జనన మొందు నపుడ సకలశాస్త్రమ్ములు
శ్రుతులు నెఱుఁగు బ్రహ్మరతుఁడ కాని
యెఱుఁగఁ డెటు బహిఃప్రవృత్తిఁ గావున నన
ర్హుఁడు రచింప గ్రంథ మొకటి యైన. 217

క. నావుడు శిష్యులు పల్కిరి
దేవా! యీయర్థ మదుఁగఁ దివురుదు మీతం
డేవిధి శ్రవణాదులు లే
కీవిజ్ఞత నెల్లఁ బడసె నెఱిఁగింపు దయన్. 218

హస్తామలకుని పూర్వజన్మవృత్తము

వ. అనుటయు గురువరుం డిటు లనియె. 219

మ. యమునాతీరమునందు సాధుచరితుం డో నొక్కవాచంయమో
త్తముఁ డత్యంతవిరక్తుఁ డుండు నెడ; నేతన్మాత తత్సన్నిధా

నమునన్ బాలుని వీని డించి 'క్షణ మన్నా! చూడవే'యంచు స్నా
నముకై బోటులతోడ నేఁగుటయు నంతన్ వీఁడు దోఁగాడుచున్.

చ. చని విధి దుర్విపాకమునఁ జయ్యన నన్నదిఁ గూలి ప్రమందఁగాఁ
దనువును గొంచుఁ దల్లియును దత్సఖులున్ యతిమౌళి నుంచి బో
రన విలపించుచుండఁగ సమాహితుఁ డౌ యతి బాహ్యవాసనల్
గని మది ఖిన్నుఁడై శిశువు కాయము సొచ్చెను యోగశక్తిచే 221

ఆ. పరతనుప్రవేశ వరయోగశక్తి నీ
తనువునందు నిలిచెఁ దాపసుండు
చచ్చి బ్రదికె నంచు జనులు ఘోషింప హ
స్తామలకుఁ డనంగ నయ్యె వీఁడు. 222

ఆ. విదితవేదశాస్త్రవిజ్ఞానుఁ డయ్యు బా
హ్యప్రవృత్తి లేక యలరు చుంట
భాష్యమర్మములను వ్యాఖ్య నొనర్పఁగా
నర్హుఁ డౌట యెఱిఁగి యన్నిగతుల. 223

క. మఱి మండనుం డనంగా
సరస్వతీసాక్షికముగ సర్వజ్ఞత్వం
బరుదారఁ గనియె నతఁ డొ
క్కరుఁ డిక్కృతిఁ జేయ వలఁతిగాఁ గన్పట్టున్. 224

ఉ. అంతియ కాదు దక్కొరు లనర్హులు వ్యాఖ్య నొనర్పఁ; బెక్కుర
శ్రాంత మసమ్మతిన్ దెలుప గ్రంథ మొనర్పఁగఁ బూను నెన్నఁగా
నాంతరవిఘ్న మొందునొకొ! యన్విచికిత్సను మాన్చివైతు మీ
రింత విచారమున్ సలుప క్షేమనువాఁడను మీ శంకరున్. 225

సీ. అనఁ జిత్సుఖాదు లి ట్లనిరి 'భవన్నిదే
శమున సనందనుం డమలచరితుఁ
డొనరించు మీరాతలంచిన భాష్యము నిబంధ
న మ్మెల్ల నొక్క క్షణమ్ములోన
బ్రహ్మచర్యమునుండి పడసెఁ దురీయాశ్ర
మము శేముషీప్రకర్షమున వెలసె
జను లెల్ల రానందమున మునింగెదరు త
ద్రచన కాతఁడె సమర్థత గలాఁడ

గీ. టంచు నమ్మండనునికంటె నప్పఁ డన్యుఁ
డుండె నని తెల్పుచుండు శిష్యులకు ననియె
భాష్యమున కన్య మైన నిబంధనమ్ము
పొందుగాఁ జేయుఁగాక సనందనుండు. 226

ఆ. తివిరి తాఁ బరప్రతిజ్ఞ మాఁవార్తిక
మతఁడు సేయ వలవ; దది యొనర్పఁ
గా సురేశ్వరుండు గావించెఁ బ్రతిన దీ
క్షను వహించెఁ గానఁ జనదు మాన్ప. 227

కం. అని శిష్యుల నాదేశిం
చినగురుని సురేశుఁ డరసి చింతగొనక యి
ట్లను "దేవ! యొక్కగను మె
చ్చని వార్త్తికరచన సేసి శ్రమపడు టేలా? 223

శా. గార్హస్థ్యంబున నుండి కర్మకలనాగాఢాభిమానుండనై
యర్హత్వంబును గంట యియ్యెడ నవద్యం బయ్యెనే? యేయతిన్
గర్హింపన్ గలనేని; సన్న్యసనమున్ గైకొంచు బ్రహ్మైక్య మ
భ్యర్హం బంచుఁ దలంపలేని గృహవ్యాపారినే దేవరా! 229

మ. శ్రుతి మర్మంబుల నెల్లవార్త్తికములన్ జొప్పింప నాకేలవి
శ్రుత మూ వేఱొక గ్రంథముఁ సలిపిమెచ్చున్ గాంచరాదో? యహం
కృతి మున్నె విడనాడి యీకృతికి నై యేలా యహంకార? ము
ద్ధతపాటచ్చరవృత్తి కీర్త్తి ననుసంధానించునే చెప్పుమా! 230

గీ. వేదమున లేమి సన్న్యాస మాదరింప
రా దనుమతంబు నాది యన్వాదు నమ్మ
రాది మనవాదములఁ బూనినట్టి ప్రతిన
లెఱుఁగరో వీర లవి శ్రుతిహితము గావా! 231

ఉ. వీరలు భిక్షమాణు లయి వేశ్మముఁ జేరుటఁ గాంచి మత్ప్రతీ
హారులు వారణఁ సలిపి రంచు సనుఁ యతిదూషకుండు గా
దూఱుట విందు; న ట్లయినఁ దోడన మీ కెటు భిక్షుకై నమ
స్కారము సేసి భిక్ష విధిసమ్మతమై తనరారఁ జేయుదున్? 2?2

ఆ. జితుఁడ నౌట సన్న్యసించితి నన మేల
యాత్మతత్త్వమెఱిఁగి యతివిరక్తి
సన్న్యసింతు వాదసంరంభ మెన్నంగఁ
దత్త్వనిర్ణయంబు దలఁచి కాదె. 233

మ. అవమానం బని యెంచఁ గాని యిటు లధ్యాత్మజ్ఞు లావీర లి
ట్టివిధిఁ న న్నెద నమ్మకుండుటకుఁ గంటిన్ దాప మీనాఁడు సా
ష్టవ మొప్పన్ రచియించి వార్త్తికము భాష్యవ్యాప్తిఁ గావించు స
త్కవి యీపద్మపదుండె కావుత భవత్సంకల్ప సంసిద్ధిగన్". 234

క. అని కేల నున్న గ్రంథం
బును గురువరు పాదపద్మముల దాఁపున నుం
చెను దన విరచించిన ద
త్యనఘము నైష్కర్మ్యసిద్ధి యనునద్దానిన్. 235

గీ. కాంచి చేకొంచు గురుఁడు నిష్కర్మతత్త్వ
విషయబోధప్రధానమై విపులయుక్తి
యగుచు నాద్యంతహృద్యపదానుగుంఫ
మగుమహాగ్రంథ మరసె నాద్యంతముగను. 236

క. అరసి ముదితాత్ముఁడై య
వ్వరకృతి శిష్యులకుఁ జూపె వారలకుం జే
కుఱెఁ బ్రత్యయ మిట్టివిబుధు
నరయము దత్త్వజ్ఞ నన్యు నని రేకముగాన్. 237

సీ. ఇంతటివైరాగ్య మెటు లెల్లఁ గల్గె నీ
కర్మనిర్మగ్నుఁ డక్కజము గాఁగ
నాపూర్వపక్షమ్ము లరయ గుండియ లావు
లింప విపక్షు లెల్గింప కుండ్రెడె
యాకృతాంతచ్ఛాయ కడలి నోరెండి మూ
ర్ఛిల్లరే పరమతస్థిరమనీషు
లాయర్థయుక్తి భావాధిక్యము నెఱుంగ
వశ మానొకో బృహస్పతికి నేని

గీ. యనుచు రచనాపటిష్ఠత యర్థగరిమ
భావగాంభీర్య మద్వైతభణితిఁ గాంచి
చిత్సుఖాదులు మదియందు సిగ్గు భయము
నచ్చెరువు నొంది గుసగుసలాడుకొనిరి. 238

ఉ. అంత సురేశ్వరుం డనె 'మహాత్మ! యిదంకృతిపూరణార్థమం
దింత యశంబొ విత్తమొ యొకించుక గౌరవమో లభించు నన్
స్వాంతమునన్ బ్రవర్తిల, నిజంబు జగద్ధితకృత్య మంచుఁ జిం
తింతుఁ ద్వదాజ్ఞ మీఱి గణనీయుఁడ నాదునె శిష్యకోటిలో. 239

గీ. ఆక్రమింపదు బాల్యమ్ము యౌవనస్థు
యౌవనము వృద్ధుఁ జేరరా దటులె మున్ను
దవిలి గృహి నైనఁ గలుగునే తత్స్వభావ
మరుగు నదుఁ డొందునే పూర్వమైన స్థితిని. 240

సీ. పూర్వమీమాంసాప్రభుండు కుమారిల
భట్టదేశికు నంత్యవాంఛ యనియు
నటుమీఁదఁ ద్రిజగ దేకాచార్యుఁడవు పరి
శీలించి నన్ను శాసింతు వనియు
నుభయులశుశ్రూష నోలి మతద్వయిఁ
గల లక్ష్యముల సిద్ధిఁ గంటి ననియు
సన్న్యాసధర్మనిష్ణాతుండనై లోప
మింత లేనటు చరియింతు ననియు

గీ. గురువుల ఋణంబు దీర్పఁ జేకుఱును సదవ
కాశ మనియును దలఁచి తత్క్లేశరచన
పూనుకొనునాకుఁ బ్రత్యూహములు ఘటిల్లె
నకట! నాదైవసంకల్ప మట్టి దేమొ! 241

గీ. నన్ను మాత్రిమ గృహి ననఁ జన్నె మున్ను
కానివా రెవ్వరయ్య మోక్షమును బంధ
మును మనంబె ఘటించుఁ గావున మనోవి
శుద్ధుఁ డౌనేని యగుత గేస్తుండొ యతియొ. 242

గీ. మున్ను గృహినై మహార్థసంపన్నముగ ర
చింతు నైయాయికాదివిశిష్టకృతుల
నిపుడు నామది భవదీయవిపులసేవఁ
దక్క నన్యంబు గావింపఁ దలఁపఁ బోదు. 243

మ. ప్రకటోజ్జీవనగా నొనర్చె వఁట యర్వాచీనదుర్వాదిగ
ర్వకరాళానలకీలలం బఱఁగ నద్వైతాఖ్యబద్ధాదరా
త్మక విద్వద్వరబుద్ధి సంస్థితము శ్రద్ధన్ వాక్సుధల్ చిల్కి; వే
నికి సాధ్యం బగునో యెఱుంగను నినున్ సేవించి యప్పిఁగఁగన్ 244

క. అని భాష్యమునకు గురునా
జ్ఞను గొంత రచించు వార్త్తికమును శపిం
చినగతి నపు డవ్వాల వై
చెను నిర్మముఁ డొంచు నాసుశీలుం డంతన్. 245

చ. అది తిలకించి భిక్షుజనతాగ్రణి భాష్యముపైని వార్త్తికం
బొదవదె యక్కటా యనుచు నుల్లమునం దుడుకెత్త ధీరుఁడై
యదియు వివేకనీరముల నార్చి, సురేశ్వరుఁ జేయఁ బంచె స
మ్మదమున వేదభాష్యముల మర్మము దెల్పెడు వార్త్తికద్వయిన్. 246

వ. అట్లు చేయం బంచి. 247

గీ. భావనిభమృదువాక్యసంపాదితార్థ
మాత్మపదధూతపూర్వపక్షానుగతము
యుక్తిసాధిత సిద్ధాంతయుతము తత్ప
దము కృతిని గాంచి మెచ్చి మోదమున ననియె. 248

సీ. వినవయ్యెకధన! నీ వనినదె సత్యం బగు
యాజుషశాఖ నాయది, తదంత
గతభాష్య మనిన నా కతిముదం బగుఁ గానఁ
దద్వార్త్తికము మదర్థము రచింపు
మఱి కాణ్వశాఖ నీయది- తదంతగతాస్మ
దియభాష్యమునకుం జేయు వృత్తి

సన్మార్గగాము లౌజనుల వర్తన మెన్నఁ
బరహితాచరణైకఫలము సూవె

గీ. యార్తిహారిగ నారెంట వార్తికమ్ము
సలిపి కార్తికచంద్రికాసదృశకీర్తిఁ
దనరుమా దుశ్శ్లోక్తిరోధంబు తొంటి
యట్ల కలుగదు నామాట నండఁ గొనుమ. 249

మ. అని శ్రీశంకరపూజ్యపాదుఁ డనఁగా నవ్విశ్వరూపుండు స
ద్వనచైతు్ౕరండు రచించె నాగమశిరోభాష్యద్వయీవార్తికం
బును, గుర్వాజ్ఞ యలంఘనీయ మని; సంపూరించి గ్రంథ మ్మపా
యనముం బట్టెను దేశికాగ్రణికి సీమాతీత మహాభక్తితోన్. 250

గీ. వక్కణించె సనందనుం డొక్కటీక
భాష్యమున కొజ్జ యానతి వడసి, యదియుఁ
బంచపాదిక యనఁ బూర్వభాగ మమర
వృత్తి యన నుత్తరార్ధ మింపెనయఁ దనరె. 251

ఉ. ఆరసి వ్యాససూత్రనివహార్థవివేచనమున్ స్వకీర్తిడిం
డీరసమృద్ధికిన్ విజయడిండిమనామక మైన వ్యాఖ్య గం
భీరతరోక్తియుక్తి పరిమృష్టముగా విరచించి యొజ్జ కం
భోరుహపాదుఁ డిచ్చెను బ్రమోదము మీఱ నుపాయనంబుగాన్.

క. తదనంతరమ్ము గురుఁడును
మది గ్రహసంచార మెంచి మంతనమునఁ దన్
గదిసిన సురేశ్వరున కనె
సదయాంతఃకరణుఁ డగుచు సాంత్వనఫణితిన్. 253

సీ. ప్రారిప్సితగ్రంథ మంతరాయము గాంచు
మంగళాచరణసామర్థ్య మెడయ
నామంగళంబు ననంతజన్మార్జిత
తంబై యిదానీంతనంబుఁ బ్రోచు
నెవ్వాఁడు బహుజన్మకృతమంగళుఁడో వాఁడు
సంసిద్ధిఁ గను నేఁడు సలుపకున్న
నద్యతనప్రాక్తనానందమంగళం
డయ్యె సజ్జను లున్న రనినఁ జెడును

గీ. నీకృతికి నేఁడు విఘ్నమ్ము సోకు, టెన్నఁ
జాల దనుకొందు మంగళాచరణబలము
ఉల్లమున నున్న రనుచు నీ వుపతపింప
నెటు సనందనుఁ డింక గ ట్టెక్కఁగలఁడో! 254

వ. అని యించుకతడవు కన్నులు మూసి ధ్యానించి నిట్టూర్పు పుచ్చి
యిట్లను. 255

గీ. ఈసనందనకృతటీక నేనుపాద
ములె వెలయు, నూత్రియుగమె యందుల రహించు
నీవు ప్రారబ్ధవశమున దేవగురుఁడ
వై పొడమి చేయుదువు భాష్యమందుఁ డీక. 256

శా. ఆకల్పం బలరారుఁగాక భవదీయం బంచు దీవించి భి
క్షాకాధీశుఁడు తోటకాదుల మహాగ్రంథమ్ము లద్వైత దీ
క్షాకంబుల్ విరచింపఁ బన్పఁగ ననేకగ్రంథముల్ బ్రహ్మ వి
ద్యాకల్పంబులుగా రచించి రల విద్యార్థుల్ యథాశక్తిగన్. 257

## ఆ శ్వా సాం త ము

శా. కస్తూరీ హిమవాలుకా ఘుసృణ సౌగంధ్యాప్త సీతాస్వయం
హస్తప్రాపిత వీటికారసన జాతానందపీప్వాయితా
ధస్తాదూర్ధ్వగసారసాబ్జమధుగంధగ్రాసమందానిలో
పాస్తి ప్రస్ఫుటమోదకారణదయోధ్యాసౌధమధ్యస్థితీ. 258

క. నిధ్యాసమాత్రపావిత
మర్త్యోటవివర్తిశబరమహిళా! మహిచ
క్రాద్యత్నా! వేంకటరా
యాధ్యాత్మారామ! జనకజాత్మాధీశా! 259

స్వాగతము. శర్వరీట్చకల సన్నిభగండా!
యుర్వరోరుభరయుగ్భుజదండా!
శర్వచాపబలచండిమఖండా!
గర్వితాహితవిఖండనచండా! 260

ఇది శ్రీగురుకరుణాసమాసాదితకవిత్వ
వెంపరాల సూర్యనారాయణ నామధేయప్రణీతంబైన
శ ం క ర వి జ య ం బు న
ష ష్ఠా శ్వా స ము.



శ్రీ గురుమూర్తయే నమః

# శంకరవిజయము

## సప్తమాశ్వాసము




మత్కౌసల్యాగ
ర్భామలశుక్త్యుదితముక్తికా! వేంకటరా
యామాత్యజప్యనామ! ని
రామిషతాపసమనోభిరామా! రామా!

వ. దేవా! అవధరింపుము.

ఆ. అవుల నొక్కదినమునందుఁ బద్మపదుండు
తీర్థయాత్ర సేయుదివుట నొంది
యభ్యనుజ్ఞ వేఁడ నాచార్యుఁ డీరీతి
ననియె యాత్ర మాన్పు నాశయమున. 1

సీ. సత్క్షేత్రవాస మొజ్జలచెంత నుంతటయ,
యనఘతీర్థము తదీయాంఘ్రిజలమ
తదుపదేశకృతాత్మదర్శనం బఖిలదై
వతదర్శనమ్ము తద్వాక్కు బుక్కు
శుశ్రూషమాణశిష్యున కొజ్జచెంతఁ జౌ
ర్యము గూడ దితరత్ర యరుగఁ గూడ
దమితమార్గాయాస మందరా దందిన
నిద్రచే స్వధ్యాననిష్ఠ చెడును

గీ. సన్న్యసనము విద్వత్సన్న్యసన మటంచు
వివిదిషాసన్న్యసన మంచు ద్వివిధ, ముభయ
మందుఁ దత్త్వంపదార్థైక్య మాప్య మగుట
గమ్యము త్వమర్థమే కాని కా దితరము. 2

క. అలవడు నొకచో సలిలము
లలవడ వొకచోటఁ; నొకట నమరును శయ్యా
స్థల మొకట నమర దిటు వాః
స్థలలిప్సం బథికుఁ డేమి సౌఖ్యము వడయున్. 3

గీ. జ్వర మతీసార మాదియౌ వ్యాధు లలమ
నేయుపాయంబు గానరా కేఁగుటకును
నాఁగుటకు సాధ్యపడ కల్లలాడుపాంథుఁ
డట్టితఱిఁ బాసి చనును సహాయుఁడేని. 4

ఆ. అధ్వగునకు నబ్బ వహారాది స్నానశౌ
చాదికము సమాధు లమరవ్రాఁజ;
లాదవ రాప్తమిత్రు, లదన నన్నము కాదు
మొగము వాఁచు శాకమునకుఁ గూడ. 5

చ. అనుటయు శిష్యుఁ డి ట్లను మహాత్మ! భవత్కథితంబు కా దనం
జనునె గురూపకంఠమున సంస్థితిఁ గల్గుసుఖంబు గల్గ దెం
దు నయిన దేశపర్యటన దుస్త్యజవాంఛ బలాత్కరించుచుం
డెను బరదేశయాత్రల గణింతునె కష్టము లవ్వి క్రొత్తలే? 6

గీ. అష్టకష్టమ్ములందు హెచ్చైనకష్ట
మరయఁ బరదేశయాత్ర గృహస్థతతికి
నేఁ బరివ్రాజకుఁడనయ్యె నెమ్మనమునఁ
దలఁతునే ద్వంద్వజన్యబాధాలవంబు. 7

గీ. ఆత్మ కంటవు కష్టసుఖాదికమ్ము
కలుగుఁ గర్మానుసారము కాయమునకుఁ
గర్మమో కాలపరిపాటిఁ గలుగుఁ గాల
గతికి దేశవిభేదమ్ము గలుగ దగ్రజు. 8

ఉ. కావునఁ బో ననుజ్ఞ నొసఁగ న్మిముఁ గోరెదఁ బ్రేమతో డిమీ
దీవన నాకుఁ దోడయి విదేశమునన్ దొలఁగించుఁ గ్లేశముల్
గావలె నన్న దుర్ఘటసుఖంబులనేని ఘటించు ధర్మదీ
క్షావిహితక్రియావనవిచక్షణమై ననుఁ జేయుధన్యుఁగన్. 9

క. అనుచు గురూక్తనిషేధము
లను బ్రతివచనములచే మలంపఁగ గురుఁడున్
మనమున నలరుచు ననె నీ
మనసుదఱిఁగియ మరయఁ దత్క్రమమున నుడివితిన్. 10

ఆ. పిన్నవయసువాఁడ వెన్నియొ వెత లబ్బ
నొంటిగా భ్రమించుచుండు వేళ
నమ్మరాదు జనుల నమ్మకపోవరా
దన్యదేశగామి యగు నరుండు. 11

సీ. విహితకృత్యమ్ము లన్వాహము పాల్యము లవి
స్మర్తవ్య మధ్యాత్మతత్త్వచింత
విదితసంవిదుల సౌహార్దము సంపాద్యము
శ్రోతవ్య మాత్మైక్యరూఢరీతి
యనఘచరితుల్ త్రాయతు లభిగమ్యులు
సహ్యమ్ము దైహికశ్రాంతిభార
మాపదఁ హితపదం బాశ్రయణీయ, ము
త్సర్జనీయమ్ము మితంపచాళి

గీ. విమతు లమతులు కుమతులు వెలయుచోట్ల
త్యాజ్యములు సూవె యేవేళలందు నీకు
వితత మొనరించు చద్వైతమతము జగతి
వివిధపుణ్యస్థలములు సేవించి రమ్ము. 12

క. అను గురునివాగమృతఝర
మును గ్రోలి పరిహృష్టహృదయమునఁ జనె దేశా
టనమునకుఁ బద్మపాదుఁడు
చనె గురుఁడును శృంగగిరికి సహశిష్యుండై. 13

చ. అచట సురేశ్వరాదిమహితాత్ములు శిష్యులు గొల్వ శారదా
పచితినిమగ్నచిత్తుఁ డయి భాసిలుచుండఁగ నొక్కనాఁడు మా
తృచరణసేవలేవడి స్మృతిం దవులన్ బుణ మీఁగియుఁ బుణో
పచయమునందు బద్ధుఁ డగుభాతిఁ గలంగి యనున్ స్వశిష్యులన్. 14

శంకరుఁడు తల్లిసమీపమునకు యోగశక్తి నరుగుట

మ. అది యేమో పరదేవతార్చనము సేయన్ నేఁడు గూర్చుండ నె
మ్మది చే వెట్టి కలంచిన ట్లయిన; దస్మన్మాత ప్రాణావసా
నదశన్ నన్ను స్మరింపఁ బోలుఁ తగు జ్ఞానప్రక్రియన్ ముక్తిసం
పద చేకూర్పఁగఁ బోదుఁ గావవలదే ప్రాగ్దత్తవాగ్దానమున్. 15

ఆ. సన్న్యసించుతఱిని జనయిత్రి వేఁడఁ బ్రా
ణావసానకాలమందు వచ్చి
నినుఁ దరింపఁజేయుఁదు నటంటిఁ దఱియైన
యటుల యోగశక్తి నది స్ఫురించె. 16

క. అని యవలంబిత గగనా
యనుఁడై క్షణమంద జననియంతికమునకున్
జనియె నసాధ్య మ్మని క
ల్గునె యెయ్యెడ యోగసాధకున కెన్నంగన్. 17

క. చని యాతుర యగుమాతను
గని తత్పదములకు మ్రొక్కి గాంచి, జలదమున్

గను ఘన్మతప్పఁ డటు ల
వ్వనిత తనూతాప మపుడ వాయఁగఁదల్చెన్. 18

గీ. తా నసంగుండ యయ్యుఁ జిత్తమునఁ గరఁగి
యమితమోహాంధతమసాపహార్త యతఁడు
తల్లి! యిదె వచ్చినాఁడ, సంతాప ముడుగు
నిపుడ యొడఁగూర్తు నీకోర్కె యేమి యనుడు. 19

క. చిరమున కనామయుని సుతు
నరయుట హర్షించి మంద మగు స్వరమున ని
త్తరి భాగ్యమ్మునఁ గుశలిని
నరసితి నిను నింతకంటె నభిమత మున్నే. 20

ఆ. నేఁడు వేగుఁబోక నిన్నుఁ దలంచితిఁ
బ్రాణ మింక దేహమందు నిలువ
దనుభయంబు నూని 'యన్న యెచ్చో నున్న
వాఁడొ యెపుడు వచ్చువాఁడొ' యనుచు. 21

ఉ. పుత్రి! జరాతిశీర్ణ మగుమూర్తి భరింపఁగఁజాల, దీనికిన్
బాత్రితఁ గల్గ శాస్త్రవిధిపద్ధతి సంస్కృతిసేసి భవ్యచా
రిత్రక! పుణ్యలోకచరవృత్తి నొసంగఁ గదన్న! యన్నఁ దా
పత్రియహారకుం డతఁ డభంగవిమోక్ష మొసంగుభావనన్. 22

శంకరుఁడు తల్లికిఁ దత్త్వోపదేశము సేయుట

చ. అమితము, సద్వితీయము, మహాసుఖరూప, మపాస్తమాయ, మ
చ్ఛమహిమ, మప్రమేయమును స్వప్రభమున్ విగతామయంబు జ
న్మమృతిజరాదిదూరము సనాతన మాపరమాత్మతత్త్వ మా
యమ కుపదేశమిచ్చె సనకాదివినుత్యుఁ డతండు భక్తిమై. 23

గీ. అపుడు జనయిత్రి యను సౌమ్య యగుణ మాత్మ
నాకు రుచియింప దీక్ష సగుణమ్ము రమ్య
మైన దైవతమును దెల్పు మకట! బుద్ధి
కంద దేక మనాకార మగుపరాత్మ. 24

ఆ. అనుచుఁ దల్లి యన దయాళుఁ డాయతి భుజం
గప్రయాతవృత్త కవనరీతి
భక్తి శివు నుతింప భవుఁడు ప్రసన్నుఁడై
యనిపె నాత్మదూతలను దురితంబ. 25

ఉ. శూలపినాకపాణు లగుచున్ జనుదెంచిన ఫాలనేత్రు దూ
తాళిని గన్నులారఁ గని యాయమ వీరలవెంటఁ బోవఁగాఁ
జాల నటంచుఁ బల్కుటయు శాంకరదూతలుఁ బోవ వేఁడి స
చ్ఛీలుఁడు శంకరుండు వినుతించె రమాధవు నాదరంబునన్. 26

వ. అంత. 27

సీ. కమలామృదూరుభాగప్రసారితపాద
సరసీజయుగళు నాజానుబాహు
నీళామహీకరాలోలచామరవీజి
తుని వినతాసుతస్తూయమాను
దేహభృదస్త్రాధి దేవతాపంచకా
ర్చితుఁ దమాలాసితద్యుతిశరీరు
నుదయదుష్ణమయూఖసదృశరత్నకిరీటు
నుత్ఫుల్లపుండరీకోపమాక్షు

గీ. భుజగరాజన్యభోగతల్పుని ముకుందు
సుతుఁడు వినుతింప నారూపె మతి ధరించి
పరమయోగీంద్రుకరణి సంసరణ మెడయఁ
దన్మయత నొంది యార్యాంబ తనువు దొఱఁగె. 28

చ. అంత శరత్కలానిధికరామలదీప్తి చలద్ధ్వజాఢ్యమున్
గాంతము నౌవిమానమును గైకొని వచ్చిన విష్ణుదూతలన్
శాంతమనోజ్ఞవేషులఁ బ్రసన్నులఁ గాంచి సుతున్ నుతించు న
క్కాంత విమానమం దునిచి గ్రక్కునఁ దోడ్కొని వార లేగుచో.

గీ. అర్చి, రహ, రాద్యపక్షమ్ము లతికరించి
నుత్తరాయన మబ్దమ్ము లుత్తరించి
పవన రవి విధు తటి దబ్ధిప హరి విధి జ
గంబులను దాఁటి పరమపదంబు చేరె. 30

శంకరుఁడు స్వయముగఁ దల్లికి నుత్తరక్రియలు నెఱవేర్చుట

ఉ. ఆయెడ గేహముల్ పొలము లర్థములున్ దన వెల్లఁ గొన్నగో
త్రీయులఁ బిల్చి యీయమ మృతిం గనె నుత్తరకర్మ మీరు శా
స్త్రీయముగా నొనర్పుఁ డనఁ జెంతను బుత్రుఁడ వుండి మమ్ములన్
జేయుఁ డటందు వేల తగునే యిటు పల్కఁగ నీకు శంకరా! 31

గీ. నీయభావమ్మునం దేమి చేయువార
మాత్మజుఁడు చెంత నుండియు నౌర్ధ్వదైహి
కక్రియలు తల్లి కొనరింప జ్ఞాతిజనుల
నిటు నియోగించు టాలింప మెచట నెపుడు. 32

చ. అనుటయు సంయమీంద్రుఁడనునక్కటయింతటిమాంద్యమెందునం
డునె చరమాశ్రమస్థితు నన్నుఁ గృహీధర్మముఁ బూను మందురే
జనని యటంచు వచ్చితినె చక్క వినుండు ముముక్షు లీమొ, తా
వునఁ దదభీష్టమున్ నెఱపుపూన్కిన వత్తు నొనర్తు నిష్టమున్. 33

క. పూర్వాశ్రమసంబంధము
సర్వము తెగె నాకు, మీరు జ్ఞాతుల చేత

త్సర్వస్వ మనుభవించుచు
గర్వంబున శాస్త్రపథము కాదనఁ దగునే. 34

మ. మమతన్ నే నరుదెంచినాఁడ ననుచున్ భావింపఁ బాపంబు ని
ర్మమతన్ గర్మము లుజ్జగించి శ్రుతిధర్మం బోముచున్ జ్ఞానవ
ర్త్మమునన్ సంసృతిభీతు లౌజనుల సంరక్షింప దీక్షించుస
త్క్రమములన్ సంయములన్ గృహస్థునటుపల్కన్ నాల్కయెట్లాడెనో

శా. ధర్మాధర్మవివేచనన్ మఱచి యర్థంబే ప్రధానంబుగా
దుర్మోహంబున గ్రుంగి శాస్త్రవిదులన్ ద్రోపాడి పాపంబునన్
నిర్మగ్నాత్ములు గాఁ దలంతురె? విధానిష్ణాతు లాపెద్ద లీ
మర్మంబున్ వివరింత్రు పోయి యడుగఁ భావ్యంబు మీకియ్యెడన్

ఆ. గురువు నౌదుఁ గాని కొమరుండఁ గా నీపె
కేను సంన్యసించి యేఁగి యుంట
నిదిగో చనుచు నుంటి నీకర్మలోపంబు
పఱచు మిమ్ముఁ గంఠపాశ మగుచు. 37

సీ. శ్రుతి సర్వసంగపరిత్యాగినై యేఁగు
నా కింతకలుషంబు సోఁకఁ బోదు
నను సంన్యసించుపుత్త్రుని గన్నయీయామె కే
కర్మలోపములు మోక్షమ్ము చెఱుప
మీకర్మలోపంబు మీకులంబులు తర
తరములు చెఱుపక సురిఁగిపోవ
దర్థాశ విహితకర్మానుష్ఠితిఁ దొఱఁగు
ఖలులఁ బూతుల శ్రుతుల్ సలుపలేవు

గీ. శాస్త్ర మాచారముఁ దలంచి సత్పథమునఁ
బొందు పోకున్నఁ గులహాని పుట్టితీఱుఁ

గోరళమున కకీర్తి చేకూఱు దూర
మరయుఁడీ తప్పుత్రోవను మఱలుఁ డీవు. 38

క. అని ధర్మము లెంతగఁ జె
ప్పిన జ్ఞాతిచయంబు పెడచెవిని బెట్టిరి కా
ని నిదానింపర యతిపతి
పను పొనరింపకయ యిట్లు పలికిరి పెలుచన్. 39

సీ. పితృకర్మ మొనరింపఁ బిఱుతివిసిరె యతీ
శ్వరులు వారికి లేవె శాస్త్రవిధులు
యతి నంటి వవులఁ బ్రాయశ్చిత్త మొనరించు
కొనఁదగు నిది త్రోసి చనఁగఁ దగద
యాత్మజుం డెట్టివాఁడో గాక పితృపార
లౌకికవిధులు సల్పంగఁ గర్త
తదభావమునఁ గాక దరి కేఁగ నన్యుల
కధికార మిసుమంత యైన సున్న

గీ. విహితకర్మము మానుసీవిధమున నవి
హిత మొనర్చిన మేము నిష్కృతివిరహిత
మైన ప్రత్యవాయమ్మున కగ్గ మాదు
మిందు నందును గతులు లేకుందు మకట. 40

ఆ. ఇది గృహస్థకృత్య మేఁ; మన్నయ ట్లీవు
సేయవలయు నొండు సెప్పఁదగదు
కా దటందువేని బోదుము నీయిచ్చఁ
జేసికొనుము మాకుఁ జెప్ప కనుచు. 41

క. ఆపలుకులకుం గనలుచు
నీపై శ్రుతికర్మబాహ్యు లీ రయ్యెద రం

బాపాపనరితులకు యతి
శాప మొసఁగ యతిని దిట్టి చని రెట కేనిన్. 42

క. అది ధర్మ మిది యధర్మం
బది కార్య మ్మిది యకార్య మని తోఁపద దు
ర్మదులమదికి భగవంతుం
డెదురఁ బడి నిజమ్ము దెలుపనీ యెటు గానీ. 43

శా. శాపం బిచ్చి యతీంద్రుఁ డాత్మజననీసంతారకుం డయ్యు సం
తాపం బందుచు 'పీడ పోఁ దగ దనాథప్రేతసంస్కారరూ
పాపద్ధర్మ మి'దంచు మాతృశవదాహార్థంబు వైశ్వానరం
బాపల్లెం గలవారి వేఁడ నిడ రై రాపుల్కన మ్మెవ్వరున్. 44

ఉ. తా నఖిలజ్ఞుఁడే యగుత ధర్మము సెప్పుమమున్ శపించి య
ద్దానికె సిద్ధమయ్యె నె యధర్మము గాదొకొ తా నొనర్ప వై
శ్వానర మిం డటంచు మము శప్తుల నేఁ డెటు వేఁడ వచ్చె? ని
ప్పైన నొసంగ మారసెద మాశవ మొక్కఁ డెటుల్ దహించునో. 45

క. అనువార కాని యచటికిఁ
జనువా రనలమ్ము నొసఁగి సాయపడఁ దలం
చినవారు లెక్క కొకరును
గనరా రతిచిత్రి మూరఁగల యెవ్వారున్. 46

మ. అటు లింటింటికిఁ బోయి నిప్పడిగి వ్యర్థాయాసుఁడై శంకరుం
డట నున్నట్టి నిజాన్వవాయుల యకృత్యం బెంచి కోపించి యం
తటఁ దన్మాతృపసవ్యదోర్మథనమున్ గావించి దీప్తాగ్ని న
ప్పటఁ బుట్టించి దహించెఁ దత్కుణపమున్ వాసోపకంఠస్థలిన్. 47

క. దహియించి యాదురాత్ముల
బహుశాఖాంకారఫంకపటల మిగుర న

మ్మహితుఁడు వా రందఱు శ్రుతి
బహిష్కృతులుగా- శపించి వదలక వారిన్. 48

ఆ. యతులు మీగృహమ్ములందు భిక్ష యొనర్ప
రేక గృహోపకరమే స్మశాన
మగును మీ కటంచు నతిఘోరశాపమ్ము
నిడియె నీట నగ్గి వోడమినట్లు. 49

క. అదిమొద లాదేశస్థులు
చదువరు శ్రుతి, యతులు భిక్ష సలుపర తద్గే
హ్యాదవసితముల, స్మశానము
సదనాంతికభువియె గాఁగ జసగును నేఁడున్. 50

చ. అకట మహానుభావుల యెడాటమునన్ బచరించుబుద్ధిపూ
ర్వక మపరాధ మేరికి శుభంబు ఘటించును? శాంతుఁ డంచు మి
న్నక సుజనుల్ వ్యథాకులుఁ బొనర్పఁ బ్రమాదము; చందనద్రు శా
ఖక యని రాపువెట్టఁ బటుకీలలతో ననలంబు పుట్టదే? 51

మ. తిలకింపన్ యతిమౌళి చేసిన దశాస్త్రీయంబు గా నున్నఁ గే
వలధర్మావనబుద్ధిఁ జేయుటను నాపద్ధర్మ మౌఁ దాదృశో
జ్వలతేజస్కులు దూల్చి వై చెద రవశ్యంభావ్యధర్మక్రియా
కలనాయాతము ప్రత్యవాయముఁ దహోగాఢప్రభావంబునన్. 52

గీ. అద్ది ధర్మవ్యతిక్రమంబట్లు తోఁచు
నరయ సాహస మౌ నది యైన; నమ్మ
హాత్ము లొనరించి రని యన్యు లాచరింప
రాదు మోస మౌ నవరదౌర్బల్యమునను. 53

క. లోకావనార్థజన్ముల
లోకాతీతప్రవృత్తి లోకుల కెప్పుడున్

స్వీకార్యము కా; దిఁకఁ ద
ద్వ్యాకుల గ్రాహ్యమ్ము లంచు వాకొనును స్మృతుల్. 54

చ. ఇటు జననిన్ మునీంద్రసమభీప్సితముక్తి వితమస్కమున్ సుఖో
త్కటముఁ బునర్జనుర్విరహితం బగుసద్గతిఁ జేర్చి యాతఁ డం
తట ధరఁ బామకొన్నవిమతంబు లడంపఁగ దీక్షఁబూని ప
ర్యటనవిలంబమున్ సలిపె నబ్జపదాగమనంబు గోరుచున్. 55

పద్మపాదుఁడు దక్షిణదిగ్యాత్రి నొనర్చుట

ఆ. మున్ను గురుననుజ్ఞఁ జన్నట్టియప్పద్మ
పదుఁ డుదీచ్యతీర్థపటలిఁ గొల్చి
చనె నవాచిదిశకు సకలామయఘ్నకు
నెందుఁ గలశజన్ముఁ డెపుడు నుండు. 56

చ. కనె సుభగోరగాభరణక్రమతనున్ బృథులింగసన్నిధా
నుని గరుణారసాప్లుతమనోయుత యానుమఁ గూడి మౌళిఁ జం
ద్రనికళఁ దాల్చి సమ్మదఘనుం డగువానిని గాళహస్తినా
థుని సురపాదిదైవతనుతున్ శివు నయ్యతి గాఢభక్తిమై. 57

శా. స్నానం బాడి యతండు కాంచనముఖి స్వచ్ఛాంబుపూరంబునం
దానంత్యంబున భావపుష్పనికరం బర్పించి యర్గించె వా
క్ఛ్రీనృత్యమ్మున భక్తిపూర ముబుకన్ శ్రీకాళహస్తీశ్వరున్
జ్ఞానానందమయప్రదీపకళికన్ జ్ఞానప్రసూనాంబికన్. 58

గీ. కాళహస్తీశు ననుమతిఁ గాంచి, కాంచి
కరిగెను బవిత్ర మగుక్షేత్ర మగుటఁ దెలిసి
భవమహోదధి సంతితీర్షువుల కదియు
తరణసాధన మనుచుఁ బెద్దలు వచింత్రు. 59

గీ. ఆత్మభాగ్యాతిశీతిచే నచటివిశ్వ
పతిని నేకామ్రనాథుని నతులఁ గొలిచి
యంతకాంతకుఁ డగుసుమ్రిహార్ద మరయ
నన గృహాంతర్గత యగుకామాక్షిఁ దెలిచె. 60

వ మఱియు నాతిదూరమున నలరారు పురాణపురుషుఁ గరుణారసస్నిగ్ధస్వాంతు ననాదిమధ్యాంతు లక్ష్మీకాంతుఁ గల్లాలేశుఁ గాంచి నుతించి, యచటు గదలి శుచిస్మితవదనమునఁ బార్వతీరూపపరిణత యగునాదిమప్రకృతికిమాత్రము గోచరింప సదా నృత్యము సలుపు సదాశివునివాస మగుపుండరీకపురమున కరిగి, నిర్మలస్వాంతంబును దివ్యచక్షువునై మునిజనంబు తన తాండవము చూచి జన్మమృత్యుజరాభయ మపనయించి తరింప నేత్రమనోవినోదకారకుం డగు పరమేశ్వరు భజించి శివభక్తులం గని తత్తీర్థమహాత్మ్య నడుగ నందొకఁ డిట్లు తత్తీర్థము నెఱిఁగించె. 61

ఉ. భక్తుల కోర్కెమై శివుఁడు భావమునన్ స్మరియింప గంగ యా
సక్తిని జెంతఁ బాఱుటఁ బ్రజల్ శివగంగ యనంగఁ దీర్థమై
ముక్తి శివాజ్ఞచే నొసఁగు మున్నినమాత్ర- నఘంబు వాసి స
ద్భక్తులు గాంతు రీశ్వరునితాండవ మంచును గొంద ఱుత్తముల్.

క. కొందఱు నాట్యంబున శ్రమ
మందిన శివుఁ దేర్ప శివయె యమరాపగ రూ
పొంది ప్రవహించుటన యిది
పొందెను 'శివగంగ' నామము నటండ్రెలమిన్. 63

చ. నట దభవోత్తమాంగక పినద్ధ చలాచల జాటజూటసం
పుటగళితాభ్రగాంగజలముల్ ప్రణటత్తటసద్ధనిర్ఝరీ
త్రుటితత పతత్కణంబు లయి తోడన పార్శ్వమునుండి జాఱి పా
ఱుట శివగంగ నాఁగఁ దనరున్ దదభిఖ్య యటండ్రు పండితుల్. 64

చ. అనితరసాధ్యభక్తి వివశాత్మకుఁడై నరుఁడేఁగి గంగలోఁ
మునుకలు వెట్టివెట్టి మఱి పుంగవకేతను పాదపద్మముల్
కనుకలి ముట్టిముట్టి హృదిఁ గ్రిన్నన శోధన చేసిచేసి తా
ననవరతంబు గాంచఁగలఁ డంగజసంహరు దివ్యనాట్యమున్. 65

క. శివగంగ మునింగి యుమా
ధవుసిన్ గనుగొన్నఁ నరు నుదారసుకృతవై
భవము వివరింప దక్షుఁడు
భవుఁ డొక్కం డగునుగాక పరు లర్హు లొకో! ౬6

గీ. అన విని పయోజపదుఁడు జితాత్ముఁ డభవ
యోజితాత్ముఁడై సమ్మదం బూని తీర్థ
మందు మజ్జన మొనరించి యఖిలలోక
భర్త యగుశంభుపదముల వ్రాలి మ్రొక్కె. 67

ఆ. అచటు వాసి దశరథాత్మజకృతసేతు
దర్శనార్థ మరుఁగఁ దలఁచి యయ్య
నుత్తముఁడు మునీంద్రుఁ డొయ్యనఁ జనువాఁడు
సరణిఁ గనెఁ గవేరజాస్రవంతి. 68

క. క్షీరోదవాసరసికుఁడు
వారిజనాభాదినామవర్ణితుఁ డగునా
హైరణ్యచేలునకుఁ గా
వేరిపులినసీమ నుంట వేడ్కయఁట మదిన్. 69

గీ. సహ్యపర్వతకన్యాప్రసన్నతరప
యోభిషిక్తముల్ భగవత్పదాబ్జములు ద
లంచి బహుశిష్యగణము సేవించుచుండ
వెడలె నభినుతిస్థలి వేగఁ జేర. 70

పద్మపాదుఁడు మేనమామ యిల్లు సేరుట

క. పోవుచు మధ్యేమార్గ
మ్మావిమలుఁడు మాతులునిగృహమునకు బహుశి
ష్యావృతుఁడై చేరుటకు సు
ధీవరుఁ డగుమేనమామ దేలె ముదమ్మున్. 71

వ. అంత నయ్యెడ నున్నసుహృద్బంధుగణంబు లప్పద్మపాదుఁ జూడ
గుములుగట్టి యొక్కపటి వచ్చిరంత. 72

ఉ. వచ్చినవారిలో నొకఁ డవారితసమ్మదజాశ్రు వయ్యె, వా
విచ్చి యొకండు గోల్పడె, నవేలముదం బొకఁ డండె, నొక్కఁ డ
త్యచ్ఛముగా హసించెఁ బ్రమదోన్నతి నొక్కఁడు ప్రాక్చరిత్ర వా
క్రుచ్చెమితోక్తి; మొక్కె నొకరుండనుడుల్ దిగమ్రింగి వైచుచున్.

చ. ప్రిమదము మీఱ వానిఁ గని బాంధవు లిట్లని రార్య! యెంతకా
లమునకుఁ గాన వచ్చి? తఖిలం బగుబంధుత హార్దపూర్ణచి
త్తములను గోరు నీదు శుభదర్శనభాగ్యము నొందఁ, నేమి పా
పమొ యొకమాఱునేనిఁ గనుపట్టవు చుట్టఱికంబు వోయెనే. 74

క. కలుగరు సుతులు సఖులు బం
ధులు యతికిన్ రాజబాధ తోఁప దెపుడు చో
రులవలనిభీతి పొడమదు
తలఁప యతిత్వము కృతార్థతామూలము సూ. 75

గీ. సుమఫలాభ్యంచితంబుఁ బ్రాంశువు సశాఖ
కోపశాఖాక మగుశాఖి నుర్విజనులు
పీడ వెట్టెడుగతి ధనాన్వితు దరిద్రు
లండఁ జేరి పీడించెద రనుదినంబు. 76

గీ. కాదు నిద్దుర, లేదు శర్మము కుటుంబ
రక్షణవిలుప్తచిత్తు లౌప్రజల కింక
దేవతాభ్యర్హణం బేడఁ? దీర్థయాత్ర
యేడ? నర్హాన్నిషేవణం బేడఁ దలఁప. 77

ఆ. నీవు సన్న్యసించునావార్త వింటిమి
తెలుప నొక్కవిప్రకులుఁడు తొల్లి
యెంతకాల మైన నీవు రా విపుడు తీ
ర్థముల కనుచు వత్తు దైవవశత. 78

సీ. సౌఖ్యమ్ము నొసఁగువృక్షముల సమాశ్రయిం
చియు వానివిడుచు విష్కిరములట్లు
పరక్లప్త మఠ సురావసథము లాశ్రయిం
చియు యతి వానిఁ ద్యజించి యేఁగు
సుమముల వ్రాలి సారము సంగ్రహించి భృం
గములు తద్రస మానుకరణి వెలయ
నిల్లిల్లు దిరిగి యోయిరము భిక్షించి త
త్సార మాని తపస్వి సౌఖ్య మొందు

గీ. ఘనవిరాగోదితాత్మావగతియె భార్య
తనువె భవనంబు మఱి సంయతంబె సుఖము
ధృతవిరాగులు శిష్యులే సుతులు గాఁగ
నలరుయతులకు నర్థనీయంబు గలదె. 79

ఉ. దారపరిగ్రహార్థము సదా మనుజుం డొనరించి యత్నమున్
దార లభింపఁ బుత్త్రిలఁ గనన్ మదిఁ గోరెడి, నిల్లు గోర్కెఁన్
సారెకుఁ బర్వులెత్తి కనఁజాలఁ డొకింత ఫలంబు ధాత్రిఁ జే
కూరు నొకో సమాప్తి యని కోర్కుల కారయ నెన్నఁ డేనియున్. 80

గీ. కోపకోన్నట్టికోర్కె చేకూఱ దేని
యమితదుఃఖంబు గను నరుం డభిలషితము
తొలుఁగ నేరఁడు కామతత్పరున కెందు
వెతలె కాన ధరింప నా మతి విరక్తి. 81

ఆ. అనఘ! చిత్తశుద్ధి యగు మూలము విరక్తి
కదియ మూల మగు మహన్నిషేవ
కంద్రు కానఁ దిరుగుచుంద్రు భగవద్భృత్యు
లుర్వి నల్దిశలఁ బరోపకృతిగ. 82

క. అజ్ఞాతగోత్రులై బ్ర
హ్మజ్ఞానుల యయ్యు జనులయట్లు కనఁబడు మన్
బ్రాజ్ఞులు ప్రాణ్యనుకంపా
భిజ్ఞు లయి చరింత్రు విషయవిముఖత వెలయన్. 83

క. చరియింత్రు లోకసంగ్రహ
పరులై తీర్థములు శుద్ధభావులు మహితుల్
దురితవిదూరులు వారలు
కరమున సోఁకిన జలంబె కనఁ దీర్థంబౌ. 84

గీ. నీదు దర్శన మనుపమామోద మొసఁగె
నుండు కతిచిద్దినంబు లోపండిత! యిట
నేఁగఁగల వంచు నేష్య ద్వియోగ చకితు
లగుచు బంధువు లిప్పుడే వగచుచుండ్రి. 85

సీ. నాట్యమందిర మనంత క్లేశములకు సా
హసకృత్యముల కెల్ల నాశ్రయంబు
ప్రాసాదరాజంబు పైశున్యమున కస
త్యాలాపకోటికి నాలయంబు

హింసావిశేషాతి మాంసలమ్ము హిరణ్య
బహుళతృష్ణా లతోపఘ్నయష్టి
ఖలజనోరగ సముత్కర వాములూరువు
జ్ఞానవంతులకు స్మశానభూమి

గీ. యగుగృహం బాశ్రయించుకొన్నట్టిక్రూర
చరితులము మేము నీసాంద్రకరుణఁ జిలికి,
శుద్ధుల నొనర్చి యతిచంద్ర! యుద్ధరింప
కున్న నోయన్న! యెన్న మా కున్నె దిక్కు. 86

క. అని వాత్సల్యము దైన్యము
నినుమడిగాఁ బలుకులందు నెసఁక మెసఁగఁ బ
ల్కిన తనచుట్టములకు ని
ట్లనియెఁ బరివ్రాట్టతం డుదారార్థమునన్. 87

గీ. అధికతాల్పత్వముల నెంచ కదిర! దేహి
కూర్చు దైవమె యోగవియోగములను
నుండవలె నిర్వికారచిత్తుం డయి నరుఁ
డిష్టము ఫలించినను ఫలియింపకున్న. 88

ఆ. అన్నదాత యెవ్వఁ డగు నా కటంచు మ
ధ్యాహ్నవేళ క్షుత్తృడార్తి వచ్చు
నతిథిక్షుత్తు దీఱ నన్నంబు నిడ్డ సు
శీలు పుణ్యమహిమఁ జెప్పఁ దరమె. 89

ఉ. స్నాన మొనర్చి యగ్ని నిరుసంజను వేలిచి, తాల్చి దండమున్
బూని మృగాజినంబు, శ్రుతిఁ బోలఁ బఠించుచుఁ జేరువర్ణిచం
దానన మధ్యమాహమున దండియు గేస్తులయిండ్లు సేరు బి
క్షాన్నకునై యతాత్ముఁడును శాస్త్రవదావదుఁ డౌచు నిచ్చలున్.

ఆ. తనువు నెవని యన్నమునఁ బెంచుకొనుచుఁ ద
పంబుసేయు నత్తపస్వితపము
దక్కు నట్టియన్నదాతకు సగము, ద
క్కును సగమ్ము కర్త కనవె స్మృతులు. 91

చ. అరయ విచక్షణుం డగుగృహస్థు గృహస్థితిఁ జెయ్యుఁ గ్లేశమున్
బొరయక తైర్థికుల్ గనెడుపుణ్యము నొందు; ధనాఢ్యుఁడేని యం
దఱును గృహస్థుఁ జేరుకొని దానముచేతనొ ప్రీతితోనొ త
స్కరగతినో బలాత్కృతినొ చక్క భుజింత్రు తదీయవిత్తముల్.92

క. తనుపఁదగు వేదవిదు వి
ప్రుని దాన సమస్తనిర్జరులు తనియుదు; ర
య్యనఘునియం దఖిలసురలు
ననయము వసియింతు రనె స్వయంబుగ శ్రుతియే. 93

సీ. నిజధర్మనిష్ఠులు నిఖిలార్థవేత్తలు
విజితేంద్రియులును సేవితసమస్త
తీర్థుల్ పరోపకృతివ్రతుల్ మహితులేఁ
తెంతురు గేస్తు నిశాంతమునక
కావునఁ దత్తీర్థసేవాఫలంబు గే
హమునసుండియ తద్గృహస్థుఁ డెనయు
గృహికి నిజావాసమే తీర్థ మగుట వ
దాన్యుండు గావలె ధనికుఁ డెపుడు

గీ. మూషికాద్యంతర స్థితమ్ములును గోమృ
గాధ్రగాది బహిస్థమ్ములైనజీవ
సృష్టి జీవించు గృహి నాశ్రయించి కాన
గేస్తు సర్వోత్తమునిగ నంకింతు మదిని. 94

గీ. తనువు మూలంబు పురుషార్థమునకు నన్న
మాతనువునకు మూలమం చనె నిగమము
లన్న మొదవ మూల మ్మాగృహస్థు మూకు
నఖిలఫలము గృహస్థమ్రమాశ్రియంబ. 95

క. మఱిమఱి చెప్పెద వినుఁ డా
దరమునఁ బూజింపుఁ డతిథిఁ ద్వగ్గృహమున కా
తురుఁడై రాఁ; బూజితుఁ డు
ద్ధరించు, ధిక్కృతుఁడు కులము హరియించు వడిన్. 96

క. చేయుఁ డనభిసంధిగ నా
మ్నాయోదితకర్మములు, సమస్తము పరమే
శాయత్తము సేయుం, డటు
సేయంగాఁ జిత్తశుద్ధి సిద్ధించు వెసన్. 97

చ. జవమునఁ గౌఁగిలించు నెలజవ్వని నవ్వుపుఁబైఁటఁ దుళ్లుచ
న్గవ నునుఁజందనద్రవమునన్ విలసిల్లునురమ్ము తోఁడివా
రవుదురె కాక వీ; రిఁక మహాయతివర్యపదాబ్జపూజనో
త్సవగతపాపులై దయయు ధర్మము గల్గి తరింత్రుగా కొఁగిన్. 98

చ. అని తనబంధువిప్రతతి కబ్జపదుం డుపదేశ మిచ్చి స
ల్పె నపుడు భిక్ష మాతులు నివేశమునందు; భుజించి కూరుచుం
డినతఱి మేనమామయు వినేయుని కేలఁ గలట్టిగ్రంథమున్
గని యడిగెన్ సరోజపదు 'గ్రంథ మిదేమి' యటంచుఁ బ్రీతిమై. 99

పద్మపాదుఁడు తనభాష్యటీక మేనమామకడ దాఁచుకొని యరుగుట

క. మామ యన నసామాన్యుఁడు
మీమాంసాశాస్త్రమున నమేయప్రతిభా

ధాముఁడు ప్రాభాకరమత
గామి యుక్తులవేనవిధంబుల ఖండనసేసెఁ జూడఁగన్. 100

ఆ. అంతవాఁడు తన్ను నాదృతి నడిగె నం
చపుఁబ్రమోదంబు నంద నార్య
వర్య! శంకరార్యభాష్యమునకుఁ డీక
యనుచు మామ కద్దె యనుచు నొసఁగె. 101

ఉ. కాంచి తపేయటీక మతికౌశలికిన్ ముద మొందెఁ - గాని యిం
చించుక యొంట రెంటఁ గసియెన్ మది, తద్రచనాచమత్కృతిన్
గాంచినమోద మన్యమతఖండనలక్షిత దుర్దమోక్తి యు
క్త్యంచితరీతి నస్తమయి మయ్యెను మామకు నేమి చోద్యమో. 102

క. స్వాభిమత మై తనర్చెడు
ప్రాభాకరమతమునకు నిరాకరణం బా
యాభాగమ్ములఁ గని మది
క్షోభించి యనూఁడు మాటకొని వినుతించెన్. 103

ఆ. అపుడు భాగినేయుఁ డనె మాతులునకు సే
తువు భజింపఁ బోవుదును ద్విదాల
యమున గ్రంథ ముంచి యరయు మోయార్య! నా
ప్రాణ మెల్ల దానిపైనె యుండు. 104

గీ. ఇతరులకు గో గృహాదులయెడల నెంత
ప్రేమ ముండునో యంత సంప్రీతి పుస్త
కములయెడ మా కటంచు నాగ్రంథ మప్ప
గించి వెడలెను సేతువుఁ గాంచు కోర్కె. 105

చ. అటు చనఁ జూచున ప్రభాకర నాయతి వామభుజోరునేత్రముల్
తటుకున దుమ్మె నొక్కటఁ, దక్షిణం బది కాంచియు దుర్నిమిత్త సం

కటత గణింప కాతఁ డధికం బగువేడ్కఁ జనెన్ సశిష్యుఁడై
యెటు విధి త్రిప్పు నట్లె భ్రమియించుట నైజగుణంబు ప్రాణికిన్.

శా. చింతించెన్ మది సప్పు మాతులుఁడు 'స్వస్రీయుండు పేర్కొన్నసి
ద్ధాంతంబుల్ గురుపక్షహాని సలుపన్ దక్షుమ్మ; లీగ్రంథమున్
సాంతంబున్ దహియింప, నాగురుమతం బవ్యాహతిన్ వ్యాప్తమా
నిం తేలా యన; వాక్కులన్ మలఁపరా దీగ్రంథ మావంతయున్.

ఆ. నైజపక్షనాశనముకంటె గృహనాశ
నంబు మే లగుట గృహంబుతోడఁ
బుస్తకము దహింతుఁ బాడ గానరా దంచు
నింటి కగ్గి పెట్టె యిట్టు లేడ్చె. 108

ఉ. అక్కట! జాలిమాలి గృహ మగ్ని యిదే దహియించుచుండెఁ బెం
పెక్కిన సర్వసంపదలు నీఱ్ఱియ బూడిద యాట కేడువన్
దక్కక మేనయల్లు నమితశ్రమ మాకృతి కేడ్తు; నింటిలోఁ
జిక్కి నశించె నే మనుచుఁ జెప్పుదు రే పతఁ డేఁగుదేరఁగన్. 109

గీ. అనుచు విలపించె నని యెల్లజనులు చెప్ప
కొనెడు నైతిహ్య మీవిరచనకు మూల
మఘ మొనర్చెడువాని కెం తగు ఫలంబు
దాని కినుమడిగాఁ జెప్పువాని కబ్బు. 110

పద్మపాదుఁడు దర్భశయనాదిపుణ్యస్థలముల కేగుట

మ. అటు లాపద్మపదుండు శిష్యసహితుండై యేఁగుచోఁ ద్రోవచ
క్కటి ఫుల్లర్షివరాశ్రమంబు గన రాఁగాఁ బొంగి యం దేఁగె; నె
చ్చటఁ మున్ రాముఁడు రావిచెట్టుమొదటన్ జాపంబు దానుంచి ని
స్తుటచింతాజలరాశిలో మునిఁగెనో దర్భాసనాసీనుఁడై. 111

ఉ. ఏగతి సాగరంబుఁ దరియింతును? జానకి నెట్లు చూతు? నిం
కేగతి భూచరిష్ణు లగునిక్కపిసీరులసేన లబ్ధిపైఁ
బోఁగల? రంచుఁ జింత మనమున్ మథియింపఁ గుశాసనస్థుఁడై
రాగవుఁ డుండఁ గానఁబడెఁ గ్రచ్చఱ జ్యోతి యొకండు దవ్వులన్.

చ. అభిముఖమై తదుజ్జ్వలమహ స్ఫురదెంచుట గాంచి కీశరా
ట్ప్రభ నిలుచుండి ఫాలతటసంఘటితాంజలియై కనంగఁ ద
త్ప్రభయుఁ గ్రమక్రమంబుగను బంచజనాకృతిఁ దోఁచి తాపస
ప్రభుశుభరూపమై నయనపర్వ మొనర్చుచుఁ జేరవచ్చెడున్. 1 3

క. పాపాపహాంత సౌమ్యుఁడు
లోపాముద్రాయుతుం డలోకద్యుతి వా
తాపిదమనుఁ డగ్నవ నివ
హాపోశనపటు వగస్త్యుఁ డై కనఁబడియెన్. 114

వ. రాముండు నక్కుంభసంభవసందర్శంబున హృదయంబునం గల ఖేద ముపశమిల్ల నల్లన సతీయుతుం డగునమ్మహర్షి కర్ఘ్యాదు లొసంగి తత్పదంబుల శిరంబు సేర్చి కొండొకతడ వట్లన యుండి ధృతిఁ బూని యుత్థితుఁడై యిట్లను. 115

ఆ. జనకసముని నిన్నుఁ గనఁ గల్గుట శమించె
నల్లదుఃఖ మబ్ధి యింకి నటుల
యే నవాప్తకాముఁ డైనాఁడ మాసూర్య
వంశ మొండె నేఁ డవార్యమహిమ. 116

సీ. తొలుత రాజ్యపదచ్యుతుఁడనై సతీభ్రాతృ
సహిత మరణ్యవాసము నొనర్చు
నచట మారీచమాయల నేను ద వ్వేఁగ
నవనిజ రావణుం డపహరించెఁ

గొనిపోయి యసుర సీత నశోకవని డాఁచె
నని మే న్దొలఁగనున్న దనియు వింటిఁ
దరుచరాధిపునిమైత్ర్యము గాంచి తత్సేన
గొలువ రా నద్దె మీజలధి దగిలె

గీ. దాఁటు టెటు దీని? రక్కసు గీటడంచు
టెట్లు? జానకిఁ దెచ్చుట యె? ట్లటంచు
పాయ మెఱుఁగక యుండ నాపాలిదైవ
మనఁగ నీదర్శనం బబ్బె మునిలలామ! 117

వ. అనుటయు నత్తాపసలలామం బిట్లనియె. 118

చ. వగవకు వత్స! భానుశశివంశజు లైనమహాత్ము లెందఱో
వగల మునుంగరే వ్యసనవర్జితులై విలసిల్ల రొక్కొ! ము
జ్జగమున నీసహోదరునిసాటి ధనుర్ధరుఁ డుంట కల్ల, యి
య్యగచరనేత బాసటగ నబ్బె ననాథుఁడ నంట లెస్సయే. 119

గీ. ఇంతటి సహాయసంపత్తి యిరవుకొనియె
నే నిదె హితోపదేష్టనై యేఁగుదెంతు
నింక నివ్వారిరాశి ని స్నేమి సేయు
స్వాంతమందుఁ దలంపు గొప్పదము గాఁగ. 120

చ. కలికములోని కేని యుదకం బొకబొట్టును లేనియట్లు లీ
జలధి నొనర్తు, నీవుఁ గపిసైన్యము నేఁగఁగ వచ్చుఁ గాని యం
దులయశ మెల్ల నాదె యగుఁ, దోయధి నీ వెటొ కట్టితేని యు
య్యలఘుయశంబు నీది యగు యత్న మొనర్చి రచింపు సేతువున్.

మ. అరిఁ జెండాడి ధరిత్రిపుత్త్రిఁ గొని నీ వాచంద్రతారార్క మా
స్థిరకీర్తిన్ గను మం చగస్త్యముని యాశీర్వాదమున్ జేసి క
న్నొలఁగన్ సేతువు గట్టి వార్థికిఁ గపీంద్రుల్ సేనతోఁ గొల్వఁ జె
చ్చెర లంకాపురి సొచ్చి వచ్చి రిపు, దెచ్చెన్ రాముఁ డాభూమిజన్

వ. అని యాక్షేత్రమహిమ వర్ణించి తత్తీర్థంబున నాభిక్షువు స్నానం
బాచరించి రామనాథునకుఁ బ్రణామము లొనర్చి మనుజులకు శ్రద్ధ
గలుగుటకై తద్వైభవం బంతయు శిష్యులకుఁ జెప్పుటయు నందొ
క్కపండితుం డగుశిష్యుండు 'రామేశుఁ' డనునామ మే సమాస
మనుటయుఁ దత్పురుష కర్మధారయ బహువ్రీహిభేదంబుల ముత్తెఱం
గగు. 123

గీ. తత్పురుష మంచుఁ దొలి రఘూద్వహుఁడు నుడివె
నభవుఁ డనియె బహువ్రీహి యనుచు భక్తి
నమరు లది కర్మధారయం బనిరి సమస
నమ్ము వివరింప 'రామేశ' నామమునకు. 124

చ. అనుచు సమాసముల్ దెలుప నచ్చటికోవిదలోక మెల్లఁ ద
ద్ఘనరుమాపాదు ధీపటిమ భక్తి నుతింపఁగఁ గొంతకాల మం
దున వసియించి శిష్యసహితుం డయి తీర్థము లెల్ల నాడి య
య్యనఘుఁడు మాతులీయనిలయంబును జేరెను బర్యటించుచున్.

సీ. గృహదాహమును విని ఖిన్నుఁడై యాపద్మ
పాదుఁ డాగంత్రావసాదనమున
కందిన యత్యార్తి కంటెను మాతులు
నిల్లుపోకకు దురపిల్లి మిగుల
'నను విశ్వసించి డాఁచిన గ్రంథదాహమ్ము
నకె కాని గృహనాశనమున కడల

ననెడు మాతులుని నూరార్చి నాబుద్ధిలోఁ
గలదు గ్రంథ మ్మని తెలిపి యప్డు

గీ. వ్యాఖ్య మరల రచింప నుపక్రమించు
జెఱఁగి బుద్ధిఘ్న మగుదివ్య మిరవుకొల్పి
యోగిరము పెట్టి తినిపించె భాగినేయు
నప్పయోముఖవిషకుంభ మండ్రు జనులు. 126

పద్మపాదాదిశంకరశిష్యు లొక్కటఁ గూడుకొని యాచార్యులం జేరుట

వ. ఆసమయంబునఁ దన్నుంబోలెఁ దీర్థయాత్రాపరు లగుసతీర్థ్యులు కని ష్ఠాశ్రమస్థు లగుకొందఱావృత్త మెఱింగి యరుదెంచి కృతప్రణా ములై యనేకదివసయోగజైక్యమునఁ బరస్పరపరిశంసల నొనర్చు కొనిరి. 127

మ. పటువాచావిజితాంగిరః ఫణిపతిప్రాచేతసుల్ తద్వశుల్
ఘటితాచార్యపదాబ్జచిత్తు లయి శంకల్ దక్కి యాపల్లవో
త్కటతన్ బల్లవ మట్లు ద్రుంచి యనువృత్త్యాహితాత్యాహితా
ర్భటి దీపింతురు; దేశికాంఘ్రి పురుషార్థం బెద్ది చేకూర్పదో. 128

గీ. అంతఁ దచ్ఛంకరార్యశిష్యప్రతాన
మాలకించె స్వదేశకీయమును సుఖద
మైనయొకవార్త నఖిలతీర్థాటనంబు
సలిపి వచ్చిన యొక విప్రకులునివలన. 129

చ. గురువరుఁ జూడఁ జాలమికిఁ గొందల మందెడుశిష్యబృంద ము
క్కరణి నెఱింగి పొంగి కనఁగాఁ జనఁగోరిరి కేరళాన; క
త్తఱికె గురుండు గూడఁ దనతల్లికి నంత్యవిధుల్ పొనర్చి ని
ర్భరముగ నాత్మధర్మపరిపాలనసక్తి విరక్తి రాజిలెన్. 130

క. కేంశమున విష్వక్సం
చాపంగై మానసమున ఛాత్రకులావళ్
గోరి చని పొగడె దేశికుఁ
డీరీతి మహాసురాలయేశు నొకతఱిన్. 131

సీ. పరిపూర్ణుఁడవు జగత్పతి నీవు లీలచే
సప్రయోజనవాంఛ నధిగమించి
సృజియింతువఁట చిదచిద్రూపముగ జగ
మపగతసదసత్త్వ మైనప్రకృతిఁ
ద్రిగుణమ్ము లూని యీజగము పుట్టించి ర
క్షించి త్రుంతువు త్రిమూర్త్యంచనమున
వివిధజలప్రతిబింబిత రవియట్లు
విశ్వగతిన్ బహువిధముఁ గందు

గీ. వని యభిష్టుతు లొనరించు చావిశిష్టుఁ
డమరసద్మమ్మునం దుండునవసరమున
సుచిరవిరహార్తు లైనశిష్యులు నమస్క
రించిరి తదంఘ్రి యుత్తంసవృత్తి మెఱయ. 132

క. కుశలానుయోగపూర్వము
వశిచంద్రుఁడు శిష్యతతిఁ గృపం దీర్ప వ్యథా
కృశుఁ డజహద్గద్గదికా
వశుఁడై కంపిలుచుఁ బద్మపాదుం డనియెన్. 133

క. దేవా! శ్రీరంగేశ్వరు
సేవించి మిమున్ భజింపఁ జేసుచు నుండన్
ద్రోవను మాతులుఁ డగపడి
స్వావసథము సేర్చెఁ బ్రశ్రయమ్మున నన్నున్. 134

ఆ. ఆతఁడు భేదవాది యని యెఱింగియును బూ
ర్వాశ్రమీయ వాసనానుబంధ
వశత యుష్మదీయభాష్యటీకఁ బఠించి
యోర్చితిని గృతానుయోగు మామ. 135

గీ. దగ్ధముద్రాస్యముద్రిమంత్రమ్ము లగుచు
ధ్వస్తగురుతర్క కపిలతంత్రమ్ము లగుచు
నిగమసారామృతముఁ జిల్కు నీదుసూక్తు
లనెడు వర్మము దాల్చి మామను జయింతు. 136

సీ. కాణాద సేనాముఖమున ఖడ్గాఖడ్గి
విహరణంబున నింత వెతను గనునె
పశ్యత్పదానీకపటలి శస్త్రాశస్త్రి
రణరంగమునయందు శ్రమ మెనయునె
కాపిలబలముతోఁ గడఁగి యష్టీయష్టి
యొనరింప నాయాస మొందునొక్కొ
జైన బౌద్ధాది పాషండులతో గదా
గది యాజి నస దైనఁ గందునొక్కొ

గీ. ధీర! యౌక్తికవంశమౌక్తిక మయమ్ము
లైన భవదీయసూక్తిసంతానములను
వ్యూఢకంఠటుఁ డైన యేబుధుఁడు గాని
యఖిలజగములఁ గాలత్రయంబునందు. 137

వ. అది యట్లుండె నవధరింపుము. 138

సీ. అతఁడు గాఢోత్కంఠుఁడై యభినందన మొనర్చి
నన్ను నావ్యాఖ్యను, మున్నువోలె

నమ్మి మామకము గ్రంథమ్ము దద్గృహమందు
విన్యస్త మొనరించి వెడలినాఁడ
నర్ధరాత్రము స్వగేహముఁ గాల్చె మామ మ
త్కృతకృతి భస్మసాత్కృతము గాఁగ
బుద్ధిహానికి భైక్షమునఁ బెట్టె గరళమ్ముఁ
గృపణుఁడై యని పుట్టెఁ గివదంతి

గీ. యేది యెటు లైన దుర్విధి నాదుమది య
సంశయ మ్మాచుఁ బూర్వప్రసాద మెనయ
దాయె భవదీయసేవాపరాయణులకు
నిట్టి విషమోగ్రదశ యుక్తమే మహాత్మ! 139

ఆ. అట్టు లగ్ని గొనిన యాటీక నెల్లని
మరలఁ గూర్పఁ బోవ మందమతిని
యుక్తిపాటవంబు సూక్తుల మున్నట్లు
కలుగ దాయె నెంత గాసిపడిన. 140

చ. పరమదయాస్పదం బగుభవత్పదమున్ శరణొందునట్టియం
దఱు నతిదీను లైనఁ బరితప్తుల యైనను గందు రమ్మహే
శ్వరపద మార్య! త్వచ్చరణభక్తుఁడ నా కపరాధ మున్నె? యే
దురితము మీపదార్హణముతోఁ జెడు నంద్రది సేయు సార్థమున్:

చ. అని వచియించు పద్మపదు నాగుపపాదులు వల్కి రుత్తమా
ర్థనిబిడతన్ దయారసకరంభితచిత్తసరోజ లౌచు సాం
త్వనవచనంబులన్ శ్రవణతత్పరచిత్తతమోపహారకం
బు నమృతసాగరోపమితముఙ్ బుత మాఘణితిఙ్ స్మితాస్యులై.

క. విషమము కర్మవిపాకము
విషమోహసమం బవార్యవిక్రమ మను నీ

విషయము సురేశ్వరునితో
మృష గా దెప్ప డనుచుఁ బల్కెనే యానాఁడే. 143

ఆ. ఒనర వార్త్తికమున సుత్సాహియై యుండు
నతని కీరుగూర్చు నల పరాభ
వాగ్నిసుమి త్వదీయ మగుగ్రంథమును గాల్చెఁ
గాదు మేనమామ, గాదు వహ్ని. 144

క. ఇతరులమన మున్నరు మను
గతి నిర్హేతుకము మసలఁ గా, దయ్యవమా
నితు చిత్తక్షోభము సం
తత మేర్చుఁ భస్మపిహితదహనోపమమై. 145

క. ఎంతవిరాగము గల్గిన
నెంత తప మొనర్చినను మఱెంతగ శాంతిన్
దాంతి గడించిన నేని ర
వంత యసూయకును లోఁగ నఖిలము ఖలమా. 146

వ. అది య ట్లుండ నిమ్ము మున్ను శృంగగిరిక్షేత్రంబున నామూలాగ్ర
ముగాఁ బంచపాది వినిపించితివిగదా; దాని నేను మఱువ లేదు. ఖేద
మ్ముడిగి క్రమ్మఱ లిఖించుకొ మ్మని యాఱడిల్లఁ బలికి యప్పుడు.

కాలిపోయిన పంచపాదిగ్రంథమును శంకరులు ధారణాబలమునఁ జెప్పుట

ఉ. చెప్పెను బద్మపాదుఁడు రచించినతొల్లిటి యానుపూర్వితో
నొప్పఁగఁ బంచపాది కృతి నొయ్యన నయ్యతి-సర్వవిద్యలన్
గుప్పి జగత్త్రయంబును గకుప్పలఁ గప్పెడుజ్ఞానశక్తి చే
నొప్పెడు దేశికాఖ్యపురుషోత్తముఁ డట్టుల సెప్ప టబ్రమే! 148

గీ. పద్మపాదుండు రభస ముప్పంచపాది
వ్రాసికొని పరమానందభరితుఁ డగుచు

లేచు గూర్చుండు విలపించు నాచికొనును
బరవశుం డయి యెలుఁగెత్తి పాడు నాడు. 149

వ. అంత. 150

శంకరుఁడు కేరళరాజునకు నాటకత్రియముఁ జెప్పుట

మ. కవితాప్రౌఢుఁడు రాజశేఖరసమాఖ్యాకుండు తత్కేరళో
ర్వీవిభుం డాయతి చిత్రవార్త వినుమా విచ్చేసి కోటీరర
త్నవిఘృష్టాంఘ్రిపయోరుహుఁ సలుపఁ దత్కార్యమంది యానందమొం
ది విభుఁ దత్కృతనాటకత్రియము వ్యాప్తిం గూర్చి ప్రశ్నించుచున్.

క. మొగ మింత సేసికొని య
జ్జగతీవరుఁ డనియెఁ 'బద్మచరణరచితకో
శగతిని నానాటకములు
దగులంబడె వీతిహోత్రధాటికి లోనై'. 152

క. అన విని శంకరసంయమి
మును వినుటను నాటకములు మూఁడింటిఁ బఠిం
చిన లిఖయించుకొనియెఁ ద
జ్జనపతి విస్మయతరంగితస్వాంతుండై. 153

ఉ. స్పష్టముగా లిఖించుకొని పార్థివచంద్రుఁడు పొంగుచున్ మనో
భీష్ట మెదేని యున్న వచియింపు మొనర్చెద నంచుఁ బల్క ని
ర్మృష్టభవానుబంధుఁడు యతీంద్రుఁడు పల్కెను వైదికక్రియా
భ్రష్టులు గాఁగఁ గాలటినివాసుల కిచ్చితి నేఁడు శాపమున్. 154

క. నాయిచ్చిన శాపము భూ
నాయక పాలింపు మీ వహారతమును వై
ధేయులు వారలు నీకు వి
ధేయులు సుమి యనుచుఁ బలికె దేశికుఁ డంతన్. 155

గీ॥ పద్మపాదుఁడు నష్ట ప్రాపంచపాది
నెనసి సంతుష్టిఁ గనఁ గేరళేశ్వరుండు
నాటకత్రయ మొంది ప్రణంత యగుచు
గురుపదధ్యానరతుఁ డౌచు నరిగెఁ బురికి. 156

శంకరుఁడు జైత్రయాత్రకు వెడలుట

ఉ. చెంతలఁ జేరి కొల్చుచు స్వశిష్యసహస్రములున్ సుధన్వభూ
కాంతుఁడు వచ్చుచుండ నధికం బగుసర్వదిశాజిగీష నా
దాంతుఁడు శంకరుండు దొలుతన్ జన సేతువు దాఁకఁ బోవ మా
ర్గాంతర వర్తమాన కుమతాంతరవర్తి జనార్తికంబుగన్. 157

వ. అట్లు పద్మపాదహస్తామలకసమిత్పాణిచిద్విలాస జ్ఞానకందవిష్ణుగుప్త
శుద్ధకీర్తి భానుమరీచి కృష్ణదర్శన బుద్ధివృద్ధి విరించిపాద శుద్ధానం
తానందగిరి ప్రముఖసహస్రశిష్యులతోఁ గూడి శంకరుండు చనుచు
మధ్యమార్గంబుమధ్యార్జునం బనుశివావిర్భూతక్షేత్రరత్నంబుసొచ్చి

గీ. వనజగర్భాదిపూజితాంఘ్రిని నదృష్ట
చరుని మధ్యార్జునాహ్వయపరమశివుని
బుద్ధి నుపచారములఁ గొల్చి పొడవుమీఱు
పాపముల వీడ్కొని ఫలైకపాత్ర మయ్యె. 159

వ. అట్లు కొలిచి యాభగవత్పాదులు మధ్యార్జునక్షేత్రాలంకార మగు
మహాదేవు నుద్దేశించి యి ట్లనియె. 160

క. నీవే యుపనిషదర్థము
నీవే సర్వజ్ఞుఁ డగుట నిగమాభిమతం
బై వరలున దద్వైతము
దేవా! ద్వైతమ్ము తెలిపి తీర్పుము శంకల్. 161

మ. అని మధ్యార్జునలింగమహాళి నొకదివ్యజ్యోతి తోఁ జెంది జో
రన "యద్వైతమె సత్య" మంచును ద్రివారం బార్చి మాయంబు గాఁ
గను, దద్ద్రష్టలు నద్భుతంపడి యశంకన్ శంకరాచార్యపా
వనపాదాశ్రియులై గ్రహించి రపు డద్వైతాధ్వమున్ భక్తిమై

వ. మఱియుఁ బ్రాతఃస్నానాదివిశుద్ధులై యాదిత్యాంబికావిష్ణుగణనాథ మహేశ్వరాత్మకపంచాయతన పూజాతత్పరులుం, బంచయజ్ఞపరాయణులు శ్రుత్యాచారరతులు శుద్ధాద్వైతబద్ధబుద్ధులు నగుటయు వారల వీడ్కొని శంకరుఁడు సశిష్యంబుగ రామేశ్వరంబు సేరుటయు నప్పుట. 163

### శంకరులకు శాక్తులతో వాదము

క. జరిగె గిరిజార్చనాచ్ఛల
పరిపీతాసవము శాక్తపటలముతో శం
కరులకు మతివాదము పరి
సరజనదత్తానుమోదసద్యుక్తిక మై. 164

వ. అది యెట్లనః— నాశక్త్యుపాసకు లెల్ల యతిశేఖరునకు మ్రొక్కి "స్వామీ మామతంబు పావనం బవధరింపుము. శంభుగుణములకవ్వలిదియు, నశేషకార్యజననియు, నాద్యయు నగుశక్తిచే మహదాది సకలజగం బుత్పన్న మగు. 165

గీ. అల్ల పరశక్తి వాఙ్మనసానవాప్య
యగుట సేవింపరామిఁ దదంశ మగుభ
వానిపాదాంబురుహము లన్వహము పూజ
సలుపుచుందుదు మార్య! నిష్కలుషభక్తి. 166

క. శ్రీవిద్యోపాసకులకు
జీవన్ముక్తిని ఘటించు శ్రీశక్త్యంఘ్రిల్

గావునఁ దాల్తుము బుజముల
గ్రీవాస్థలి వాని స్వర్ణకృతచిహ్నములన్. 167

గీ. విద్యను నవిద్య నెఱుఁగు నే వేత్త; యతఁడ
విద్యఁ గొని మృత్యువు జయించి విద్యచేత
నమృత మొనయును గాన విద్యాస్వరూప
యంబచు ముముక్షువుల కవలంబ మగును. 168

గీ. ఈశరూపిణి ప్రకృతి యా; నీశ్వర ప్ర
కృతులకు నభేదకలనము శ్రుతికథితమ
కన 'సదైవ' మాదివాక్యములు తత్ప
రమ్ము లౌట నవ్వియె ప్రమాణమ్ము లిందు. 169

సీ. ప్రణవస్థ మగునకారప్రభృతుల కట్ల
శాంభవీప్రముఖతచ్ఛక్తులకు స
ముత్పత్తి గలుగుచునుండు; సమస్తదై
వతకారణం బగుప్రభునకుఁ బర
మై చంద్రునకు జ్యోత్స్న యటుల రుద్రోద్బోధ
కస్వరూపిణి యామెఁ గ్రాలుచుండు
స్వాధీనవల్లభ యనఁబడురుద్రశ
క్తి భవాని యని నమ్మితిమి త్రిశుద్ధి

గీ. పురుషోత్తమ! తచ్చిహ్నధారి వగుచు
నావిముక్తిద నాజగదంబ నీశ్వ
రినె యుపాసింపవలయు నీ వనుచుఁ బలుక
వారితో నిట్లు లాచార్యవర్యుఁ డనియె. 170

క. పరఁగ నిది సత్య మైనను
'పురుషోత్తముబోధమునన ముక్తి' యని శ్రుతో

త్కర మనుట; నాత్మ నాత్మను
బొనసిన నే కలుగు ముక్తి, పొసమ దిః కౌంటన్. 171

గీ. ఇందులఁ బ్రమాణ మగుఁ 'దమేవైవ' మాది
వాక్యతతి, యజామిత్యాది వాక్య మచ్యు
తాస్వరూపమ్ము దెల్పి, మోక్షమ్ము వడయు
కొఱ కని పరేశుతత్త్వమే యెఱుక పఱిచె. 172

క. మఱియును సాంఖ్యులు ప్రకృతిని
నెఱిఁగి, వికృతిదూరుఁ బురుని నెఱుఁగుటనే చె
ప్పిరి ముక్తిగఁ గాన సుఖా
కరు నీశ్వరు నెఱుఁగ ముక్తి గలుగును జూరే. 173

క. బ్రహ్మేత్యాదికనిగమము
బ్రహ్మముతో జ్ఞాని కైక్యభావము నొడివెన్
'బ్రహ్మైవ' యనుచుఁ గావున
బ్రహ్మజ్ఞానమ్ము మీరు పడయఁగవలయున్. 174

గీ. ఏయమ భవాని యని వచియింపఁబడియె
నామె యద్వైతబోధవిద్యాస్వరూప
విడువ కమ్మహాదేవి సేవించుచుండ
శీఘ్రముగఁ గైవసం బగుఁ జిత్తశుద్ధి. 175

వ. కావున మీరు కుంకుమపుండ్రాంకమును హైమపాదాదిచిహ్నము
లను విసర్జించి 'బ్రహ్మహ'మ్మనెడువిద్యయందు నాసక్తులరు గం
డనుటయు. 176

ఆ. వారు చిహ్నములను వడి వీడి శంకరు
గురునిగాఁ దలంచికొనుచు స్నాన

సంధ్యలందుఁ గనిరి శ్రద్ధ శుద్ధాద్వైతు
లగుచుఁ బంచపూజనాదిసక్తి. 177

లక్ష్మీభక్తులతో వాదము

ఆ. అంత నటకు శ్రీమహాలక్ష్మీభక్తులు
వచ్చి గురున కెఱఁగి పలికి రిట్లు
వినుము దేవ! శాస్త్రవిహితంబు యుక్తి స
హంబు నైనమామతంబురీతి. 178

సీ. బ్రహ్మాండజనని సర్వఫలప్రదాత్రి మ
హాలక్ష్మియే యాద్య యైనప్రకృతి
యగు 'నస'దిత్యాదినిగమోక్తి; నీఁక 'సదే'
వేతి వేదోక్తి విధాతృముఖ్యు
లమల మహాపురుషోత్తమాంగమ్మునుండి యే
యింతియందు జనింతురో, యెవ తెయంద
పర మేశునకుఁగూడఁ బరఁగునంతర్భావ
మాదేవి సేవ్య మోహార్థులకును

గీ. గుంకుమాంకితమహాళు లబ్జాంకలసిత
భుజులు పద్మాక్షమాలావిభూషు లగు ర
మాసమారాధనాసక్త మతులకుఁ గర
గతమ యగు ముక్తి, కాన మామతము గొనుము. 179

వ. అనుటయు శంకరుం డాశ్రీభక్తులతోఁ దత్త్వంబు దెలిపెద వినుం
డని యిట్లనుు. 180

సీ. సదసత్స్వరూపుఁడై జానొందు నద్వితీ
యుఁడు పరమాత్మ యొక్కఁడ జగంబు

సృజియించువాఁడు గా కితరుండు లేఁడు 'స
ఆత్మ' యన్ శ్రుతిచేత వ్యాహృతుఁ డగు
నానందరూపుఁడై యలరు సదా తద
ధీన యాప్రకృతి కెందేని మోచ
కత్వమ్ము చెల్లునే? కడఁక నెవ్వండు "బ్ర
హ్మహ"మంచును ధ్యాన మాచరించు

గీ. వానికి విముక్తి కరగతం బౌ నసత్య
దేవతోపాసకులకుఁ దద్విధజగములె
తాఱుఁ గానఁ గుంకుమపదధారణంబు
విడిచి కైకొనుఁ డద్వైతవిద్య ముక్తి. 181

క. అని శంకరుఁ డుపదేశిం
చిన వా రద్వైత మూఁది శిష్యత్వము గాం
చిన యావృత్తాంతము విం
చును జేరఁగ వచ్చి రాశుశుక్షణికల్పుల్. 182

శారదోపాసకులతో వాదము

ఉ. భాసుర పుస్తపుండ్రక విభా పరిచిహ్నితు లౌచు శారదో
పాసకు లయ్యతీంద్రునకు వందనముల్ పచరించి, నిత్యతన్
భాసిలు వేద; మట్లగుట భారతి సత్యము లోక హేతువున్
హ్రాసవిదూరరూపయుఁ బరాత్పరమూర్తియునై విరాజిలున్. 183

గీ. ఆమెయే బ్రహ్మ హరి హ రాద్యఖిలశబ్ద
గమ్య, యాదేవియే జగత్కర్త్రి నిత్య
యను శ్రుతి, ముముక్షువులకు నుపాస్య యగుట
నాగుణాతీత నీకు నుపాస్య యగుటె. 184

గీ. పర మయినవాక్స్వరూపంబు నెఱుఁగఁ డింత
శ్రుతిగతార్థానభిజ్ఞుఁ డంచును వచించుఁ
గాదె 'నావేద' యనుసూక్తి? గని తదర్థ
మానఁ దగు వాక్స్వరూపసంధాన మవుల* 185

చ. అనుటయుఁ "గంఠ తాలు రదనాదిక సంగతిఁ బుట్టువేద మే
యనువున నిత్య మౌ" ననియు నయ్యతి యి ట్లను- వర్ణమాత్రమా
కన ధ్రువ మైన? దక్షరనికాయమ? యాదిమ మెప్డు గాదు గ్ర
స్సన నవియున్ జగల్లయమునన్ లయ మొందు ధ్రువంబులెట్టులౌ?

క. అమరు శ్రుతు 'లీశునిశ్వసి
తము లై' యనుసూక్తి జన్యధర్మమ్మ్మన; జ
న్యము లెల్ల ననిత్యము లను
ప్రమాణమునఁ గాదు నుఁడి ధ్రువం బంతిమమున్. 187

సీ. అంగసమన్వితం బగు వేదము యుగాంత
మున లయం బొందుడు, మునులకు రవి
సెప్పె నంచును సూర్యసిద్ధాంతమున నుండెఁ
బ్రళయ మొందినవేదరాశి కర్కు-
వలనఁ బ్రవర్తనం బలవడుటను శార
దకు నెట్లు గల్గు సత్యత్వ మకట!
సుర లనిత్యు లైనఁ బర మేష్ఠి ధ్రువుఁ డౌట
నిత్యయే వాణి యంద్రేని వినుఁడి

*క. వేదార్థవివేకరహితుఁ
డేడెస బరవాక్స్వరూప మెఱుఁగడ యనినా
వేదేత్యాద్యుక్తి కలిమి
వేద మెఱిఁగి వాక్స్వరూపవిదుఁ డౌట తగున్.

గీ. యాదిమప్రాణి యాట నిత్యత్వశూన్యుఁ
డగుచతుర్ముఖుముఖముల నలరుశార
దకు ననిత్యత్వ మక్షసిద్ధమ్ము కాన
శ్రీమ మ దేం వాఙ్నిత్యతాసాధనమున. 188

వ. పరమాత్మాతిరిక్తంబునకు మృషాత్వంబు సిద్ధంబ కానఁ బరమయుఁ బ్రకృతియు నగుశారదయె మహదాదివిశ్వంబునకుఁ గారణం బగుట యసంగతము. వాగాద్యతీతం బగునప్పరమభూమం బొక్కటియ సదాదిశబ్దబోధనీయము కాని ప్రకృతి కా దని యెఱింగి సదాది శబ్దంబుల బహ్మజ్ఞానము సాధనీయంబు, ముక్తిపదంబు నొంద నాత్మజ్ఞానముదక్క నన్య మగునుపాయంబు లే దని వేదము పలుకుట లేదె? అట్లుగాన శుద్ధాద్వైతబద్ధబుద్ధులరై మీరు స్నానాదిసకలకర్మమ్ము లీశ్వరార్పణబుద్ధి సలిపి దురితములఁ దొఱఁగి శుద్ధులై యానందఘన మ్మగుబ్రహ్మము నెఱిఁగిననే ముక్తు లగుదురు కాని యన్యథా కానేర రనుటయు నాశారదోపాసకు లెల్లరు శంకరార్య శిష్యులైరి యంత వామాచారు లగుశాక్తులు కొందఱు జగద్గురుఁ గాంచి యి ట్లనిరి. 189

## వామాచార శాక్తులతో వివాదము

మ. వెడవేసమ్ము ధరింతు, వారయవు సంవిదూపమున్ మూఢుకై
వడి, వంధ్యాతనయోపమం బయినయద్వైతప్రబోధంబునన్
బడె, దద్వైతమె సున్న, భేదము లయావస్థాప్తినే నుంట- మా
నుడు లాలించి గ్రహించి శక్తిమతమున్, మోక్షమ్ము చేకొఁగదే.

సీ. పృథగాకృతిని నెద్ది యీశునందు విమర్శ
మనుసంజ్ఞతో వెల్గు ననవరతము
నెయ్యది తేక పరేశుండు నల్పకి

యాచరణంబునం దవముఁ డగును
సంతతం బైయ్యాది సర్వస్వతంత్రయై
యెల్లలోకము సృజియించుచుండు
శివునకు బీజమై చెల్వారు నైయ్యాది
విద్యాస్వరూపయై వెలయు నేది

గీ. యట్టిపరశక్తి భజియించునట్టివారి
కే లభించును ముక్తి తదితరులకు న
లభ్య మగుఁ జూవె పెక్కు లేలా వచింప
నఘచయజిఘాంస! పరమహంసావతంస. 191

గీ. 'ఆ విమర్శాభిధాన మవ్యక్త' మనుచు
బ్రహ్మభృగ్వాదు లనిరి తత్త్వమ్ము నరసి
దానికంటె నన్యం బయి దనరునట్టి
సకలము చరాచరము తద్వశమ్మె సుమ్మ. 192

ఉ. ఆ పరశక్తిభక్తు లయి యంచితసిద్ధులు గన్నవారి కా
క్షేపము లే దెటఁ విధినిషేధము లుండమి; నిర్గుణాఢ్యగ
శ్రీపరకోటికిఁ విధినిషేధము లంటునె? కాన మాకు న
త్తాపసు లౌభృగుప్రభృతి ధన్యులవర్తనముల్ ప్రమాణముల్. 193

క. కావున మీ రితరమ్ములఁ
బో విడిచి గ్రహింపుఁ డాత్మముక్తికిఁ బర యా
శ్రీవిద్య నంచు నుడువం
గా విని యాచార్యుఁ డీప్రకారము నొడివెన్. 194

సీ. అటు పల్కఁ దగునయ్య "యత్ర" యన్శ్రుతి యనా
త్మమున కెల్లను నిషేధము వచించెఁ

గానఁ దా నెందుఁ గల్గద విమర్శమున క
నాత్మంబునకు సత్యతాప్తి లేద
యధ్రువ ప్రకృతి నుపాసింప ముక్తి రా
దాలింపుఁడయ్య 'మాయాభి రింద్ర'
యను శ్రుతిసూక్తిచే నాప్రకృతికి బహు
రూపత గల్గు దెలుపఁగఁబడియెఁ

గీ. గానఁ బ్రకృతికిఁ బరము సుజ్ఞానగమ్య
మఖిలసృష్టిప్రభువు నౌ చిదాత్మ యొకఁడె
వెలుఁగుచుండు ముముక్షువిజ్ఞేయ మగుచుఁ
దద్విజిజ్ఞానఁ గాని యమృతంబు గనుఁడు. 195

వ. మఱియు 'ఈశానో భూతభవ్యస్య' యనుశ్రుతిం జెప్పఁబడిన పర
మాత్మ నకించిత్కరుం డనుట మౌఢ్యంబు గాదె. 196

క. కలదే బ్రాహ్మణ్యము ని
చ్చలు కలు ద్రావుచుఁ గళంజ జక్షణరతులై
మెలఁగెడు మీ, కటు గావున
సలుపుకొనుఁడు నిష్కృతిన్ వెసన్ విహితగతిన్. 197

చ. భృగుఁ డఱగాలఁ దన్నె మును వెన్నుని, సాగరసప్తకంబు లె
స్సగఁ జుళుకించి గ్రోలె ఘటజన్మమహాముని, యట్టిశక్తి మీ
కుఁ గలుగ దేల? మౌఢ్య మిఁక గొబ్బునఁ ద్రోచి ద్విజాతిధర్మముల్
డిగ విడనాడుమీరలు కడింది వినిష్కృతి సేసికొందగున్. 198

మ. అనుచున్ వారలు ప్రొక్కి శాస్త్రవిధిఁ బ్రాయశ్చిత్తముల్ చేసికొం
చనిదంపూర్వపవిత్రవృత్తు లయి శుద్ధాద్వైతబద్ధాదరం
బునఁ బంచాయతనార్చనాది సకలంబున్ సల్పుచున్ శంకరా
ర్యుని సేవించిరి శిష్యు లౌచు నపుడే యుత్సృష్టసందేహులై. 199

చ. ఇటు పటుయుక్తిసూక్తుల యతీంద్రుఁడు దర్పవలగొంచు నీచవా
క్ఛటల నెదుర్చువారి ద్విజజాతి బహిష్కృతులౌ ననార్యులన్
బటుమతులైన శాక్తుల క్షణంబునఁ దత్ప్రతివాక్యలాపనా
పటువులఁ జేసి లోకహితవాంఛ రచించెను గర్మసేతువుల్. 200

శంకరుఁడు రామేశ్వరమున కరుగుట

మ. క్రమ మొప్పం గనుఁగొంచుఁ బూర్వరరమన్ రామేశ్వరక్షేత్రసీ
మము నెల్లన్ వలగొంచు వచ్చి కనెఁ దన్మధ్యస్థ సౌవర్ణహ
ర్మ్యమునన్ రాఘవ సంప్రతిష్ఠితుని సవ్యార్ధాంగ మాతాగ్రిగృహ
స్థు మహానీలలసత్కిరీటు జగదీశున్ రామనాథేశ్వరున్. 201

సీ. సేతుపరిష్కృతసింధూర్మికల రామ
నాథార్ణవముగ స్నానం బొనర్చి
నభిషేక మొనరించె నమలగంగాంబులఁ
బొంగి తత్సైకతలింగమునకు
నారగ్వధాబ్జ దుత్తూరప్రసవ బిల్వ
పత్త్రిరాశులతో సపర్య నడపె
నానాఫలమ్ముల నైవేద్య మర్పించెఁ
గమ్మని కవిత స్తోత్రమ్ము సేసె

గీ. శంకరాచార్యుఁ డిటు నిజచ్ఛాత్రసమితిఁ
గూడుకొని బ్రహ్మభావన షోడశోప
చారముల రామనాథు హర్షమునఁ దేల్చె
రెండుమాసము లచటనే యుండఁ దలఁచె. 202

వ. అంత నాక్షేత్రవాసులును, తత్పరిసరజనపదనివాసులు నగుప్రజ
లును శంకరాగమనంబు విని దర్శింప గుములు గట్టి నిరంతరం బరు
దెంచి తద్బోధమునఁ దనియుచుండుదు రట్టియెడ. 203

సీ. అద్వైతదూషకు లంచితలింగాంక
బాహుయుగ్మకులు శైవవ్రజంబు
శూలాంకచిహ్నితఫాలస్థలులు లింగ
ముద్రితాఖిలతనుల్ రుద్రభక్తు
లురుడమర్వాంకబాహులు లింగధరులు మ
స్తకధృతశూలురు జంగమాళి
శూలాంకలక్షితఫాలవక్షోనాభి
బాహావిరాజితుల్ పాశుపతులు

గీ. గుములు గుములుగ వచ్చి యగ్గురులలాముఁ
గాంచి ప్రణమిల్లి యీరీతిగా వచించి
రఖిలమతముల కుత్తంశ మని యొకొక్క
రాత్మమతగత వివిధసిద్ధాంతములను. 204

వ. అందుఁ బాశుపతు లి ట్లనిరి. 205

క. కారణ మీశ్వరుఁ డగుట స
దారాధ్యుఁడు చిహ్నధారు లగువారి కప
ర్ణారమణుఁడె యను నిగమస
మీరితములె మానములు సుమీ మతమునకున్. 206

గీ. ఋతము సత్యమ్ము పరమునై యెసఁగు బ్రహ్మ
మనఁగ, నూర్ధ్వరేతుఁడు విరూపాక్షుఁ డైన
కృష్ణపింగళపురుషుఁగా నెంచి యట్టి
విశ్వరూపున కర్పించువినతి యిద్ది. 207

సీ. ఏదేవునకు దివం బెసలారు శిరసుగా
నభ మెుప్పు నెవనికి నాభి గాఁగ
భాస్కరుఁ డిందుఁ డెవ్వని కనుఁ గవలు గా
నెవని కా దిక్తతి శ్రోణములుగ

చ. ఇటు పటుయుక్తిసూక్తుల యతీంద్రుఁడు దక్ వలగొంచు నీచవా
శ్చటల నెదుర్చువారి ద్విజజాతి బహిష్కృతు లౌ ననార్యులన్
బటుమతులైన శాక్తుల క్షణంబునఁ దత్ప్రతివాక్యలాపనా
పటువులఁ జేసి లోకహితవాంఛ రచించెను గర్మసేతువుక్. 200

శంకరుఁడు రామేశ్వరమున కరుగుట

మ. క్రమ మొప్పం గనుఁగొంచుఁ బూర్వరరమన్ రామేశ్వరక్షేత్రసీ
మము నెల్లన్ వలగొంచు వచ్చి కనెఁ దన్మధ్యస్థ సౌవర్ణహ
ర్మ్యమునక్ రాఘవ సంప్రతిష్ఠితుని సవ్యార్ధాంగ మాతాద్రిగృహ
స్థు మహానీలలసత్కిరీటు జగదీశున్ రామనాథేశ్వరున్. 201

సీ. సేతుపరిష్కృతసింధూర్మికల రామ
నాథార్పణముగ స్నానం బొనర్చి
నభిషేక మొనరించె నమలగంగాంబులఁ
బొంగి తత్సైకతలింగమునకు
నారగ్వధాబ్జ ధత్తూరప్రసవ బిల్వ
పత్త్రరాశులతో సపర్య నడపె
నానాఫలమ్ముల నైవేద్య మర్పించెఁ
గమ్మని కవిత స్తోత్రమ్ము సేసె

గీ. శంకరాచార్యుఁ డిటు నిజచ్ఛాత్త్రసమితిఁ
గూడుకొని బ్రహ్మభావన షోడశోప
చారముల రామనాథు హర్షమునఁ దేల్చె
రెండుమాసము లచటనే యుండఁ దలఁచె. 202

వ. అంత నాక్షేత్రవాసులును, దత్పరిసరజనపదనివాసులు నగు ప్రజలును శంకరాగమనంబు విని దర్శింప గుములు గట్టి నిరంతరం బరుదెంచి తద్బోధమునఁ దనియుచుండుదు రట్టియెడ. 203

సీ. అద్వైతదూషకు లంచితలింగాంక
బాహుయుగ్మకులు శైవవ్రజంబు
శూలాంకచిహ్నితఫాలస్థలులు లింగ
ముద్రితాఖిలతనుల్ రుద్రభక్తు
లురుడమర్వాంకబాహులు లింగధరులు మ
స్తకధృతశూలురు జంగమాళి
శూలాంకలక్షితఫాలవక్షోనాభి
బాహావిరాజితుల్ పాశుపతులు

గీ. గుములు గుములుగ వచ్చి యగ్గురులలాముఁ
గాంచి ప్రణమిల్లి యీరీతిగా వచించి
రఖిలమతముల కుత్తంశ మని యొ కొక్క
రాత్మమతగత వివిధసిద్ధాంతములను. 204

వ. అందుఁ బాశుపతు లి ట్లనిరి. 205

క. కారణ మీశ్వరుఁ డగుట స
ధారాధ్యుఁడు చిహ్నధారు లగువారి కప
ర్ణారమణుఁడె యను నిగమస
మీరితములె మానములు సుమీ మతమునకున్. 206

గీ. ఋతము సత్యమ్ము పరమునై యొసఁగు బ్రహ్మ
మనఁగ, నూర్ధ్వరేతుఁడు విరూపాక్షుఁ డైన
కృష్ణపింగళపురుషుఁగా నెంచి యట్టి
విశ్వరూపున కర్పించువినతి యిద్ది. 207

సీ. ఏదేవునకు దివం బెసలారు శిరసుగా
నభ మొప్పు నెవనికి నాభి గాఁగ
భాస్కరుఁ డిందుఁ డెవ్వని కగుఁ గనులు గా
నెవని కౌ దిక్తతి శ్రోత్రములుగ

మఱి వివృత్తంబు లామ్నాయంబు లెవనికి
వెలయు వాక్కుగ నంచు వేదకథితుఁ
డగునట్టి వానిమోక్షార్థినై శరణంబు
వేడెద నను వాక్యవిధముఁ బట్టి

గీ. శివుని యెడ భక్తి గల్గి తచ్చిహ్నచిహ్ని
తాత్ము లగుభక్తజనముల కనవరతము
నభవ లోక నివాస రూపామృతంబు
హస్తగత మౌఁ జుమీ యనాయాసముగను. 208

వ. ఇంతియ కాదు! జగత్కారణం బెద్ది యని యొకప్పుడు దేవతలు ధ్యానించుచుండ నంబరంబున నంబరాంబరుండు దివ్యదర్శన మొసంగి "నీ వెవ్వఁడ?" వని యడుగు నిర్జరుల కిట్లనె. "వేల్పులార! తొలుదొల్త నే నొక్కండ నుంటి నాకంటె నన్యుండు లేఁడ నేఁడు జగదీశ్వరుండ నగుట నద్వయుండనై నేన యుందు" ననియెఁ గావున నుపాదానకారణం బగుటం జేసి ప్రభు వగుశివుండ సద్బ్రహ్మాత్మాదికము లగుసామాన్యశబ్దములకు వాచ్యుం డయి జగత్కర్త యగు.

ఆ. "లేఁడు తొల్లి బ్రహ్మ లేఁడు శంకరుఁడొక్క
వాసుదేవుఁ డున్నవాఁ" డను నెడ
నగును వాసుదేవుఁ డన మహాదేవుండె
విను తదర్థ మింత విస్తరింతు. 210

వ. తనయందు జగము లన్నియు వసించుటను వాసు వనంబడు, నట్టి దేవుండ వాసుదేవుం, డతండ జగత్కర్త యగుమహేశ్వరుండు. శ మ్మన సుఖంబు, దానిం గలిగించువాఁ డగుటం జేసి శంకరుం డనం బరఁగు నట్టిచో విష్ణుండు పాలకుం డనుట యెట్లు పొసంగును? ప్రాకృతప్రళయంబునఁ బాల్యం బగుజగం బెల్ల నభావంబుం

బొందఁ బాలకుం డగువిష్ణువును లేకుండుట ధ్రువంబు 'రుద్రులలో శంకరుఁ డను నేన' యనిన కృష్ణోక్తియే శంకరుండు పరమాత్మ యనుటకుఁ బ్రమాణము మఱియు దుర్వాసునకు మహాదేవుండు చెప్పిన కొన్ని వాక్యంబులు గలవు సావధానంబుగ వినఁదగినవి 211

సీ. అరయ నే నొకఁడ నక్షరుఁడఁ గర్తఁ బరాత్ప
రుఁడ శివుండను సదాత్ముఁడను జువ్వె
యజ విష్ణువులకు లోకావళి కాదికా
రణ మైనవాఁడఁ బురాణవస్తు
వను బూర్వగుఁడను బూర్వజ్యేష్ఠుఁడను శ్రేష్ఠుఁ
డను నద్వితీయుండ ననఁ దనర్తు
నస్మదిచ్ఛారూప యగుశక్తి లోకసం
హారమ్ము సేసి నాయందు డణంగు

గీ. సృష్టిసేయుదు నేఁ బునస్సృష్టి దాని,
నది ప్రకృతియై గుణత్రితయాంకురప్ర
ధానకారణ మగు మహత్తత్త్వమును సృ
జించె మత్సాక్షికము స్వతంత్రించి యంత. 212

మ. కలిగించెన్ ద్రిగుణాత్మకం బగునహంకారమ్ము, దానన్ గుణా
త్ములు రుద్రుల్ పదునొక్కరున్ బొడమ, నందున్ సృష్టికై రాజసా
త్ములు, రక్షార్థము సాత్వికాత్ములు, లయంబున్ జేయఁగాఁ దామసా
త్ములఁ గావించె యథాప్రకారముగఁ బెంపుంగాంచు నట్లాదృతిన్.

క. ఆవిర్భవించిరి యవ
* ర్ణోవర్ణ మవర్ణములఁ బయోజాసన ల
క్ష్మీవర శివు లనఁ గ్రమముగ
మూవురు సకలమ్మునందు ముఖ్యులయి తొలిన్. 214

---

క. 'అ'నుండి పొడమె ద్రుహిణుం
* 'ఉ'నుండి జనించి విష్ణుఁ డుదితుఁడై 'మ'వ
ర్ణాన మహేశుఁడు, సకలము
లోన ప్రముఖభావమున వెలుంగుదు రెలమిన్. పాఠాంతరము.

ఆ. వారి ననుసరించి వర్తింతు రితరు లే
కాదశేషు లిట్టి క్రమమువారు
తద్విభూతు లిపృథక్పృథగాఖ్య నహా
నమరతతి చరాచరము జగము లు. 215

క. నానాత్వము తత్తత్క
ర్మానుస్మృతిని జెందినట్టి యఖిలమును లయం
బౌ నల బ్రహ్మజ్యోతి, న
నూన ప్రలయావసర మహోగ్రావస్థన్. 216

సీ. అఖిలంబు లోఁగొని యరుణ మహారాజస
తేజంబు మలయ వర్తించు బ్రహ్మ
శ్యామలం బైన నారాయణ తేజంబు
నందు నస్తంగతుం డైనయంత
నంతర్భవించు నారాయణుండును శుక్ల
దీధితి యగురుద్ర తేజమందు
నారుద్రుఁడు స్వకీయ మగుశుక్ల తేజంబు
తోఁ బ్రకృత్యంతర్గతుఁడుగ నౌను

గీ. ప్రకృతినామయు శుక్లవర్ణయు నగు మ
దిచ్ఛ నాయందె డిందుఁ జుమ్మా యు టౌట
నను ననంతు సర్వజ్ఞు లౌజనులును గన
లేరు; నామాయఁ దెలియఁగా లే రెవండు. 217

సీ. కాన శ్రీరుద్రసూక్త జపాశ్రితులు రుద్ర
భవ్యపూజాది తాత్పర్యమతులు
పంచాక్షరీమనూపాసకుల్ భసితలి
ప్తాంగులు రుద్రాక్షహారధారు

లవిరతధ్యానపరాయణులును నౌడు
నవ్యక్తు వ్యక్తాత్ము నభవు రుద్రుఁ
బూజింతురే నరపుంగవుల్ వారికి
నిశ్శ్రేయసమ్ము పాణిస్థ మగుట

గీ. భూతిరుద్రాక్షధారణంబును బొనర్చ
యమల మగు భక్తిరీతిఁ జిత్తమును గూర్చి
శ్రీమహాదేవు నర్చనశ్రీఁ దనర్చి
ద్వంద్వముక్తుండవై భవవ్యథ విడుచు. 218

క. అని యభవుఁడు దుర్వాసో
మునికిఁ దెలిపి మాయమయ్యె; మునియుఁ దదాచా
రనిరతుఁ డయ్యెను గావున
జనును ముముక్షులు పరాత్ము శంభు భజింపన్. 219

గీ. ధృతిని నారాయణుం డద్వితీయుఁ డగుచుఁ
బ్రజల సృజియింపఁ దలఁచునప్పట జనించె
భూతములు, తద్విధాన విధాతయును బ్ర
జాపతియుఁ బుట్టి రని శ్రుతిసరణి లేదె? 220

శా. ఆనారాయణశబ్దవాచ్యుఁడు శివుం డౌ నార మన్నన్ విధిం
దాగ్రినంతాదినృకోటి, యద్ది యయనం బౌవాఁడ నారాయణుం
డౌ నాదిత్యతతుల్ తదంశములె సుమ్మా భూద్యురాదిస్థులౌ
నానారుద్రులకున్ నమస్సనెడు నామ్నాయంబు మానం బిటన్. 221

గీ. ఎవనివలనఁ ద్రిమూర్తు లుద్భవము గనిరొ
తత్ప్రకేశుండె కారణత్వమున జ్యేష్ఠుఁ
డై సచందానఁ దాన కార్యత్వమునఁ గ
నిష్ఠుఁ డగు నని వాకొనె నిగమ మరయ. 222

ఆ. జ్ఞానమయు ననంతు సత్యుఁ బ్రభు గుహా
నిహితు నెఱుఁగఁ దగు నని యెడు శ్రుతికిఁ
బరఁగ లక్ష్య మైనవాఁ డమ్మహేశ్వరుఁ
డతఁ డొకండు జగదుపాస్యుఁ డెన్న. 223

క. నిర్గుణుఁడ యయ్యు నీశుఁ డ
నర్గళ చిరకాల చింతనాయత్తుండై
సర్గ మొనరింతు నని యం
తర్గతిఁ జింతించి పెక్కునాళులు కడకున్. 224

సీ. ఆత్మ తేజంబు సూర్యాకారముగ, మనం
బును జంద్రునిగ, సత్త్వమును గుజునిగ
సర్వవాఙ్మయమును సౌమ్యునిగా, సుఖ
జ్ఞానపుంజమ్ము వాచస్పతినిగ
వీరమ్ము దానవాచారునిగాఁ, గ్లేశ
మును శనైశ్చరునిగా, మును సృజించె
వెలుఁగు సూర్యాదిమండలములు తత్తేజ
మునఁ గాని వెలుఁగనేర్చునె తమంత?

గీ. ఇందులఁ బ్రమాణముగ గ్రహియించి పలుకఁ
జను 'న తత్ర సూర్యో భాతి చంద్రతార
క'మ్మని యుఁ 'దస్య భాసా జగంతి భాంతి'
యనియుఁ జాటెడు వేదమ్ము యతిలలామ! 225

క. ఆనారాయణపదమున
కా నీశునివలన బ్రహ్మ యయ్యెఁ జుమి ప్రజే
శానుఁడుగ, విష్ణు వయ్యెఁ బ్ర
జానీకాజస్రపాలనాధాముఁడుగన్. 226

ఉ. పాయక తొంటినుండియును బ్రహ్మయు నీశుఁడు లేనియప్డు నా
రాయణుఁ డుండె నంచు శ్రుతియందు శ్రుతంబగుఁగా సభావమై
యీయఖిలంబు డిందినను నీశుఁడు విశ్వజగన్నిదానుఁ డే
చాయ సభావమొందఁ డని చాటదె వేదము యప్పరాత్పరున్. 227

క. కర్మమునఁ బుట్టు లోకము
కర్మమున నశించు నను నిగమసూక్తిని ద
త్కర్మము కారణ మను టెటు?
కర్మము ఫల మిడదు జడముగాన; శివుఁ డిడున్. 228

గీ. ఈశ్వరు సభావునిగ గ్రహియించువాని
నిందనొనరించి, యున్నవానిగ నెఱుంగు
బ్రహ్మవేత్తను వేదమ్ము ప్రస్తుతించెఁ
గను "మసన్నేవ స భవతి" యనువచనము. 229

ఆ. కాన లోకకర్త యా నీశరూప ప
రాత్మ సంతత మ్ముపాసనమ్ము
సేయుచును దదీయచిహ్నమ్ము లొడల న
వశ్యముగ ధరింప వలయు నియతి. 230

శంకరులు శైవమతమును ఖండించుట

చ. అనవుడు శంకరుం డనె నహో సృజనస్థితినాశముల్ పొన
ర్చును దుహిణాబ్జనాభ హర రూపము లొంది యొకండె దేవుఁ డం
చును శ్రుతి యుండె; మాకును ద్విశుద్ధిగ నిష్టము; లింగధారణం
బున కెచటన్ గనంబడదు మూలము కావున మానఁగాఁదగున్. 231

వ. మఱియు వేదవేదాంగవేత్త నాభి కూర్ధ్వమున సోమపులును, నధర
దేశంబున నసోమపులును వసియించుట శ్రూయమాణంబ కాదె!

సీ. కైశిక శీర్షాలిక శ్రోత్ర ఘ్రాణ క
    పోల జిహ్వోష్ఠ చిబుక గళములు
న సంధ్యాయ ద్విబాహూ పాణ్యురో నాభి
    కటిదేశ లింగ ముష్కములు మఱియు
నంఘ్రిజంఘాయు గోర్వష్ఠీవ వంక్షణ
    వస్తి పాయ్వాది కావయవములును
నాలంబనములుగా నస్మదాదిక సర్వ
    బృందారకులు మునుల్ పితృగణంబు

గీ. స్నానపానాన్నమిశ్రితం బైననిత్య
కృత్యములఁ దృప్తు లగుదు మం చీశుఁ డయిన
బ్రహ్మ యరుణ కేతువునకు వక్కణింప
లేదె శ్రోత్రియుమూర్తి నిలింపు లునికి. 233

క. సకలామరమయ మగు నే
నికిఁ దాపము గూర్పఁ గలుగనేరదు శ్రేయం
బకట! యనూచానుని మెయి
సకలామరు లుందు రనుచుఁ జాటవొకో శ్రుతుల్. 234

క. 'చితికాష్ఠ మటుల వీఁ డికఁ
బతితుఁ డగుత' మని శపించి వడిమీఱఁ బలా
యితు లగుదురు శీర్షాది
స్థితులు సురలు తాప మింత దేహము సోఁకన్. 235

ఆ. కర్మయోగ్య మైనతన్మదేవుతనువున
వ్యాధి లేక తాల్చినట్టి చిహ్న
మఱఁ బడిన సూర్య నప్పుడ వీక్షింప
వలె, ప్రహ్లదమునసేని వలయు మునుఁగ. 236

గీ. ఈదృశాగమవాక్యంబు లెన్నో కలవు
వినుఁడు 'యోఽన్యా' మ్మనెడుశ్రుతి భేదకలిత
మగు నుపాసన గర్హణీయంబ యంచు
వక్కాణించెను హేతువుల్ పెక్కుసూపి. 237

చ. అవనిసురుండు కర్మచిత మైనసమస్తజగంబు లెన్న న
ధ్రువములుగా నెఱింగిఁ విరతుం డయి రాగమునుండి యాత్మవి
త్ప్రవరుఁ ద్రయీగతార్థవిదు 'బ్రహ్మముఁదెల్పు'మటంచు నాశ్రయిం
పవలె నటం చికొక్కశ్రుతి పల్కును- ముక్తికి వేద్య మాత్మయే.

వ. కాన నన్యచిహ్నధారణంబు వ్యర్థంబు. ముక్తికి బ్రహ్మజ్ఞాన మొ
క్కండ సాధంబు. 239

క. కన రా కనుప్రవిష్టుం
డును గూఢుఁడు గహ్వరేష్ఠుఁడు గుహానిహితుం
డు నపూర్వుఁ డయినదేవుని
గని యాత్మజ్ఞాని వాయు గాసియు ముదమున్. 240

గీ. ప్రవచనమ్మునఁ బరమాత్మ పట్టువడఁడు
చిక్కఁ డమితశ్రుతంబుల, శేముషిని ల
భింపఁ- డెవ్వఁడు వరియించుఁ బ్రీతిఁ దన్నుఁ
దన్నరుశరీరము వరించుఁ దప్పకుండ. 241

ఆ. తనువులందు నతనువును, ననవస్థవ
స్తువులయం దవస్థితుఁడును గాఁగ
నమ్మహావిభుని బరాత్ముని ధీరుండు
మనన మొనరఁ జేసి వనట లుడుగు. 242

గీ. ఆకసమ్మును గృష్ణాజినాదిక మటు
చుట్టగాఁ జుట్టఁజాలినచో నమండు
స్వాత్మము నెఱుంగకయ భవానంతదుఃఖ
మును దరించు నటంచు వాకొనియె శ్రుతులు. 243

క. అటు గాన గురునికరుణా
కటాక్షమున నాత్మవిద్యఁ గఱచి యభేద
స్ఫుటవాదసుధాస్వాదన
పటుతృప్తిం గనుము గురుని భక్తిఁ గొలుచుచున్. 244

క. అని యుక్తియుక్తముగ గురుఁ
డన విని విద్వేషవీరుఁ డనులింగధరుం
డనయము ప్రీతుండై వం
దన మిడి యగ్గురులలాముసకు ని ట్లనియెన్. 245

శా. స్వామీ! నాకు శరణ్య మీవ, మును సంసారాహిదంష్ట్రావిష
వ్యాముగ్ధాత్ముఁడ నై తిఁ బ్రోవు, భవదచ్ఛామ్నాయవాగ్రీతిచే
నామూలంబు నశించె భేదము 'శివోహ' మ్మంచు నద్వైతవి
ద్యామాహాత్మ్య మెఱుంగఁ గంటిఁ జరితార్థం బయ్యె నాజన్మమున్

క. నీవ మహాదేవసప
ర్యావాప్తఫలంబ వనఘ! యద్వైతసుధా
సేవధిదాతవు కావున
నీవ యనుత్తముఁడ విశ్వేశ్వరుకరుణన్. 248

గీ. అనుచు నుతిపాత్రుఁ డగుశంకరార్యుఁ బాగడి
మొయ్యన నమస్కరించి పాదోదకములఁ
గ్రావి తత్కథితాచారతత్పరుఁ డయి
త్రిప్పె నద్వైతమునకు స్వదేశ మెల్ల. 248

విపక్షశూలాది లింగధారులతో శంకరుఁడు వాదించి జయించుట

వ. అంత నవ్వృత్తాంత మెఱింగి విపక్షశూలుఁడు మున్నగు లింగధారులు మఱి కొందఱు భూతిరుద్రాక్షధారులై లింగచిహ్నాతులై యుగ్రాకారముల వచ్చి యయ్యతీంద్రున కి ట్లనిరి. 249

ఆ. మాయవేష మూని మావాని బ్రాహ్మణి
కమతదూరుఁ జేసి కుమతమందు
నిలు ప్రవేశపెట్టి యేఁగుచునుంటి నీ
కంటె వంచకుండు గలఁడె జగతి? 250

సీ. "బ్రాహ్మణ్యమునకంటె వైష్ణవం బగ్ర్య ము
త్తమము శైవం బెన్న దానికంటె"
నని చెప్పఁడే నారదున కజుం డటుగాన
నారూఢుఁ బఱితు నేలా యొనర్చి?
తౌర 'నమస్తే' యటన్న వేదోక్తి సం
స్తుతుఁడు విశ్వాత్ముఁ డీశుండ కాఁడె?
యతఁ డఖిలాస్యోత్తమాంగకంఠుఁడు జగ
ద్వ్యాపి భూతౌఘగుహాశయుండు

గీ. కాన శివుఁ డొక్కరుఁడ సర్వగతుఁ డటంచుఁ
బురుషసూక్తము శ్వేతాశ్వతరముగూడఁ
బలికి విరమించెఁ గాన విశ్వస్వరూపుఁ
డభవుఁ డంచు నిరూపితుం డయ్యెఁ గాదె? 251

గీ. హ్రీయు లక్ష్మియుఁ బత్నులం చీశ నహస్సు
రాత్రియును బార్శ్వము లటంచుఁ బ్రస్తుతించు
వాక్యయుగళంబు శివపరత్వమె నిరూప
ణంబు నిశ్శంకముగను బొనర్చెఁ గనుము. 252

గీ. గంగయే హ్రీ యటంచుఁ దద్ద్వారి లక్ష్మి
యనుచు వా రిర్వురకుఁ బతి యల్లశివుఁడ
యనుచు యామళమున స్కాందమునను గొన్ని
వాక్యములు పొల్చు విను మోతపస్వి! వాని. 253

వ. తొల్లి హిమాచలంబున శివమౌళి గంగ డిగ్గ నుఱికిన దదీయభార సంభ్రాంతుండై రుద్రుండు హ్రీమతివై యుచ్చైర్వర్తనశూన్యవై బ్రహ్మవిష్ణ్వాదికారణం బగుపరమపురుషశ్రేష్ఠు న న్నొంది యడంగి యుందువుగా కని యానతిచ్చిన మందాకిని హ్రీభాగపీడిత యగుచు నప్పర మేశుజటాటవి భక్తి నణంగి వర్తించుటం జేసి హ్రీ యని బుధజనాభిహిత యయ్యె. 254

గీ. ఆ సదాశివు నంకపీఠాధిరూఢ
యగుచు నేఁటికి వెలుఁ గొందునట్టి శ్యామ
విశ్వమోహనరూప మహేశ్వరి యన
నలరు పరశక్తియే 'లక్ష్మి' యయ్యె నయ్య! 255

ఉ. ఆ గిరిరాజనందిని మహాశకణమందు జనించు నిందిరా
వాగయుతంబు; లీశ్వరు నవార్యమహస్సున నిందిరాధిభూ
వాగధిపాదికోట్లు ప్రభవం బగు వారికి నాశ మబ్బునన్
వేగ సృజించు నాశివుఁడు; నేతృఁడు వారికిఁ దానె కావునన్. 256

క. అచ్చపుఁబటికమునకు సరి
వచ్చెడుకుడివైపు దివసభావము, నైల్యం
బెచ్చు నెడవైపు రాత్రిత
యుచ్చుపడఁగఁ దనకు, నాపరాంబిక యొప్పున్. 25

గీ. నేను నిత్యుండ మఱియు ననిత్యుఁడ నని
తన్ను సర్వాత్మకునిగ జగన్నిదాన

భూతునిగఁ జెప్పె సురల కిమ్మొగ శివుండె
యని యథర్వశ్రుతిని గాన నగును వింటె. 258

వ. మఱియు శివరహస్యఖండమ్మున శివుండె ధ్యేయుం డని చెప్పం
బడఁడె? 259

సీ. 'శివుఁడె ధ్యేయుం డని చెప్పఁగా దివ్యవా
చంయమాగ్రేసరసమితి సాక్షి.
'జ్ఞానప్రదాత యీశానుఁ డొక్కఁడ' యని
ప్రకటింప మహితుఁ డౌ శుకుఁడె సాక్షి.
'జ్ఞానసంవేద్యుఁ డీశ్వరుఁడే' యటంచుఁ ద
థ్యముగవాక్రువ్వ వేదమ్మె సాక్షి.
'స్వకభక్తవిమత శిక్షణ విచక్షణుఁ డుమా
పతి' యన శమనపరిభృతులె సాక్షి.

గీ. 'నిత్యుఁ డీశ్వరుఁడే' యన నీరజోద్భ
వోత్తమాంగకమాల్యసంపత్తి సాక్షి.
'యాది యంతమ్ము లేనివాఁ' డనఁగ సాక్షు
లాత్తకిరి హంస రూపు లౌహరియు నజుఁడు. 260

వ. అని యిట్లు జగత్కారణ మీశ్వరుం డగురుద్రుండ యని శ్రుతులం
దెల్లెడ నుల్లసిల్లుఁ గావున నాతండె జ్ఞేయుండు. రుద్రకాండమ్మునఁ
దప్తలింగాంక, రుద్రాక్ష, విభూత్యాదికధారణంబును, బీఠాద్యర్చ
నంబును, రుద్రాధ్యాయజపమును, సర్వకిల్బిషహరణకారణము
లనియు, శివరూపాపాదకము లనియు నిరూపింపఁబడె. 261

గీ. స్తేయ గురుదారగమన మైరేయపాన
విప్రహత్యాది నేది గావించెనేని
యాతఁ డఘముక్తుఁ డగు లిప్తభూతియై వి
భూతిఁ బండె రుద్రాధ్యాయమును జపింప. 262

ఉ. ఆవలఁ గోటిజన్మసముపార్జితపుణ్యము లున్న నే మహా
దేవునిపట్ల భక్తి పొడ తెంచును, దద్దృఢభక్తి గల్గు స
ద్భావుఁడు పాతకమ్ము లుపపాతకముల్ పొరిప్రుచ్చి, ముక్తికిన్
బోవు నటంచుఁ జెప్పెఁ గనవో శివగీతలయందు సత్తమా! 263

వ. మఱియు నాశివగీతలయందు ధర్మార్థకామమోక్షములపార మొందఁ గలవా రని మునులకై శివుండు తెల్పిన పాశుపతవ్రతక్రమంబు సెప్పెద వినుము. 264

క. విరజాహ్వయదీక్షం గొని
హారాక్షములఁ దాల్చి భూతి నలఁదికొని నిరం
తరము శ్రుతిసార మనునీ
శ్వరనామసహస్రమును జపము సలుపవలెన్. 265

క. దాన నరత్వ మ్మఱి యీ
శానతనువు గలుగ లోకశంకరుఁడు శివుం
డానతులయెడఁ బ్రసన్నుం
డౌ నని కైవల్య మొసఁగు ననియు వచించెన్. 266

గీ. బ్రాహ్మణులకు విభూతిధారణ మవశ్య
మనుచుఁ గాలాగ్నిరుద్రవేదాంతసూక్తి
యలరుఁ గాన విభూతిమాహాత్మ్య మెల్ల
నెఱిఁగి వచియింప నెవ్వానితరము ధరణి. 267

క. ఔదల నొసటను మెడను శ్రీ
వో దోర్యుగముల హారాక్షములఁ దాల్చు నరుం
డౌ దిగ్వాసుఁడు— వాఁడ ధ
రాదివిజుం డయ్యెనా పరాత్పరుడె యగున్. 268

చ. అనుచు నగస్త్యసంహిత నిరాకులరీతి వచించు నంతెకా
దనఘ! "యతప్తదేహుఁడు చిదాత్మము నొందఁ" డనన్ బ్రమాణముం
ట నటు ముముక్షువుల్ తనువునన్ శివలింగముముద్రలన్ ధరిం
ప నగు నవశ్య మంచును విపక్షు లనన్ యతివర్యుఁ డిట్లనున్. 269

గీ. అట వివక్షిత మరయఁ గృచ్ఛ్రాదితాప,
మనలతాపమ్ము గాదు– 'కృచ్ఛ్రాదికృశుఁడె
తప్తుఁ' డని పేర్కొనినబృహన్నారదీయ
మున కతివిరుద్ధ మీరు పల్కినవిధంబు. 270

సీ. లింగాంకితాంగు రథాంగశంఖాంకితాం
గునినేని కన నీట మునిఁగి కాని
సూర్యుఁ గన్గొని కాని శుద్ధుఁ డౌఁ దప్తలిం
గాంకన తప్తచక్రాంకనులను
పాషండధర్మతత్పరు లైనవారి వా
జ్మాత్రనే నర్చింపఁ గాదు మఱియు
హవ్యకవ్యమ్ములం దవ్వాఁడు త్యాజ్యుఁడు
త్యాజ్యంబు తద్వీక్షితాన్న మెపుడు

గీ. లింగచక్రాంకమాత్ర వేదాంగవేత్త
యగుచు వైదికాచారపరాయణుఁ డగు
నట్టిఁడేనియుఁ బతితుఁ డౌ నంచు నుండె
నల బృహన్నారదీయమం దరసికొనుఁడు. 271

వ. అంతియకాదు. మార్కండేయపురాణమ్మున నైతిహ్య మొక్కండు
గలదు. తొల్లి గాయత్రితో విప్రులకుం బెద్దవాదు పుట్టుటయు నం
దమ్మహాదేవి క్రుద్ధయై మీరెల్లరు పాషండులై వేదోక్తకర్మదూరు

లును దాంత్రికాచారపరతంత్రులును నయ్యెద రని శపింప నాబ్రా హ్మణులు గజగజ వణంకి పాదంబుల వ్రాలి ప్రార్థింప నద్దేవి కరుణించి నావాక్యమోఘంబు మీరు కలియుగమున నధమద్విజులై, వేదార్థహీనులు, లింగచక్రచిహ్నితులు, జ్ఞానకర్మపదభ్రష్టులుఁ, గామక్రోధాదిపీడితులు నై పుట్టి, యాయుగము ముప్పదివేల వత్సరంబు లరుగ, నద్వైతార్థానుచింతకులై సత్యధర్మపరాయణు లయ్యెద రని శాపమోచనంబు చెప్పెం గావున లింగాదిధారణం బనార్యం బగుట స్పష్టంబకదా! 272

క. మానసముతోడ వాక్కు
వ్వాని నెనయలేక వెనుకఁబడె నాసత్య
జ్ఞానాదిలక్షణున కెం
దేని నుపాస్త్యనవబోధమే యొసలారుఁ. 273

గీ. దానికంటెను బ్రహ్మవతారుఁ డైన
శివు నుపాసన శ్రుతులందుఁ జెప్పఁబడియె
దాని నిరసింప నెవ్వానితరము? చేయఁ
దగినదియ భూతిరుద్రాక్షధారణంబు. 274

వ. అంతియ కాని లింగాదిచిహ్నధారణమునఁ బ్రమాణం బరయ మనుటయు, శివభక్తాగ్రగణ్యుం డగువిపక్షశీలుం డిట్లను, నార్యా! ప్రమాణంబు లేక పోలేదు. వలయునేని యిదె తెల్పెద నాలింపుము. 275

చ. మును త్రిపురాసురక్షయ సముద్యములై సుర లంద, ఱాది వ
హ్నిని, నడుమన్ శశిన్, దుది రమేశు ఘటించి సృజించి యొక్కయ
మ్మును-దమలో నెవండు నది పూన సమర్థుఁడు గామి నెవ్వఁ డో
నని మది నెంచుచోఁ గలిపయామరు లిట్లని రంతరజ్ఞులై. 276

క. జ్వాలనాదులు రుద్రుని యు
జ్జ్వలతేజంబులె; కృశానుచంద్రులు నేత్రం
బులు, హరి తద్దేహజుఁ, డ
ట్టు లగుట గా దిద్ది యమృడునకు భరంబై. 277

ఆ. అనఁగ దక్షుఁ గల్గునమరు లా నంచుఁ బ్రా
ర్థించి రంబికేశుఁ బృథులభక్తి
హరుఁడు గోరె సురల వరమొండు పశువుల
కేను బతిగ నుండ నిచ్చగింతు. 278

క. అనుటయు దేవత లని రే
మును నలినజుఁ డాది పసులము సుమా, మా కె
ల్లను బతి వీ వని తాల్పఁగ
మొనసిరి లింగాదిచిహ్నముల దేహముల౯. 279

ఉ. అంతట నల్లె వాసుకి, శరాసము మేరువు, చక్రముల్ వివ
స్వంతుఁడుఁ జంద్రుఁడున్, రథము క్ష్మాస్థలి, వాజులు వేదరాశి, త
ద్యంత విరించి, గాఁగ సకలామరసన్నుతుఁ డౌచుఁ గాళికా
కాంతుఁడు తచ్ఛరాగ్నులను గాల్చెఁ బురత్రయితో సురారులన్.

గీ. కాన లింగాదిచిహ్నముల్ పూన న్యాయ్య
మేము సేవకులము పరమేశుచిహ్న
ముల నవశ్యమ్ము దాల్పంగ వలదె? సేవ్య
సేవకుల కిట్టిధర్మంబు చెల్లు గాఁదె? 281

క. నావుడు శంకరుఁ డి ట్లను
దైవతతతి లింగశూలధారు లనంగా

లేవు ప్రమాణము, లగపడు
దేవతలు హరాక్ష భూతి ధృతి నిరతు లనన్. 282

క. అల కైవల్యోపనిషత్సూ
క్తుల 'శ్రద్ధాభక్తులను నకుంఠధ్యానా
కలన నెఱుఁగు మాత్మం' బన
నలసును, లింగాదిచిహ్న మగపడ దందుఁ. 283

గీ. జ్ఞానమునకు శూలాదిచిహ్నమ్ము లంగ
ములుగ నెందును గనరాద, బోధలిప్సు
జనులు ధరియించి రనుటయు విన మొకప్డు
గాన లింగాదిధృతి పాతకమున కగును. 274

వ. 'నాన్యః పంథా విద్య తేఽయనా' యేత్యాది వేదవాక్యములు ము ముక్షువున కపరోక్షజ్ఞానము వలయు నని తెలుపునే కాని యెందుం దేహసంతాపాదికమ్ము వలయు నని తెలుపవే! మఱియు నయ్యది శాస్త్ర వినింద్యంబు. 285

ఉ. తొమ్మదయు తేంద్రుచిహ్న మగుఛత్రము భృత్యునియందుఁ గానఁగా,
రాదు; మహేశచిహ్న మని రాజితభక్తిఁ దలంచి మీరు శూ
లాదులఁ దాల్ప నాగ్రహావశాత్ములరేని యమోఘమయంబు శూ
లాదినిమాత్రిఁ దాల్పవలె నబ్బును భారముమాత్రదానిచేఁ. 286

మ. "హరభక్తుండు భుజాదిభూషణముగా వ్యాళాదిచిహ్నాళిఁ ద
త్పరచిత్తంబునఁ దాల్పఁగావలె" ననన్ భావ్యంబె? యేరజ్జువో
యురగభ్రాంతిని గాంచుమాత్రమునఁ దాఁసోద్రేకసంజాత దు
ర్భర కంపావిల చిత్తుఁ డైనరుఁడు తాల్పఁ జాలు నె ట్లారయన్?

క. కావున నిష్పామరమతిఁ
బోవిడిచి, త్యజించి చిహ్నములు, శ్రుతిహితక
ర్మావహితుఁడవై కనుమా!
జీవేశైక్యానుభూతి స్థిరచిత్తమునన్. 288

ఆ. అట్టు లాత్మబోధ మలవడెనేని య
జ్ఞాననాశనమ్ము గలుగు దాన
ముక్తుఁ డౌదు వన్యమున నెన్నఁటికిఁ గావ
టంచుఁ బలుక గురున కతఁడు మ్రొక్కె. 289

వ. అట్లు మ్రొక్కి పశ్చాత్తప్తచిత్తంబుతోఁ గలంగి నలంగి. 290

ఉ. పీతసమస్తచిహ్నుఁ డయి వేగ సపుత్రకబాంధవమ్ముగా
నాతఁడు శంకరార్యచరణాశ్రయలబ్ధవివేకభావి తా
ద్వైతమతావలంబి యయి భాసిలెఁ; గొందఱు శైవు లంత న
ద్వైతమతప్రవిష్టు లయి తత్త్వ మెఱింగి చెలంగి రయ్యెడన్. 291

---

## ఆశ్వాసాంతము

శా. మాద్యద్రావణ వక్త్ర వారిజ వనీ మాతంగ! సుత్రామ పు
త్రోద్యద్దుర్దమ కాద్రివేయ గిలనాత్యుత్సాహ పిత్సత్పతీ!
ఖిద్యత్తాపస తాప హృ త్త్యభిన వాక్షీణాంబుమోత్సాబ్ద! బ్ర
హ్మాద్యారాధ్య పదాబ్జ పాంసు లగ నాబ్జాక్షీభవ త్ప్రస్తరా!

క. సగుణ భగవ త్స్వపర్యా
నిగమన పర నైకమత గణిత లత్యాత్మా!
అగుణ భగవ దగణిత మహి
మగ వాఙ్మనసానవాప్య మాహాస పుంజా!

మత్తకోకిలవృత్తము

దుష్టశిక్షణ శిష్టరక్షణ దుష్కరవ్రత దీక్షితా!
భ్రష్టధర్మ పునఃప్రతిష్ఠితి రక్షణాత్తవతారకా!
హృష్టవేంకటరాయమంత్రి హృదీడ్య మందిరవాస సం
తుష్టమానస! ముష్ట దుర్దమ దుష్ట విద్విష దిందిరా!

ఇది శ్రీగురుకరుణాసమాసాదితకవిత్వ
వెంపరాల సూర్యనారాయణ నామధేయప్రణీతంబైన
శంకరవిజయంబున

సప్తమాశ్వాసము.



శ్రీ గురుమూర్తయే నమః

# శంకరవిజయము



## అష్టమాశ్వాసము




త్ర్యంబక బింబా! గా
యత్ర్యంచితపురుషరూప! హస్తధృతలస
ద్ధాత్రీత్మజ! వేంకటరా
ద్ధాత్రీమరస్తుత్యనామ! దశరథరామా! 1

వ. అవధరింపుము. 2

### శంకరుఁ డనంతశయనక్షేత్రమున కేగుట

ఉ. ఆ నియతాత్ముఁ డ ట్లచట నద్వయనీతిఁ బ్రతిష్ఠ సేసి స
న్మానితుఁడై యనంతశయనం బను క్షేత్రముఁ జేరి యాహరిన్
బూని భజించు చొక్కనెల పుచ్చుదు; వైష్ణవ, పాంచరాత్ర, వై
ఖానస, భక్త, భాగవత, కర్మవిహీన, సమాఖ్యు లాద్విజుల్. 3

క. షడ్విధములవారు పరి
వ్రాడ్వగుదరిఁ జేరఁ బ్రాడ్వివాకుం డయి "వి
ద్విడ్వృత్తి మఱచి మీ మీ
షడ్విధమతరూపములఁ బ్రసంగింపుఁ" డనన్. 4

### భక్తమతనిరాసము

గీ. అందు భక్తాఖ్య విష్ణుమతావలంబు
లనిరి- సర్వజ్ఞుఁడు జగన్నియంత యజుఁడు
నైనవాసుదేవుండె రామాదికావ
తారముల నెత్తె భూభారహారకముగ. 5

క. మూఢుల నేమి మహాదేవుని
గాఢముగ నుపాస్తి సేసి 'కాంతుము తద్వా
సాధ్యాకన' మను బుద్ధిని
రూఢిని వర్తింతు మని యెఱుగుము మమ్ముల్. 6

శా. కౌండిన్యర్షికి సుప్రసన్నుఁ డయి లోకత్రాత యానియ్యనం
తుం డస్మత్సముపాస్యుఁ డై నభగవంతుం- డింక నాచారమం
దుండెన్ 'గర్మము, జ్ఞాన'మం చెఱుఁగుఁడింగోస్వామి! మాలోఁ గ్రియా
కాండాసక్తులు కొంద ఱుండి రరయంగా బ్రహ్మగుప్తాదికుల్. 7

ఆ. జ్ఞానసరణి విష్ణుశర్మాదులము మేము
నడతు మనుడు యతియు జ్ఞానలక్ష
ణంబు తెల్పుఁడా యనంగ నీక్రియఁ దెల్పె
విష్ణుశర్మ సూక్ష్మవిధము దోఁప. 8

క. శరణం బనంతభగవ
చ్ఛరణం బని మిన్న కుంట జ్ఞానము సుమి; యే
హరియాన లేక తృణమే
నటిముటిఁ జలియింప నేర కవనిం బడునో. 9

వ. అనుడు శంకరుం డవ్విష్ణుశర్మ కిట్లనె. 10

సీ. జనియించు శూద్రుఁడై జన్మమ్ము చే, గర్మ
మున జనించు ద్విజన్ముఁ డనఁగ నవుల
సంధ్య నుపాసింపఁ జను నిత్య; మన్యథా
యగునేనిఁ బ్రత్యవాయము ఘటిల్లుఁ
నహరాదివేళలం దగ్నిహోత్రాదిక
మును భక్తి మెఱయఁ బూజన మొనర్చి

సకలభద్రము లొందఁజాలెడు విద్వాంసుఁ
డగుబ్రాహ్మణుం డంచు నిగమసూక్తు
గీ. లభినుతించును నిత్యమైనట్టికర్మ
మిట్లు గావున శ్రుతిత్యక్తమైనకర్మ
మెల్లవారికిఁ గర్తవ్య మెపుడు; విధిని
విడువ వెత గల్గు నని మున్ను నుడివె మనువు. 11

క. క్రమ మఱి కర్మపరిత్యా
గముఁ దాఁ బ్రదికియు నొనర్చుకష్టున కాక
ల్పము నరక మ్మగుఁ; గర్మం
బమరదె స్నానామరార్చనాది యతులకేఁ. 12

క. కతిపయవత్సరములుగ వి
హితకర్మముఁ దొఱఁగువారి కెటు బ్రాహ్మణ్యం
చితగతి యలవడు నను న
య్యతిపతిఁ గని విష్ణుశర్మ యనియె నిటువలెన్. 13

గీ. 'నాకు సప్తమపురుషుండు నాసము డఁట
వానిపిత సుంత కర్మతత్పరుఁ డటంచు
బాల్యమున వింటిఁ బెద్దలవలన' ననుచుఁ
దొలఁగు దూరము ముం దంచుఁ బలికె గురుఁడు. 14

చ. అనవుడు విష్ణుశర్మ స్వగణావృతుఁడై వ్యథఁ గూరి దండరీ
తిని భువి వ్రాలి మ్రొక్కులిడి దేవ! మమున్ క్షమియింపు మన్నవా
నిని దగుపాచితంబున వినిర్మలుఁ జేయుఁ డటంచు శంకరుం
డనుటయు శిష్యు లెల్ల గురునానతిఁ బాలనసేసి రయ్యెడన్. 15

క. ప్రాయశ్చిత్తముల విమలు
లై యెల్లరు కర్మనిష్ఠు లగుచు నపుడు వా
రాయతిపతిఁ గని బ్రాహ్మ్యం
బీయెడ నీకతనఁ గంటిఁ; మిఁక ముక్తి యెటుల్? 16

క. నావుడుఁ బరమగురుండు ద
యావృతమతియై ద్విజాన్వయాచారమునన్
సేవింపుఁడు నిచ్చ శివ, ర
మావిభు, రవి, విఘ్నప, త్ర్యంబా, పంచకమున్. 17

సీ. పంచాయతనపూజ బ్రహ్మార్పణ మ్మని
నిష్కామబుద్ధియై నెఱపవలయు
నటు నిత్యకర్మమ్ము లాచరింప మనంబు
విమలమై జీవేశభేద మడఁగు
నాభేద మడఁగ మూలాజ్ఞాన మెల్లఁ బ
టాపంచ లగు; నది రూపణంగ
జ్ఞానమ్ము పొడతెంచు, దాన లింగశరీర
మస్తమించును, దాన నబ్బు ముక్తి.
గీ. గాని వేఱొకదారి మోక్షంబు గలుగ
దనుచు వచియించు నాచార్యునంఘ్రియుగళి
నగణుఁడై వ్రాలి యవ్విష్ణుశర్మ నిత్య
కర్మములఁ దత్పరతఁ జేయఁ గడఁగె నెలమి. 18

వ. స్మార్తాచారరతుండై భస్మంబునం జందనంబునం ద్రిపుండ్రంబు దాల్చుచు, స్నానం బొనరించి మృత్తిక నూర్ధ్వపుండ్రంబు తీర్చుచుఁ బంచాయతనపూజాపరుండై యుండు నంతఁ గర్మమార్గగాము లగు బ్రహ్మగుప్తాదు లరుదెంచి వందన మిడి. 19

శా. స్వామీ! స్మార్తమతావలంబనులమై బ్రహ్మార్పణం బన్నధీ
నే మెల్లప్పుడు కర్మముల్ నెఱపుకొం చీక్షేత్రమున్ బాయ కు
న్నా మంచుల్ పలుకన్ గురుం డనె 'నిఁకన్ బంచార్చనానిష్ఠఁ జే
తోమాలిన్యము వాసి, భేదమతి క్రందున్ ముందు పీడం దగున్'.

గీ. ఆత్మబోధాప్తి లింగదేహము నశింప
సద్వయము సచ్చిదానంద మైనబ్రహ్మ
మందుదు రఁటన్న, బ్రహ్మగుప్తాదు లెఱఁగి
శంకరునిశిష్యు లైరి, స్వాస్థ్యమ్ము గనిరి. 21

భాగవతమతనిరాసము

ఉ. అంత నొకండు భాగవతుఁ డొద్విజుఁ డయ్యతిఁ గాంచి పల్కె నొ
క్కింతగ మామతంబు వినుమీ! 'సకలశ్రుతిలబ్ధపుణ్య, మ
త్యంతము సర్వతీర్థములయందలిసత్ఫల మొందు మర్త్యుఁ డ
శ్రాంతజనార్దనస్తుతివశంవదుఁడై' యను సూక్తి చొప్పునన్. 22

ఆ. విష్ణుకీర్తనం బవిరతం బొనర్చుచు
శంఖచక్రచిహ్నశాలుల మయి
యతితితులసిపేరు లలిఁనూర్ధ్వపుండ్రమ్ము
లమర నిందు నుందు మబ్బె ముక్తి. 23

ఆ. అనుడు శంకరార్యుఁ డనియెఁ జక్రాద్యంక
నము ప్రమాణవిరహితము వినింద్య
మనుచు నెఱుఁగ కక్కటా! భాగవతుఁడ నం
చనఁగ నెంత ధైర్యమును వహింతు? 24

క. భగవంతుని మూర్తులు నా
లుగు దెఱఁగులు; వానిలోఁ దొలుతది పరాఖ్యన్
గగనాకృతి యగు, నది వా
గగోచరం బనఁ బ్రమాణ మాలింపగదే. 25

వ. 'యతో వాచో నివర్తంతే౽ప్రాప్య మనసా సహ' అను నేతాదృశ
శ్రుతివాక్యంబుల నెఱుంగవే? అట్టి నిరాలంబస్వరూపునకుఁ జి
హ్నము లేడ? దానిని మీరు దాల్చు టేడ? 26

మ. హరికిన్ రెండవమూర్తి వ్యూహసమభిఖ్యన్ సర్వలోకాత్మ యై
పరఁగున్ శక్తుఁడ వేని దాల్పు మది, యాపాదోత్తమాంగంబు చె
చ్చెరఁ దప్తంబుననో, మఱొక్కటనొ; నాశంబొంది యాపొంది వే
నరదుష్ప్రాపము వైష్ణవత్వమును బొందం జాతె దాసంస్కృతిన్.

గీ. అచ్యుతుతృతీయమూర్తి మత్స్యావతార
మాది యగు నవి, తప్తలోహమున వాని
చిహ్నములఁ దాల్పు; శంఖాదిచిహ్న మేల?
విష్ణువటు లోహచక్రాది వెస ధరింపు. 28

క. అదిగాక విష్ణునాలుగ
వది యగు మూర్తియ శిలామయార్చామూర్తుల్
వదలక తనువు తదాకృతి
పదచిహ్నత మాచరింపు బాలిశ! యిఁక నేన్. 29

వ. అని తదీయచిహ్నధారణంబు నిందించి, దిగులొంది యున్న యా
భాగవత మతానుయాయియందుఁ గరుణ వొడమి యతిచంద్రుండు
మంజులఫణితి ని ట్లనుఁ. 30

గీ. ఆలకింపుము విష్ణుచిహ్నము లవశ్య
ధార్యము లటన్న పాషండతను ద్యజించి
ఫలము పరమేశ్వరార్పణకలితముగ స్వ
కర్మములు సల్పి సంశుద్ధి గాంచి యంత. 31

క. అద్వైతవాది యగున
ద్విద్వాంసుని గొల్చి తదుపదేశమ్మునఁ గ
ర్మద్వైతబంధసంహతి
కుదాసము సేసి ముక్తి నొందఁ గదోయీ! 32

క. పరియతింపవలె ముముక్షువు
లయమున బోధమున కెప్పుడు 'నాన్యః పంథా
అయనాయ విద్యతే' యని
నయమున శ్రుతి ఘోషణం బొనర్చుట వినవో. 33

వ. అనుటయు నవ్విప్రదేవుండు మ్రొక్కి దేవా! మదీయపుణ్యపరిపా
కంబున భవదంఘ్రిసరోజసందర్శనం బబ్బె, నన్నుఁ గృతార్థుఁ గా
వింపవే యని వేడుటయు జగద్గురుండు కరుణాళుండై యిట్లను. 34

ఆ. చిహ్నములను వెసఁ ద్యజించి కర్మముల న
కామముగ నొనర్పఁ గడఁగు 'బ్రహ్మ
మేన యైతి' ననుచు నెద భావన నొనర్ప
బోధ ముప్పతిల్లి ముక్తిఁ గనెదు. 35

వ. అని యుపదేశింప నావిప్రదేవుండు తదుక్తప్రకారమున వర్తించు
వాఁడ నని వందనం బాచరించి గురుని సేవించుచు నుండు నవ
సరంబున. 36

## వైష్ణవమతనిరాసము

సీ. నాలుక "నోం నమో నారాయణాయ" య
న్మంత్రమ్ము నుచ్చారణమున మరపి
తనువు తదీయముద్రలఁ బాంచజన్యసు
దర్శనమ్ములఁ జిహ్నిత మ్మొనర్చి
పటుతర సంసారబంధ ముక్తుండనై
వైకుంఠమున కేఁగువాఁడ నిరత
నస్మద్గురులు వైష్ణవాగ్రణుల్ పరమప
దం బైనయం దుండఁ దగినవార

గీ. లని వచించుచు శార్ఙ్గపాణ్యాఖ్యవాఁడు
వైష్ణవుం డొక్కఁ డయ్యతిస్వాములకడ
కరుగుదెంచి చక్రాద్యంకనాదిఁ గూర్చి
పలికె నాడంబరంబు వాక్కుల నెసంగ. 37

గీ. బుజములందు శంఖ రథాంగ ముద్ర లఱుతఁ
దులసిమాలలుఁ దమ్మిపూసలు సెలంగ
ఫాలవిధృతోర్ధ్వపుండ్రులై పరఁగువారె
వైష్ణవులు, విశ్వభువనపావనులు వారె. 38

క. అనియెడు పురాణవచనం
బనఘా! 'చిహ్నములఁ దాల్ప నగు' నన మానం
బనుశార్ఙ్గపాణినామకుఁ
గని యనియె యతీంద్రుఁ డుక్తికౌశల మొలుకన్. 39

మ. శ్రుతి నీయర్థము గానరా దరయుచో శ్రుత్యుక్తి యొక్కం 'డతప్తతనుం డొందఁడుముక్తి' నాఁదనరు "తప్తం" బన్నఁగృచ్ఛ్రాదికో
గ్రతపస్తప్తము గాని తప్తపదముద్రాదగ్ధ మం చర్థ మె
ట్లు తగున్ ముక్తికి ధ్యానమున్ శ్రుతులు తెల్పున్ సాధన ప్రక్రియన్.

వ. అంతియ కాని చిహ్నధారణవిధి శ్రుతుల శశివిషాణంబు. 41

ఆ. బహ్మవిదుఁడు ముక్తిఁ బడయు నర చనుసూక్తి
నెఱుక యొకటె మోక్షహేతు వయ్యెఁ
బుణ్య మఱిన మర్త్యమును జొచ్చు ననుసూక్తి
నబ్బు సంస్మృతియు తదన్యగతుల. 42

సీ. తప్తశంఖాదిముద్రల నిషేధింపవే
యులబ్రహ్మన్నారదీయాదికవచులు

హారిసముం డైతే? జిహ్వాధృతి నం చనుట మ
నోరాజ్యమాత్రి ప్రానుగద తలఁప
నవరపర్ణుఁడు శిఖాయజ్ఞోపవీతాది
ధారణమ్మున ద్విజత్వమ్ము గనునె?
మోక్షమ్ము బ్రహ్మాత్మ బోధమ్ము నసె లభ్య
మను శ్రుతిప్రామాణ్య మరయలేదె?

గీ. కాన "బ్రహ్మాఽ హ" మని సదా ధ్యానమూన
ద్వైతభావన నశియించు, దాన నప్పుడ
జీవుఁడే పరశివుఁ డయిపోవు, నదియ
యపునరావృత్తిముక్తిసమాఖ్య నొప్పు. 43

ఆ. అవిరతంబు మది 'శివోఽహం శివోఽహ' మ్మ
టంచు నెంచు నెవని కైనఁ గాని
తార్చు శివుఁడు తనదు తాదాత్మ్య మని శివ
గీత నొడివె" ననుడుఁ గేల్మొగిడ్చి. 44

ఆ. అల్లవైష్ణవుండు నద్వైతమతదీక్షఁ
గందుఁ ద్వదుపదేశకలన ధన్యుఁ
డైతి, ననుచు గురుని యడుగుఁదమ్ముల వ్రాల
నరసి గురుఁడు ముక్తుఁ డగుమి యనిన. 45

క. మొదలఁ గొని స్మార్తధర్మా
స్పదుఁడై పంచాయతన సపర్యాపరుఁ డై
మది ముద మందుచు నిజ జన
పదవాసులఁ దనమతంబువలనికిఁ ద్రిప్పెన్. 46

వ. అట్లాతండు గురుకరుణామృతపానతుందిలహృద యారవిందుండై
స్వమందిరంబున నుండె నంత. 47

## పాంచరాత్ర మత-నిరాసము

గీ. తివిరి పాంచరాత్రాగమదీక్షితుం డొ
కండు సనుదెంచి యాచార్యుఁ గాంచి పలికె
భువిని ముక్తిప్రతిష్ఠాదిమూలభూత
మస్మదాగమమత మొక్కఁ డగును గాన. 48

గీ. నిఖిలవిప్రుల కాశ్రయణీయ మస్మ
దాగమ మతంబ యన శంకరార్యుఁ డనియె
నాగమము శ్రుతి కవిరుద్ధ మైన గ్రాహ్య
మగును; గాదేని యగ్రాహ్య మఖిలమునకు. 49

సీ. ఆయాగమము చెప్పు "నన్యమంత్రోపదే
శము నొందఁ గాదు వైష్ణవత" కనుచు
"నబ్బు బ్రాహ్మణత గాయత్ర్యుపదేశాన"
నన వైష్ణవతకుఁ జే టగును గాదె
గాయత్ర్యభావమే కలుగుచో విష్ణుమం
త్రశతాప్తినైన విప్రత లభింప
దా బ్రాహ్మణతయ రూపఱ వైష్ణవత యేల?
యటుగాక "మాకు గాయత్రి విష్ణు

గీ. శక్తి యగును శంఖాదిసంసక్తి ననిన
నిందుశేఖర, పంచాస్య, హృద్యమూర్తి
సర్వసంపూజ్య, శుభద, యీశ్వరియుఁ గాన
నల్ల గాయత్రి కాదొకో యభవుశక్తి? 50

మ. కమలాప్తోద్గతదివ్య తేజమునకున్ గాయత్రియే హేతువై
యమరున్; విష్ణువు భానుమండలగతుం డౌఁ, గాన, నాదేవి త
త్కమలానాయకుశక్తి యానెకద, తత్పంచాననత్వం బనే
కము లౌరూపుల నొందు నాపెకుఁ దగుంగా యుండదే మోకదా,

సీ. వ్యాహృతులఁనూడి గాయత్రి; ప్రణవమునను
వ్యాహృతులు, తన్మహేశ్వరువలనఁ బ్రణవ,
మవతరించుట గాయత్రి శివునిశక్తి
"హరుఁడ సర్వకర్త" యనదె నారాయణంబు. 52

గీ. ఎద్ది వేదాదిసంప్రోక్త, మెది తదంత
సుప్రతిష్ఠిత, మెది ప్రకృతిప్రలీన
మట్టి సర్వమున కవ్వల నభవుఁ డలరు
నని నారాయణశ్రుతిఁ గనినఁ దెలియు. 53

ఆ. అష్టమూర్తి మూర్తులం దర్కుఁడొకటి, పం
చాననాదియుక్త వానిశక్తి
వైష్ణవునకు నీకు భవమూర్తి రవిఁ గొల్వ
రామి హాని యొదవు బ్రాహ్మణతకు. 54

క. చెడుఁగాక బ్రాహ్మణత నా
కడరెను వైష్ణవత యందువా? యుభయభ్ర
ష్టుఁడ వైతి భాషణాయో
గ్యుఁడవును నడపీనుఁ గైతి వోసరి చనుమా. 55

చ. అని యతి వల్క మాధవసమాఖ్యుఁడు వైష్ణవుఁ డొక్కఁ డిట్లు ప
ల్కెను "విను తప్తశంఖ ముఖ కీలన వైష్ణవలోక మబ్బు నం
చు ననెడి పాంచరాత్ర మతసూక్తి త్వదుక్తిని నష్ట మయ్యెనే?
యనవుడు శంకరార్యుఁ డనె నాగమముల్ శ్రుతిసమ్మతిన్ మనున్.

క. ఆగమకథితాచారము
నైగమసమ్మతిని గాంచెనా? గ్రాహ్యం బౌ
నాగమ మగ్రాహ్య మగుఁ ద్ర
యీగమితవిరోధ మొందెనే నించుకయున్. 57

ఉ. మానుగ వేద మొక్కటి ప్రమాణము సూవె యతీంద్రియార్థవి
జ్ఞానమునందు; నాగమము గ్రాహ్యము యా నిగమానుకూల మౌ
నేని; త్రయీవిరుద్ధమగు నెద్దియుఁ గాదు ప్రమాణ మెన్నఁడున్
గాన స్వకర్మసక్తుఁడవుఁ గ మ్మిఁక బ్రాహ్మణధర్మసిద్ధికై. 58

సీ. నియతస్వధర్మాభినిష్ఠుఁడ వై తేని
తొలఁగు మోహము విశుద్ధుండ వగుదు
తనయంతఁ దాన తత్త్వజ్ఞాన మవు డబ్బ
నద్దాన ముక్తుండ వగుదు వీవు
తదితరమున ముక్తి యొదవ దియ్యర్థమం
దునఁ బ్రమాణమ్ము శ్రుతిని వినఁగదె
"తన్నను సర్వభూతములందుఁ దనయందు
సకలభూతములఁ గాంచంగఁ గనినఁ

గీ. బరతరాత్మంబు నొందు నితరముచే న
సాధ్య" మని యుండెఁ గానఁ బాషండచిహ్న
ముల విడిచి మోక్షసిద్ధ్యర్థముగ గణింప
వయ్య యద్వైతమతనిష్ఠ ననవరతము. 59

చ. అనవుడు మాధవుం డపుడ స్వాన్వయులున్ నిజదేశవాసు లా
జనములు దాను స్మృత్యుదితసంస్కృతులన్ గని యద్వయాధ్వని
ష్ఠను సతతాగ్నిహోత్రబలిసాంధ్యవిధిప్రవణాత్ముఁడై తన
ర్చెను గురు నాజ్ఞ నౌదల ధరించి జగద్ధితబద్ధబుద్ధియై. 60

వైఖానసమతనిరాసము

వ. అంత. 61

సీ. నారాయణుం డస్మదారాధ్యుఁ డగుట మా
మతము కా దనఁగ బ్రహ్మకుఁ దరంబె?

వైకుంఠపదమె భావ్యమ్ము "తద్విష్ణోః ప
రమ్మను శ్రుతి ప్రమాణమ్ము దాన
నజ రుద్రు లుదయింత్రు హరినుండి యను శ్రుతి
నారాయణుఁడు జగత్కారణ మగు
నాతఁ డంతర్యామి యఖిలలోకారాధ్యుఁ
డజుఁ డనంతుండు విశ్వాతిశాయి

గీ. యనుచు వైఖానసమతస్థుఁ డైనవ్యాస
దాసుఁ డనువాఁడు తత్సవిధమున కేఁగు
దెంచి ప్రణమిల్లి మఱియు వచించె యతిబు
భుక్షుతో నిట్లు తద్భక్తలక్షణంబు. 62

క. నెమ్మదిని హరి నిలిపి శం
ఖమ్ము రథాంగమ్ము భుజసఖములుగ నిఖిలాం
గ మ్మూర్ధ్వపుండ్ర సంస
క్తమ్ముగ వైఖానసమత తత్పరుఁ డొప్పున్. 63

మ. అనఁ బల్కున్ యతిమౌళి "పాలకుఁ డజుండైనన్ ముకుందుండయై
నను మాకిష్టమ సూ, పునర్జననశూన్యం బౌపదం బొందఁ గో
రినఁ దత్త్వావగమంబె సాధనము పేర్మిన్ విష్ణుభక్తుండ వే
నొనరింపన్ వలెఁ గర్మకాండ మనహంయుఖ్యాతిఁ దప్పిరితిగన్. 64

గీ. అంతియేకావి తప్తశంఖాదిచిహ్న
ధారణము మానవలె, నిరాధార, మాగ
మము శ్రుతివిరుద్ధమై యప్రమాణ మగుట
వినవొ? యటుసేత బ్రాహ్మణ్యమునకె హాని. 66

వ. అనుటయు వ్యాసదాసుండు 'స్వామీ తొల్లి దత్తాత్రేయపరమ
యోగి పంచముద్రాముద్రితాంగుండయ్యె, నామార్గమ్ము పెక్కురు

ముముక్షువులు గ్రహించి రని పురాణంబుల విశ్రుతంబ, కానఁ జక్రాదిధారణమున కాపురాణంబుల ప్రమాణంబు. తత్సంస్కార దూరునకు వైష్ణవత్వహాని తప్పదు. కాన భగవచ్చిహ్న ధారణ మావశ్యకం బనుటయు నాయాచార్యసార్వభౌముఁ డి ట్లనియె. 66

శా. దత్తాత్రేయుడు తత్త్వవేత్త, ఋషి, తప్తక్షుద్రముద్రావిధిన్
జిత్తం బుంచునె? యేప్రయోజనము సంసిద్ధించు నవ్వాని; కీ
వృత్తం బర్భకులేని నమ్ముదురె? యేదేసిన్ బురాణంబునన్
దత్తప్తాంకనవృత్తముల్ వినము నీ తత్త్వజ్ఞతల్ మెచ్చ నా. 67

వ. కాన మౌఢ్యమ్ము విడిచి సుఖింపుము. పురాణంబులఁ జిహ్నధారణం బశ్రుతచరం బగుట నగ్రాహ్య మని తెలియుము. 68

మ. అల ప్రహ్లాదునకున్, విభీషణునకున్, హస్తీశ్వ రౌత్తానపా
దులకున్, ద్రౌపది, కాంజనేయునకు గోధు గ్గోపికాశ్రేణి, కి
మ్ములఁ జక్రాంకన మేగురుం డొనరిచెన్ మూఢత్వ, పాషండ ము
ద్రలఁబోనాడిచి బ్రహ్మమైతి ననుచింతన్ మోక్షమున్ గాంచుమా.

సీ. అంకధారణ మవశ్యంభావి యంటేని
గరుడముద్రలను గంధరఁ ధరింపు
శేషాహిచిహ్నముల్ఁ జెక్కుల దాల్పు క
ర్మేంద్రియాగ్ర్యము లైన యిరుభుజంబు
శంఖచక్రాంకనసంపన్న మొనరింపు
జ్ఞానేంద్రియాభ్యర్ణగతము లైన
చెక్కిళ్లు లారీతిఁ జిహ్నితం బగునంతఁ
బశువట్లు కొంతు నిబంధనంబు

గీ. నిటుల స్వవిహితకర్మవిహీన వైష్ణ
వునకు నీ కగ్నిహోత్రాది పొనుఁగు వడిన

మిగులునే కద బుగబుగల్ నెగడు గంధ
సారపుంబూఁత లమలవస్త్రముల ధృతియు. 70

మ. అన వైఖానసుఁ డయ్యతిప్రవరు పాదాబ్జంబులన్ వ్రాలి యో
యనఘా! నీకరుణన్ వివేకి నయి చిహ్నత్యాగమున్ జేసికొం
టిని నా కీవ గురుండ వద్వయవిధా నిష్ణాతునిం జేయు న
న్నని ప్రార్థింప స్మితాస్యుఁడై యనియె నయ్యాచార్యుఁ డవ్వానికిన్.

ఉ. భావనసేయు "మే నయితి బ్రహ్మ" మటంచును శక్తి లేదయే
నావచనంబులన్ దలఁపు మాత్మను బాయక, యట్లు సేయుచోఁ
బోవును ద్వంద్వముల్, సమసిపోవు షడూర్ముల్, లెఱుఁగు దాత్మమున్
నీవు విముక్తిఁ గాంతు, గననేరవు సూ పెఱత్రోవ మోక్షమున్.

క. అని బోధింపఁగ 'శిష్యుం
డనుఁ జరితార్థుండ' నని మనంబున బ్రహ్మం
బ నయితి నని భావించుచుఁ
జనె యతిపతి కెఱఁగి స్వకుల జనసంయుతుఁడై. 73

కర్మహీన మతనిరాసము

వ. ఆతం డట్లరుగునంత నామతీర్థుం డనుకర్మహీన వైష్ణవుం డేఁతెంచిన శంకరుండు వానిం గాంచి నీమతంబు దెలుపు మనుటయు నాతండు సగర్వంబుగా ని ట్లనుఁ. 74

సీ. అప్రధృష్యమ్ము శేషాహి కేనియు మన్మ
తంబు నాలింపు 'సర్వంబు జగము
విష్ణుమయం' బను విమలోక్తి కతన "మ
చ్ఛిష్యుఁ ద్వత్పదసరసీజయుగళిఁ

జేస్ప్రుమా” యని గుహసింహుఁడు ప్రార్థింప
జగదీశ్వరుం డట్లు సలిపిరీటుఁ
గానఁ బునర్జన్మకారణాభావుండ
నగుచు జీవన్ముక్తి నందుకొందు

గీ. నీరును ముముక్షులేఁ గర్మహీను లగుచు
విశ్వమయుని సురేశుని విష్ణుఁ గొలువ
నయ్యెదరు ముక్తులుగ నిశ్చయంబు దీని
కంటె సుఖమైనమోక్షమార్గంబు లేదు. 75

వ. అనుటయు శంకరుండు సోత్ప్రాసంబుగ నిట్లనియె. 76

గీ. పలికితి నిజంబు గర్మవిభ్రష్ట వగుట
నంది తీవు జీవన్ముక్తి నదిర! మదిని
నింద్యము ననింద్య మనుచుఁ జింతింపకయ పి
శాచవైఖరి వర్తింప సాగి తిటుల. 77

వ. అని యపహసించి వేదోక్తసకలకర్మంబులు బ్రహ్మంబున ఫలా ర్పణంబుసేత జ్ఞానమార్గం బనియు ఫలార్థము కర్మము లొన ర్చుట కర్మమార్గం బనియు నందు, రయ్యుభయమార్గంబుల భ్రష్ట వగుట దండ్యుఁడవు కాని విష్ణుభక్తుండ వెన్నఁటికిఁగా నేరవువినుము.

క. తన కులధర్మము విడువఁడు,
గను సమత, హితాహితుల నొకని విడువఁడు, హిం
సను జేయఁడు, సితమనసుం,
డనఘుఁ డెవఁడో, వాఁడుసూవె హరిభక్తుఁ డనన్. 79

చ. స్థిరమగు మామకాజ్ఞలు శ్రుతిస్మృతు, లవ్వి యతిక్రమించువాఁ
డరయఁగ నాకు ద్రోహియు మదాజ్ఞలు మీఱుట; వాఁడుభక్తిమై

వరలినఁ గాఁడు వైష్ణవుఁ, డవాక్యమదాజ్ఞను ద్రుంచి ద్రోహియై
నరకము సొచ్చు” నన్నవచనంబుల విష్ణుఁడె యొప్పెఁ గర్మమున్.

వ. ‘బ్రాహ్మణః కర్మ కుర్వీ’ తేత్యాది వాక్యములం జేసి కర్మత్యాగ
మును దేవాంతరత్యాగమును విప్రుల కొప్పద. “అగ్ని ర్దేవో
ద్విజాతీనా’ మనువాక్యముచే బ్రహ్మచారిప్రభృతు లెల్లరు కర్మ
త్యాగ మొనర్పరాదు. 81

క. శమియించును గృచ్ఛ్రత్రిత
యమునఁ ద్రిసంధ్యాతిపాతజాఘ మనుటఁ గ
ర్మము ద్విజుల కపరిహార్యము
సుమి, “యతులకె త్యాజ్య” మనుచు శ్రుతి యానతిడెన్. 82

ఉ. నావుడు నామతీర్థుఁడు ప్రణామములన్ గురుఁ దృప్తుఁ జేసి సం
భావితకర్మమార్గుఁ డయి వర్తిలుచుండ్, నిజపక్షఖండనం
బావిధి సల్పు శంకరునె యందఱు నొజ్జగఁ గోరి నిష్కృతిన్
బావను లౌచు స్మార్తమతపద్ధతితోఁ గొని రద్వయాధ్వమున్. 83

హిరణ్యగర్భమతనిరాసము

క. అంతఁ బరివ్రాట్త్రిలకుఁ డ
నంతశయనవాస మెడసి యయి దహముల కం
తంతట సుబ్రహ్మణ్యా
ఖ్యాంతక్షేత్రమ్ము చేరె నట గుహుఁ గొలువన్. 84

సీ. స్నానం బొనర్చె శిష్యశ్రేణిఁ గూడి కు
మారధారాఖ్య నిమ్నగకు నేఁగి
యర్చించె విధివిహితార్ఘ్యమునన్ భక్తి
షణ్ముఖదేవు శేషస్వరూపుఁ

దాల్చి గాషాయవస్త్రములఁ దచ్చుగను శో
భిల్లి యీ దండకమండలువులఁ బూని
మంద్రస్వరమునఁ ద్ర్యంబక ముచ్చరించుచు
భూతి సర్వాంగీణముగ నలందెఁ

గీ. బూర్ణభక్తి సుబ్రహ్మణ్యపూజ సలుప
నటకుఁ దండోపతండమై యరుగుదెంచు
దేశ దేశాంతరస్థ ధాత్రీసుపర్వ
సమితి కద్వైతబోధమ్ము సలుపఁ జొచ్చె. 85

ఉ. అందు హిరణ్యగర్భ సముపాసన దీక్షిత విప్రకోటి క
ర్మందిమహేంద్రు సన్నిధికిఁ గ్రన్ననఁ జేరవచించి "రార్య! మే
మందఱమున్ మనుప్రభృతు లర్థి సృజించిన కర్మమార్గ మిం
పొంద గ్రహించినారము పయోరుహగర్భకలోద్భవాప్తిచే. 86

చ. "తొలుత హిరణ్యగర్భుఁ డుదితుండయి భూతచయైకనేతయై
యిలను దివంబుఁ దానె ధరియించెను, దాదృశదేవు మాని య
న్యులకు హవిన్ విధింప" మను సూక్తి జగత్త్రుల కెల్లఁ గర్తయున్
దలఁపఁగ భర్త, హర్తయు నతండ యటంచు వినిశ్చితుం డగున్.

సీ. నిఖిలంబు తానె విసర్జించు, సర్వాత్ముఁ
డగుట నంతర్యామి యయి వెలుంగు
నవులఁ 'దదైక్షతే' త్యాద్యుక్తి కథితుఁడై
తా హరిహరుల దోర్ద్వయి సృజించు
నట్టి హిరణ్యగర్భాంఘ్రిభక్తులము కూ
ర్చకమండలువుల ధారణము విడక
యోగనిష్ఠను గర్మ ముడుగక పచరించు
వారము వైధాత్రవంశజులము

గీ. యతిపతిని బూజ్యపాదు ని న్నిరసి చారి
తార్థ్యమును బొందితిమి, కాని యస్మదుక్తి
వినుమి, యద్వైతమునఁ బ్రయోజన మెుకింత
గానవచ్చునె యేల శుష్కశ్రమంబు? 88

క. తలసూపు నలువ యెడ జీ
వులు నిజకర్మమున భవము పొందుఁ బోరిఁబోరిన్
నలువ కడుపునన లయ మగుఁ
బ్రళయముతఱి ముక్తి నెందుఁ బడయఁగ రామిన్. 89

ఆ. బ్రహ్మవిదుఁడు పొందు బ్రహ్మలోక మదియ
పరమపదము గానఁ గరకదండ
ధారి వైననీవు తల్లోకయోగ్యుండ
వగుదు వనుడు నిట్లు యతి వచించె. 90

ఆ. ఎవనివలనఁ బొడమె శివుఁడు బ్రహ్మాది భూ
తములు, వాని నెఱుఁగఁ దడయ కబ్బు
ముక్తి - యనుచు వేదములు పల్కుఁ గాన బో
ధమ్మె మోక్షకారణమ్మె సుమ్మె. 91

ఉ. అంతియ కాని సుప్తిసమ మైన లయం బెటు ముక్తి యౌను? వే
దాంతవచస్సదాశ్రితిని నబ్బును బోధము, దాన మోక్ష మం
తంత లభించుఁ; గార్య మగునబ్జజుసేవల ముక్తి నేక్రియన్
గాంతురొ మీ రనన్, విడిచి క్రన్ననఁ జిహ్మములెల్ల వారలున్.

క. శుద్ధాత్మబోధతత్పర
బుద్ధి నయిరి శిష్యు; లదియుఁ బొడగని స్వమత
శ్రద్ధాళు లగ్న్యుపాసకు
లద్ధీసుని కడకు వచ్చి యని రీరీతిన్. 93

## వహ్నిమత నిరాసము

క. అనలమతరతుల మే మ
గ్ని నుపాసించెదము మంత్ర నిగదిత దేవుం
డనలుం డోంకారుఁడే యని
మనమున భావింతు మిటఁ బ్రమాణము శ్రుతియే. 94

సీ. విశ్వంబు లేకుండువేళను దొలుదొల్తఁ
బొడసూపె నగ్నిదేవుండు తాన
యయ్యగ్నివెంట నుదయమైనదేవతా
వితతి నుత్తముఁ డయ్యె విష్ణుమూర్తి
'యజమానుకొఱకునై యగ్ని హవిర్భాగ
ములఁ బరిపాటి వేల్పులకు నొసఁగ
మును పరిగ్రహణమ్ము నొనరించుఁగా' కంచు
నిగమ ముండుట భజనీయుఁ డగ్ని

గీ. విస్ఫులింగాత్మ మణిఖండ విధృతి నగ్న్యు
పాసకబ్రాహ్మణులు ముక్తిఁ బడయుదు రని
యగ్ని ద్విజులకుఁ దా దేవుఁ డనియు శ్రుతి వ
చించుటఁ ద్విజన్ములకు వేల్పు శిఖియ తలఁప. 95

చ. అదియునుగాక విప్రుల కఘాపహ మగ్నియ కాక దైవతం
బెదియును లేదు "వహ్నీ! జ్వలింయింపుమి, నాయఘుపూరుషున్ హరిం
పు, దశదిశల్ ఘటింపు సుఖపూరితజీవనమున్, బలోత్కరా
భ్యుదయము" నంచు వేదమున నుంట ద్విజాశ్రయణీయుఁ డగ్నియే.

వ. కావున మీరును నయ్యగ్ని సేవించి కృతకృత్యు లయ్యెదరు గాక
యనుటయు నయ్యాచార్యేంద్రుఁ డి ట్లను. 97

గీ. దేవతలలోన నవముఁడు పావకుం డ
నుత్తముఁడు విష్ణుమూర్తి, తదుభయ మధ్య
వర్తు లవశిష్టులైనదేవత లటంచ్రు
కర్మదేవత దేవభాగదుఁడు వహ్ని. 98

ఆ. అగ్ని కారణం బటన్న వాక్యములు భూ
తాత్మవహ్నిపరము లయిన, వగ్న్య
ధీనముగను గర్మ మూని సల్పుఁడు విష్ణుఁ
గొలువుఁ డద్వయాధ్వగులరు గండు. 99

చ. అదియ విముక్తికిన్ దెరు వటంచు యతీంద్రుఁడు బోధ సేయఁ ద
త్పదముల వ్రాలి మ్రొక్కి ప్రమదంబున నద్వయమార్గ మూని, నె
మ్మదిని సుహోత్రుఁ డాది మతిమంతులు వారలు స్వాస్థ్యమొందు న
య్యదన యతీంద్రుఁ జుట్టుకొని రంచెల సౌరమతస్థు లీసునన్. 100

సౌరమతనిరాసము

చ. అరుణను మాంచితాంగు లరుణారుణ రాంకవచేలధారు, ల
త్యరుణ కుచంద నాగ్నిశిఖ దర్పితచిత్రికు లా దివాకరా
ద్యరుణగభస్తిభక్తులు జయంబు గొనన్ యతిఁ గాంచి పీటికా
త్యరుణిమలిప్తదంతరుచు లాశలఁ గ్రమ్మఁగఁ బల్కి రీక్రియన్.

సీ. సర్వజగద్విలోచన మర్కుఁ డను శ్రుతి
బ్రహ్మదిరూపుఁ డర్యముఁడు సూవె
యాదిత్యుఁ డితఁడు బ్రహ్మ యటన్న శ్రుతి సృష్టి
సంస్థితిహేతువు సవిత చూవె
ధృతి 'ఘృణి స్సూర్య ఆదిత్య' యన్మంత్రంబు
శిష్టజనం బుపాసించ్రుఁ జూవె

జపకాలమునఁ దాల్పఁ జను రక్తచందన
తిలకరక్తలతాంతములను జూవె

గీ. కారణం బగు బ్రహ్మయాకార మని భ
జింత్రు కొంద ఱుద్యత్సరసీరుహాప్త
నన్యులు భజింత్రు విశ్వసంహారకుఁ డగు
నభవుఁ డితఁ డంచు గగనమధ్యస్థు సూర్యు. 102

క. జగ దుపసంహార క్రియుఁ
డగు హరుఁడె యుపక్రమించు నఖిలము సృజియిం
పఁగ ననియు హరుఁడె యును రూ
పగు ననియుఁ దలంచి కొంద ఱర్చింత్రు రవిన్.

మ. అతిదీక్షన్ రవిమండలంబున హిరణ్యశ్మశ్రు కేశాది సం
యుతు దేవున్గని కొల్తు కొంద,ఱటు సూర్యున్ జూచుచున్గొల్చు నా
వ్రతులం దేకతరుల్ గనుంగొని రవిన్ బాద్యాదిఁబూజించి కా
ని తినం జూడర యన్నమున్ జలము నేనిన్ గ్రోలఁ బో రెన్నఁడున్.

చ. ఉరమున ఫాలమందు భుజయుగ్మమునన్ రవిమండలాకృతిన్
బరఁగెడు తప్తలోహకరణంబులఁ జిహ్నములన్ ధరించి సు
స్థిరహృదయాంతరమ్ముల భజింతురు సూర్యు ననుక్షణంబుఁ గొం
ద ఱిటుల యాఱురీతులఁ దనర్తురు ద్వాదశమూర్త్యుపాసకుల్. 105

చ. యమివర! వీర లార్వుర కుపాస్యము మున్ను వచించినట్టి మం
త్రమెసుమి- భానుమండలపరంబుగ సంస్తుతిసేయు వేదవా
క్యములు పరస్సహస్రముః సహస్రశిరోక్షిపదుం డటంచు నా
ద్యమణినె కాదొకో పురుషసూక్తము చెప్పు మతించు నెంచుమా.

క. నిగమచయ నిరూప్యుఁ డగుర
భగుఁడ "ఋత"మ్మనెడు రుద్రమంత్రంబునఁ బొ

ల్పగు పురుషశబ్ద; మది సర
విగ రవిపర మాను గృష్ణపింగళుఁ డనుటన్. 107

వ. అరుణుండు సూర్యుండు భానుండు చంద్రుండు తపనుండు మిత్రుండు హిరణ్యరేతసుండు రవి యర్యముఁడు గభస్తి విష్ణుండు దివాకరుండు నని యాదిత్యులు పన్నిద్దఱు. 108

శా. ఆయాదిత్యులయందు విష్ణు వాకరుండై యుంట నాసూర్యుఁడే
యయ్యెన్ విష్ణువు 'నేనె విష్ణుడను జు మ్మాదిత్యులం, దేన సు
మ్మయ్యా! జ్యోతుల నంశుమాలి రవి' నంచబ్జాక్షుఁ డప్పార్థుతో
నొయ్యం బల్కెఁడె యబ్జజాదులు తదంశోత్పన్నులే కావునన్. 109

క. పూని ముముక్షుజనం బీ
భానునె సేవింపఁ జనును బ్రత్యక్షముగాఁ
గాన నగుదేవుఁ డర్కుఁడె
నా నయ్యాగీంద్రుఁ డనెఁ దృణముసేసి పరున్. 110

క. వినుమా మూఢ! దివాకర!
జనియించె మనంబునుండి చంద్రమసుఁడు చ
క్షునునుండి సూర్యుఁడు జనిం
చె ననుచు జన్యతను శ్రుతి వచించును రవికిన్. 111

గీ. తర్కసిద్ధాంతమున 'నసిత్యమ్ము జన్య'
మని తనర్చుట, నయ్యనిత్యునియెడ నెటు
ననును బ్రహ్మత్వ మర్కనిష్ఠ పరమాత్మ
బోధక శ్రుతి తాత్పర్యమును గ్రహింపు. 112

మ. జగదీశాజ్ఞభ్రమించు సూర్యుఁ డని సుస్పష్టంబు తద్భావ 'మా
జగదీశాజ్ఞకు భీతి నొందును నభస్వంతుండు వీతెంచుఁ ద

ద్భగుఁ డాత్మోదయుఁ డౌను, వహ్ని వెలుగున్, భాసిల్లు నింద్రుండు, పె
ల్లుగ ధావించును మృత్యు'వంచును శ్రుతుల్ ఘోషించుటాలింపవో

చ. "సమయము, రోదసుల్, జలదసంగతి, లేని యఖండబోధసౌ
ఖ్యమహితమూర్తి వెల్గెడు చిదభ్రపథంబున సూర్య చంద్ర ఋ
క్షములుఁ దటిత్తులున్ వెలుఁగజాల వనన్ జ్వలనుండు లెక్కె? వి
శ్వ మెవని వెల్గునన్ వెలుఁగు వానినె పాయక వెల్గు సర్వదా"

క. అనెడు శ్రుతిసూక్తిఁ బరమే
శుని తేజమునన వెలుంగు సూర్యాదిక మం
చును స్పష్టము; జ్యోతిశ్శ్రుత
మునఁ దదనిత్యతయె స్పష్టముగఁ గన్పట్టున్. 115

ఉ. "అంబుజగర్భవాసరము నాది గ్రహాంబుల సృష్టియున్, దదం
తంబున నష్టియున్ గలుగుఁ, దత్సమయం బొకకల్ప, మట్టి క
ల్పంబులు రెండు గూడుకొని బ్రహ్మకు నొక్క యహర్నిశం" బటం
చుం బొడగట్టుఁ గాన నెటు సూర్యుఁడు బ్రహ్మకుఁగారణం బగున్.

క. తరణిస్థితుఁగాఁ గేవలుఁ
బరమాత్మునె పొగడు వేదఫణితి యెఱిఁగి దు
ర్భరపాషండాంకములం
దొఱఁగి స దద్వైతగతిఁ గనుండీ ముక్తిన్. 117

క. అనుటయు సౌరమతస్థులు
వినతు లయి తదీయ శిష్యవృత్తి వెలయ నా
జనపదమునఁ గల భూసుర
జనులు యతీంద్రునకుఁ బూజ సల్పిరి భక్తిన్. 118

క. ఇట్టుల జగద్గురుం డ
ట్టట్టునఁ గల ద్విజుల గౌరవమునకు గుఱియై

దట్టులు వెనుకొనఁ జని న
ప్పట్టున విజిగీష వాయవం బగుదిశకున్. 119

మ. కరతాళంబులఁ గాంస్యతాళముల శంఖధ్మానరీతిన్ శుభం
కరవాగ్రీతి మృదంగధింధిమిరుతిన్ ఘంటాధ్వనిన్ బింఛచా
మరతాలవ్యజనానిలంబులను సంభావించి సేవింతు రెం
దఱో మధ్యపథ మయ్యతీంద్రుఁ గని తత్తద్దేశవాసిద్విజుల్. 120

క. సేవించిన ఫలముగ నా
యావిప్రులు కరుడు గట్టినట్టి కుశంకల్
వోవ నడఁచి తచ్ఛిష్యులు
నా వెలసిరి త్రోవపొడుగునను జిత్రముగన్. 1:1

క. దారి నరుగు వాఁ డట నటఁ
దారిన ద్విజరాజి కమృతధారానిభ వా
చారుచిరబోధమున భవ
తారకుఁ డయ్యెను శివావతారము గానన్. 122

చ. యతిపతి యన్వహం బిటు ప్రయాణ సేయుచు శిష్యసంఘు సం
యుతుఁ డయి భిక్షలందుకొనుచొక్కొకయూరను విశ్రమించు చం
చితులగు దైవచింతకుల శిష్యులుగాఁ గయికొంచు వారు సం
స్తుతిఁ దరియించు త్రోవ వివరించుచుఁ జేరెఁ బురంబునొక్కటిన్.

గాణపతమతనిరాసము

క. ఆస్థానము; గాణపత మ
తాస్థానః మ్మటకు వచ్చు నన్యమతస్థుల్
స్వస్థితిఁ బరిణతిఁ గనక ని
జస్థానము సేర రంచు జగములు పలుకున్. 124

క. గణవర మనుపుర మఁట యది
గణనాథాశ్రమము మోక్షకర మనియుఁ దరం

గిణి 'కౌముది' యని విని త
ద్గుణము లెఱిఁగి పొంగి నదిని దోఁగెన్ దొలుత౯. 125

ఆ. అవ్యయుని గణేశు నర్చించి శంకరుఁ
డచట మాసమాత్ర మధివసించెఁ
బద్మపాదముఖులు పంచపూజాపరా
యణులు శిష్యు లర్థి ననుచరింప. 126

క. పరవిద్యార్దనచుంచులు
పరపక్షక్షపణచణులు వాద కథావి
స్తరవిత్తోత్కులు సరసిజ
చరణాదులు దిగ్గజప్రశంసాపాత్రంబుల్. 127

వ. అట్టి శిష్యులం గూడి శంకరుం డగ్గణవరమునందలిగాణాపత్యమత దీక్షితులు యతులకు భిక్షావందనమ్ము సేయ రని యెఱింగియు నచోటు వాయక యొక్కమఠంబున విడిసి యుండె. 128

ఉ. ఆతఱిఁ బద్మపాదుఁడు తదాజ్ఞ శిరంబునఁ దాల్చి షడ్రసో
పేతము వంటకమ్ము పచియించుచు శిష్యుల కెల్లఁ బెట్టుచున్
బ్రీతిని దేశికాగ్రణికి భిక్షయొనర్చు చహర్దివంబునుం
బ్రీతిగ సేవలన్ సలుపు బ్రహ్మసమర్పణ మంచు సర్వము౯. 129

శా. సాయంకాలము వ్యాదశానతుల నాచార్యేంద్రు నర్చించి భ
క్త్యాయత్తాత్మకు లౌచు శిష్యులు సమిద్ధానద్ధ వాద్య ధ్వని
స్ఫాయత్తాల లయూర వాయత మహేశస్తోత్రవాచార్భటి౯
జేయం జొచ్చిరి తాండవం బొకపు డంచెల్ గట్టి చిత్రంబుగన్.

భుజంగప్రయాతము } అజర్యం బనూహ్యం బనాద్యం బనంతం
బజయ్యంబు బుద్ధిస్థ మద్వైతసారం

బజాండప్రజాధార మానందకందం
బజం బుక్త్యగమ్యంబు నా బ్రహ్మ మేనే. 131

ఉత్సాహము. జితహృషీక మానిగమ్య చిన్మయంబు, సన్మయా
కృతి సదాశివాభిధానకీర్తితం బనార్త తా
రితభవాబ్ధి శుద్ధబుద్ధహృద్యరూపదీపితం
బితచరాచరంబు బ్రహ్మ మేన, యేనె విశ్వము౯. 132

క. అని యిటు శివతాండవలీ
లను గురు నానందలహరులం దేలింపం
గని 'యిది యే' మని యచ్చెరు
వెనయుచుఁ జనుదెంచి రచటి యెల్లజనంబుల్. 133

శా. త త్తాదృ క్ఛివతాండవోత్సవము సందర్శించి వైవశ్యసం
పత్తి౯ గొందఱు చూప ఆందొకళులై భావప్రకర్షంబుగా
నృత్తంబు౯ బచరింప- గాణపతు లన్వీక్షించి యీనృత్త మా
పత్తిన్ ముంచెనె మామతంబు ననుచున్ వారించి యవ్వారితోన్.

శా. సన్న్యాసుల్ పొనరించు తాండవము నస్మద్గృహస్థుల్ పొన
ర్ప న్యాయ్యంబొకో! యింక వీరిమత మద్వైతంబు 'వో్యమంబటుల్
శూన్న్యం బద్వయమైన బ్రహ్మ మగు"మంచున్ దెల్పుహృద్వాగగ
మ్యన్యూన్యార్థ మెఱుంగు టెట్లని కరంబాక్షేపముల్ పల్కఁగ౯.

వ. శంకరభగవత్పాదు లప్పలుకులు విని యది యట్లుండనిచ్చి ముందు
మీమతం బేదియో తత్స్వరూప మెట్టిదో దానికిం బ్రమాణమ్ము
లేవియో తెల్పుం డనుటయు వారల కగ్రేసరుం డగు గిరిజాసు
తుం డనువాఁ డిట్లనె. 13;

ఆ. మాది గాణపత్యమత మారు విధములఁ
దనరు, నెల్ల శ్రుతులు తత్పరములె
యమ్మతమ్ము నూన నత్యంతశాంతియు
ముక్తి నరుల హస్తమునను బొదలు. 137

గీ. అనఘ! తండ్రైకదంతచిహ్నాంకితుని స
శక్తికు మహాగణేశ్వరు స్వాంతమందు
నిలిపి తన్మూలమంత్రంబు నిష్ఠ జప మొ
నర్చు ద్విజుఁ బొందు ముక్తి సనాతనముగ. 138

ఉ. ఫుల్లసరోజపాణి మణిభూషణభూషితగాత్రి యైన శ్రీ
వల్లభఁ గూడి విశ్వ జని వర్ధన మర్దన మూలహేతువై
యెల్లరఁ గోర్కు లిచ్చెడు గణేశుఁడె ధ్యేయుఁ డటన్నసూక్తి నీ
యెల్లజగంబు విఘ్నపతియే సృజియించును బెంచు లోఁగొనున్.

ఆ. అబ్జజాదు లెల్ల రత్యయం బొందిన
నుండు గణపతియు నొకం డటంచు
శ్రుతి వచించుఁ గాన నతఁడ బ్రహ్మాది గ
ణేశుఁ డఖిలమునకు హేతు వరయ. 140

క. కావునఁ దన్మాత్రయామహే
మావిఖ్యాతుల యజాదు లని గాణపతుం
డో వాది యనఁగ; గురుఁ డనె
దేవానాం ప్రియ! వినంగదే తత్త్వమ్మున్, 141

చ. గణపతి రుద్రపుత్రుఁ డనఁగాఁ బ్రథితం; బెటు తండ్రి కాను గా
రణము సుతుండు? కాన నలబ్రహ్మము వైదికసూక్తి విశ్వకా
రణ మగు; నీవు నూపుశ్రుతి రాజిలుబ్రహ్మపదంబు బ్రహ్మనా
గణపతిమాత్రకా, దెటుల కారణ మౌ గణనాథుఁ డారయన్. 142

క. అనిన గిరిజాసుతుం డో
యనఘ! భవత్సూక్తి సత్య, మైనను పితాం
కనుఁ డిష్టదేవతాంతిక
మున కేటు చను? ననఁగ భిక్షుపుంగవుఁ డనియెన్. 143

మ. వినుమా బాలిశ! బ్రాహ్మణాన్వయజనిన్ వేదోక్తకర్మాతిని
ష్ఠ నజస్రంబు శిఖాదిధారణమునన్ త్స్మాదేవతాభావ మ
బ్బను దన్మాత్రఁ గృతార్థుఁ డౌనుజుమి విప్రుం; డిట్టి లోహాంకనా
దిని బాషండతమాత్రమే కలుగు ముక్తిన్ గాంచఁబోఁ డెవ్వఁడున్.

క. వేదవిరుద్ధంబు పురా
ణాదివినిందితము నగుట, నది మోక్షసుధా
స్వాద విలోల వివేకి జ
నాదర్తవ్యమ్ము కాని దని తెలియఁ గదే. 145

సీ. ఉండుఁ జతుర్దళం బుదిరిడాల్ గలుగు మూ
లాధారచక్ర మం దలగణేశుఁ
డమరు షడ్దళము విద్రుమరుచి యైనస్వా
ధిష్ఠానచక్రానఁ దివుట బ్రహ్మ
యలరును దశదళం బయి నీలవర్ణంబు
నగు మణిపూరకం బందున హరి
యడరు ద్విషడ్దళంబయి పింగ మగుననా
హతచక్రమున భూతపతి శివుండు.

గీ. వెలయు షోడశదళము ధూమలవిభాస
మగు విశుద్ధచక్రమున జీవాత్ముఁ డవులఁ
బొలుచును సహస్రదళము కర్పూరవర్ణ
మైనయాజ్ఞాఖ్యమునఁ బరమాత్ముఁ డెపుడు. 146

క. కావున గణపతి తనువున
నే వెలుఁగుఁ దదీయచిహ్నధృతి వ్యర్థం బౌఁ
జూవె త దాజ్ఞాహ్వాయ చ
క్రావస్థితు సాక్షి నిర్గుణాత్మ నరయ నౌ. 147

క. అఖిలోత్తముఁ బరమాత్ముని
నఖిలజగదతీతు సచ్చిదానందమయున్
నిఖిలశ్రుత్యాదితుఁ దలఁపు
ము ఖిలం బగు భవము; దొరకు ముక్తి తనంతన్. 148

ఆ. అనుచు శుద్ధ మద్వయము శంకరుఁడు దెల్ప
సగణుఁ డౌచును గిరిజాసుతుండు
పంచయజ్ఞపరతఁ బంచపూజారతిఁ
జిహ్నములఁ ద్యజించి శిష్యుఁ డయ్యె. 149

క. గిరిజాసుతుఁ డటు శంకర
చరణాశ్రితుఁ డగుటఁ గాంచి సరవి హారిద్రా
కరివదన భక్తుఁ డొకరుం
డరుదెంచి వచించె నిటు దురాగ్రహ మెసఁగన్. 150

హారిద్రగణపతి మతనిరాసము

శా. యావద్దేవగణోపజేష్టృకవిబృందాదేష్ట, బ్రహ్మాది త
ద్దేవేశానగణేశుఁ డంబురుహసూత్రిత్రాతయున్ జ్యేష్ఠరా
జై వెల్గొందు పరేశు నెంతు మనువేదాలాపమూలంబునన్
యావత్కార్యముఖార్చ్యుఁ డయ్యెఁగద విఘ్నాధీశ్వరుండొక్కఁడే.

ఆ. కాన సర్వదేవగణపూజ్యుఁ డగు గణే
శ్వరుఁ డొకండె సుమ్మి, స్కాందమందు

నా గణాధినాథు ధ్యానంబు సంప్రోక్త
మయ్యె నది యతీంద్ర! యవధరింపు. 152

ఉ. తాలిచి పాశ సృణ్యభయ దండములన్ శయపంక్తిచే హరి
ద్రాలసదాననం బుదిరిరంగుహారంగు లెసంగు జందెమున్
జేలము నుల్లసిల్లఁగఁ ద్రినేత్ర చతుర్భుజ శోభి యైన శుం
డాలముఖున్ భజించిన క్షణంబున మోక్షము గల్గు నేరికిన్. 153

ఉ. ఆతఁడు విశ్వహేతువు, తదంశజు లజ్జభవాదు లౌట వి
ఖ్యాతు జగత్పితామహు గణాధిపతిన్ భజియింపు మీవు, బా
హాతటులందు నేకరదనాకృతిఁ దుండసమాకృతిన్ సుత
ప్తాతతలోహముద్ర లనయంబు ధరింప విముక్తి చేకుఱున్. 154

చ. అన విని విశ్వవేది కరుణాంబుధి యాగురుఁ డిట్లు పల్కె "నీ
వనిన జగన్నిదానమె పరాత్మ మగున్ బహునాముఁడైన యా
శునకు గణేశనామమును జొప్పడు, రుద్రుఁడె పుత్రరూపమున్
గొనెఁ జుమి యంశి కంశమునకున్ బొడసూపునె భేద మింతయున్.

గీ. కాన సర్వాత్మ సర్వవిఘ్నప్రహర్త
భక్తు లగువా రుపాసింపవలయు, నతఁడె
సర్వదుఁడు గాన విప్రు లర్చనము సలుప
వలె గణేశాదిపంచదేవతల సతము. 156

ఉ. మోదమునన్ ముముక్షుజనముల్ గొలువందగు; నంతెకాని తుం
డాదిక చిహ్నసంధృతి నిరాకృత మయ్యెఁ బురాణసంహతిన్
వేదములందుఁ గాన నవి వీడి నిరంతరదీక్షఁ బంచపూ
జాదు లొనర్చి యద్వయమతాప్తుఁడవై భవమోక్ష మొందుమా.

ఆ. అనుడు గణకుమారుఁ డయ్యతీంద్రునకు ద్వా
దశనతుల్ ఘొనర్చి తత్కటాక్ష

విమలుఁడై జగద్గురు మది ధ్యానించుచుఁ
బంచపూజాదిపరతఁ దనరె. 158

ఉచ్ఛిష్టగణపతి మతనిరాసము

వ. అట్లు గణకుమారుం డద్వైతమతావలంబి యగుట యరసి, హేరంబసుతుం డను నుచ్ఛిష్టగణపత్యుపాసకుం డరుదెంచి మహాగణపతి హరిద్రాగణప త్యుచ్ఛిష్టగణపతి నవనీతగణపతి స్వర్ణగణపతి సంతానగణపతు లను నుపాస్యవస్తువుల భేదంబున గాణపతమతంబు షడ్విధం బని శైవాగమకథితం బయ్యె. అందు నుచ్ఛిష్టగణపతియ మా కుపాస్యుండు. వామమార్గావలంబనమున నుచ్ఛిష్టగణపతి యనఁ బరఁగుఁ దత్స్వరూపం బించుక వివరింతు వినుము. 159

క. వినుతింతుఁ జతుర్భుజుఁ ద్రి
నయను బాశాంకుశ గదాభయాంచితుఁ దుండా
గ్రనిపీతమధుకు గణనా
థుని రాత్రిందివము భక్తితో నోరారన్. 160

క. ధ్యానింతు మహాపీఠా
సీనుని వామాంకమున వసించెడు దేవిన్
బూని కవుంగిటఁ దుండము
చే నచ్చోటెని స్పృశించి చెలఁగెడువానిన్. 161

ఉ. దక్షిణ వామ మార్గముల ధ్యానము లీగతిఁ బ్రోక్తమయ్యెఁ బ్ర
త్యక్షముగాఁగ జీవపరమాత్ముల మైక్యమువోలె నైక్య, మా
పక్షయుగంబునందుఁ గనుపట్టు నెఱింగి భజింతు భక్తిఁ దా
దృక్ష పథద్వయంబు, ధరియింతు నొసంటను గుంకుమాంకముల్.

గీ. మఱియు స్వచ్ఛందరీతిఁ గర్మము లొనర్చు
కొనుచు నుచ్ఛిష్టగణపతిం గొలుచుచుందు

దీని కెనయైన మఠ మొందఁ గాన నంచుఁ
బ్రీతినిమిష మందఁ గందు హర్షమ్ము మదిని. 163

సీ. మఱి మామతమున ధర్మ మెయ్యెండు గలదు య
తీంద్ర! పూరుషు లెల్ల నేకజాతి
చాన లెల్లరు నేకజాతి వా రౌట స్త్రీ
ణము లెల్లఁ బురుష భోగ్యములు సుమ్మి
దురితంబు వారయదు నర నారులకును సం
యోగంబునందు వియోగమునను
నితఁడె యీామగువకుఁ బతి యంచు నియమమ్ము
కన; యొండొరుల సంగమున లభించు

గీ. నట్టి యానందమే ముక్తి "యల గణేశుఁ
డరయ నానందమయుఁ డంచు నబ్దజాదు
లతని యంశము లంచు నంశాశులకు న
భేద మంచు" వేదమె పల్కలేదె యనఘ. 164

వ. మఱియు 'గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమ' యని శ్రుతియందు రుద్రుండ గణపతిగాఁ జెప్పఁబడు, 'న కర్మణా' యను శ్రుతి యందు సహిష్ణుతాదిగుణయుతం బగు త్యాగంబె కాని, మోక్షం బునకుఁ గారణంబు కర్మంబు కా దని గలదు గాదె? మామతంబునఁ బుణ్యపాపాదులంద ద్వంద్వత వెలయుఁ గావున నింతకంటె ముము క్షుసేవ్యం బెద్ది గలుగు ననుటయు నాచార్యవర్యుం డిట్లను. 165

క. కలు ద్రావఁ జనదు పరనా
రులఁ గవయఁగ రాదటంచు శ్రుతి దూఱినచేఁ
తలుగల మతము త్యజింపఁగ
వలె మోక్షార్థులు స్మశానవహ్ని విధమునన్. 166

ఉ. అద్వైతతత్త్వవిత్తు దళితాంహుఁడు నా యతికే 'నకర్మణే'
త్యాదికసూక్తి ముక్తిరమ యబ్బుటఁ దెల్పెను గాని మద్యపా
నాదరుఁ డన్యదారరతుఁ డౌనఘవృత్తికిఁ దెల్పెనే? సురా
పాదులు ముక్తిఁగాంతు మని యార్చుట దౌష్ట్యము దుఃఖదంబగున్

ఉ. కానఁ ద్యజించి యామతము గ్రిన్నఁ బ్రసన్న ధరామరోక్తిచేఁ
బూనిక నిష్కృతిన్ బడసి మోక్షపదాప్తికిఁ బంచయజ్ఞముల్
మానక, పంచదైవతసమర్చన సల్పుచుఁ బాపదూరులై
మానసశుద్ధి జ్ఞానమహిమన్ గృతకృత్యులు కండు మీ రిఁకన్. 168

క. ధృతి మూలాధారాది
స్థితుల గణేశాదులను మతిన్ గను చజపాం
చితమంత్రాసక్తులరై
సతతము చరియింపఁ గొండ్రు శాశ్వతముక్తిన్. 169

నవనీతగణపతిమతాదినిరాసము

వ. అనుటయు హేరంబసుతాదు లట్లొనర్చి కృతకృత్యు లగుటయు, నవశిష్టులగు నవనీత, సువర్ణ, సంతానగణపతిమతస్థులగు వీరభద్రాదు లరుదెంచి శంకరునితో "స్వామీ! యీజగం బంతయు గణపతిస్వరూపంబుగ మోక్షార్థులమై ధ్యానింతుము. సుఖార్థులగుజనులకుఁ బూజ్యం బగు మా మతంబు మీ రెట్లు దూషించితిరో వింతయయ్యె ననవుడు మీరు మూఢులరు శాస్త్రతత్త్వంబు నిదె తెలిపెద వినుం డని గురుచంద్రుఁ డిట్లనియె. 170

సీ. మును మహత్తత్త్వమ్ము పూరుషాధిష్ఠిత
యగు ప్రకృతిని నుదయంబు నొందె
నామహత్తత్త్వమ్మునందుండి త్రిగుణాత్మ
క మ్మొప్పతిలె నహంకార మనఁగ

సద్ధియే సుద్రవిష్ణ్వాదిరూపం బయ్యె
నారుద్రునం దుదయమ్ము గనిరి
సుతులు ముప్వురు గణపతి కుమారస్వామి
భైరవుం డనెడు నాహ్వాయము లొంది

గీ. వారు స్వ స్వాధికార నిర్వహణ సక్తు
లగుట నాయాయిచక్రములందు వెలుఁగు
నగ్గణేశాదులే ధ్యేయు లైరి విప్ర
వితతి కింక నశక్తులవిధి వచింతు. 171

క. ఆదిత్యాంబా హరి లం
బోదర శంకరు లనఁగ మహోన్నతిఁ గను నా
యైదుగురు దేవతల ధర
ణీదేవుఁడు పూజసేయ నిత్యము వలయున్. 172

మ. అను నాచార్యుని సూక్తిజాలవశులై యావీరభద్రాదు లో
య్యనఁ జిహ్వాంబుల నూడ్చివైచి గురుపాదాబ్జంబులన్ వ్రాలి పె
ల్చనఁ దచ్ఛిష్యతఁ గాంచి పంచ సురపూజా పూర్వ కాద్వైతరీ
తి నితాంతామలమానసాబ్జు లయి యర్థిన్ బొంది రబ్రంబుగన్.

మ. పరపాషండ మతాళి నుక్కడఁచి యద్వైతార్థవాగ్వ్యష్టిఁ గ్రి
చ్చఱఁ జోళద్రవిళాదిదేశజులఁ బాదాక్రాంతులన్ సల్పి, త
త్కరిశైలేంద్ర నితంబ కాంచి యగు శ్రీకాంచిన్ సురాగారముఁ
బరవిద్యాచరణానుసారిగ రచింపంజేసి కర్మంది తాన్. 174

ఆ. తాంత్రికులను బాయఁ దఱిమి కామాక్షికి
భగవతికి సపర్య నిగమసమ్మ
తమ్ముగా ఘటించి తత్పురి నొకనెల
శంకరుండు శిష్యసహిత ముండె. 175

పదపడి భైరవపూజా
స్పదుల మదం బణఁచి రొక్కపతి ధీశక్తిన్. 181

వ. అచటినుండి కర్ణాటదేశమున కేఁగ శంకరార్యుండు దలపోయు
చుండ విదర్భరాజిట్లను. 182

శా. కర్ణాటావనిఁ బర్యటించెదుకడంకన్ వత్తు రీ రంచు నా
కర్ణింతుర్, వినలేదె తద్విషయ ముగ్రింపక్వకాపాలి కా
కీర్ణం, బనమ తోపదేష్ట్రజనతా కీ టోర్ణనాభం, బన
భ్యర్ణం బాస్తికకోటి కంచు, విరమింపంజూడు మాయత్నముల్.

ఆ. అన నధిజ్యధన్వుఁ డౌచు సుధన్వుఁ డి
ట్లనియె వీఁడె భర్తుఁ డండ నుండ
భయము నీ క దేల ప్రతిపక్షు లగుపాము
రాళివలన స్వామి! యనుచుఁ బలుక. 184

ఉ. వైళమ యేఁగెఁ దీర్ఘకరవర్యుఁడు శంకరదేశికుండు కా
పాలికజాలకంబు గెలువన్ ధృతి పీడక కన్నడానఁక
వ్వేళను శంకరాగమనవృత్త మటన్ గ్రికచాభిధాన కా
పాలిక దేశికుండు విని పట్టఁగరాని దురాగ్రహంబునన్. 185

కక్రిచుఁ డను కాపాలికుని చరితము

చ. పితృవన భస్మ లిప్త తనుభీకరుఁడై సృకరోటి శూల సం
యుతకరయుగ్మ మొప్పఁ దన కుద్ధిగ వేసము దాల్చి పెక్కు రు
ద్ధతగతి వెంట నంటఁగ మహామనుఁ డౌచు నఖర్వగర్వభా
షితముల నిట్లు పల్కె యతిశేఖరుఁ జేరి యనాదరంబుగన్. 189

చ. బసుమము మై నలందితివి బాగగుఁ గాని కరోటిఁ దాల్ప క
ప్పసముగ బొంతఁ దాల్తువు కపాలియుపాసన లేద, రక్షసి

క్తసితసరోత్తమాంగములఁ గల్లునఁ బూజ లొనర్ప కెట్లు గో
త్రిసుత కవుగింటన్ వివశతం గనుభైరవుఁ డొందు మోదమున్.

చ. అని యిటు భైరవాగమరహస్యములన్ వివరించువాని నీ
చుని మెడవట్టి త్రోయుఁ డనుచుం గడు నల్గి సుధన్వుఁ డాజ్ఞ యి
చ్చినక్షణమే తదీయు లగుసేవకు లాసభనుండి పాఱనూఁ
కిన భ్రుకుటీఖరాస్యుఁ డయి కేలఁ బరశ్వథ మూని వాఁడునున్. 188

గీ. వరుస మీామీాశిరంబులు నఱుక నేని
నేను గ్రికచుఁడ నే యంచు నీచుఁ డతఁడు
కెరలి పగచాటి పోయి ముష్కరకపాలి
తతి యతుల మీాఁది కనిపె వధం బొనర్ప. 189

క. అలిగి కపాలిబలంబులు
ప్రళయాంభోధర భయంకర క్ష్వేళలతో
బిలబిల మని వచ్చి యతుల
నలమె నసంఖ్యాకముగ నుదాయుధ మగుచున్. 190

గీ. అంత నవ్విప్రకులము భయాకుల మయి
పఱచు టరసి సుధన్వుండు పట్టరాని
యలుక సన్నద్ధుఁడై రథియై నిషంగి
యై కపాలివ్రజము ముంచె నంపవెల్లి. 191

క. ఆరీతి నృపతి కుమతుల
మాఱుకొనం గ్రికచునాజ్ఞ మఱియొక కేలన
గూరకపాలు లుదాయుధు
లై రవరవ నఱుకఁ గవిసి రవనీసురులన్. 192

చ. యమభటులట్లు పైఁబడెడునట్టి కపాలిసహస్రముల్ సమీ
పమునన కాంచి గొల్లు మని పాఱులు శంకరుఁ జేరి దేవ! కా
వు మనుచుఁ గూయిడన్, యతియు బూదిగఁ జేసెను హుంక్రియోత్థని
స్వనమదహానార్చులన్ నిశితశస్త్రసహాయుల నాతతాయులన్. 193

క. భూనేత కనకపుంఖ శ
రానీక నికృత్త శాత్రవాస్యకమలసం
తాన పరిష్కృత రణమహి
యై నిరుపమభక్తి మెఱయ యతిపతి కెఱఁగెన్. 194

మ. క్రకచుం డంత స్వకీయు లంతమగుటన్, బ్రాహ్మణ్య మక్లేశ ము
త్సుక మాటం గని దూయమానచలచిత్తుండై యతీశాను నం
తికమున్ జేరి "దురాత్మ! నామహిమన్ వీక్షింపుమా యింత కిం
త కనంజాలెద"వంచుఁ గేలఁ బుఱియన్ గైకొంచుఁ గన్మోడ్చి లోన్.

గీ. భైరవాగమమార్గముఁ బట్టి ధ్యాన
మాచరింపఁ గరోటి మద్యంబు పొడమె
నందు సగ మాని, పుఱియఁ దక్కర్ధ మూని
భైరవు స్మరించు నంత నబ్రమ్ము దోఁప. 196

క. మ్రోలను మహాకపాలి త్రి
శూలి నరకపాలమాలి శోచిష్కేశ
జ్వాలాజాలనిభజటా
పాళి పొడమె నట్టహాసభాశ్శాలియునై. 197

చ. అటు పొడసూపు భైరవుని యంఘ్రుల వ్రాలి 'భవన్మతాశ్రిత
చ్ఛటఁ బొరిగొన్న యీఖలు వెసన్ గనుమంట దహింపు' మన్న ను
త్కట రుష 'మత్స్వరూపు యతితల్లజుఁ జంపు మటంచె' యంచు న
క్కటుమతి వాళి శూలమునగ్రిక్కనఁ ద్రుంచి నటించెనెంతయున్.

గీ. అంతఁ గోరిధభయంకరుండై నటించు
నట్టి సంహారభైరవు నంఘ్రియుగళి
వ్రాలి శంకరదేశికేశ్వరుఁడు సన్ను
తించి యిట్లను భయము భక్తియును మెఱయ. 199

సీ. స్వామి! వేదపురాణశాస్త్రసంప్రతిపాది
తమగుకర్మమ్ము కర్తవ్య మనుచుఁ
దత్కర్మమున నబ్బు ధర్మమ్ము, దాన మ
హాఘకోటులు నాశ మందు ననుచు
నాశుచివ్రతమున నంతరంగము పాప
దూరమై శుద్ధమై తోఁచు ననుచుఁ
జిత్తవైమల్యమ్ము చేకుఱ నాత్మసా
క్షాత్కార మప్పుడ గలుగు ననుచు

గీ. నపునరావృత్తిమోక్ష మయ్యదియె యనుచు
నఖిలభూసుర పరిష దభ్యంతరాళ
మందు నద్వైతమతసార మర్థి నుడువు
చుంటి జగతికి భవపీడ యోసరిలఁగ. 200

ఉ. ఆయెడ నీదు భక్తుఁడు రయంబున నీఁ డరుదెంచి యాక్షమా
చ్ఛాయ 'ని దెల్లఁ ద' ప్పను చసంగతదూషణ యుక్తికోటులన్
గూయ, మదీయశిష్యతతి గొట్టి మెడన్ జెయివెట్టి నెట్ట, వై
ధేయత మంత్రశక్తి నినుఁ దెచ్చెను, జచ్చెను శూలకృత్తుఁడై. 201

క. దేవా! సత్యాసత్యము
లీవ యిఁకన్ దెలిపి ప్రోవుమీ మ మ్మన నా
దేవుఁ డనియె ద్విజశిక్షణ
కై వెలసిన శంకరుండ వౌ దీనార్యా! 202

ఉ. వేదపదార్థగమ్యుఁడవు విశ్వసమర్చ్యుఁడ వీ వొనర్చు నే
దేదియు నే నొనర్చినటులే యగు- బ్రాహ్మణధర్మ మూఁది యీ
యీదురితాత్ము లెల్లఁ దరియింప నొనర్చు, కలిప్రభావ మి
ట్లాదుకొనంగ నిష్ట మగునట్లు చరింతురు వీరు క్రూరులై. 203

గీ. మంత్రబద్ధుండ నౌట దుర్మతికి వీని
కకట! ప్రత్యక్షమైనాఁడ నంతెకాని
ధర్మమునఁ గా దటంచు నందఱును గాంచు
చుండ భైరవుఁ డంతర్హితుం డగుటయు. 204

క. ఆపట్టున వటుకాదులు
కాపాలికదుర్మతానుగతులు తదీయా
లాపముల కళికి శంకరు
శ్రీపదముల కాచరించిరి నతుల్ పదిరెండున్. 205

ఉ. వా రరు దొంది 'మే మకట! స్వామి! విమూఢుల మేలుమా కృపా
సారముఁ జిల్క మ' న్మనుడుఁ జల్లని మాటల నాదరించు చ
క్కాగుణికాగ్రగామి కడగంటన శిష్యులఁ గాంచి పూతులౌ
వారి నొనర్చ నాజ్ఞయిడ వైశమ పద్మపదాదు లొక్కరై. 206

గీ. వారలను బ్రాత రవగాహ పరులు గాఁగ
సతత సంధ్యావిధా ద్యనుష్ఠాన పూర్వ
పంచయజ్ఞ పంచాయతన నాంచన నియ
తులుగ బ్రాహ్మణాఢ్యగులుగ సలిపి రెలమి. 207

వ. సమాహితచిత్తులై వటుకాదు లగువాకాపాలికు లద్వైతమతనివి
ష్టులై శంకరచరణంబులు శరణంబుగ నమ్మి శిష్యులై సేవించు
నెడ నొక్క కాపాలికధూర్తుం డరుదెంచి యి ట్లనును. 208

ఉన్మత్తభైరవునితో వాదము

సీ. కాపాలికమతానఁ గలుగుచో న్యానత
పరమతంబుల నింత ఫలము గలదె?
బ్రహ్మజాతితయ గొప్ప దనుదురూహా ని
వ్వటుకాదులు స్వమతభ్రష్టులైరి
జాతిచే నేప్రయోజనమును గనఁబోము
సకల దేహములు భౌతికము లగుట
'నిద్ది యీజాతి' యం చెవఁడు సెప్పఁగలాఁడు
కాన నేతజ్జాతి కల్పితంబ

గీ. యిందులఁ బ్రిమాణ మగపడ దింక నద్ది
వినుము ద్వివిధంబు, స్త్రీజాతి యనఁగఁ బురుష
జాతి యన- నందు నాద్య శ్రేష్ఠము తదీయ
సంగమ మ్మక్షయానందజనక మగుట. 209

ఆ. గమ్య యీపె, యిది యగమ్య పీనిదియ యీ
గరిత- పరుని యాలిఁ గవయరా ద
టన్ననుడిని నమ్మ మఖిలకాంతలు స్వీయ
లగుట; "దోస మంటు' ననుట తగదు. 210

క. ఆనందార్థము చర్మము
చే నొకచర్మమ్ము నొరయ జీవున కఘు మె
ట్లా 'నానందజతృప్తియె
యా నలజీవునకు మోక్ష' మనరే పెద్దల్. 211

క. కానన్ దత్సంగ స్ఫుట
మానందమె భైరవుఁడు; నిజాంగలయమునన్
దా నాదేవుని గలియుటె
యా నిక్కపుముక్తి తెలియుమా మన్మతమున్. 212

సీ. అనుచుఁ దెల్పఁగ శంకరాచార్యుఁ డనియెఁ గా
పాలిక! సత్యంబు పలికి తీవు
నీతల్లి యెవ్వానికూఁతు రం చన వాఁడు
దీక్షితసుత యంచుఁ దెల్ప, యతియు
దీక్షితత్వమ్ము సిద్ధించె నాతని కెట్టు
లనుడుఁ గాపాలికుం డనియె నిట్లు
తాల హింతా లాదితరువుల కలు గీయుఁ
దమ్రిచి యెఱిఁగియుఁ ద్రావఁ డొకపు,

గీ. డమ్ము నితరుల కింత న్యాయమ్ముఁ దప్ప
డది గని జనంబు దీక్షితుం డనుచుఁ బిలుచు
నట్టిదీక్షితుపట్టి మాయమ్మ, యింక
నాయమచరిత్రము వచింతు నాలకింపు. 213

క. నిచ్చలు తనుఁ జేరిననరు
లచ్చపుసుఖవార్ధి నోలలాడఁగ దేహం
బిచ్చి వ్రతము నెఱపుకొనిన
సచ్చరిత మదంబ; జనకచరితము వినుతున్. 214

ఆ. ఎవనిమద్యగంధ మిసుమంత సోఁక స
న్నిధిని నిలువలేక నిర్జరులును
బఱవఁ జొత్తు, రట్టిప్రఖ్యాతి గన్న సు
రాకరాహ్వయుండు నాకుఁ దండ్రి. 215

క. ఉన్మత్తభైరవాఖ్యుఁడ
సన్మాన్యుఁడ నిట్టియాభిజాత్యము గల న
న్ను స్మి గర్చించిన జీ
వన్ముక్తుల రగుదు రనిన వారని కినుకన్. 216

ఉ. ప్రేలక యూరకేఁగి పృథివిన్ విహరింపు యథేష్టరీతిఁ గా
పాలిక! దుర్మతస్థితుల బ్రాహ్మణజాతుల శిక్షసేసి స
చ్ఛీలురఁ జేయుపూన్కి నరుదెంతును గా, కొరులన్ స్మరింప నా
కేల? యటం 'చవాచ్యుఁ డగునీఖలు దవ్వుగ రుమ్మఁడా' యనన్.

ఉ. మూఁకలు గట్టి శిష్యులధముం డగుభైరవు మాళిఁ బట్టి పి
ర్వీఁకులఁ బెట్టి యొజ్జనుడి వెంటన దవ్వుల నెట్టి- రంతఁ జా
ర్వాకుఁ డొకండు వచ్చి యతిరాజుఁ గనుంగొని సైఁప నోప క
ట్టాకలఁ బెట్టుచిత్తమునయందు విచార మొనర్చె నీక్రియన్. 218

చార్వాకమతనిరాసము

సీ. తనరు దేహాద్యతీతముగ నాత్మ మటంచు
వదరుమూర్ఖులతోడ వసుధ నిండె
మాకు సైతము నట్టిమతి గల్గు నేమొ త
త్సాంగత్యమున నను త్రాస మొదవె
వారి కందఱ కగ్రచారి యీసన్న్యాసి
యఁట యించుకంత మాటాడవలయు
నిలుతు నింత వివేకకలితుఁ డంచును దోఁచె
నేని, గాకున్నఁ దోడ్తోన చనెద

గీ. నని విచారించి సభసొచ్చి యతిని జేరి
తత్త్వ మెఱుఁగుదువే ననంతరము మోక్ష
లక్షణము తెల్పుదువు గాని లలితఫణితి
వినుచు నస్మద్వివేకమ్ము వినుము తొలుత. 219

క. జలనిధిజలముల విలయ
మ్మొలయునదుల కొగమనమె యున్నెడ, మృతుఁ డీ
యిల మరలఁ బొడముఁ, గావున
విలయమె జీవునకు ముక్తి వివరింపంగన్. 220

ఆ. తృప్తుఁ డగు మృతుండు దీనిచే నంచు శ్రా
ద్ధాదికర్మ మాచరించునట్టి
మోఱకుల వివేకమునకు న వ్వొదవును
వారిచిత్రమతము గోరు నెవఁడు? 221

గీ. కాయ మే యాదిరూపమ్ముగా జనించు
నట్టికాయమ్మె తా నయి యలరుజీవు
నకు లయమె ముక్తి, కా దిఁ కన్యంబు- మూఁఢు
లట్టి జీవుండు మఱిమఱిఁ బుట్టు నంద్రు, 222

సీ. 'పరలోకములు స్వర్గనరకముల్ గల వవి
పుణ్యపాపప్రాప్యములు క్రమముగ
నాపుణ్యపాపమ్ము లయి పోవ జీవుండు
మరల మర్త్యమున జన్మంబు నెత్తు'
ననువారి మత మెంతయును నప్రమాణ మ
య్యుభయానుభవ మిట నొదవదొక్కొ-
యెవ్వాఁడు సుఖభోక్త యవ్వాఁడె స్వర్గి, యె
వ్వఁడు దుఃఖభోక్త యవ్వాఁడె నిరయి

గీ. యిటుల ప్రత్యక్ష మనుభవం బేర్పడంగ
నెటొ పరోక్షమ్ము కల్పింప నేటిపాడి?
యింద్రియములు దేహము నశియింప నింక
నెవఁడు పరలోకమున కేఁగు? నెట్టు లేఁగు? 223

గీ. అరయ జీవుండు దేహేంద్రియాదు లగుట
దేహము నశింప జీవుండు దీఱిపోవుఁ
'గన నగును భేద' మన మహాకాశమందు
నంతరించుఘటాకాశ మట్ల డిందు. 224

ఆ. కాన మామతము జగన్నుత్య మంచుఁ జా
ర్వాకుఁ డనఁగ నిట్లు పలికె యతియు
వేదబాహ్యమతము నీది నుత్యం బెట్టు
లస్మదీయమతము నాలకింపు. 225

సీ. ఆయాత్మ దేహేంద్రియాదులకు విభిన్న
మదె ముక్తమై పరమాత్మ మగును
అజ్ఞానమునఁ బరమాత్ముఁడే బద్ధుఁ డౌ
జ్ఞానమ్మున విముక్తుఁ డౌను జువ్వె
'దేహపాతమున ముక్తి లభించు' నను త్వదా
లాపమ్ము భ్రాంతిమూలము నిజముగ
జ్ఞానాగ్ని నిర్దగ్ధ కర్ములై కంద్రుఁ బ్రి
హ్మము నంచు జ్ఞానమాత్రమ విముక్తి

గీ. హేతువుగఁ దెల్పు శ్రుతియు; య దెటు ప్రమాణ?
మనిన నీకుత్సితోక్తి యానా ప్రమాణ?
మగ్ని దహియింప స్థూలదేహంబు, లింగ
దేహ మూఁది జీవాత్మ యెందేని యేఁగు. 226

వ. ఇందులకు 'స్వర్గకాముఁడు జ్యోతిష్టోమము చేయఁ దగు, నిత్యా
దివేదవాక్యములె ప్రమాణము. 227

క. శ్రుతి జీవుఁ దృణజలూకా
ప్రతిమునిగ వచించెఁ దనువు పడ; నన్యతనూ
గతుఁడై పరలోక మొనయు
సతనికిఁ దత్సుతులు చేయనగు శ్రాద్ధాదుల్. 228

చ. అనియును బ్రేతతారహితుఁడై యతఁ డుత్తమలోక మొందఁజే
యన తగుఁ బిండదానము గయాదుల నంచుఁ బురాణ ధర్మశా

స్త్రనివహ ముగ్గడించుటను సప్తదశాంగము లింగదేహమున్
'దన' దని పొంది జీవుఁడు పతంగముకైవిఁ బరత్రిఁ దాఁ జనున్. 229

క. కావున మాతాడక చను
మీ వోచార్వాక! జడమతీ! యని పలుకం
గా వాఁడు వేషభాషలఁ
బో విడచి యతీంద్రుపాదములకున్ మ్రొక్కెన్. 230

వ. అట్లు మ్రొక్కి యథావిధి నాజగద్గురులకు శిష్యుండై నాఁటం గో
లెఁ దత్పుస్తకభార భరణరూప శుశ్రూషాపరుం డయ్యె, నట్టి యె
డఁ బీనకాయుం డగుసౌగతుం డొక్కఁడే తెంచి శంకరునకు మ్రొ
క్కి యి ట్లను. 231

సౌగతునితోడి వాదము

ఉ. ఆదృతకర్మమార్గు లయి రజ్ఞత నీజను లిట్లు; స్నానదా
నాదుల భౌతికంబునకు నబ్బునె శుద్ధి? సదా విశుద్ధి పెం
పూఁదెడు జీవుఁ డంగ మటు లూడ్చి విముక్తిని బొందుచుండఁగా,
'నేదొ ఋణానఁ జిక్కి జనియించు మటేన్ భువి'నంద్రు దుర్మతుల్.

గీ. ఋణము మే నెత్తునప్పు డదృష్ట, మటులె
యంతమున లేదు, కాన ద్రవ్యము గడింప
ఋణభయము వాయవలె విన వే 'ఋణం బొ
నర్చి నెయి త్రావవలయు' న న్వాక్యరీతి. 233

చ. అది పరమప్రమాణము, నిరంతర మెల్లెడ నప్పుసేసి పెం
చఁదగుఁ గళేబరంబు మతిశాలి; సుఖం బఖిలాన్నభోక్తకే
యొదవును, ముక్తి నాఁగ నటు లొందుసుఖంబె సుమా! విముక్తికే
కద మఱి నీప్రయత్న మనఁగా విని యయ్యతి పల్కె సౌగతున్.

ఉ. నీదు వృథాప్రలాప మిఁక నేనియు మాను శ్రుతి స్మృతీతిహా
సాదులు కర్మభోగమునకై పరలోకగతిన్ వచించుటల్
బోదు ఋణాదికర్తృ కిలఁ బుట్టుట చచ్చుట, కానఁ బాపసం
పాదకమౌ కుబుద్ధి నెడఁబాసి చరింపుము సత్పథంబునన్. 234

గీ. అనుడు సౌగతుఁ డిటు లను వినుము సుగతుఁ
డనుముని సమస్తభువిఁ గాంచి, కని జగన్ని
సర్గసత్యమ్ముఁ, బ్రాణ్యుపాసనరతుఁ డయి
కరుణ నుపదేశమిచ్చె నిక్కరణి నాకు. 235

ఉ. గణ్యము ప్రాణ్యహింస యనఁగా దగు ధర్మ మొకండె, నీవు త
త్ప్రాణ్యవిహింసనంబునఁ గపాలనివర్తన మూని మోక్షసా
ద్గుణ్యము గాంచు మంచు-దయతో నను తద్గురువాక్కు లెంచి యా
పుణ్యము గల్గఁ దద్వచనమే కొని ప్రాణ్యవిహింసఁ బూనితిన్. 236

ఆ. ఆత్మ గురునిపదము, లాదలఁ దద్వాక్కు
లూని సకలచేతనానుకంప
వ్రతముగాఁ జరింతు క్షితి నన్నె యిట్టిధ
ర్మమ్ము సర్వసమ్మతమ్ము నమ్ము. 237

వ. మామతము ధర్మస్థానము కావుటంజేసి యెల్లరు మేకొనఁ దగిన
దనుటయు నాచార్యుం డి ట్లను. 238

సీ. ఏమంటి వోరి నిహీన! సౌగత! యహిం
సాన్యధర్మంబె లే దనఁ దెగింతు
యాగీయహింసన మది ధర్మ మనుచు వే
దములు పేర్కొనవె వ్యక్తమ్ము గాఁగ
నెటి స్వర్గ మిచ్చు నగ్నిష్టోమ ముఖ్యమ
ఖమ్ములు పశుహింస కారణముగఁ

బ్రాహ్మ్య మాహింస శుచిత్వాచారరతులకుఁ
బాషండు లగుదు రప్పథము దొలఁగ

గీ. బ్రహ్మవీర్యజులేని నారకములందుఁ
బడెడువార సదాచార వర్జనమున
వేదనింద నటంచు మన్వాదు లనుట
నట్టి రాకల్పనిరయులై యార్తిఁ గంద్రు. 239

వ. కావున బ్రాహ్మణాదివర్ణజులకు వేద నిరూపితాచారంబు పరమప్రమాణంబు, దాని నంగీకరింపనివాఁ డధముఁ డనుటయు నాసౌగతుండు ప్రమాణశూన్యం డగుటఁ బ్రతి వచింప నేరక శంకరునకు మ్రొక్కి, త దుచ్ఛిష్టాదన పుష్టియై, పద్మపాదాదులకుఁ బాదుకావాహకుండై సేవించుచుండ నొక్కనాఁడు. 240

క్షపణకమతనిరాసము

క. ఒక కేలఁ దురీయంత్రము
నొక కేలం గోళయంత్ర మూని, కటిని గోం
డొకకౌపీనము దాలిచి
యొకక్షపణకుఁ డేఁగు దెంచి యొజ్జకు ననియెన్. 241

క. స్వామీ వినుమీ యరుదగు
నామత మత్యంతశోభనము 'సమయుం' డ
న్నామమ్ము వాఁడఁ బూర్ణుఁడ
నేమతమును మామకైందిరియికమత సమమే. 242

శా. హేళిన్ గాలనియంత యంత్రయుగళిన్ హేలాగతిన్ గట్టి త
త్కాలజ్ఞానముచే వచించెదఁ ద్రిలోకంబందు రా నుండు ని
ర్వేలం బైనశుభాశుభార్థముల భావింతున్ సదా వేల్పుగాఁ
గాలంబున్; బర మేశుఁడున్ గదలుపంగా లేఁడు నాపక్షమున్. 243

చ. అన విని శంకరార్యుఁడు సమంచితరీతి వచించి, తెంచితిన్
'నిను సమయజ్ఞుఁ' డం చెపుడు నేనిఁ బరీక్ష ఘటిల్లకుండ, దం
దనుక మదాశ్రియంబున మసంగదె, ప్రశ్న మొనర్తునాఁడె యం
చనవుడు వాఁడు నియ్యకొనె నమ్మఱునా డతిభీకరాకృతిన్. 245

జైనమతనిరాసము

శా. కౌపీనంబును మాత్రఁ దాల్చి మలదిగ్ధం బైన మేనొప్ప, నం
కాపేతుండు నపుంస్త్రుఁ డయ్యు ధృతదీవ్యద్బిందుపుంద్రుండునై
యాపట్లన్ జనుదెంచె జైనుఁ డొకరుం "డర్హన్నమో" యంచు శి
ష్యోపేతంబుగ రేఁగి బొబ్బ లిడుకొం చొయ్యన్ బిశాచం బనన్.

క. చనుదెంచి శంకరుం గని
యనె- జినుఁ డనుదేవుఁ డెల్ల ప్రాణుల హృదులం
దున జీవుఁ డన వెలుఁగు, ము
క్తి నొసంగును ముక్తుఁ డగు నతిజ్ఞానమునన్. 246

ఉ. ఆతఁడు శుద్ధుఁ డొౕఁ దనులయం బొదవన్, మలపిండరూపమా
నీతను వెట్లు శుద్ధమగు నెందు మునింగిన నెట్టిగందపుం
నబూఁతలఁ బెట్టినన్ వలిపముల్ పయిఁ జుట్టినఁ? గాన స్నానముల్
పూఁతలు రోఁతలంచును బ్రబోధమొనర్పఁగ శంకరుం డనున్. 247

సీ. దేహ మొక్కటి యెట్లు త్రితయ ముండఁగ స్థూల
సూక్ష్మకారణము లంచును బ్రసిద్ధిఁ
గ్రమముగా నవి నాశనము నొంద సచ్చిదా
నందరూపము జీవుఁ డొంది వెలుఁగు
నీశభిన్నుఁడ నను నెఱుక యవిద్య- జీ
వుఁడు తదవిద్య బద్ధుఁ డయిపోవు

సే నభిన్నుఁడ నీశునికి ననుమతి విద్య,
యద్దాన భవముక్తుఁ డగును దేహి

గీ. యిటు సుదుర్లభ మగు మోక్ష మెటుల దేహ
పాతమాత్రమునన యుట్టిపడు ననియెడు
శంకరుపదంబులకు మ్రొక్కి ధాతుఁ డయ్యె
వాఁడు సహశిష్యుఁడై వేషభాష లుడిగి. 248

బౌద్ధునితోడి వాదము

ఆ. అంత శబలనాముఁ డగు బౌద్ధుఁ డేఁ తెంచి
యతివరేణ్యుఁ గాంచి యనియె నిటుల
త్వత్ప్రబోధ మెల్ల వ్యర్థంబు నరశృంగ
మునకు సమ మభేదమును దలంప. 249

గీ. ఈవు సర్వోత్తముఁడ విట్టు లేల యయితి
దృష్టఫల ముజ్జగించి యదృష్టఫలము
కోరె దది దూర, మేమి చేకూర్చు నీకు
శూన్యముగదా పరోక్ష మిచ్చునె ఫలంబు. 250

శా. నిర్జీవం బగుటన్ భవన్మతము కంటే వ్యర్థ, మస్మన్మతం
బూర్జస్వాంతము, దాన నాత్మ యొకఁడయ్యున్ బెక్కులై చేతనా
తూర్జంబై హృదయాదిఁ బ్రేరణము సేయున్ నిత్యముక్తంబునై
యార్జించున్ సుఖ మక్షయంబుగ సతం బద్వైతశూన్యం బగుఁ.

క. నేనే కర్తను భోక్తఁ బ
రానందాకృతి నటంచు స్వాభీష్టములన్
ధ్యానము గల యన్నాళ్లీ
మేనులఁ గ్రీడించి, కాంచు మే నట్టి ముక్తిన్. 252

వ. అనుటయు శంకరుం డి ట్లను. 253

క. విను మింద్రులు పదునలువురు
చనుదాఁక వసించు బ్రహ్మజగమున సత్యం
బును శౌచము గలిగి సురా
ర్చన యతిథి సపర్య సలుపు సజ్జనుఁ డర్థిన్. 254

క. అమరు లలర నగ్నిష్టో
మము సేయఁగ నింద్రలోకమందిరుఁ డగు, యా
గము పౌండరీక మొనరుప
నమరుం దత్సత్యలోకమందుం గాఁపై. 255

వ. కాన నాయాదేవతల నుపాసించువా రాయాదేవతలఁ జేర నరుగుదురు. మఱియు భగవద్గీతయందు "యోయో యాంయాం తనుం భక్త్యా శ్రద్ధయార్చితు మిచ్ఛతి। తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహ" మ్మనుభగవంతుని వాక్యమువలనఁ బరలోకగమనాదికము సిద్ధ మగుచుండెఁ గాన దేహపాతమాత్రంబున ముక్తి లభింప దని యెఱుంగుము; మఱియు. 256

శా. 'యావద్భూతములందుఁ దన్నుఁ, దనయం దాభూతకోట్లం గనంగా విజ్ఞాని యెవండో వాఁ డొకఁడె తాఁ గాంచున్ బరబ్రహ్మ,మింకేవాఁడున్ గనఁజాలఁ' డంచు శ్రుతియం దేర్పాటుగా నుండె 'జ్ఞానావిర్భూతినిదక్క ముక్తి గనరా' దంచాపథ మ్మాన నో. 257

ఉ. కాన ననర్థదాయి మతికల్పిత పాటను జీవభావమున్
లేనటు పుచ్చి, శాశ్వతికనిర్వృతి గాంచుట ముక్తి సుమ్మి, యిం
కేని త్యజించి మాఢ్యము సుఖింపు- మనన్ విని వాఁడు శంకరాం
ఘ్ర్యానతుఁడై తదద్భుతయశోఽభినుతివ్రత మూనె వందియై. 258

మల్లపురమున మల్లారిభక్తుల నద్వైతులఁ జేయుట

క. తదనంతర మాదేశము
వదలి జగద్గురుఁడు శిష్యపరివృతుఁడై నె
మ్మది మల్లపురికిఁ జని యి
ర్వదియొకదినములు వసించె స్వాస్థ్యము మెఱయన్. 259

చ. మఱి యచటన్ వసించు ద్విజమండలిఁ గన్గొని 'పాత్రరాదిగా
నిరతము నెల్లవేళఁ గరణీయము మీ, కెది సెప్పుఁ డన్నఁ జె
ప్పి రిటుల వారు 'మల్లుఁ డనుపేరి సురారి హరించి దేవుఁ డీ
పురి నెలకొన్నవాఁ డతనిమూర్తి భజించుటె కృత్య మెప్పుడున్

క. మల్లారి యనెడు నవ్వే
ల్పెల్లరకు నుపాస్యుఁ, డతని యెకిరింత శునీ
వల్లభుని, వేషభాషా
దు ల్లీల ధరింతు మాను దుము మెష గవ్వల్. 261

శా. మల్లారిక్ ప్రభు సుప్రసన్ను నొనరింపంగంటె మోస్వామి! య
ద్వల్లీలార్పిత నాట్య వాద్యములచేతన్ దత్కటాక్షాప్త సం
పల్లాభమ్మున వర్ధమాన సుఖ సంపన్మగ్నులై మేము యా
వల్లోకంబుఁ దలంతు మేత దుదరాభ్యంత స్థితం బం చెదన్. 262

సీ. మాకు సుఖేచ్ఛ యేమాత్రమ్ము లేదు వ
ర్తింతు మామ్నాయవిధిప్రకార
మరయ "నమః శ్వభ్య" యని "శ్వపతిభ్యశ్చ
వో నమ" యనియు వేదానువాక
మాయాశ్వేదునకు వాహన మగు శ్వానమ్ము
నకును సార్వాత్మ్య మున్నతి వచించెఁ
దద్వేష భాషాది ధారణంబున నస్య
ములయెడఁ గోర్కె యే మొదవకుండుఁ

గీ. గావున స్వశిష్యకోటితో నీవు వేద
చోదితాచార మిది పూను మీదినమ్మొ
యివె వరాటకములు ధరియింపు మెడను
మోక్షలక్ష్మి స్వయంగ్రహమ్మున సుఖింతు. 263

వ. అనుటయు నవ్వి యవ్విజ్ఞశేఖరుం డిట్లను. 264

మ. తనమాయన్ సఖిలాబ్జజాండముల నుత్పాదించుచున్ బ్రహ్మ వి
ష్ణు నిటాలాక్ష నిదాన మాచుఁ బర మేశుండై 'సది' త్యాదివే
ద నిగా దాస్పద మద్వితీయము ననంతం బేక మవ్యక్తమై
చను వాఁ డప్పరమాత్ముఁ డొక్కరుఁడ మోక్షప్రాప్తిమూలం బగున్.

గీ. అంశభవు లగు వీరభద్రాదుల లయ
మాఁది రుద్రుని లయ మెంచనోపనట్లు
తత్ప్రబోధమ్మువే రుద్రతత్త్వ మెఱుక
వడ, దటులె రుద్రుఁడును బరబ్రహ్మమునెడ. 266

క. కన 'శ్వభ్యః శ్వపతిభ్యో'
యను నిగమము పదియునొక్క రని రుద్రులఁ దె
ల్పెను, గలదె బహుత యేక
మ్మునఁ? కింకఁ ద దంశబోధమున ముక్తి యెటుల్? 267

ఉ. దేని స్పృశించుదోషము గతింపఁగ విప్రుల కెల్ల మృత్తికా
స్నానము పాచితంబొ, యల శ్వానము వేషము భాష లంకముల్
పూని, కులక్రమాగతినె పో యఘ మెంచక నిత్యకర్మముల్
మాని త్రిసంధ్యనాట్యమును మానరు, విప్రత మీకు నున్నదే? 268

క. కలుషాత్ముల మిముబోంట్లం
దిలకించినపాప ముడుగ దినకరుఁ జూడక

వలె, మౌన మూనవలె నని
తెలుపవె శాస్త్రము లటంచు దేశికుఁ డనుడున్. 269

ఉ. వాద నికృత్తమూలతరుభాతి, నృపాంఘ్రుల సాపరాధులౌ
వారువలెన్ జగద్గురునిపాదములన్ బడి లేవకున్న న
క్కారుణికుండు వారిఁ గడగంటఁ గనుంగొని లేవఁ బల్కె, యా
సారసపాదుఁ డాది యగు ఛాత్రుల కానతి యీయఁ దద్బుధుల్.

ఉ. చెచ్చెర శీర్షముండనము, చెంతనదిన్ బదివేలు స్నానముల్
గ్రచ్చర మృత్తికన్ వపనకర్మము, మృత్తిక నూఱు స్నానముల్
పొచ్చెము లేక చేసికొనఁ బుచ్చి పవిత్రులఁ జేయ, నప్డు వా
రచ్చుగ విప్రతాధ్వగతులై యతికిన్ నతులైరి శిష్యతన్. 271

గీ. స్నానశౌచాదిపరతఁ బంచాయతన న
మస్య శ్రుతిశాస్త్రసంతతామ్నాయ మూని
శంకరదయాప్తి మోక్షభాజనము లైరి
యరిగె యతిపతియును బశ్చిమాధ్వ మూఁది. 272

విష్వక్సేనమతనిరాసము

క. ఆ పశ్చిమదిశను మరుం
ధాపురి శంకరుఁడు సేరె నానానుత్యా
లాపులు శిష్యులు ధక్కా
వ్యాపారానుగుణచలితపాణు లగుచు రాన్. 273

వ. అందు విష్వక్సేనదేవుగోపురమ్మునకుం బూర్వదిశ విపుల మగుప్రపా
శాలం గాంచి యందు దర్భాసనాసీనుండై, మనోన్మనీనా మాంగు
ష్ఠమాత్ర లక్ష్యంబై, ప్రభువును నై వెలుఁగుసంపూర్ణమండలాకా
రుని బరమాత్ముని లోచూపునఁ జూచుచు, సుధాబిందుధారా స్వాద

తృప్తాంతరంగుఁడై కుండలినీశక్తిని మూలాధార మొందించి తదధిపతి గణపతిని నుతించుచు సుఖంబునఁ బెద్దతడ వుండె నంత.

క. ఆ నెలవునఁ గలవిష్వ
క్సేనపరాయణులు తోత్రకీలితపాణుల్
మానితశంఖరథాంగాం
కానమ్రభుజుల్ వినమ్రులై యని రిట్టుల్. 276

శా. వైకుంఠమ్మున సైన్యనాథుఁ డగువిష్వక్సేనుఁ డారాధ్యుఁ డౌ
మాకుం గావున మామతంబు జగతీమాన్యంబు పుణ్యప్రదం
బే కా కంతకభీతి దూల్చుఁ; దను పుర్వీం గూలఁ దద్దాసులే
వైకుంఠమ్మున మమ్ముఁ జేర్తు రనుచున్ వార్కుచ్చె భిక్షుండిటుల్.

క. కా దటు, విష్వక్సేనుఁడె
తా దాసుఁడు విష్ణువునకుఁ దద్దాసమునన్
దాదృశభక్తు లనేకులు
గాఁ దోఁతు రజస్రవిష్ణుకైంకర్యరతుల్. 277

సీ. తద్భక్తజనములు తద్భక్తులకుఁ బూజ్యు,
లను ననుజ్ఞామాత్రమున నుపాస్యు
లగుదు రే తమయంత? నటు లొనర్పఁ బ్రమాణ
మగపడ, దాహరి సగుణుఁ డౌట
సేవ్యుండు తల్లోక జిగమిషువులకుఁ బా
రంపర్యమున మోక్షరమ నొసంగుఁ
బ్రత్య గభిన్న భావనను నారాయణు
నొక్కని సేవింప నొదవు ముక్తి

గీ. కాన మీకు ముముక్షయే కలదయేని
దేశికలలాము శాస్త్రోపదేశ మెనసి.

యద్వయాఖండపరమాత్మ మాత్మ నందు
చింతన మొనర్చి మోక్షలక్ష్మిని గొనుండు. 278

ఆ. అనుడుఁ ద్వ్యక్తచిహ్నులై వారు ప్రణమిల్లి
దేశికాజ్ఞ స్మృతులు దెలుపునట్టి
విద్య నొంది సాధువృత్తులై కర్మాధ్వ
నిరతులై రి జ్ఞానభరితు లై రి. 279

మన్మథమతనిరాసము

క. ఆతటి మన్మథభక్త
వ్రాత మ్మేఁ తెంచి యోగిరాట్పదములకున్
బ్రీతి నెఱఁగి స్వమతసమయ
రీతుల నీరీతిఁ బల్కిరి సగర్వముగా. 280

సీ. సర్గాదికర్త విశ్వమనస్థుఁ డఖిలార్థ
మార్గణోపాస్యుఁడు మన్మథుండె
పరమాత్మ సుమి! యక్కుపయి జెలంగెడు వటుఁ
వగు భూషణద్వయిన్ జగము వశము
సేసికోఁ జాలుకాంతాసంఘముల బహు
సౌఖ్య దదర్శన స్పర్శనములఁ
గామాత్మపూర్ణసుఖమ్ము లభించు టే
ముక్తి సుమ్మస్మన్మతోక్తరీతిఁ

గీ. గాన మీరు స్మరోత్సవకాలములఁ ద
దీయచిహ్నమ్ములం దాల్చి తెంపులేని
సౌఖ్యమున మున్గి జన్మ నాశన జరాదు
లెవుడు నెఱుఁగనిముక్తు లయ్యెదరు గాక. 281

చ. అనుటయు నప్రమాణ మిటు లాడఁగఁ బాడియె యంచు శంకరుం
డను వినుఁ డయ్య 'విశ్వ సృజ నావన నాశన హేతు లంబుజా
సన వనజాక్ష శర్వు' లన స్పష్టము, విష్ణుసుతుం డతండు పా
లనకృతి కోపఁ; డాత్మజుఁ డిలన్ సవితృప్రభ గాంచ లేనటుల్. 282

క. అంగనలసంగమును ద
త్సంగిజనులసంగమును వెసఁ దవ్వఁగ వీ
డంగఁ దగు నను నిషేధ మె
సంగుట యుష్మ న్మతం బసాధువు సుండీ. 283

మ. మఱి మోక్షాదిక మీ యనంగునకు సామర్థ్యం బెటుల్ కల్గు? శం
బరవిద్వేషికి సృష్టి రక్షణలయ స్వామిత్వ మేశాస్త్రమం
దరయఁ గా దటు లేఁ విరోధమగుఁ బ్రత్యక్షాదికం బన్న మ
స్కరికిన్ మ్రొక్కిరి క్రౌంచవిత్ప్రభృతు లంక త్యాగపూర్వంబుగన్.

వ. అట్లు మ్రొక్కి తదుపదేశమ్ముం బట్టి పంచాయతనపూజానిరతులు, నద్వైతపరిబోధముదితులు నై యుండు నంత జగద్గురుం డుదగ్గిశకుం బ్రస్థానంపు వెడలి తొలుత మాగధం బనుపురంబు సేరుట యు, నందు నవనిధ్యాత్మసువర్ణపదకాలంకృతు లగుకుబేరభక్తు లరు దెంచి యమ్మస్కరికి స్వమతోత్కర్షము నిట్లు చెప్పం దొడంగిరి.

కుబేరమతమును జయించుట

చ. నవనిధినాథుఁ డౌట యతినాథ! కుబేరుఁడు విశ్వతోఽధిక
ద్రవిణుఁడు; వానిఁ గొల్చుటను రాదు దరిద్రత మాకు నెందుఁ ద
ద్ద్రవిణమహత్త్వ మా కెపుడు బ్రహ్మస్వరూప మఖండ మాసుఖం
బవు, ధనమూల మెల్లపను లం చిటు సేయఁగ నౌ ముముక్షువుల్.

సీ. కమలజాదులకు నైతము రాజరాజేంద్ర
వ్యము నీఁగనుట విశ్వపాలకుఁ డగు

నై శ్వర్యసంసిద్ధి కర్చనీయ కుబేర
సేవిక యైనయక్షిణి యొకర్తు
ల దితరారాధనతత్పరు లపవర్గ
పథులును మందులు భాగ్యహీను
లర్థ మోక్షాది వాంఛాయత్త చిత్తులా
మీకునైత ముపాస్యుఁ డాకుబేరుఁ

గీ. డనుడు నాచార్యుఁ డిటు పల్కె నప్రమాణ
మీరు పల్కిన దెల్లఁ, గుబేరుఁ డైన
నన్యుఁ డయిన ధనాధీశుఁడై తనిసెనె
తనియనిచ్చునె యాశ యేమఁజునైన. 287

గీ. తనివిలేకున్న ధర్మ మింతయు లభింప
దతిదవీయము మోక్ష మన్నట్టి మాట
కాన నర్థ మనర్థమ్ముగా ముముక్షు
వెఱిఁగి యనపాయ మగు బ్రహ్మ మెఱుఁగఁదగును. 288

క. "అనుకొనుము నిత్య మర్థం
బనర్థ మని సుఖలవాంశ మం దొదవదు నం
దనులకునైతము ధనికులు
మనమున నళికెదర యిదియ మార్గ మ్మెందున్." 289

క. అని సూక్తి యుండె, ధర్మము
ధనసాధ్యం బేనిఁ గొలువ ధనదుం డేలా?
జనులు పురాకృత సుకృతముచే
తను ధన మొందుదు రటంచుఁ దద్విదు లనరే. 290

చ. నలువ హిరణ్యగర్భుఁడు, జనార్దనుఁ డిందిర నన్పుకాఁడు, శ్రీ
గళుఁడు హిణ్యవీర్యుఁడు నగద్విషుఁ డెన్న సువర్ణభూమిభృ

న్నిలయుఁడు వీరికెల్లరకు నిచ్చు ధనంబు కుబేరుఁ డిచ్చునే?
వలదు మహాద్వినింద యగు పల్కులఁ బల్కుట యింక నేనియుః.

గీ. చిహ్నముల దీసి మఱి సముచితముగాఁగఁ
స్నానసంధ్యాదు లొనరింపఁ బూని పంచ
దేవతార్చన మద్వైత దివ్య బోధ
మొందుఁ డన శిష్యులై చేసి రంద అటులె. 292

ఇంద్రమత నిరాసము

ఆ. అవుల నింద్రభక్తు లచ్చటి కేఁ తెంచి
పరమగురుని పాదపద్మములకు
మ్రొక్కి యనిరి స్వామి ముజ్జగంబున కొక్క
యింద్రుఁడే యుపాస్యుఁ డెట్టు లనిన. 293

సీ. సుర సిద్ధ సాధ్య రక్షో యక్ష గంధర్వ
విద్యాధరాదిసేవితుఁ డతండు
బ్రహ్మ విష్ణు మహేశ్వర త్రిమూర్త్యాకారుఁ
డింద్రుండ యని వేదమే వచించు
వామనాగ్రజుఁడు నిత్యామృతాహారుఁడు
సర్వరత్నస్థానసదనవాసి
త్రిజగతీరక్షణ దీక్షావిరాజి స
ర్వాతీతుఁ డో పరమాత్ముఁ డనఁగ

గీ. సర్వమున కాత్మరూపుఁడు నిర్విశేషుఁ
డఖిలయతిశిక్షకుం డాట స్వార్థహీను
లగు నరున్ముఖనామకయతుల వృకము
లకు నొసంగిన మహిమగలాఁడు సూవె. 294

క. కావున శ్రేయస్కాములు
సేవింపఁ దగున్ మహేంద్రుఁ జేరి యనంగా
నావిశ్వగురుఁడు పల్కెను
భావింపక యిటుల పల్క వల దిటు వినుమా. 295

వ. బ్రహ్మశబ్దాదికంబుం బోలె నింద్రశబ్దమును బరిపూర్ణైశ్వర్యయుతుం డగు సచ్చిదానందరూపునందుఁ బ్రయుక్తంబు గాని వజ్రాదియుక్తునందుఁ గాదు 'స దే' వేత్యాదినాక్యంబులందుఁ బరబ్రహ్మంబ నిరూపితంబయ్యె, నాబ్రహ్మమునుండి త్రిమూర్తు లుదయించిరి. అందు విధాతనుండి యింద్రాగ్నియమాదిదేవతలు పొడసూపిరి. ఇంద్రుండు జగత్స్రష్టయేని తక్కుంగల లోకపాలురు నేలకాఁ జాలరు? అం దింద్రుని సర్వదాత్మత్వమ్ము సకలజంతువులకట్ల సాపేక్షంబ. యమృతపానమాత్రంబునన బ్రహ్మత్వము సిద్ధించునేని యానంత్యమ్ము రాదా? 'ఏకమేవ' యను వచనమ్ము వ్యర్థమ్ము కాదా? 'మఱియు సహస్రయుగకాలము బ్రహ్మ కొక్క దినము, తచ్చతుర్థాంశకాలము జీవించు సురేశ్వరుఁడు బరమేశ్వరుఁ డెట్లులగుఁ గావున నిమ్మార్గమ్ము విడిచి నాపలు కాలకింపుము. 296

క. శ్రుతివాక్య ప్రమాణముగా
వెతకి తెలిసికొనుము విశ్వబీజము ప్రకయా
హతము స దాదిప్రతిపా
దిత మగు బ్రహ్మమ్ము గురుల దీవ్యత్కరుణత. 297

క. అన గురున కెఱఁగి పంచా
ర్చన తత్స్మత్యుక్తకర్మసంగ్రహదీక్షన్
గొని వారు శిష్యులై చనఁ
జనియె యమప్రస్థపురికి శంకరుఁ డంతన్. 298

యమమతనిరాసము

చ. అట నెల యొండు పుచ్ఛ మహిషాకృతిచిహ్నపినద్ధబాహులై
పటురటనంబు లొప్ప యమభక్తులు కింకరసంజ్ఞ కాదు లో
కట యతిచంద్రుఁ గాంచి "లయకారణ మంతకుఁ డౌట సృష్టి, కో
ముటకు నతండ కర్త యగు ముక్తిదుఁ డాతఁడ భక్తకోటికిన్. 299

సీ. జమునకై సోమాభిషవ మొనర్పఁడు హవి
స్సను వేల్వఁడీ కృతాంతుని గుఱించి
యజ్ఞమ్ము చనును దద్యముఁ గూర్చి- దూతీకృ
తుం డిందు నగ్నిహోత్రుండ' యంచు
యజ్ఞభోక్తృత్వ మయ్యమునకే శ్రుతి సెప్పఁ
గానఁ బరాత్ముఁ డక్కాలుఁడ' యగుఁ
దచ్ఛుక్లమూర్తియ తత్పరమాత్మ మహా
నానిర్గుణుం డగు యముని వలన

గీ. పొడము మహదాదికము, దానఁ బుట్టు రుద్రుఁ;
డాయముని నీల మూర్తి యం దవతరించె
విష్ణు వనఁగఁ; దదీయ నాభీసరోజ
మునఁ బొడమె రక్తవర్ణుఁ డౌ వనజభవుఁడు. 300

ఉ. ఆతని నుండియే పొడమి రష్టదిశేశులు నర్యమాది వి
ఖ్యాతబహుగ్రహంబులుఁ జరాచరరూప జగచ్చయంబుఁ ద
దీతి సృజించి శిక్షణమతిన్ బెనుదండము దాల్చి దక్షిణా
శాతలనేతయై వెలయు సైరిభవాహనుఁ డౌచు నెప్పుడున్. 301

ఆ. స్వాంశభూతహరిహయాదులం దాతండు
భసితపిహిత హైనవహ్నికణము
వోలె వెలుఁగుచుండు నోలిఁ గాలుఁడె స
త్యాదిరూపుఁ డగుయథార్థముగను. 302

సీ. అటుగాన శుద్ధబుద్ధాదిరూపుఁడు సర్వ
కారణుం డరయ నక్కాలుఁ డొకఁడ
యతని యంశమె గుణాఢ్యంచితబ్రహ్మంబు
నిర్గుణు సేవింపనేర రెవరు
నని మేము నీలవర్ణుని యముఁ గొల్తు మ
ద్దాన మూలాజ్ఞానదళన మొనరు
నది వోవ 'సర్వము యముఁడ' య న్బోధము
పొడమి యయ్యము శుక్లమూర్తి దోఁచు

గీ. దాన ముక్తి కరస్థమౌఁ గాన సకల
మోక్షులాలను లేకాగ్రముగ మనంబు
నిలిపి యముని నుపాసింపఁ గలర యేని
ముక్తిఁ గైకొందు రతద్బోధమూలకముగ. 303

క. అన, యతిపతి పలుకు నిటుల
చనునె శ్రుతివిరుద్ధముగఁ బ్రసంగ మొనర్పన్?
వినరె పితృశప్తుఁడై యము
మనికికిఁ జనినట్టి విప్రమాణవకు కథన్. 304

నాచికేతో పాఖ్యానము

ఉ. ఆతఁడు నాచికేతుఁ డను నాఖ్య గలాఁడు తపస్వి- క్రోధనుం
డై తనుఁ దండ్రి తిట్టిన యమాలయ మప్పుడ సేరె; నేదియో
హేతువునన్ యముం డెటకొ యేఁగుటఁ దద్వసతిన్ ద్రిరాత్ర మ
ప్పూతుఁడు కూడు నీరు గొనఁ బోలమి నుండెను నిట్టుపాసముల్ 305

క. అంతఁ జతుర్థదివస మం
దంతకుఁ డరుదెంచి కాంచ స్వాలయము తనూ

కాంతుల బంగరుపూయుచు
వింతగ వెలుఁగొందు బాలవిప్రుఁ డగపడన్. 306

చ. గడగడలాడిపోవు చలికంబునఁ గ్రొవ్వ గీలుకొల్పి "కి
న్పుడిగి మహాత్మ! నత్కృపఁ గనుఁగొనుమయ్య! త్రిరాత్ర మోదనం
బుడిగి మదాలయంబునన ముందఁట తావకదేహకాంతి డీ
ల్పడ దిసుమంత యెంతటి తపస్వివొ! నీయనుభావ మల్పమే! 307

గీ. ముందు నాకు క్షేమమును గల్గ దీవింపు
మూఁడు రాత్రు లిచట గూడు లేక
నీవు కుతిలపడిన నేరమునకు మూఁడు
వరము లిత్తుఁ గోరు వైళ మనుచు. 308

క. వినయమున నాచికేతుం
డనె సాంజలిబంధుఁడై మహాత్మ! వినుము మ
జ్జనకుఁడు విశ్వజి దధ్వర
మున దక్షిణగాఁగ ధేనువుల నీనుండన్. 309

ఉ. ఏ నటువంకఁ జూతుఁగద యేమన, నించుక గడ్డి యిన్ని నీ
ళ్లాని పొదుంగు లెండి యెప్పుడైనను జూలును దాల్పలేని వా
ధేనువు లెల్ల - వీని మహీదేవుల కిచ్చినఁ బుణ్యలోకముల్
కానమి మాత్రకాదు, బహుళం బయి తప్ప వనందలోకముల్. 310

వ. అని తండ్రికి రానున్న ముప్పు దలంచి దుఃఖించుచు నిట్టి వంధ్యల
నెవరి కిత్తు వని యడిగి 'ఋత్విజుల కిత్తు' నను తత్ప్రతివచనంబు
నకు వగచి మానిపింప నెరవు దోఁపక. 311

చ. జనకుని గాంచి 'వీనిని ద్విజన్ముల కిచ్చిన యట్లె నన్ను నె
వ్వనికి నొసంగఁ జూ' తని త్రివారము మానక ప్రశ్నసేయ న

ల్క నెనసి 'నిన్ను మిత్తి కొనగంగల' నంచు వచింప, నమ్మహా
త్మునిది యమోఘవాక్కగుటఁ దోడన నీవశ మొంద వచ్చితిన్.

సీ. కరుణించి నీవును వరము లిచ్చెద నంటి
నిజమేని వరము తొంటిదిగ నిమ్ము
'సౌమనస్యము శాంతసంకల్పత దలిర్ప
జనకుండు నాయెడఁ గినుక వీడి
త్వత్ప్రసృష్టుని నన్నుఁ బ్రాక్ప్రకారము మాట
లాడి దీవించి ప్రఖ్యాతుఁ డగుత'
మనుటయు 'నీయెడ మును వోలె హృష్టుఁ డౌ
నారుణి యుద్దాలకాత్మజుండు

గీ. కినుక నెఱుఁగక సుఖనిద్ర కనఁ గలండు
మృత్యుముఖముక్తు నిన్ను దర్శింపఁ గలఁ' డ
టంచుఁ బ్రథమవరం బీయ యముని గాంచి
నాచికేతుండు కోరె రెండవవరమ్ము. 313

గీ. క్షు త్పిపాసా జరా మృత్యు శూన్యుఁ డగుచు
స్వర్గమునఁ బూరుషుఁడు భీతివాసి తిరుగు
నంద్రు- తత్స్వర్గ మొసఁగెడు నగ్ని నీ వె
ఱుఁగుదు శ్రద్ధాళు వగునాకెఱుంగఁ జెపుమ. 314

చ. అన యముఁడున్ దదగ్ని భవదాఖ్య నిఁకన్ గను నంచు స్వర్గ్యవ
హ్నిని భజియింపఁ గీలకము లెల్లను దెల్పెడు, నాచికేతుఁడున్
మనమునఁ దత్స్వరూపమననం బొనరించి తదగ్ని స్వాహ్వాయం
బెనయుట కుబ్బి కోరుకొనె నిమ్ము తృతీయవర మ్మటం చిటుల్.315

క. మనుజుఁడు మరణించిన వె
న్కను 'నస్తి' యటం చొకండ్రు 'నాస్తి' యను చొకం
డ్రను బల్కుడు రివ్విచికి
త్సను ద్రోలచేఁడు విద్య నాకు దయసేయఁగదే. 316

ఉ. నావుడు ధర్మరాజు ద్విజనందనుఁ బల్కు "ద్వదీప్సితం బసం
భావిత మొందు నెవ్వరికి వాకొన నీకొన- దాని మాని యిం
కేవియు నేని కోరుకొను మిత్తు సతీసుతులో ధనంబులో
సేవకులో చిరాయువొ విశిష్టసుఖంబులొ వేఱ తెల్పుమా. 317

వ. అనుటయు నాచికేతుండు చిఱునవ్వు నవ్వి సమవర్తి మొగంబుగని.

శా. ఏలా నన్నిటు లోభపెట్టెదవు నా కింతుల్ సుతుల్ విత్తముల్
మే లందిచ్చునె? భూము లేమి స్థిరముల్? చింతింప నీ వుండు న
న్నాళుల్ గాదె చిరాయు వన్నదియు? నన్నా! మున్ను నాకోరు వి
ద్యాలేశం బిడి యంపు మద్దియ సమస్తార్థంబులన్ దా నిడున్. 318

క. నా విని లోభవిదూరుం
డై విద్యాలోలుఁ డనఘుఁ డగు ద్విజసుతునిన్
భావించి తదధికారిగ
నావిద్య సుగోప్య మేని యముఁ డిటు గఱపెన్. 319

ఉ. ఏపదమున్ దలంచు శ్రుతు లెల్లఁ, దపంబులు సర్వ మన్వహం
బేపదమున్ వచించు, మును లెల్లఁ జరింతురు బ్రహ్మచర్య మం
దేపద మొందఁగోరి, వినుమీ! వచియించెద సంగ్రహమ్ముగా
నాపదమున్ మహాత్మ! ప్రణవాహ్వాయ మోంకృతియే యదెన్నఁగన్

క. అనవస్థతనువు లందు న
తనువై వెలుఁగొందు విభు నుదాత్తుని నాత్మన్
గనుఁగొని మనమున ధీరుఁడు
గనఁ డించుక శోక మెట్టి కాలమునందున్. 321

క. ఎవనికి బ్రహ్మక్షత్రము
లవు నోదన మనఘ! మృత్యు వనఁబడు నదియే

యుఁపు నుపసేచన, మాఽవిభుఁ
దవిలి యెఱుఁగువాని కరగతం బగు ముక్తులే. 322

ఆ. అనుచు నిట్టి సూక్తులను గొని ద్విజునకు
యముఁడు బ్రహ్మవిద్య సాంతముగను
దెలిపి, యనిపె ననుచుఁ బలికెడు శ్రుతియందు
బ్రహ్మ మితర ముంట స్పష్టపడదె? 323

వ. ఆ కఠోపనిషత్తు బ్రహ్మమున కుపసేచనము మృత్యు వని భవదుపా
న్యుఁ డగుయముని నోటనె వెలువడినటు తెలుపుటంజేసి మృత్యు
వే యగు యముండు పరమాత్మాయత్తుం డని స్ఫుటం బయ్యెఁ
గాదె. యముఁడే పరమాత్ముఁ డంటి మేనిఁ దన్నుఁ దా భక్షిం
చుకొనుట యెట్లు పొసంగు? 324

సీ. కావున శమనునికంటెఁ బరంబును
బ్రహ్మవిష్ణ్వాదిరూపమున సర్వ
వస్తుకారణ మైనబ్రహ్మంబు సేవ్య మం
తియ కాని యుపసేచనీభవత్కృ
తాంతునిచిహ్నముల్ దాల్ప ముక్తి లభించు
నన సాహసము, బోధ మైన రాదు
సుందరుఁ గొని చను శూలిదూతల, నజా
మిళునకై హరికింకరుల నెదిర్చి

గీ. యోడి తనకింకరులు రాఁగ నోట మునిఁగి
చేయునది లేక ప్రణతులు సేసె శమనుఁ
డం చను పురాణముల నుండదా కృతాంత
నాథవత్త్వము తెలిపెడు గాథ లెన్నొ? 325

వ. మార్కండేయపురాణమ్మున సుందరుండనుమహాపాపి శివరాత్రిమ రణమున ముక్తినెనయుటయు భాగవతంబున నజామిళచరిత్రమును శివకేశవులకు యముఁడు దాసుఁడైనచందంబు చాటవే? 326

ఉ. మీరెలి వేమి యందు నిఁక మీఁదఁ ద్యజించి కృతాంతచిహ్నముల్ పూతులరై శ్రుతిప్రహితముల్ విధు లొప్పుగఁ జేసికొంచు, స ద్వైతపథానువర్తి గురువర్యు భజించి ప్రబోధ మొంది ని ర్భీతి భవాంబురాశిని దరించి వరింపుఁడు ముక్తిసుందరిన్. 327

వరుణ, వాయు భూమి తీర్థ మతముల ఖండనము

చ. అనుటయు వారు మ్రొక్కులిడి యయ్యతి కాశ్రితులైరి, తోడనే చనియెఁ ద్రివేణికా సలిల సంగమ పావన మౌ ప్రయాగమం దు నిజమతంబు శంకరుఁడు నూల్కొలుపం దలపోసి, మూఁగి రం త నది యెఱింగి వారుణమతస్థులు వాయుమతస్థు లొక్కటన్. 328

వ. వారివెంట నంటి భూమ్యుపాసకులుఁ దీర్థోపాసకులు నరుదెంచి క్రమ ముగ వరుణ వాయు భూమి తీర్థముల సేవయే ముక్తిదాయకం బని తమ తమ మతసిద్ధాంతంబుల వినిపింప జగద్గురుండు వారల కిట్లను. 329

ఉ. అస్థిరభూతపంచకమునందలిపేని జగన్నిదాన మం చాస్థ నుపాస్తి సేసెడు జడాత్ముల మిమ్ముల నేమి చెప్ప? దే హస్థితు లోకహేతువుఁ బరాత్ముఁ నిఁకేని యెఱింగి ముక్తులై సుస్థితిఁ గాంచుఁ డంచుఁ బరిశుద్ధవివేకులఁ జేసె నందఱన్. 330

శంకరుఁడు శూన్యవాదిని జయించుట

ఆ. అపుడు శంకరునియుదంత మాలించి యు ద్భోట్టికి వచ్చి యొక్క శూన్యవాది

బ్రమొక్కి తనమతంబు వక్కాణింపఁ దొడంగె
హీ్రిభయంబు లించుకేని లేక. 331

క. మృగతృష్ణాంబుల మును కిడి
తగ శశిశృంగంపుధనువు దాల్చి శిరసునన్
గగనకుసుమమ్ముఁ జెటివి, యు
రుగువంధ్యాసుతుని వచ్చుత్రోవం గంటిన్. 332

క. దేవుఁ డని మొక్కి వాని కి
దే వచ్చితి నిన్నుఁ గాంచ నెంచి యనఁగ, నో
యీవిద్వత్తర! పే రెది
నావుడు శంకరున కనె వినయమున వాఁడున్. 333

సీ. నను నిరాలంబనుం డని యండ్రు, తండ్రి క్ష
పణసమాఖ్యుఁ డస్మన్మతప్రవక్త
యనుటయు శంకరుం డనె శూన్య మగుట నిం
ద్యంబు నీమతము, శూన్యమున కున్నె
బ్రహ్మత్వము? 'త మేవ భాంత' మ్మనెడు శ్రుతి
వినవొ? యింకేనియు విడిచి మాధ్య
మద్వైతవిద్య సమాశ్రయించి సుఖంపు
మనవుడు వాఁ డిట్టు లని వచించె

గీ. నాకసమె బ్రహ్మ మని వేదమందు నుంట
నన్నిభూతమ్ములకు మిన్న యాకసంబె
యదె పరాయణ మఖిలభూతాళి, కందె
విలయ మని వేదమే తెల్పఁ దెలియవొక్కొ. 334

వ. 'ఆకాశ స్తల్లింగా' త్తనివేదాంతేమునె నయ్యాకాశమునకు బ్రహ్మ
త్వము నిశ్చయింపఁబడెఁ గాదె. కాన మామతంబు భవాదృశుల

కవశ్యస్వీకార్య మనుటయు నాచార్యుం 'డోరి మూఢ? యాశ్రు
త్యంతమునకు నీచెప్పినది యర్థము కానేరదు. విను' మని యిట్లు
చెప్పె. 335

సీ. ఆకాశమునకు బ్రహ్మత లేదు సగుణత్వ;
నీక గంధవహునకు హేతు వగుచుఁ
బరమాత్మ కగుఁ గార్య, మరయ శ్రుత్యర్థోభ
య విబోధ కాకాశ మనఁగ నర్థ
మాత్మమే కాని భూతాకాశమ్ము కాదు 'జ్యా
యస్త్వమ్ము ఖాదులకంటె నాత్మ
కమరు నం' చనుశ్రుతి నరయ నానభమె య
ద్వైత మానంద మా బ్రహ్మమునుమి

గీ. పంచభూతమ్ములకు నంతవత్త్వదోష
మొదవె నంచు శాలావత్యు నుఱక దెగడి
నట్టిజైవలి 'యాకాశ' మనిన భూత
గగన మనునె? ఛాందోగ్యమ్ము గనుము లెస్స. 336

క. అన శూన్యవాది హర్షం
బునఁ 'దమదర్శనమ్ముఁ జేసి పూతుఁడ నైనాఁ
డను, ముక్తిఁ గాంచఁ బ్రేమం
బున వెస బ్రహ్మోపదేశమును జేయుఁ' డనన్. 337

గీ. దేశికుం డల్ల నగి యుపదేశ మపుడ
సలిపె "నీహృదయంబునఁ గల నభంబె
బ్రహ్మ మనుబుద్ధిఁ జేయు ముపాసన' మని
యయ్యె వాఁడును దచ్ఛిష్యుఁ డాక్షణంబ. 338

వరాహ మతనిరాసము

ఉ. అంత వరాహభక్తుఁ డొకఁ డయ్యతిమౌళికి మ్రొక్కి 'మన్మతో
దంతము నాలకింపు ప్రళయాంబువిలీన ధరిత్రి దంష్ట్రి వి
క్రాంతి దలిర్ప నెత్తిన వరాహముఁ గొల్వుము, ముక్తి గల్గు, న
శ్రాంతము దంష్ట్రికాంకనభుజంబుల నుండుట ముఖ్య మిం' దనన్.

మ. గురుఁ డిట్టుల్ వచియించె నీమతము నాకున్ నచ్చ దోరీ! తప
శ్చరణం బొక్కటె విప్రకృత్య మని తత్సంసిద్ధికై యత్నమున్
జరుపంగాఁదగు వేద మార్గమున; మేనన్ జిహ్నముల్ దాల్ప మ
త్సరమేనిన్ దను వెల్లఁ గాల్చికొను వైసార్యాదిచిహ్నంబులన్ 340

ఆ. లేదు బ్రాహ్మణునకు వేదోక్తకర్మంబు
కంటె నర్థ మొండు కనఁగ, సగుణ
మైనబ్రహ్మ మర్చ్య మందువా హరిహరా
కృతి భజింపు చిహ్నధృతిఁ ద్యజింపు. 341

శా. 'దండార్హుం డగు భూసురుం డకృతసంధ్యావందనాద్యర్హ క
ర్మం డే' నందురు, గాన వీడుకొనుమా మూఢత్వమున్, సల్పుకొం
చుండం జూడు కులార్హకర్మములఁ దద్యోగాత్త సంసిద్ధి ము
క్తుం డౌ దీ వన జ్ఞానివై యతికిఛాత్రుం డయ్యె వాఁ డయ్యెడన్.

వ. లక్ష్మణాహ్వయుం డగునవ్వాఁడు పరమతపస్వియై యద్వైతమ
తము దశదిశల వెలుఁగొందింప మొదలిడె, ననంతరంబు కామకర్మం
డనులోకసేవకుం డరుదెంచి యతీంద్రునకు మ్రొక్కి యి ట్లను. 343

లోకసేవక మతనిరాసము

సీ. పరమేశ్వరుఁడు లోకపాళియందు వసించు
సేవ్యుఁ డాతఁడె మోక్ష చింతకులకు
నబ్బుఁ దత్సత్యలోకాత్మిక యగుముక్తి
కలుగఁబో దన్యమార్గమున నద్ది

యనుడు శంకరుఁ డనె సన్మతభూత మ్మవి
త్య మ్మగుసేవ నీ వాచరింప
సత్యరూపంబు మోక్షం బెట్లు చేకుఱు?
భవదీయమతము చెప్పంగ వింత

గీ. యనుడు వాఁడు శంకరు చరణాబ్జములకు
మ్రొక్కి యద్వైత సన్మతంబును గ్రహించి
శిష్యుఁడై తన్మతవ్యాప్తిఁ జేయఁ దొడఁగె
నంత నొకగుణసేవకుం డరుగుదెంచి. 344

గుణోపాసకమతనిరాసము

ఉ. వారిజగర్భుఁ డాదియగు వారల కెల్లను గర్తలున్ జగ
త్కారణముల్ గుణంబులె కదా? తదుపాసన తత్పరాత్మ లౌ
వారము మేము స్వామి! యపవర్గ ఫలేప్సు భవాదృశోత్తముల్
గోరి భజింప నవ్వియ తగున్జుమి నావుడు దేశికుం డనున్. 345

క. జనకంబు విడిచి జన్యం
బును సంసేవింప మోక్షము లభించు నె? నాఁ
గను వాఁడు నిరుత్తరుఁ డౌ
చును శుద్ధాద్వైతలాలసుం డయ్యె వడిన్. 346

సాంఖ్యమతఖండనము

ఉ. వానివెనుంద సాంఖ్యమతపాలన శీలి ప్రధానవాది యా
జ్ఞానవిబోద్ధఁ డారోఁకని 'జగంబుల కెల్లఁ బ్రధానమే యుపా
దానముగా స్మృతం బగుఁ' బ్రధానము నా గుణసామ్య- మద్దియే
యౌను నిదాన మార్య! మహదాదిక తత్త్వము లెల్లఁ బుట్టఁగన్.

గీ. దేవ! యవ్యక్తమును వ్యక్తభావ మనఁగఁ
బరముకంటె బరం బయి వరలు నాప్ర

ధానమునె కొల్వుమా ముక్తి దాన నబ్బు
ననె స్మృతులు గాన స్వీకార్య మదియు మీకు. 348

వ. అనుటయు శంకరుం డిట్లనెను. 349

సీ. వేదవిరోధ మాపాదిల్లుకతన న
గ్రాహ్యము భవదుక్తి రచన మెల్ల
వేదానుకూలమై వెలసిన నే కాక
స్మృతి ప్రమాణంబు గా దితరములను
దత్ప్రధానం బశబ్దం బౌట జగదాది
కారణం బెన్నండుఁ గాదు సూవె
యెటుల వేదోక్త మా నీక్షిత్వృత్వమ్ము త
జ్జడవస్తువునకుఁ బొసంగ నేర్చుఁ
గీ. గావున 'స ఐక్ష' తేత్యాదికశ్రుతిస్మృతి
నాప్రధానము కారణం బనఁగఁ దగదు
సచ్చిదాకృతి చైతన్యసంజ్ఞిక మగు
బ్రహ్మ మొక్కండె విశ్వకారణము ధ్రువము. 350

వ. అనుటయు నాసాంఖ్యుండు 'వినుము ప్రధానం బశబ్దంబు గా దని శ్రుతియే కలదు. మఱియు నచింత్యము నవ్యక్తము నరూపము న వ్యయంబు నరసంబు నగంధంబు ననాద్యంతంబును ధ్రువంబును బరంబును మహత్పదవాచ్యంబు నగు నాప్రధానంబు నెఱింగి మృత్యు ముఖమునుండి విముక్తుఁ డగుచున్నాఁ డని యవ్యక్తశబ్దముచేఁ బ్రధానము ప్రతిపాదింపఁబడె' నని పలుక, యతీంద్రుం డోయీ! ప్రకరణాది యగునవ్యక్తశబ్దముచేఁ జెప్పబడినవాఁడు ప్రాజ్ఞుండు. అంతియకాదు. గుణసామ్యసేవవలన సత్త్వోద్రేకరూపం బగు జ్ఞానంబువోడమదు కావున నీమతమ్ము విడిచి యద్వైతవిద్య నాశ్ర యించి ముక్తుఁడవు గమ్మని వానికి విచికిత్సానివర్తకంబుగ సోప

పత్రిక మగునుపదేశము సేయుటయుఁ దోఁడన వాఁడు శిష్యుఁడై
భృత్యుఁడై భజింపం దొడంగె. 351

### కాపిలమత నిరాసము

ఆ. అవుల నయ్యతీంద్రునడుగుల కెఱఁగి కా
పిలుఁ డొకండు యోగవేత్త పలికె
యోగమునన మోక్ష మొదవుట బోధించు
మన్మతంబు సప్రమాణ మార్య! 352

సీ. విజనభూమి సుఖోపవిష్టుండు శుచి సమ
గ్రీవోత్తమాంగశరీరుఁ డగుచు
నంతిమాశ్రమసంస్థుఁడై జితేంద్రియుఁ డయి
ప్రణమిల్లి గురునకు భక్తియుక్తి
స్వచ్ఛుఁడై శోకవివర్జితుం డయి యచిం
త్యాత్ముఁడై యవ్యక్తుఁడై యనంతుఁ
డై శాంతుఁడై యమృతాకారుఁడై శివుఁ
డై బ్రహ్మయోనియై యద్భుతుఁ డయి

గీ. యాదిమధ్యాంతరహితుఁడై యద్భుతరూపుఁ
డై చిదానందుఁడై త్రినేత్రాసితగళుఁ
డై యనన్యుఁడై సోముఁడై యలరెడు పర
మేశు ధ్యానింపఁదగును మౌనీంద్రుఁ డాత్మ. 353

గీ. ఆపగిది భూతయోనియు నఖిలసాక్షి
యైనయీశ్వరు ధ్యానించునట్టిమౌని
తమము కడచి సుఖింపఁగా క్షముఁ డగు నను
నిట్టివేదోక్తులు ప్రమాణ మెప్పుడు మౌనీ. 354

గీ. ఆగమప్రోక్తజపవిద్య నధిగమించి
చక్రషట్క విభేదనసరణి ప్రోక్త
మగుట నస్మన్మతంబు ప్రాగ్ర్యంబు సేవ
నీయము భవాదృశ ముముక్షునికరములకు. 355

చ. అన యతి వల్కె 'నీవలు కనాదరణీయము వేదముల్ వచిం
చును దహరాఖ్యవిద్య యది సు మ్మపవర్గనిదాన, మంతె కా
కనఘ! త్వదుక్తయోగ మగునా యపవర్గద? మింక 'సోఽహ' మం
చని యజపాఖ్యమాత్రమున కర్థము నిశ్చిత మయ్యె వింటివే. 356

క. ఆగతి జీవేశులకు భి
దాగంధము లేమి నిశ్చితం బగుట నటన్
యోగ మెటు తగును? మోక్షము
నాఁగఁ దగునె చక్రభేదనక్రమమాత్రిన్. 357

గీ. అఖిలభూతస్థుఁ గాఁ దన్ను, నఖిలభూత
ములను దనయందుఁ గనినవే పొందు బ్రహ్మ
మందలేఁ డన్యహేతుల నని నిషేధ
మును వచించె జ్ఞానేతరమునకు శ్రుతియు. 358

ఆ. శమదమాదు లమర శ్రవణాదిసాధన
ములను జిత్తశుద్ధి గలుగుజ్ఞాని
యాత్మయందుఁ గేవలాత్మము గనుఁగొను
ననుచు శ్రుతియ గానమును బొనర్చు. 359

సీ. నిగమాంతవిజ్ఞాననిశ్చితార్థులును స
న్న్యాసయోగమున శుద్ధాత్ములు నయి
భాసిల్లుదురు యతీశ్వరు లాక్రియ విశిష్ట
మగుజ్ఞానమును ద్యాగ మలవడంగ

వార లెల్లరు, బర(బహ్మవలోకనం
బెనయుట నపునరావృత్తి గాఁగ
దేహ(త్రయాంత మొందెడునప్డ యెద్దానఁ
బొరివోనిమాయచే ముక్తు లగుదు

గీ. రనెడు నీదృశనిగమవాక్యములచేఁ ద్వ
దుక్త షట్చ(క భేదన యోగపథ ము
పేక్షణీయమ్ము గాన ముముక్షువుల క
పేక్షణీయ మయ్యద్వైతవిద్య యొకటె. 360

వ. అనుటయు నయ్యాచార్యునిం గాంచి యతీం(దా)! పరిజ్ఞానహీ
నుండ వగుట ని ట్లంటి వంతియకాని జ్ఞాని యెవ్వండు ని ట్లనండు
వినుము. 361

సీ. ఖేచరీముద(నీక్షింప 'కేనే బహ్మ'
మనువాని జిహ్వ కోయంగవలయు
నలతి(కూట మెఱుంగ 'క్షైనాఁడ (బహ్మంబ'
ననువాని జిహ్వ కోయంగవలయు
శృంగాటకమ్ము నెఱుంగ 'కేనే (బహ్మ'
మనువాని జిహ్వ కోయంగవలయుఁ
గననేరకయు మనోన్మని '(బహ్మ మే నైతి'
ననువాని జిహ్వ కోయంగవలయు

గీ. నెఱుఁగ కంగుష్ఠమా(తుఁ డౌ పురుషు, '(బహ్మ
మైతి' ననువాని నాల్కఁ గోయంగవలయు
మూఁ డవస్థల నెఱుఁగ కెవ్వాఁడు '(బహ్మ
మైతి' ననువాని మస్తకం బవనిఁ (దెళ్లు. 362

ఆ. (ప్రళయవేత్త పొందుఁ బరమాత్మ హరవేత్త
పరము ధు(వము (బహ్మపదముఁ జెందు

ననెడునుడుల ముక్తి కాసించు మిముబోంట్లు
యోగమార్గ మూన నొప్పఁగాదె. 363

క. అన గురుఁ డనె నిటు లజ్ఞత
ననియెద నష్టాంగయోగ మైకాగ్ర్యత శు
ద్ధిని గాక ముక్తి నిడ; ద్వై
తను శ్రుత్యవిరోధి గావునన్ శ్రోత్రమ యా. 364

గీ. అంతె కాని విజ్ఞాన మావంత లేక
మోక్షమును ఖేచరీముఖముద్ర యొసఁగు
నని స్వయంసాధనముగ ననుట సాహ
సమ్ము సుమి ముక్తి గల్గ దన్యమ్ము చేత. 365

సీ. ముక్తి బ్రహ్మజ్ఞానమ్మునఁ గల్గు వేఱొంటఁ
గలుగ దంచును శ్రుతుల్ పలుకఁగాదె
శ్రుత్యుక్తకర్మనిష్ఠుండై నఁ జిత్తశు
ద్ధిని బొంది సువివేకియును విరాగి
యును నై నరుండు సముపాత్తశాంతి దమాది
కుఁడు ముముక్షువును నై గురుము ఖాత్త
'తత్త్వమ' స్యుక్తితాత్పర్యావగాహియై
యజము సచ్చిత్సుఖం బైనదాని

గీ. నాత్మమును భేదశూన్యమం చవధరించి
ముక్తుఁ డగు నంచు నద్వైతమోక్షపథము
దెలుప సాంఖ్యుండు యతిపదంబులకు మ్రొక్కి
శిష్యుఁ డయ్యె నయ్యెడ నతిచిత్రముగను. 366

పరమాణువాదమతనిరాసము

ఉ. ధీరశివాదు లంతట సుధీప్రవరుల్ పరమాణువాదు ల
ద్ధీరు యతీంద్రుఁ గాంచ నరుదెంచి యిటుల్ వచియించి 'రీశ్వరుఁ

డారయఁ గర్త' యన్ననుడి నాతఁ డిలాదిక, శాశ్వతాణువుల్
సేరఁగఁ దెచ్చి లోకము సృజించు, లయంబునఁ బాయు వానినిన్.

క. లోకగురుఁ డతఁ డిలాదులఁ
జేకొని లోకము సృజించి జీవతతుల నా
నాకృతుల రచించి యఖం
డాకృతియై సాక్షి యయి తనంత వెలుంగున్. 368

చ. అని స్వమ తాకృతిన్ దెలియ నాడ యతీంద్రుఁ డనున్ 'విరుద్ధ మిా
రనినది వేదరీతి, కిఁక నప్పర మేశుని భూతసృష్టి యొ
ప్పను శ్రుతి, నిత్య మెట్టు లణుబృందము లౌ? నటుకాన నిత్యుఁడై
గనఁబడు నీశుఁ డొక్కఁడ, జగంబు లనిత్యము జన్య మాటచే. 369

గీ. ఈశునెడఁ గాక కొన్నింటి కెటులొ జన్య
భావ మలవడెనేని 'సర్వమున కీశుఁ
డే జనకుఁ డౌట పొసఁగనిహేతువున జ
గజ్జనకుఁ డీశుఁ' డనుమాట కల్ల యౌను. 370

ఉ. 'గౌతమవిద్యనే చదువఁ గల్గును జంబుకజన్మ' మంచు వి
ఖ్యాతము; గాన దానియెడ నాస్థఁ ద్యజించి భజింపుఁ డింక న
ద్వైతముఁ, గొల్వుఁ డొజ్జలపదంబులు, గాంచుఁడు నిత్యసత్యచి
ద్రీతు, లెఱుంగుఁ డాత్మము, తరించి భవాబ్ధి వరింపుఁ డేకతన్. 371

క. అంచి వచించుగురున కిగు
రించినభక్తిని నమస్కరించి యపుడు వా
రంచితగతి శిష్యు లయి ను
తించిరి తన్మహిమ మెఱిఁగి ధీరశిఖాదుల్. 372

ఉ. అంత సశిష్యుఁడై గురుఁ డహార్ముఖమందుఁ ద్రివేణి నాడి యం
తంతఁ బ్రయాగవాసు లమితాదృతి మ్రొక్కఁగ వీడుకొం, చెదన్

సంతస మార నేడుదివసంబులకున్ జని చేరెఁ గాశికిన్
సంతత విశ్వనాథకరుణార్ఘుర పాలిత జీవరాశికిన్. 373

కర్మవాది మతనిరాసము

ఉ. అత్తఱిఁ గర్మవాదు లగునట్టిబుధుల్ గనవచ్చి ప్రొక్కి భి
క్షూత్తముఁ బల్కి రిట్లు జగదుద్గమనాదులు కర్మరీతి కా
యత్తము, లద్ది రమ్య మగునా రుచిరంబు ననుత్తమంబు మే
నెత్తును, బాపకర్మ మగు నేని, జఘన్యము మేను దాలుచున్. 374

ఉ. 'అందిరి మోక్షసిద్ధి జనకాదులు కర్మముచేతనే' యటం
చుం దనరారువాక్యములఁ జూడ ముముక్షువు కర్మ మర్థి న
క్తందివ మాచరింప విహితంబుగఁ దోఁచును 'ముక్తి నా సుఖం
బందుటె యంద్రు మౌను' లన నాబుధునిన్ గని శంకరుం డనున్.

క. మీ తెలివి మెచ్చఁ దగు 'య
స్యైతత్కర్మ' యను నిగమ మనదె జగము వి
ఖ్యాతముగ బ్రహ్మ కార్యం
బై తగుఁ, గారణమె ధ్యేయ మగు నెపు డనుచున్. 376

ఆ. అని యుపక్రమించి యభవుఁ డభ్రిష్టుఁడై
తగ వచించె నాటె 'బూతంచ' యనెడు
శ్రుతియుఁ దెలిపె స్థూలసూక్ష్మాది వివిధాత్మ
మైన బ్రహ్మమే నిదాన మనుచు. 377

గీ. కాన సర్వజ్ఞుఁ డీశుఁడే కారణము జ
గంబునకుఁ, గర్మ మది గాదు కారణంబు
జడిమచే మందు లాకర్మసరణి మనెద
రనుచుఁ బరవిద్యఁ గొని శిష్యు లైరి వారు. 378

చంద్రమతనిరాసము

చ. అగుటయు శిష్యయుక్తుఁడు శివాభరణాఖ్యుఁడు శిష్యవేష్టితుం
డగు భగవత్పదున్ వినతుఁడై యిటు పల్కె 'జగత్ప్రకాశకుం
డగు చమరాదిపాలకుఁడు నౌటను జంద్రుఁడు పూర్ణిమాదులం
దగణితభక్తిసేవ్యుఁడు నుపాస్యుఁడు సూపె ముముక్షుకోటికిన్' 379

మ. అనఁ బల్కెన్ యతి ముక్తి నిత్యమొ, యనిత్యం బాపదార్థం బుపా
సన సేయన్ లభియించు టెట్లు లది? యిష్టాపూర్తయాగాదికృ
జ్జనముల్ చంద్రునిలోక మొంది మరలన్ ధాత్రిస్థలిన్ జొత్తు ర
ర్జున యంచున్ బరమాత్ముఁడచ్చుముగవాక్రువ్వండె గీతాస్మృతిన్.

వ. శ్రీకృష్ణపరమాత్ముండు "ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా
దక్షిణాయనం। తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే"
అని గాన మొనర్చినవాక్య మీయర్థంబు స్పష్టపఱచు. 381

ఉ. 'ఈతఁడ దైవతాన్న' మనియెన్ శ్రుతి యన్న మువాస్తి సేయుచో
నేతటి ముక్తి నీఁగలదె? యిచ్చిన నిచ్చును సజ్జగత్త్రితిన్
బూతచరిత్ర! యింకయిన మూఢమతిన్ విడనాడి శుద్ధ మ
ద్వైతము పొంది చెందు మమృతం బన నాతఁడు శిష్యుఁడై చనెన్.

అంగారకాది గ్రహోపాసకు లద్వైతు లగుట

శా. భౌమాదిగ్రహభక్తు లంతటఁ బరివ్రాట్చంద్రునిన్ వందన
క్షేమప్రశ్నల నర్చ సేసి యని రుక్తిన్ ముక్తి సంధించి యో
స్వామీ! భౌమముఖగ్రహార్చ నగుఁ గైవల్యం బటంచున్ శ్రుతుల్
ప్రామాణ్యమ్మువహించుచుండెంచిగననెంౘ బ్రాజ్ఞుల్ వెసన్ మోక్షమున్.

క. నా విని యతి యనె గ్రహాపి
డావృతు లగులోకులకుఁ దదర్చనరీతుల్

వేవగలఁ గలవు ముక్తిఁ
గా వవి, బ్రహ్మంబు గాంచు జ్ఞానముదక్కన్. 384

క. వేదములందు 'సదేవే'
త్యాదివచనములను మోక్ష మభిహిత మయ్యెం
గాదె యన వారు భగవ
త్పాదాంతేవాసులై రతంద్రప్రీతిన్. 385

వ. తదనంతరంబ "యంత్రద్వయంబున గ్రహసంచార మెఱింగి కాల స్వరూపంబు నిరూపింప నేర్తు" ననితొల్లి యేతెంచిన క్షపణకుం డప్పరమహంసావతంసంబునకు మ్రొక్కి యిటు పల్కె. 386

సీ. స్వామీ! భవత్సమాశ్రయమునఁ గడపితి
క్షణము వోలెను మాసషట్త్రియంబు
నాలింతె యస్మన్మతాంతఃకృతాంతముల్
'కాలంబె పరమాత్మగా నెఱింగి
మోక్షార్థము భజింపఁబోలు' నం చన యతీం
ద్రుం డివ్విధమున వాక్రుచ్చె లీల
నోయి! 'సంవత్సరో జాయత కాల ఏ
ష' యటంచు శ్రుతి కాలజని వచించె

గీ. గానఁ గాలమ్ము జన్యమ్ముగా నెఱింగి
వ్యర్థ మగు నూహ లెడసి యద్వైతమతస
మాశ్రయమ్మున ముక్తుండ వగు మన నతఁ
డటులె యయ్యెను మఱుమాట నాడలేక. 387

గీ. అట్లతండు సర్వజ్ఞశిరోవతంసు
మునిలలాముని శంకరార్యుని భజించి

తత్కారుణ్య నదద్వయ బ్రహ్మతత్పరు డయి
యులర బితృదేవతార్చకు లటకు వచ్చి. 388

పితృమతఖండనము

వ. మ్రొక్కి సాంజలిబంధులై, తదనుజ్ఞ నాసీనులై యుండ నం దగ్రి
గామి యగు సత్యశర్మ యనువాఁడు స్వమతప్రశంసాపూర్వంబుగ
భాష్యకారున కిట్లనును. 389

క. విను మగ్నిష్వాత్తాదు ల
యినపితృదేవతలు నివసియింతురు శీతాం
శుని మండలమ్ము మీఁదం
గన నిత్యవిముక్తులై ప్రకాశించ నెపుడున్. 390

గీ. మూఁడు గవ్వారియందు నమూర్తు, లిక స
మూర్తులై నల్వు రుంద్రు తత్పూజనమునఁ
గలుగు ధర్మాదిఫలము, మోక్షంబుఁ గలుగుఁ
గాన సేవ్యులు వార జగంబులకును. 391

మ. సతతంబున్ ఋతవాదియై గృహి పితృశ్రాద్ధంబులన్ బెట్టఁ ద
త్పితృకారుణ్యముచేత ముక్తుఁ డగు, దత్ప్రీత్యర్థమై శ్రాద్ధముల్
ప్రతిదర్శంబు నొనర్పఁగావలయుఁ జాంద్రం బై నమాసంబు త
త్పితృమధ్యాహ్నము, ముఖ్యకాల మది తప్పింపన్ మహాఘం బగున్.

చ. అన గురుఁ డిట్లు వల్కె 'వినుమా! యమృతాప్తికిఁ గర్మహాని సా
ధనము? 'నకర్మణా' యని శ్రుతం బగుసూక్తి నెఱుంగ వేమొ? పొం
దును బరమాత్మ నాత్మవిదనుత్తముఁ డొక్కఁడె, కాన గర్మ ము
జ్జన మొనరించి శుద్ధ మగుస్వాంతమునన్ గన నొఁ బరేశ్వరున్.

క. కావున నటు సేయు మనం
గా విమల తదుక్తిఫక్కికను లెస్స మదిన్
భావించి బ్రహ్మవిద్యా
భావనఁ జేకొనిరి సత్యవర్మయు నాప్తుల్. ౩94

గరుడభక్తుని, ననంతభక్తుని నద్వైతుల జేయుట

ఆ. గురునిఁ జేరి యంతఁ గుబ్జలీఘుఁడు శంఖ
పాదుఁ డనెడు గరుడ, పన్నగేంద్ర
భక్తియుగము భక్తిఁ బ్రణతులై స్వ స్వ మ
తప్రశస్తిఁ దెలుపఁ దలఁచి యనిరి. 395

క. నారాయణునకు శయ్యా
కారుఁ డనంతుండ మోక్షకారణ మనుచున్
శౌరికి వాహన మగు భుజ
గారియె కారణ మటంచు నని రిరుత్రోవన్. ౩96

ఉ. ఆయెడ శంకరుం డనె 'నహా! శయనంబును వాహనంబు శ్ర
ద్ధాయుతులై భజించుట వృథా యగుఁ గాదె? తదాశ్రయంబు నా
రాయణుఁ డేల కాఁడొ సముపాస్యుఁడు మీకు? విచిత్రమా' నన
బోయిరి వారు శంకరుని బోధమునన్ బరిశుద్ధచిత్తులై. 397

సిద్ధోపాసకాదు లద్వైతు లగుట

క. చిరకీర్తిప్రభృతు లసం
తర మగ్గురుఁ గాంచి వందనం బిడి యిటు ప
ల్కిరి కృతకృత్యుల మైతిమి
యరయఁగ సిద్ధోపదిష్ట మగు మంత్రములన్. ౩98

ఉ. కౌదురు మీరు గూడఁ జరితార్థులు మావలె, వేగ శ్రీమహీ
ధాత్రిదుల కేఁగుఁ డందుఁ గన నౌదురు సిద్ధులు, వా రొసంగు మం
త్రాదు లుపాస్తి సల్పుఁడు పుమర్థము లొందెద, రేము సత్యనా
థాదికసిద్ధులన్ గొలిచి యందితిమయ్య యభీష్టసంపదల్. 399

వ. చిరంజీవులుఁ గృతార్థులు, సర్వజ్ఞులు నగు నాసిద్ధులు విచిత్రమగు
నంజనాదివిద్య లొసంగుదురు. కావున యత్నింపుఁ డనుడు నవ్వి
యాచార్యవర్యుం డిట్లనియె. 400

క. కూడి ఫలేప్సులతో మా
లాడుటయుం దగదు చిత్ర మగువేసములన్
గూడెడిలాభము లే దొడఁ
గూడుఁ బరద్రివ్యలబ్ధి ఘోరాఘంబుల్. 401

గీ. అంతె కాదు చిరంజీవు లైన ఫలము
లేదు, సకలార్తిమయ మగుఁ గాదె మేను
గానఁ ద్యాగంబున విశుద్ధిఁ గాంచి దేహ
ముక్త్యుపాయంబు గనఁ బోలు బుధున కెందు. 402

వ. అను నాపలుకులకు వశులై వారు శిష్యు లైరి. తదనంతరంబు గం
ధర్వోపాసకు లరుదెంచి శంకరుం గని యిట్లనిరి. 403

గంధర్వోపాసకులు పరాజితు లగుట

మ. 'వికలత్వం బెద సోకఁ కేము నెఱపన్, విశ్వావసూపాస్తి - నా
ద కళా బిందువిబోధ మబ్బ కృతకృత్యత్వంబు గన్నార, మో
పిక గాంధర్వకళన్ బరిశ్రమము గావింపం దగున్ మీరు, నా
దకళాబిందువు లాత్మరూపము లె కాదా' యన్న భిక్షుం డనున్. 404

సీ. భవదుక్తిగతి యనుపాదేయ మరయ వే
దవిరుద్ధ మైన పద్ధతి యగుటను
బరగ నశబ్ద మస్పర్శ మరూప మ
వ్యయ మరసంబు నిత్యం బగంధ
మాది మ ధ్యాంత శూన్యము మహాత్పదవాచ్య
మనితర మాపరమాత్మ మెఱిఁగి
మృత్యువిముక్తుఁడై మెఱయు నం చను స్మృతి
సరణి శబ్దాద్యగోచరము బ్రహ్మ
గీ. మగుటఁ దన్నాద బిందు క ళాత్యతీతు
నెఱుఁగు నెవ్వండు వాఁడె సుబ్రహ్మ సమస్త
వేదవేత్త కావునన నాదాది కాతి
గామి బ్రహ్మము గని ముక్తి గనుఁడి యనియె. 405

క. ఏవంవిధ యత్యుపదే
శావర్జితచిత్తవృత్తులై వా రపు డం
తేవాసు లయి చనుడు న
చ్చో వేతాళార్చకాళి చుట్టుకొని రొగిన్. 406

బేతాళార్చకుల వశపఱచుకొనుట

క. భూతప్రేతపిశాచుల
వేతాళు స్మరించుకొనుచు బీభత్సరసో
పేతు లయి తనువిలిప్త వి
భూతికు లవ్వారు యతివిభున్ బల్కిరిటుల్. 407

గీ. యతిపతీ! యేము భూతాద్యుపాసకులము
సర్వలోక వశీకార శక్తి యుతుల
మనుడుఁ గర్మంది వెఱఁగొంది యష్ట డెంద
మల్లఁ బదిలించుకొని వారి కనియె నిట్లు. 408

ఉ. పాతకులార! మీమత మపాత్రము శ్రోత్రియకోటి కెన్నఁగా
'భూతలవాసి భూతచయముల్ దొలఁగం జనుఁ గాత రూపఱుం
గాత, శివాజ్ఞ విఘ్నకరణప్రవణం బగుభూతజాత' మ
న్శ్రౌతవచోగతిన్ వినరె? బ్రాహ్మణు లీ రెటు లైతిరో కదా! 409

క. విడువుఁడు భ్రష్టాచారము
తడవుఁడు నిజవర్ణసముచితపుఁగర్మంబుల్
ముడువుం డద్వైతధనము
గడవుఁడు భవవారిరాశిఁ గాలువలీలన్. 410

ఆ. అనుడు వారు గురుపదాబ్జంబులకు మ్రొక్కి
నైజకర్మ కరణ నైష్ఠికతను
మించి శిష్యు లగుచుఁ బంచదేవార్చన
నిరతు లగుచుఁ జనిరి గురునియాజ్ఞ. 411

క. ఒం డెదురు లేక దండ్యా
ఖండలుఁ డటు దేశదేశ గత బహువిధ పా
షండ ద్విజ మండలములు
చెండుచు నపరాంతజలధిచెంతకుఁ జేరెన్. 412

ఉ. చేరి కనంగ- దుందుభి హసించుధ్వనిన్ జలదూర్మికా కర
ప్రేరణ మెప్పుఁగా నభినయించుచు గూఢతరార్థముల్, మహా
వారిధి చూడ నయ్యెఁ బ్రతివాది యనన్; యతియున్ జనెన్ జడా
కారు భ్రమిన్ బుధోన్మథితుఁ గంధిఁ దలంచి క్షమించియోయన్.

క. చని యట గోకర్ణక్షే
త్రనికట జలరాశి నాడి తత్సన్నిధి వ
రి నుమాపతిఁ బొగడె జనులు
వినఁగ భుజంగప్రియాతవృత్త కవితచేన్. 414

నీలకంఠమతమును జయించుట

క. తదుపరిఁ బ్రిణతుల కౌషని
షదవిద్యను గఱపు యతినిశాపతిఁ గని నె
మ్మదిఁ గలఁగుచు హరదత్తుఁడు
కదలి చని వచించె నీలకంఠుని స్వగురున్. 415

శా. దేవా! శంకరనామభిక్షు విట కంతేవాసిసంవేష్టితుం
డై వచ్చెన్, మును భట్టమండనుల నొయ్యం గెల్చినట్లే మిమున్
వీవాదమ్మున గెల్చువేడుక; భవానీనాథ దివ్యాలయం
బావాసమ్ముగ నుండె లెం డిఁకఁ దదౌద్ధత్యంబుఁ దూల్పం దగున్.

వ. అనుటయు నీలకంఠమతప్రవర్తకుండు సాంగోపాంగ శైవాగమ
రహస్యవేత్తయు నగు నానీలకంఠబుధుండు. 417

క. మును బహునిబంధసప్రీణ
యనచతురత శివపరముగ వ్యాస రచిత సూ
త్రనివహమునకున్ భాష్యము
నొనరించిన నీలకంఠు నొజ్జఁ దలఁచుచున్. 418

చ. బిట్టుగ నవ్వి పల్కె 'విను! భిక్షు వతండు పయోధు లగ్ని నా
నొట్టఁగఁజేయుఁగాక, రవి నుర్వరఁ గూలుచుఁగాక, వ్యోమమున్
జుట్టునుగాక చాఁపయటు, సుంతయు నేని ననున్ వివాదమం
దట్టిటు సేయ నేర్చునె? నిరాశ నొనర్పనె యొక్క మాటలోన్ 419

క. పరపక్ష త మోర్కము లయి
పరఁగెడు మత్తర్కముల సహా క్కయి యతి చె
చ్చెర విడిచి స్వమత మప్పుడ
పఱవఁడె గుండియలు చేతఁ బట్టుకొని వడిన్. 420

వ. అని గర్వంబు నలుకయు నసూయయుఁ దేటపడం బలికి. 421

చ. సితభసితాంచితాంగుఁ డయి చెన్ను దలిర్ప హరాక్షదామముల్
కుతుక ధరించి, శైవమత గూఢతరాశయ పారదృశ్వ శి
ష్యతతి పరీతుఁడై యరిగి యాత్మమతం బిరవొందఁ బల్కెన
య్యతిపతిమౌళి, వ్యాసమునికంటెను మున్ గపిలర్షివైఖరిన్. 422

చ. అపుడు సురేశ్వరుండు వినయంబున దేశికుఁ గాంచి 'యోర్మిమై
నిపుడు మదుక్తిపాటవము నీరలు సూచుచు నుండుఁడా' యనన్
నిపుణుఁడు నీలకంఠుఁ డతనిం గని తెల్లము మాకు నీమనీ
షపటిమ మంచు గేలిగొని శంకరసమ్ముఖుఁ డయ్యె నయ్యెడన్. 423

క. పరపక్ష బిసాద్మర సిత
గరుడాయిత సూక్తిదండిఖండితమై పెం
పఱుస్వమతము గావఁగ లే
కఱిమిఁఱి ఖండింపఁ బూనె యతిపతిమతమున్. 424

వ. స్వపక్షస్థాపనాహీనముఁ బరపక్షవిదళనమాత్రావసానము నగు
వితండావాదమున కుద్యుక్తుండై శంకరుం గాంచి యిట్లను. 425

క. శమివర! 'తత్త్వమసి' యను ని
గమమున జీవేశ్వరైక్యగతి నుడువు త్వదీ
యమతము పొసఁగదు తేజ
స్తమవైక్యమువలె విరుద్ధధర్మం బగుటన్. 426

సీ. ప్రవిరుద్ధధర్ములై పరగుచున్నను రవి
ప్రతిబింబముల కభిన్నతయ తోఁచు
మాడ్కి, విరుద్ధధర్మ యుత జీవేశుల
కవిభేద మొనగూడ దనుట తగదు

వ్యోమశి వాది గురూక్తి మిథ్యాభూత
మర్థంబునం దోఁచునట్టినీడ;
తాదృశప్రతిబింబితమున కభేదయో
గ్యతయె లేదాయె, నేకరణి నద్ది
గీ. యగును జీవేశ్వరాభేదమందు నిర్ణ
యమ్ము సేయంగఁబూన దృష్టాంతముగను?
గానఁ దాదృశ పల్లవ గ్రహాణ మాత్ర
కల్పనానల్ప జల్పన క్రమము విడుము. 427
గీ. అంతియేకాదు నీమతమందు లేదె
బింబముఖ భిన్నముగఁ బ్రతిబింబ ముఖము
పార్శ్వగజనంబుచేఁ జూడఁబడుటను మృష
యగును బ్రతిబింబితాస్య మన్నట్టి నీతి. 428
వ. మృషాభూత పదార్థమున కభేదయోగ్యతయే లేమింజేసి యేతద్దృష్టాంతము ననుసరించియు జీవేశ్వరుల కభేదంబు చెల్లదు మఱియు.
సీ. జీవనిష్ఠవిమూఢభావ మీశ్వరనిష్ఠ
సకలవిత్త్వమ్ము మాయికము లగుట
జీవేశు లిరువురుఁ జిద్రూపు లౌదురు
నిజ మభేదమ్ము యంటేని వినుము
బహుళ ప్రమాణ సంపాదితార్థము నెడ
బాధితం బను టసంభావ్యమె కద!
యటుల ప్రమాణ సిద్ధాశ్వత్వ గోత్వముల్
బాధితంబై హయపశువులకును
గీ. స్వస్వరూపమ్ముచే నేకభావ మొదవ
నగుఁగదా- భేదమునకు దత్తాంజలి యగుఁ
గాన మాధ్యసర్వజ్ఞతల్ గావు మాయి
కములు, గావు బాధితము లేక్రమముచేత. 430

చ. అని యిటు పెక్కుయుక్తు లొలయంగ గలంచెన్ గవిసీలకంఠుఁ డౌ
పనిషదవాక్ప్రకాశితము భవ్యము నాయతిభూమిభృన్మతం
బును వికచాంబుజాతవనమున్ గలభంబుబలెన్ దదుక్తదో
షనికర మింకి పోఁ బలికె సంయమియున్ బ్రతివాక్య మీగతిన్. 431

వ. కవీంద్రా! 'సోఽయం దేవదత్త' యనువాక్యంబునఁ దత్పదంబునకుం దద్దేశకాలవృత్తిత్వవిశిష్టుం డగుదేవదత్తుం డర్థంబు. 'అయ' మ్మనుపదంబునకు నేతద్దేశకాలవృత్తిత్వవిశిష్టుం డగుదేవదత్తుం డర్థంబు నగుం, దాదృశవిరుద్ధవిశేషణవిశిష్టవ్యక్తుల కభేదంబు వలుకుట యసమంజసం బనునట్లు గానిపించుం, గాని 'సోఽయ' మ్మను పదద్వయంబు సమానవిభక్తికం బగుటఁ దాదృశపదవాచ్యంబుల కభేదంబు వచించుట శాస్త్రసమ్మతం, బట్లు పలుకుట కియ్యెడ భాగత్యాగలక్షణ యవశ్యం బాశ్రయణీయం బయ్యెడి- నది యెట్లంటేని:- తద్దేశకాలవృత్తిత్వవైశిష్ట్యంబు నేతద్దేశకాలవృత్తిత్వవైశిష్ట్యంబును త్యజియింపం దగు. దానం గేవలదేవదత్తునెడ నభేదంబ బోధితం బగుం గాదె! ఆరీతినే 'తత్త్వమసి' యనుసూక్తియందుం దత్పదార్థంబు సర్వజ్ఞత్వవిశిష్టం బగుచిత్తగుఁ, ద్వంపదార్థంబు కించిద్జ్ఞత్వవిశిష్టం బగుచిత్తగు,నట్టిరెండింటె కభేదంబు పొసంగనేరదు. అట్లయ్యును 'తత్త్వ'మ్మనుపదద్వయంబు సమానవిభక్తికంబు లగుటంజేసి శాస్త్రవిచారంబున నభేదం బనివార్యవచనీయంబై భాసిల్లుటం భాగత్యాగలక్షణ నాశ్రయించి తత్పదార్థైకదేశం బగుసర్వజ్ఞత్వవైశిష్ట్యంబును, ద్వంపదార్థైకదేశం బగుకించిద్జ్ఞత్వవైశిష్ట్యంబును బరిత్యజింప నాపదద్వయంబు జీవేశ్వరుల కభేదంబును స్పష్టంబుగ బోధించుం, గావున నియ్యెడ విరోధంబును లేదు. గోత్వమ్మునశ్వత్వమ్మును బరిత్యజించులక్షణ నాశ్రయించి గవాశ్వముల యెడ నభేదంబు చెప్పం దలంచుట యనుభవవిరుద్ధంబును నప్రమాణంబు నగుటంజేసి 'గోత్వాఽశ్వత్వ పరిత్యాగపురస్సరంబుగ హయపశువుల కభేదంబు ప్రాప్తింపవలయు' నను నతిప్రసక్తియుఁ రాదు.

సీ. షాఢ్య సార్వజ్ఞ్య ధర్మయుత జీవేశ రూ
పాతిరిక్తం బైన యయ్యిరువుర
పరినిష్ఠిత స్వరూపమె లేదు 'తత్త్వమ'
సీతివాక్యంబునం దేల లక్ష
ణాశ్రియ ణాయాస మనఁబోకు 'శుక్తిరూ
ప్యగతి జీవేశ రూపములుఁ గల్పి
తా త్మనుయుక్తి సత్యపదార్థ మొక్కఁడ
ధిష్ఠానముగ నొప్పి తీఱవలయు

గీ. నీహా దేహో ద్యహం తాంత మెల్లదృశ్య
మునకు జడిమ మొప్పక తప్ప దనఘ! జడము
నకు నధిష్ఠానముగఁ జేతన మ్మగు నొక
రూప మొప్పంగవలె; జీవరూప మదియ. 433

చ. "తగ ననిరూప్య పహాట విమతం బది కల్పిత పాను రజ్జు జి
హ్మగగతి" నన్నయుక్తి ననదాకృతి యాజగ మెల్లఁ గల్పితం
బగుట ధ్రువంబు- కాల్పనిక మైనజగంబున కాశ్రయంబు గాఁ
దగినది యీశురూప మని తత్స్థితి నియ్యకొనన్ వలెన్ జుమీ. 434

గీ. కాన శ్రుతిగమ్య మనుపాధిక మగునుభయ
రూపమున- నిరుపాధిక పాపటికము
నందున జపాసుమారుణ్య మలమునట్లు
లలమ వజ్ఞత్వ సర్వజ్ఞతలు లవంబు. 435

వ. జీవేశ్వరభేదజ్ఞానమే యథార్థ మగునేని * 'మృత్యో స్స మృత్యు

---

* ఎవఁడు 'పరమాత్మ వేఱు నేను వేఱు' అను నానాత్వము గల వాఁడో, వాఁడు సంసారమునుండి సంసారము నొందును. అనఁగా జన్మపరంపరయందు మునుఁగు నని భావము.

మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' యనియు ♦ 'య ఏతస్మిన్నుదర మంతరం కురుతే అథ తస్య భయం భవతి' యని శ్రుతులు భేదదర్శికి భయమును జెప్పకపోయెడివి, మఱియు భేదబుద్ధి విపరీతబుద్ధియే కానిచో విపరీతద్రష్టకు (జీవేశ్వరభేదదర్శికి) భయము కలుగు నని చెప్పుటచే విపరీతదర్శి కనర్థయోగము తప్పదు. విపరీతబుద్ధియే భేదబుద్ధి యగుం జువ్వే. 436

ఉ. వేదగతంబ యయ్యును నభేద మతాత్మ్యైక మేని 'తద్భిదా
వేదికిం బూరుషార్థము లభించు' నటంచు నెటుల్ వచించు 'న
న్వేదమె? యేం బరేశునకు భిన్నుఁడ' నన్ భ్రమ శాస్త్రబాధితం
బౌఁ దుహినాంశునైంద్రియిక మైనప్రమాణముకై వడిన్ వడిన్.

వ. చంద్రమండలంబు ప్రాదేశమాత్రప్రమాణంబై కానవచ్చుచున్న దనుభ్రమంబు జ్యోతిశ్శాస్త్రప్రామాణ్యంబున బాధితం బగుట లోకవిదితంబు. 433

గీ. కాన 'నే నీశ్వరుఁడను గా' ననెడి భి
దామతి కబాధ కల్పింపఁ దగదు; నిగమ
సిద్ధ జీవేశ్వ రాభేదబుద్ధి యట్టి
దియ- శ్రుతిని మించుమాన మైంద్రియిక మగునె? 469

చ. అల పరమాత్మతత్త్వముఁ బుమర్థపుఁ దత్త్వముఁ దొల్లి పెక్కుదా
రులఁ గపిలాది తాపస నిరూపిత మయ్యెను; దాని వీడి నీ
పలుకు గ్రహించు టెట్లనెదవా 'ప్రబలంబు శ్రుతుల్, స్మృతుల్ సుదు
ర్బల' మనునీతి వేదపరిపంథి మునీరిత మప్రమాణ మా. 440

♦ పరమాత్మునియెడ స్వల్ప మగు భేదము నేనియు నెవ్వఁడు తలంచునో వానికి (సంసార) భయము తప్పక కలుగును

గీ. కానఁ 'దత్త్వమ'సీతి నైగమవచోవి
రుద్ధ కపిలాది తాపస ప్రోక్తపక్ష
యననుసరణీయ మని నిశ్చయముగ నెఱుఁగు
మట్టిసరణు లాపాతరమ్యములు సూవె! 441

వ. అని వచించు భాష్యకారుని వాఙ్ముఖంబున కడ్డంబు దవిలి యా కపీంద్రుఁ డిట్లను. నార్యా! 'సుఖదుఃఖాదివైచిత్ర్యమునం బ్రతిదేహంబున జీవుండు భిన్నుం డగు' నను యుక్తి నెసలారు మహర్షి వాక్యంబును శ్రుతివాక్యంబు పగిది గ్రాహ్యంబు. అట్లు గాక 'జీవాత్మ యొక్కఁడే' యగునెడ మహాదుఃఖి యువరాజ్యసౌఖ్యంబు నొందవచ్చు, మఱియు 'వీఁడు సుఖి, వీఁడు దుఃఖి' యను ననుభవంబే గల్గకుండెడిని. ఎవ్వాఁడు జ్ఞానయుక్తుం డట్టి జీవుండే కర్తయు, భోక్తయు నగుంగాని, యచేతన మగునంతఃకరణంబునకుఁ గర్తృత్వభోక్తృత్వంబులు గలుగు టెట్లు? అట్లు గలుగునేని దేవదత్తకృత కర్మఫలభోక్తృత్వంబు యజ్ఞదత్తున కాపాదిల్లుటం జేసి యతిప్రసంగదుష్టం బగు. మఱియు నీలోకమున దుఃఖనాశనమే పురుషార్థం బని వేదంబున నిశ్చితం బయ్యెఁగాదె! 'సకలసుఖంబులు దుఃఖయుతంబులు కావుటం జేసి విషసంపృక్తాన్నవిధంబున హేయంబులను నభేద్యయుక్తి వలన సుఖంబు లెన్నండు బురుషార్థంబులు గా' వనుటయుఁ జిఱునగవు మొగంబు గై సేయ భగవత్పాదుం డిట్లను.

సీ. అరయంగ మోదఖేదాది వైచిత్ర్యమ
నోధర్మ మదియె మనోగతభిద
సాధించుఁ గాని యేసరణి జీవుల భేద
మునకు సాధకముగా ననువుపడదు
'తోచ్చెఁ గర్తృత యచేతన తనూయుగళిఁ జి
త్సంబంధ మగువిశేషం బొకటియు

యది లేమిఁ గర్తృత్వ మలవడదు తృణాది'
కనెడుకల్పన వరీయమ్ము మిపుల

గీ. నీవు పేర్కొన్నదుఃఖసహిత సుఖంబు
వైషయిక; మిఁక దుఃఖలవంబు లేని
దనఘ! బ్రహ్మసుఖం బౌట నట్టిబ్రహ్మ
సుఖమె పురుషార్థముగ గ్రహించునది సూవె! 443

ఆ. అంతెకాని తుచ్ఛ మగుదుఃఖములనాశ
మర్థ్య మాం పుమర్థ మనుట తగునె?
జరుగదొక్కొ దుఃఖశాంతి కండూయన
మున నెవండు దాని ముక్తి యనును? 444

మ. అనుచున్ యుక్తిశతోపబృంహిత మహార్థాప్తంబు శుశ్రిత్యంగనా
జన తాంతఃపుర సావిదల్ల మగువాచాధార నాత్మీయమై
చను నద్వైతమతంబు నశ్రమమునన్ స్థాపించి, మించన్ జయిం
చెను దచ్ఛైవమతంబు హేలఁ బరకృత్సిద్ధాంతఘోరోక్తులన్. 445

క. యతిరాడ్జితుఁడై శైవుం
డతఁడు స్వభాష్యమ్ము దర్ప, మపుడ విడచి "నా
గతి నీవే" యని తచ్చరణా
నతుఁ డయ్యె సశిష్యుఁడై ఘనం బగుభక్తిన్. 446

వ. అట్లు యమిబుషభ నిర్జితుం డగునీలకంఠపండితుని శృంగభంగంబు నాలించి యద్వైతవిద్యా విద్వేషు లగువివిధ మతంబులవారు కంపంబు నొందిరి. జగం బెల్ల శంకర విజయ వార్తా ఘోషణంబుల నిబిడం బయ్యె నంత. 447

ఆ శ్వా సాం త ము

శా. అద్వైత ప్రతిపాది తామృతపదార్థాకార! రాకారవిం
దద్విడ్ధిక్కరణక్రియా నిపుణ నిత్య స్మేరవక్త్రాంబుజా!
విద్వద్వర్ణన దుర్లభామలయశోఽన్వీత ప్రతాపాబ్ధి! కృ
ష్ణద్వైపాయన సూత్రజాల పరిలగ్న స్థూల మీనాకృతీ!

క. తత్త్వంపదార్థయుగళై
కత్త్వాలంబ ద్విధాప్రకాశ స్త్రీపుం
సత్త్వ లలితదాంపత్యై
కత్త్వవిరాజిత! విదేహకన్యాసహితా!

వనమయూరము

ఈదరకు లామృతనదీశ శశి సేవా
మోదరసికాత్మ! మునిముఖ్యహృద యావా
సాదర! యమేయవిజయ ప్రభవచంద్ర
క్షోద, రజతాద్రి, శతకోటినిభ కీర్తి!

ఇది శ్రీగురుకరుణాసమాసాదితకవిత్వ
వెంపరాల సూర్యనారాయణ నామధేయప్రణీతంబైన
శ ం క ర వి జ యం బు న

అ ష్ట మా శ్వా స ము.



# శంకరవిజయము



## నవమాశ్వాసము





కర! వేంకటరాట్సువి
వాకల్పితధర్మకృతిశుభైధావనదీ
ఝూక! నిగమకేళీక! ని
రాకృతజననాది విక్రియాకా! రామా!

వ. అవధరింపు మనంతరం బప్పరివ్రాట్సార్వభౌముండు సౌరాష్ట్రాది
నానాదేశంబుల నిజభాష్యంబుల వ్యాపన మ్మొనర్చుచు నందందుఁ
గల పండితబృందంబుల ప్రశంసలకు లక్ష్యంబై చనుచు ద్వారవతీ 1
నగరంబు సేరునంత.

సీ. ఆ తప్త శంఖచక్రాకృతి లోహాభి
హతి భవవ్రణకిణాంచితభుజులును
బృథులలలాట దీపిత శరదండ స
మా నోర్ధ్వపుండ్ర సంధానచణులు
మాధ వాపచితి నిర్మాల్య కోమలసుంద
ర తులసీదళ లసచ్ఛ్రవణతలులుఁ
దప్త కార్తస్వరద్రవ విభ్రమ భ్రమా
ధాయక పీతకౌశేయ ధరులుఁ

* 'బంచవిధ భేద వేత్తలే కాంచువార
లమృత' మని పల్కువారునై యలమి పాంచ

---

* (1) జీవేశ్వరభేదము, (2) జీవుల పరస్పరభేదము, (3) జీవునకు,నచిత్తులకు గల భేదము, (4) ఈశ్వరునకు నచిత్తుకు గల భేదము, (5) అచిత్తుల పరస్పరభేదము— అనెడి పంచవిధభేదములు.

రాత్రులు ప్రగల్భ తద్యతి ధ్వాత్రి వీర
సింహముల కోడి దంతులై చెదరి చనిరి.

### ఉజ్జయినియందు భాస్కరభట్టునోడించుట

చ. అప్రతిమానశక్తి నిటు లయ్యతి వైష్ణవ, సౌర, శైవ, శా
క్తప్రముఖుల్ వశంవదులు గాఁగ జయించి, యవేళవాక్పరా
స్తప్రతివాది యాచుఁ జనెఁ జయ్యన నుజ్జని; కాక్షణంబ శ్రో
త్రప్రియబంధు లయ్యె శివతాండవమర్దళ దింధిమిధ్వనుల్. 3

సీ. అభవపూజా మృదంగారావ మభ్రగ
ర్జిత మంచుఁ గృహకేకితతి నటింప
సుమ సుగంధ్యనిలముల్ శూలిదిదృక్షఁ జె
చ్చెర వచ్చు దనుఁ జేరి సేదఁ దేర్ప
నగురుధూపోత్థ ధూమ వ్యాక్రాంత హరిదంత
మయి మహాకాళునాలయము దోఁపఁ
బ్రణతిపూర్వక శివారాధన ధన్యుఁ డౌ
తనకు మంటపి నిల్చు తావు నొసఁగ

గీ. జయపిశున లక్షణము లివ్వి శర్వకరుణ
నరయవచ్చె నటంచు శంకరుఁ డలంత
వాసి కవి యగుభాస్కరాహ్వయునికడకుఁ
బంపెఁ బద్మపాదునిఁ దనవార్త తెలుప. 4

క. స్తవ్యుని బుధశేఖరు బహు
ధా వ్యాకృత నిగమవచనతతి సులభ జితా
రివ్యూహు నతనిఁ గని వ
క్తవ్య మ్మిటు పద్మపదుఁడు గలఁగక పలికెన్. 5

చ. వడిఁ గడలొత్తఁ గీర్తి భగవంతుఁడు శంకరయోగిసార్వభౌ
ముఁడు పరమాద్వితీయమతమున్ బ్రకటించుచుఁ దద్విపక్షవా
ది దమరహారకుం డయి క్షితిన్ నుతి కెక్కినవాఁ; డతండు దా
నోడి వెను సూరతుం డయి నిన్నుఁ గుఱిసేసి య వెల్లఁ జెప్పుదున్.

మ. కుమతోత్ప్రేక్షితసూత్రవృత్తులతెఱంగుల్ గూర్చి 'వేదాంత జా
లము బ్రహ్మం బగుప్రత్యగాత్మమున తెల్పున్ దత్పరం' బంచు వా
దము గావింతుము, దూరమారసియ యద్వైతంబు నంగీకరిం
పుము నీదుర్మ్మతమున్ ద్యజించుకొను 'మేమో' యన్న నాలింపుమా.

క. అక్షీణాస్మత్తర్క ప
విక్షతి నీపక్ష మిపుడు విక్షతి గనన
ట్లీక్షణసహస్రమును నిడి
రక్షించుకొనన్ యతింపు రచ్చకు రమ్మా! 8

క. అని 'యొకటి యను' మనిన నూ
ఱనెడు సనందనుని హేళనాలాపమ్ముల్
విని లబ్ధవర్ణుఁ డాకవి
యనె యతివరుశిష్యుఁ గోప మందియు నగుచున్ 9

ఆ. మామకోక్తి గుంఫమండలీ రేఁగఁ గా
ణాద జల్పితమ్ము లల్ప మగును
గాపిలప్రలాప మోపక రూపఱు
ననిన నద్వైతనబుధాళి యెంత? 10

ఉ. అంచు వచించునాకవిని యబ్జపదుం డను 'నోయవిజ్ఞ! య
భ్యంచితులం దవజ్ఞ నిటుపై నొనరింపకు, పర్వతంబు ఖం
డించిన టంక మైనఁ దగునే మగరాఁ దెగఁగోయ? నంచు భా
షించి స్వదేశికాంతికముఁ జేరి వచించె సమస్తవృత్తమున్. 11

ఉ. వానిపిఱుందనే సపరివారము తద్బుధుఁ డేఁగుదెంచి వి
జ్ఞానసభిన్ జగద్గురుని గాంచి జిగీష వెలార్పఁ నంత న
వ్వానికి మాని కయ్యె, బరపక్ష విఖండన నైజపక్ష ర
క్షా నిపుణార్థ యుక్తి విలసద్వచనం బగువాద మున్నతిన్. 12

క. అతిచిత్ర శబ్ద శయ్యా
న్వితమై మర్మయభివా ప్రతీప వచోయు
క్తితతంబునయి తటస్థ
శ్రుతవ దవేద్యముగ వాదసూరత మెఱసెన్. 13

ఉ. అంత యతీంద్రుఁ డబ్బుధు సమర్థతఁ గాంచి స్వపక్షయామినీ
కాంతునకున్ శరత్కమలకల్పము సూరిపురోఽప్రభాతసి
ద్ధాంతము నైనభాస్కరబుధాదృతపక్షముఁ దూరుపెత్త; నా
వంతయు నైజపక్ష మరయంగ నశక్తుఁడ యయ్యెఁ గెల్వఁగన్ 14

క. ప్రతిబాదీ రచనాద
క్షత మెఱయఁ ద్రయీశిఖాప్రకాశితమై స
న్మత మగునద్వైత మహా
కృతముగ వాగ్మిత్వ మమర నిట్లనుఁ బ్రౌఢిన్. 15

వ. పరివ్రాడవతంసా! నీమతమునం "బ్రకృతి జీవపరమాత్మభేదిక" యనికదా చెప్పంబడును! ఆప్రకృతి జీవగతమై జీవపరమాత్మభేదిక" యగునా?-ఈశ్వరగతయయియే యగునా? జీవభావమ్ము నీశ్వరభావమ్మును బ్రకృతిసంబంధము కల్గుననంతరంబ సంభవించుటం జేసి జీవగతమై కాని యీశ్వరగతమై కాని తదుభయభేదిక కాదు. 16

శంకరవచనము:—బింబగతంబై దర్పణంబు బింబప్రతిబింబభేదక మగునా? ప్రతిబింబగతంబయియే యగునా? ఆబింబప్రతిబింబంబు లుభయంబును దర్పణోత్తరోద్భవం బగుటవలనఁ బక్షద్వయంబు సంభ

వింపదు. దర్పణంబు కేవలముఖ మాత్రింబై బింబప్రతిబింబభేదకం బగుచోఁ బ్రకృతంబునను కేవలశుద్ధచిన్మాత్రగతయై ప్రకృతియు జీవపరమాత్మభేదక మగు. "అట్లగుచోఁ జీవాత్మత్రమునకు (శుద్ధచైతన్యమునకు) దుఃఖిత్వాదికం బేల సంభవింప" దందు వేమొ? వినుము. దర్పణంబు ముఖగతంబై బింబప్రతిబింబభేదకం బైనను దర్పణగతం బగుమాలిన్యాదికంబు బింబభూతముఖంబునకు సంభవింపక ప్రతిబింబమ్మునకే సంభవించునట్లు బింబభూతం బగుపరమాత్మ పక్షపాతమ్మును విడిచి చితిమాత్రగతం బగుప్రకృతిరూపోపాధి ప్రతిబింబభూత జీవాత్మయెడఁ బక్షపాతంబు గలదై జీవాత్మయందే దుఃఖిత్వాదికం బాపాదించు. 17

భట్టభాస్కరః—బ్రహ్మం బవికారి సంగరహితంబు, బోధైకరసంబును గదా! ప్రకృతి యన్ననో వికారి,యబోధరూపము(జడము)నుగాదె! ఇట్టి ప్రకృతికి విరోధంబువలన బ్రహ్మాశ్రయంబు గలుగదు. కాననే యంతఃకరణవిశిష్టం బగు నాత్మాశ్రితత్వంబు ప్రకృతికిం జెప్పవలయునే కదా!

శంకరః—ప్రకృతి యంతఃకరణవిశిష్టంబున నుండు ననుటకుం బ్రమాణంబు లేదు. 'అహ మజ్ఞ' (నేనజ్ఞుఁడను)యనుప్రతీతియే ప్రమాణం బందువా?'అహ మనుభవి' (నే ననుభవించుచుంటి) యను ప్రమాణంబువలన ననుభవమ్ము గూడ నంతఃకరణవిశిష్టమునం దుండవలసి వచ్చు. అజడరూపం బగుననుభవంబు జడం బగునంతఃకరణంబుతోఁ గూడినదానియం దుండుట విరుద్ధ మగుట నిష్టము గాదు.19

భట్టభాస్కరః— దాహకంబు గానియినుమగ్నిసంయోగంబువలన దాహక మ్మగుగతి ననుభూతి గలిగినయాత్మతోడి సంయోగమున నంతఃకరణమునందు 'అహ మనుభవి' యనుననుభవ మాపాదింపఁబడుచుండు. 20

శంకర:—అట్లగునేని చిదుపాధిసంబంధంబున నంతఃకరణమున కజ్ఞానము సంభవింపక నీచెప్పినచోప్పున మాయాశ్రియ మగుచిత్సంబంధము గలయంతఃకరణమునం దజ్ఞాన మాపాదింపంబడు. 21

భట్ట:—ఆర్యా! అయ్యనుభవం బజడం బగుట జడం బగునంతఃకరణంబున నుండు ననుట బాధితము. కావున ననుపపన్న మగుటంజేసి యనుభూతి గలయాత్మసంబంధమ్మున 'నంతఃకరణమునందు ననుభూతికి వ్యవదేశ' మనుట యుక్తము. ప్రకృతమున నంతఃకరణంబును మాయయు జడంబులే యగుట బాధలేమింజేసి యంతఃకరణము మాయాశ్రియ మగుం, గాని మాయాశ్రియచిన్మాత్రసంబంధమ్మున నంతఃకరణంబునం దజ్ఞానంబునకు వ్యపదేశం బని పల్కుట తగదు. 22

శంక:—ఓయీ! అవిద్యాజనితం బగుచిత్తం బవిద్య కాశ్రియంబు గాదు. చిత్తం బజ్ఞానంబున కాశ్రియంబె యగుచో సుషుప్తియందుంగూడ నజ్ఞానము చిత్తవర్తి కావలయునే! అట్లగుట సమ్మతము గాదుగదా! కానం బ్రకృతి దృశ్య మగునంతఃకరణవిశిష్టమందుండు ననం బ్రమాణంబులేమిం బ్రకృతి చిద్గతమే యగు. 23

భట్ట:—'సతా సౌమ్య తదా సంపన్నో భవతి స్వ మపీతో భవతి'యను ఛాందోగ్యశ్రుతి "జీవునకుం బరమాత్మైక్యము సుషుప్తియందుం గలుగు" ననుటవలన సుషుప్తియందుం బ్రతిబంధకం బగునవిద్యయే లేద'అయ్యవిద్య చిద్గత' మనుట పొసంగదుగాదె! 'సతి సంపద్య నవిదు' అనుశ్రుతివాక్యము సుషుప్తియం దజ్ఞానసద్భావంబు తెలుపుచుండె నందువేమో! ఆశ్రుతియందలినఞ్ శబ్ద మభావంబు బోధించుం గాని యజ్ఞానంబును బోధింపదు, గాన 'సతా సౌమ్య' యనుశ్రుతిచే సుషుప్తియం దజ్ఞానము బోధింపంబడదు. నీచెప్పిన

యీయజ్ఞానము నిత్యమా? యనిత్యమా? యుక్తి లేమింజేసి నిత్య మనంజనదు. అనిత్యమందువా? ఆయనిత్యమునకు నివర్తక మొకటి యుండవలెం గదా; ఆనివర్తకము చిత్ప్రకాశమా? జడప్రకాశమా? చిత్ప్రకాశము సాక్షియగుటంజేసి భవత్సమ్మతం బగుజ్ఞానంబు భావరూపం బగుం, గాన విరోధి కాని యీయజ్ఞానంబు నివర్తకంబు కాదుగదా? ఇంక జడప్రకాశం బందువా? జడ మగు నజ్ఞానమునకును జడప్రకాశమునకును విరోధంబు లేమింజేసి నివర్తక మెన్నండును గానేరదు. కావున నవస్థాత్రయంబునను నజ్ఞానంబు ప్రతిబంధకంబు కాదు. అట్లగుటంజేసి 'సంసారంబునకు బీజభూతంబును, నవస్థాత్రయంబందు ననపాయియు, మోక్షావస్థ యందు నశ్వరంబును నగునజ్ఞాన మనునొకపదార్థము గల' దను భవత్సిద్ధాంతంబు సమంజసం బెట్లు కాంగలదు? "అట్లేని యవస్థాత్రయంబునం జిత్తు భాసింప కుంటకు నిమిత్త మేమి" యనిన భ్రమము (మిథ్యాజ్ఞానము) నగ్రహముం, దత్సంస్కారము ననుభ్రమాది త్రితయంబె నిమిత్తం బగు.

శంకర:— నీ వనినట్లే యగుచో భ్రమ మనంగా నెట్టిది? 'నేను మనుజుండ'నెడి యహంకారాదిదేహపర్యంతం బగునాత్మంబునం దాత్మబుద్ధియ భ్రమ మందువా? ఓహో! సర్వపదార్థసాంకర్యమును జెప్పు నీయతివిస్మరణశీలత్వంబు మెచ్చందగుం గాదె! నీవిస్మరణశీలత యెట్టి దందువా? వినుము భేదాభేదవిషయత్వ మనెడిశాస్త్రసిద్ధ హేతువుచే 'అముకః ఖండః' (ఇది ఖండము) అను భేదాభేదప్రత్యయమునకుం బ్రమాణత్వమ్ము నాశ్రయించి యీభేదాభేదవిషయ మగు నేను మనుజుండ,ననుప్రత్యయమును భేదాభేదముచే సర్వసంకరవాది యగు నీవు 'నేను మనుజుండ' నను జ్ఞానము భ్రమ మని యంగీకరించుట నీమతమును విస్మరించియేకదా! అట్లగుచో వివాదవిషయ మగుబుద్ధి

భేదాభేదవిషయిక మగుటచే(1) యథార్థము (ప్రమ) అనువిషయమున (ఖండోఽయం, 'నిది ఖండ' మనుజ్ఞానము దృష్టాంతము. 25

భట్టభాస్కర:— 'నేను మనుజుఁడు' ననుజ్ఞానము నిషిధ్యమానవిషయ మగుటచే శుక్తియందు రజతబుద్ధివలె 'అప్రమ' యగును. కానఁ బ్రతిహేతువుచే నీచూపిన హేతువు(2) సత్ప్రతిపక్షిత మగునుగాదె!

శంకర:— (నాయం ఖండో గౌః కింతు ముండో గౌః) ఈగోవు ముండమే కాని ఖండము కా దనెడిఖండాన్యధీస్థ ముండమునందు నిషిధ్యమాన మగుఖండమే విషయ మైన 'ఖండోఽయంపశు' వనుబుద్ధి యందు సాధ్య మగునప్రమాత్వాఽభావం బుండుటవలనను నచటఁ బ్రతిహేతు వగునిషిధ్యమానవిషయకత్వరూప మగుహేతు వుండుటవలనను బ్రతిహేతువు వ్యభిచారి యగును. 27

భట్టభా:— అప్రమాత్వమును సాధించునది నిషిధ్యమానవిషయత్వము కాదు. మఱేమనినఁ బ్రతిపన్నోపాధియందు నిషిధ్యమానవిషయత్వము హేతువు. కాన వ్యభిచారము సంభవింపదు. అట్లగుచోఁ బ్రతీతివిషయ మైనయధిష్ఠాన మగు 'ఇద' మంశమ్మున నే "నేదం రజత" మ్మని నిషిధ్యమాన మైనటుల యాత్మయందుఁ బ్రతిపన్నం బగుమనుజత్వం బాత్మయందే "ఆత్మా న మనుజ" యని ప్రతిషేధింపంబడు. కాన "మనుజోఽహం" మ్మనెడిజ్ఞానము భ్రమయే యగు, "ఖండోఽయం గౌ" యనునది ప్రతిపన్నోపాధియందు నిషిధ్యమానవిషయకము గాని దగుటంజేసి భ్రమ కాదు. ప్రమయే యగుం గానఁ బ్రతిహేతువు వ్యభిచారి కాదు. 28

---

(1) విమతా ధీః ప్రమా, భేదాభేదవిషయత్వాత్ యథా ఖండోఽయ మితిధీవత్ (2) సంహానాత్మధీః అప్రమా నిషిధ్యమానవిషయత్వాత్

శంక:— అప్రమాత్వసాధకమ్ముగా నీచేఁ బ్రయోగింపఁబడిన ప్రతిప న్నోపాధియందు నిషిధ్యమానవిషయత్వం బను హేతువు 'ఖాణ్డోగా' యనునెడ వ్యభిచరించును. 29

భట్ట:—గోత్వోపాధియందు బ్రతిపన్నం బైనఖండమునకు నిషేధంబు లేదు కాని ప్రథమానముండమునందుఁ గలదు కానఁ బ్రతిపన్నోపాధియందు ఖాడము నిషిధ్యమానము కాని దగుట హేతువు వ్యభిచారి యగు టెట్లు? 30

శంక:— ఖండంబునకు నిషేధంబు కేవలముంముడనందా? గోత్వవిష్ట ముండమునందా? కేవలముండమునందు ఖాడమునకుం బ్రసక్తియే లేమింజేసి నిషేధము కలుగదు. కలుగునేని యప్రసక్త ప్రతిషేధం బగు ద్వితీయపక్షమున గోత్వవిశిష్టముండంబున ఖండమునకు నిషేధసమయంబుననే ముండవిశేషణ మగుగోత్వమునందుఁ గూడ ఖండమునకు నిషేధము శ్రుతం బగుచున్నయది. కానఁ బ్రతిపన్నోపాధియందు నిషిధ్యమానఖండము విషయమ్ముగాఁ గలదియే ఖాడ జ్ఞాన మగుటంజేసి యప్రమాత్వసాధకముగఁ బ్రయోగింపఁబడిన ప్రతిపన్నోపాధియందు నిషిధ్యమానవిషయత్వరూప మగు హేతువునకు వ్యభిచారము దృఢవజ్రలేపము సుమా. 31

భట్ట:—ప్రమాత్వసాధకంబుగ నుపయుక్తం బగుభేదాభేదవిషయత్వరూపహేతు వనుచ్ఛిన్నతద్వ్యవహర్తృత్వరూప మగునుపాధితోఁ గూడిన దగుటచే వ్యాప్యత్వాసిద్ధం బగు. 32

శంక:-బ్రహ్మసాక్షాత్కారానంతరము "మనుజోఽహ"మ్మనువ్యవహారంబు లేమి, ననుచ్ఛిన్నతద్వ్యహర్తృత్వంబునకు సాధనావ్యాపకత్వంబు సిద్ధింపమింజేసి యాయనుచ్ఛిన్నతద్వ్యవహార ముపాధిగా నేరదు. 33

భట్ట:— ప్రారబ్ధకర్మము క్షయించినవెంట "మనుజోఽహ" మ్మను వ్యవహారము లేమింజేసి యనుచ్ఛిన్నైతద్వ్యవహారం బుపాధియే యగుం గాదె. 34

శంక:—మామతంబున జగం బజ్ఞానోల్లసితంబు గావున నజ్ఞాన లయం బగుడు, జగంబు లయంబొందు. నీమతమందో జగత్తుసత్యము గాన ననుచ్ఛిన్నైతద్వ్యవహారము సాధనావ్యాపకము గామింజేసి యుపాధి కానేరద"యనునిట్టి యుక్తిపరంపర భట్టభాస్కరమతంబునం దు "భ్రమ" మనుపదార్థమే సిద్ధింప దని స్థిరీకరించి "ఇద మిాారయ భ్రిమః కో" యనువాక్యము నూఁది ప్రథమోక్త భ్రమపదార్థమ్ము నే ఖండించి వైచి ప్రతిపక్షిచే "జితోఽస్మి" యనిపించె. 35

చ. అనఘుఁ డమర్త్యకీర్తి యగునయ్యతి యీగతి యుక్తులన్ సుధీం
ద్రుని గతతంద్రునిన్ గెలిచి శ్రుత్యదితార్థ విరుద్ధభావగుం
ఫన మగుభాష్యమున్ గుమత వజ్రితనుత్రి మగల్చివైవ, బో
రన భగవద్యశస్సుధ ధరాస్థలి ముంచెఁ, గలంగ దుర్మతుల్. 36

క. కుమతాతిరేక మిాాక్రియ
శమియింప, యతీంద్రుకీర్తి సకలాశాచ
క్రముఁ గ్రమ్మె ఘనాఘనసం
ఘ మడంగ శరత్సుధాంశుకౌముది పగిదిన్. 37

చ. హరిఁబోరి బాణ దండి భవభూతి మయూర ముఖాద్యసత్కవీ
శ్వరబిరుదాంకితుల్ కవులు వాదునఁ బల్వు రెదిర్చి యోడి శం
కరగురు నాశ్రయించి కడఁకన్ గడకొత్తి స్వదుర్మతంబులన్
వరుసఁ బఠింత్రు భాష్యము లవంత్యపవర్తన వర్తనంబునన్. 38

బాహ్లికదేశమున నార్హతమతస్థులం గెలుచుట

ఆ. అచటు వాసి బాహ్లికాఖ్య దేశము యతి
సేరి భాష్యములను శిష్యులకును
గఱపు టరసి చూడఁగా నోప కార్హత
సమయు లెదిరి పలుకసాగి రిటుల. 39

క. వివరింప మన్మతంబున
శివప్రదము లేదు గలవు 'జీవాఽజీవాఽఽ
స్రవ సంవర నిర్జర బం
ధ విమోక్షాహ్వాయము' లగుపదార్థము లార్యా. 40

ఆ. వాని సప్తభంగిచే నీ వెఱింగి త
రింప కిటు వృథా భ్రమింపఁదెగితి
తత్పదార్థములు యథామతి వివరింతు
వినుము సావధానవృత్తి మెఱయ. 41

వ. బోధాత్మకుండు జీవుండు, జడవర్గం బజీవంబు; వీని యపరప్రపంచంబు వచింతు. జీవాస్తికాయము పుద్గలాస్తికాయంబు, ధర్మాస్తికాయం, బధర్మాస్తికాయం బాకాశాస్తికాయంబు నని యస్తికాయంబు లైదు గలవు. 'కై గై శబ్దే' అను ధాతువువలన(అస్తి) గల దని చెప్పంబడునది యస్తికాయము. ఆయస్తికాయపంచకంబున జీవాస్తికాయము 'బద్ధుఁడు, ముక్తుఁడు, నిత్యసిద్ధుఁడు'నని ముత్తెఱంగు. నిత్యసిద్ధుఁ డర్హదాఖ్యుఁ డొక్కండ. ఇతరులు కొందఱు సాధనములచే ముక్తులగుదురు. తక్కంగలవా రెల్ల బద్ధుల. పుద్గలాస్తికాయ మాఱువిధంబులం బరఁగు, పృథివ్యప్తేజోవాయువు లనునాల్గుభూతమ్ములును, స్థావరంబును, జంగమంబు నని పేర్కొనంబడుచుండు. శాస్త్రీయం బగుబాహ్యప్రవృత్తిచేఁ బొడముజ్ఞానాంతరం బగుసపూ

ర్వం బను పేరుగల ధర్మ మనుమానింపఁబడుటంజేసి ప్రవృత్త్యను
మేయం బగునాధర్మంబె ధర్మాస్తికాయము నాఁ దనరు. ఊర్ధ్వగ
మనశీలుం డగుజీవునకుం దేహావస్థానంబున నధర్మ మనుమానింపఁ
బడుటంజేసి స్థిత్యనుమేయం బగునధర్మమే యధర్మాస్తికాయం
బనం జెల్లు. లోకాకాశం బలోకాకాశం బని యాకాశాస్తికాయం
బిరుతెఱంగు. పయిపయిం గలలోకంబుల కంతర్వర్తి యగునది
లోకాకాశంబు. సర్వలోకంబులకు మీఁది దగుమోక్షస్థానం
బలోకాకాశంబు. ఏతదస్తికాయంబ జీవాఽజీవప్రపంచంబు.
మఱియుఁ బురుషు నింద్రియములద్వారంబున విషయంబులందుఁ
జొప్పించుంగాన నాస్రవం బనంబడు. కొందఱు పౌరుషం బగుజ్యోతి
యింద్రియద్వారంబున విషయంబుల స్పృశించుచు రూపాదిజ్ఞాన
రూపంబునఁ బరిణమించుం గాన నాస్రవం బనిరి; ఒక్కొండ్రు
కర్త ననుసరించునవి కర్మంబు లగుటంజేసి యాకర్మంబులె యా
స్రవం బనియు నీమిథ్యాప్రవృత్తి యనర్థహేతు వనియు నండ్రు.

జీవుని, నాస్రవంబు, నాశ్రయించుకొని సంవరనిర్జరంబులు
రెండుం బ్రవర్తిల్లు; నందు శమదమాదిప్రవృత్తియై యాస్రవస్రో
తోద్వారంబు నావరించి యుంట సంవరం బనియు, ననాదికాలప్ర
వృత్తకషాయకలుష పుణ్యాపుణ్య ప్రహాణహేతువు లగు తప్తశిలాధి
రోహణాదికంబు నిర్జరం బనియు నండ్రు,నిశ్శేషముగాఁబుణ్యాపుణ్యం
బుల సుఖదుఃఖోపభోగంబునఁ దున్మించుట నిర్జర మయ్యె నని కొంద
ఱండ్రు. బంధం బన యష్టవిధం బగుకర్మంబు. ఆయష్టవిధంబు
లందు జ్ఞానావరణీయ, దర్శనావరణీయ, మోహనీ, యాంతరాయంబు
లనునాల్గును ఘాతికర్మంబు లనఁ బరఁగు. 'జ్ఞానమువలన వస్తుసిద్ధి
చెప్పఁజో నతిప్రసంగ మగుం గావున మోక్షమునకు సమీచీ
నజ్ఞానము సాధనంబు కా' దను విపర్యయంబ జ్ఞానావరణీయంబు

నాఁజను. ఆర్హతదర్శనమ్ముల నభ్యసింప మోక్షంబు గలుగ దను జ్ఞానంబె దర్శనావరణీయంబు. తీర్థకరోపదిష్టంబులై విప్రతిషిద్ధంబు లగుపెక్కుమార్గంబు లుండ నెందును విశేషావధారణంబులేమియ మోహనీయం బనంబడు మోక్షమార్గప్రవృత్తులకు విఘ్నకరం బగుజ్ఞానంబ యంతరాయం బనంజను. ఇయ్యవి శ్రేయోఘాతుకంబులు గావున ఘాతికర్మంబు లనం బరఁగె. దేనిచేఁ దత్త్వవేదనము సిద్ధించునో యట్టి శుక్లశరీరాకార పరిణామ హేతువు వేదనీయంబు. తదనుగుణంబై యొప్పునది నామికం, బయ్యది శుక్లపుద్గలమునకుఁ గలిలబుద్బుదాదిరూపం బగునాదిమావస్థ నాపాదించు. దేహాకారపరిణామశక్తిరూపంబున నొప్పుచు నవ్యాకృతం బగునదియ గోత్రికం బనఁబడు. శుక్లశోణిత రూపంబై యుత్పాదనము వలన నాయువుం జెప్పునది యాయుష్కం బనంబడు. కొందఱు 'నాకు వేదనీయము తత్త్వ మస్తి'యనునదియే యనుకొనుట వేదనీయంబనియు, నే నీ పేరివాఁడ ననునభిమానంబ నామికం బనియు, భగవంతుఁ డగుబుద్ధునిశిష్యవంశమువాఁడ ననునభిమానము గోత్రికం బనియు శరీరస్థిత్యర్థం బగుకర్మం బాయుష్కం బనియు నిర్వచింతురు. తత్త్వావేదకంబు లగుశుక్లపుద్గలంబుల నాశ్రయించుకొనునవి యగుటం జేసి యీనాల్గును నఘాతికర్మంబులు నాఁబరఁగె. తాదృశకర్మాష్టకంబు పురుషుని బంధించుం గాన బంధం బయ్యె. సకల క్లేశంబులుం దద్వాసనలుం బోవ ననావరణీయం బగుజ్ఞానంబుతో సుఖైకతానం బగునాత్మంబునకు నుపరిదేశస్థితియె మోక్షం బని కొందఱును, నూర్ధ్వగమనశీలుం డగుజీవుండు ధర్మాధర్మాస్తికాయంబుల బద్ధుండై యుండు, నాబంధమువలన విముక్తుండై యూర్ధ్వముగ నేఁగుటయ మోక్షం బని కొందఱును బల్కిరి. ఈసప్తపదార్థములఁ బ్రాపింపఁజేయుసప్తభంగిస్వరూపం బెట్టి దందువా? వినుము. స్యాదస్తి,*స్యాన్నాస్తి,స్యాదస్తినాస్తి, స్యాదవక్తవ్యము,

* తిఙన్తప్రతిరూపకావ్యయం బగు 'అస్తి' పదము కథంచిదర్థకము.

స్యాదస్త్యవక్తవ్యము, స్యాన్నాస్త్యవక్తవ్యము, స్యాదస్తినాస్త్యవక్తవ్యము నని సప్తభంగంబులు ప్రసిద్ధంబులు. వస్తువు నస్తిత్వవాంఛయందుఁ బ్రథమభంగంబు ప్రవర్తిల్లు. నాస్తిత్వవాంఛయందు ద్వితీయభంగంబు ప్రవర్తిల్లు. క్రమముగ నుభయమును వాంఛించుటయందుఁ దృతీయంబును, నాయుభయంబును గ్రమ[illegible]ము యొక్కమాఱు వాంఛించుటయందుఁ జతుర్థంబును, స్యాదస్తిస్యాదవక్తవ్యమ్ముల వాంఛించుటయందుఁ బంచమంబును, స్యాన్నాస్తిస్యాదవక్తవ్యవాంఛయందు షష్ఠంబును, దృతీయచతుర్థవాంఛయందుఁ సప్తమంబును బ్రవర్తిల్లు. ఏతత్సప్తభంగీక్రమ మెఱింగి సప పదార్థవివేకంబు వడయవేని నీవివేకంబు వ్యర్థం బని యాడంబరంబుగ నుపన్యసింప నాలించి శంకరుం డిట్లను. 42

కం. జీవాస్తికాయ మర్హత!
యేవంవిధ మనుచుఁ దెల్పుమీ" యనఁ వాఁడున్
దేహా[illegible]త్మకవృత
ద్రూపై వెలయుం దనూసమాన మగుమానముతో. 43

ఉ. అనవిని దేశికేంద్రుఁడు "డమహా, త్తనణీయము, నాట జీవుఁడే
యనువునఁ గాఁడు నిత్యుఁడు ఘటాదులటుల్; నరదేహ మూడ్చియు
యున్న గజదేహ మొందునెడ నంతట నుండఁడు, పుత్తికాంగ మొం
దఁ దివ్వలఁ గొంతయేన్ మిగులఁ దప్ప"దటంచు నార్హతుం డనున్.

కం. కలుగఁ గలిప యావయవం
బులు పెద్దశరీర మొందఁ బో, నల్పతనూ
కలనమునఁ దొఱఁగు; జీవుఁడు
ములయు సముత్రితిఁ దనూసమానుఁ డయి యుటుల్. 45

గీ. అనుడు శంకరుఁ డను నవయవము లిటుల
వచ్చి పోవునే నాగమాపాయు లాత్మ
మెటు లగు? ననాత్మములు పుట్టు టెటు? లనాత్మ
మం దెటు లణంగు నాత్మావయవము లనఘ? 46

ఉ. నావిని యార్హతుండు "జనన క్షయ హీనము లాప్రతీకముల్
పోవును వచ్చు నాత్మ కెటుపోలునొ యట్టివె; దంతిదేహమం
దే విలసిల్లుచోఁ బెరుఁగు నెల్లెడ నిండఁగఁ, బుత్తికాంగక
ప్రావృత మైనఁ దత్తనుసమర్హముగా నగు" నంచు వాకొనన్. 47

చ. యతిపతి పల్కె "నయ్యవయవాళి యచేతనమో సచేతనం
బో తెలుపుమా! సచేతనమె పొమ్మ నెదేని-విరుద్ధబుద్ధి న
వ్వి తనువు గ్రుస్సివో నలఁతవెట్టు, నచేతన మన్న-నెట్టు లె
ల్లతనువు చేతనన్ బడయులా గొనరింపఁగజాలుఁ జెప్పుమా! 48

వ. అనుటయు నయ్యార్హతుం డీరీతి నను. 49

క. తురగములు పెక్కు లయ్యును
నరదము నేకమతి లాగునటు లితరే
తరమైత్రిఁ జేతనతఁ గని
పరఁగించును మేని నవయవంబులు నిచ్చల్. 50

గీ. అనవుడు యతీంద్రుఁ డనెఁ 'బెక్కు లయ్యు హయము
లైకమత్యంబు గనుట నియంతకలిమిఁ;
గలుఁగడు నియామకుఁడు ప్రతీకములఁ; కెటు భ
వత్కథిత మొప్పు ననఁ బ్రతిపక్షుఁ డనియె. 51

క. తఱుఁగక పెరుఁగు మహాత్మ
శరీరమున జీవునంగసమితి- జలూకా

సరణిని వ్యాకోచము గ్రి
చ్చుఱఁ గను, సంకోచ మెనయు ననభీష్టము యేన్. 52

గీ. అనుటయు యతీంద్రుఁడు డను 'విక్రియాయుతంబు
లగుట నవి నశ్వరముల ఘటాదు లటుల
జీవుఁ డిటు నశ్వరుం డయి పోవునేని
కృతవినాశము నకృతసంగతియుఁ గలుగు. 53

మ. మఱి కర్మాష్టకభారపీడఁ బృథుసంసారాబ్ధిలో మున్గి కా
తర మూపాణి కలాబువట్లు సతతోర్ధ్వప్రాప్తియే మోక్ష మన్
స్థిరసిద్ధాంతము తావకీన మెటు సిద్ధిం గాంచు? మోక్షంబు చే
కుఱ, నీపల్కినసప్తభంగియును మాఱున్ నచ్చ దే మందువా? 54

క. ఆసప్తభంగి మోక్ష మ
హాసాధన మంటె; వెట్టు లగును? విరుద్ధం
బాసదసత్త్వాదు లొకట
నేసమయమునను ఘటిల్ల వేలా మాటల్. 55

నానాదేశవిజయము

ఆ. అనుచు మాధ్యమికులయద టెల్ల వదలించి
వరుస గెలిచి మెఱసె దరద శూర
సేవ గురు కరూశ సింధు పాంచాలాది
నామకోపవర్తనముల కరిగి. 56

చ. ఖండనకారుఁ బోలెడియఖండమనీషుఁ బటిష్ఠయుక్తి వా
ఖండితసర్వశాస్త్రు గురుకల్పుని భట్టవికల్పు నొక్కనిన్
బండితమాళిఁ బట్టి యభిమానము తద్యతి దుంచి నొంచి యు
ద్దండ వివాదకేళిని వశంవదుఁ జేసికొనెన్ క్షణంబునన్. 57

వ. పదంపడి కామరూపదేశంబున కరిగి యందు నాభిచారికక్రియాని
ష్ణాతుండనఁ బ్రసిద్ధుండును శాక్తభాష్యకారుండునగు నభినవగుప్తుం
డనునొక్కమాంత్రికుని శాస్త్రవాదంబున గెలుచుటయు; వాఁడతఁ
డుత్తుండై చేయునది లేక యాచార్యమండలేంద్రునకు మ్రొక్కి 58

క. వేదాబ్జవికాసి కిశో
రాదిత్యుని నిన్నుఁ బోలు నభిరూపుఁ గనఁ
లే దెట; వక మొందనిపత్రి
వాచి యనుచు నున్న నీ కవార్యప్రతిభా! 59

గీ. అనుచు నుతియించి దర్ప ముజ్జన మొనర్చి
ఘాతుకిలను శాక్తభాష్య మచ్చటన విడిచి
యాత్మను జనాపవాదభయంబు గలఁప
ననుసరించెను శిష్యుఁ డట్లయి యతీంద్రు. 60

చ. తివిరి స్వశిష్యు లౌనటు లుదీచ్యులఁ జేసి, విదేహ కోసలా
దివిషయలోకపూజ్యుఁ డయి దేశికుఁ డుక్కున వంగధాత్రి గె
ల్చి విడిచె; గౌడదేశజులచే స్వయశంబును బాడఁజేసె, స
త్కవితతిఁ బేరి కెక్కినబుధద్విపకోటుల గెల్చె వాదులన్. 61

చ. మును కలి వేదనిందక కుబుద్ధి ద్విజన్ముల మోహవార్ధి న
ద్దిన యసదధ్వ బుద్ధునె యెదిర్చిన ధీరుల భాస్కరాదులన్
గనుఁగొని కూటవాద మణఁగన్ గెలుపొందుట కాదు, వేత్తయా
మునిపతి కూటవాద పితృభూత జినోక్త మతంబె చీలిచెన్. 62

ఉ. బాలిశశాక్త పాశుపత వైష్ణవ గాణప తార్క్ష తార్క్ష కా
పాలికులున్ దదన్యులును వైదికమార్గము పాడొనర్పఁ దు
త్పాలన కోర్చెఁ గాని ప్రతివాదుల నయ్యతి; మానపాలనా
లోలతఁ గా, దమానితకు లోపము పుట్టదె యట్టు లైనచోన్. 63

మ. జగదాద్యద్రుహిణోపదిష్ట మయి, తత్సంతాన నిర్దిష్టమై,
భగవ న్నారదభవాది మౌనిజన తాప్తంబై, త్రయీసమ్మతం
బగునద్వైతస్మృతిన్ ముముక్షుపథికప్రాప్యంబు గావించె భే
దగ దుర్మేధస కంటకోద్ధరణ మార్గస్థన్ సల్పి యయ్యోగి డాన్. 64

మ. భువి షడ్వక్త్రునికై వడిన్ యతిలలాముం డెల్లెడన్ శాంతిదాం
తి విరాగోపరమ క్షమానితరవృత్తిత్వాఖ్య షణ్మాత్ర హా
ర్దవివృద్ధాత్మకుఁడై ప్రచండమదపూర్ణక్రూరపాషండదా
నవధిక్కార మొనర్చుఁ గాన—సుమనోంతస్తాపముల్ రూపఱెన్. 65

మ. యతిసమ్రాట్కృత సర్వదిగ్విజయ యాత్రారంభ తారాపథో
త్ప్లుత తుత్తుంభ పటుస్వనంబు వినుచున్ లోకాయతుల్ భీతి వి
ద్రుతులై రుక్కజీ, సైన్యభూపాళులఁ గణాదుల్ కాణులై, రింకి రు
ద్ధతు లాసాంఖ్యులు యోగులట్ల యన నేతం డోహటింపం డిఁకన్.

మ. పండితగోష్ఠి ఘోరపణబాధ నిబంధన పూర్వకోగ్రమా
మండనుతోడివాదున సమార్జితమై, జయసూచకమ్ము నౌ
డిండిమచండరావము ఘటించెను; హానిఁ గువాదచుంచు పా
షండజన శ్రవోవిపిన సంతతికిన్ దవపావకార్చియై. 67

ఉ. అంజక బుద్ధుఁ డాజి నెదురై వడి విద్రుతుఁ డయ్యె, మూలలన్
ఖంజుఁ డటుల్ కణాదుఁ డొదుఁగంబడె, గౌతముఁ డిర్లఁ జిక్కెఁ, బె
ల్చెం జితుఁ డౌచుఁ బాఱెఁ గపిలర్షి, కృతాంజలులైరి యెల్లపా
తంజలు లయ్యతీంద్రుపటుతర్కన్ గని నిస్సమ మంచు భీతులై. 68

శా. హస్తగ్రాహ మనిన్ గృహీతు లగు వేదాభ్యాసకుల్ కొందఱున్
ధ్వస్తప్రాణులు కాణభుక్కులుఁ జెఱం బడ్డట్టి లోకాయతుల్
శస్త్రబ్రహ్మవిహారుఁ డౌ గురునిచే స్వస్వాధిరాజ్యప్రతి
ష్ఠస్తుల్ గావుటఁ గొల్తు; రయ్యనఘుశౌర్యశ్రీకృషల్ చిత్రముల్.

సీ. శమదమాదిక సరస్వ ద్బాడబజ్వాల,
సత్య ఘనాఘనచక్ర వాత్య
కరుణా లసచ్చంద్రికా దర్శయామిని,
క్షాంత్యబ్జినీ పూర్ణచంద్రకాంతి
యాస్తిక్య భూజ దవానల పటుహేతి,
సత్కథా హంసి కాజస్రవర్ష
కుహనాది వివిధ దుర్గుణవిత్త మంజూష,
దౌరాత్మ్యఫణి వామలూరుసీమ

గీ. యగుచు సకలకుచ్చక్ర మాదుకొనిన
భండ పాషండ పండితాఖండ లోక్తి
మండలి నిజోపనిషదుక్తి మండలాగ్ర
చండతరధార నలశంకరుండు చెండె. 70

మ. పరితో వ్యాపనక్రమ్రమై కురియు చద్వైతామృతం, బాత్మగో
చరమై, తాపహమౌ గురూక్తి జలముక్చక్రంబు దుర్భిక్షు బం
ధురక్షప్తిన్ స్వపరైక తైకఫల మౌ దుర్భిక్ష మార్చెన్ నిరం
తర పాషండ ఖరాతప ప్రసరణాంతం బూన్చి నత్యంతమున్. 71

సీ. శాంతులై తగుపతంజలియోగదర్శనా
ధ్యక్షులకును బంటులైనవారుఁ
గాపాలికుల పతద్గ్రాహముల్ మోచువా,
రలకణాదుల ప్రతీహారిజనులుఁ
బ్రౌఢ క్షపణకేంద్ర వైతాళికులు, దిగం
బర నరపతుల సామంతసమితి
యభినవంబుగ నహరహమును దలనూపు
నట్టిచార్వాక వంశాంకురములుఁ

గీ. ప్రబల ఝంఝాప్రభంజ నోపమిత శంక
రార్యభగవత్ప దాపరిహత కృతాంత
బద్ధ వాగ్ధాటి కిద్ధరఁ బడి నలంగి
జీర్ణదశఁ గ్రుంగి నామావశేషు లైరి. 72

గీ. ఇటుల ద్వైతనివృత్తి యెల్లెడ నొనర్చి
ప్రతిదినమ్ము గురుండు ద్వాపరము లణఁచు
చాతత మొనర్చి పుచ్చె నద్వైతపథము
తమ మడఁచి యాతపముఁ జిమ్ము తరణి కరణి. 73

శంకరునకు భగందరవ్రణముపుట్టి పూనుట

చ. అభినవగుప్తుఁ డీక్షణమునందు యతీంద్రున కోడెఁ; దత్క్షణ
ప్రభృతి యతీంద్రు పాయువివరంబున నాటును బోటుఁ బుట్టి ని
ష్ప్రభ మయి దేహ మెల్లను జ్వరంబునఁ గ్రాఁగఁదొడంగె దానఁ వీఁ
డభిచరణంబు సేయఁడు గదా యని యాతని సంశయింపఁగన్. 74

గీ. ఏమి కారణమున జనియించెనో వచి
యింపరా దయ్యెఁ గనుచుండ నెదిగి గురుని
పాయువున నొక్కకెలన నపాయ మగు భ
గందరవ్రణ మయ్యె నక్కడిఁదిపోటు. 75

గీ. అదిర! వైద్యచికిత్స్య వ్రణాంతర స్ర
వ ద్రుధిర సిక్త శాటు లన్వహము నూడ్చి
తోటకాచార్యుఁ డొకరుఁ డెప్పాట రోయ
కేటి తెలిసీట నుదికి యం దిచ్చుచుండు. 76

క. అగదంకా రాసాధ్యము
భగందరవ్రణము పుట్టి బాధింపఁ గడున్

నాగిలెడు గురునిం గని శి
ష్యగణం బెదఁ గుంది కంది యని రిపగిదిన్. 77

ఉ. ఈవ్రిణ మెంత యంచు మది నెంచితి రేమొకొ!చూచుచుండఁ గాఁ
దీవ్రితరాకృతిన్ బెరిఁగె దీనిని మానుపఁజాల దెట్టివై
ద్యవ్రజ మేని నందు; రుదయాస్త మనం బగు దీనిపీడ ని
త్యవ్రత మైనలోకహితయాత్రి యెటుల్ ఘటియిల్లు మీ కికన్.78

ఉ. రింఖ దధర్మ సంహరణ కృత్యము వైదికధర్మ దేవతా
ప్రేంఖణముఙ్ ధరిత్రిఁ గనువేడ్కఁ జరింతువు దేశదేశ ము
చ్ఛృంఖలవృత్తి; సేమమున నీతను వుంటఁగదా 'శరీర మా
ద్యం ఖలు ధర్మసాధన' మటం— ద్రివి వో నెటు ధర్మరక్ష యా?

వ. అనుటయు వైద్యుల నుద్దేశించి యాచార్యుం డి ట్లనె. ౮0

సీ. వాత పిత్త శ్లేష్మవైవిధ్య మెఱుఁగరు
వైద్యక జ్ఞానలవంబు గనరు
రోగకారణము నిరూపింప నేరరు
వస్తుగుణంబు లేవంకఁ దెలియ
రవ్రుతలేహ్యములు మిథ్యౌషధమ్ములు గూర్తు
రయథార్థతైలమ్ము లారచింతు
రకట! వ్యుపాకపాయములు పచింతురు
దంభమ్ము గర్వమ్ము దలఁగనేర

గీ. రామయులపాలిటికి ద్రవిణాశఁ బుడమి
కవతరించిన యమభటు లనఁగ నద్వ
తనభిషక్కులు పెక్కు రుక్కునఁ బిచండ
భాండమును నింపుకొంద్రు భూభార మడఁచి. ౮1

క. నావుడుఁ బల్కి రిటు తదం
తేవాసులు దేవ! నీ వనినది నిజమె, కా
నీ వైద్యక శాత్యంతా
భావము పలుకంగఁదగునె పరిశీలింపన్. 82

ఉ. లేరనరాదు పాపపుఁగలిన్ సయితంబు పురంద రాగదం
కారుల మీఱువా రమృతకల్పులు వైద్యక నీతి చాతురీ
వారిధు లౌభిషక్కులు నభంబున రిక్కలువోలె లెక్కకున్
వారలఁ దేరఁగా వెదకువారము ధారిణి- నాజ్ఞ యీఁగదే. 83

క. దేహాభిమాన దూరు ల
నీహులు మీ రౌట, నిటు లుపేక్షింతురు గా
కూహింపఁగ మాకు భవ
ద్దేహము జంగమ సురక్షితిజమే కాదే? 84

క. గురుఁడు నిజశరీరాదుల
నిరపేక్షు నుపేక్ష సేసెనేనియు శిష్యుం
డరయుచు నుపేక్ష సేసిన
నిరయం బగు నంచు శాస్త్రనిశ్చయ ముండెన్. 85

మ. భవదీయామల పాదపంకరుహముల్ స్వస్థంబు లౌ నేని, మా
కవు స్వాస్థ్యంబు, తదబ్జభృంగముల మే మాటన్ మహాత్మా! వినం
గవలెన్ మా మొఱ,యంచు దీనముగఁ బల్కన్ శంకరుం డావ్రణో
ద్భవబాధన్ మఱిపొంది యి ట్లను విరక్తస్వాంతుఁడై యంతటన్ 86

ఉ. చింతిలకుండు నా కయి వచింతు నిజంబు, గదం బనంగ జ
న్మాంతరపాపపాక; మది యంతము నొందును భోగరీతి; నా
వంత యభుజ్యమాన మగునా! యది పా యద మెట్టివాని జ
న్మాంతరమందుస్సైతము నటంచును దెల్పును గాదె శాస్త్రముల్. 87

క. ద్వివిధము రోగము- కర్మో
ద్భవ మని వాతాది ధాతుభవ మని- కర్మో
ద్భవ మారుఁ గర్మసంక్షయ
మవునేని- జికిత్సఁ జరమ మంతం బొందున్. 88

చ. అనుభవరూప కర్మవిలయం బయి నేఁడు జనించు వ్యాధి నా
శన మగుఁగాక! దాని కుపచార మొనర్పను, దన్నిమిత్తమై
తను విలఁ గూల నొానెడలఁ దప్పక కూలునుగాక! దానికై
మనమున సాధ్వసంబు నణుమాత్రము గల్గదు నా కొక్కప్పుడున్.

వ. అని యాచార్యుం డాడిన నిర్మలవాచారీతుల మనంబులు పంకిలం
బగుటయు నయ్యండజ సమ్మతిని బద్మపాదుం డిటు వల్కె. 90

క. దేవా నీతనువు నెడన్
నీ వాశను విడుచుకొన్న నేము విడము- త
జ్జీవనమె మాకు జీవన
మా, వాశ్చరములకు సలిలమట్లులవో లేక. 91

మ. వినవే 'తాము కృతార్థు లయ్యును బరప్రీత్యర్థ మాత్మీయమూ
ర్తిని నీరాగులె ప్రోచుకొం' దని 'స్వయం తీర్ణః పరాం స్తారయే'
త్తను నీతిన్ జగతీహితార్థ మవనీయంబౌ నవశ్యంబు నీ
తను-వంచున్ బలుకంగ నెంచఁ బునరుక్తంబౌం నటం చోడెదక. 92

ఉ. ప్రాణులు ప్రాగనుకృత శుభాశుభ కర్మఫలంబులన్ ఫల
శ్రేణి భుజించుమాడ్కిని భుజించు, విపాకము వేళ సౌఖ్యపా
రీణము లై నరీతిని దరింపఁగఁ జాలక దుఃఖమగ్నమై
ప్రాణి చెడక గృశించు, దినరాత్రులవంటివి సౌఖ్యదుఃఖమున్. 93

సీ. మానసికదుఃఖములు మాను మానకుఁడుఁ
దోఁచుఁ దోఁపక యుండును వాచికములు

గాని సాధ్య మసాధ్య మఁట గదము లనఁగఁ
బొడమి కాయికదుఃఖముల్ స్ఫుటము లగును. 94

వ. అలంతుల మగుమేము సర్వజ్ఞులకు మీకుఁ దెలుప వలంతుల మే?
యైన నిదానీంతన మ్మగుననస్వాస్థ్యంబున నట్లుంటి రేమో యనుసంది
యమ్మున నొక్కవిషయంబు దేవరస్మృతికిఁ దేర సాహసింతు. భవ
దుక్తవైఖరి నీవ్యాధి నుపేక్షించిన శరీరపతన మవశ్యంభావి యగు,
నట్టిద యకాలమృత్యు వనియు, దాని నుపచారమ్మునఁ దలఁగింప
నగు ననియుఁ జరకసంహిత యనిన సూక్తు లవధరింపుము. 95

ఉ. దైవము పౌరుషం బని ద్విధా ప్రవిభక్తము పుణ్యపాపరూ
పావృతకర్మ మొక్కటియ, యయ్యది ప్రాగ్జను రార్జితంబ తాన్
దైవ మటంద్రు, సంప్రతికృతం బది పౌరుష మం, డొకొక్కఁ డా
దైవము పౌరుషంబు త్రివిధం బగు నుత్తమ మధ్య మాధమోత్క. 96

సీ. దైవపౌరుషము లుత్తమములు గలసి దీ
ర్ఘసుఖంబు నియతాయు వొసఁగు నెసఁగ
మఱి తద్ద్వయము మధ్యమము గూడి మధ్యమం
బగుసుఖం బాయువు దగఁ ఘటించుఁ
బ్రబల మాపురుషకారము దుర్బలం బైన
దైవంబు నున్మూలితం బొనర్చు

ఆ. దైవము విశిష్టమైన నధఃకరించు
నితర మైనకర్మమ్ముల నెల్లవానిఁ
బ్రతిఘటించును దబ్బలాబలవిశేష
మరయఁ బ్రారబ్ధ మనుభావ్య మశేషు నుడిని. 97

సీ. మంత్రౌషధీ మణీ మంగళ బల్యుప
హార నిష్కృతి నిజుమ్మాదు లేల?
భ్రాంత ప్రచండ చపల గోగజోష్ట్ర కా
సర ఖ రాశ్వాదికిఁ దొలఁగ నేల?
శైల ప్రపాత విషమ దుర్గ జలరయ
జ్వాల దనలాదికి జంక నేల?
యతిచండ చపల సృపామర్ష విష సరీ
సృప సాహసాదుల కెడయ నేల?

గీ. మేల వెలిపొందుట యదేశకాలచర్య?
కేల మదమోహలోభాదివృత్తుల విడువ?
నాయువే మేని కాధారమగున యేని?
యాయు వది కర్మనియతంబ యగునయేని? 98

గీ. నియతకాలప్రమాణమై నెగడు ననిన
నాయువున కిట్టి భావముల్ హాని నిడవు,
ప్రాణుల కకాలమరణభయంబు లేదు
తన్నిరోధకయత్న మింతయుఁ గలుగదు. 99

సీ. రసాయనాధికారమున మానులయత్న
కథనప్రయోగాదికము వృథ యగు
నియతాయు వగుశతునిం బురుషాయుతుండు
శతకోటిఁ బరిమార్పఁ జాలకుండు
నుపచరింపఁ దలంప రోగి నాశ్వినేయు లా
ర్తుల కిష్టభేషజముల నొసంగి
సంయమీంద్రులు తపస్సాధనంబున యథే
ష్టముగ నాయువు నొందఁజాలకుండు

గీ. రమరనాథుఁడు దేవర్షి సమితి రసర
సాయనమ్ములఁ గనిపెట్టె, నన్యుల కుప
దేశ మొనరింపఁ, నిర్మింపఁ, దిపుర- రాయు
వఖిలలోచనగోచరం బగునదేని. 100

చ. ఇవి మనకక్షిగోచరము లేకద! యామిక మీఁఱఁ జొచ్చి యా
హవ మొనరించుసైనికసహస్రము లొక్కపటిన్ వినష్ట మా
నవి సమమైనయాయువుగలట్టివొకో! యుపచార మొంద కే
యవిషభుజుల్ మెలంగరొ, విషాశను రీల్గరొ మందు లిచ్చినన్. 101

క. ఆ యవిష విష పాశ్రిను
లేయెడఁ బ్రతికార మెనయ, కెనసియు నాయు
ర్దాయవిపర్యమునఁ జని
పోయెద రాయువును జూడఁ బోలునె కంటన్. 102

గీ. కావున హితోపచారమె జీవితంపు
మూల మగుఁ- దద్విపర్యయమున మృతి యగుఁ
గలదు మఱి కాలమృత్యు వకాలమృత్యు
వను విభేదమ్ము దెలియు నో నగదకర్త. 103

సీ. యానసమాయుక్త మతమ్ము ప్రకృతిమై
యానగుణోపేతమై సమస్త
గుణయుక్తమై యనుగుణ మగుకాలంబు
వాహ్యమానం బయి స్వప్రమాణ
సంక్షయంబున నవసానంబు గాంచుఁ- ద
ద్విధమున- నాయువు దేహ మొంది
యుక్త మా ప్రకృతినియుక్తిని నుపచర్య
మాణ మానెడ స్వప్రమాణమునకు.

గీ. సంక్షయము గల్గుతటి నవపాన మొందు
నదియ సూ కాలమృత్యుసమాఖ్యఁ బరఁగు,
ఖ్యాతమగుఁ దద్విరుద్ధ మ్మకాల మృత్యు
వనఁగ. నది దాఁట నగు వెజ్జు నాశ్రయించి. 104

వ. అని యాయుర్వేదంబున ననుపచరితంబగు నేని నియతమయ్యు నాయువు క్షీణింప నకాలమృత్యువు కలుగు ననియు,నాయువు దైవపౌరుష రూప ద్వివిధకర్మ విశేషంబుల వైవిధ్య మొందు ననియుఁ, బౌరుష ప్రాబల్యమున దైవమ్మును నిర్జించి యాయు వార్జించి యకాల మృత్యువు జయించి శరీరము నిల్పుకొని, యదియ సాధనంబుగఁ జతుర్విధ పురుషార్థంబులం బురుషుండు పొందవలె ననియు స్పష్టంబుగ సిద్ధాంతీకరింపబడెఁ, బురుషార్థాపేక్ష గలయెల్లరకు రక్షణీయంబు దేహంబ కాదె! భవాదృశులదేహపీడ లోకపీడయ యగు నని శాస్త్రవిహి తోపపత్తి పూర్వకంబుగా వ్రణచికిత్స యావశ్యకంబని నిర్బంధపురస్సరంబు బతిమాలుపద్మపాదున కెదురాడం జాలక, కొంతతడవు దిగ్భ్రమ మందియు స్వస్థుండై యద్దేశికుండు. 105

శా. ఆయుర్వేదమహత్త్వ మెచ్చికొని, వేదాంతానుకూలంబుగా
నాయర్థంబుల నన్వయించుకొని, హేయం బయ్యుఁ గాయం బుపా
దేయం బంచు గ్రహించి, పద్మపదుబుద్ధిన్ బెద్ద గొండాడి, మీ
మీయిష్టం బగుచాయఁ జేయుఁ డనికూర్మిన్ శిష్యులన్ బల్కుడున్.

ఉ. ఛాత్రులు దేశికోక్తి కరుసంబున మ్రొక్కిడి యెల్ల దిక్కులం
దాత్రమునన్ భిషగ్వరులకై వెదుకం జని రాత్మముల్ హరి
క్షేత్రములన్ బొనర్చి, పరసీమ నివాస పటీయు లౌట నే
మాత్ర మలంత నొవ్వరు ప్రమాదముఁ జెంద రొకందుయాత్రలో.

చ. నృపునిఁ గవుల్, భిషక్కుల శరీరులు, దాత ధనార్థులున్, సదా
నిపుణత నాశ్రయించు టది నిక్కము గాన వసుంధ రేశవా

సపురములందు వారిఁ గనఁ జాలుదు మంచు ననేక భూమిపా
లపురులు సొచ్చి తద్భిషజులం గని తెచ్చిరి యొజ్జ చెంతకున్. 108

క. పదఁపడి నిజసేవకభూ
త్రిదశార్చితు లగుభిషక్తతియు యతితో మీ
కేది కర్తవ్యము తెలిపిన
నది సేసెద మనిన నిటుల యతిపతి నుడివెన్. 109

క. వాయువునో మాయువునో
పాయువున వ్రణమ్ము పుట్టి బాధించెడి నా
కాయువు కలిమిని వత్తురు
జాయువు తగినది యొసంగి చక్కఁ బఱుపుఁడీ. 110

వ. అనుటయు. 111

సీ. స్వచ్ఛమై సట్టికాలాగ్నిరుద్రరసంబు
తేనియతో నాస్వాదింప నిచ్చి
రక్తమోక్షణముకై రక్తపా పాతన
శృంగ శస్త్రక్రియల్ ధృతి నొనర్చి
సైంధవ నాగర జాతిపత్త్రాది పి
ష్టములఁ దైలముల లేపములొనర్చి
సౌవర్చల త్రిఫలా వచాదిక రచి
తము లైన పెక్కు క్షారములు చల్లి

గీ. స్వేద నాలేప లంఘ నాస్య స్రావమోక్ష
ణాది శాస్త్రోదిత చికిత్స లఖిలములును
సలిపిరి భగందరవ్రణశాంతికొఱకుఁ
గంట వత్తిడుకొని భిషజ్మౌళిమణులు. 112

ఉ. వాతికమో కఫోద్భవమొ పైత్తికమో యని నాడిఁ జూచి యె
ట్లా తెవు లుద్భవించెనో రవంత నిదాన మెఱుంగలేక వ్రి

ఖ్యాతము లైనమందులు భగందరశాంతికిఁ జెప్పఁబడ్డ వే
వో తెలివొప్పఁ జేసి యిడి రొక్కటి మానక తద్భిషగ్వరుల్. 113

గీ. ఆంతరమ్ముగఁ గొంత బాహ్యముగఁ గొంత
క్షారముల లేపనమ్ముల శస్త్రములను
ఘృతములను భేషజములఁ జికిత్స జరిగెఁ
గాని యది యేటఁ గలిపినకతక మయ్యె. 114

చ. అటు తమకృత్య మెల్ల వృథయై యెటు తోఁపక చిత్తవీథులన్
గటకట నొందువెజ్జులను గాంచి తదక్షమతన్ స్మరింప క
ప్పటికి యతిప్రభుం డిటుల పల్కె 'నయో! బహుకాల మయ్యె ని
చ్చటికి కరుదెంచి మీర లిఁకఁ జయ్యన మీగృహసీమ కేఁగుఁడీ 115

క. ఇత రాయా రూపులు మీ
రితః పర మ్మింటి కేఁగుఁ, డేఁగక యున్నన్
వెత నొందుచు మీరాకకు
హితబంధులు సూచుచుందు రెమ రగు టెన్నల్. 116

ఉ. మీకు శరణ్యుఁ డౌనృపతి మీ రిటు వచ్చుట యాలకించుచో
గాఁకల రేఁగి యీయఁదగుకానుక లు జీతము లీయ మాని య
ట్టాఁకలఁ బెట్టి పోఁ బనిచి, యన్యు నొకానొకనిం భిషక్కుగాఁ
జేకొనునేమొకో చపలచిత్తులు రాజులు వాజులుంబలెన్. 117

క. జనపదములు తఱచు భిష
గ్జనశూన్యము లామయావి జన నిబిడము లౌ
టను మీగృహములకడ మిముఁ
గన నెందఱొ రోగు లుంద్రు కలఁగుచు రుజలన్. 118

గీ. దేహి కుత్పత్తి జనయితృధీన, మవిర
తావన మ్మగదంకారహస్తగతము

వెజ్జొదవఁడేని పుట్టువు విత శరీరి
కతఁడె హారి సుఁడి యనుమతి కనిరి వారు. 119

ఉ. మీం రనినట్టి దంతయు నమిథ్యయ కాని మిమున్ ద్యజించి పో
నేరక యుంటి మేనరుఁడు నేని దివిన్ ద్యజియించి మర్త్యమున్
గోరునె? యం చశక్తను గుప్త మొనర్చుచుఁ బల్కి యాభిష
గ్వరులు జాఱి పోయి రెటొ భేషజశబ్దము దంభ మానటుల్. 120

క. తదనంతర మాభగవ
త్పదుఁడు తనువు మీఁదిమమతఁ ద్యజియించి, వగల్
మది సోఁక నీక శాంభవ
పదకమల ధ్యానపూర్ణభావుం డయ్యెన్. 121

చ. అవనిఁ బ్రసిద్ధు లౌపరసహస్రము వైద్యులు చేరి చేఁతనౌ
వివిధచికిత్సలం జలిపి వేసరినట్టివ్రణంబు పీడకున్
బొవులఁ డతండు నారికెడపుంఫలమందలిసార మట్లు త్వ
గ్భవ దృఢ బంధ ముక్తమయి స్వాంతము నిర్మమ మాట నద్దిరా! 122

చ. అదిగద యోగసాధనమహత్త్వము! కర్మఫలానుభూతికిన్
వదలి కళేబరం, బచలభావము చిత్తము నత్తుకో దురా
సద మగుబ్రహ్మభూయమున సమ్మద మందును యోగి, దానికే
కద ఋషికోట్లయత్న, మెది కాపలె యోగ మధీన మా నెడన్.

చ. గురుఁ డటు వెజ్జు లేఁగుడు నకుంఠితయోగసమాధి నుండఁగా
నరసి, వినేయు లాజ్ఞఁ గలయన్ వలగొంచు నిజేష్టదేవతా
స్మరణ విచింత నాద్యనుమక్రియలన్ దప మాచరింపఁ జొ
చ్చిరి ఫల మొజ్జ కప్పనము సేయుతలంపునఁ బాయ కెల్లరున్. 124

సీ. తోటకార్యుండు మృత్యుంజయమంత్ర ము
సంఖ్యమ్ముగ జపింప సాగె విడక

హస్తామలకుఁడు గభస్తిమాలి మహామ
నూపాసనము సేయుచుండె దీక్ష
నల సురేశ్వరుఁడు సేయఁగఁబూనె నాసత్య
ధన్వంతరుల పదధ్యాన మర్థి
నెడపక చిద్విలాసుఁడు శీతలాదేవి
మంత్రమ్ము జపియింప మానఁ డెపుడు

గీ. పద్మపాదుండు నరసింహ భవ్యమంత్ర
నిరవధికసంఖ్యజప మహర్నిశము సేయ
దీక్షితుం డయ్యె నాచార్యదేవునకు న
నామయము గోరి తీవ్రతృష్ణ లతకరించి. 125

శా. ఆరీతిన్ బరమేశ్వరాంఘ్రికమల ధ్యానాప్తి నానాగదం
కారాసాధ్య భగందరవ్రణ నిరాఘాట ప్రసారంబు చ
ల్లారంజొచ్చెఁ గ్రమక్రమంబున గురుం డార్జింపఁగాఁజొచ్చెఁ బూ
ర్వారోగ్యం బదిరా! తపంబున కసాధ్యం బెద్దియుఁ గల్గునే? 126

చ. అభయము గల్గ నేదివస మాది శమింపఁగఁ బూనె దేశిక
ప్రభువ్రణ, మాదినంబ ప్రభవం బయి యట్టివ్రణంబ వృద్ధియై
యభినవగుప్తు మిత్రిం గె యతి కావ్రణ మంతయు మానునాఁడ; దు
ర్లభము పరాపకారకృతి లాలసచిత్తుల కాయురర్థముల్. 127

గీ. కృత్య నమ్మాంత్రికుఁడు ప్రయోగించె ననియు
శంకరుం డడ్డినను బద్మచరణుఁ డాభి
చారికక్రియ నాకూ్రరుఁ జంపె ననియుఁ
బాడమె నవమాట జగతి నద్భుతముగాఁగ. 128

సీ. అవమానితుఁడు గాన నాభిచారిక మభి
నవగుప్తుఁ డొనరింపఁ దివురుఁగాక

యద్దాని కట్టికృత్యము సేయువాని శం
కరునంతవాఁడు పోఁ దలుమఁడొకో
చేయఁడే జపము దేశికురక్షకై పది
మందితో పాటరవిందపాదుఁ
డతఁడ యీశాక్తుని మృతిహేతు వను టెట్లు
వానిపాపమున నవ్వాఁడు మడియ
గీ. యతియు, శిష్యులు జపియింప నందు నొక్క
పద్మపాదునకే యపవాద మొదవు
టచ్చెరువు, దానిలోనిపుణ్యంబు పాప
మెఱుఁగ నగు దైవమునకె కా కొరుల కగునె? 129

వ. అట్లు స్వాస్థ్యంబు గాంచి యొక్కనాఁటిసాయంతనవేళ శంకరుండు తత్కాలకర్మానుష్ఠానార్థంబు గంగ కరుఁగుచుండ. 130

గౌడపాదుండు శంకరుని భాష్యములఁ గాంచి ప్రశంసించుట

సీ. మినువాకతరఁగచాలున నూఁగి వచ్చి లేఁ
దెమ్మెరల్ గొలువ నేఁతెంచువాని
విరిసిన తెలిదమ్మి సరివచ్చుపటికంపుఁ
గరకంబు కెంగేల మెఱయువాని
జలదంబుపోలిక సంజకెంపున జొత్తు
వాఱినమే నొప్ప వచ్చువాని
ద్వాపరయుగ త్రేతాయుగాభ్యధికజీవితుఁ డౌటఁ
గురులందు నర, మేనఁ దలులవానిఁ
గీ. లీలఁ జెందమ్మిసవి తేనెఁ గ్రోలి ముసరు
మధుకరము లన రుద్రాక్షమాల కేల
భాసిలెడు వాని శ్రీగౌడపాదవరానిఁ
బరమగురుఁ గాంచె నా జగద్గురువరుండు. 131

క. కని బిఱబిఱ నెదురుగఁ డాఁ
జని మునిపాదముల కెఱఁగి జలజసదృశముల్
పనివడి యర్చించి ఘనం
బున భక్తిశ్రద్ధ లొలయ మోడ్చెఁ గరంబుల్. 132

గీ. క్షీరవారాశి వీచి సాచివ్యమునకు
జతన మొనరించు నిజకటాక్షముల మూని
యతిని ముంచుచు దంతచంద్రాతపమ్ము
లాశ లలముకొనంగ ని ట్లనియె నర్థి. 133

సీ. ఎఱిఁగితే గోవిందగురుకృప సంస్ఫురద్
ద్ధారకంబై హృద్య మైనవిద్య
సచ్చిదానందంబు సత్యంబు వేద్యంబు
నిత్య మాతత్త్వంబునెఱి నెఱిఁగితె
కొలుతురే నిన్ను శిష్యులు నిరంతరభక్తి
శమ దమ తత్త్వ జిజ్ఞాస లెనసి
నిత్యశాత్రవులు వినిర్జితులే కద
శాంత్యాది సద్గుణార్జనము గలదె

గీ. తవిలి యష్టాంగయోగ సాధకత గంటె
కనెనె చిత్తంబు చిత్తత్త్వగతి యతీంద్ర!
యనవరతము జీవన్ముక్తి సార్థకము గ
జగదవనదీక్ష చరియింతె ఛాత్రతిలక! 134

మ. అనఁ గర్మందియమందభక్తియుతుఁడై యానందబాష్పాంబువుల్
కనులం జిప్పిల నంజలిన్ శిర మలంకారించి భాషించె ని
ట్లని 'యాచార్యపదుల్ కృపాజలధులై యర్థిన్ నన్నుఁ బ్రోవ్నఁ జే
సిన దెల్లన్ ఫలియించె, దుర్లభములున్ జేఁజిక్కవే మీకృపన్.

క. మూఁగయు వాగ్మి యగు, బుధుం
డౌఁగద జడుఁడేనిఁ, బాపి యగు నరుఁడును బు
ణ్యాగణ్యసుగుణయుతుఁ డగు
రాగియుఁ గడకంటె నీ వరయ - నిస్పృహుఁ డౌ. 136

సీ. ఆజానసిద్ధ దివ్యజ్ఞానుఁడై వెల్గె
నెవ్వాఁడు ధర జనియించునపుడ
యతిరయ మొప్ప నౌదాసీన్యసంపన్నుఁ
డై యెవం డెందేని నరుగఁదొడఁగెఁ
బుత్రి! పుత్ర! యటంచుఁ బొంగారుప్రేమ ద్వై
పాయనుం డెవని వెన్నాడి పిలిచె
స్వవశమై యోగసర్వస్వ మొప్పుటఁ బ్రపం
చైకభావ మెవండు హేల నొంది

గీ. నొంది వృక్షమయుం డయి 'యో' యటంచు
మాఱుపలికెను దండ్రి కేమహితచరితుఁ
డట్టిశుకుఁ గొల్చి నేర్చె తధ్యాత్మవిద్య
నీమహిమ మెన్న సామాన్యమే మహాత్మ. 137

క. అంతటివానిని గొలిచి య
నంతజ్ఞానము గడించి నట్టిమిమున్ ము
న్నెంతసుకృత మొనరించిరొ
కాంతును, బూజింతుఁ జరణకమలయుగళమున్. 138

క. దీనుం డగునీభక్తుని
గానఁగ మీరలు స్వయంబుగా వచ్చుట దే
వా! నాభాగ్య మమేయం
బౌ నను యతి గౌడపాదుఁ డనియె నిటువలెన్. 139

ఉ. వింటిని వత్స తావకపవిత్రగుణంబులు వార్తవంబుగాఁ
గంటిని వేడుకన్ శమగుణప్రవణాత్ముఁడ వైననిన్నుఁ గ
న్గంటను గాంచి పోవ; ననఘా! తమి మత్కృతవార్తికంబు ల
న్నింటికిభాష్యమున్ సలుపనేర్చితివంట ప్రమోద మయ్యెడున్. 140

వ. నీ కధ్యాత్మగురుండును నాకు శిష్యుండు నగు గోవిందయతీంద్రుని వలన వినుట గలిగె, ననుటయు శంకరాచార్యుండు వినీతుం డయి భాష్యం బశేషంబును వినిపించె, విశేషించి మాండూక్యోపనిషత్తునకు రచించిన శ్రుతిభాష్యంబును గౌడపాదకారికాభాష్యంబును వినిపింప హర్షించి యమ్మహర్షి యి ట్లను. 141

ఉ. మామకవార్తి కాంతరిత మంజుల భావ విబోధకంబుగా
నీమెయి భాష్య మెల్ల రచియించిన నీ కెదియే వరంబు నీఁ
గా మది వాంఛ పుట్టె నడుగందగు నిచ్చెద నన్న, నయ్యతి
గ్రామణి యిట్లుకోరెను శుకప్రతిమానుఁ దపోధనాగ్రణిన్. 142

చ. మునివర! ని న్నతిప్రియుగపూరుషుఁ గన్నులఁ గాంచుకంటెఁ గ
ల్గునె వర మంచుఁ గోరఁగ నొకొం డెదియేనియు? నైనఁ గాని నీ
యనుమతిఁ గోరుకొందు, ననయంబును జిత్తము చిత్పదార్థ చిం
తనమున నంతరాయరహితం బయి యుండ వరంబు నీఁగదే. 143

క. నావుడుఁ 'దథా' స్తని చిరం
జీవి యయిన గౌడపద ఋషిప్రభుఁడు తిరో
భావ మొనయ యతిపతి శి
ష్యావళి కావార్త వినుచు చానిసి గడపెన్. 144

క. తోడన తెలవాఱుటయును
నీడంబులఁ గలకలధ్వనిని విహగము లా

మెచ్చిడన మొనరింప వినుచుఁ
గ్రీడించుచుఁ బ్రకృతి కన్నుగీటి హసించెన్. 145

ఉ. ఆసమయంబునన్ ద్రిపథగాపగ కేఁగి సశిష్యుఁ డౌచు స
న్న్యాసివిభుండు స్నానము నొనర్చి యథావిధి నిత్యకర్మముల్
వేసర కాచరించి తటవీథి స్థిరాసనబద్ధుఁ డై నిది
ధ్యాసన లాలసుం డయినయప్డొకవార్త యిటుల్ వినంబడెన్. 146

శంకరుని సర్వజ్ఞ పీఠాధిరోహణము

సీ. భూలోకమందు జంబూద్వీప మేపొందు
నందు భారతదేశ మలరుచుండు
నాదేశమందు ముఖ్యం బయి కాశ్మీర
మండలం బసమాన మహిమఁ దనరు
నామండలమున భాషాధీశ యగు శార
దాదేవి వెలయు నామోద మెసఁగ
నాశారదాలయం బమరుఁ జతుర్ద్వార
యుత చతుర్మంటప వితత మగుచు
గీ. నందుఁ జెలువొందు సర్వజ్ఞుఁ డైనవాఁడె
యెక్కఁ దగుపీఠ; మితరు లం దెక్కు టేల?
యడు గటుల చాఁపలేరు, నల్గడల మేటి
బుధులు కాఁపుండి శాస్త్రార్థముల జయింత్రు. 147

క. ప్రాచిని పౌరస్త్యులును బ్ర
తీచిని పాశ్చాత్యబుధు లుదీచి నుదీచ్యుల్
గాచికొని యుంద్రు- రార య
వాచీద్వారంబుఁ దెలుప నర్హులు దాక్షుల్. 148

వ. సర్వజ్ఞుం డగుదాక్షిణాత్యుం డు లేమి నాద్వారం బుద్ఘాటింప రను నావార్త యాలించి యందలిపాత్రమాణ్య మెఱుంగఁ దలంచి దాక్షిణాత్యుం డగుశంకర భిక్షుక్షితిపతి దక్షిణద్వారం బపావృతంబు సేయుపూన్కిఁ గతిపయ ప్రయాణంబులఁ గాశ్మీరంబు సొచ్చి తత్ప్రతిజ్ఞా భంజనార్థం బద్దేవీభవనంబు సేర నరుగు నవసరంబున. 149

మ. ప్రతివాదిద్విప గర్వ దుర్మదము దుర్గింపం జాలు శ్రీదేశికే
శితృసింహం బిదె సర్వవిత్త్వమున విచ్చేసెన్ బటూపంచలై
బ్రతుకుం డో ప్రతివాది దుర్గజములారా! వేదశీర్షాటవీ
శ్రితమై సంన్యసనోగ్రదంష్ట్రమయిపొల్చెన్ గ్రిం గుద్వైతాటవుల్.

ఉ. గండతల స్రవన్మద సుగంధముఁ గ్రోల భ్రమించు తేంట్ల పెన్
తండము జీఱువాఱు తరుణద్విపకుంభముఁ జీల్చునమ్మృగే
శుండు సృగాలపంక్తిఁబలెఁ జూడఁడు కన్గవ విచ్చి నీచవై
తండిక వాది తండము నదాటుగ నేని యతీంద్రుఁ డెన్నఁడున్. 151

క. అని తనయశమును శిష్యులు
గొనియాడఁగఁ దీరైవ గురుఁడు కోవెల కపుడే
చని దక్షిణ దిగ్ద్వారం
బును జేరి కవాటబంధమును దివఁబోవన్. 152

గీ. వాదినివహంబు సంభ్రమ మోదాభ్రాంత మగుచు
జుట్టి యతికడ్డముగ నిల్చి యిట్లు లనిరి
యేల యీసంభ్రమంబు? నీ కేమి వలయు?
తెలుపు త్వరపడఁ గోర్కె సిద్ధించు నో కాక? 152

క. రావచ్చుఁ బరీక్షింపం
గావచ్చు నెవండు - నే సకల మెఱుఁగుదు నం

చే విను పరీక్ష నొసఁగి యు
దేవిభవనంబు సొచ్చెను దీటుఁగ నొప్పన్. 154

గీ. అన పలుక వారి కుత్తరంబును నుడువఁగ
భూను శ్రీశంకరాచార్యు మోహరించి
యడిగె షడ్భావవాది కణాద మత వి
హారి యొక్కఁ డిట్లు స్వమతసిద్ధాంత మూఁది. 155

ఉ. ఆఁగి వచించి పొమ్ము 'పరమాణుయుగంబు పరస్పరంబు సం
యోగము నొందఁగా ద్వ్యణుక ముద్భవ మౌ'నని మామతంబు సు
మ్మా గణుతించి యట్టి ద్వ్యణుకాశ్రిత మైన యణుత్వ మేక్రియన్
దాఁ గలుగంగఁజాలునో? కనందగుఁ దావకసర్వవిత్త్వమున్. 156

క. నా విని 'పరమాణు గతం
బై వెలసిన ద్విత్వసంఖ్య యగుఁ గారణ' మం
చావిజ్ఞుఁ డనఁ, గణాద
శ్రీ వెనుకడుగిడెఁ దదుక్తిరీతిఁ బొగడుచున్. 157

ఉ. ఆయెడ నడ్డు సొచ్చి యనె నయ్యతితో నతిగర్వితుం డొకం
డీయనుఁ డొక్కరుం డిటు 'కణాదమతంబునకంటె వేఱు ని
శ్శ్రేయస మక్షపాదమతరీతిఁ జెలంగుటఁ జెప్ప నేర్తువే
నీయెడ సర్వవేత్తవె సుమీ; ప్రతినన్ విడు మట్లు కానిచోన్. 158

మ. అన యోగీంద్రుఁ డనెన్ గణాదమతమం దౌ మోక్ష మత్యంతనా
శనమై పోవ గుణౌఘసంగతి వియత్సామ్యంబుగా నుంటె, యిం
కను దద్గౌతమ పక్ష మోక్ష మది తత్కాణాద మోక్షంబుక
న్నను భిన్నం బగుఁ జెచ్చ్యుగాఁ గనుట సానందోపలబ్ధిత్వమున్. 159

వ. సర్వజగ న్నిమిత్తకారణభూతుం డీశ్వరుండే యని కణాదపక్షమం
దువలెనే గౌతమపక్షమందును నైక్యము కానుపించినను 'ద్రవ్య,

గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవా, యాభావంబు లను సప్త పదార్థంబుల కణాదపక్షమున విఖ్యాతంబు లగుచుండ, గౌతమపక్షంబునఁ 'ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాం, తావయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండా, హేత్వాభాస, చ్ఛల, జాతి, నిగ్రహస్థానంబు' లను షోడశపదార్థంబు లాఖ్యాతంబు లయ్యె ననుటయు నా నైయాయికుండు శంకరు నభినందించి మరలుడుఁ గాపిలుం డెదుర్కొని యిట్లడిగె. 160

ఆ. మును స్వతంత్ర యగుచు మూలప్రకృతి జగ
త్కారణముగ నగునొ? కాక చిత్ప్ర
విష్ట యగుచు నౌనొ? వివరించి మఱి లోని
కరుగు మఖిలవిదుఁడ వైన ననుడు. 161

ఆ. యతివరుండు పలుకు నావిశ్వయోని స్వ
తంత్ర యౌచుఁ ద్రిగుణతను ననంత
రూప యగుట నుడువుఁ గాపిలమతము, వే
దాంతపక్ష 'మస్వతంత్ర' యనును. 162

ఆ. అను యతీంద్రు నాఁపి యపుడు బాహ్యార్థవి
జ్ఞానశూన్యవాదు లైన బౌద్ధు
'లేమయా పరీక్ష యీయ కంబాలయ
మందుఁ జొత్తె' యనుచు నడిగి రిటుల. 163

క. ద్వివిధం బందురు వివరిం
పవలెఁ బాహ్యార్థవాద పద్ధతు; లింకన్
భవదీయమతమునకు వే
ఱవునటఁ విజ్ఞానవాద మది యెట్టిదొకో? 164

క. ఈరెండు ప్రశ్నములకు ను
దారార్థమ్ముగ నొసంగుమా యుత్తరముల్
శారదగుఱిఁ జొరవచ్చున
యారె యనుచుఁ బలుకఁ బలికె యతి ప్రత్యుక్తిన్. 165

మ. 'అనుమానాహ్వయ మానగమ్య మగు వేద్యం' బంచు భాషించెడిన్
గన సౌత్రాంతికుఁ; 'డక్షిగమ్య' మనుచున్ వైభాషికుం డాడు; రెం
టను గూడన్ క్షణభంగురత్వము సమానంబే యగున్, గాన వే
దనవేద్యక్రమమాత్రఁ గాననగుభేద మ్మొక్క టెక్కా నొకో? 166

గీ. ఒప్పె విజ్ఞానములకు బహుత్వము క్షణ
భంగురత్వంబు విజ్ఞానవాది; యింక
నట్టివిజ్ఞాన మొకటియ యంచు ధ్రువ మ
దంచు నంగీకరించె వేదాంతవాది. 167

చ. ఇదియె మహావిశేషము సుఁడీ యనుచుండ దిగంబరాయనా
స్పదుఁ డరుదెంచి యిట్టు లను సర్వవిదుండవయేన్ రహస్యమై
న దొకటి ప్రశ్న సేసెద రయంబున జైనమతం బెఱింగి చె
ప్పఁదగుదు వస్తికాయ పద పూర్వపదంబుల నేది వాచ్య మా? 168

గీ. అనుడు గురుఁ డనె నిష్టమే నాలకింపు
మన్న! తచ్ఛబ్దవాచ్య మెయ్యది యనంగ
జైను లంద్రు జీవాదిపంచక మటంచు
నామతమున నిఁ కేమేని యడుగఁ దలఁతొ. 169

చ. అని యిటు వేదబాహ్యు లగు నయ్యయి వాదుల కుత్తరంబు లి
చ్చినతఱి జైమినీయమత శిష్టుఁ డొకం డరుదెంచి పల్కెఁ బె
ల్చిన నిటు 'జైమినీయమున శబ్దము ద్రవ్య మొకో? గుణంబొ? యి
య్యెన వివరించి పోఁగదె! కిమాత్మకమో' యను శంక వాయఁగన్.

క. అనుటయుఁ జిఱునగ వ్యాసం
బున లాస్యము సేయ యతివిభుం డాయన జై
మిని విహిత మ తాభినివి
ష్టునిగ నెఱిఁగి తన్మతోక్త సూక్తిని గొనుచున్. 171

ఉ. 'వర్ణము లెల్ల నిత్యములు వ్యాపకముల్ శ్రుతివేద్యముల్; తదా
కీర్ణమ యాట శబ్దతతి కేవలనిత్యము ద్రవ్యమున్ జగ
త్పూర్ణమునై నిరంతరము పొల్చు' నటందురు జైమినీయు లం
చర్ణవభంగ భంగ చణ మా భణితిన్ జితుఁ జేసె వ్రేల్మిడిన్. 172

గీ. ఇటుల సకలశ్రుతంబుల హేల నుత్త
రం బొసఁగుశంకరార్యు నర్చనలఁ దనిపి
యాబుధులు దక్షిణద్వార మపుడు తెఱచి
తెరువు చూపింప గుడి సొచ్చె దేశికుండు. 173

శా. ఆసంన్యస్త సమస్త కాముఁడు సరోజాంఘ్రిన్ గరంబందు ను
ల్లాసం బొప్పఁగ నూఁది, దేవికి నతుల్ గావించి సేవించి వి
ద్యాసింహాసన మెక్క నుండ - నశరీ రాలాప రూపాన భా
షాసీమంతిని శంకరుం గుఱించి యీచాయన్ వచించె న్వెసన్.

క. మున్నె యగుమ సర్వజ్ఞుఁడ
వన్నింటఁ బరీక్ష కాఁగి యయి తిపుడును, గా
దన్న విధి కపరరూప మ
న న్నెగడెడు విశ్వరూపునకు గుహ వాదే. 175

క. ఒకసర్వజ్ఞతయే పీ
ఠిక నెక్కఁగ హేతు వచుచు డెందంబున నెం
చకుము విశుద్ధత కారణ
మకట! కలదో లేదో సందియము నీయెడలన్. 176

ఉ. నాపరిశుద్ధతన్ జగమునన్ వెలయింపనె యిట్టు లంటి గా
కోపరదేవతా! తెలియ కుందువె నాహృదయంబు నిర్మమం
బై పరిపాక మొందినటు లానతి యిచ్చినఁ జాలుఁ బీఠికా
రోపణ మేల? సర్వము నెఱుంగు నెవం? డొకనీవు దక్కఁగన్. 187

మ. అని సర్వజ్ఞతయున్ విశుద్ధతయు సువ్యక్తంబులై తోఁపఁగా
వినయస్ఫూర్తి వచించి సన్నుతుల దేవిన్ హర్షవారాశిఁ దే
ల్చినయాచార్యవరుం దొఱంగుసుమవృష్టిం గాంచి తత్పాదుకా
వనతిన్ సన్నుతి సల్పి రద్భుతజయప్రస్తావనన్ గోవిదుల్. 188

మ. అణుమాత్రంబు చలింప కప్రతిహత వ్యాహార విస్ఫూర్తిచే
ఫణిసమ్రాట్టు నధఃకరించు యతిసమ్రాట్టు సుధా స్వాదు భా
షణ సంభూషితుఁ జేసె శారదయు 'భో సర్వజ్ఞ! పీఠాధిరో
హణ కళ్యాణ మితోఽస్తు తే'యనుచు వ్యోమాంతర్హితాకారయై.

గీ. అంత గంభీరగమనుఁడై యతియు నడ
నడి పద్మపదుండు కైదండ యీయ
నరిగి సర్వజ్ఞభద్రసింహాసనమున
శిష్యపరివృతుఁ డగుచు నాసీనుఁ డయ్యె. 190

సీ. వాదకథా వినోదాదరప్రతివాది
బాహుసంస్ఫాల నోత్పన్న యగుచు
దుర్వార దుస్తర్క దుర్గనిర్భేదక
పృథుజైత్రయాత్రాప్రవృద్ధ యగుచు
హరిదంతరాంతర భరితమాహానుభా
వ్య స్తవప్రాప్తవిద్వత్త్వ యగుచు
'వస్తుం త్వమేవ సర్వజ్ఞోఽ ర్హ' ఇ త్యుక్త
వ ద్విధద్వామోద పాత్ర మగుచు

గీ. పూరితాపార మోదాత్మ శారదాఁ స
మాన బహుమాన జోఘుష్యమాణ యగుచు
జరుగు జయలక్ష్మి శంకరాచార్యచక్ర
వర్తి శ్రీశారదాపీఠవాసిఁ జేసె. 191

ఉ. సూరెల వందిమాగధులచొప్పున వాదపరాజితుల్ సుధీ
వీరులు కేలు మోడ్చి జయవెట్టఁగ, శిష్యులు భృత్యులై పదాం
భోరుహముల్ భజింప, జగముల్ 'సకలజ్ఞుఁ' డటంచుఁ బాడఁగాఁ
బారమహంస్య రాజ్యపరిపాలనభారము దాల్చి మూఁపునన్. 192

సీ. అడఁగారె నెందొ పశ్యత్పాదకథ యెల్లఁ
దలసూప దాయెఁ గాపిలమతంబు
భగ్నమై చెదరెఁ బ్రాభాకరాఁ భగోష్ఠి
భట్టపాద మతంబు పట్టు దప్పెఁ
గంటికిఁ గనరాద కాణాదమత, మెట
దాఁగెనొ కాని పాతంజలమ్ము
భేదవార్త వినంగరా దెందుఁ బాషండ
మతసంహతులు మటుమాయ మయ్యె

గీ. దుర్దమ ప్రతివాద్యక్షధూర్త సమితి
గండడేప బ్రహ్మవిద్యా గురుండు సలుపు
ద్యూతకేళిని బాడము దుందుభిధిమింధి
మిథ్యనుల నాలకించి భ్రమించి మతులు. 193

గీ. శారదాపీఠపూర్వాద్రి శంకరార్కుఁ
డఖిలపాషండ తిమిరాపహముగఁ బొడువ
ద్వైతమతఘూకవితతులు దాఁగె నెటనొ
ప్రబలనాస్తికమతతుషారమ్ము లింకె. 194

ఉ. ఆయెడ నభ్రవీథి విననయ్యెఁ బునర్నవ రత్నలాభజా
తాయతమోదతుందిల బలారి సమీరితదేవతాడిత
స్థాయి దమంద దుందుభిరవంబు ఘనాఘనగర్జితా ప్తమి
త్రాయితమై భ్రమత్సలిలరాశి ఘుమంఘుమ రావ బంధురై. 195

క. గురువరుపయిఁ గురిసిరి సుర
వరు లమరతరుప్రసూనభర; మొకకొన్నా
ళ్లరిగెడుదాఁక శచీకచ
భర మపగర్భకము గాఁగఁ బటుమోదమునన్. 196

వ. ఇట్లు శంకరాచార్యుండు కేవలస్వమతగౌరవార్థంబునకే మానావమానాదిద్వంద్వవిదూరుండయ్యు ననన్యసాధ్యం బైన శారదాసర్వజ్ఞభద్రాసనం బెక్కి, నిగమధర్మంబు నాల్గుపాదంబుల నడువఁ గట్టడసేసి కాశ్మీరంబునుండి శృంగగిరి కరిగి. 197

ఉ. 'ముప్పదిరెండు వర్షములె భూస్థలి నుం' దని బాదరాయణుల్
సెప్పినమాట తద్హృదయసీమ స్ఫురింపఁగఁ దా నొనర్ప నౌ
నప్పనులెల్లఁ బూర్ణముగ నయ్యెఁగదా యనుకొంచు, వానికే
ముప్పును రా నటుల్ నెఱపి ముప్పదిరెండవయేఁడు సొచ్చెడున్.

వ. శంకరుం డొంటిమెయి నుండి స్వకృత్యకార్యసర్వస్వమును బరామర్శించి చూచుకొనుచు నందు ముఖ్యముగ. 199

సీ. "నెలకొల్పఁబడెఁ గరామలకుఁడు ద్వారకా
పురి శారదాపీఠమునను దొల్త
బదరికావని రచింపంబడ్డ జ్యోతిర్మ
ఠ మ్మేలుచుండెఁ దోటకుఁడు శ్రద్ధ.

నలినపాదుఁడు జగన్నాథపురస్థ గో
వర్ధనాఖ్య మఠాధిపత్య మూనె
శృంగగిరిస్థిత శ్రీపీఠమునకు సు
రేశ్వరుం డాయె నధీశ్వరుఁడుగ

గీ. వజ్రికవచంబు లయి పరివ్రాజకాగ్రి
గణ్యు లిటు కాచుచుండ జగత్సమాద
రమున నద్వైతమతమహారాజ్యలక్ష్మి
చెక్కు చెదరక పెంపెక్కు నిక్కువముగ. 200

చ. అని మదిలో చిటంబును, మహాముదమున్, వసుధాటనంబునన్
దనివియుఁ గాంచి శిష్యసహితంబుగ దేశికసార్వభౌముఁ డో
య్యనఁ బయనించుచున్ బదరికాశ్రమభూమిని జేరి యన్వహం
బును దపమున్ స్వభాష్యములబోధనమున్ బచరించు చున్నెడన్.

క. పాతంజలయోగకళా
ధీతులు కొందఱు యతీంద్రుతీ రరసి కసిన్
జితమనస్కు లయి సమా
యాతు లయి పరాజయమ్ము నందిరి యతిచేన్. 202

మ. జితులై త్యాజితసర్వదర్శనులునై శిష్యత్వముం గొంచు వి
శ్రుతపాతంజలయోగదర్శనదీక్షుల్ వారు కోరంగ న
య్యతి చూడామణి భాష్యముల్ గఱపెఁ దారాధీశ రోచీ రమాం
చితకీర్తి ప్రతికర్మ నిర్మల హరిత్సీమంతినీకంబుగన్. 203

క. ఈరీతిం గలికలుష వి
దారకచరితల శివావతారుఁ డగుయతీ
ఖారాతికి ద్వాత్రింశ
త్సరాబ్దంబులవయస్సు జరిగె సుఖముగన్. 204

సీ. మూల్యంబు గాఁగఁ గైవల్యలక్ష్మికి సుధీ
భాష్యంబు లగుభాష్యముల రచించె
ఖండించి వైచెను బండితాహాంత దు
స్స్వాంతప్రణామ సంజాత భూత
సద్యస్సముద్య దతిద్యోతఁ జేసె వి
రక్తసజ్జనవేద్య ముక్తిపద్య
శ్రేయముల్ బుధుల కమేయముల్ ఘటియించె
స్థేయముల్ సేసి యామ్నాయరీతు
గీ. లిఁక నెదిసేయు జగతికి? శంకరుఁడు ద
యామృతరసాయి తేందుకుందామరాశ్వ
హార నీహార నిభయశః పూరశమిత
సుకృతిజన దైన్య పావకవిక్రుతిభరుఁడు. 205

ఉ. ఉత్తమ మైనకీర్తి దెస లొత్తిల ముజ్జగ మొత్తె, నద్భుతా
యత్త విహారకేళుల దిగంతరముల్ వడి ముంచె నివ్వెఱన్,
సత్తము లైనభక్తుల కొసంగె నభీప్సితభుక్తిముక్తిసం
పత్తుల శంకరార్యగురుపాదుఁ డిఁకే మొనరింపఁగావలెన్. 206

శంకరుఁడు సశిష్యుఁడై కేదారమున కేఁగుట

ఉ. చేరె ననంతరంబు సహశిష్యుఁడు శంకరభిక్షుమాళి కే
దారము సేవమానజనతాసమభీప్సితసర్వసౌఖ్యవి
స్తారము పాపరూప కటుదావశిఖావ దుదారతాపసం
హారము దుర్గమాప దవహారము సంసరణాభిచారముల్. 207

గీ. అచ్చుసీతున నచ్చట ముచ్చముడిఁగి
పోవుచుండిసశిష్యులఁ బ్రోవ నెంచి
వెచ్చ నగుతోయ మీయంగ వేఁడెఁ జంద్రు
మౌళి నతులప్రభావుఁ డమహాద్రినిమాళి. 208

క. కర్మందిబృందపతి యిటు
నిర్మముఁడై వేఁడ శివుఁడు నిష్టప్త కృపీ
టోర్మిబహుళలహరి నొకటి
శర్మ మిడ నొసంగెఁ జరణజలజమువలనన్. 209

ఉ. ఆదృతి శిష్యు లాశివదయార్జిత కోష్ణజల ప్రవాహముం
దీఁదుచుఁ దాన మాడి సుఖయించి గురున్ నుతియించి రంట! త
త్పాదకనిర్ఝరం బనియ యున్నది నేఁటికిఁ దద్యశంబుఁగన్
బాదుకొనంగఁ జేయుచు దివస్పృథివీచరపావనంబునై. 210

## ఉపసంహారము

వ. అట్లు శృంగగిరి వెడలివచ్చునాఁ డయ్యతిసమ్రాట్టు మధ్యమార్గంబు జోగులాంబను, మహాలక్ష్మిని, బగళాంబను, జ్వాలాముఖీదేవిని సందర్శించి, పాండురంగక్షేత్రము సేవించి, కాంచి దర్శించి, యవంతిని వింత లరసి, ద్వారక కేఁగి, మధురాపురిని విడిసి, కాశి సంభజించి, మాయాపురంబునఁ గొంతకాలంబు పుచ్చి, తత్రత్య దైవతంబుల శివకేశవాది నానామరాకారుల నభేదదృష్టి దర్శించి, సేవించి, యందంద యద్వైతమత ప్రతిపాదకమ్ము లగునాత్మీయ భాష్యమ్ములంగల యర్థమ్ములం దత్తద్దేశవాసులకుం దైర్థికులకును బోధించి హిమవత్పాద విరాజమానం బగు బదరికావనమునందలి జ్యోతిర్మఠంబునఁ దోటకాచార్యు సేవల నలరి యపునరావృత్తిమోక్షదం బగు కేదారమహాక్షేత్రంబున నపునరావృత్తికంబుగఁ బరిమితచ్ఛాత్ర పరివృతుం డయి నివసించి శంకరుండు తన ముప్పదిరెండవయేఁడు గడసన నుంట యెఱింగి యంతేవాసి సంతతి నంతికమ్మునకుఁ జేరఁ బిలిచి. 211

ఉ. మోమున లేఁతనవ్వొలయ ముద్దిడి దీవన లిచ్చి పుచ్చె హ
స్తామలకున్, సురేశ్వరు మహాదృతిఁ బల్కె, సరోజపాదునిన్

క్షేమము గల్గఁ జెప్పి పని చెన్, గవుఁగింటను జేర్చెఁ దోటకుఁ
గామితముల్ ఫలింపఁగ నొనర్చెను దీవన తక్కువారికిన్. 212

సీ. నారాయణునకు వందన మొనర్చెను, బద్మ
భువుపదమ్ములు స్వాంతమున ఘటించెఁ
దలచెఁ వసిష్ఠు నిస్తులతపస్సంపన్ను,
శక్తిమహర్షిఁ బ్రశంస సేసె
వినుతించెను బరాశరుని జగత్కల్యాణు,
బాదరాయణు నెదఁ బాదుకొలిపె
శుకమహర్షి స్మరించి జోత లర్పించెను,
స్తుతియించె గౌడపాదుని మహాత్మ

గీ. గురుని గోవిందయతి నిల్పుకొనియె మదిని
నిటు గురుపరంపరఁ దలంచి యిష్టదైవ
తములయెడ నైక్య మెన్ని కేదారనాథ
శివుని యెదుట దర్భాసనాసీనుఁ డగుచు. 213

శా. ప్రాణాపానగతావరోధమున బాహ్యార్థాప్తికై యింద్రియ
శ్రేణిన్ బోవఁగ నీక పట్టి యెడఁదన్, స్వాంతంబు బుద్ధిఁ, మఱిఁ
రాణన్ జీవునిలో, లయించి పరమబ్రహ్మంబె తానై విని
ద్రాణానందమయత్వ మొంది తుద కద్వైతస్థితిన్ భాసిలెన్. 214

సీ సర్వభోగవిశేషశాలి దేవేంద్రుఁడె
వ్వానియానందలవం బెఱుఁగఁడో
భువననిర్మాత యంభోజాతసూతి యె
వ్వానిదృష్టిలోఁ దృణప్రాయుఁ డగునో
లక్ష్మీసమాశ్లేషలాలితుం డగుహరి
యెవనితుష్టికి గవ్వయేని కాఁడో
యైశ్వర్యపూర్ణుఁ డౌహరుఁడు నెవ్వనిశాంతి
యం దొక్కలేశమే నొందఁ లేఁడో

గీ. తాదృశాద్వైతశుద్ధసిద్ధాంతవస్తు
పరమతాదాత్మ్యనిర్ముక్తబంధతోఁది
తామితానందరసమయుండై వెలింగె
శంకరుఁడు విశ్వలోకశుభంకరుండు. 215

శా. తత్తాదృక్షసమాధిసుస్థితికి మోదం బాత్మ నిండార శ్రీ
దత్తాత్రేయుఁడు దోఁచి యాశ్రితుల ధాత్రిశ్రేణిఁ బోనంపి సం
విత్తాదాత్మ్యము నొందియున్న గురునిన్ విశ్వాతిశాయిప్రభా
వాత్తఖ్యాతిఁ గవుంగిలించికొనెఁ జేతోఽబ్జాతమం దర్మిలిన్. 216

మ. తనయందున్ జగతీతతుల్, జగములన్ దన్నున్,గనుంగొంచుఁ బా
ల్చిన శ్రీశంకరు నాంతరేక్షణస్ఫూర్తిన్ జిత్రింబుగాఁ దోఁచి యొ
య్యన నీరీతి నుతింపఁగాఁదొడఁగె దత్తాత్రేయుఁ డుద్యత్సుధా
వనధి త్వంగ దభంగ భంగ నటన వ్యాపార పారీణతన్. 217

చ. జయజయ మానుషాకృతి లసత్త్రుహిణాదిసుతా మనోహరా!
జయజయ యబ్జజాండచయ జన్యవన క్షయ మూలకారణా!
జయజయ దేవతా ముకుటజాల మణీఘృణి దీప్రపాదుకా!
జయజయ రాజతాచలనిశాంత! ప్రశాంతపదా! సదాశివా! 218

సీ. భూతపంచక సమతీత! భూతాకృతి!
పంచకోశాగమ్య! ప్రణవమూర్తి!
షడ్వికారవిదూర! సంవిస్మయాత్మక!
గుణసమవేత! నిర్గుణవిలాస!
సంయమీంద్రాంతరచక్షు రానాయమీ
నాయిత! తత్సహస్రారవర్తి!
సంసారసాగర సాంయాత్రికాభిగ
మ్యద్వీప! యాదిమధ్యాంతశూన్య!

గీ. వేదవేదాంత నిబిడాటవీ సదాని
రంకుశ విహరణ హరిమృగాధిరాజ!
స్వపరిభావ వశీకృతానార్యనాయక!
జాగరి దద్వైతసిద్ధాంత సారభూత! 219

ఉ. ఖాండికనాస్తికోక్తులకు ద్వైతమతప్రవరిష్ణు ధూర్తవై
తండికఖండనంబులకుఁ ద్రాసముఁ బొంది కదధ్వమందుఁ బె
న్మ్రుండులఁ గూలి తూలి వెత మున్గిన వైదికవాక్పవిత్రి నొ
క్కండవ యెత్తి నిల్పితి సుఖప్రచు రాద్వయ సత్పథంబునన్. 220

సీ. జనిమాత్రమునఁ బంచజనుఁడవే కాని సా
క్షాచ్ఛంకరుఁడవు విశ్వజ్ఞమౌళి
మనుజుఁ డిట్టుల విద్యలను నేర్చునే కాక
నీవు పుంభావ వాగ్దేవి కావె
మనుజమాత్రు లొనర్చు పనులె యత్యల్పకా
లమున నీ చేయు కృత్యములఁ దలఁప?
నాచంద్రతారార్క మవని నిత్యజ్యోత్స్నఁ
జల్లదే నీయశశ్చంద్రబింబ?

గీ. మాహిమాహార్య సేతుపర్యంత భూమి
భవ దమల పాదపద్మ సంస్పర్శ పావి
తంబు కానట్టి యొక యంగుళంబు మేర
గలదె? జగతీతలోద్ధారకా! మహేశ! 221

చ. పొడమితి వేదరక్షకయి భూస్థలి ద్వైత కుతర్కధాటికిన్
సడలనియట్లు వజ్రకవచంబుల భాష్యములన్ రచించి, న
ల్గడ మఠరాజముల్ నిలిపి కట్టడ సేసితి దుర్మతంబులన్
గెడపితి వేమి యున్న దవనిన్ గరయణీము నీ కుమాపతీ! 222

మ. కలిమాహాత్మ్యమునన్ నిరంతర మనేక ద్వైత పాషండ దు
ర్లలితానర్థమతంబు లుప్పతిలినన్ రాజిల్లు రారాజటుల్
తలపూ వాడక త్వత్సముద్ధృత తత్త్వాద్వైతాత్మసిద్ధాంత ని
స్తులదివ్యస్మృత మర్పి యెల్లఁ గనమందున్ బట్టిపాలించుచున్. 223

క. ధరణిఁ గలట్టి నదీనద
ఝరము లుదధిఁ గలియు కరణి సకలమతములున్
బారయ నె యంతర్భావం
బరయఁగ నద్వైతమతిమునం దం దందున్. 224

చ. అతుల భవత్కృతాఖిలదిగంతజయోదితపుణ్యకీర్తి సం
భృతబహుళప్రబంధముల నెల్ల జగంబున సార్వకాలిక
స్తుతి నజరామరత్వపరశోభితమూర్తి వి[illegible] తనర్చు శా
శ్వతముగఁ ద్వత్కృతామితనిబంధము లుర్విఁ గూర్చు భద్రముల్.

క. ద్వాత్రింశ చ్ఛరదాయు
ర్మాత్రుఁడ వన మోస, మజుఁడమరుఁడు నయిన చి
న్మాత్రుండవు మృత్యుంజయ
మాత్రుండవు కాని మనుజమాత్రుఁడవా కో—! 226

గీ. కనుము కైలాస మదిగో శంకరుఁడు వాఁడె
యంబ యదిగో గణేశ్వరుం డల్లవాఁడె
షణ్ముఖుఁడు వీఁడె వీరు నీఛాయ లగుదు
రీ రహస్యంబు ముందె నీ వెఱిఁగియుందు. 227

వ. అని తద్వ్యాసపథావతీర్ణుఁడయి దత్తాత్రేయుఁ డగ్గించుచుం
డనె- కైలాసము శంకరుం డగజ విఘ్నస్వామి షాణ్మాతురుం
డును నందీశ్వరముఖ్యపారిషదు లందున్ దోఁచి—వీక్షించుచుం
డనె శీతాద్రియు రాజితాద్రి యయి కన్పట్టన్ యతీశానుఁడున్.

శా. తన్నుం జూచుకొనంగ నద్భుతముగాఁ దా నమ్మహాదేవుఁడై
యున్నట్టుల్ సనకాదిమౌనులు నమర్త్యుల్ సిద్ధులుం సాధ్యులున్
గ్రన్నం దన్ను నుతించుచున్నటుల వీక్షాపర్వమై తోఁప న
చ్ఛిన్నానందమయుండు శంకరుఁడు గాంచెన్ స్వస్వరూపైక్యమున్.

గీ. ఆమహిం తు పాంచభౌతికం బైన మూర్తి
యఖిలజగదేకగురుమూర్తి యష్టమూర్తి
మూర్తియైనట్టి దక్షిణామూర్తి యయ్యె
జ్ఞానసుధ సుస్మితకటాక్షసరణి నొలుక. 230

వ. అట్టియెడ- 231

క. పురుషోత్తమాద్యమరులు నం
బురుహాక్ష సరోజభవులు మూర్ధధృతకరాం
బురుహు లయి సల్పిరి మనో
హర వేదోక్తులను మంగళాశాసనముల్. 232

ఆ శ్వా సాం త ము

విశ్వక్షోణిధురంధరాయతభుజా! వీరావతంసా! జయ
శ్రీశ్వేతేక్షణకైరవప్రసవరాజీమాలికాలంక్రియా
శశ్వత్కామ్రదిగంగనాముకురితాంచత్కీర్తిభాసా! మునీం
ద్రిశ్వశ్రేయసమూలకారణవతారా! భక్తకల్పద్రుమా! 233

సౌభాగ్యభాగ్యశోభిత
వైభవ సుబ్బాంబికాధిపతిసంతతపూ
జాభాజన! సీతారమ
ణా! భక్తాభీష్టవితరణాస్వప్నమణీ! 234